# ఆంధ్ర రచయితలు

## ప్రథమ భాగము

[[illegible]]

గ్రంథకర్త
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

రు 6/-

ప్రతులకు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# కథాపీఠము

ఈ ప్రకారము నన్నయతో మొదలు చిన్నయదాఁక నొకతీరున సాగినది. నడుమ నడుమ కొన్ని మార్పులు కలిగినను అవి యల్పములు. [illegible], [illegible] చిన్నయసూరి నాఁటినుండి వాఙ్మయ మార్గమున క్రొత్తదారులు తీసినది. [illegible] ప్రారంభము చేసిన మహా నాయకులు వీరేశలింగము పంతులుగారు. కొన్నిటికి మార్గదర్శిత్వమే పంతులుగారిది. నవలలు, వ్యాసరచనలు, కవిజీవితములు, స్వీయచరిత్రములు, కథానికలు, ఖండకావ్యములు, ప్రహసనములు, గ్రంథవిమర్శనములు, నాటికలు, చరిత్ర పరిశోధనము, పత్రికాప్రచురణము — ఇత్యాదులు నేఁటి సారస్వత[illegible] చేసిన క్రొత్తకొమ్మలు. ఈకొమ్మ లెల్ల మున్ముందుగాఁ బూచి కాచుచుండుట నేఁడు పరికించుచున్నాము. [illegible] సపూర్వము లనఁగొనముగదా, ప్రకృత కాల పరిస్థితుల ననుసరించి మన కాలోచనలు కొన్ని కావలసి గట్టిచేసికొంటిమి.

వీనిలో కవిచరిత్ర రచన మొకటి. శ్రీ వీరేశలింగము పంతులుగారు బహు పరిశ్రమకుఁ బాల్పడి ఆంధ్రకవుల చరిత్రలు సంపాదించి వెలువరించిరి. అంతకుమున్న శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు ఆంగ్లేయుల మార్గము నాశ్రయించి కవి జీవితములు ప్రచురపఱిచిరి. గురుజాడవారి రచనపై వీరేశలింగముగారి కూర్పు సంస్కరణ పూరణములు కలదిగా వెలసినది. కావలి వేంకటరామస్వామి యనునాయన ఆంగ్లభాషలోఁ గొంద ఱాంధ్రకవులను గూర్చిన చరిత్రలు వ్రాసి ౧౮౨౭ వ యేట బొంబాయిలో వెలువరించినారని మిత్రులు చెప్పుట. బ్రౌనుదొర తన నిఘంటువునఁ బ్రసంగమునఁ గొందఱు ప్రాక్తనకవులను గూర్చి యించించుక వ్రాసెను. ఇవి బొత్తిగా చాలనివి. గురుజాడ శ్రీరామమూర్తిగారి కవి జీవితములు ౧౮౭౮లో మొదలై పదేండ్లకుఁ బూర్ణముగా బయటఁ బడినది. వీరేశలింగము పంతులుగారి కవిచరిత్రము ౧౮౮౭ నాటికి ప్రకటితము. పంతులుగారి కూర్పు తెలుఁగు వారికి మేలుబంతి. ఇటీవల నిటీవల విడివిడిగా, విపుల విపులముగా కవి జీవితములు

మహారచయితలు గలరు, శతకములకు సంబంధపడినవారు గుంపులుగ ఉన్నారు. వారి నెల్లరను దేర్చి చేర్చినగాని యీ కూర్పునకు సమగ్రత సిద్ధించ నేరదు. కాని, ఇప్పటి కిది నాకసాధ్యము. దైవాదేశ మయినచో, ఈగ్రంథము సుపరిపుష్టము కావచ్చును.

ఇవి ఉచిత ఆరాధింపఁబడినవారు గాక, మఱియెందఱో మహనీయులు తెలుగున గలిగినవారి క్షమాభిక్ష నేను వేఁడవలసియున్నది. ఈ మహాశయులలోఁ గొందఱి జనన తిథ్యాదికము తెలియకపోవుట — కొందఱి రచనలు నేఁటివఱకు చదువుకొనుటకు నాకు చాలకపోవుట — కొందఱు జీవత్కవులు తమ్ముఁగూర్చి ప్రకటింపరాదని నాకు శాసించుట — కొందఱి విషయమున, రచయితలుగా నందిన కీర్తికంటె, భాషాభివర్ధకులుగా సంపాదించిన యశస్సు హెచ్చుగా నున్నదని సదుద్దేశముతో నుపేక్షించుట — ఇత్యాదు లేనేనో కారణము లీగ్రంథము నింత పరిమితముగ చేసినవి. క్రింది రచయితలను, ఈ కూర్పునందే పూజించుకొన లేని నా నీరసతకు, సిగ్గిలుచున్నాను.

కాలనాటి గంగయ్య
శతఘంటము వేంకటరంగశాస్త్రి
గడలునాడ సుందరరామశాస్త్రి
ఆదిపూడి సోమనాథరావు
ఆదిపూడి ప్రభాకరరావు
దురగా వేంకమరాజు
అమరవాది రామకవి
భోగరాజు నారాయణమూర్తి
కొప్పరపుఁ గవులు
శేషాద్రి రమణ కవులు
తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి
కాశీనాథుని నాగేశ్వరరావు
ముట్నూరి కృష్ణారావు
ఉన్నవ లక్ష్మీనారాయణ
జూలూరి అప్పయ్య
అక్కిరాజు ఉమాకాంతము
మల్లాది విశ్వనాథశర్మ
రాయమర్గము నరసయ్యశాస్త్రి
శ్రీకరపు వేంకటశాస్త్రి
భండారు అచ్చమాంబ
కాంచనపల్లి కనకమ్మ
త్రిపురనేని రామస్వామి చౌదరి
మానవల్లి రామకృష్ణకవి
నాయని సుబ్బారావు
అబ్బూరి రామకృష్ణారావు
బలిజేపల్లి లక్ష్మీకాంతము
తాపీ ధర్మారావు —

ఇంక నెన్నో పేరులు స్మరించవచ్చును. రాయలసీమ, నిజాము ప్రాంతములలో నెందఱో విజ్ఞులవిషయమున నేను అజ్ఞుఁడను. వీరందఱను కాలక్రమమున మనము ఒకకూర్పున సమావేశము చేయవలసి యున్నది.

ఈ నా రచనల్లో యెందఱో మిత్రులు సహాయము పడసితిని. వారందఱు మేలు మఱువ రానివారలను. సామూహికముగా వారికి నా హార్దాభినందనము లిందు మూలముగా మనవి చేసికొనుచున్నాను.

ఒక సంగతి మనవి:— కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్య గారు ౧౯౧౧ పూర్వము జననము కలిగియుండిన వారనుకొని యిందుఁ జేర్చుకొనుటకై, నెల్లూరి వాస్తవ్యులు శ్రీ అప్పుల గోపాలకృష్ణమూర్తి (ఎం. ఏ; యల్. యల్. బి) గారిని కవిబ్రహ్మ జీవితాంశములు తెలుప వలసినదిగాఁ గోరి తొందరపెట్టి యుంటిని. దయతో వారు పంపిన విషయములను జూచి నరసయ్యగారు ౧౯౧౧ సం॥ జన్మించిరని తెలిసికొంటిని. వారు, మఱికొందఱు ప్రముఖరచయితలు రెండవభాగమున రాఁగలవారు.

మఱి, ౧౯౧౧ సం॥ తో ముగించుటకు బదులు, ఒక యేఁడు ముందుకు సాగి ౧౯౧౧ సం॥లో జననము గల శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారి నిందుఁ జేర్చుట, వారిని గూర్చిన వ్యాసము ద్వితీయ భాగమునకు 'నాంది' పాఠము కాఁగలదని యిప్పుడిక్కడ మనాకూచనమునకు —

ఈ రచన యిటు లింతలో వెలుఁగు చూచుటకు పూజ్యులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆశీఃప్రోత్సాహములు నే నెప్పుడును మఱువఁజాలని దోహదము లయినవి. వారికి మనఃపూర్వకమైన ధన్యవాదము లర్పించుచున్నాను.

ఈ గ్రంథము 'సరస్వతీ పవర్ ప్రెస్సు' అధికారులు, ఉదారులు నగు శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావుగారి సౌహార్దముతో నావిష్కృతమైనది. ప్రత్యేకశ్రద్ధవహించి, ముచ్చటగా నీకూర్పు ముద్రింపించి, ఇంతత్వరలో నా యుద్యమమును లోకమునకుఁ జూపిన శ్రీ నాగేశ్వరరావుగారిని హృదయపూర్వకముగా నభినందించుచు, వారి కిలో నధిక భోగ భాగ్య సంపత్తి ప్రసాదించుటకు జగదీశ్వరు నభ్యర్థించుచున్నాను.

రాజమహేంద్రవరము
౧ సెప్టెంబరు ౧౯౫౦

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# సమర్పణావతారిక

ఇది పదియేండ్లనాఁడె రచియించుతలంపులు లేఁతవంపుగాఁ
బొదలి, సరస్వతీకరుణ పొంగులు దేఱఁగ, పేరు నాదిగాఁ
గదలిన 'ఆంధ్రి' నొక్కకటిగాఁ బ్రకటించుచు వచ్చినాఁడ; నీ
బ్రదుకున కాయదృష్టమును బట్టకపోయె నొకింత కాలమున్.
అది మూఁడేఁడుల ముచ్చటై నడచిపో — నల్లల్లనన్ సాహితీ
హృదయస్పందము గుర్తులందుకొని 'ఆంధ్రీ' పత్త్రికారత్న మ
భ్యుదయ చ్ఛాయల కెక్కుకాలమున నయ్యో! పాపినై యాఁపికొ
న్న దరిద్రుండను; నిద్రలోఁ గలవరింతున్ నేఁటి నాయూహముల్.

నాఁట నవిచిన యీ కూర్పు నేఁటి కిటులు
పెనిచి, మాతల్లి నత్తిపెంచిన జనకుఁడు
రాజయోగి: శ్రీ అకొండి రామమూర్తి
శాస్త్రి కుడుగరలిడుదుఁ బుష్పసరభరము.
ఇచ్చుటయు, వారు మేమును బుచ్చుకొనుట
మూఁడు తరముల యాచారముగ రహించు;
నిపుడు మాయుడి వయిచేయి; యిచ్చువాఁడ
నేను; నాకృతికిఁ బ్రతిగ్రహీత తాత.
'పోల్వరము' వెళ్లి వచ్చునప్పుడదియేమొ!
వెక్కసం బౌను, అమ్మమ్మ వెఱ్ఱిప్రేమ;
ఆమె కనులు కృపాఝరు; లామె వోయు
దీవనలు లేక రాలేను రేవుదాఁటి.

మవ్యాఘమానసులై యమృతమానసులై కనటింతలేని లే
నవ్వులరాసులై మెఱసినార లఖండరసస్వరూపు; లా

ముప్పురు మేనమామలయుపోలిక నా మీదఁ గూడి వచ్చినం
బువ్వలబాట లంచనడపుఁ గద ! మత్కవితా చిరంటికిన్.
పోరలున్ — పోరులు లేక భావములు పూవుల్ తావులై వాస్తుమా
వుగ మేనత్తల కూర్మిలోఁ గరఁగిపోవు నాన్నమన; న్నింతలో
బిగుసులోఁవును బెన్గయుల్లుఁదనవుంబిగకమ్ము; నా కంఠలో
భరమైపోవును వారి వారి యమృత స్వాన్తమాత్ర మర్యాదలున్.

పెద్దకఁ దాతయ్య కూర్చున్న పీఠియురఁగు
పండ్ల బరువున నొరఁగు కల్పద్రుమంబు —
చేరి మామయ్య లోఁదాగు దక్షిణావృత్తపు
పోకమ్రాఁకులు, తముల్పుటాకుఁ దోఁపు.

విందులలో మందులలో
పొందులలో పేరుచెప్పి యేతెంచు హితుల్
బంధుగులు నిత్యమును బడి
యుందిగదా, వారి సదన మాధురి యదిరా !

మఱియొక ముచ్చట — అచ్చటఁ
బఱిదిన భోజనపుఁ బంక్తిఁ బరికింపవలెన్
వరికళ్ళము చేరిన పా
వురముల వలె వచ్చి తినవి పోదురు నిసువుల్.

కొడుకులు మనుమలుం జెలుపఁ గుఱ్ఱలు బంధువు, లల్లువారు, పే
ర్వడిన కవుల ప్రియాతిథులు పర్విన చుక్కలబంతిలోనఁ జం
ద్రుఁడు వలె " గందమత్తులలోఁ " గళతో—సఖిరామమూర్తి యే
ర్పడ సమ్మతాన్నపుం జవులు వట్టును తాతయు, మెట్టి ధన్యుఁడో !
ఎనుబది యేండ్లకున్ దరిసి నెక్క తొలంకినవాఁడు తాత — జ
వ్వనమున నుండి పెంపుగను వాఁడగు నీమనుమండు కూడ — ని



బ్రహ్మశ్రీ

పండిత : ఆకొండి రామమూర్తి శాస్త్రిగారు

ల్వాని యదది నిశ్చయం; బీఁక నిలాస్థలి నీయుభక్తైక నిష్ఠ బం
ధన పరమార్థ మీకృతిగదా, యొకకొంతకుఁ గొంత నిల్చినన్.

ఏమో! యీకృతి యంత శాశ్వతమటోయీ! యందురా, కాదు కా
నీ, మాధుర్యధురీణ కావ్యరచనా నిత్యోత్సవ శ్రీకళా
ధాముల్ సూర్యరు పెంచు నీయమృతగాథా స్తోత్రము లీనాఁటితో
నే, మిన్నందియు పట్టి "మందకొడు" లౌనే, యొట్టులూహించినన్.

'ఇది యి'ట్లని చెప్పఁగా
కుదురని యొక కదలి పోని గూఢాశయ మె
య్యదియొ నను గదలించెడి—
నదిగో, మాకామపూర్ణాభిలషితమై.

అంబరములు తొడవు లగ్రహారమ్ములు
పంచకార మభిలషించలేదు ;
వ్రాయఁ దోఁచి వ్రాసి— బ్రహ్మార్పణైకతా
త్పర్య మదర సుకృతి కాత కెడద,

## సమర్పణము

కాతయ్యా, కొనుమయ్య, యీ చిఱుతపాత్రం బుత్తమ శ్లోక గా
థా తాత్పర్య సనాథమై యలరి యంధ్రశ్రేణి రాణించు! నీ
కేతత్స్వీకృతి దొడ్డగా; దయిన — దౌహిత్రుండనై పూజ్యపూ
జాతంత్రంబున నవ్వులోఁగు నను విశ్వాసంబుతో నిచ్చెదన్.

సాఁగిన జీవితంబు, చెయిచాఁపని భావము, కీర్తిలిప్సకున్
లోఁగమి - కాగ నిస్పృహత - లోకము దాఁటినచూపు - నిన్నిటం

డాఁగిన కోవిదుండనగు త్వత్కవితా గజగర్భ పద్ధతిం
దోఁగినవాఁడ; నీ నినున్న దోయిటఁ బోయుము వంచుదీవనన్.

అరయిక చేసితో నొకటి యాశ్చర్యముఁ దోఁచును నాకు; అమ్మతో
శరణముగాఁ గవిత్వధన మంపితి వింపిత; మట్లు పిత్ర్యమై
సిరి నను సంక్రమించుటను జేసి ధనత్కృతముం గృతజ్ఞతా
భర హృదయుంబునం దలఁచు వాఁడగఁ జెప్పెద ధన్యవాదమున్.

పసినాఁటం దనతండ్రిఁ గాసి వనవింపంగీసి - మానాన్న శా
రసుతో పాటుగ "సైద్యాలత్రిన్న" నిడి శౌరా! నాఁటి నీ ప్రేమఫుం
బస నీనాఁడొక భామసందన నసీ ప్రాగ్భారమై మాఁదు వం
గన మింపారెడి నన్నుఁజో సతీశరామా కృంబానా లోకానకిఁ.

తిరుపతి కవీశ్వరులు 'శేవి చరిత' రచనఁ
బసదనాన సద్ధావన మొనఁగి రనఁగ -
నీకవితాధికృతులు గణింపఁ దరమె!
నీకు నాయిచ్చుకాన్క యుల్లాకులనుక.

ఇలు వేల్పై కరుణించి పూటపడి నీ
శేలోటునున్ రాని య
ట్టులు దీవించెడి 'శామవల్లి' కృప గ
ట్టుల్ దాఁటి నామీఁద, పొం
గులుగట్టన్ మతిమిన్ని కట్టుడునా, ని
గ్గుల్ జేఱు నేశాద్య గు
జ్జ్వాల బంధంబులు, భావబంధుర కృతుల్
భాషా విభూ షోన్నతుల్.

రాజమహేంద్రవరము
వికృతి శ్రావణి - ౧౯౫౦

సత్యనారాయణశాస్త్రి

# ప్రకాశకుల విన్నపము

ఈగ్రంథము, మా సరస్వతీగ్రంథమండలికే గాదు, ఆంధ్ర వాఙ్మయమునకును క్రొత్త భూషణము. శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, ఇది రచించుటతో, గ్రంథకర్తలలో తా మొక విశిష్టస్థాన మాక్రమించుకొని, ప్రకటించుటతో, గ్రంథప్రకాశకులలో మాకు నొక విశిష్టస్థాన మనుగ్రహించినారు.

ఆంధ్ర వాఙ్మయమున, నేను, శ్రీ వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రతో సరితూగగల గ్రంథ మిది యొక్కటియే. అందు కవుల బాహిరరూపము చిత్రింపబడినది. ఇందు రచయితల ఆంతర రూపము చిత్రింపబడినది. అది సంతరించుటకు పంతులుగా రెంత శ్రమ పడియుండినారో, యిది సంతరించుటకు శ్రీ శాస్త్రిగారును అంత శ్రమపడినా రని పాఠకులు స్ఫుటముగా గుర్తింపగలరు.

ఇందు పందొమ్మిదవ శతాబ్ది రచయితలనే గ్రహించినారు. అయితే, విషయసేకరణకు అవకాశములు చాలక, మరికొందరి నిందు చేర్చుటకు వీలులేకపోయినది. ఆకొందరు, అధికసంఖ్యాకులు గాని అల్ప సంఖ్యాకులు కారు. వారిని గురించి మరింత గ్రంథము తయారు కావలసియున్నది. అందుకును తమకు గల ఉద్దేశప్రయత్నములు శాస్త్రిగా రింకు ఉల్లేఖించియే యున్నారు. నేనును అదియును ప్రకటించుటకు ఉత్సుకుడనై యున్నాను. మీ మిరుపురమును గూడ ఇందు త్వరితముగనే కృతకృత్యులము కాగలమని నేను నమ్ముచున్నాను.

ఈగ్రంథము చదివిన, దిగ్గజములవంటి అనేకజీవద్రచయితల గోష్ఠిలో పాల్గొనుచున్నట్టు విలక్షణానుభూతి కలుగును. దానంజేసి

బుద్ధి నిశితమును, ప్రతిభ నవనవోన్మేషితమును అగును. శ్రీ శాస్త్రి గారు ఆశించిన పరమార్థమే యిది.

శ్రీ శాస్త్రిగారి ప్రతిభాప్రాగల్భ్యములు మన పండితకవులు ఇదివరకే తప్పనగా గుర్తించియున్నారు. ఈ గ్రంథము శాస్త్రిగారికి జయపతాకయు, పండితకవులకు ఆనందోద్బోధనమును కాగలదు.

ఈ రెండును నాకు వెలలేని భూషలు.

శ్రీ సత్యనారాయణశాస్త్రిగారితో నాకు ఇట్టి మైత్రి సంఘటించిన శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నేను నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

ఆంధ్రమహాజనులు, ఈగ్రంథము గౌరవము గుర్తించి, ఆదరించి, ఇంక నిట్టి యుద్గ్రంథములు ప్రకటించునట్లు నాకు ఉత్సాహము కలిగింతు రని ఆశించుచున్నాను.

ఇట్లు

రాజమహేంద్రవరము
15 — 9 — 1950

అద్దేపల్లి నాగేశ్వరరావు
సరస్వతీ పవర్ ప్రెస్సు అధిపతి

# ఆంధ్ర రచయితలు


| | పుట |
|---|---|
| పరవస్తు చిన్నయసూరి | 1 |
| మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి | 11 |
| కోరాడ రామచంద్రశాస్త్రి | 16 |
| మతుకుమల్లి నృసింహకవి | 20 |
| వారణాసి వేంకటేశ్వరకవి | 25 |
| అకొండి వేంకటకవి | 29 |
| పరవస్తు వేంకటరంగాచార్యులు | 34 |
| నరసింహదేవర వేంకటశాస్త్రి | 37 |
| రేకుల వేంకట రాయకవి | 39 |
| అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి | 42 |
| మండపాక పార్వతీశ్వరశాస్త్రి | 48 |
| మాడభూషి వేంకటాచార్యులు | 55 |
| ముడుంబ నృసింహాచార్యకవి | 60 |
| కొక్కొండ వేంకటరత్నశర్మ | 65 |
| బహుజనపల్లి సీతారామాచార్యులు | 69 |
| ఆదిభట్ల నారాయణదాసు | 73 |
| కందుకూరి వీరేశలింగకవి | 82 |
| త్రిపురాన తమ్మయదొర | 89 |
| వావిలాల వాసుదేవశాస్త్రి | 94 |
| గురజాడ శ్రీరామమూర్తి | 100 |
| వేదము వేంకటరాయశాస్త్రి | 102 |
| ధర్మవరము రామకృష్ణమాచార్యులు | 111 |
| దేవులపల్లి సోదరకవులు | 116 |
| పురాణపండ మల్లయ్యశాస్త్రి | 121 |
| పోరవంది రామశాస్త్రి | 124 |
| వడ్డాది సుబ్బారాయకవి | 126 |
| కోలాచలము శ్రీనివాసరావు | 131 |
| కొంగి భద్రాద్రిరామశాస్త్రి | 133 |
| తాడూరి లక్ష్మీనరసింహరాయకవి | 137 |
| కల్లూరి వేంకటరామశాస్త్రి | 140 |
| మచ్చ వేంకటకవి | 143 |
| అకొండి వ్యాసమూర్తిశాస్త్రి | 148 |
| జయంతి రామయ్య | 154 |
| పూండ్ల రామకృష్ణయ్య | 162 |
| అల్లంరాజు రంగశాయికవి | 165 |
| మేడేపల్లి వేంకటరమణాచార్యులు | 171 |
| గిడుగు వేంకటరామమూర్తి | 176 |
| కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి | 179 |
| వావిలికొలను సుబ్బారావు | 184 |
| నాదెళ్ళ పురుషోత్తమకవి | 187 |
| శృంగారకవి సర్వారాయకవి | 191 |
| దాసు శ్రీరామకవి | 196 |
| ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ | 201 |
| పానుగంటి లక్ష్మీనరసింహరావు | 206 |
| నాగపూడి కుప్పుస్వామి | 211 |
| శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి | 214 |
| కూచి నరసింహము | 223 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహము | 224 |
| చిలుకూరి వీరభద్రరావు | 236 |
| కొమర్రాజు వేంకటలక్ష్మణరావు | 239 |
| కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు | 244 |
| జనమంచి వేంకటరామయ్య | 251 |

# పరవస్తు చిన్నయసూరి

## 1806 – 1862

సాతాని శ్రీవైష్ణవుఁడు. అభిజనము: చెంగల్పట్టు జిల్లాలోని పెరంబూదూరు. ఉనికి: చెన్నపురము. తల్లి: శ్రీనివాసాంబ. తండ్రి: వేంకటరంగయ్య. సూరి జననము 1806–నిర్యాణము 1862. రచించినగ్రంథములు: చింతామణివృత్తి 1840– పద్యాంధ్రవ్యాకరణము 1840– సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము 1844– పచ్చయప్ప నృపయశోమండనము 1845– ఆదిపర్వవచనము 1847– శబ్దలక్షణ సంగ్రహము 1853– నీతిచంద్రిక 1853– నీతిసంగ్రహము 1855– బాల వ్యాకరణము 1855– విభక్తిబోధిని 1859– ఆంధ్రధాతుమాల– అక్షర గుచ్ఛము– ఆంధ్రశబ్ద శాసనము– బాలవ్యాకరణ శేషము– ఇంగ్లీషులా చట్టముల భాషాంతరీకరణము– ఆంధ్రకౌముది (వచనము) ఆంధ్ర కాదంబరి (వచనము) అకారాది నిఘంటువు– చాటుపద్యములు– సుజనరంజనీ పత్రిక– యాదవాభ్యుదయము.

ప్రాచీనాంధ్ర భాషాయుగమునకు నన్నయవలె, అర్వాచీనాంధ్ర భాషాశకమునకు 'చిన్నయ' మార్గదర్శకుఁడు. నన్నయ తననాఁటి వ్యావహారికమును గ్రాంథికవ్యావహారముగా సంస్కరించుటకు చింతామణి రచించిన శబ్దశాసనుఁడు. చిన్నయ దేశభాషలో బాలవ్యాకరణము రచించి యాంధ్రపాణిని యనిపించుకొనిన సూరి. చింతామణికి శేషగ్రంథముగా 'అథర్వణ కారికలు' బాలవ్యాకరణమునకు శేషగ్రంథముగా 'ప్రౌఢవ్యాకరణము' వెలువడినను విద్వాంసుల శాస్త్రార్థములకాఁగినవి చింతామణి బాలవ్యాకరణములు రెండే. నన్నయభట్టు భారతామ్నాయము నాంధ్రీకరించి తెలుఁగునఁ బద్యకవితకు బాటవేసెను. చిన్నయసూరి నీతిచంద్రిక సంధానించి యాంధ్రమున గద్యకవితకు ఘంటాపథము కల్పించెను. ఆదికవి యనఁబడిన నన్నయభట్టారకునకుఁ బూర్వ

మాంధ్రమునఁ బద్యకవిత్వము సేయుటకు పిలువబడదు. అటులే, చిన్నయ సూరికిఁ బూర్వము గద్యగ్రంథములు రచించినవారు లేరనుటకును ధైర్యము చాలదు. కాని 'నీతిచంద్రిక' వంటి యుత్తమవచన కావ్యములు నాఁడు వెలయలేదనవచ్చును. నాఁటికిని నేఁటికిని సూరివచన శైలి యనన్యలభ్యమైన వైలక్షణ్యము గలిగియే యున్నది. కావునఁ బద్యమున నన్నయకువలె గద్యమునఁ జిన్నయకు నాద్యస్థానము నీయవలయును.

చిన్నయసూరి తండ్రి వేంకటరంగయ్యగారు మంచి పండితులు. వీరు చెన్నపురిలో నీస్టుఇండియాకంపెనీవారి పాలసమయమునున్న యున్నత న్యాయస్థానమునఁగల పండితసభ్యులలో నొకరు. 1836 లో వీరు మరణించిరి. చనిపోవునప్పటికి వీరి వయస్సు నూటపదియేండ్లవఱకునుండును. సూరి తండ్రికడనే తెనుఁగు, అఱవము, సంస్కృతప్రాకృతములు చదువుకొనెను. కంచి రామానుజాచార్యులతోఁ దర్కాలంకార మీమాంసలు పఠించెను. ఉత్తరదేశ పండితుఁడు రామశాస్త్రి యను నాయనకడ వేదవేదార్థరహస్యములు సంగ్రహించెను. ఈ రామశాస్త్రియే సూరికి హయగ్రీవమంత్రోపదేశ మొసగించెను. సూరి స్వయంకృషిచే నాంగ్లములోఁగూడ నించుకపరిచయము కలిగించుకొనెను. వేదము వేంకటరమణ శాస్త్రులుగారు (వేదము వేంకటరాయశాస్త్రి గారి తండ్రి) చిన్నయసూరినాఁటివారు. వీ రిరువురు సాహిత్యగోష్ఠి చేసెడివారు. సూరిగారి యాంగ్లభాషాపరిచయము బ్రౌనుదొర మున్నగువారితో విశేషస్నేహము చేకూర్చినది. ఉన్నతోద్యోగులగు నాంగ్లేయు లెందఱో సూరిగురుత్వమున సంస్కృతాంధ్రములు సాధించిరి. వారివారి సాహాయ్యమున పచ్చయ్యప్ప కళాశాలలో సూరి ప్రధాన పండితపదము సంపాదించి 1845 మొదలు 1848 వఱకు నచట నుద్యోగించెను.

చెన్నపుర రాష్ట్రీయ కళాశాలలో సూరి ప్రధానాంధ్రోపాధ్యాయుఁడై యుండెను. మొట్టమొదట నాంధ్ర మహాభాగవతము వెలువరించిన పండితవరులు పురాణము హయగ్రీవశాస్త్రిగారు నాఁడు ద్వితీయాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. వీ రిద్దరును సహపాఠులు. నాఁడు విశ్వవిద్యాలయ కార్యదర్శి ఎ. జె. అర్బత్ నట్ దొర కాశీనుండి తర్క మీమాంసా పండితుల రావించి చిన్నయను బరీక్షచేయించి సమర్థుఁడని యెఱిఁగి 'చిన్నయసూరి' యను నక్షరములతో స్వర్ణకంకణము నొండు 'సీమ' నుండి తెప్పించి బహుమానించెను. నాఁడు మొదలు చిన్నయ చిన్నయసూరి.

ఆ కాలమున మదరాసులో న్యాయమూర్తి శ్రీరంగనాథశాస్త్రి పదునైదు భాషలలోఁ బ్రవేశముగల పెద్దన్యాయాధిపతి.

ఆయనకు హయగ్రీవశాస్త్రిగారిపై నభిమాన మధికము. ఆ కారణమున నాయనతో "సూరిగారి ప్రథమోపాధ్యాయ పదవి మీకు వచ్చునట్లు చేసెద" నని రెండుమూఁడుసారులు చెప్పుచు వచ్చిరఁట. అంతట హయగ్రీవశాస్త్రిగారు "ప్రధానోపాధ్యాయస్థానమునకు సూరిగారే సమర్థుఁడు." అని చెప్పి రంగనాథశాస్త్రిగారికి సూరిప్రతిభ చూపనెంచి యొక యాదివారమున వారిని సూరియింటికిఁ గొంపోయిరఁట. రంగనాథ శాస్త్రిగారి కోరికపైఁ జిన్నయసూరి యలంకారవిషయము ముచ్చటించుట కారంభించెను. ఆ మహోపన్యాస మట్లు గంగాప్రవాహమువలెఁ బోవుచునే యున్నది. రంగనాథశాస్త్రిగా రేకతానులై చెవులొగ్గి వినుచుండెను. హయగ్రీవశాస్త్రి తమసహపాఠికీర్తి కానంద భరితుఁ డగుచుండెను. రాత్రి పదిగంట లయినది. అప్పుడు న్యాయాధిపతికి మెలఁకువవచ్చి సూరి శాస్త్రజ్ఞానమున కాశ్చర్యపడి, పూర్వాభిప్రాయము తొలఁగించుకొని సెలవుగైకొని యింటికిఁ బోయెను.

సూరిగారికిఁ జేరువఁ బొందినశిష్యు లెందఱో. కల్పతరు శబ్దరత్నాకరకర్తలు, ప్రౌఢవ్యాకర్తలు నైన బహుజనపల్లి సీతారామాచార్యులు

గారు వీరి శిష్యరత్నము. ఆంధ్ర విశ్వగుణాదర్శకర్త పంచాంగము తేవప్పెరుమాళ్ళయ్య సూరికడనే పఠించెను.

బ్రౌనుదొర, గాజుల లక్ష్మీనృసింహము సెట్టి, జస్టిస్ రంగనాథ శాస్త్రి, కుమారస్వామిశాస్త్రి మున్నగు మహనీయులు నెచ్చెలులై చిన్నయసూరి భాషాసేవకు నిరంతర ప్రోత్సాహ మిచ్చుచుండువారు. తొట్టతొలుత సూరిని గ్రంథ రచనోద్యమములో బెట్టినవాడు లక్ష్మీనరసింహముశ్రేష్ఠి. ఆంధ్రశబ్దశాసనము, ఆంధ్రనిఘంటువు, వీరి హెచ్చరిక వలన నీసూరి వ్రాయనారంభించెను. కాని యది గ్రంథము గడముట్టలేదు. ఈనిఘంటువిషయ మిచట గొంతముచ్చటింపవలసినది కలదు.

చిన్నయసూరి యాంధ్రనిఘంటు రచనోద్యమము నెఱిగినవారు పెక్కుమంది యుండరు. ఆయుద్యమము కడముట్టలేదు గాని పదముల పట్టిక వ్రాసికొని, యర్థనిర్ణయమునకు గావలసిన ప్రాచీనమహాకవి ప్రయుక్త వాక్యముల నెత్తి, కొన్నింటి కర్థనిర్ణయము చేసి సూరి చాల బరిశ్రమమునకు బాలుపడి దైన దుర్విపాకమును రాచపుండును బడయుట చేత, 1862 లో బ్రాణములు గోలుపోయెను. ఆచార్యుని గతానంతరము వారియాప్తశిష్యులు బహుజనపల్లి సీతారామాచార్యులవారు సూరిగారి కోడలికడ నున్న నిఘంటుసామగ్రిని కారణాంతరము చెప్పి పుచ్చుకొని యంతయు సంగ్రహించి వ్రాసికొని మరల నది యామె కిచ్చివేసిరని యొక వదంతి. ఈ వదంతిలోని యోగాయోగములు నిర్ధారింపజాలము. కాని శబ్దరత్నాకరమునకును, అముద్రితమగు చిన్నయసూరి నిఘంటువునకును పెక్కుచోట్ల నక్కసెల్లెండ్ర పోలికలు కలవు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి కిది యెటులో లభించినటులు, ఆయనకడ వీరేశలింగము పంతులుగారు విలిచికొని, సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయము వారికి, అనగా ఆంధ్ర సాహిత్యపరిష త్కార్యాలయమునకు వెలకో, ఊరకో యిచ్చియుందురని విన్న సంగతి. ఏమైనను, తన్నిఘంటు కార్యాలయ పండితులు ప్రామాణికముగా నిర్వాంతకాలము చూచు

కొన్నా రన్నది నా కనుఁగొన్న సంగతి. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువున చి. ని. అను సంకేతాక్షరములతో నున్న పద సందర్భము లరసిన నిది విశదము. సూరి స్వహస్తాక్షరములతో నక్షిపర్వ మొన రించుచున్న యసంపూర్ణ నిఘంటుపత్రములు భాషాచరిత్రమున శాశ్వ తత్వమును గల్పించుకొనఁగలవనుటలో నాశ్చర్యము లేదు. శబ్దరత్నాకర కారుల యీ వాక్యములువినుఁడు.

"సంస్కృతాంధ్రములయందు విశేషపాండిత్యము కలిగి యాసేతు హిమాచలము చాలఁ బ్రసిద్ధివహించియుండిన పరస్తు చిన్నయసూరిగారు జీవితులై యుండినకాలంబున దీర్ఘసూత్రతతో ననేక గ్రంథపరిశోధనంబు గావించి మిగుల విరివిగాఁ బ్రయోగసహితంబుగా అకారాది తెనుఁగు నిఘంటు వొకటి వ్రాయం బ్రారంభించి నడపుచుండిరి."

ఈ మాటలనుబట్టి చూచిన సీతారామాచార్యులవారికి సూరిపైఁ గల గౌరవభావమును, శబ్దరత్నాకరమునకు సూరినిఘంటువుతోఁ గల సంబంధము విస్పష్టమగును. ఆచార్యులవారి "ప్రౌఢవ్యాకరణము" లోని సూత్రములకును, అచ్చున కెక్కని సూరిసూత్రములకును గొన్నింట గురుశిష్య సంబంధమున్నది. సూరి "బాలవ్యాకరణ శేషము" ఆంధ్రి యభాగ్యవశమున సశేషమై పోయినది.

బాలవ్యాకరణము :

'బాలవ్యాకరణము' నకు చిన్నయసూరి యని ప్రసిద్ధవ్యవహారము. కిరాతార్జునీయమునకు 'భారవి' యని, శిశుపాలవధమునకు 'మాఘు'వని పేరు లున్నవి. 'టెన్నిసన్' చూచితిరా? 'షెల్లీ' చదివితిరా? యనునది పాశ్చాత్యము. తెలుఁగున నిట్టివాడుక చిన్నయసూరికిఁ దక్కినది. సూరి కీర్తిచంద్రికకు బాలవ్యాకరణము శారదరాత్రి. సంస్కృత భాషావ్యాక రణములెన్నో యున్నవి. కాని పాణినీయముముం దవి నిలఁబడలేక పోయినవి. తెలుఁగునను జాలమంది వ్యాకర్తలు పుట్టిరి. వారు చిన్నయ సూరికి లోచ్చు. దీనినిబట్టి సూరిని కాదనిపింపఁగల శాస్త్ర పండితులు

కలిగింపఁజూతురు. అంతకుఁబూర్వము కొంతకాలము క్రిందటఁ జిన్నయసూరి బాలవ్యాకరణము రచియించెను. దానితో సరిపోల్పఁదగిన యాంధ్రవ్యాకరణ మానరకు వేఱొకటి లేదు. అట్లుండఁగాఁ గృష్ణమూర్తిగారిచేఁ జేయఁబడిన వ్యాఖ్యానముతోఁ గూడిన హరికారిక లనఁబడెడి యాంధ్రవ్యాకరణసూత్రగ్రంథ మొకటి యటుతరువాత నల్పకాలమునకు వెలువడెను. అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ జేర్కొనఁబడిన కారికావళియైన పక్షమునఁ జిన్నయసూరి తనవ్యాకరణములోని సూత్రములన్నిటిని హరికృతగ్రంథమునుండి దొంగిలించి తన పేరిటఁ బ్రకటించినట్లు స్పష్ట మగుచున్నది. అయినను మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్ని యథర్వణాచార్యుల కిటీవలి యాధునిక గ్రంథములలోని వగుటచేత వ్యాఖ్యానమును మాత్రమేగాక మూలగ్రంథమును సైతము కృష్ణమూర్తిగారే రచించిరేమోయని పలువురు సందేహపడుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగలసామర్థ్య మావిద్వత్కవికిఁగల దనుటకు సందేహములేదు. ఈయన యిటువంటి గ్రంథకల్పనము సేయ సంశయపడువారు కారని చూపుటకై చరమదశయందు నూడుగల్లులోనున్న ప్పు డొకరాత్రిలోఁ జేసిన ట్లీయన కారోపింపఁబడిన యశ్వశాస్త్రకథ కొంత తోడ్పడుచున్నది".

(కవులచరిత్ర 588 పుట)

ఈ వాక్యములు సావధానముగాఁ జదివినచో సూరిగారి బాలవ్యాకరణమున కసూయపడి కృష్ణమూర్తిశాస్త్రిగారు హరికారికలు రచించిరనుట సుస్పష్టము. ఇదిగాక హరికారికలు పెక్కుచోట్ల నసందర్భములుగా నున్న వికూడను. ప్రథమమున మదుపజ్ఞంబని చెప్పిన 'సంస్కృత వ్యాకరణము' సుప్రచురము కాదని తలఁచి బాలవ్యాకరణము తెనుఁగున సూరి రచించినాఁడు. చిన్నయసూరి కృష్ణమూర్తిశాస్త్రిగారివలె సర్వతంత్రస్వతంత్రుఁడు, షడ్దర్శనీపారంగతుఁడు కాకపోవచ్చును. బాల

వ్యాకరణము రచించుటకుఁ దగినపాణినీయపాండితియుఁ బ్రయోగపరి జ్ఞానము లేనివాఁ డనుట యన్యాయము.

ఆంధ్ర విశ్వవిద్యాలయపండితులు శ్రీ గుమ్మ్లూరి వేంకటరమణశాస్త్రి గారీ వాదమును బలపఱుచుచుఁ గడకు వారు నిష్కర్షించి తెల్పిన యభిప్రాయ మిది:

"...పూర్వోదాహృతములగు సంశయములన్నియు బాల వ్యాకరణమే ప్రాథమిక మని స్థాపింపఁజాలియుండుటవల్లను, సూరిగారు విద్యాంసులని పండితపరంపరాయాతమగు ప్రసిద్ధి యుండుటవల్లను, నాంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయము వారు ప్రచురించిన సూరిగారి జీవితమును బట్టియు, సూరిగారు రచించిన నిఘంటువును బట్టియు వీరిట్టి వ్యాకరణ గ్రంథము స్వతంత్రముగా రచించుటకు సమర్థులని స్పష్టముగాఁ దెలియు చుండుట వల్లను, బూర్వోదాహృతమగు సర్వశాస్త్రకథనుబట్టి శిష్టుకవిగా రిట్టి గ్రంథ కల్పనము చేయఁగలిగినవారని స్పష్టపడుచుండుట వల్లను వారికారికలకు బాలవ్యాకరణమే మూలమని నాయభిప్రాయము."

[బాల వ్యాకరణ వారికారికల పౌర్వాపర్య విమర్శనము - ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక సంపుటము ౧౫ - సంచిక ౫, ౬.]

**నీతిచంద్రిక :** ఇది సూరికృతులలో నత్యుత్తమము. వచన కథారచనా విధానమునకుఁ జిన్నయసూరియే శ్రీకారముచుట్టె ననుటకుఁ జరిత్రపరిశీలకు లొప్పకున్నను నీతిచంద్రికలోని శైలి గణాలవాల మనుట నన్వాదయు సామాన్యముగ నిష్ణాపత్తియే. సూరి 'వాణీదర్పణ' మను ముద్రాయంత్రమును నెలకొలిపి నీతిచంద్రిక తొలిముద్రణము 1853 లో వేయించెను. ఏ కేశలింగకవి "చిన్నయసూరి ధీయు తెదఁ జేరిది సారెకు నాదరింపఁగా మున్ను రచించియించె నగము స్వచనంబుగ నీతిచంద్రికన్" అని తా నుత్తరార్థముఁ గూర్చెను. కొక్కొండ వేంకటరత్నము పంతులు గారును 'విగ్రహము' గావించిరి. సూరివచనములోని సొగసు వీరిద్వార తను దూరమైనది. మిత్రభేదము మిత్రలాభముకంటెఁ బ్రౌఢము. రచనా

చతురతకును, సామెతలు చక్కఁగ వాడుటకును, ప్రయోగ విశేషములు ప్రదర్శించుటకును చిన్నయసూరి శ్రద్ధ తీసికొనెను. రసానుగుణములగు వృత్తులు, పాత్రోచితములగు పదములు నీతిచంద్రికయందే పరికింప వలయును. సూరి సూత్రాంధ్రవ్యాకరణము — ఆంధ్ర ధాతుమాలయు నాంధ్ర సాహిత్యపరిషత్తు ప్రకటించినది.

ఇతఁడు సంస్కృతాంధ్రములలోఁ జక్కనిరీతిగల కవిత సంతరించెను. పచ్చపస్నప యశోమండనము చూడుఁడు.

"గగనంబట్లు రసప్రపూర్ణ విలసత్కాండంబుల స్స్మితి య
భ్రగసాలంబుగతిన్ సితచ్ఛదములన్ భాసిల్లి మేరుక్రియన్
జగదామోద సువర్ణభాస్వరముగా జానొంది పచ్చాపనీ
శగుణంబు ల్గణుతించుకోశ మిది యిచ్చు న్మెచ్చుగావించెడిన్.
గుణస్య బాధికాం వృద్ధిం కృతవాన్ పాణినిః పురా
అబాధితగుణాం వృద్ధిమకరోత్ పచ్చపప్రభుః"

సంస్కృతాంధ్రకవితలు రెండును ధారాళగతినుండి పండిత హృదయముల నాకర్షించుచున్నవి.

చిన్నయసూరి వ్యాకర్తయే కాదు, కావ్యకర్త కూడను. భాషాభిజ్ఞుఁడే కాదు, సంగీతకళావిజ్ఞుఁడు కూడను. సరస్వత్యుపాసకుఁడే కాదు, హయగ్రీవోపాసకుఁడు కూడను. సుస్థిరయశస్సంపాదకుఁడే కాదు, "సుజనరంజనీపత్రికా" సంపాదకుఁడు కూడను.

సూరి కంఠధ్వని చాల శ్రావ్యముగా నుండెడిదఁట. ఆయన సంగీతము కొంతనేర్చెను. సూరి 'సుజనరంజని' యను మాసపత్రిక కొన్నియేండ్లు వెలువరించినట్లు తెలియును. అందుఁ బట్టపరీక్షార్థులకు విద్యాంసులకుఁ గలుగు భాషాసందేహములకుఁ జక్కని సమాధానములు ప్రచురింపఁబడుచుండెడివఁట. "ఇదివరలోఁ జిన్నయసూరి ముద్రించుచు వచ్చిన సుజనరంజనీ యను పత్రికయందు పై నుదహరించిన

మూఁడు గ్రంథములును భట్టుమూర్తి రచించె నని వ్రాసియున్నది" (అముద్రితగ్రంథ చింతామణి- 1886 ఫిబ్రవరి) ఈవ్రాఁతను జూచిన 'సుజనరంజని' సూరి నడపినటులు సువిశదము.

సూరి కవితానిపుణుఁడు. వచనరచనా మార్గదర్శకుఁడు. సంఘ సంస్కారపరుఁడు. భాషాపోషకుఁడు. ఇతఁడు ప్రాచీనుల యడుగుజాడలలో నడచెను. ఇతనికి నన్నయ చెప్పినది వేదము. ఇతనికడ శాస్త్రాది గ్రంథములతో నిండిన భాండాగార ముండెడిదని ప్రసిద్ధి.

శ్రీనుదార ప్రోత్సాహము - లక్ష్మీనరసింహశ్రేష్ఠి హెచ్చుగిక, సూరిభాషాసేవకుఁ జేయూఁత నిచ్చినవి. సూరి మరణించినను నాతని కీర్తిజ్యోతి బాలవ్యాకరణ పీఠిచంద్రికాస్నేహమున నధునాతనాంధ్ర భాషాభవనములో దేదీప్యమానముగ వెలుఁగుచునే యున్నది.

# మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి

# 1808 - 1873

ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. హారితసగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. తల్లి : సీతమ్మ. తండ్రి : శరభరాజామాత్యుఁడు. జన్మస్థానము : పిఠాపురము దగ్గఱనున్న తిమ్మాపురము. జననము : క్రీ. శ. 1808 విభవసంవత్సరము. నిర్యాణము : 1873 సం॥రం మే 11 తేది, శ్రీముఖసంవత్సర వైశాఖశుద్ధచతుర్దశి భానువాసరము. గ్రంథములు: ౧. సీతారామచరిత్రము (అష్టాశ్వాసముల కావ్యము– 1851–52) ౨. కృష్ణార్జునచరిత్రము (ద్వ్యర్థి కావ్యము – 1868) ౩. శివలింగ శతకము (1869. )

సూర్యప్రకాశకవి శ్రీ కృష్ణభూపాలునాస్థానమునఁ బండితకవి. కృష్ణభూపాలుఁడు 'మాడుగుల' సంస్థానప్రభువు. ఈప్రభువు స్వయముగాఁ జదువుకొనిన పండితుఁడు. ఈయన 1813 లో నుదయించి 1875 లో నస్తమించెను. 1835 లో సంస్థానాధిపత్యము వహించి నలువదివత్సరములు రాజ్యమేలెను. అల్లంరాజుసుబ్రహ్మణ్యకవివరుఁ డీయనపై "కృష్ణభూపతిలలామశతకము" రచించెను. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి యీప్రభువుచే సంభావితుఁడయ్యెను. బులుసు పాపయ్యశాస్త్రి, ఇంద్రకంటి గోపాలశాస్త్రి మున్నగు విద్వత్సత్తము లీయుత్తమభూపాలుని దర్శించి సంతోషించుచుండెడివారు. సాహిత్యముకలిగి సమర్థుఁడైనప్రభుని యాస్థానమునసుండి గౌరవింపఁబడుట కవికి మహాభాగ్యము. అట్టి యదృష్టము పట్టుట యొక్కఁడనోకాని కన్పట్టదు. సూర్యప్రకాశకవి మంచి విద్వాంసుఁడు. చక్కనికవి. ఇతఁడు కృష్ణభూపతియోలగమున విద్వత్కవిగా వెలసెను. ప్రభుదర్శనమునకు వచ్చుపండితులను గౌరవించి రాజసన్మానము గావించి పంపించుచుండెను. అతని సహృదయత ప్రశంసనీయముగదా !

ఈ కవి విద్యాగురువులు మువ్వురు. కందర్ప సీతారామశాస్త్రి గారు బాల్యగురువులు. దేవులపల్లి తమ్మయసూరిగారు, వాడపల్లి అనంత పద్మనాభాచార్యులు గారును భాషాచార్యులు. వీరికడ నదఃకువకో నుభయభాషలం జక్కంగ సంప్రదాయసిద్ధముగ నభ్యసించెను. కవితాధార యితని కాజానుజమైన యులవాటులోనిది. తల్లివంక వారును, తండ్రి వంక వారును బండితకవులు.

ఈకవి మేనమామ మంచికవియఁట. సీతారామచరిత్ర లోని యీ పద్యము చదువుఁడు.

సీ. ఏమహాత్ముని తాత యీశ్వరారాధన
ప్రముదితస్వాంతుండు బసవరాజు
ఏగుణాధికు తండ్రి హిమశైలకైలాస
సురుచిరసత్కీర్తి జోగిరాజు
ఏసుధీమణియన్న భాసురాత్మజ్ఞాన
పటుమనీషాశాలి బసవరాజు
ఏధన్యునానుం డనేకబాంధవజన
స్తుత్య సద్గుణవార్ధి జోగిరాజు
అట్టి విస్సాప్రెగడ సత్కులాంబురాశి
సోము సుకవిత్వధారాభిరాము నాకు
మేనమామయు మామయునై మెఱయువాని
సథివకృతసఖ్యుఁ గామరాజాఖ్యుఁ దలఁతు.

ఈకవి తండ్రి నిటు నుతించెను.

క. ప్రవిమలభక్తి నుతింతును
రవిసన్నిభతేజు శరభరాజసమాఖ్యున్
కవితామహత్త్వ జితభా
రవికవి మజ్జనకు శరభరాజసమాఖ్యున్.

సూర్యప్రకాశకవి మూఁడుకృతులు రచించెను. అందు మొదటిది సీతారామచరిత్రము. ఇందున్నవి యాఱాశ్వాసములు. ఆంధ్ర సాహిత్యపరిషత్తు బాలకాండముగల ప్రథమాశ్వాసము 1941 లో వెలువరించినది. ఈకృతి కృష్ణభూపతి యాజ్ఞచే శ్రీ భీమలింగేశ్వర దేవున కంకితము. పూర్వాంధ్ర కవుల నీకవి యభినుతించుచు నొకసీసము వ్రాసెను. అందుఁ గవి కాలక్రమము సక్రమముగఁ బాటింపలేదు. నన్నయ, తిక్కన, శ్రీనాథుఁడు, ఎఱ్ఱన, భాస్కరుఁడు, భీముఁడు, పోతన, రంగనాథుఁడు, రామభద్రుఁడు, సోముఁడు - ఈకవి యెత్తుకొనిన కవుల వరుస యిది. సమకాలికుఁడైనను పిండిప్రోలి లక్ష్మణకవి నితఁడు కొలిచెను. దీనికిఁ గారణ మొకటి యని తోఁచెడిని. లక్ష్మణకవి ద్వ్యర్థి కావ్యము వ్రాసెను. ఈయనకును ద్వ్యర్థికావ్యము రచింప నప్పటికే తలఁపు కలిగెను. ఆ తలఁపు క్రమముగ 1863 సం॥ లో 'కృష్ణార్జునచరిత్రము' గ ఫలరూపము నందినది.

సూర్యప్రకాశకవి తనప్రభునిచే నిటు లనిపించుకొనెను:

చ. ప్రవిమలభక్తి శంభుపదపంకజపూజన మాచరింపఁగా
నవిరళ శబ్దశాస్త్రములయర్థము లొప్పఁగఁజెప్ప నుల్లస
న్నవరసభావ కావ్యరచనాపటిమ న్నృపకోటికి న్మహా
కవులకు మెచ్చుగూర్పఁగఁబ్రకాశకవీ! చతురుండ వెన్నఁగన్.

ఈకవి శివభక్తుఁడనని తెలుచు చెప్పుకొనియు 'సీతారామచరిత్రము' రచించి తన యద్వైతాభిమాన మావిష్కరించెను.

ఇతఁడు రచించిన 'కృష్ణార్జునచరిత్ర' మను రెండాశ్వాసములు గల ద్వ్యర్థికావ్యము శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి టీకతో 1905 లో వెలువడినది. ఇందు పారిజాతాపహరణ విజయువిలాసార్థములు గలవు. శ్లేషకావ్యమైనను పింగళి సూరన కవిత్వచ్ఛాయలలోనుండి కుంటి నడక లేకుండ నున్నది. శబ్దశ్లేషకంటె నర్థశ్లేష ప్రధానముగా గ్రహింపఁ బడినది. శబ్దశ్లేషలో రాఘవపాండవీయ విధానము నాశ్రయించెను.

గీ. సమయమున్నక భీష్మకజాతకేళి
నిలయ సన్నిధిఁజేరుట నలరువార్త
వినిన సత్యవిరక్తి దుర్వృత్తియనుచుఁ
జాల నిందింపకుండునే జగతి నన్ను.

(ప్రథమాశ్వాసము ౧౮౦ ప.)

కృష్ణ: సమయమున్నక = ఆచారమును గణింపక, భీష్మకజాతకేళి నిలయ = రుక్మిణీ విలాసమందిరమును, సన్నిధిఁజేరుటన్ = మంచి నిధినిఁ బొందుటయును, అలరువార్తన్ = పుష్పవృత్తాంతమును, సత్య = సత్యభామ, విరక్తిన్ = విరాగముచేత, దుర్వృత్తి యనుచున్ = దుర్వ్యాపారము కలవాడనుచు.

అర్జు: సమయమున్నక = శపథము గణింపక, అభీష్మ = భయంకరుఁడు గాని, కజాత = యమపుత్రుడను ధర్మరాజుయొక్క, కేళినిలయ సన్నిధిన్ = క్రీడాగృహసమీపమును, చేరుటను = చేరుటయనఁదగు, వార్త = వర్తనమును, సత్యవిరక్తి = శపథము నతిక్రమించిన వాఁడును........

(శ్రీవిక్రమదేవవర్మగారి టీక)

ఈ కృష్ణార్జునచరిత్రము 1908 లో బి. ఏ కును, 1914 లో ఎమ్. ఏ కును శాశ్యముగా చెన్నపుర విశ్వవిద్యాలయము వారు నిర్ణయించియుండిరి.

ఈ పండితుని సంస్కృత చాటువులు మూఁడు "చాటుధారా చమత్కారసారము" న అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి చేర్చి వ్యాఖ్యానించి యున్నాడు. అవి యివి:

శ్లో. చేతకీ గోతకీ బాకీ కాకకీ వానకుక్కుటీ
రుచిం పశ్యామి నుశ్యామే కచానాం తవ మంజులామ్॥

శ్లో. కృష్ణభూపతి సంకాశం కృష్ణభూపతి సన్నిభమ్
కృష్ణభూపతినీకాశం కృష్ణభూపతి సదృశః।

శ్లో. విక్రమేణార్జునముఖాః కృష్ణభూపాల తే హితాః
విక్రమేణార్జునముఖాః కృష్ణభూపాల తేఽహితాః॥

తొలిశ్లోకములోని పూర్వార్ధము తెలుఁగుగా భ్రమింపఁజేయును. రెండు మూఁడు శ్లోకములు మాఁడుగుల కృష్ణభూపాలుని గుఱించి ప్రశంసించుచు రచింపఁబడినవి.

సూర్యప్రకాశకవి భీమలింగ శతకమునుండి రెండురత్నములు :

క. కాయలు లేని మహీజము
కోయిల లేనట్టి వనము గుడిలేనిపురం
బాయత మోదముఁ జేయవు
కాయజహర! భీమలింగ! కలుషవిభంగా!

క. జీతంబు లేని కొలువును
దాతలు లేనట్టి పురము తమిలేని కవల్
ఖ్యాతిని బొందక యుండును
కౌతుకయుత! భీమలింగ! కలుషవిభంగా!

---

# కోరాడ రామచంద్ర శాస్త్రి

# 1816 - 1900

వేగినాటి బ్రాహ్మణుడు. కౌండిన్యసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. తండ్రి: లక్ష్మణశాస్త్రి. జన్మస్థానము: కిళ్ళంపల్లి (అమలాపురం తాలూకా) నివాసము: బందరు. జననము 1816సం॥ అస్తమయము 1900 సం॥ రచించిన తెలుగుకృతులు: ౧. మంజరీ మధుకరీయము నాటిక. ౨. ఉన్మత్త రాఘవము. ౩. నయప్రదీపము. (విగ్రహాంధ్రీకరణము) ౪. రథాంగ దూతము. (వచనము) — అముద్రితములు: ౧. శాకుంతలాంధ్రీకరణము. ౨. వేణీసంహారము. ౩. ముద్రారాక్షసము. ౪. ఉత్తరరామ చరితము. ౫. పరశురామ విజయము. (గద్యము) ముద్రితసంస్కృత గ్రంథములు. ౧. కుమారోదయము. (చంపూ కావ్యము ౨౩ ఉల్లాసములుమాత్రమే ముద్రితము) ౨. ఘనవృత్తము. (సంస్కృతాంధ్ర పద్యములు) ౩. దేవీవిజయము. (చంపువు) ౪. శృంగార సుధార్ణవము. ౫. ఉపమావళి — అముద్రిత సంస్కృతకృతులు: ౧. మృత్యుంజయవిజయ కావ్యము. ౨. పురుషార్థసేవధి కావ్యము. ౩. కమలానందభాణము ౪. రామచంద్రవిజయ వ్యాయోగము. ౫. త్రిపురాసురవిజయడిమము. ౬. ఉత్తర రామాయణము. ౭. ధీబోధము. (వ్యాకరణసంగ్రహము) ౮. మంజరీ సౌరభము ఇత్యాదులు.

“ఉత్పత్స్యతే మమతు కోపి సమాన ధర్మా” అను నిశ్చయమున ౧౯వ శతాబ్దిలో సంస్కృతాంధ్ర గ్రంథములు రచించి క్రొత్తమార్గము తీసినపండితకవి రామచంద్రశాస్త్రి. వీరిది పండితవంశము. ఆయన అమలాపురము తాలూకాలోని కిళ్ళంపల్లి గ్రామమున మాతామహుని యింట బాల్యము గడపెను. రామమంత్రోపదేశము పొందెను. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రులవారిసన్నిధి నలంకార గ్రంథములు చదివెను. మంచి సాహిత్యము సంగ్రహించెను. అంతఁ గొంతకాలమునకు,

త్వం సాహిత్యమరోసి సాధుకవితాధుర్యోసి తే వాగ్మితా
సిద్ధా ప్రవ్రజ చెన్నపట్టనపురీం విద్యాలయో మాఽనఘా

అధ్యాప్యార్య్యతమాయ విత్తబహులందత్వా పరార్థం వరం
తేన స్యాత్త్వ సత్కళత్రవిభవ స్తస్మై దిహైత త్కురు.

అని మిత్రులు వివాహార్థ మెచ్చరించిరఁట. ఆసమయమునఁ జిరపరిచయులగు శిష్టుకవిగారు రామచంద్రపురము రాజుగారికి "ఇతని నాస్థాన పండితునిగా గౌరవింపుఁ" డని యుత్తరము వ్రాసి యీయఁగా వారు దేశమున క్షామము పట్టుటచే నీకవిని రెండునెలలకంటె నెక్కువపోషింపలేమనిచెప్పిరఁట. ఆమాట రామచంద్రశాస్త్రికి నచ్చలేదు. మదరాసు పోయి యేదో యుద్యోగము సంపాదించుటకు సంకల్పించి ప్రయాణము సాగించెను. త్రోవలో మచిలీపట్టణమున నాఁగవలసివచ్చి ఇంగువ రామస్వామి శాస్త్రిగారియొద్ద మంత్రశాస్త్ర మభ్యసించెను. అప్పుడు వఠ్ఠం అద్వైత పరబ్రహ్మశాస్త్రి పాండిత్యశక్తి పరీక్షకు వాక్యార్థముచేయఁగా నందాయనను ధిక్కరించి పెండ్లిచెడఁదీసికొని యింటికిఁ బోయెను. ఆయన స్వస్థలము నడనపల్లి. ఆయూరివారు రామచంద్రశాస్త్రి సామర్థ్యము పరీక్షించుటకు శతావధానము చేయుమనిరి. మహాకవితాధార కలిగిన యీయన కడి యొక్క లెక్కకు ౧౦౭ పద్యములు తడవుకొనకుండ నవధానమునఁ జెప్పెనఁట. ఆ పద్యములు మాత్ర మనుపలబ్ధములు.

క్రమముగా శాస్త్రిగారి పాండితీ కవితా ప్రతిభలు నుతికెక్కినవి. బందరు నోబిలుపాఠశాలలో నుద్యోగము లభించినది. అక్కడ ౪౩ వత్సరములు పనిచేసిరి. దొరలు వీరినైష్ఠికతకు నివ్వెఱపోయెడివారు. ఇతఁ డెవ్వరిని లెక్కసేయఁడు. ఉద్యోగించిన నలువదిమూఁడేండ్లలో 'తప్పుచేసితి' వని యధ్యక్షునిచే నాక్షేపింపఁబడలేదు. కళాశాలాధ్యక్షునకు నీయనకు నొక శ్లోకార్థములో వ్యతిరేకాభిప్రాయములు వచ్చినవి. శాస్త్రులుగారు ముక్తకంఠమున 'మీయర్థము పొరపా" టని వ్రాసి వైచిరి. తాత్కాలికముగా నధికారికిఁ గ్రోధావేశము కలిగినను శాస్త్రులుగారి యథార్థవాదిత కాయన తలయొగ్గక తప్పినదికాదు.

వెనుక శ్రీ వీరేశలింగము పంతులుగారు రాజమహేంద్రవరమున ఆర్ట్సు కాలేజీలోఁ దెలుఁగుపండితులుగా నుండునపుడు కస్తూరి శివశంకర శాస్త్రి గారిది సంస్కృతపండిత స్థానము. శాస్త్రిగారు పరీక్షాపత్రము లెన్నగా వ్రాసినవారికి నూటికి నూటపది మార్కులు వేయుచుండు వారఁట. ప్రిన్సిపాలు 'ఇదేమిటి' మని యడుగగా, 'అవిద్యార్థిభ్యో' మని నిరంకుశముగా సమాధానించుచుండు వారఁట. మన రామచంద్ర శాస్త్రిగారి నైరంకుశ్య మీతీరుగానే సిదే.

మాడభూషి వేంకటాచార్యులవారు మనశాస్త్రిగారి ప్రతిభ నెఱుఁగఁ దలఁచి "శ్లో. చింతకాయ కలేశాయ బీరకాయ తమోరిణే, ఉచ్చింతకాయ వాకాయ సాధకాయ నమోఽజలిమ్" అని యొకశ్లోకము వ్రాసి శిష్యునకిచ్చి రామచంద్ర శాస్త్రి కీని కర్థ మెట్లు చెప్పునో కనుఁగొని రమ్మనెనఁట. అంతట శాస్త్రులుగారు దాని కర్థముచెప్పుటయటుండగ మఱి రెండు గడ్డుశ్లోకములు వ్రాసి యాచార్యులుగారికిఁ బంపి నిరుత్తరులను జేసి రని వదంతి.

ఈయన సంస్కృతాంధ్రములలోఁ జాలకృతులు రచించెను. పంద్రెండవయేటనే యుపదేశము పొందెను. 'దేవీవిజయము', 'కుమారోదయము' అను గ్రంథములు వీరి యుపదేశవిషయమును స్ఫుటీకరించును. 1860 ప్రాంతమున మంజరీమధుకరీయనాటకము నంఘటించిరి. ఈనాటకమునకు ముందుఁ దెలుఁగున ఏలకూచి బాలసరస్వతి విరచితమగు 'రంగకౌముది' నాటకమున్నట్లు వినికలి. మంజరీమధుకరీయములోని కథ కల్పితము. ఇది రంగమున కననుకూలము. ఇందలి కవిత్వము కఠినము. మచ్చున కొకపద్యము చూపెదను:

మ. పికదష్టామ్రమ కిసాల దంతిపటియుక్సైనస్ఫుర త్స్వరభ
ప్రకటోద్గార రజోగుళుచ్ఛ కుచభార ప్రహ్వ సంజాతకో
రక రోమోద్గమ సాంద్రమన్మద కలని ర్హ్లాదస్వనగ్రీవ, యీ
సకలశ్రీవని యామునిం గదిసి హృల్లక్ష్మీడలఁ జల్పెడిఁ.

రామచంద్రశాస్త్రిగారు వేణీసంహార ముద్రారాక్షస శాకుంత లము లనువదించిరి. సంస్కృతాంధ్రకవితలు రెంటను వీరిచేయి యారితేఱినది. మేఘసందేశము తరువాతికథను 'ఘనవృత్తము' అను గీర్వాణకావ్యముగ రచించిరి. దీనికిఁ దెలుఁగుసేత శ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు చేసిరి. యక్షసందేశ శ్రవణానంతరము మేఘుని వృత్తాంతము తెలుపునది గుట దీనిని 'ఘనవృత్త' మని పేరిడిరి. అందలి ధోరణికి కాళిదాసు నొరవడి.

శ్లో. ఇత్యుక్తోసౌ నవది జలద స్తేన దీనాత్మనాలం
శ్రుత్వా కామం సరసహృదయ ప్రాగ్రణీత్వాత్స్వహృష్టః
లోకే దీనావన మనుపమం పుణ్య మా దత్తఏవ
సంతః ప్రోచు స్తదిహ హిమయాతో ప్యణీయస్పృహా మే.

# మతుకుమల్లి నృసింహకవి

## 1816 - 1873

ఆఱువేలనియోగి. కృష్ణయజుశ్శాఖీయుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. జన్మస్థానము తెనాలి. తల్లి జానకమ్మ. తండ్రి కనకాద్రిశాస్త్రి. జననము 1816 - ధాతృ సంవత్సర శ్రావణ బహుళ చతుర్దశి. నిర్యాణము 1873 - శ్రీముఖ సంవత్సర శ్రావణ బహుళ తృతీయ. గ్రంథములు: ౧. ఆంధ్రమేఘసందేశము. ౨. వేంకటాచల యాత్రాచరిత్రము. 3. అజచరిత్రము. (ఆంధ్రప్రబంధము 1912 ముద్రి) ౪. చెన్నపురీవిలాసము (ప్రౌఢప్రబంధము. 1920 ముద్రి) ౫. శ్రీకృష్ణ జలక్రీడావిలాసనాటకము. ౬. నృసింహసహస్ర నామావళి. (సం) ౭. పుండ్రకళానిధి. (సం) ౮. ఆంధ్ర సిద్ధాంతకౌముది. ౯. ధాతుశాస్త్ర సర్వస్వము. ౧౦. సంగీతసారసంగ్రహము. (అముద్రి.)

మూఁడుశతాబ్దులనుండి వీరిది పండితవంశము. ఈనృసింహకవియొక్క ప్రపితామహుఁడు మాధవకవి. ఈయన వ్యాసభారతము యథామాతృకముగ ననువదించి "అభినవభారతము" అని పేరుపెట్టెను. ఈ మహాకావ్యమునఁ బ్రస్తుత మాదిపంచకము మాత్రము మిగిలియున్నది. తక్కుఁగలపర్వములు తాడిపత్రిగ్రామమునఁ దగులఁబడినట్లు చెప్పుదురు. తెనాలి గోవర్ధనస్వామి కోవెలయెదుటఁగల గరుడవిగ్రహము మాధవకవి శిల్పకళాకుశలతకు దార్కాణ. ఈయన పుత్రులు నృసింహశాస్త్రి గారు. వీరు వేదవిదులు. గొప్పవైయాకరణులు. కనకాద్రిశాస్త్రి గారు వీరికిఁ గుమారులు. వీరే మనప్రస్తుతకవివరుని జనకులు. కనకాద్రిశాస్త్రి గారు సకలశాస్త్ర ప్రవీణులు. శ్రీ మల్రాజు గుండారాయఁడుగారి సంస్థానపండితులు. గుండా రాయఁడుగారు నాఁడు పేరుమోసిన పెద్ద జమీందారులలో నొకరు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వీరినిగూర్చి యీకథ ముచ్చటించిరి:

"ఒకప్పుడు వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడును, నర్సారావుపేట మల్రాజు గుండారాయఁడును, నూజవీటి అప్పారావును, చల్లపల్లి అంకి

నీఁడును గూడి యిష్టాగోష్ఠి సల్పుకొను సందర్భమున హాస్య చతురుఁడు గుండారాయుఁడు 'మనజీవితములు కడచినతర్వాత లోకము మనల నెటు ప్రశంసించునో తెలఁచి చూచుకొందమా?' అనెనఁట. అందఱు నంగీకరించిరఁట. నూజవీటి అప్పారాయుఁడు చనిపోయెనా బైరాగులందఱును బలవించెదరు. తాను చనిపోయితి నా వేశ్యలందఱు పలవించెదరు. వేంకటాద్రి నాయుఁడుచనిపోయెనా అందఱు నిల్లోయని దుఃఖించెదరు. అంకినీఁడు చనిపోయెనా అందఱు ఆహాయని సంతోషించెదరు."

ఈగుండారాయని యాస్థానమున నుండి పాండిత్యశక్తిచే నీకనకాద్రి శాస్త్రిగారు స్థిరమైనభూమి నార్జించి సుఖించెను. నృసింహావిద్వత్కవి తల్లి కూడ విదుషి. ఆమె పేరు జానకమ్మ. చదలవాడ సుబ్బయామాత్యుని కొమార్తె. ఈ పద్యము లామెయే చెప్పినదఁట:

"మతుకుమల్లియిల్లు మహి విద్య వెదచల్లు
పరబుధేంద్రులకును బ్రక్కముల్లు
ఎఱిఁగి మోఁగి లేని నిలబించే వాటిల్లుఁ
గాన వారియిల్లు ఘనతఁ జెందె"
అతి చమత్కృతి గలిగిన మతుకుమల్లి
వారు శబ్దము గొల్పిన కారణమున
వసుధలోపల మంచెల్లవారియిల్లు
శారదాదేవి నాటకశాల యండ్రు
వాను దేవుని కవితావిలాస మచట
మొలక బంగరు గజ్జెల మ్రోఁత గాదె?

మనకవివరునితమ్ముఁడు కృష్ణశాస్త్రి. ఆయన తన యన్నగారి "అజచరిత్రము" లో నక్కడక్కడ నాశ్వాసాంతపద్యములు పోయినవి మరల వ్రాసెను. అతఁడుకూడఁ జక్కనికవితాధార కలవాఁడు.

మనన్పసింహావిద్వత్కవి పూర్వులను మించిన పండితుఁడు అజచరిత్ర మను ప్రౌఢప్రబంధ మితని కృతులలో నుతికెక్కినది. ఇందలిశైలి వసుచరిత్రకు సహపాఠి. తెలుఁగుకంటె సంస్కృతపుఁజాలు పీనికవితలో

హెచ్చు. భావములు మహోన్నతములు. భాష నిర్దుష్టము. ఈ పద్య మిన్నిటికి నాదర్శమైనది.

సీ. ఘనఘన శ్రీసముత్కట జటాపగమున
క్రమయుక్తి యామయరవ్యవేణి
నానాస్వరవ్యంజన ప్రతతాపానూన
శబ్దమహాశబ్ద శాస్త్ర వీణ
భూరిగుణవిశేష పుంస్త్రైక నిత్యసం
బంధన త్తర్క విభ్రాజితశ్రీ
సరససాలంక్రియోజ్జ్వల సువర్ణపదాగ్ర
సంగీతసాహితీ స్తనభరాఢ్య

గీ. శ్రీప్రసన్నత సుఖరభాట్ట పరిభాగ
రీయమంజీరయుగ రమణీయ చరణ
జలజనిత్య ప్రగల్భ వాచాల వాణి
నిలుచుగాత ! మదీయాస్య జలరుహమున.

ఈ అజచరిత్రకే 'ఇందుమతీపరిణయ' మని మారుపేరు. ఇందున్నవి యారాశ్వాసములు. ఆద్యంత మొక్కరీతిని కవిత మహాప్రౌఢముగా నడచినది. రఘుచరిత్రాదుల ఛాయలు పెక్కు లున్నను కవి ప్రతిభావ్యుత్పత్తులు వానిని కప్పిపుచ్చినవి. ఈ కావ్యము మంగళాంతము.

క. పాణిగ్రహణ మొనర్చిరి
యేణాక్షియు వరుఁడు సాత్త్వికైకస్వేద్య
త్పాణిశ్లథభావము స్ఫుర
మాణహ్రీకైతవమున మాటుపడుచుచుఁ. (౬-౧౩)

ఈకవి శ్రీమన్మాల్యశైలనృసింహభక్తుఁడు. గ్రంథాంతగద్య మరయునది:—

"శ్రీమన్మాల్య శైల నృసింహ వరప్రసాద సమా
సాదిత సకల శాస్త్ర సంవిదుపస్కృత సంస్కృ

ఆంధ్ర సాహితీ పురస్కృత సరస సారస్వత
చతుర వాగ్ధోరణి......................

ఈకృతి యానృసింహస్వామి కే యంకితము.

ఈకవి నృసింహకవి యుభయకృతులలో "చెన్నపురీవిలాస" మనుకృతి చెప్పు కోఁదగినది. ఇది శ్రీ రాజా బొమ్మదేవర నాగన్ననాయఁడు బహద్దరు వారి యాజ్ఞచే రచియింపఁబడినకృతి. ఈతఁడు కృష్ణామండలములోని "కోట్లనల్లూరు" సంస్థానాధిపతి. ఆసంస్థానమున నీనృసింహకవి పండితుఁడుగను, బరీక్షాధికారిగను నుండెను. సంస్థానప్రభువునకును మనకవికి సహవాసస్నేహము నంతయుండెను. కోటల్లూరు తిరిగినపండితులు వార్షికములకు వచ్చినప్పుడు వీరేపరీక్షాధికారులు. తర్కాదిశాస్త్రపండితులగు శ్రీ ప్రభల సుందరరామశాస్త్రి ప్రభృతులను వీరు శాస్త్రవాదమున నోడించిరని యందురు. శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి పీఠవిద్వాంసులసమక్షమునఁ బై వారికిని మన శాస్త్రిగారికిని దర్కశాస్త్రీయ వాద మిరువదియొక్క దినము జరిగినదఁట. అప్పుడు వీరివిజయమునకు సంతసించి పీఠాధిపతులు పండితు సేనుఁగుపై నూరేఁగించిరఁట. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములలో వీరి వాదప్రావీణ్య మగణ్యము. నృసింహోపాసకుఁ డగుటచే నీతఁడు సరయొకటి వాదముచేసి నెగ్గినవారు లేరని నదింతురు. వీరి బుద్ధిలోఁ బ్రతిఫలింపనిశాస్త్రము లేదు. కళలేదు. ఇందులకు వారిగ్రంథములే సాక్ష్యములు. ఈయన ముప్పదియేండ్లు వచ్చువఱకుఁ బితురంతేవాసియై సకలశాస్త్రములు లోతులుముట్ట వ్యాసంగించెను. అప్పుడు వాక్యార్థములకు గ్రంథరచనకుఁ గడఁగెను. లోకము వ్యాదకు సంస్థానపండితుఁడుగా నుండెఁగాని ప్రభువునకు లొంగియుండ లేదు.

సంస్థానప్రభువు నాగయ్యనాయఁడుగారితో నీకవి చెన్నపురము వెళ్లి నపు డాపట్టనవిశేషములు ప్రబంధరూపముగ వర్ణింపుఁడని యడుగ నీ"చెన్నపురీవిలాసము" రచించిరఁట. అది 1860 ప్రాంతము. నాఁటి మదరాసులోని విశేషములన్నియు నిజమునకు గన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁ బడినవి. వీథులు, మేడలు, సముద్రము, రైలు, పోటో(గ్రాఫు), అచ్చుకూటములు, ఆసుపత్రులు, మ్యూజియము, లైటుహౌసు, హార్బరు

# వారణాసి వేంకటేశ్వరకవి

## 1820

వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. విశ్వామిత్రగోత్రుఁడు. తల్లి: లచ్చమాంబ. తండ్రి: కామయార్యుఁడు. గోదావరి మండలములోని పిఠాపుర ప్రాంతమునఁగల 'శ్రోత్రియుసుకపల్లి' యీకవి నివాసమని చెప్పుదురు. 1850 ప్రాంతమున గ్రంథరచన గావించి నటులు తెలియుచున్నది. జననము 1820 ప్రాంతము. రచించిన గ్రంథము: రామచంద్రోపాఖ్యానము (ఆఱాశ్వాసముల కావ్యము 1911 ముద్రితము.)

రామాయణములోని కథను సంక్షేపించి యాఱుకాండములకు నాఱు ఆశ్వాసములుగా 'రామచంద్రోపాఖ్యాన' మనుపేర గద్య పద్యాత్మక మగు కావ్యము రచించిన యీవారణాసి వేంకటేశ్వరకవి సంస్కృతాంధ్రములలోఁ జక్కనిప్రవేశముకలిగి శివారాధకుఁడైన పండితుఁడు. ఈగ్రంథమునకు శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు పీఠిక వ్రాయుచు నీ వేంకటేశ్వరకవి నివాసము పీఠికాపురపరిసరమున వెలసిన శ్రోత్రియుసుకపల్లి యనియు, నించుమించు 1850 ప్రాంతమం దీగ్రంథరచన చేసియుండుననియుఁ, దత్రత్యులవలన విన్నది విస్పష్టపఱచిరి. కూచిమంచి తిమ్మకవి వలెనే యితఁడును శివభక్తుఁడై యీకృతి "శ్రీ పీఠాఖ్యపురీ మహేశ్వరుఁ" డగు కుక్కుటేశ్వరున కంకితము గావించెను. రామోపాఖ్యానము రచించి యీశ్వరున కిడుటలో నితని యద్వైత మతాభిమానము వెల్లివిరిసినది. సంస్కృత సీసములో నీ కవి గావించిన కుక్కుటేశ స్తవము వినుఁడు.

సీ. శ్రీమ ద్వచోమానినీ మహశ్చక్రాణి
నాకలోకేభ విభాకులాని
దుగ్ధపాథోధి సమ్యగ్ధామయూధాని
పుండరీక ప్రభామండలాని

బృందారకాపగా మంగళా బృందాని
కైలాస శైల శృఙ్గాలకాని
మహనీయ సురమహీరుహా దీప్తిజాతాని
విపుల శుభ్రచ్ఛత్రపటలాని
వ్యాళనాయక గురు చక్రవాళకాని
శబల విస్ఫార శోభాడంబరాని
భువి విజిత్వా విరేజిరే తవయశాంసి
మారమదభంగ! కుక్కుటాకారలింగ!

ఏతద్ గ్రంథాంతగద్యమున "ఇది శ్రీమత్కుక్కుటేశానుగ్రహ ప్రభూతకవిత్వ విశ్వామిత్ర గోత్ర పవిత్ర వారణాసివంశపారావార కైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామయార్య పుత్ర సుకవి జనవిధేయ శ్రీ వేంకటేశ్వర నామధేయ ప్రణీతంబైన......" యనియున్నదిగాని, కృత్యాది పద్యములో నీగ్రంథనిర్మాణమునకుఁ దనసోదరులైన లక్ష్మ్మవతి, జోగన్న యనువారలు తోడ్పడిరని కలదు. ఆపద్య మిది:

శా. ప్రీతింబుట్టితి మద్వధూవగులకున్ శ్రీ వెంకటేశుండ నే
నేతద్ గ్రంథనిబంధనంబునకు నాకెంతేనియుం దోడుగాఁ
జేతస్ఫూర్తి రచించి పొల్పెసఁగు లక్ష్మ్మవత్యభిఖ్యుండు వి
ఖ్యాతప్రజ్ఞుఁడు జోగనాహ్వయుఁడు నార్యశ్లాఘ్యసంశీలతన్.

గ్రంథపీఠికాకారులు మల్లయ్యశాస్త్రిగారీవిషయము గుఱించి యిట్లు వ్రాయుచున్నారు.

"...ఇట్లున్నను నీగ్రామమునను న్నవారొకరు వీరు తమకు సన్నిహిత బంధువు లనియు, వీరిముప్పుర నెఱుఁగుదు మనియు, వేంకటేశ్వరకవి దీనిని రచింపనారంభించి మిక్కిలి కొలఁదిభాగమును రచియించి యేకారణముచేతనో మాని తరువాతఁ గొలఁదిదినములలో మృతిఁజెందెరనియుఁ, బిమ్మట లక్ష్మ్మవతియే దీనిని సాంతముచేసి యున్నయందలిభక్తిచే నాయన

చేసినట్లే ప్రచురించెనని యుఁజెప్పిరి. వీరు రచించిన యితరగ్రంథములేవియు లేమింజేసియు, శైలి యున్నిభాగముల సదృశ మగుటంజేసియు నిందేది యెవరు రచించిరో తెలియుట దుస్సాధము......"

ఏది యెట్లైన నీగ్రంథ మొక్క-టేతీరున ధారాళమైన కవిత్వముతో రాజిల్లినదనుట వాస్తవము. వేంకటేశ్వరకవి పితామహుఁడు "...... అజస్రాంభోరుహాస్తాను కం, పాసంప్రాప్త సమస్తదేశ విలసద్భాషా కవిత్వాది, విద్యాసంపాదితరత్న హేమ వసనత్స్మారామ భూషాముఖ, శ్రీసత్కారుఁడు" అయిన వేంకటేశ్వరకవి యని గ్రంథములోఁ జెప్పికొనెను. ఇతని తండ్రి "రాజాధిరాజ సభాంతరార్యలోక సంశ్లాఘ్య సకల కలా కలాపసిద్ధి" యఁట. ఆయన పేరు రామకవిరాజు. తండ్రికడనే మన వేంకటేశ్వరకవి చదువులు సమస్తము చదివెనఁట. ఇతని పితృసోదరుఁడుకూడ నుభయభాషాకవిత్వ విశారదుఁడనియు, రాజానుగ్రహ పాత్రుఁడనియు గ్రంథాదినున్నది. మీనమామయు గొప్పభక్తుఁడు, నీతిశాస్త్రవేత్తగఁ జెప్పఁబడెను. ఈరీతిని దండ్రియుఁ, బినతండ్రియుఁ, బితామహుఁడు, మాతులుఁడు ప్రఖ్యాతులైనటులును, మహారాజ సత్కారము లంది నటులును వేంకటేశ్వరకవి కృతిప్రారంభపద్యములో ఘనముగస్తుతించు కొనెను గాని, వారి వారి గ్రంథములుగాని, వారినిగుఱించిన కథలుగాని కనఁబడవు, వినఁబడవును.

ఈ రామచంద్రోపాఖ్యానము నంతటి కవిత యందచందములు కలిగి ధారావిషయమునఁ బూర్వకావ్యములతీరు స్మరింపఁ జేయుచున్నది. ఎత్తుకపోయె, చేతును మున్నగు ప్రయోగములు కొన్ని వ్యాకరణము ననుసరించనివిగలవు. మొత్తముమీఁద ద్రాక్షాపాకము, నడుమ నడుమ నారికేళపాకముగఁ గవితసాగినది. మచ్చుపద్యములు:

చ. ఒక పలుగాకి కాకి యమిఁకొన్నఁడ మొప్పి ధరాతనూజికం
జకముక నొందఁజేయ రఘుశేఖరుఁ డారసి దాని కాత్మలో

బృందారకాపగా మంగభా బృందాని
కైలాస శైల రుగ్జాలకాని
మహనీయ సురసుహీంగవా దీప్తిజాతాని
నిపుణ శుభ్రచ్ఛదోన్నపటలాని
వ్యాళనాయక రుచి చక్రవాళకాని
తట సిస్ఫార శోభాకదంబకాని
భుట విజితా పరేశరే తవయశాంసి
మారసూదన గంగ! కుక్కుటాకారలింగ!

ఏతద్ గ్రంథాంతగద్యమున "ఇది శ్రీమత్కుక్కుటేశానుగ్రహప్రభూతకవిత్వ విశ్వామిత్ర గోత్ర పవిత్ర వారణాసివంశపారావార కైరవమిత్ర విద్వన్నుతచరిత్ర కామసూర్య పుత్ర సుకవి జనవిధేయ శ్రీ వేంకటేశ్వర నామధేయ ప్రణీతంబైన......" యనియున్నదిగాని, కృత్యాది పద్యములో నీగ్రంథనిర్మాణమునకుఁ దనసోదరులైన లక్ష్మీపతి, జోగన్న యనువారలు తోడ్పడిరని కలదు. ఆపద్య మిది:

శా. ప్రీతింబుట్టితి మద్వధూవగులకున్ శ్రీ వెంకటేశుండ నే
నేతద్ గ్రంథనిబంధనంబునకు నాకెంతేనియుం దోడుగాఁ
జేతస్స్ఫూర్తి రచించి పౌర్వపుఁగు లక్ష్మీపత్యభిఖ్యుండు వి
ఖ్యాతప్రజ్ఞుఁడు జోగనాహ్వయుఁడు నార్యశ్లాఘ్యసంశీలతన్.

గ్రంథపీఠికాకారులు మల్లయ్యశాస్త్రిగారు కీవిషయమును గుఱించి యిటులు వ్రాయుచున్నారు.

"...ఇట్లున్నను నీగ్రామమున నున్న వారొకరు వీరు తమకు సన్నిహిత బంధువు లనియు, వీరిపూర్వర నెఱుఁగుదు మనియు, వేంకటేశ్వరకవి దీనిని రచింపనారంభించి మిక్కిలి కొలఁదిభాగమును రచియించి యేకారణముచేతనో మాని తరువాతఁ గొలఁదిదినములలో మృతిఁజెందెననియుఁ, బిమ్మట లక్ష్మీపతియే దీనిని సాంతముచేసి యన్నయందలిభక్తిచే నాయన

చేసినట్లే ప్రచురించెననియుఁ జెప్పిరి. వీరు రచించిన యితరగ్రంథములేవియు లేమింజేసియు, శైలి యున్ని భాగముల సదృశ మగుటంజేసియు నిందేది యెవరు రచించిరో తెలియుట దుస్సాధము......”

ఏది యెట్లైన నీగ్రంథ మొక్క తీరున ధారాళమైన కవిత్వముతో రాజిల్లినదనుట వాస్తవము. వేంకటేశ్వరకవి పితామహుఁడు “......అజస్రాంభోరుహాప్తాను కం, పాసంప్రాప్త సమస్తదేశ విలసద్భాషా కవిత్వాది, విద్యాసంపాదితరత్న హేమ వసనక్ష్మారామ భూషాముఖ, శ్రీ సత్కారుఁడు” అయిన వేంకటేశ్వరకవి యని గ్రంథములోఁ జెప్పికొనెను. ఇతని తండ్రి “రాజాధిరాజ సభాంతరార్యలోక సంశ్లాఘ్య సకల కలా కలాపసిద్ధ” యఁట. ఆయన పేరు కామకవిరాజు. తండ్రికడనే మన వేంకటేశ్వరకవి చదువులు సమస్తము చదివెనఁట. ఇతని పితృసోదరుఁడుకూడ నుభయభాషాకవిత్వ విశారదుఁడనియు, రాజానుగ్రహ పాత్రుఁడనియు గ్రంథాదినున్నది. మేనమామయు గొప్పభక్తుఁడు, నీతిశాస్త్రవేత్తగఁ జెప్పఁబడెను. ఈరీతిని దండ్రియుఁ, బినతండ్రియుఁ, బితామహుఁడు, మాతులుఁడు ప్రఖ్యాతులైనటులును, మహారాజ సత్కారము లందినటులును వేంకటేశ్వరకవి కృతిప్రారంభపద్యములో ఘనముగస్తుతించుకొనెను గాని, వారి వారి గ్రంథములుగాని, వారినిగుఱించిన కథలుగాని కనఁబడవు, వినఁబడవును.

ఈ రామచంద్రోపాఖ్యానము నందలి కవిత యందచందములు కలిగి ధారావిషయమునఁ బూర్వకావ్యములతీరు స్మరింపఁ జేయుచున్నది. ఎత్తుకపోయె, చేతును మున్నగు ప్రయోగములు కొన్ని వ్యాకరణము ననుసరించనివికలవు. మొత్తముమీఁద ద్రాక్షాపాకము, నడుమ నడుమ నారికేళపాకముగఁ గవితసాగినది. మచ్చుపద్యములు:

చ. ఒక పలుగాకి కాకి యనిశోన్మద మొప్ప ధరాకుమారికం
జికమక నొందఁజేయ రఘుశేఖరుఁ డారసి నాని కాత్మలో

నకనక నొంది క్రన్నన ద్రుణం బొకటేయు మహోగ్రస్ఫురత్కరం
బొకపరి బీకువోక సకలోర్వరఁ ద్రిప్పెనఁ గాకి భీమగతిన్.

తృతీయాశ్వాసము.

శా. కాంతాంతర సంచర జ్జనకరాట్కన్యా మణీ నిస్ఫుర
త్కాంత శ్యామల కేశపాశ విలస త్కాలాంబుదాలోక నా
ద్యంతామోద నటత్కలాపిచయు కేకా రావ సంపూరితా
శాంతం బయ్యెను వింటి కాని యెడఁ గేక్యాఘనంబు లిట్టుండునే!

తృతీయాశ్వాసము.

మ. కలికీ నూను మహోపదేశమున సర్వస్వామి నంతే విని
ర్మల భక్తిం బ్రణుతించి బాహుబలసామగ్రిన్ విజృంభించి యా
కలుషాత్మున్ వధియించెదం గలన నింకన్ బంకజాతాసనా
దులు నడ్డంబుగ వచ్చి నిల్చిన సుధాంధో బృంద మోర్వంగనన్.

షష్ఠాశ్వాసము.

# ఆకొండి వేంకటకవి

## 1820

ఆరామద్రావిడ శాఖీయ బ్రాహ్మణుఁడు. తండ్రి: జగన్నాథ శాస్త్రి. తల్లి: అచ్చమాంబ. నివాసము: విశాఖపట్టనమండలములోని "గజరాయనివలస". రచించిన గ్రంథములు: తత్త్వసంగ్రహ రామాయణము శతకములు మూఁడు (అముద్రితములు). కవి కాలము: 1820 ప్రాంతము.

ఈకవిచే నాంధ్రీకరింపఁబడిన "తత్త్వసంగ్రహ రామాయణము" నందలి బాలకాండము ఆంధ్రవిజ్ఞానసమితి వెలువరించినది. ఈ రామాయణము సంస్కృతములో రచించినవారు శ్రీ బ్రహ్మానందభారతీ స్వాములు. ఈయన యెప్పటివారో తెలియదు. భారత, విష్ణు, కూర్మ బ్రహ్మాండాది నానాపురాణములనుండి సంగ్రహింపఁబడిన కథ లెన్నో యిందున్నవి. ఈ వేంకటకవి మేనమామలు పెద్దపండితులు. వారిని గూర్చి కావ్యాది నిట్లు చెప్పుకొనెను:

సీ. పండితదుర్గిను మనఃపల్లవముకుళవు
మ్మవికాస చైత్రుండు పాత్రసూరి
స్వాభ్యస్త నిఖిలశాస్త్రాబ్ధిజజ్ఞానామృ
తేష్టానుభవుఁడు గారీణ్మనీషి
ప్రభుసభాప్రథిత విద్వజ్జయోద్భవ మహో
న్నతనవ్యశుఁడు జగన్నాథశాస్త్రి
స్వకృత ప్రబంధ పుష్పగుళుచ్ఛసురభితా
ర్ణవ మధ్యదేశుండు రామసుకవి

గీ. యనఁదగు సమాఖ్య లొప్ప భూమ్యధిప దత్త
మణివలయకుండలాది భూషణము లమర
సలువు మీఱఁ జెలంగునా సలువురైన
మాతులుల కెఱఁగెదఁ గీర్తిమాతులులకు.

ఈకవి చిన్ననాఁటనే పితృవియోగము నందె మాతామహుఁడు కాకర పర్తి వేంకటశాస్త్రియొద్ద సంస్కృత మభ్యసించెను. ఇతని మేనమామ లలో పాత్రసూరి యనునతఁడు "సత్యభామా కృష్ణ సంవాదము" అను నందమైన ప్రబంధము రచించెను.

ఈవేంకటకవి నుండవాక పార్వతీశ్వరకవి, రాకర్తి పాత్రసూరి కవులకు సమకాలికుఁ డగుట ౧౮వ శతాబ్ది యారంభములోనివాఁడని తెలియవచ్చును. ఈయన "తత్త్వ సంగ్రహరామాయణము" రచించు చుండుటఁ దెలిసి సాలూరు జమీందారును, కాశింకోట జమీందారును కృతినిమ్మని కోరిరఁట. నరకృతిగావింప నిష్టపడక తద్గ్రంథము శ్రీకృష్ణ భగవదంకితము గావించి యీకవి చరితార్థుఁ డయ్యెను. ఇందలి కవిత సంస్కృతపద ప్రచురము. వ్యాకరణవిశేషము లీకవి యెఱుంగును. ఇట కనేక నిదర్శనము లున్నవి.

క. ఏహి గృహాణ పతిభిక్షాం
దేహి దయాక్షీరవారిధే సన్త్రాహి
త్రాహి రవిజం భటం జా
నీహి జహీహి క్రుధా మనీషాం శాంత్యా.

ఇది శుద్ధసంస్కృతకందము. ఇట్టి వింకను గలవు. గ్రంథకర్త స్యాలకుఁడు వజ్ఝల అన్నయభట్టు ఈగ్రంథము కొంతభాగము పూరించెను.

గీ. స్యాలకుఁడు మాకు సాహితీపాలకుండు
వజ్ఝ లన్నయభట్టు కవనవిశేష
తులితసన్నయభట్టురుబలసహాయ
మునరఁ జేయఁగ నీగ్రంథమును రచింతు.

అని కవి చెప్పుకొని, బాలకాండము మొదలు సుందరకాండాంతము - యుద్ధకాండములోఁ గుంభకర్ణ యుద్ధాంతముగను - తరువాత రావణ ద్వితీయ యుద్ధభాగము సీతాపరిగ్రహణ పట్టాభిషేక ఘట్టము వ్రాసి

పూర్తిచేసెను. నడుమది వఝ్ఝల అన్నయ భట్టు ఎనుబదిపద్యములలో బూరించెను. పూరణ శైలి వేఱుగా నున్నది. వార్ధకభీతిచే నీ కవి యితరునిచే వ్రాయించెనా ? యని సందేహించెదము. వస్తిపూర్తి కాకుండఁగనే యితఁడు మరణించెననియు, గ్రంథరచనమునకుఁ బదునైదేండ్లు పట్టెననియుఁ దద్వంశీయులు చెప్పెదురు.

ఈ రామాయణమేగాక వేంకటకవి మూఁడుశతకములు కూడ రచించెను. "రామా" అనునది యొకటియు, "నారాయణ ! భక్తపోషణా ! శ్రీరమణా !" అనున దొకటియు "రామప్రభూ" అనున దొకటియు నా శతకములకు మకుటములు. ఈ రామాయణములో నాయా శతకపద్యములు శ్రీరామస్తవ సందర్భమునఁ గలవు. మచ్చున కందలి పద్య మొకటి ప్రకటింతును.

అఘనాశాఖిల దేవతానిచయ సౌఖ్యప్రాపకోద్యత్ప్రభా
వఘనా ! దివ్యసువర్ణ చేలమణి భాస్వత్కాంచి కాంచన్మహో
జఘనా ! హార కిరీట ముఖ్యవర భూషాభూషిత ప్రోజ్జ్వలా
వఘనా ! కీర్తిఘనా ! ఘనాఘన సమాభాధామ ! రామప్రభూ !

---

# పరవస్తు వేంకట రంగాచార్యులు

## 1822 - 1900

జననము 1822సం. నిర్యాణము 1900సం. నివాసస్థానము విశాఖపట్టణము. తండ్రి: శ్రీనివాసాచార్యులు. గ్రంథములు: ౧. కుంజాల వైభవము (ఏడంకముల నాటకము) ౨. లఘువ్యాకరణము (శ్లోకరూపమగు సులభవ్యాకరణము) ౩. ప్రపత్తివాదము (వేదాంతగ్రంథము) ౪. కుంభకర్ణ విజయము ౫. ఆంగ్లాధిరాజ్యస్వాగతము (చిన్న కావ్యములు) ౬. శకుంతలము (ఆంధ్రీకరణము) ౭. కమలినీకలహంసము (రాజచూడామణి దీక్షితుని కృతి కాంధ్ర పరివర్తనము) ౮. శబ్దార్థ సర్వస్వము (నిఘంటువు) ౯. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్యాది దశోపనిషత్తులకుఁ బద్యానువాదము. మున్నగునవి—

మన ప్రాచీనకవి పండితుల నిరంకుశతకు గుఱుతులుగా ననేక చరిత్రములు చెప్పుకొందురు. పిఠాపురసంస్థాన ప్రభువగు గంగాధరరామారావుగారు గొప్ప రసిక ప్రభువులనియు, వారియాస్థానిలో బులుసు పాపయ్యశాస్త్రి ప్రభృతులు పండితులుగా నుండి చేసిన నిరంకుశవాదములు స్మరణీయము లనియు నేడు కథలుగా, గాథలుగా నల్లుకొన్నవి. విజయనగర సంస్థానములో కలిగొట్టు కామరాజుగారని గొప్ప గాయకుఁడు. ఆయన వల్లవిపాటలో జోడులేనివాఁడు. మహారాజు బతిమాలినను, దనకు దోఁచినపుడుగాని గొంతెత్తువాఁడు కాదఁట.

మహామహోపాధ్యాయులగు పరవస్తు రంగాచార్యుల వారిని దర్శింప వలయునని విజయనగర సంస్థాన ప్రభువు సభిలాష. ఎన్నో సారులు వర్తమానము లంపిరి. చివరకు రంగాచార్యులవారు మూడు నియమముల కడ్డు చెప్పనిచో వచ్చుట కభ్యంతరము లేదని కబురు చేసిరి. ౧. సవారీలో కోటగుమ్మమువరకు వెళ్ళుట (౨) కోట గుమ్మముకడ సవారీ దిగి పాదుకలతో సభామండపమువరకు వెళ్ళుట.

(౩) అక్కడ పాదుకలువదలి సభలో చిత్రాసనముమీఁదఁ గూర్చుండుట. పయి షరతులలో మొదటి రెండును మహారాజున కంగీకార్యము లైనవి. చివరిది మాత్రము వా రంగీకరింపలేదు. "చిత్రాసనముమీఁదఁ గూరుచుండుట మాకేమియు వ్యతిరేకము కాదుగాని, పండితుల కవమానకరమగు" నని ప్రభువుల యుద్దేశము. ఆపద్ధతిని మేము రానే రామని రంగాచార్యులవారి సమాధానము.

ఇట్టి యాచార్యులవారి పాండితీ పటిమత యెంతగొప్పదో! ఆయన తర్క వ్యాకరణ మీమాంసా ద్యనేకశాస్త్రములలో సందెవేసినచేయి. మహా మహోపాధ్యాయ బిరుదమునందిన మన తెలుఁగువారిలోఁ బ్రథములు రంగాచార్యులవారు. వీరితరువాత తాతా సుబ్బారాయ శాస్త్రిగారికే యాబిరుద మన్వర్థమై యందగించినది. పదవడి, దాని లోని బిగువు కొంత సడలిపోయి బెడఁగు తగ్గినది. శాస్త్రములలో నింత పరిశ్రమ చేయువారు, తెలుఁగు బాసపై నేలికచూపు వేయుదురు. వీరటులు కాదు. కాళిదాసు శాకుంతలము ౧౮౭౨ లోఁ దెలుఁగున సంతరించి 'సకల విద్యాభివర్ధనీ పత్రిక' లో రెండంకములు వెలువరించిరి. మిగిలిన గ్రంథము ప్రచురితమైనట్లు చూడలేదు. రంగాచార్యులవారి యీ తెలిఁగింపు వీరేశలింగము పంతులుగారి శాకుంతలాంధ్రీకృతికిఁ గొంతయుత్సాహ మిచ్చినదని స్వీయ చరిత్రములోని పంతులుగారి వ్రాఁత వలనఁ దెలియును.

ఎంతటి కఠినాంశ మయినను జేతి యుసిరికవలె నందఁజేయు చాతుర్యము రంగాచార్యులవారికి నిసర్గజము. ఆయన మాటాడునపుడు జనులు ముగ్ధులగుచుండెడివారు. సభ్యుల యభిరుచులు కనిపెట్టి, యిట్టే తమయభిప్రాయము మార్చుకొని యుపన్యసించుటలో వీరి కున్నంత నేరుపు వేఱెవరికి నుండదని పలువు రిప్పటికిఁ జెప్పుకొనుట కలదు. ౧౮౭౫ లో వీరొకతూరి రాజమహేంద్రవరము వేంచేసినపుడు

జరిగినముచ్చట శ్రీ వీరేశలింగము పంతులుగారు ముచ్చటించిరి. హిందూమత ప్రశస్తతనుగూర్చి రంగాచార్యులవారు సుధా సహోదర మగు మధురధోరణిలో నుపన్యసించెను. వెనువెంటనే మహారాష్ట్ర పాఠశాల స్థాపించి నడపుచుండిన ముత్తుస్వామి శాస్త్రి భావోద్రేకత నాఁపలేక "తా నదివఱకు క్రైస్తవ మతావలంబిననియు మీ యనుగ్రహము వలన నేఁటినుండి హైందవ మతావలంబి నయితిననియుఁ" చెప్పి ప్రణమిల్లెనఁట. ఆయనకేకాదు, నాఁడు వీరియుపన్యాసము విన్న పరమతస్థుల మనస్సు లెన్నో హిందూమతముపైపునకు వచ్చి స్థిరపడినవి. వాదవిషయమునఁ గొంత స్వతంత్రత చూపినట్లున్నను, మొత్తముమీఁద శాస్త్రప్రామాణ్యమునకు దవ్వుగాని త్రోవ రంగాచార్యులవారు తీసినారని యనేకుల యభిప్రాయము.

వీరు తమ ఎనిమిదవయేఁటనే కుంభకర్ణవిజయ మను సంస్కృత కావ్యము రచించిరి. ప్రౌఢభాషాసరస్వతి బిరుదాఢ్యులై ౧౮౯౭ లో విక్టోరియా జూబిలిలో మహామహోపాధ్యాయులై వన్నె గాంచిన రంగాచార్యులవారు బొబ్బిలి, ఉర్లాము, పిఠాపురము, మైసూరు, మందసా, మున్నగు సంస్థానములలో సన్మానింపఁబడిరి. బొబ్బిలి సంస్థానమున మూఁడు వందల పృచ్ఛకులతోఁ బరశ్శతావధానము గావించిరని ప్రసిద్ధి.

ఆంగ్లములోని "ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా" గ్రంథము వీరు నాదర్శముగాఁ గొని శబ్దార్థ సర్వస్వమను గొప్పనిఘంటువును వీరు రచించినారు. ఇది వీరి సారస్వతోద్యమములలో శిరోమణి. దీని రచనకు మొత్తము నలువదియేండ్లు పట్టినది. 200 పుటలలో అకార-ఆకారాది పదములు గల రెండుసంపుటములు వెలువరింపఁబడినవి. శేషభాగ మెంతయో వెలుఁగు చూడవలసి యున్నదై యున్నది. మొదటి సంపుటములు చూచినచో శ్రీ రంగాచార్యుల వారి విశ్వతోముఖపాండిత్య మందు రూపముగట్టి కనుపట్టును. వీరి తండ్రిగారు శ్రీనివాసాచార్యులు "సర్వశబ్దసంబోధిని" యను అకారాది సంస్కృత

నిఘంటువు రచించిరి. అదిగాక వారు వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శము' తెలుగు పఱిచిరి. కుమారుఁడు తండ్రిని మించిన పండితుఁడు.

ఈశా న్యుపనిషత్తులకుఁ దెలుఁగు పద్యములలో ననువాదము రంగాచార్యులు గావించిరి. అదిచూడ నబ్బురమగును. ఆపద్యముల పొందిక సుందరమైనది.

శాన్తిః॥ పూర్ణమదః, పూర్ణమిదం, పూర్ణా త్పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావశిష్యతే ॥

క. పూర్ణమది, పూర్ణమిదియుం
బూర్ణంబగు దానివలనఁ బూర్ణము పొడమున్
బూర్ణమగు దానిదే యగు
పూర్ణముఁ గొని మిగులుచుండుఁ బూర్ణమె యొందున్.

శాన్తిః॥ అప్యాయన్తు మ మాంగాని, వాక్ప్రాణశ్చక్షు శ్శ్రోత్ర
మథోబల మిన్ద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మోపనిషదం,
మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మామా బ్రహ్మ నిరాకరోత్,
దనిరాకరణ మ, స్త్వనిరాకరణం మే అస్తు, తదాత్మని నిరతేయ
ఉపనిషత్సు ధర్మా స్తేమయి సన్తు తే మయి సన్తు॥

సీ. అప్యాయితములు నాయంగంబు లగుఁ గాత,
ప్రాణంబు వాక్కు నేత్రంబు చెవియు
బల మఖిలేంద్రియంబులు నట్లయగుఁ గాత
నిఖిలంబు బ్రహ్మోపనిషదమె యగు
బ్రహ్మంబు నేను నిరాకరింపఁగరాదు
బ్రహ్మంబు నన్ను నిరాకరింప
రా, దెందును నిరాకరణము కాకుండుఁగా
వుత, లేకయుండుఁ గావుత మదీయ

గీ. మగు నిరాకరణంబును, నాత్మనిరత
మైన చోటున నుపనిషద్వ్యాహృతంబు

త్తైన ధర్మంబులెల్ల నాయందు నెపుడు
కలుగుఁ గాత, నాయందవి కలుగుఁ గాత!

శాన్తిః॥ భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్షభి
ర్యజత్రాః । స్థిరైరఙ్గై స్తుష్టువాగ్ంస స్తనూభిః । వ్యశేమ
దేవహితం యదాయుః । స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః ।
స్వస్తినః పూషా విశ్వవేదాః । స్వస్తి న స్తార్క్ష్యో అరిష్ట
నేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥

ఉ. విందుముగాత మాచెవుల వేలుపులార శుభంబు లెప్పుడుం
గందుముగాత భద్రములె కన్నుల నోయజనీయులార! యు
క్తం బిరమైన యంగముల పొడిమి నిన్ను నుతించువారమై
యుందుముగాత, ఆయు విరవొందఁగ మీమలు నీకు నింపుగన్.

ఆ. వె. ఇంద్రుఁ డిచ్చు మేలు వృద్ధశ్రవుండు విశ్వ
వేదుఁడైన పూష విభుఁడు నట్ల
తా నరిష్టనేమి తార్క్ష్యుండు మాకు బృ
హస్పతియును శుభదు లగుదురెలమి.

శాన్తిః॥ సహనా వవతు । సహనౌ భునక్తు ।
సహవీర్యం కరవావహై । తేజస్వినా వధీత మస్తు
మా విద్విషావహై । ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

చం. మనల నతండు ప్రోచుత సమంబుగఁ, బాలన సేయుఁగావుతన్
మనమును వీర్యమొక్కటెయగు మానక చేతుముగాత, చెప్పెడున్
మనదగు నీయధీతమును మానిత తేజముగాత, ద్వేషమున్
మనకెపుడుం దొలంగుత, శమంబు శమంబు శమంబుగావుతన్!

# నరసింహదేవర వేంకటశాస్త్రి

## 1828-1915

ఆరామద్రావిడశాఖీయబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. తల్లి సీతమాంబ. తండ్రి ఉమామహేశ్వరశాస్త్రి. జన్మస్థానము తాడేపల్లిగూడెము. నివాసము తణుకుతాలూకాలోని వెలగదుర్రు. జననము 1828- సర్వజిన్నామసంవత్సర కార్తిక శుద్ధ ద్వితీయ. విశాఖ నక్షత్ర చతుర్థచరణము. నిర్యాణము 1915 సం॥ రాక్షసనామ సంవత్సర శ్రావణబహుళ పంచమి. గ్రంథములు: ౧. వేంకటేశ్వర శతకము. ౨. గౌరీశతకము. 3. విచిత్రరామాయణము.

ఇరువదియేండ్లు వచ్చువఱకును వేంకటశాస్త్రిగారు పండితుఁడు కాఁడు. కవియును గాఁడు. అష్టపదులు తరంగములు కృతులు మృత్యుంజయ విలాసము అధ్యాత్మరామాయణ కీర్తనలు చెప్పుకొని పాడుకొను నొక భక్తుఁడు. దానికిఁదోడాయన మృదంగముకూడఁ జక్కఁగ వాయించు చుండువారు. వెలగదుర్రు గ్రామమునకు సభాపతియై పెత్తనము నిర్వహించుచుండెను. అట్టిసమయమున నెవరో యొకశాస్త్రులుగా రాయూరు వచ్చి మన వేంకటశాస్త్రిగారితో సంస్కృతమున మాటాడ నారంభించిరఁట. వీరి కాభాష బొత్తిగా రాదు. దానితో నభిమానము పుట్టి నాఁడు మొదలు వేంకటశాస్త్రిగారు సంస్కృతాంధ్ర భాషలు పట్టుదలతో సాధించిరి. ౨౫ వ యేఁట రచించిన వేంకటేశ్వర శతకము వీరి తొలికబ్బము. తరువాత 'గౌరీశతకము' రచించిరి. ముప్పదవయేఁట "విచిత్రరామాయణము" రచించుట కారంభించి మూఁడేండ్లలో నాలుకాండములను బూర్తిచేసిరి. ఇది శ్రీరామాంకితము. ఈ కవివరుని కీర్తిని శాశ్వతి మొనరించునది యీ యొక్క కావ్యమే.

గోపీనాథకవి వచనమున నీవిచిత్రరామాయణము తొలుత రచించెను. అదిచూచి గద్యపద్యకావ్యముగా వేంకటశాస్త్రిగారిది వ్రాసిరి. ఇందు లాక్షణికు లంగీకరింపని ప్రయోగములు కొన్ని యున్నను కవి

త్వము మాత్రము ధారావాహి. అనాఁడు పెద్దపండితులైన కొక్కొండ వేంకటరత్నశర్మ, బహుజనపల్లి సీతారామాచార్యులు నీగ్రంథము మీఁద మంచి యభిప్రాయములిచ్చిరి. "...దండికావ్యము కంటెను అభినవ దండికావ్యముకంటెను జాలమేలని మెన్నఁదగియున్నది" అని వేంకటరత్నశర్మగారును, "...అధునిక గ్రంథస్థములని తెలియక యుండిన గద్యపద్యములను విన్నవారు అవి పూర్వగ్రంథస్థము లనుకొని నిస్సందేహముగఁ దలంతురు" అని సీతారామాచార్యులుగారును విచిత్ర రామాయణమును గొండాడిరి. ఇందలి కవిత్వపు మచ్చునకు రెండుపద్యములు:

గుంపులుగూడి సీత మనకు న్మనసివ్వదు గాని చన్గొనఁగ
సొంపవు శక్రనీల మణిసోయగము న్వహియించి యున్న పీ
చంపకగంధి మోముఁజగి చందురు నేటకు సాటిగాఁదగుఁ
దంపతులేమి నోఁచిరొకొ తథ్యము గర్భిణియుందురందఱుఁ.

లలితేందీవర్ణ కైరవాశ్మృతజ కల్హారాదిపుష్పౌఘ సం
చలదింగిందిర బృందగానలహరీ సంయుక్తమంద క్రమా
నిలనంచారకృతార్భకోర్మియుత పానీయాఘముంగల్గి ని
ర్మలమై యొప్పు సరోవరంబుగని రా మ్మానవుల్ కౌతుకం(?)బుగ.

శాస్త్రిగారు తమ ౭౮ వ యేఁట విచిత్రరామాయణమున నుత్తర కాండము సంపూర్తిపఱిచి వారే ముద్రింపించుకొనిరి. తరువాత వారి కుమారులు ౧౯౩౭ లో నీగ్రంథము సమగ్రముగ వెలువరించిరి.

ఈకావ్యముగాక 'మనకవి 'విరాగసుమతీసంవాద' మను వేదాంతపర మగు హరికథను వ్రాసెను. వీరికి నాగబంధ, రథబంధాదులరచనయందు మంచిపేరుపు కలదు. గానకళలోఁ జక్కనిప్రవేశము కలదు. ముఖ్యార్థ భాగమునఁ బెద్దయనుభవము కలదు. ఈయన యుట్టికవియో యట్టి నైష్ఠికుఁడు. ఏకాదశీవ్రతము విడిచియెఱుఁగఁడు. ఇట్టి భక్తకవి నోటి నుండి వచ్చిన "విచిత్రరామాయణము" తెలుఁగుబాసకుఁ దొడవగుట కాశ్చర్యమేమి?

---

# రేమెల వేంకటరాయ కవి

## 1820-1847

గోదావరీ మండలములోని 'దుగ్గుదుర్రు' గ్రామ నివాసి. వెలమకుల సంభవుఁడు. అరశెల్లగోత్రేయుఁడు. తండ్రి: భావయ. జననము 1820 ప్రాంతము. నిర్యాణము 1847 ప్రాంతము. రచితగ్రంథము: ఉత్తరా పరిణయము.

ఈ కవి వెలమకులీనుఁడు. 'ఉత్తరాపరిణయ' మను మూఁడాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము రచించెను. నివాసము కాకినాడ తాలూకాలోని దుగ్గుదుర్రు. అచటికి రెండుమైళ్ల దూరమున 'కుయ్యేరు' అను పల్లెటూరు కలదు. అది సుప్రసిద్ధ పండితకవియగు పిండిప్రోలు లక్ష్మణకవి పుట్టినయూరు. లక్ష్మణకవికిని వెంకటరాయకవికిని పరస్పర పరిచయము గలిగియున్నట్లు తత్రత్యులు చెప్పుదురు. ప్రకృతకవి యిరువదియేడేండ్లు మాత్రమే జీవించియున్నట్లు పరంపరాయాత ప్రసిద్ధి.

శ్రీమీఱంగ ధర సద్గుణావళులచేఁ జెన్నొందు చున్నట్టి యా
శ్రీమద్వేంకటనీలశైలపతి నాసిం జూచి పోషింపఁగా
ధీమద్రాజితదుగ్గుదుర్తిపురి నాత్రేయాసమాలోకనో
ద్దామత్వంబున నుంటి నిచ్చట సదాధర్మార్జనవ్యాప్తిచే.

అని వ్రాసికొనుటఁబట్టి శ్రీ పీఠికాపుర ప్రభువగు శ్రీ రావు వేంకట నీలాద్రిరాయినింగారి యాదరణమునకుఁ బాత్రుఁడయ్యెనని వ్యక్తము. ఈకవి జ్యోతిషమున మంచిప్రజ్ఞావంతుఁడఁట. జాతకమునుబట్టి తా నిరువది యేడేండ్ల వయసున మరణింతునని తెలిసికొని పెండ్లి గావించుకొనక గ్రంథరచనా దీక్షితుఁడై శ్రీరామచంద్రసేవామగ్నుఁడై కాలము గడపెను. ఈ స్వల్పవయస్సుననే యుభయభాషాభ్యాసముచేసి "ఉత్తరా పరిణయ" కావ్యమూలమున యశము సంపాదించెను. ఈ ప్రబంధము 1980 లో కవి వంశీయులు శ్రీ రేమెల చినవేంకటరాయినింగారు వెలువ

రించిరి. శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు దానికి టీక వ్రా యించిరి.

ఈప్రబంధమరసినచో నీకవి చక్కని ధారాశుద్ధి గలవాఁడని స్పష్టమగును. మను వసు చరిత్రాదులలోని పద్యములఛాయ లీతని కవిత్వమునఁ గలవు. ఏవో స్వల్పలోపము లున్నను మొత్తముమీఁద నీకవి ప్రయోగపరిజ్ఞతయు, వ్యాకరణజ్ఞానము గలవాఁడుగాఁ దోఁచుచున్నాఁడు. రెండవయాశ్వాసమున... "ధనము, ద్రటదవదాత పత్రనికురంబము..." అని ప్రయోగించెను. "ఇట 'నికురుంబము' గాని 'నికురంబము' గాదు" అని టీక. 'నికురంబ' మను అన్యాయుక్త ప్రయోగము లక్షణసమ్మతము. బాహుళకమువలన నుకారముగా కూడ రాఁగా "నికురుంబము" అని కూడ నగును. ఉకార విశిష్టమైన ప్రయోగము ప్రహతముగా నున్నది. కాని నికురంబము తప్పుకాదు. ఈపదము నుపయోగించుటఁబట్టి యీకవికి వ్యాకరణజ్ఞానము చక్కఁగా నున్నదని యవగతము. ఈకవి ధారాశుద్ధి గలవాఁడగుట కీపద్యము చాలును.

బంతులు దేరి పూఁబొదల పజ్జలఁ జేరి సరోజపాళికిన్
దొంతిగఁ బాఱి జొమ్మనుచుఁ దూరెకుఁ దూరెకు మల్లికానభా
సంతతి దూరి భాసిత రసాల విశాల మరందధారల
త్యంతము గ్రోలఁ గోరి మధుపావళులొప్పె వనాంతరంబులన్.

౨ ఆశ్వాసము.

ప్రబంధప్రారంభమున "శ్రీలలనాఁ జానికంబగుచు..." ఇత్యాదిగా నున్న నీలాసుందరీపరిణయములోని మొట్టమొదటి పద్యము యథాతథముగఁ జేర్పఁబడియున్నది. "ఇంతమాత్రమున నియ్యల్లఘునందు గ్రంథచౌర్యము నారోపించుటకన్న, నీయనకు శ్రీ కూచిమంచి కవిసార్వభౌమునియందపారమైన యభిమానముగలదని తెల్పుటకుఁగా నది సాధక

మయ్యెడి" నని పీఠికలో వ్రాసిరి. కాని యీ మొదటిపద్యము ప్రక్షిప్త మనియో, లేఖకులెవరో ప్రార్థనమునకు వ్రాసికొని రనియో చెప్పితీరవల యును. దీనికి రెండుప్రబలకారణము లున్నవి. శ్రీ రాజన్మహీజా... అని శ్రీకారముతో రెండవపద్యము ప్రారంభింపఁబడినది. అది శ్రీరామ ప్రార్థనము. కాని "శ్రీరామచంద్ర సాంద్ర కరుణాసమాగత కవితా మాధురీ ధురీణుఁడ" నని యాశ్వాసాంతవచనముఁ జెప్పుకొనుటచేఁ గావ్యాదిని శ్రీరామప్రార్థనమే చేసినాఁడనుట యుక్తము. 'నీలాసుందరి' లోని 'శ్రీగంగ దానకంబగుచు' అను పద్యము శివస్తోత్రపరము. ఈ పద్యము మొదటఁ జేర్చుట కవిమతమును జెఱచుట యగును. అదియుఁ గాక మూఁడవపద్యమున "...కాంచనాచలో, దారశరాసనుండు జయ ధన్యత మాకొనరించు నెప్పుడున్" అని యీశ్వరుని ప్రార్థించినాఁడు కూడను. దీనినిఁబట్టికూడ మొదట ముద్రించిన పద్యము తీసివేసినఁగాని సరిపడదు. ఉత్తరా పరిణయము చక్కని కావ్యము. ఈ కావ్యకర్తకు భగవంతుఁ డొసఁగిన నిట్టికబ్బము లెన్ని సృష్టింపఁబడెడివో! ఈ కవి చక్కఁగ సంభాషించెడివాఁడనుట కచటివారీవిషయము చెప్పుచుందురు. "పిండిప్రోలు లక్ష్మణకవిగారును వీరును బావమఱఁది వరుసయాచక మాడు కొనుచుండువారు. ఒకప్పుడు ఏదో సభలో లక్ష్మణకవి కూర్చుండి యుండ మనకవిగారు వెళ్లిరఁట. మరియాదకు లక్ష్మణకవి చోటుచూపి "దొర లకు చోటు చాలా" యనెనఁట. అప్పు డీయన "దొరలకు-చోటు చాలు" నని సమాధానము. (దొరలకుము=బత్తిగిల్లఁ బడుము) కవి సంభా షణా చాతుర్యము!

# అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

## 1831-1892

ఆరామ ద్రావిడ బ్రాహ్మణుఁడు. హరితసగోత్రుఁడు. తల్లి: గంగమాంబ. తండ్రి: రంగశాయి. జన్మస్థానము: పిఠాపురము కడనున్న చేబ్రోలు. జననము 1831- వికృతి సంవత్సరము. నిర్యాణము 1892. గ్రంథములు: ౧. శ్రీ కృష్ణభూపతిలలాము శతకము (1868) ౨. శేష ధర్మములు (అష్టాశ్వాసముల పద్యకావ్యము). (1867) ౩. పాపయ మంత్రి శతకము. ౪. ఆత్మబోధము (శంకరకృతికి తెలుఁగుపద్యములు) (1875) ౫. మణిధ్వజచరిత్రము (గ్రంథము లభింపలేదు.) ౬. సింహాద్రి రామాధిప శతకము (1876) ౭. భద్రాపరిణయము (1878) ౮. శ్రీకృష్ణ లీలా కల్యాణము (1878) ౯. చాటుధారా చమత్కారసారము.

ఒకప్పుడు మాడభూషి వేంకటాచార్యులవారు పిఠాపురసంస్థానమునకు శ్రీ గంగాధర రామరాయేంద్రుని దర్శనార్థము వచ్చిరి. అప్పుడు అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారు నిండుకొలువులోనుండి "ఇఁక" అను పదముతో నారంభించి కందములో, ప్రభుకీర్తిని వర్ణింపుఁడని యాచార్యులవారితో ననిరఁట. వేంకటాచార్యులవారు గొప్ప యాశుకవి. వెంటనే యిట్లు చదివిరి.

క. ఇఁక నెవ్వరికీర్తులు నీ
ప్రకటగుణుండైన రామరాయ క్ష్మాభృ
త్సుకృతి జనపోషకుని కీ
ర్తికి సరిగారావునమ్ము పృథ్వీస్థలిలోఁ.

సుబ్రహ్మణ్యకవి "యీపద్యములోఁ దప్పుకల" దని యాచార్యుల వారి నాక్షేపించెను. 'తప్పులే' దని యాయన గంభీరముగఁ జెప్పివైచెను. అవుడు సుబ్రహ్మణ్యకవి 'ఇదిగో' నని యీ పద్యమును పఠించెను.

ఇఁక విను నీయశమునకుఁ ద
లఁకి శశి కృశుఁడయ్యెను మఱలఁ దొరుఁగ వేర్వ

ల్లఁకీయుఁ గొననొక్కొ తోలిమలకె
లంకలను శ్రీరామరాయ లలితశ్రేయా!

“ ఇఁక ” సబిందుకశబ్దమగుటఁ దక్కిన చరణములు సబిందుకప్రాసముతో నడువవలెనని తత్క్షణమున వేంకటాచార్యులవారికిఁ దట్టియుండక పోవచ్చును. గంగాధరరామారావుగారు గడుసురాజు. “ ప్రబంధకవిత్వమున మీరధికు ” లని సుబ్రహ్మణ్యకవిని స్తుతించెను. “ ఆశుకవితలో మీ రధికు ” లని యాచార్యకవి యభినందించెను.

సుబ్రహ్మణ్యకవి చమత్కృతి కప్పు డట్లనేఁగాని సబిందుక నిర్బిందుక ప్రాససాంకర్యముచేయునని పట్టుదల పట్టినకవి కాఁడు. ఆయన భద్రాపరిణయములో ( ద్వితీయాశ్వాసము 75 పద్యము చూ. ) నెన్నో దీని కుదాహరణము లున్నవి.

ఈ సుకవివరుని చాటుపద్యములు తెలుఁగున వ్యాప్తముగ నున్నవి. ఈయన కాట్రావులపల్లి సూతులపై నొకపద్యము చెప్పెను.

దేవాసుర లబ్ధిఁదరువ
నావిర్భూతమయి హాలహల మపుడు మహా
దేవునకుఁ భీతిలి కా
ట్రావులపలిసూతులందు డాఁగెంజుండీ.

మాడుగల్లుసంస్థానమునకుఁ బోయినపు డక్కడ నొక్కనియోగికవి వైదికకవులనుబట్టి పడఁదిట్టుచుండెనఁట. అప్పుడు సుబ్రహ్మణ్యకవి పట్టలేక యీపద్యము చెప్పెను.

చందనశాఖకన్న విరసంబుగ బూరుగ మేలటన్న శ్రీ
విం దగినట్లు వైదికకవిత్వసుధారస ధారలెల్లఁ జె
ల్వొందఁగ భూతలంబున నియోగికవిత్వముతోడ సాటిరా
దందురు చెట్టిదంబగునటందురు కొందఱు మూఢమానవుల్.

సూరపరాజు మల్లపరాజు అనునాయన గంగాధరరామారావుగారి మిత్రుఁడు. సుబ్రహ్మణ్యకవి యీయనను జూడఁబోయెను. “శ్రీ రావు

వేంకటమహీపతి గంగాధర రామారావు" అని పలుకునట్లు సమస్యనొసంగి కందము చెప్పుఁడని మల్లపరాజుగారడిగిరి. అప్పుడు వీరిట్లు చెప్పిరి.

శ్రీధర! శౌరీ! వైకుం
ఠా! ధర శ్రీరావువేంకటమహీపతి గం
గాధరరామారాయ
త్స్మాధగునిం బ్రోవు మెపుడు కరుణాదృష్టిన్.

ఈచాటువులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సేకరించి నాకొసంగిరి.

సుబ్రహ్మణ్యకవిది పండితవంశము. ఇతని తండ్రి రంగధామార్యుఁడు. నారాయణాచలమాహాత్మ్య కృతికర్త. కవిచకోర చంద్రోదయము, సత్య భామావిలాసాదులు రచించిన రామకృష్ణకవి కితఁడు భిన్నోదరుఁడు. సుబ్రహ్మణ్యకవి నాగాభట్ల నరసకవితో సంధ్యాభాష [illegible] చెను. చాలవఱకు స్వయంకృషి చేసి సాహిత్యసిద్ధిఁ గాంచెను. మను చరిత్రము-ఆముక్తమాల్యద వీరి కభిమానగ్రంథములు. శ్లోకభాగ ముకూడ నీయన చక్కఁగ నెఱిఁగెను. అదికొంత తెలుఁగు జీవనాధార మైనది. క్రమముగాఁ గవిత్వరచనమే ప్రధానవృత్తిగాఁ బెట్టుకొని రాజ దర్శనము చేయుచు సుబ్రహ్మణ్యకవి తనలేవడి నెట్టుకొనుచుండెను. 1853 లో మాదుగల్లు సంస్థానాధిపతియగు శ్రీకృష్ణభూపతిపై నీకవి సీసపద్యములశతక మొకటి చెప్పెను. అది "శ్రీకృష్ణభూపతి లలామశత కము". అప్పటికిఁ గవియీడు డిరువది రెండేఁడులు. మాదుగల్లుసంస్థాన పండితులు మనకవి నెన్నో తిప్పలు పెట్టిరఁట. మంత్రిప్రెగడ సూర్య ప్రకాశరాయకవి మున్నగువారు నాఁడు తత్సంస్థాన విద్వత్కవులు. అక్కడివారు "కుట్రయొనర్చ లేమ తన గుబ్బలయుబ్బు సహింప లేమిచేన్." అను సమస్య నిచ్చి, నిలుచుండఁగాఁ బూరింపుమనిరి. అది యీకవిచే నిటు పూరింపఁబడెను.

వస్త్రువహారరత్నములు వన్నె నగల్ పులిమీఁదవచ్చు నా
పుట్ట యటన్నరీతి జిగిఁ బొల్పగు చూచుకలీలఁ జూచుచున్

ద్రోట్రిలనేల ? కేలఁగొని గోగులకొమ్మలను సాఁచియుంచుఁ దాఁ
గుట్రయొనర్చి లేమ తనగుబ్బలయుబ్బు సహింపలేమిచేన్.

ఇట్టి పరీక్షల కాఁగిన సుబ్రహ్మణ్యకవిని మాడుగుల్లు ఱేఁడు మెచ్చి యాస్థానకవిగా నర్థించెను. తాను జన్మస్థానమగు కాయూరు దూరమగుటచే సంగీకరింపక కవిగారు వార్షికబహుమానము వచ్చునటుల ప్రార్థించెను. 1858 మొదలు 1869 వఱకు నాసంస్థాన వార్షికవిత్తము సుబ్రహ్మణ్యకవి పొందుచుండెను.

1869 లో పీఠికాపుర సంస్థానమున నూతనవేతన మేర్పడినది. గంగాధరరామరాయేంద్రుఁ డీకవిప్రతిభఁ దెలిసికొని సన్మానించెను. "భద్రాపరిణయము" అను ప్రౌఢాంధ్ర ప్రబంధ మా మహారాజున కంకితము గావించెను. ఏతత్కృతిప్రదానవిషయ మీ పద్యము తెలుపును.

శాలివాహనశక సంవత్సరము లిందు
గగనకరీందుసంఖ్యల నెసంగ
జరుగుప్రమాథివత్సర మార్గశిరశుద్ధ
సప్తమీ శుక్రవాసరమునందు
శ్రీ మహారాజభూషిత చరిత్రుండు సూ
ర్యారాయభూనాయకాత్మజుండు
రావు గంగాధరరామరాయోత్తమా
ధవుఁడు సుబ్రహ్మణ్యకవివరునకుఁ
పీఠపురదుర్గసౌధంపుఁ బెద్దకొలువు
నందు భద్రాపరిణయకావ్యంబు నంది
యధికతరమాన్యభూమి వివిధ్యములును సు
వర్ణ వలయంబులును సేలువలు నొసంగె.

ఈ భద్రాపరిణయము నాలుగాశ్వాసములు కలది. కాణాదము పెద్దన సోమయాజి భద్రాపరిణయమను మఱియొకపేరుగల ముకుందవిలాస ప్రబంధము రచించెనని వీరేశలింగము పంతులుగారు వ్రాసిరి. ఆ ముకుంద

విలాసములోని కవితాగీతులే సుబ్రహ్మణ్యకవి కొన్ని సంగ్రహించెను. అందలిపద్యములు పద్యములుగాఁగొన్ని యిందున్నవి. కథలోఁగూడఁ బెద్ద మార్పులేదు. భావములు చాలవఱకు దానిని బోలినవే. సుగ్రీవ విజయము శ్రీ నడకుదుటి వీరరాజుగారును బెల్లడించిరి. ఆకవి కవితపైఁగల యభిమానమున నీసుబ్రహ్మణ్యకవి యిటులు చేసినాఁడని సమర్థించు కొనవలయును. పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి వ్యాఖ్యతో 1912 లో నీగ్రంథము నేఁటి పీఠికాపుర ప్రభువు లావిష్కరించిరి. సుబ్రహ్మణ్యకవి సాధారణకవి కాఁడనుట కతనిఁగూర్చినకథలు చాలఁగలవు. పెద్దపెద్ద సంస్థానములకుఁ బోయి యతఁడుచూపిన విచిత్రాశుకవితాగుంఫనములకుఁ దార్కాణ. ఆయన 'చాటు ధారాచమత్కారసార' మనునొక గ్రంథము సంధానించెను. అందుసంస్కృతమునఁ జాటువులుగ నుండి పండితులచేఁ బరంపరాయాతములై యున్న గంభీరార్థకములగు శ్లోకములకు సులభమైనయర్థము వ్రాయఁబడియున్నది. ప్రాచీనాధునాతనపద్యము లెన్నో యందున్నవి.

కమలాకర కమలాకర
కమలాకర కమల కమల కమలాకరమై
కమలాకర కమలాకర
కమలాకరమైనకొలను గని రా సుదతుల్.

ఈపద్య మిచ్చి మూడుగుల సంస్థానములో నెవరో పండితులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నర్థము చెప్పుమనిరఁట. నాఁటి వారిలో నిట్టి పాషాణములను బ్రద్దలుగొట్టు దిట్టలు చాలమంది యుండువారు. మన శాస్త్రిగారు వెంటనే దానికర్థము వివరించి చెప్పిరి. తరువాత సేకరించిన కొన్ని చాటువులకు వ్యాఖ్య వ్రాసి "చాటుధారా చమత్కారసారము" వెలువరించిరి.

జయంతి రామయ్యపంతులుగారికి వీరికిని మైత్రి. రామయ్యపంతులుగారి ప్రోత్సహామువలన నీకృతి రచితమైనది. ఆ విషయమును విస్పష్టము చేయు శ్లోక మీక్రిందిది విధిగా నుదాహరింపఁదగినది.

శ్లో. ఏతాదృగ్భిర్గుణ మణిగణై ర్వ్యాపితేనైవ తేనా
సుజ్ఞాంప్రాప్య శ్రితహితకరీం ప్రేమపన్నామపూర్వాం
అల్లంరాజాన్వయమణి రసౌ రంగశాయ్యార్యపుత్ర
స్సుబ్రహ్మణ్యస్సుకవి రకరో చ్చాటుధారార్థసారమ్"

రామయ్యపంతులుగారి నుద్దేశించి సుబ్రహ్మణ్యకవి 'అంతర్లాప' యిటులు చెప్పెను. ప్రశ్నోత్తరములు లోపలనే నిగూఢముగా నుండు సమస్యకు 'అంతర్లాప' యని పేరు.

చెప్పినాఁడ రెండు చిత్రోత్తరము లిందు
నల జయంతి రామయార్యవరుని
సువచనమున నే దడవిలోఁ జరించు న
ద్దీశ్వరునికిఁ బ్రియము నెక్కుడనఁగ.

సుబ్రహ్మణ్యకవి యాధునికుఁడగుట గ్రంథవిమర్శములనుగూడ వ్రాసెను. శ్రీమన్నాడభూపి వేంకటాచార్యకవి రచించిన 'భరతాభ్యుదయము' న దోషము లున్నవని సప్రమాణముగఁ జూపి రాజయోగి పత్రికలో వెలువరించెను. కాని యిక్కడి రేఫద్వయమైత్రి, అఖండయతి, కొన్ని ప్రాచీనలాక్షణికానభిమత సంధులు విడిచిపెట్టలేకపోయెను. అదియటుండె, సుబ్రహ్మణ్యకవి ప్రతిభావ్యుత్పత్తులు సమానముగాఁ గల కవివరుఁడు. వారిపద్యధారకుఁ జివర నొక యుదాహరణమిచ్చి విడిచెదను.

పగడపుమోవితో జిలుఁగుఁబయ్యెదతో విడియంపుసొంపుతో
నిగనిగ నుబ్బుసిబ్బెముల నిగ్గులతోఁ దగుగుబ్బదోయితో
సొగసగువేణితో బెళుకు చూపులతో లలితేతనవ్వుతో
జిగిపగగుల్కవచ్చి యొక చేడియచూచెఁ ద్రిలోకమోహనున్.

భద్రాపరిణయము ౪. ౫౮.

# మండపాక పార్వతీశ్వరశాస్త్రి

## 1833 - 1897

వెలనాటి వైదిక బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. పారాశర గోత్రుఁడు. తల్లి సోగమ్మ. తండ్రి కామకవి. జన్మస్థానము విశాఖపట్టణ మండలములోని పాలతేరు (బొబ్బిలి సమీపము) జననము శ్రీ॥ శ॥ 1833 సం॥ జూన్ 30 తేదీ. నిర్యాణము 1897 సం॥ జూన్ 30 తేదీ. విరచిత గ్రంథములు ఏకప్రాస శతకములు: ౧. బ్రహ్మేశ శతకము ౨. చిత్రశతి ౩. వేంకటశైలనాయద్విశతి ౪. విశ్వనాయక శతకము ౫. విశ్వనాథస్వామి శతకము ౬. కాశీ విశ్వనాథ శతకము ౭. పార్థివ లింగ శతకము ౮. పరమశివ శతకము ౯. సూర్యనారాయణ శతకము ౧౦. బాల శశాంకమౌళి శతకము ౧౧. చంద్రఖండ కలాప శతకము ౧౨. కలిపురుష శతకము ౧౩. ఈశ్వర శతకము.

శతకములు. (౨౩)

౧. సీతారామ ద్వ్యర్థి శతకము ౨. శ్రీ జనార్దన శతకము ౩. కాశీ కా విశ్వనాథ సీసపద్య శతకము ౪. పరమాత్మ శతకము ౫. పార్వతీశ్వర శతకము ౬. కాశీవిశ్వనాథ ప్రభా శతకము ౭. సూర్యనారాయణ శతకము ౮. వేంకటరమణ శతకము ౯. వరాహ నరసింహ శతకము ౧౦. జగద్రక్షక శతకము ౧౧. రమానాయక శతకము ౧౨. అంజనేయ శతకము ౧౩. రామ రక్షా శతకము ౧౪. గోపాలకృష్ణ శతకము ౧౫. బాలకృష్ణ శతకము ౧౬. రఘుపతి శతకము ౧౭. జగన్నాయక శతకము ౧౮. రామలింగేశ్వర శతకము ౧౯. సర్వకామదా శతకము ౨౦. గణపతి శతకము ౨౧. హరి శతకము ౨౨. హరిహరేశ్వర శతకము. మాలికా కృతులు, దండకములు మరికొన్ని కలవు.

కావ్యములు.

౧. శ్రీ రాధాకృష్ణ సంవాదము ౨. బొబ్బిలి మహారాజ వంశావళి ౩. ఉమాసంహిత ౪. కాంచీమహాత్మ్యము ౫. అమరుకము ౬. అక్షరమాలి కావ్య నిఘంటువు.

గద్యకావ్యములు.

౧. యాత్రాచరిత్ర ౨. గురుచిత్రకథ ౩. లఘుచిత్రకథ ౪. శ్రీ బొబ్బిలి మహారాజ వంశావళి.

సంస్కృత కృతులు.

౧. సుఖశ్లోకాది చిత్రరచన ౨. కవితా వినోద కోశము ౩. సీతా స్తుతి ౪. కాశీశ్వరాష్టకము ౫. మంగళాష్టక చతుష్టయము ౬. శ్రీ వేంకటగిరి ప్రభు ద్వ్యర్థిశ్లోక కదంబము ఇత్యాదికము.

పార్వతీశ్వరశాస్త్రిగారు రభిన వాంధ్రకవితా పితామహుఁడని పేరు పొందిన పండితుఁడు. ఈయనకుఁ బ్రబంధకవిత్వమందును శతక కవిత్వమందును సిద్ధహస్తత యున్నది. శతకకవులలో నీయన కున్నది యుత్తమ స్థానము. వీరు వ్రాసినశతకములు శతసంఖ్యగలవి. సత్యవోలు భగవత్కవి మున్నగు వారు శతకశతము రచించినట్లు తెలియుచున్నది. తెలుఁగు వాఙ్మయమున శతకములకు గొప్ప విలువయున్నది. అది యిప్పుడిప్పుడీ యిరువదవ శతాబ్దినుండి యించుక సన్నగిల్లుచున్నది. నేఁడును 'కాళహస్తీశ్వర' ప్రభృతి శతకములను గౌరవముతోఁ జూచుచున్నవారు చాలమందియున్నారు. పార్వతీశ్వరకవి ౧౯ వశతాబ్దిలోఁ బ్రసిద్ధుఁడగు శతకకవి. కేవలము శతక కవియే కాదు. ఆశుకవి, ప్రబంధకవి కూడను. వీరినిగూర్చి చెప్పవలసిన విశేషములు చాలఁ గలవు.

ఈయన పితామహుఁడు వేరయసూరి. ఇందుమతీపరిణయము, నిర్దుష్ట నిరోష్ఠ్యదాశరథీశతకము, లక్ష్మీనృసింహమూర్తిస్తుతి కృతులు రచించినవారు వీరే. పార్వతీశ్వరశాస్త్రిగారితండ్రి కామకవి బ్రహ్మోత్తరఖండము, కార్తికమాసవ్రతమాహాత్మ్యము, బలరామక్షేత్రమహాత్త్వము, జానకీరామశతకము, సూర్యనారాయణ రామప్రభుశతకములు రచించిన విద్వత్కవి. పార్వతీశ్వరకవి యన్నగారు రామస్వామిశాస్త్రి వేదాంతకృతి కదంబము, గంగాలహరి, గంగాస్తవము వ్రాసిరి. పార్వతీశ్వరశాస్త్రిగారు తండ్రిగారి సన్నిధిని మొదటఁ జదువుకొనిరి. తరువాత తాతా సూర్యనారాయణశాస్త్రిగారి కడఁ బఠించిరి. శ్రీ త్రైవదేంద్రస్వామివారి యనుగ్రహమున నుపనిషత్పాఠము చేసిరి. స్వయంకృషిచే బహుళమైన పాండిత్యము సంస్కృతాంధ్రములలో సంపాదించిరి. కవిత్వము సహజముగ నున్నదే.

ఈ సహజకవితాధార కాయసాధారణపాండిత్యము తోడైనది. పంద్రెండవ యేటనే పాటముగఁ గవిత వ్రాయ నారంభించి "కవితా లతాంకురము" పంతముపట్టి గంటలోఁ జెప్పెను. చిన్ననాఁటనే వేంకటగిరి మున్నగు సంస్థానముల కేఁగి కవితాప్రదర్శనమున సత్కరింపఁబడెను. బొబ్బిలి సంస్థానమున విద్వత్కవిగాఁ గుదిరెను. ఆయాసంస్థానరంగములలో నీయన కనఁబఱిచిన కవితాచతురత పెద్దల మెచ్చుకోలుబడసినది. పార్వతీశ్వర కవి తజ్జీవిత విశేషములు 'ఆత్మచర్య' యను సీసపద్యములలో వ్రాసి కొనెను. ఇది యొకటి చదువుఁడు :

మఱియు సద్గోష్ఠిలో వలపు పట్టఁగఁ జూచి
గుఱుతు తప్పక వాసకురియునట్లు
మంచిపద్యములు గావించి తెండని రంగ
రాయవిభుం డాదరమునఁ బల్క
నీవిూఁద భారంబు నేనుంచి యప్పుడ బీ
జాక్షరఘటిత పద్యంబు లైదు
పంచరత్నము లనఁ బచరించి నవరత్న
పద్యయుక్తముగఁ దద్విభున కొసఁగఁ
గాకతాళీయనయమున గాలివాన
కురియఁ జేసితి వది మాన్పఁగోరి మాన్పి
తౌర! యతివృష్టి కష్టహారాష్టకమున
హరిహరేశ్వరదేవ! మహానుభావ!

ఇచట రంగరాయవిభుఁడన బొబ్బిలి ప్రభువు వేంకటశ్వేతాచలపతి రంగా రావు బహద్దరు వారు. ఈకవి యుద్దిష్ట సిద్ధ వాక్కనుటకు సందేహింపఁ బని లేదు. బొబ్బిలిలో నీతఁడు 1876 లోఁ బ్రవేశించి 1897 వఱకు సంస్థాన కవిగా నుండెను. అదియుం [illegible] జాతకమున ఘనదశ. అంతకుమున్ను శ్రీ విజయనగరమహారాజదర్శనమునకుఁబోయి 1867 లో నచటఁ గవితా పటిమా ప్రకటనము చేసెను. కాని యాస్థానకవితాస్థానమున నుండుటకు

యోగము పట్టలేదు. ఆయన బొబ్బిలిసంస్థానకవి కావలసియుండెను. ఆనందగజపతిదర్శనము చేసి పార్వతీశ్వరకవి యమూల్య పద్యములు చదివెను. అం దిది యొకటి.

అభ్రప్రదుఁడగు మేఘుఁడు బలి
కుప్రదుఁడగు ఖేచరుండగు ననుప్రదుఁడ
త్రిప్రదుఁడగు నర్కుఁడు నం
దప్రదునకు సాటియనఁగఁ దగునే విరిగా.

విజయనగరములోని యాస్థానపండితుఁడు ముడుంబ నరసింహాచార్యకవి "అన్నవశాళిఁజాల కవాహా! యని తల్లడమందె నెంతయున్" అను సమస్యనిచ్చి "కన్నులఁ గాయఁ గాయజుఁడు వేయుటకై విరిగోల లేయ లే" యని పూర్వార్థము వెనుక నేను పూరించితినని తక్కిన చరణములు శాస్త్రులుగారు చెప్పవలయుననిరఁట. అప్పుడది యాశువులో ననుప్రాసము వచ్చునట్లు వీ రిట్లు పూరించిరి.

క్రొన్నన గోయఁ గోయనుచుఁ గోయిల కన్నులఁ జేయ జేయటుల్
కిన్నరఁబాయఁ బాయవము కెల్కని ఖాంగిన ఛాయ ఛాయలన్.

1865 లో వావిలవలస జమీందారగు ఇనుగంటి సీతారామస్వామిగారి దర్శనమున కీ కవి వెళ్ళినపుడు వసుచరిత్రలోని పద్యమునిచ్చి సంస్కృతీకరింపుమనిరి. తెలుఁగును సంస్కృతములోనికి నింతమాధురీధుర్యముగా మార్చిన-మార్చఁగల కవులు తక్కువ.

అతన్వంగి యసంగఝాంకరణవజ్జ్యాయుక్త మాతాత్రని
ఘాతం లోర్వ్యాం తమ్ములంచుఁ దటినీ గర్తైర్భవ ద్వంశాత్కం
జాతవ్రాతము మాటుచెంద నది తోంచగా సాఁగె మున్నుందుగా
జ్ఞాతిత్వే దనలేన కిమ్మని వాదారూఢ సత్యమ్మునుగా.
సాఽనసమ్యస్మరఝంక్రియాశ్రయ గుణోన్మక్తాత్రమబాణస్థితిం
తన్వీ సారసజాతి రిత్యవధృతా పద్మాటవీ మాశ్రితా

ఆశుధారాపరీక్షలో నీకవి మొదటితరగతిని నెగ్గినాఁడు. చతుర్విధ కవిత్వములందు నీకవి కడుదిట్ట. ఒకశివరాత్రి యుపవసించి లింగోద్భవకాలమున మొదలిడి తెల్లవాఱునసరికిఁ బార్వతీశ్వర శతకము రచించిన యాశుకవి వరుఁ డీయన. రెం డేకప్రాసశతకములు మూన్నాళ్ళలో రచించి చూపిన శీఘ్రకవితాచతురుఁడు. యమకముగఁ బద్యములల్లుట, ద్విత్రిచతుఃప్రాసములతోఁ గవితవ్రాయుట యీకవికి వేడుక.

వీరి రాధాకృష్ణసంవాదము కృష్ణాభ్యుదయము అమరుకము, తెలుఁగు నాఁటఁ బ్రచారమున నున్నవి. వెనుకటివారిలో, తాళ్ళపాక తిరువేంగళప్ప అమరుకాంధ్రీకర్తలయం దగ్రగణ్యుఁడు. అధునాతనులలో నమరుకము నాంధ్రీకరించినవా రయిదాఱుగురు కలరు. వానిలోనెల్ల వీరి తెలిఁగింపు చాల గొప్పగా నున్నది. రాధాకృష్ణ సంవాదములోని యీ క్రిందిపద్యము వీరి తాతతండ్రుల విశిష్టత కొంత గుఱుతు.

సీ. శ్రీవిరాజి నుభయభాషా ముఖ్య సత్కృతుల్
తజ్జ్ఞులెన్నఁగ మదంకితములు చేసి
యశముగాంచిన వీరయ మనీషిమణికిఁ బౌ
త్రత్వంబుఁ గార్తికవ్రతమహాత్మ్య
శివమహాత్మ్యాద్యనేకవిధ ప్రబంధంబు
లొనరించి సత్కవి వినుతిఁ గనిన
పారాశరసగోత్ర పావనుండగు మండ
పాక కామేశ్వర పండితునకు
మహిత పుత్రత్వమును గాంచి బహువిచిత్ర
చిత్రకృతి ముఖ్య సత్కృతుల్ చెప్పి మెప్పు
వడసితివి గద కులకీర్తి వర్ధిలంగ
సరసగుణసాంద్ర! పార్వతీశ్వరకవీంద్ర!

పార్వతీశ్వరశాస్త్రిగారి మనుమలు పార్వతీశ్వరశాస్త్రిగారును భాషా పోషకులై తాతగారివి మఱుఁగునఁ బడిన కవితారహస్యములు కొన్ని

భారతి కందిచ్చిరి. అముద్రితగ్రంథచింతామణి పార్వతీశ్వరశాస్త్రి ప్రతిభకు నికషము. తత్పత్రికాధిపతులు పూండ్ల రామకృష్ణయ్యగారు వీరి చరిత మామూలాగ్రముగ వ్రాసిరి. అది పార్వతీశ్వరశాస్త్రి 'ఆత్మచర్య' యనఁదగు "హరిహరేశ్వర శతకము" నకుఁ బీఠికగా వెలసియున్నది. పార్వతీశ్వరశాస్త్రిగారికిని, మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారికి నీపత్రికాద్వారమునఁ గొన్నాళ్ళు భాషావిషయక వివాద మాపాదిల్లినది.

పార్వతీశ్వరశాస్త్రిగారు మహాభక్తులు. కడకాలమున "మృత్యుంజయునకు నమస్కరింతుఁ దరింతుగా" అను మకుటములోఁ బద్యములు చెప్పుచు ముప్పదియైదు పద్యములు పూర్తిచేసి జీవము విడిచిరి. వీరు జీవించిన యెనుబదిరెండేండ్లలో శతాధికములగు కృతులు విరచించిరి. తుదకు మిగిలిన కృతులు కూడ నెనుబదిగండె. ఈ నవశతాబ్దిలో నిట్టి యాశుకవి లేఁడనుటకు సందేహము లేదు. పార్వతీశ్వరశాస్త్రిగారి శతక కవిత యిటులుండుననుట కొకపద్యము నుదాహరించి యిఁక విరమించెదను.

అత్తుల్ నిన్ననునట్లు హస్తములు నిన్నర్చించునట్లాత్మ ని
న్నత్తీరంబుగ నమ్మునట్లు చెవి ని న్నాలించునట్లాస్యముల్
జిహ్వ న్నిన్నెనియాడునట్లు కరుణ న్వీక్షించి రక్షింపుమీ
సాక్షాన్మంగళ సంఘసంఘటన కృష్ణా! బాలకృష్ణా! హరీ!

# మాడభూషి వేంకటాచార్యకవి

## 1835–1895

వైష్ణవబ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. తల్లి: అలివేలమ్మ. తండ్రి: నరసింహాచార్యులు. జన్మదేశము: నూజవీడు. జననము 1835. నిధనము 1895- మన్మథనామసంవత్సర ఫాల్గునబహుళ తృతీయ. గ్రంథములు: ౧. భరతాభ్యుదయము (ప్రబంధము) ౨. వామనసాటకము. ౩. పుష్పబాణవిలాసము, ౪. హంససందేశము. ౫. మదనమోహన చరిత్ర (వచనము) ౬. బృహద్దైవజ్ఞరత్నాకరము. ౭. రామావధూటీ నక్షత్ర మాల. (చాటుపద్యమణి మంజరి-ద్వితీయభాగము చూడుఁడు) ౮. ఆనంద గజపతిపై వ్రాసిన ౬౫ సీసములు.

శతావధానములను ప్రచారములోనికిఁ దెచ్చినవారిలో వేంకటాచార్యులుగారు కనిష్ఠికాధిష్ఠితులు. భట్టుమూర్త్యాదులు శతలేఖినీపద్య సంధానధురంధరుల మని చెప్పికొనినారు. వేంకటాచార్యులవారు అసాధారణుఁడైన మేధావి. ఈయన గంటకు వందలకొలఁది పద్యములు చెప్పఁగలనేర్పరు లనుట యటుండి, యేకసంధాగ్రహణమున నూఱులకొలఁది పద్యములు అప్పగించు బుద్ధిమత్తరులు. వీరి మేధావిశేషమునకుఁ జెక్కుకథలు తెలుఁగుదేశమునఁ బ్రాఁకియున్నవి. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "చాటుపద్య మణిమంజరి" లో వెలువరించిన కథ నొకటి ప్రకటించెదను.

"వసుప్రాకం అనంతాచార్యులుగారిదగ్గఱ కొకప్పుడు ఆవలివ్వుఁడగు అరవదేశపు విద్వాంసుఁడు వచ్చి స్వరచితము లైన శ్లోకములను చదువుచు వివరించుచుఁ బ్రశంసించుకొనుచు నుండఁగా వేంకటాచార్యులవారు వినుచుండిరి. పది శ్లోకము లయినవి. ఆత్మోత్కృష్ట్య ప్రశంసాపరాయణుఁడుగా నున్న యా పండితునితో "అయ్యా ఈ శ్లోకములు చిన్ననాఁడు మా నాయనగారు నాకుఁ జెప్పిరి. ప్రాచీనకవికృతములైన

యీ శ్లోకము లనంతాచార్యులుగారు తెలుఁగ రని యాత్రేయములుగాఁ జదువ నారంభించితిరా ?" యని పలికిరఁట. కుపితుఁడై పెద పెద సభ్యు నవ్వి యా యవధానపండితుఁడు వెంకటాచార్యులుగారి తెలుఁగ 'ఏమి నీకు వచ్చునేని చదువుము, రచించినవాఁడను నేనే యిక్కడ నుండఁగ-నాతోనే యిట్లు పలికెదవేమయ్యా ! ఎవ్వరవీవు ?' అని తూటాడించెనఁట. ఇదిగో చదువుచున్నానని యేకసంథాగ్రహణమున నప్పగించిరి. సిగ్గు బోయి యా పండితుఁడు వేఁడుకొనెరఁట. వీరి మాహాత్మ్యము తెలుఁగ నైతిని మన్నింపుఁడని-"

ఇట్టికథలు గాథలు వీరినిగూర్చి ప్రచరితములు. కని విని తెలుఁగని భాషలోనివి కొన్ని పద్యములు వీరికడ నొక్కసారి చదివినఁజాలును. అవి యద్భుతముగా వల్లించిన పద్యముల వలె నప్పగించువారఁట. ఆయన ధారణాశక్తి యట్టిది. ఒక గదిలో నూఱుచెంబులు పెట్టి పుల్లతో ముందు వరుసగా వాయింపఁగా, గదివెలుపలనుండి వీరి మూరల నడుము నేచెంబుపై దెబ్బ కొట్టినను 'ఇది యీసంఖ్యగల చెంబు' అని చెప్పువారఁట. శబ్దగ్రహణమునఁగూడ నాయన కిట్టి బుద్ధిసూక్ష్మత యుండెడిది. దేవులపల్లి సోదరకవులు, తిరుపతివేంకటకవులు వీరిని విని యవధానము లారంభించిరి. తిరుపతివేంకటకవులు అవధానలతను దేశము దేశమెల్లఁ బ్రాకించిరి. వేంకటాచార్యులుగారు శతావధానియే కాదు. సంస్కృతాంధ్రముల లోఁతు చూచిన పండితుఁడు. తర్కవ్యాకరణములు గురుకులక్లిష్టుఁడై కఱచెను. చిత్రమువీరాఁడఁ జదివినదానికంటె జూచిన దక్షిణ-సంస్థానముల కెక్కుట - యవధానములు గావించి యాకుండి [illegible] చెప్పుటయే [illegible] యోగ్యము. తెలుఁగురాజు తెంపతో వీరి నాదరించి సత్కరించి [illegible] ప్రభువులకు నెక్కుడుగ నూజివీడు గాపురము. తోఁచినప్పు [illegible] ప్రదేశించి [illegible] గావించి [illegible] నరము చేయుచుండిరి. [illegible]

గంగాధర రామారావుగారిని దర్శించి 1879లో నవధానము చేసెను. ఆయవధానమునకు మహారాజు మహైశ్వర్యభరితుఁడై మనకవివరుని గొప్పగ సన్మానించెను. ఈరీతి నీయన పొందిన రాజగౌరవములకు కొరలేదు.

చింతకాయ కలికాయ చీరకాయ తమారికే
ఉద్భింతకాయ వాక్కాయ సాధకాయ తమాంజలిమ్.

ఈ మొదలైన కొంటెరకపు శ్లోకములు వేంకటాచార్య రచితములుగాఁ జాలనుండి చదువ విందుము.

ఆచార్యులుగా రొడ్డుపొడుగులుగల మానిసి. స్ఫురద్రూపి. ఆయన రసికతకు నిదర్శనములుగాఁ గొన్నిరచన లున్నవి. "రామావధూటి శారావళి" వానిలో నొకటి. ఆ పద్యములు రసఘుటికలు. రెం డుదాహరింతును.

సీ. శ్రీరాధికాకుచాశ్లేషజ సంతోష
 వివశుఁడౌ శ్రీకృష్ణవిభున కేఁగి
సకలవిద్యావ్యాప్తి సాధనభూతయౌ
 శారదాంబకు నమస్కారములిడి
దైహికానంద ప్రవాహపూరకమైన
 శృంగారరస మూర్తి నిరవుకొలిపి
మదనసామ్రాజ్య సింహాసనారూఢులౌ
 పురకాంతు రసికశేఖరుల నెంచి
వివిధ రతితంత్రపాండిత్య భవమహాత్మ
భవముతో పదార్థములుగ నేర్పరచి సీస
పద్య సప్తకమాలిక భావవిదుల
మనము లలరంగఁ గూర్తు రామావధూటి.

పరసుఁడు దూరమేఁగునని చాలఁగ నామది చింతనొందు నె
ల్లరకు వినోదమైనను గళానిధి వైరము నర్చి వెండియున్
బరభృతకాకలీరవముఁ బాసి తనర్చును నిమ్ముఁగటీ విస్ఫు
త్వర మలయానిలంబులనఁ బ్రాణము తేమాఱయించు నెంతయున్.

ఆచార్యులుగా రసపత్యులు. 'భరతాభ్యుదయము' వారిపుత్రుఁడు. అవధాన ప్రతిభాయాతమగు కీర్తి వారిపుత్రిక. గుంటూరిలో నిప్పుడు న్యాయవాదులుగా నున్న వేదాంత నరసింహాచార్యులుగారు వీరి దత్తకుమారులు.

శ్రీరంగమున నొకవత్సర ముండి నరసింహాచార్యుఁ డింటికివచ్చెను. శ్రీవిజయనగర ప్రభువులును గాశినుండి వేంచేరి. మన కవి మరల మహారాజ దర్శనముచేసెను. ఆనందగజపతియు వీరి కవిత్వగోష్ఠి కలిగి వీరిని మరిమరి ప్రేమించుచు వార్షిక బహుమాన మొసఁగుచుండెను. ఆనందగజపతి చెప్పుటచే మహారాజా విజయరామగజపతికిని నరసింహాచార్యుల కవిత్వ పాండిత్యాదులపై విశ్వాసము కలిగినది. అప్పు డా మహారాజాపై మన కవివరుఁ డిట్లు చెప్పెను.

ఈ జగమందు నిందు నటులెల్లరకుం గనుపిం చెనర్చునై
ఈరాజ గనంగ రాజనుట కల్లను సందియ మొంద దిందునన్
రాజను మాట మా విజయరామనరేంద్రునకే పొసంగు పై
రాజులు కేవలమ్ము మదిరాజులట రాజు లనంగఁ జెల్లెడిన్.

ధళ్ళా దధాంకరణ రవ
ఫక్కృత్ఫణిప ఫణమణి నిపతనజ శూల
స్ఫృక్కర్ణ కుహర ఘుర్ఘుర
ముక్కోలపభీత గుప్తముఖ కూర్మేంద్రా!

ఈ పద్యములు విని విజయరామరాజు చాల సంతోషించి నరసింహాచార్యుని తన సంస్థానకవిఁగ నాదరించెను. భర్తృహరి మున్నగు కృతులు మహారా జీ పండితునికడఁ బఠించెను.

కూరెళ్ళ రామశాస్త్రులను పండితులొకరు "ఉమాముఖం చుంబతి వాసుదేవః" అను సమస్య నిచ్చి పూరింపుఁడని నరసింహాచార్యులఁ గడిగి నపు డాయన తడవుకొనకుండ

భవిష్యదీశోపయమం విచింత్య
హిమాలయస్యాలయమేత్య కిం తే
సుతేతి చోద్ధృత్య శిశుత్వ ముగ్ధ
ముమాముఖం చుంబతి వాసుదేవః.

అని చదివెను. అశువున నింత యందముగఁ జెప్పుట యబ్బురము. సంస్కృతాంధ్రములు రెండింటను వీరికవిత ప్రౌఢతరము. తెలుఁగున వీరు వ్రాసినవి తక్కువగ నున్నవి.

# కొక్కొండ వేంకటరత్నశర్మ

## 1842-1915

నియోగిశాఖీయులు. జన్మస్థానము వినుకొండ. నివాసము చెన్నపట్టనము. రాజమహేంద్రవరము, జననము 14-3-1842 సం॥ నిర్యాణము 1915. కవికర్తృకకృతులు: పంచతంత్రము, సింహాచల యాత్ర, బిల్వేశ్వరశతకము, బిల్వేశ్వరీయ ప్రబంధము, కుమారనృసింహము, ధనంజయవిజయ వ్యాయోగము, నరకాసుర విజయ వ్యాయోగము, మంగళగిరి మాహాత్మ్యము కొరుకొండ మాహాత్మ్యము, గోదావరీ వర్ణనము, గోవిందమంజరి, దీక్షితచరిత్రము, యువరాజ పర్యటనము, పోయం ఆఫ్ ది ప్రిన్స్ ఆఫ్ వేల్సు-విజిట్ టు ఇండియా - ఇత్యాదులు.

వేంకటరత్నశర్మగారు "మహామహోపాధ్యాయ" లని కొనియాడఁబడిన పండితులు. చిత్తూరు మండలములోని 'తిరువల' గ్రామమున వెలసిన శ్రీ తనుమధ్యా బిల్వ నాథేశ్వరులభక్తులు వీరు. తత్కరుణా కటాక్ష సంప్రాప్త కవితావిద్యా ప్రవీణులు. గుంటూరిలో విద్యాభ్యాసము చేసిరి. చెన్నపురి రాష్ట్రీయ కళాశాలలోఁ బండితపద మధిష్ఠించిరి. రాజమహేంద్రవర రాజకీయ శాస్త్రకళాశాలయందుఁ బ్రధానాంధ్రపండితులై ముప్పదియేం డ్లుద్యోగించిరి. కవిబ్రహ్మయనియు, అక్షరసంఖ్యాచార్యులనియు వీరి బిరుదములు. మహామహోపాధ్యాయ మహాబిరుదమందిన తెలుఁగువారిలో వీరు తొలివారు. "ఆంధ్ర భాషాసంజీవని" వీరు నడపిన తెలుఁగు పత్రిక. ప్రసిద్ధిగాంచిన నాఁటి పత్రికలలో నిది యొకటి. అముద్రిత గ్రంథచింతామణి-కళావతి-వివేకవర్ధని-శశిలేఖ మున్నగు పత్రికలు మహోత్తమ రచయితల సంపాదకత్వమున వెలువడుచుండిన దివసము లవి. నాఁడు 'ఆంధ్రభాషా సంజీవని' యాస్వాదనాపూర్వముతో వెలసినది. వేంకటరత్నము పంతులుగారికి ధర్మవరము కృష్ణమాచార్యులు, రాయదుర్గము నరసయ్య

పూండ్ల రామకృష్ణయ్య పండితుఁడు వేంకటరత్నముపంతులుగారి బిల్వేశ్వరీయాది కృతులు విమర్శించివైచెను. ఆయా విషయములకు సముద్రిత గ్రంథచింతామణి యరయనగును. వేంకటరత్నకవి కవిత సంస్కృతసమాస నిబిడము. ఈయనకు సంస్కృతభాషా పాండిత్యము తక్కువయనియుఁ దెలుఁగున గట్టిశక్తి కలదనియు విమర్శకు లనిరి. అది మనము సహింపరాని మాట. వీరు వెండి, బంగారము మున్నగు క్రొత్తరకపు వృత్తములు కల్పించి తమ ప్రబంధములలోఁ జేర్చిరి.

సీ. చిటిపొటి కొంపలు చిన్నవి పెద్దవి
యిండ్లు మిద్దెలు దారి కిరుగెలఁకుల
నారు పోసినయట్లు వారక యున్నని
పూర్వాచరణముల పోల్కిఁ దనర
మరికొన్ని సుగృహహార్మ్యములు నూత్నాచార
ముల యట్లు పైపయి మురువునూపఁ
జైత్యద్రుమంబుచే సత్రంబులుగ వార
మున కొకసంతయౌ రొబివర విపణి
గా నధిత్యకనృహారి నికాయమౌ ఘన
రాజమందిరముగఁ గడు రాజిలంగ
జానపద జన సమాజమొప్పైనఁ జొర
గోవిదావాసము నగుఁ గోల్కొండపురము.

'కుమార నృసింహము.'

వీరేశలింగముపంతులుగారును వీరును పరస్పర గ్రంథ విమర్శనములు గావించుకొనిరి. ఆ గ్రంథవిమర్శనములు క్రమముగా వ్యక్తిదూషణములకుఁ జేరి విసుగుపుట్టించినవి. అయినను భాషాభిజ్ఞానువుల కా విమర్శనములు కొంత యుపయోగపడిన వనవచ్చును. వేంకటరత్నముపంతులుగారు 'ఆంధ్రభాషాసంజీవని' పత్రిక కనుబంధముగా హాస్యసంజీవిని

ప్రకటించిరి. వీరేశలింగముపంతులుగారును 'వివేకవర్ధని' ప్రక్క శాస్త్రవర్ధని వెలువరించిరి. ఇవి యన్యోన్యవివాదములలో జాలకాలము చెలరేగినవి. ప్రసిద్ధపండితుఁ డన్న వాఁ డల్ల వెంకటరత్నముపంతులుగారి గ్రంథములు విమర్శించెను. దీనికిఁ గారణము; ఆయన సంస్కృతాంధ్రములం దసమానపండితుఁడై మహామహోపాధ్యాయుఁడను నగ్గలపు బిరుద మా నాఁ డాంధ్రులలో నందుకొనుటయే యనవలయును.

'పలుకు దయ్యమా, ఇది పాయసమమ్మా! బహ్మదయ్యపుటిల్లాలా! ఇది పానకమమ్మా! త్రాగుమమ్మా!' అను రీతిని మాటాడు గ్రాంథిక భాషాస్వరూపుఁ డీయన. ఇంటిలో భార్యకడను, బజారులో దుకాణము కడను వీరు గ్రాంథికసంభాషణము గావించెడివారు. అంత పట్టుదల. అఱవము, కన్నడము తెలియుదురు. వీరు రచించిన బిల్వేశ్వరీయమున కఱవమున మాతృక యున్నదఁట. 'గీతమహానటము' అను పేరితో జయదేవుని గీతగోవిందమువంటి కృతిని వీరు సంస్కృతమున సంతరించిరి. విద్యావినోదము పనప్పాకము అనంతాచార్యులుగారు పంతులుగారిని "ఆంధ్రా జాన్సన్" అని పిలుచుచుండువారు. ఇట్టి కవి తెలుఁగువారికి సదా స్మరణీయుఁడుగదా!

# బహుజనపల్లి సీతారామాచార్యులు

## 1827-1891

ద్రవిడదేశవైష్ణవులు. జననము. 1827 సం॥ నిధనము 20-3-1891 సం॥ పుట్టుక నాగపట్టనము. నివాసము చెన్నపట్టనము. రచించినగ్రంథములు: సౌందర్యరాజస్వామిశతకము 1849—ప్రాకృతదీపిక, పదార్థనామకోశము, బాలచంద్రోదయము, 1871 – అలఘుకౌముది 1872 –నీతిమాల 1872– సతీధర్మసంగ్రహము, ప్రపన్న పారిజాతము 1887 — ఆంధ్రశబ్దమంజరి, ఉపాధ్యాయబోధిని, వినాయక శతకము, త్రిలిఙ్గ లక్షణశేషము, శబ్దరత్నాకరము 1855.

సీతారామాచార్యులుగారి పేరు చెప్పినంతనే శబ్దరత్నాకరము, ప్రౌఢవ్యాకరణము జ్ఞప్తికి వచ్చుచుండును. శబ్దరత్నాకరప్రాశస్త్యమును గని పట్టి చెన్నపురిలోని దేశభాషాగ్రంథకరణసభ వారాచార్యులుగారికైదు వేలు సన్మానముగా నిచ్చిరి. నిజమాలోచించినచో నైదులక్షలిచ్చినను దెలుఁగువారు వారియప్పు దీర్చుకొనలేరు. "శరీరకష్టమును విత్తనష్టమును నించుకేనియుం బాటింపక" రేలుంబవల్లు శ్రమించి రచించిన నిఘంటువని నిఘంటుకారులు వ్రాసికొనియేయున్నారు. శబ్దరత్నాకరములోని శబ్దములరూపనిర్ణయము నర్థనిర్ణయము శాస్త్రసమ్మతమైనది. పూర్వనిఘంటువులకంటె నిది బహువిధముల మేలైనది. అక్షరక్రమముగా రచింపఁబడిన నిఘంటువులలో నిది శ్రేష్ఠము. తెలుఁగున నీరకమైన నిఘంటువులకు దారితీసినవారు ఎ. డి. కాంబెలు పండితుఁడు, సి. పి. బ్రౌనుపండితుఁడును. వీరిద్దరు నాంగ్లేయులే. అక్షరక్రమనిఘంటువులు తెలుఁగులో వెలయుట యాంగ్లేయులదే యాదిభిక్షము.

తరువాతఁ బరవస్తు చిన్నయసూరిగారాంధ్రజనసామాన్యమునకందుబాటులో నుండునటు లొక తెనుఁగుపదముల నిఘంటువును రచింపఁ

దలఁచి పదములు ప్రామాణికగ్రంథములనుండి యెత్తివ్రాసికొని యిచ్చు టచ్చుటఁ గొన్నిపదముల కర్థనిర్ణయము చేసికొని యీమహోద్యమము తుదముట్టకుండఁగనే పరమపద మలంకరించిరి. వారియనంతరము సీతా రామాచార్యులవారు సంస్కృతాంధ్రపదములు తదర్థములు గొన్ని ప్రయోగములు చేర్చి శబ్దరత్నాకరము సంధానించిరి. ఇది 1885 లో వెలువడినది. శబ్దరత్నాకరము తరువాత 'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు' వెలువడిన విషయము తెలుఁగువారికిఁ దెలిసినదే.

చిన్నయసూరి వెనుక లాక్షణికులలో సీతారామాచార్యులుగారు ముఖ్యులు. ఈయన సూరికి శిష్యుఁడ నని వ్రాసికొనలేదు. కాని శిష్యుఁ డైనట్లు జనశ్రుతి. ఆచార్యుల వారు కొండొకచో నిటులనుచున్నారు. "పరవస్తు చిన్నయసూరిగారి కాంధ్రమునందును దదుపయుక్త సంస్కృత ప్రాకృతములయందును దలస్పర్శియగు పరిజ్ఞానము కలదని వారుచేసిన లక్ష్యలక్షణగ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోఁ జిరకాలము సాహవాసము చేసియుంట వారిపాండిత్యము మాకనుభవసిద్ధము." ఇది చూచి వీరి శైష్యోపాధ్యాయిక తెలిసికొన వచ్చును.

ఆచార్యుల వారు పండితోత్తముఁడు సజ్జనాగ్రేసరుఁడునగు తమ తండ్రిగారికడ విద్యాభ్యాసము చేసిరి. కవితారసధార యథోచితముగఁ బసినాఁటనే కలిగినది. అప్పుడు బాలవయోవస్థాకాల వాసస్థానమైన నాగపట్టణములో నున్న సౌందర్యరాజ స్వామిపై శబ్దాలంకారభరితమైన శతక మొకటి రచించిరి. ఈశతకము శతకకవిచరిత్ర కారులకు దొరకినది. కవిత ప్రాథమికమైనను నిటులు మాధురీభరితముగ నున్నది.

హారకోల నామకరదా
    కరదాసితగాత్ర భక్తజనహితవరదా !
వరదామరుచిర సురదా
    సురదాస్య మహిత సుశాబ్జ మందరరాజా !

మలయజ శిశిర తనురుచిర
జలరుహదళ సదృశనయన జలనిధిశయనా!
కలరవ కలిత కటకయుగ
సులలిత మృదుపద పయోజ! సుందరరాజా!

ఇది వ్రాయునాటికి కవి యీడు ఇరువది రెండేండ్లు. అప్పటికే జిన్నసాహితియుం గవితాధోరణియుంగల యాచార్యులుగారు, ఇంక నిచట కూపమండూకమువలె నుండరాదని సమీపమునంగల మదరాసునకు వచ్చెను. వచ్చి యానాఁడు చెన్నపురిలో మంచి వ్యుత్పన్నుఁడై, ప్రామాణికుఁడైయున్న పరవస్తు చిన్నయసూరిని జేరి యతనితో ననేకవిషయములు చదివెను. సూరి రాజధానీకళాశాలలోఁ బ్రధాన పండితుఁడు. పురాణము హయగ్రీవశాస్త్రిగారు రెండవపండితులు. ఈయిర్వుర సాహచర్యము సీతారామాచార్యులుగారికి విద్యాసంగ్రహణమునఁ జాల నుపకరించినది. 'శబ్దరత్నాకర' నిఘంటురచనాబీజ మాచార్యులవారి హృదయకేదారమునఁ బడినది యీసమయమే. సూరి యహోరాత్రము లదేపనిగా విశ్వనిఘంటురచనోపయోగి పరికర సంగ్రహణ మొనరించుచున్న సమయమది. పాపము! అతనితలఁచినపని పూర్తికాకుండఁగనే 1862 మ్రింగివైచినది. సూరి తత్సమపదముల కర్థము వ్రాయవలయునని తలపెట్టలేదు. మన యాచార్యులుగారు తత్సమ పదములుచేర్చి, సూరినిఘంటువు నాదర్శముగాఁదీసికొని సర్వప్రశస్తముగా "శబ్దరత్నాకరము" నావిష్కరించిరి. సూరి గతించిన 1862 లో నారంభమై యించుమించు ఇరువదిమూఁడేండ్ల వఱకు సాగి 1885 లో నీనిఘంటువు బయటికివచ్చినదని చరిత్రజిజ్ఞాసువులకుఁ దెలివిడి. శబ్ద రత్నాకరరచన సాగుచున్నకాలముననే యాచార్యులవా రనేకకృతులు వ్రాసిరి. నిఘంటునిర్విఘ్నపరిసమాప్తికి 'వినాయక శతకము', రచించిరి. దానిలోని పద్యములం సొగసుగా నున్నవి.

వంకర తొండము చేటల
పోంకము గలచెవులు పెద్దపొట్టయుఁ దగ ని

ర్వంకల వందులు వ్రాగడఁగ
బింకముతోఁ జాల్తువయ్య వేర్వెనకయ్యా!
తల్లిని పరిగొన భక్తుల
కుల్లాసము పుట్టఁజేసి యురు మదధారల్
వెల్లిగొన సొంపుమూను
బల్లిదు నినుఁ గొల్తునయ్య భవు పెనకయ్యా!

పాఠశాలలకుఁ బనిచేయు విభక్తిదీపిక, బాలచంద్రోదయము, అలఘు కౌముది, ప్రాకృతదీపిక మున్నగు చిన్నపుస్తకములుకూర్చిరి.

ఇవియెల్ల నటుండఁ, శబ్దరత్నాకరముతరువాత నాచార్యులవారికీర్తిని ధ్రువముచేయుగ్రంథము ప్రౌఢవ్యాకరణము. నిఘంటురచనాకాలమున భారతాదిగ్రంథ పరిశోధనమువలనఁ గలిగినఫలమే ప్రౌఢవ్యాకరణము. సూరి బాలవ్యాకరణమునకు శేషగ్రంథమగుట దీనికిఁ ద్రిలింగలక్షణశేష మని పేరుంచిరి. సూరివలె నాచార్యులుగారికి సూత్రపఱచుటలోఁ బొందిక కుదురలేదనవలయును. ఆచార్యులుగారు వ్రాసికొనినట్లు, ఇందలి లక్షణము లసాధారణములనియు నియ్యది విద్యార్థుల కత్యంతోపకారక మనియు ననుటలో సందేహములేదు.

క్షేత్రయ్య సీతారామాచార్యులుగారి దృష్టిలోఁ బరమ ప్రామాణికుఁడు. క్షేత్రయపదములు వేశ్యలభినయించునపుడువీరు చెవులు కోసికొను వారఁట. అభినయాభిరుచియాచార్యులుగారికిఁ బెద్దదని పెద్దలవలనవినుట.

వీరు చెన్నపురిలోని బోధనాభ్యసన పాఠశాలలో ద్వితీయపండితులుగా 1864 లో మొట్టమొదటఁ బ్రవేశించిరి. అక్కడినుండి రెండేండ్లకు ప్రథమపండితస్థాన మాక్రమించి యావజ్జీవ మచటనే గడపి చెన్నపురిలో నాఁడుద్యోగించెడి కొక్కొండ వెంకటరత్నశర్మ, వదలువాడ సీతారామశాస్త్రి మున్నగువారితోపాటు సీతారామాచార్యులవారు నొక పండితస్థానము నాక్రమించిరి. శబ్దరత్నాకరము వదలువాడ సీతారామశాస్త్రిగారే సంధానింపఁగా, వారితరువాత సీతారామాచార్యులు తమ పేర దాని నించించుకమార్పులుచేసి ప్రకటించుకొని రని నమ్మఁజాలని ప్రతీతి.

# ఆదిభట్ల నారాయణదాసకవి

## 1864-1945

పేరూరు ద్రావిడ శాఖీయ బ్రాహ్మణుఁడు. భారద్వాజస గోత్రుఁడు. తల్లి: లక్ష్మీ నరసమాంబ. తండ్రి: వేంకటచయనులు. జన్మస్థానము : అజ్జాడ గ్రామము. నివాసము : విజయనగరము. పుట్టుక : 1864 ఆగష్టు 31 వ తేదీ. నిర్యాణము: 1945 జనవరి 3 వ తేదీ. ముద్రిత గ్రంథములు: హరికథలు:— ౧. జానకీశపథము ౨. రుక్మిణీకల్యాణము 3. అంబరీష చరిత్రము ౪. హరిశ్చంద్రోపాఖ్యానము ౫. భీష్మచరిత్రము ౬. గజేంద్రమోక్షము ౭. మార్కండేయోపాఖ్యానము ౮. ప్రహ్లాద చరిత్రము ౯. సావిత్రీచరిత్రము ౧౦. ధ్రువోపాఖ్యానము ౧౧. యథార్థ రామాయణము ౧౨. భగవద్గీత [వేల్పుమాట]
శతకములు:— ౧౩. రామశతకము ౧౪. శివశతకము ౧౫. ముకుందశతకము. ౧౬. మృత్యుంజయ శతకము ౧౭. సూర్యనారాయణ శతకము ౧౮. సత్యవ్రత శతకము ౧౯. నూరుగంటి ౨౦. వేల్పువంద ౨౧. బాటసారి [కావ్యము] ౨౨. నవరస తరంగిణి [షేక్సుపియర్, కాళిదాసకవుల కవిత్వపు సొగసులు వివుర్చించునది] ౨౩. పురుషార్థ బోధిని ౨౪. ఉమర్ ఖయామ్ [పారశీకకృతికి సంస్కృతాంధ్రములలో పరివర్తనము] ౨౫. ఋక్సంగ్రహము [తెనుఁగులో సంగీత కృతి] ౨౬. వెన్నుని వేలుపేరుల వెనుకరి [విష్ణుసహస్రనామసంకీర్తనము నకుఁ దెలుఁగుసేఁత] సంస్కృతభాషలో:— ౧. కాశీశతకము ౨. రామచంద్రశతకము3. శ్రీకృష్ణకథామృతము [సంస్కృతభాషలో హరిగాథ] ౪. తారకమ్ (కావ్యము)

ప్రఖ్యాతపురుషుల జాతకములు బహువిచిత్రముగ నుండును. సాధారణముగఁ జిన్ననాఁటఁ బడరానిపాట్లు పడినవారు పెద్దతనమున విడుపు లేని విభవము ననుభవించుట చూచుచున్నాము. విశ్వఖ్యాతి నార్జించిన నేఁటి దేశనాయకుల, నేఁటి మహాకవుల, నేఁటియుత్తమపురుషుల జీవిత చరిత్రములు చదివికొన్నచో మన కీవిషయము విస్పష్టమగును.

ఆదిభట్ల నారాయణదాసుగారి నెఱుఁగనివారు తెనుఁగువారిలో నుండరు. ఆయన హరికథాకథనమున నాద్యబ్రహ్మ. సంస్కృతములో, ఆంధ్రములో, ఆంగ్లములో నాయన యందె వేసిన చేయి. ఎన్నో భాషలయం దద్భుతముగాఁ గవిత చెప్పెను. ఎన్నో భాషలయం దసన్య సామాన్యముగా హరికథలు పాడెను. ఆంధ్ర దేశీయులేగాక, యన్య దేశస్థు లెందరో నారాయణదాసుగారిని బ్రహ్మరథము పట్టిరి. అట్టి మహాశయుని చిననాఁటి మనుగడను గూర్చి యాలోచించినచో నే డాశ్చర్యపడుదుము. దాసుగారిది సిరిగలకుటుంబము గాదు. తండ్రి వేంకట చయనులుగారు శ్రౌతస్మార్తములు దిట్టముగా వచ్చిన లబ్ధవర్ణులు. ఆయనకుఁ గల నైదుగురు పుత్రసంతానములోను కడపటివాఁడు నారాయణదాసు. పై నలువురు సోదరులు నేదోరకముగా విద్యావంతులై ప్రయోజకు లయిరి. కడకు, కడపటి సంతతి ప్రయోజకతనుగూర్చి తల్లికి వెఱపు. పసినాఁటనే తండ్రి నెడఁబాసిన కొడుకును తల్లిగారు లక్ష్మీ నరసమాంబ బుజ్జగించి యుగ్గుఁబాలతో భాగవతతత్త్వమును బోధించినది. ఒకముచ్చట చెప్పుకొందురు. 'గుంప' యను శివక్షేత్రమున శివరాత్రికి గొప్పతీర్థముజరుగును. ఆతీర్థమునకుఁ దల్లితో నారాయణదాసు ప్రయాణమాయెను. బండి యెక్కి తల్లీ కొడుకులు వచ్చుచుండఁగాఁ బుస్తకములమ్ము నంగడి పసిదాసు కంటఁబడెను. ఆ దుకాణములో పోతనగారి భాగవతము బొమ్మలతో నున్న ప్రాఁతప్రతి యుండెను. అదిచూచుసరికి నారాయణదాసు తనయొడలు గగుర్పొడువ, వెంటనే బండియుఱికి సాహుకారునొద్దకుఁబోయి యా భాగవత మర్థించెను. ఆ సాహుకారిపేరు దాసుగారి చరిత్రములో బంగారునీట వ్రాయఁదగ్గ "రంగయ్య" యని అతఁడు "పసివాడికి నీకు భాగవత మేలనయ్యా" అని వెటకారముచేయుట తల్లి బండిలోనుండి విని, "కాదు, వాఁడు చదువుకొందమని యభిలాషతో నడిగ

నోయీ" యని సమాధానము చెప్పెను. వర్తకుఁడు భాగవతము తీసి బాలనారాయణదాసును పఠింపుమనెను. అతఁడు గణగణ తడవుకొనకుండ రాగధోరణిలోఁ జదివెను. ఇటులే మఱొకఘట్టము, మఱొకఘట్టముగా సాహుకారు పిల్లవానిచేఁ జదివించి విని బ్రహ్మానందపడి, భాగవతపు ప్రతియేకాక మరియొక నైదురూపాయ లుపాయనముగాఁగూడ వానిచేతిలోఁ బెట్టెనఁట. ఆ బేహారి 'రంగయ్య' పేరు వేఱొకతూరి స్మరించుకొందము. పసినాఁట మాతృోపదేశము, భాగవతసందేశము గుండియలకుఁ బట్టించుకొనియే నారాయణదాసు క్రమముగా కళాప్రపూర్ణుఁడై వాసికెక్కినాఁడు.

దాసుగారికి సహజముగ నాటపాటలయందు మేటి యాసక్తి మొసులెత్తినది. అయిదాఱేండ్లయీడుననే కళాబీజములు పొటమరించినవి. విజయనగరమహారాజాగారి రాజకీయాంగ్లపాఠశాలలో నాంగ్ల విద్యాభ్యాసమునకు విఘ్నేశ్వరపూజ జరిగినది. ఆనాఁటికి వీరివయస్సు పదునాఱు సంవత్సరములు. 1886 లో 'మెట్రిక్యులేషన్' పరీక్షయందు నెగ్గి ఎఫ్. ఏ. విశాఖపట్టణము ఏ. వి. యన్ కళాశాలలోఁ జదువుకు మొదలిడిరి. 1888 సం॥ ఎఫ్. ఏ పరీక్ష వీరిని తప్పించినది. అంతతో దానికి స్వస్తి. నిర్బంధపఠనము వదలిన పిదప ఆంగ్లములో నెన్నో మెలఁకువలు, మెలఁగులు గుర్తించుటయేగాక పారసీకము, అరబ్బీ, ఉర్దూ, సంస్కృతము చదివి తనపాండితికొక క్రొత్త వన్నె తెచ్చుకొనెను.

తొలుతనే ముచ్చటించవలసిన విషయమొకటి యిపుడుజ్ఞప్తికి వచ్చుచున్నది. అసలు, తలిదండ్రులిడిన నామకరణము వీరికి 'సూర్యనారాయణ' యని. "నారాయణదాసు" అనుటయేకాని యాపేరు చాలమంది యెఱుఁగరు. వారిబంధుకోటిలో మాత్రము 'సూరన్న' యని పిలుచుట వాడుక. 'దాసు' అనునుత్తరపదముతోఁగూడిన వ్యవహారము 1886 సం॥ నుండి తెలుఁగునేలలో మంచి ప్రచారములోనికి వచ్చినది. నారాయణదాసుగారికి 'హరికథా' కల్పవృక్షమునకుఁ బ్రాకుడుగొమ్మ

వైన జయంతి కామేశము గారిని తలపోసికొనవలసియున్నది. ఆయన బరంపురము నివాసి. దాసుగారి తొట్టతొలిహరికథకు సన్నాహముచేసి, ప్రోత్సహించిన మహోదారుండాయన. అదిగాక, మైసూరు సంస్థానములోనే కాక, పిఠాపురము, ఉర్లాము, చీకటికోట, కిర్లమపూడి, మందసా, సిరిపురము, లక్ష్మీనరసాపురము, సంగడిగూడెము, నూజవీడు, వేంకటగిరి మున్నగా నెన్నో దేశసంస్థానములలో వీరి కథకు సత్కృతులు జరిగినవి. మైసూరు సంస్థానమునకు వీరువెళ్ళినప్పటి ముచ్చట చెప్పవలసియున్నది. నారాయణదాసుగారి అన్నగారు సంగీతజ్ఞులు ఈయన యభివృద్ధికిఁ గొంతకారణ మాయన్నగారేయని కొందరు చెప్పుకొందురు. ఆయన గాత్రము సన్నవిడిది. నారాయణదాసుగారిది చెప్పనక్కరలేదు. బ్రహ్మాండమంతగొంతు. తమ్మునివెనుక నన్నగారు సహకారగానముచేయుచుండు నలవాటు. మైసూరు వీరిరువురును వెళ్ళిరి. సంస్థాన విద్వాంసుల పరీక్షల కాఁగినఁగాని ప్రభుదర్శనముకాదు. మొత్తముమీఁదఁ బెక్కునాళ్ళకు దివాణములోని గాయకులు వీరిపాట వినుట కేర్పాటు చేసిరి. కొమ్ములుతిరిగిన పండితులు కూర్చుండి, నారాయణదాసుగారిని వీణవాయించుటకును, వారియన్నగారిని పాటపాడుటకును నియమించిరి. ఇది బొత్తిగా రక్తికట్టలేదు. అపుడు దాసుగారు "తానుపాడెదనని, అన్నగారు వీణవాయించు" నని చెప్పి గొంతెత్తెను. ఇంక బట్టబగ్గములులేవు. కొంతదూరములోఁ బచారు చేయుచున్న మహారాజు చెవిలో నమృతవర్తి వలె నారాయణదాసుగారి కంఠస్వరము సోఁకఁబడినది. ఆశ్చర్యపడి, ఆయన తిన్నగావచ్చి స్వయముగా దాసుగారి విషయమడిగి తెలిసికొని యభినందించి బహుమానించెను. అది దాసుగారికి మైసూరుగాయకుల యెదుట, పండితుల యెదుట నొక జయధ్వజ ప్రతిష్ఠ. మైసూరు వృత్తాంతము పత్రికలలోఁ జదివి విజయనగరము మహారాజు ఆనందగజపతి నారాయణదాసును గుర్తించి, కానిపించుకొని సంస్థాన విద్వాంసునిగాఁ జేసెను.

ఈయనకు మహాకవిగా రావలసినపేరు హరికథకుఁడుగా వచ్చినది. హరికథా కథనములో వీరికిఁ జెప్పఁదగిన శిష్యులు నేతిలక్ష్మీనారాయణ, వాజపేయయాజుల సుబ్బయ్య, చొప్పల్లి సూర్యనారాయణ మున్నగాఁ జెక్కురున్నారు, వారెల్ల గురువుల స్మరణకుఁ దెచ్చు హరికథాకేసరులు. నారాయణదాసుగారు ఆడువారు మగవారు కలిసి గజ్జెకట్టు మరాఠీ హరికథా విధానమును మార్చి మనదేశపద్ధతిలోఁ గ్రొత్తమెఱుఁగులు కలిగించినారు. ఆయన త్యాగరాజువంటి భక్తుఁడు. సరిగా, త్యాగరాజు జయంతి నాఁడే దాసుగారు పరమపదము చేరుట మరచిపోరాని ఘట్టము. అదియటుండ, ఈయన జీవితము తిరుపతి వేంకటకవులజీవితముతోఁ గొంత పోలియుండుట మనము గమనింతుము. కవిత్వముపేరు చెప్పుకొని వారు ప్రతిసంస్థానము, ప్రతిగ్రామము చూచినారు. హరికథల పేరుచెప్పుకొని నారాయణదాసు చూడని సంస్థానము, చూడని పురములేదు. చెళ్ళపిల్ల వేంకటశాస్త్రిగారికి నేడు కవిత్వము చెప్పువాఁడెల్ల శిష్యుఁడు. నారాయణదాసుగారికి నేఁడు గజ్జె కట్టినవాఁడెల్ల శిష్యుఁడు. ఈయిరువురికి సాక్షాచ్ఛిష్యులో, పరంపరా శిష్యులో, ఏకలవ్య శిష్యులో కానివారు తెనుఁగువారిలో నెందఱుందురు? చెళ్ళపిళ్లకవిని స్మరింపక శతావధానము, నారాయణదాసును స్మరింపక హరికథ లేదన్నట్లుగా నున్నది. నారాయణదాసు పండితులలోఁ బండితుఁడు, కవులలోఁ గవి. గాయకులలో గాయకుఁడు. ఆయన నేఁటిసాధారణదాసులవలె మాటలు, పాటలు నోటఁబట్టుకొని చెప్ప వలసిన ప్రారబ్ధయోగము కలవాఁడు గాఁడు. ఆశువులో నప్పటి కప్పుడు చెప్పుటయే యీయన యలవాటు. పరవాదులతో భాషించు నపుడు, అంత నిర్భీతి, అంత స్వపక్షస్థాపనప్రీతి కలవారరుదుగానుందురు. నారాయణదాసు జీవితము మదవుటేనుఁగు మనుగడ. ఆ భోగ త్యాగ ములు వేఱొకనికి సాగుట కష్టము.

చెప్పనలవిగాకయున్నా లేనిపోని వాలకములఁ దాము వలచిన కూడు గూర్చు, లు దనతోటిపాటివారి నందఱిం జెఱచియున్నాననొక్కఁడే హాయిగానుండఁగోరి పెద్దల నడువడికిఁగసింతయు స్వదారి ద్రొక్కమని గోటునఁ దెగనీల్గుచుఁ బ్రాఁజదువులఁ బిక్కపెట్టి గ్రుడ్డెద్దు చేలఁబడునట్లు అంవ్వీ రోలుచు లోలోనఁ జెడుపను లెన్నెన్నో చేయునాలిముచ్చు వాగరుఁబోతుఁబరువు బయలుపెట్టి తనతోటిపాటివానికి మంచువెరవు నేర్పుటయే యుఁ. నాచేత వెల్లడింపించు నాయిలు నేల్పు ప్రొద్దు న్గోని యాడుచు నువరు కయ్యాలము పద్దియపేన్నలోని విపరముగా నాయల్లిన యీ నెలుఁగుపద్దెముల న్నెల్లునుడి కొలినంతయును లేని నాటు పాటి మాటలతోడనే యిదివఱకే మాటలల్లువాగు న్గూర్పఁ దొరకొనఁ దెగింపని పట్టుదల న్గొంటి పెద్దలు నుడివడికట్లొక్కంతయు న్దప్పకేరికైన నిట్టే పారసి నుడుల వివరించు నాటుమాటలం బన్నని నలవిగాని తెన్నునఁ గూర్పఁ గల్గితినని చాటుచు మఱియు మొట్టమొదట వెగటుగాఁ దోఁచిన దిను సైనసం జవి చూచినకొలంది నలవాటునై నింపుగాక మానదు నోర్మిగల మంచి చదువరుల కీ నాపన్నిక కొనచుట్టు నా రసికొలంది జవిగొల్పిక తీరదను నిండునమ్మిక నింతతో నీనాప్రిత ముగించి నాఁడను......"

అచ్చతెనుఁగు రచన యింతస్వాధీనము చేసికొన, రచయితలు చాలఁ దక్కువగా నుందురు. వచనముకాక పద్యము కూడ హాయిగా సొయగ గా నడపించునేర్పు నారాయణదాసుగారితోఁ బుట్టినది 'ఉమరు ఖైయాము' లోనివే కొన్ని సంస్కృతాంధ్ర పద్యోదాహరణము లీయకుండ నుండఁగూడదు.

గీ. నడికారునకు జ్జేలకు
నడుమ నలరు తోటలోన నా విడిదట సం
దడి లేదు కొద్దిగొప్పల
గొడవ మఱి బ్రదుకు కోరుకొన్నటు కడచున్.

ఆ.వె. పట్టనీ పోటులు చట్టి స్వేదము రోట్టె
కోలుబుడ్డిలాలు కోఫుమడ్డి
నేను నీవు చాటుగా నసిసిన వేడ్క
దొరకుచుట్టు లెట్టిదొరలకైన.

చ. ఏటిరెయొద్దునఁ జివురుగత్తెస బీడు
వేలుపువడుచు మోవిన్నట్టె ననదు
త్రొక్కఁ గూడదు కాలికో నిద్దిచెల్వ
చిన్నారి పొన్నారి చెక్కిలిగ్గు.

క. ఏరు న్నారన నేరక
యూరక యున్నార లెవ్వరో పల్కు నిటా
రారా దూరకుఁడీటా
నారయ కావేల్పు గూడనై పానరించున్.

శ్లో. భూతకాలః పరోక్షో౽స్తి, భావికార్య మనిశ్చితమ్
వృథా గతా నాగతయో శ్చర్చా పిబ పిబా పిబ
అనంబద్ధ శ్చేతనో౽యం జడప్రకృతికో నతః
స్వతంత్రస్య తథాప్యస్య వృథాకర్మ విధీయతే.
యావత్పిత్రు గృహం గచ్ఛే త్త్వం శనైః ప్రాణవల్లభే
తావ దేవాను సృత్యాత్వాం సాయుజ్య పదవీ మియామ్.

ఈతీరుగల సంస్కృతాంధ్ర కవితలు సంతరించు నారాయణదాసు మహారచయితలలో రచయిత. ఏది "తారక" కావ్యము, పరికించి Gildner అను ప్రొఫెసరు Marburg నుండి పంపిన యీ యభిప్రాయము ప్రకటింపఁదగియున్నది.

జానాతే యన్న చంద్రార్కౌ జానతే యన్న యోగినః
జానీతే యన్న భర్గో౽పి తజ్జానాతి కవి స్స్వయమ్.
వచ స్సుధామయం కావ్యం పీత్వాహం తృప్తమానసః
కృతజ్ఞో౽భిప్రశంసామి భవంతం కవిశేఖరమ్.

దేశీయ స్వదేశీయ పండితులచే మెప్పులుగాంచిన నారాయణదాసు కవిత్వము తెనుఁగువాఙ్మయమున కొక మేలివెలుఁగు. ఆయన యాట పాటల వేవెలుఁగునెదుట కొన్నాళ్ళు కవిత్వము కాఁగడావలెఁ గాంతి హీనముగా నుండిపోయినది. ఇపు డది విద్యుద్దీపిక. ఆధునికకాలములో నచ్చ తెనుఁగున కొక యుజ్జ్వలతనిచ్చు రచనకు నారాయణదాసుని యమృతభిక్ష. ఆసుహాకవి సర్వభాషాప్రవేశమున కీసీసము సముదాహరణము.

—: పీ ఠి కా పు ర వ ర్ణ న ము :—

సంస్కృతము

భ్రాజతే కుక్కుటేశ్వర మాధవాలయాభ్యాం ఘనాఽఽఢసౌధాంతరేణ

పార్శి

హాసిల్ హమీష జవాన్ తాజ్ నమూన బి హిమ్మత్తుస్సా పిర్బి హి రిసాల

ఇంగ్లీషు

రావునార్యారావు రాజాబహాదుర్ది చారిటబ్రులాల్సొప్రిజెఁట్స ఎరెద్రి

తెలుఁగు

చదువుల పుట్టిల్లు చల్వ తెమ్మెరజల్లు మేల్కొల్లు పొగడిక మీఁరజెల్లు
మేటిపంటల టెంకి కల్మి మొదలంకి
శిష్టులా ని గ్గోదావరీ యీస్ట్ ది సీజె
మర్ద్య పీర్వ జవాన్ జవాల్ మీర్జనాన
పీఠికాపుర మేవ త్రివిష్టప మిహ.

# కందుకూరి వీరేశలింగకవి

## 1848-1919

ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడు. జన్మస్థానము: రాజమహేంద్రవరము. తల్లి పున్నమాంబ. తండ్రి సుబ్బారాయుఁడు. జననము: 16-4-1848. నిర్యాణము: 27-5-1919. వీరిరచిత గ్రంథములసంఖ్య 130-ప్రబోధచంద్రోదయము, మాలతీమాధవము, మాళవికాగ్నిమిత్రము, అభిజ్ఞానశాకుంతలము, రత్నావళి, హరిశ్చంద్రనాటకము, సత్యరాజ పూర్వదేశయాత్రలు, విసుగునర్తకుని చరిత్ర, రాగమంజరి, రాజశేఖరచరిత్ర, నీతిచంద్రిక, ఆంధ్రకవుల చరిత్రము, స్త్రీల చరిత్రము ప్రహసనములు మొత్తము 58. ఇత్యాదులు. విపులచరిత్రమునకు వీరి స్వీయచరిత్ర (2 భాగములు) చదువుకొనవలయును.

వీరేశలింగంగారు తెలుఁగు వాఙ్మయమునఁ దొల్లి త్రొక్కని క్రొత్తదారు లన్నియుఁ ద్రొక్కి యాధునికాంధ్రవాఙ్మయమునకు మార్గదర్శి యనిపించుకొనినకవి. ఆయన రచించిన గ్రంథములు నూటయిరువదికిఁ బైగా నున్నవి. 'అయిగవవాచకము' మొదలుకొని 'ఆంధ్ర కవుల చరిత్ర' వఱకు వ్రాసినారు. నవలలకు దారిచూపినారు. నాటకములు రచించినారు. కథలల్లినారు. వ్యాసములు వెలువరించినారు. ప్రహసనములు ప్రకటించినారు. గ్రంథవిమర్శలు సంధానించినారు. శాస్త్రగ్రంథములు సంతరించినారు. చారిత్రక కృతులు ప్రచురించినారు. వార్తాపత్రికలు సంపాదించినారు. విశేషమేమనఁగా నీ సారస్వతశాఖలకుఁ గొన్నిటికిఁ ద్రోవచూపినవారు, కొన్నిటికి రాచబాట వేసినవారు నైరి.

పందొమ్మిదవశతాబ్ది శేషార్ధమునుండి తెలుఁగున నొక క్రొత్తయుగ మారంభమైనది. దానికి గద్యయుగ మని సాధారణముఁ పేరు పెట్ట వచ్చును. అంతకుఁ బూర్వము వచనగ్రంథములు మిక్కిలి తక్కువ. చంపూపద్ధతిని పురాణములలో నక్కడక్కడ వచన ముపయోగింపఁబడి నది. ప్రబంధములలో వర్ణనము ఛందోనిష్పందము లేనిపద్యములవలె

నడపించిరి. ఇంతియేకాని ఇతిశ్రీ గా గద్యము గల గ్రంథములు 17 వ శతాబ్దిలో మధురా పరిపాలకుడైన విజయరంగ చొక్కనాథుని కాలమునుండి కాని బయలుదేఱలేదు. మధురాంధ్ర వాఙ్మయములోఁ బుట్టిన వచనరచన లన్నియు పౌరాణిక గాథాగ్రథితములు. పోనీ, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయనాటకమును నంది మల్లయ్య, ఘంట సింగన కవులు ప్రబంధముగా మార్చిరిగాని నాటకము నాటకముగా నాంధ్రీకరింపలేదు. 'విద్ధసాల భంజిక'ను మంచనకవి 'కేయూరబాహు చరిత్ర' కావ్యముగా మార్చెను. ప్రాచీనాంధ్రకవులకు వచనములపై గల యుపేక్షాభావమున కిది నిదర్శనము. క్రొత్త తీరుగల చిన్నయసూరి 'నీతిచంద్రిక' తెలుఁగున మొట్టమొదటి వచనగ్రంథము. చిన్నయసూరి వేసిన వచన వాఙ్మయబీజమును వీరేశలింగము పంతులుగారు మొలపించి వెలయజేసిరి. వీరేశలింగముగారి రాజశేఖరచరిత్రము గోపాలకృష్ణను సెట్టి "రంగరాజచరిత్ర" తోఁ బోలికలు గలవని యొకరు చూపించిరి. అగుఁగాక! తిక్కన కవిబ్రహ్మ యనునట్లు పంతులుగారు గద్యబ్రహ్మ. సూరి నీతిచంద్రిక తరువాత సుప్రసన్న భాషలో వీరేశలింగముగారు సంధివిగ్రహములు వ్రాసిరి. వీరిశైలి సుమధురము సులభమునై సర్వజనగ్రాహ్యముగా నుండును. సంధులచ్చు టచ్చుట సడలించినను రచనలో మాధుర్యము మాత్రము తొలఁగించలేదు. అన్యదేశ్యములు కొన్ని యుపయోగించినను నందము చెఱుపలేదు. ప్రజాసామాన్యమున కర్థము కావలయుననియు సంఘసంస్కార ప్రచారార్థమనియు వీరిశైలి తేలికపఱుచుకొనిరి. వీరి రాజశేఖరచరిత్రము, సత్యరాజా పూర్వదేశయాత్రలు ఆంగ్లేయరచనలకు ఛాయలైనను స్వతంత్ర రచనములవలె నుండి నవలలకు దారిచూపినవి. వీరేశలింగము పంతులుగారు వచనములో నొకవిలక్షణత వెలయించిరి.

ఇఁక నాటకముల మాట యోచించినచో నివి యింతకుఁ బూర్వము తెలుఁగున లేవు. యక్షగానములుమాత్ర మున్నవి. కాళిదాసకృత

శాకుంతలము పంతులుగారు రసువదించి 1883 లో నావిష్కరించిరి. అది మొదలు వేదము వేంకటరాయశాస్త్రి ప్రభృతులు పదిమందివఱకు నా నాటక మొకరిశక్తికొలఁది నాంధ్రీకరించికొనిరి. వీరేశలింగముగారి ఆంధ్రశాకుంతలము రంగస్థలములకెక్కి యనేకులచే సభినందింపఁ బడినది.

చల్లనివై శ్రమం బడఁపఁజాలిన తామరపాకు వీవసల్
మెల్లన గొంచు వీచుదునొ మిక్కిలిశీతలమైన వాయువుల్
సల్లలితారుణాబ్జ సదృశంబగు నీచరణద్వయంబు నో
పల్లవపాణి! నాతొడలపై నిడి హాయిగఁ బట్టువాఁడనో!
కొండలమం దెడెందము శకుంతల కానిపు జేఁగునం చఁటూ
క్రందుగ బాష్పరోధమునఁ గంఠముముంచెడె, దృష్టిమాంద్యముం
బొందెడె నాకింతపెంచిన తపోధనులే యిటుకుంద నెంతగాఁ
గుందుదురో తమంతఁ గనఁబూఁతులఁ బాయు గృహస్థులక్కటా!

ఇత్యాదిపద్యములు తెలుఁగున మఱుఁ బ్రాసినవి. శాకుంతలముగాక ప్రబోధచంద్రోదయము, మాళవికాగ్నిమిత్రము, రత్నావళి మున్నగు నాటకము లాంధ్రీకరించిరి. ఆంగ్లేయనాటకములఁ బట్టి చమత్కార రత్నావళి, కల్యాణకల్పవల్లి, రాగమంజరి అను వానిని రచించిరి. ప్రహ్లాద దక్షిణగోగ్రహణాది పురాణనాటకములు వ్రాసిరి.

పంతులుగారు కృతికర్తలే కాక, ప్రాచీనమహాగ్రంథముల నెన్నిటినో ముద్రింపించిన భాషాపోషకులుకూడను. నాచనసోమనాథుని యుత్తర హరివంశము, అనంతుని భోజరాజీయము, చరిగొండధర్మన చిత్రభారతము, నందిమల్లయ, ఘంట సింగయకవుల వరాహపురాణము, నారాయణకవి పంచతంత్రము, శాకమూరి మూర్తి పాంచాలీ పరిణయము, మొల్లరామాయణము మున్నగు కబ్బములకు వీరేశలింగముపంతులు గారే తొలుత నచ్చు వెలుఁగు చూపి పున్నెము గట్టుకొనిరి.

వీరేశలింగముగారికిఁ దొల్లి తెలుఁగులో బ్రహసనములులేవు. 'చంద్రరేఖావిలాపము' వంటి తిట్టుకవితలు మాత్రము గలవు. సంస్కృతమునఁ

జాలనున్నవి. ప్రహసననిర్మాతలలో పంతులుగారే ప్రథములు. "ఆచారము" అను ప్రహసనములో చేదస్తపుచెలమమ్మమాటలు కొన్నిమచ్చు:

"నీవు అదృష్టవంతురాలవు గనుక వొక్కమోస్తరుగా ఆచారం జరుపుకుంటున్నావు. నాకు నీలాగు జరుగదు అక్కడికి నేను రోజుకు రెండు వందలస్నానాలు చేస్తాను. ఈవేళ మట్టుకు ఇప్పటికి పదిస్నానాలు చేసినాను. తెల్లవారిలేచి దొడ్లోకి వెళ్ళినప్పుడు కాలికింద యేమో మెత్తగా తగిలి అది యేమిగుడ్డో అని తలనిండా స్నానముచేసినాను. తరువాత మాకోడలు దగ్గరనుంచి వెళ్ళినప్పుడు పైటకొంగు తగిలినట్టుఅనుమానం కలిగి మళ్ళీస్నానము చేసినాను. గోదావరికి వెళ్ళి స్నానముచేసి బిందె ఎత్తుకొని వస్తూ బట్టలు వుతుక్కునే వాళ్ళ నీళ్ళుపడ్డట్టుతోచి మళ్ళీవెళ్ళి మునిగినాను. తీరా వడ్డుకు వచ్చేటప్పుడు నీళ్ళలో కాలికేదో ఆకుతగిలి అంటతిప్పళాలు తోమవాళ్లు వేసిన అంటాకని నీళ్ళుపారపోసి వెళ్ళి మళ్ళీ స్నానం చేసినాను. తరువాత బిందెత్తుకొని సఘుందూరం వచ్చేటప్పటికి ఇరవైగజాలదూరంలో మాలవాడు కనబడి నీళ్ళు నడివీథిలో పారపోసి వాణ్ణినాలుగు తిట్టి వాడిజవాసికి కసూరుమంటూ మళ్ళీ వెనుకకు గోదావరికి వెళ్ళి స్నానముచేసి నీళ్ళు తెచ్చుకున్నాను ......... ఎన్నిస్నానాలయినవో లెక్కపెట్టినావా" ఈయన మొత్తము ౨౮ ప్రహసనములు కూర్చిరి. అందు పదునాల్గు పెద్దవి. వీరి ప్రహసనభాష సొగసుగానేయుండును. స్వాభావికత కొంతతక్కువ.

వీరు "తర్కసంగ్రహము" నకుఁ జక్కని తెనుఁగు వ్రాసిరి. జ్యోతిశ్శాస్త్రము—శారీరశాస్త్రము ననువదించిరి. ఆంగ్లేయభాషలోనుండు భౌతికశాస్త్రము లాంధ్రీకరించుత్రోవ పంతులుంగారే చూపిరనవచ్చును.

జీవితచరిత్రరచనమునకుఁ దెలుఁగున సూత్రము వేసినవారు వీరేశలింగముపంతులుగారే. వేమభూపాలీయ రఘునాథాభ్యుదయాదులు సంస్కృతములో వెలసినవి. వానిలోఁగవితకున్నంత ప్రాధాన్యము చరిత్ర

మునకు లేదు. ఆంధ్రమున రామరాజీయాదులు రెండుమూడు చారిత్రకకృతులు లున్నవి. ఇవియును ప్రాచీనే. ఆంగ్లసంప్రదాయము ననుసరించి వంతులుగారు తొలుత సక్రోటీసు మహాశాస్త్రజ్ఞ చరిత్రము, జీవనచరిత్రము తెలుగులో నెలకొల్పిరి. అక్కడినుండి యనేకజీవితచరిత్రలు చిత్రింపఁబడినవి. "స్వీయచరిత్ర" రచనారంభము చేసినవారు వీరే. ఇది 1910 లో వెలువరింపఁబడినది. పంతులుగారి చిన్నతనమునుండియుఁ గలచరిత్రము సమగ్రముగా వ్రాయఁబడినది. స్వాత్మశ్లాఘనములుకూడ విస్మరింపక వీరీచరిత్రము సంధానించిరి. ఇది వీరిమేధాబలమునకు బలకరమగు నిదర్శనము. ఈచరిత్రము చదువునప్పుడు సమకాలికులకు నాత్మస్తుతిగాను పరనిందగాను నున్నట్లు కొన్నిపట్టుల గోచరించును. ఈ విషయమే పంతులుగారు తొలుతఁ జెప్పుకొనిరి. ఈపంక్తు లరసిన వారి స్వరూపస్వభావాదులు తెలియును.

"ఎక్కడ నేయక్రమము కనఁబడినను నాది సహించి యుండెడి స్వభావముకాదు ఆయక్రమమునకుఁ బ్రతిక్రియఁ జూచునంతకును నా మనస్సున కూరట కలుగదు."

"ఈశ్వరుఁడు నాకు వేగముగా వ్రాయుశక్తిని బ్రసాదించియున్నాఁడు. పద్యమునుగాని, వచనమునుగాని నేనొకసారియే వ్రాయుచుందును. వ్రాసినదానిని మరలదిద్ది వ్రాయుట నాకలవాటులేదు. అందుచేత నా వ్రాఁత దిద్ది దిద్ది మరల మరల వ్రాయుచుండువారి దానివలె నంత మెఱుగుగా నుండదనుకొనెదను."

"ఏకసంథాద్విసంథాగ్రాహులకుండుబుద్ధివిశేషము కొంతకలవాఁడ నగుటచేత నేనింటనుండి పాఠశాలకుఁ బోవుచు నొకసారిగాని రెండుసారులో దారిలోఁ బాఠము చూచినంతమాత్రముననే నాకది ముఖస్థమై యప్పటికిఁ దప్పులేక యప్పగింపశక్తుఁడ నగుచుంటిని."

స్వయముగాఁ దమచరిత్రము తామే వ్రాసికొనుటచే నిప్పటిమాటలు స్వాహంకారపూరితములుగా స్థూలదృష్టికిఁ దట్టును. కాని, యథార్థ

మరసినచో వీరేశలింగకవి యట్టివాఁడే. అద్యతనాంధ్రవాఙ్మయములో ననేకనూతన మార్గములు వేసి శతాధికకృతులు రచియించి యఖండ కీర్తి నార్జించిన యీ కవివరుని యెడ పక్షసంధాగ్రాహిత్వాదిలక్షణము లుండుననుట స్వభావోక్తికి దవ్వుగానిమాట.

అచ్చతెనుఁగు కృతులు రచించుటలో వీరేశలింగకవిది గొప్పచాతుర్యము. ఈయన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధము ప్రసిద్ధమైనది. విశ్వేశ్వరీయములో కొక్కొండ వేంకటరత్నపండితుఁడు పంతులుగారి నిటులు కొండాడినాఁడు:

అచ్చతెనుఁగు కబ్బ మొనరించుట కూచి
మంచి తిమ్మనయును, మంచి తెలగ
నయును, లింగనయును నయమున స్వీయభా
షాభిమాన మాన్యు లని నంతింతు-

తిమ్మనార్యుఁడు, తెలగన్నలతోపాటు వీరేశలింగకవి కూడ అచ్చ తెనుఁగు కబ్బములు కూర్చుటలో దిట్ట.

ఇంకఁ గవిచరిత్రరచనము ప్రచురముచేసినవారును పంతులుగారే. శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారు ఆంగ్లేయుల ననుసరించి తొలుదొల్తఁ దెలుఁగున నాంధ్రకవిజీవితములు వ్రాసిరి. దానికిఁ బిమ్మట వీరేశలింగకవి గారు "ఆంధ్రకవులచరిత్రము" మూఁడుభాగములుగా వ్రాసిరి. శ్రీ రామమూర్తిగారి గ్రంథము కంటె నిది పెద్దగ్రంథము. దానికంటె దీనిలోఁ జారిత్రక చర్చ మిన్నగా నున్నది. కవికాలనిర్ణయాదులు లెస్సగ నిందుఁ గూర్చిరి. కవుల గ్రంథములలో గుణదోషవివరణము గావించిరి. ఈ గ్రంథము వీరేశలింగముగారి శక్తిసామర్థ్యములను జాలభాగము చూరఁ గొనినది. వీరు కొందఱు కవులనుగూర్చి వ్రాసిన కాలనిర్ణయాదులకు నవీను లంగీకరింపలేదు. ప్రథమ ప్రయత్నమున నిది యాక్షేపణీయము గాదు. పంతులుగారనంతముగ భాషాసేవచేసిన మహాశయులు. సంఘ

సంస్కారణప్రియులును. శ్రీ పునర్వివాహకరణోద్యమమునకుఁ బరిపుష్టి గావించిరి. ఈవిషయమున వీరు పెద్దప్రచారము గావించిరి. కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారికిని వీరికి బహుకాలము వివాద మీవిషయమున సాగినది. ఇది యాంధ్రులకుఁ బరిచితము.

వీరేశలింగముగారు పగలు సంస్కారణవిషయములలోఁ బనిచేసి రాత్రులు గ్రంథరచనము సాగించుచుండు నలవాటుకలవారు. వీరసగోగ పీడితులగుట రాత్రులు వీరికి నిద్రపట్టుడది కాదు. 'కాఫీవగనూన' యాహారప్రాయముగా నుపయోగించుకొనుచు గ్రంథరచన చేయుచుండువారు. ఈయనకలమునకు మొగమాటము యనునది కలలోనైన లేదు. సంఘాచారములకు వ్యతిరేకమై పెద్దలకుఁ బ్రతిష్ఠాభంగము కలిగించి యీయన వ్రాత యభియోగముల కెక్కినది. కాని యీయన సత్యవాదిత విడువలేదు. చివరికాలమున నపనిందలఁ బాలయ్యెను. చెలికాండ్ర సహవాసము వీడవలసివచ్చెను. ధనవ్యయము మయ్యెను. ఆరోగ్యము చెడెను. ఎన్ని క్లిష్టపరిస్థితులు తటస్థించినను కర్మశూరత్వము సత్యవాదిత్వము విడువలేదు. ఈయన వాఙ్మాధుర్యముకంటె వ్రాతనేర్పు గొప్పది. వీరేశలింగంపంతులువంటి దీక్షాపరుఁడు, కర్మశూరుఁడు, ధైర్యవంతుఁడు, కార్యదక్షుఁడు, స్వార్థత్యాగి, స్వతంత్రుఁడు ఆంధ్ర మహారచయితలలో లేఁడు. ఉండఁడు.

# త్రిపురాన తమ్మయదొర

## 1849 - 1890

తెలగావంశీయుఁడు. తల్లి: చిట్టమాంబ [చిట్టెమ్మ] తండ్రి : వేంకట స్వామిదొర. జన్మస్థానము, నివాసము : విశాఖమండలములో శ్రీకా కుళము తాలూకా సిద్ధాంతగ్రామము. జననము : 1849సం. సౌమ్య సంవత్సర శ్రావణశుద్ధ చతుర్దశి గురువారము. నిర్యాణము: 1890 సం. వికృతి సంవత్సర పుష్య శుద్ధ పూర్ణిమ. ముద్రితశతకములు: ౧. నీతిశత కము. ౨. పాండురంగాష్టోత్తరశతము. ౩. కామినీ నిర్మోహజనన తారా వళి. ౪. విటీవిట నటనార్థమాల. ౫. ముఖలింగేశ్వరశతకము. ౬. నిద్రా విజయము. ౭. శ్రీ దేవీ భాగవతమహాపురాణము (1883 విరచితము – అచ్చుపడలేదు.)

త్రిపురాన తమ్మయ దొరగారు మంచికవులుగాఁ బేరుగాంచి 'దేవీ భాగవతము' నాంధ్రీకరించినవారని తెలుఁగువారికి వేఱే తెలుపనవసరము లేదు. దేవీభాగవతము నిప్పటికి నలువురు తెలిఁగించిరనియు, నానాల్గిటి లోను మూఁడు ముద్రితములైనవనియు ననుకొని, తమ్మన్నకవిగారిది మాత్ర మచ్చుపడవలయునని మనము కోరుకొనుచుందుము. మనకోరిక నమకూరుఁగాక !

తమ్మయ్యకవిగారు తెలగ దొరలు. దంతపుహుండా మాలుకుదారులు. సిరికిఁ దగినయీవి. ఈవికిఁ దగ్గపాత్రవివేకము. కవులను సంభావించిరి. పండితులను గారవించిరి. పేదసాదుల నాదరించిరి. ఉర్లాము జమీందారులు శ్రీ కందుకూరు బసవరాజుగారు ప్రతిశ్రావణికి వేదశాస్త్రపండితుల నాహ్వా నించి, పరీక్షచేయించి వస్త్రాశనము లొసంగుచుందువారు. అక్కడకు వచ్చిన పండితులెల్ల నిక్కడ తమ్మయదొరగారినిగూడ దరిసించి సత్కా రములంది పోవుచుందువారు. వీరినాఁటి కవులుగాదు, పండితులుగాదు, వీరిగౌరవము నొందనివారు లేరనిచెప్పుకొందురు. శ్రీ ముక్కపిల్లి సాంబయ

శాస్త్రిగారు వీరి యాస్థానకవులు. ఆయన సంస్కృతాంధ్రములలో నిరూఢపాండితి యుండి యుభయభాషాకవితయందు నేర్పుగలకవులు. వీరి 'జానకీశ్వరశతక' మొకటి ప్రకటితము. ఇట్టియుదితుని తనసంస్థానమున నుంచుకొని తమ్మయకవి పోషించెను. శ్రీ ఆంధ్రపూర్ణులని విశ్వవిద్యాలయమువారిచే నెన్నఁబడిన త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయకవి తమ్మయదొరగారి కుమారరత్నమనుఁడీ! బాణభట్టునకు, తత్పుత్రుఁడు భూషణభట్టునవలె నీతండ్రి కొడుకులిరువురు పండితులును, కవులు నగుట మెచ్చుకోఁదగినది. తమ్మయదొర యెంతు ధన్యుఁడు. దేవీ భాగవతుండై పోతరాజు 'భాగవతకవిత' నారాధించుచు 'దేవీభాగవతము' తా నాంధ్రమున రచించినాఁడు. శ్రీ సూర్య ప్రసాదరాయకవి తండ్రినిఁ గూర్చి యిటులువ్రాసెను.

ఉ. భాగవతోత్తముండనఁగఁ బ్రస్తుతికెక్కెఁ జతుర్థ్యాగద్ధరి
భాగవతాంతకీర్తియయి భాసిలె శక్తి కథాసుధాధ్యమా
భాగవతంబుఁ దాఁ దెలుఁగుబాస రచించెఁగఁగం సమ్మయా
భాగవతోత్తము నెన్నఁగను బన్నగనాథున కైన శక్యమే!

"నిర్వచన కుమారసంభవము"

అదియుఁగాక తమ్మయదొరగారి కుమారుఁడు ప్రసాదరాయకవి తండ్రిగారిస్వర్గతికి వగచుచు "స్మృతజీవి జీవితామృతము" అను పేరితో రచించినకృతిలోని పద్యములు చదువవలసినవి. మూఁడు పద్యములు మాత్రము ప్రచురించెదను.

మ. నిను మూఁడేఁడులప్రాయమందె విడిచెన్ నీతండ్రి, నీవంతకుం
జననాటన్నను జూసిపోయితి విదే చిత్రంబు నీయట్ల నే
మనునరొహ్యా! పితృసౌఖ్యముంబడయఁగానోఁచన్, బితంబాయునం
దను కల్మిన్ వృథగావె తమ్మయవిభూ! తండ్రీ! కవిగ్రామణీ!

మ. అవసానంబున దారపుత్రికల డాయుంబిల్చి నాకోన మీ
రు వగం బొందకుఁ డీకులాంకురిషు పేరుం బెంపునుం బొంది ప్రా
పవు మీ కంచును నప్పగించితఁట మాయక్కయ్యకున్నన్న నెం
త విశేషజ్ఞుఁడవయ్య తమ్మయవిభూ! తండ్రీ! కవిగ్రామణీ!

మ. పదుమూఁడేఁడుల ప్రాయమంద కవితాప్రావీణ్యముం జూపి న
ల్వది రెండేఁడులు మాత్ర మీ బ్రదికియున్ భాస్వద్యశోవల్లి క
ష్టదిశల్ ప్రాఁకులు సేసి యీరవి నివేశస్థాయివై సల్పి త
త్పదముం జేరితి వౌర తమ్మయవిభూ! తండ్రీ! కవిగ్రామణీ!

తమ్మయకవి దేవీభాగవతరచనకు సరిగా స్వభాను సంవత్సర చైత్ర శుద్ధ ప్రతిపత్తు [1883 - ఏప్రియల్ 8 తేదీ] నాఁడు శ్రీకారము చుట్టి, రెండుమూఁడేండ్లలో సమాప్తిగావించిరని తెలియుచున్నది. ఈ రచన మయినపిమ్మటఁ దమ్మయకవి మూఁడునాలుగేండ్ల కంటె నెక్కువ కాలము బ్రదికియుండలేదు. ఆయన నిర్యాణము 1890 లో. జీవితము పూర్వార్ధమున నేవో కొన్ని శతకములు, కొన్ని చిన్నకృతులు రచించి పరిపాక దశలో భాగవతము ప్రారంభించిరి. అసంగతి మనకుఁ గవిత్వము లోనే పొడఁగట్టుచున్నది. "గడియలోన నొక్కకావ్యంబు రచియించు భూరితర కవిత్వధార గలఁడు" అని వీరినిగూర్చిచేసిన ప్రశంస సుప్రశంస. కాకున్న ౧౧వేల గ్రంథము రెండేండ్లలో నెట్టులువ్రాయుదురు! శ్రీ దాసు శ్రీరామకవిగారు 'దేవీభాగవతము' ను నాలుగునెలలలో వ్రాసి రఁట. పట్టుదల వచ్చినపు డట్టులు రచించువారిని మనము చాలమంది నెఱుఁగుదుము. తమ్మయకవిగా రాశుగతిని రచించినను వీరి దేవీభాగ వతము సుందరతరముగా సాగినది. పూర్వకవులు తిక్కనాదులకువలెనే వీరికిని కృతిరచనారంభమునఁగలవచ్చినది. కలలో శ్రీరంగపతి సన్నిధి చేసి నా కంకితముగ దేవీభాగవతముఁ దెలిఁగింపుము నెనఁట. యథార్థ ముగఁ దమ్మయదొర యుట్టికాముభక్తుఁడు. ఆయన కృతులెల్ల భగవ

దర్పితముతే. తమ్మయరాట్కవీంద్రుని భాగవతకవితలోని కమ్మఁదనము చూఱలిచ్చుట కీపద్యము లుదాహరణముగ నిచ్చుచున్నాఁడను.

క. కాలము గడచుట నైజం
కేలీలలనైనఁ గడచు హీనులకు, నము
ద్వేల వ్యసనమ్ములఁ, గుణ
శాలురకున్ హరికథా ప్రసంగవశమునన్.

సీ. దేవీపద ధ్యాన దినకర ప్రభలచే
ఘోరసంసారాంధ కారమణఁగు
దేవీపదాబ్జ సంసేవానిలంబుచేఁ
దాపత్రయ మహాంబుదమ్ము లణఁగు
దేవీ వివిధ నామధేయ స్తవాగ్నిచేఁ
గలుష శుష్కారణ్య గణము లణఁగు
దేవీనమస్కార దివ్యౌషధమ్ముచే
బ్రబలేంద్రియోపతాపమ్ము లణఁగు

గీ. భక్తజన పరిరక్షణాసక్త యగుచు
దేవి సర్వోత్తమస్థితిఁ దేజరిల్లు
సత్య మిది నిగమాగమ సమ్మతమ్ము
శౌనకమునీంద్ర! నీ కేల సందియమ్ము.

[వ్యాసకృతతపశ్చర్య – శుకోత్పత్తి]

శా. కన్యన్ నవ్యవయోవిలాస లలితాకారాంగ రంగత్కళా
ధన్యన్ సత్కుల సంభవామలచరిత్ర స్ఫీత సౌజన్య స
మాన్యన్ దుష్కృతవంధ్యతోపధికథామాత్సర్యరోగక్రుధా
శూన్యన్ బొందినఁ బొందవచ్చును, దనూజన్ నాకదెట్లబ్బెడున్.

ఉ. అబ్బనుగాక ! బంధనము లైన లతాంగుల పొందు మేలె ? యు
బ్బుబ్బ! జగంబునం బురుషుఁడన్మదవహ స్త్రికిఁ గాలినంకెలల్
గుబ్బెత లెంచిచూడ నిది గూడదు సంస్కృతిఁగూడి చిక్కఁడే
గిబ్బపటాణి కాతు తమకించి సతీతనుపాశ బద్ధుఁడై.

[మింటఁదోఁచిన ఘృతాచిం జూచి]

సీ. కాదంబినియొ కైశికమొ యెఱుంగఁగరాదు
ద్విజరాజొ వదనమో తెలియరాదు
కనకాంబుజమ్ములో కరములో గనరాదు
తారలో నఖములో తలఁపరాదు
స్వర్ణదీ వీచులో వళులో పలుకరాదు
గగనమో మధ్యమో గాంచరాదు
చక్రవాకములో కుచములో యరయరాదు
మెఱుపొ, మేనో యేరుపఱుపరాదు

గీ. నన్ను వంచింపవచ్చిన నవ్యదివ్య
కామ మోహాన దేవతాకార మిదియు.
నిక్కమని మాని లోలోన నుక్కుచిక్కి
మాటలనేవచ్చు, వచ్చునే మనసునిలుప ?

ఉ. చన్నుఁబెంపు, పాద జలజమ్ములకెంపు, మనోహరమ్ములౌ
కన్నులసొంపు, మైయగరుకంపు, కనుంబొమ వంపు, శ్రోణులన్
తిన్నెల నింపు, నెన్నడల తీఱునిజంపు, నఖాళి తెంపు, పల్
క్రొన్ననయింపు, ముంగురులగుంపుఁ దలంప వరింపకెట్లగున్.

[ప్రథమస్కంధము]

# వావిలాల వాసుదేవశాస్త్రి

# 1851 -1897

తెలగాణ్య శాఖీయ బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. హారితస గోత్రులు. కాంపురము రాజమహేంద్రవరము. జననము కారుమూరు (తెనాలితాలూకా) తండ్రి. అప్పయ్య. జననవత్సరము 1851. నిర్యాణము 1897. రచనలు: ౧. ఆరోగ్యసర్వస్వము ౨. గరుడాచలము 3. నందకరాజ్యము ౪. మృచ్ఛకటికము ౫. ఉత్తరరామచరిత్రము ౬. మాతృస్వరూపస్మృతి ౭. ఆంధ్రరఘువంశము ౮. జూలియసుసీజరు ౯. ముముక్షుతారకము మున్నగునవి.

రాజమహేంద్రవరమునఁ బ్రఖ్యాత కవిత్రయము అనఁబడిన వారిలో వాసుదేవశాస్త్రిగారొకరు. తక్కుంగల యిద్దరిలో పెద్దాడ సుబ్బారాయుడుగా రొకరు. వేఱొకరు వీరేశలింగము పంతులుగారు. కవితా విషయమునఁ గాంచినచో వీమువ్వురకును జాలభేదమున్నది. కొక్కొండ వేంకటరత్నశర్మ, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, వాసుదేవశాస్త్రిగారలు కవులలో నొకశ్రేణికి సంబంధించినవారు. ఈ మువ్వుర రచనలలోను నొక ప్రత్యేక విలక్షణత యుండును. వీరిలో నొకరు బహుగ్రంథకర్తలగు మహామహోపాధ్యాయులు. ఒకరు భారతాంధ్రీకర్తలగు నాంధ్రవ్యాసులు. ఒకరు దృశ్య శ్రవ్య కావ్య రచయితలుగా విఖ్యాతులు. ఈమువ్వుర రచనలలోఁగూడ నించుక భేద మున్నను, మొత్తము మీఁద నొకరకపు కవిశ్రేణికిఁ జెందినవారుగాఁ దోఁచెదరు.

వాసుదేవశాస్త్రిగారు విద్వద్వంశీయులు. ఈయన ప్రపితామహుఁడు వెంకటశివావధాని వాసిరెడ్డివారి సంస్థానమునఁ బండితుఁడు. మన శాస్త్రిగారు బందరునోబిలు కళాశాలా పండితులైన కోరాడ రామచంద్రశాస్త్రిగారికడ సంస్కృత విద్యాభ్యాసము గావించెను. అదిగాక,

రాజ మహేంద్రవర కళాశాలలోఁ జదివి 1872 లో బి. ఏ పట్టభద్రు లయిరి. ఆయేఁడు "మార్క్డోనాల్డు" బంగారుపతకము వీరికి లభించినది. 1874 మొదలు 1896 వఱకు రాజమహేంద్రవరమున ప్రభుత్వకళాశాలాంగ్ల సహోపాధ్యాయపదవి నలంకరించిరి. తరువాతఁ బాఠశాలా సహాయపరీక్షకులుగాఁ గూడ నుండిరి.

వాసుదేవశాస్త్రిగారు పేరుగొన్న రచయిత. ఆంగ్లనాటకము లాంధ్రీకరించుటలోను, క్రొత్తయితివృత్తముతో స్వతంత్ర నాటకములు సంఘటించుటలోను శాస్త్రిగారికిఁ బ్రాథమ్య మీయవలెను. జూలియస్ సీజరు. 'సీజరుచరిత్ర' మనుపేర వీరాంధ్రీకరించిరి. వీరి 'నందకరాజ్య' నాటకమంతయుఁ దేటగీతముతోనే సాగినది. యీపద్యమరయుఁడు.

తేట గీత మందె దీనిని వ్రాయంగ
మంచి దంచుఁ దోఁచె మదిని నాకు
సాయ మిండి నాకు సదయత బుధులార!
వావిలాల వాసు దేవ శాస్త్రి.

కథా సరణియందు, పాత్రల పేరులయందు మాఱుపు చేయలేదు. ఈ యాదర్శమే వీరేశలింగము పంతులుగారి వెనీసువర్తక చరిత్రాదులను వెలయింపఁ జేసినది. 'నందకరాజ్యము' స్వతంత్రాంధ్రనాటకములలో మొదటిదిగాఁ బరిగణింపవలయును. దీని ప్రచురణము 1880 లో. దాని పీఠికలో నిట్లున్నది :

"...ఇది నేను వ్రాయుటకుఁ గల్గిన ముఖ్యోద్దేశము మనవారిలో, అందులో బ్రాహ్మణులలో బహుతరముగాఁ గాన్పించునట్టి నైకమత్యమును సర్వవిధంబుల స్వీకరించి దానివల్ల మనమెల్ల మేలుపడయఁ గోరవలయునని బోధింగించుటె గాని మఱియొకటి కాదని స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడను. ఈసంగతినే పొడి మాటలతోఁ దెలియఁజేయక కథ యొకటి కల్పించి యందులోఁ బరస్పరవైరములు పెంచినవారు శిక్షింపఁ

బడినట్లు కూర్చుట మంచిదని తలంచి యిట్టి నాయభిప్రాయంబును మన వారెల్లరు గ్రహింతు రని తలంచి నాటక ధోరణిని వ్రాసితిని...."

గీతనాటకములకీ నందక రాజ్యము ముంగలిది. పూర్వపు గ్రామ్య వ్యవహారము లిందు సుందరతరముగా నభివర్ణితములు. పదప్రయోగమున నంత ప్రౌఢిమ పొడసూపదు గాని, స్వాభావికత పెద్దగానున్నది.

వైదికులపక్షమున రామదీక్షితులమాటలు :—

భూవు సంపత్తికిని వారె మూలబలము
కావునన వైదికులకు భూకాంతులు మును
పెక్కులుగ జీవనములు కల్పించినారు
బహుదినంబులు పోఁగ కుటుంబములు పెరిగి
వంటకో పాతికో చిక్కి మావారు సగము
తగ్గి జీవించు చుండిరి దాన దాన
కాని యేలొకో, యిటీవల హానివచ్చె.

రాజకీయోద్యోగుల పక్షమున శరభోజి పలుకులు :—

"ఇప్పుడీ దీక్షితులు విప్పిచెప్పినట్లు
వైదికులపైని మాకేమి వైరమేమి?
మేము వారును నొక్కటై మెలఁగఁ గన్న
నైకమత్య ఫలంబుల ననుభవింపఁ
గాను, మా సరివా రెందుఁ గానరారు.
అయిన నావేడ్క మా కింక నబ్బ దయ్యె;
స్వామి కార్య నిర్వహణము జగడమునకు
మూల మయ్యెను, నిజముగా భూపవర్య!"

శాస్త్రిగారు 1874 లో ముముక్షుతారక మనుపేర భజగోవిందశ్లోకములనువదించిరి. 1875 లో 'బ్రాహ్మణీయము' ప్రబంధము రచించిరి. ఇది యముద్రితము. వీ రనువదించిన 'మృచ్ఛకటికము' మనోహర

మైనది. అటుపిమ్మట తిరుపతివేంకట కవులు కూడ దాని ననువదించిరి. వాసుదేవశాస్త్రిగారి ఉత్తరరామచరిత్రాంధ్రీకృతి 1883 లో వెలువడి నది. వీరి తెలుఁగుసేత దాని ననేకు లనువదించిరి.

వీరి 'మృచ్ఛకటికము' తెనిఁగింపు మచ్చు:

తోడిఁ బండకుండఁగా జనము త్రోవల నిల్చిన మింటిదీపమై
పొడమె శశాంకుఁ డల్లడుగొ బోటుల చెక్కు లవోలె వెల్లనై
యుడుగణ మాశ్రయింప నిసు లుచ్చిపడన్ వెదచల్లె వెన్నెలన్
వడిలిన పంకమందుఁ బయిపైఁ బడుచుండెను పాలధారగా."

"అద్వైతం సుఖదుఃఖయో రనుగత" మిత్యాదికమగు ఉత్తరరామ చరితగతశ్లోకమునకు వాసుదేవశాస్త్రిగారి తెనుఁగు పరివర్తనపుఁదీరు:

ఎవ్వనికైన జన్మమున వ్యాప్తియు లేక సుఖాసుఖంబుల
న్నవ్వుచు నొవ్వకే చెలువున న్నతతంబును రాగలబ్ధితో
జవ్వనమూడి వార్ధకము సాఁగఁగ స్నేహము మెండుకొన్నఁ దా
మవ్వపుఁ గోర్కి నట్టి యతిమానుష శాలికి మంగళంబగున్!

వీరి 'రఘువంశము' గ్రిగ్గుదొరగారికి గురుతుగానర్పింపఁబడినది. చిత్ర మయిన యీపద్యము చదువుఁడు. "ఖ్రుష్టమత బోద్ధృ సూరి విశిష్ట భూతి, సకలవిద్యాధికారి ప్రశస్తసూరి, ఆశ్రితావనశక్తి రాజాదృతోక్తి, లగ్గు పుడుకంగలారు శ్రీగ్రిగ్గుగారు." వీరివ్యుత్పత్తి భారములో రచనా సౌలభ్యము కొంత మఱుఁగున నుండును. ఎన్నో పద్యము లిందుల కుదాహరణములు చూడవలయును. రఘువంశమును దొరగారి కంకి తము నిచ్చుట యీగీతమాలలో నిటుల సమర్థింపఁబడినది.

కృతుల కొప్పిరి శ్రీశిష్టు కృష్ణమూర్తి
లక్ష్మణకవులు గౌరన సూక్ష్మబుద్ధి
కందుకూరి వడ్డాది నిగమ సుసర్ల

పాలెపు త్రిపురాన పన్నాల వ్యాండ్ల
వారణాసి చిలంబు దుర్భ విడవర్తి
వంద్రి సత్వవోల్ కల్లూరి బయువునేడి
జగతి శైల నాదెళ్ళ గుండు గురుజాడ
మాడభూషి గోల్కొండ వంక్రవగేయు
లోగిరాల జగన్నాథ నాగయాది
బుధులు నరదేవతాంకితములుగఁ జేసి

ఈమాలికలో సమకాలికుల ప్రసక్తి లెన్సగాఁ బొంకికగా ముచ్చటింపఁబడినది. రాజమహేంద్రవర రాజకీయ సర్వకళాశాలాధ్యాపకాస్యతముఁడు, సంస్కృత ప్రాకృత మహాభాషాసామ్య వైషమ్యబోద్ధయు, శాస్త్ర బ్రహ్మచార్యవధా శుద్ధతాప్త సువర్ణశానసముండు, కతిపయ రూపకప్రణేతయు నగు వాసుదేవశాస్త్రిగారు ధన్యులు. ఎవరో చమత్కరించి నటులు వీరిపేరు ఆటవెలఁదిలో నిముడును. "నందకరాజ్య" మండలి యాక్రింది సీసము శాస్త్రులుగారి జీవితసర్వస్వ సంగ్రహమునకు నిలువుటద్దము.

తొల్లి విరోధికృత్తున జ్యేష్ఠ శుక్ల ద్వితీయాదివాకరతిథి సరిగ నాఁడ, వేయి యెనిమిదగు నూటయేఁబది యొంకటవ యేఁటి జూనొకటి నాఁడు పుట్టి కార్యామ్రరిలో మట్టెమువారింట మేనమామల కోగిఁటిమీఁద నట్లు చేవేంద్ర కృష్ణమ్మ శేషాచలముగార్ల యొద్దను బడిచదువొసరఁ జదివి మేనత్త పెదకొడుకైనట్టి యారామలింగ శాస్త్రులవారి వెంగటను బసందుగాఁ గాళిదాసత్రయము మేము పఠించి యుప్పుకవియు నుంచి నేర్చి కార్యామ్రర, గుంటూరు పేర్మితో నింగ్లీషు చదివి, బందరఁ గొడ్డిశాలఁ జదివి నోబిలుస్కూలులోను బ్రవేశపుఁబరీక్ష బ్రథమశాస్త్రపరీక్ష వఱకుఁ దేలి యచట వేదుల వేంకటాచార్య వర్యుల సన్నిధిలో నాంధ్ర

సంస్కృతముల జాడలు మఱుఁగులు చక్కఁగా వినఁగల్గి మేరలేని కృతజ్ఞ భారమొంది రాజమహేంద్రవరము వచ్చి స్కూలులో మేష్టరీ పహోదాను మేలుపొంది సర్వేశుకరుణ శాస్త్రబ్రహ్మచారినై కాలేజి మేష్టరీ గ్రాలుచున్న నేను, నా కుపకర్తలైన మహానుభావులపేళ్ళు సతముగా భువిని వెలుఁగ,

వారి కీయపూర్వ ఫక్కిక పుస్తంబు
నన్నుఁ బెంచి విద్య నాకుఁ జెప్పి
నట్టి దయకుఁ గృతిగఁ బట్టి యిచ్చెద నిదె
వావిలాల వాసు దేవ శాస్త్రి.

తిథి 1-4-1880 సం॥

# గురుజాడ శ్రీరామమూర్తి

## 1851-1899

నియోగిశాఖీయ బ్రాహ్మణులు. తండ్రి : దుర్గప్రసాదరావు. నివాసము కాకినాడ, విజయనగరము. జననము 1851. నిధనము 1899. గ్రంథములు : ౧. చిత్రరత్నాకరము ౨. కాళ్ళప్పోదయ కథాసంగ్రహము ౩. కవిజీవితములు ౪. కలభాషిణి ౫. తెనాలిరామకృష్ణునికథలు ౬. అప్పయదీక్షితచారిత్రము ౭. తిమ్మరుసుచారిత్రము – ఇత్యాదులు. 'రాజయోగి' పత్రికా సంపాదకత్వము.

గురుజాడ శ్రీరామమూర్తిగారికిఁ బూర్వము తెనుఁగునఁ గవిచరిత్రములులేవు. వీరాంగ్లవిద్యార్థులు గాసఁ బాశ్చాత్య విద్వాంసులు రచించిన కవిజీవితములు చూచి యట్టివి యాంధ్రమున సంధానించిరి. ఆంధ్ర కవిజీవితములు కథాప్రధానమయినగ్రంథము. అందు కవి కాలనిర్ణయాదుల కంటె నా యాకవులపైఁ జెప్పఁబడిన పుక్కిటిపురాణము లెక్కువ. చారిత్రకదృష్టితోఁ బరిశీలించిన నీగ్రంథమునకుఁ బ్రథమస్థానము లేకున్నను గవిచారిత్రముల కిది మార్గదర్శి యనవలయును. కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ 'కవులచరిత్ర' లో మఱుఁగున నున్నకవులను బెక్కుమందిని బయటఁ బెట్టి వారివారి కాల నిర్ణయములు సప్రమాణముగా నొనరించి తత్తద్గ్రంథములలోని గుణదోషములు వెల్లడించిరి. ఆకారణమున వీరి కవిజీవితములకంటె, వారి కవిచరిత్రములకుఁ బెద్దపేరువచ్చినది. 1880 లో కవి జీవితరచనము వీరిది సాగినది. రామమూర్తిపంతులుగారి పీఠికలోని కొన్నిమాటలు పఠింపఁ దగినవి.

"...కందుకూరి వీరేశలింగముగారు తమమిత్రు లెవ్వరో తమ్ముఁ గవిచరిత్రములు తిరుగ రచియించుటకుఁ బ్రోత్సహించినారని కవిచారిత్రములనుపేరితో నొకగ్రంథము ప్రాచీనకవులం గూర్చిన భాగమును ముద్రించి ప్రకటించిరి. అందు పెక్కండ్రు కవుల పేళ్ళును వారి చారిత్రములును

వ్రాసినట్లున్నను జాలభాగ మిదివఱలో నాచేఁ బ్రకటింపఁబడిన కవి జీవితముల యర్థ సంగ్రహమే కాని వేఱుకాదు. ఏవియైన నొకటిరెండు కథలు నవీనముగాఁ గాన్పించుటకుఁ జేర్పఁబడినను నవి యనవసరమైన చారిత్రములుగానైనను లేక ప్రత్యేకము కవిత్వ శైలిం జూపుటకు వ్రాయఁ బడిన పద్యములు నుదహరణములుగా నైన నుండును....”

ఇదియటుండె, రామమూర్తి పంతులుగారిది సువర్ణవిగ్రహము. విగ్రహమునకుఁ దగ్గగుణసంపత్తి. ఈయన 'మెట్రిక్యులేషన్' పరీక్షలో నుత్తీర్ణులు. పూర్వపు 'మెట్రిక్యులేషన్' నేఁటి ఎమ్. ఏ లకు సహపాఠి. వీరు కాకినాడ సబ్ కోర్టులో నుద్యోగించుచు రాజీనామానిచ్చి 1880 లో విజయనగర సంస్థానాధీశ్వరులు ఆనందగజపతి సన్నిధిని నిలయవిద్వాంసుఁడుగానుండెను. ఆప్రభువున కీకవియెడలఁ జెప్పలేని యాదరము. ఆనందగజపతి నిర్యాణము 1897 లో. ఆతరువాత రామమూర్తిగారిని సంస్థానము పోషించినది. వీరి కవిజీవితములు ఆనందగజపతి పేరుగా వెలసి యున్నవి.

ఈయన చరిత్రపరిశీలకుఁడే గాక కవి కూడను. 'మర్చంటు ఆఫ్ వినీస్' నాటకమును బరివర్తించిరి. ఓగిరాల జగన్నాథ కవిగారి యిచ్చు తెనుఁగునిఘంటువగు "ఆంధ్రపదపారిజాతము"ను గొన్నిపదములందుఁ జేర్చికూర్చి వీరచ్చుకొట్టించిరి. తిమ్మరుసు, బెండపూడి అన్నమంత్రి, అప్పయదీక్షితులు ఈమూవురు మహామహుల చరిత్రములు సంపాదించిరి. తెలుఁగువారి కందిచ్చిరి. మొత్తము, వీరికిఁ జరిత్రసంధానముపై మక్కువమెక్కువ. వీరు కాకినాడ నుండి వెలువరించిన 'రాజయోగి' పత్రిక, నాఁడు పేరుగాంచినది. విజయనగరము ప్రాంతములో వీరికి "కాకినాడ పంతు" లని పేరు. శ్రీరామమూర్తి గారి 'కవిజీవితములు' చరిత్రలో నొక కనక ఘట్టము.

# వేదము వేంకటరాయశాస్త్రి

## 1853 - 1929

కులము: ద్రావిడబ్రాహ్మణులు. తల్లి: లక్ష్మమ్మ. తండ్రి: వేంకటరమణశాస్త్రి. పుట్టుక మదరాసులో. పూర్వుల జన్మస్థానము నెల్లూరు జిల్లా కావలితాలూకాలోని మల్లయపాలెము. జననము 1853 డిసెంబరు 21 తేది. (ప్రమాదీచ సంవత్సర మార్గశీర్ష బహుళ ౧ బుధవారము. నిర్యాణము. 1929 జూను 18 తేది ఉదయము 6-45 ని. కు) రచిత గ్రంథములు: ప్రక్రియాఖండనము, అలంకారసారసంగ్రహము 1886- ఆంధ్రకథాసరిత్సాగరము 1891 - నాగానందము 1891 - ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము 1896- ప్రతాపరుద్రీయ నాటకము 1897- ఆంధ్రప్రసన్నరాఘవ నాటక విమర్శనము 1898 - ఉషానాటకము 1901 - బొబ్బిలియుద్ధనాటకము 1916- మాళవికాగ్నిమిత్రము 1919- ఉత్తరరామచరిత్రాంధ్రీకరణము 1920- విక్రమోర్వశీయ, రత్నావళి, సాహిత్యదర్పణాంధ్రీకరణములు 1921- శారదా కాంచిక శృంగారనైషధము సర్వంకష వ్యాఖ్య 1913- ఆముక్తమాల్యద వ్యాఖ్య 1920- రఘువంశము, కుమారసంభవము, అమరు కావ్యము, విజయవిలాసము, సారంగధర, కావ్యాలంకార చూడామణి మున్నగునవి టీకలతో-1910 లో సంస్కరించిరి. 'జనవినోదిని' పత్రిక ప్రకటించిరి.

"కవి పండితుఁడు కాఁడు. పండితుఁడు కవి కాఁడు" అని కొందఱి వాదము. కాళిదాసుఁడు కవికులతిలకము. అతని పాండిత్యము భువనవిదితము. భవభూతి మహాకవి. అతఁడు పదవాక్య ప్రమాణజ్ఞానమునఁ బేరుమోసినవాఁడు. కవి పండితుఁడు కాఁడనుటలో సొగసు లేదు.

వేదము వేంకటరాయశాస్త్రిగారు మహామహోపాధ్యాయులు. సర్వతంత్రస్వతంత్రులు. కళాప్రపూర్ణులు. వ్యాఖ్యానమల్లినాథులు. వీరు వ్రాసిన పద్యకావ్యములు లేవుగాని కాళిదాస భవభూతులవలె వీరును మూఁడు నాటకములు రచించిరి. ఇవి మూఁడును మూఁడురత్నములు. వానిలో ప్రతాపరుద్రీయ మనర్ఘరత్నము. ఉష, బొబ్బిలినాటకములు రమ్యములై

రంగస్థలముల కెక్కి-కీర్తి గనినవి. ఈనాటకములు మూఁడిటికిని పాత్రౌ చిత్యపోషణము పెద్దవన్నె దెచ్చినది. మహానుభావము గల వేంకటరాయ శాస్త్రిగారు గ్రాంథిక గ్రామ్యములు పాత్రోచితములుగాఁ జిత్రించి ప్రతాప రుద్రీయమునకుఁ జేరుదెచ్చిరి. నాగానందాంధ్రీకరణమునను ప్రతాపరుద్రీయమునను వీరు క్రొత్తమార్గము త్రొక్కుటఁ జూచి కొందఱు కేవల గ్రాంథికవాదులకుఁ గోపకారణమైనది. విమర్శనములు వెలువడఁ జొచ్చినవి. అంతకుమున్నే యిదికనిపట్టి 'ప్రతాప'లో శాస్త్రిగారిట్లు వ్రాసికొని నటిచేఁ జదివించిరి.

అంకెకుఁ దార్చ నేరసికు నంగలభారతి ప్రౌఢనీతి, నా
కింకిరినాంధ్రి ద్రావిడియుఁ గేరుచు దైవియుఁగూడి రెన్వనిఁ
జంకు కళంకు లేనికవిచంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁడా
వేంకటరాయశాస్త్రికృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే?

ప్రతాపరుద్రీయమునఁ దురుష్కునిచేతను, బొబ్బిలిలో సిపాయి చేతను శాస్త్రిగారు సందర్భసముచితమగు సంభాషణము చేయించిరి. వేంకట రాయశాస్త్రి తండ్రిగారు వేంకటరమణశాస్త్రిగారు సంస్కృతాంధ్రము లలో గొప్పపండితులు. వీరు పరవస్తు చిన్నయసూరికి సహపాఠులు. తండ్రిగారు పెక్కు పట్టనములలో నుద్యోగములు చేసియుండుటచే వేంకటరాయశాస్త్రిగారు కూడ వారితోపాటనేక మండలములలోఁ దిరుగుట, తత్తన్మండల వ్యవహార భాషాసంప్రదాయము తెలియఁగుట తటస్థించినది. బహుబాల్యముననే ప్రతాపరుద్రీయ కథ వేంకటరాయ శాస్త్రిగారి నాకర్షించినది. అది 1896 లో నాటక రూపమునకు వచ్చి యాంధ్రి కాభరణమైనది. ఈవిషయము తన్నాటకాపతా రికలో నిటు లున్నది "ఓరుగంటి ప్రతాపరుద్ర మహారాజును తురకలు ఢిల్లీకి ఖయిదు గొనిపోయినకథ లిఖితముగాని ముద్రితముగాని నాకెచటను దొరకలేదు. నే నెనిమిదేండ్లవయసున నుండఁగా మానాయన

గారు వేదము వేంకటరమణశాస్త్రులవారు తమ మిత్త్రబృందములో నీ కథను ప్రస్తుతించునపుడు నేనును వింటిని. వారుచెప్పుటలో నీకథ అరగంట కూడపట్టలేదు. ఇటీవల నేను ఆంధ్రజనవినోదినీముద్రణాధి కృతుఁడనై యుండఁగా 1888 సం॥మున ఈకథను నాకుఁ దోఁచినట్లు విరివిచేసి యల్లి కథారూపమునఁ బ్రచురించియుంటిని. పిమ్మట 1896 సం॥న జూలై నెలలో దానిని నాటకోచితముగారూపుచేసి, ఈనాటకమునందలి గద్య భాగమును మాత్రము వ్రాసి నామిత్రులకుఁజూపితిని.''

శాస్త్రిగారి తండ్రిగారికడ నలుగురు శిష్యులు వేదాంతగోష్ఠి తఱచు చేయుచుండువారఁట. వారిలో నొకఁడుబ్రాహ్మణుఁడు. రెండవవాఁడు చాకలి, మూఁడవవాఁడు మహమ్మదీయుఁడు, నాలుగవవాఁడు క్రైస్తవుఁడు. వారిగోష్ఠి శాస్త్రిగారు వేడుకపడి వినుచుండువారఁట. ప్రతాప చరిత్ర లోని మహమ్మదీయపాత్ర మంతమనోహరముగాఁ జిత్రింపఁగలుగుటకు నాఁటిమహమ్మదీయ శిష్యునిమాటల వినియుండుటయే కారణమని శాస్త్రిగా రనుచుండెడివారని చెప్పుకొందురు.

ఈయన చోడవరము బడిలోఁగొన్నాళ్ళు ప్రధానోపాధ్యాయులుగా నుండిరి. నాఁటి యొకవిచిత్రగాథ నిట్లుచెప్పుదురు. ఆబడిలో 'పేరి గాఁడు' అను నొకనౌకరు యుండువాఁడు. బడివనులేవియు ముట్టుకొనక మూఁడుప్రొద్దులు 'సెక్రటరీయింటనే గృహకృత్యములు సేయుట, ఎప్పుడోవచ్చి బడియరుఁగుమీఁదఁ బరుండుట - ఇది వానిదైనికచర్య. మన శాస్త్రులుగారికి వీనిచర్య చూడ నరకాలిమంట నెత్తికెక్కె- యొకనాఁడు వీని కిదివనికాదని యొకచింతబరికె చేతఁబుచ్చుకొని నసాళమంటు నట్లు నాలుగుచుఱుకులు తగిలించి మెల్లఁగాఁ దప్పుకొని రఁట. వాఁడు 'మొఱ్ఱో' అని లేచి 'సెక్రటరీ' తో శాస్త్రులుగారి యన్యాయము చెప్పి కొనెను. సెక్రటరీ శాస్త్రిగారిని రమ్మని నౌకరును పంపెను. 'మీయింటికి వచ్చునవసరము నాకులేదు. పనియున్నచో మీరు రావలయును.' అని శాస్త్రిగారి ప్రత్యుత్తరము.'' నిరంకుశాః కవయః!

ఈపేరిగాఁడే ప్రతాపరుద్రీయములోని పేరిగాఁడు. శాస్త్రులుగారిచెవి కింపుగా నేదేని చక్కని పలుకుబడిగాని నామవాచకముగాని వినఁబడి నదో, అది సందర్భోచితముగ గ్రాంథికముచేయవలసినదే. ప్రతాప రుద్రీయములో వెఱ్ఱివాఁడు "నేను కండచీమను. ఏమనుకున్నావో. పట్టు కుంటే వదలను" అనును. శాస్త్రులుగారు విశాఖపట్టనములో నున్న పుడు పొరుగింట ముసలిమగఁడు పడుచుభార్యను జీటికిమాటికి నీకండ చీమ పదము నుపయోగించి తిట్టుచుండువాఁడఁట. అది జ్ఞప్తికిరాఁగా నిచటఁబ్రయోగించిరని వారిసన్నిహితులు చెప్పుదురు.

బొబ్బిలినాటకమున నయిదవయంకములో సారాయిదుకాణముపెట్టిన వానిపేరు 'బాడ్మ్యిక్' అనిరి. ఇది వీరు విశాఖపట్టనములో నున్నపు డక్కడిదుకాణదారునిపేరఁట. ఇంకను నిట్టియనేక స్వానుభవములు తమ నాటకములలో నుద్ఘాటించిరి. వీరికి జంగముపాటలు, పడవపాటలు, ముష్టివారిపాటలు వినుటయం దాస్థహెచ్చది. ప్రతాప నాటకమునకు ముఖ్యముగాఁ బ్రఖ్యాతి గొనితెచ్చినది పాత్రోచితభాష. కవిచెప్పినటు లీనాటకము 'పండితపామరుల గండపెండేరు' గా నున్నది.

ఉషాచరిత్రము నెఱ్ఱాప్రెగడయు, సోమనాథుఁడును దమ కావ్య ములలో రసోత్తరముగాఁ జిత్రించిరి. ఎఱ్ఱన బాణుని రాక నాలోకించిన యుషచే శోకసీసము చదివించినాఁడు. సోమనాథుఁడు కలఁగనిలేచిన యుషచే శోకసీసము పఠింపించినాఁడు. వేంకటరాయశాస్త్రిగారి నాటక ములో "భ్రాంతిద్వీపమున నక్షత్రప్రాసాదమున బంధితయుష చెలి చిత్రరేఖతో" నిట్లనుచున్నది.

ఒడిలోన నేనులే కోలగంబుండని
తండ్రికినేఁ బగదాననైతి
నన్నుఁ గైసేయించి కన్నదే దినమైన
తల్లికి నే విషవల్లినైతి

ప్రాణంపుఁ బ్రాణంబువగిది సన్నో౯డెందు
నన్నకే తలనంపు వ్యాధినైతి
సమరగోరి తనప్రాణమునకుఁ దెగించిన
దయితుని కే బంధధాత్రినైతిఁ
బ్రాణనాథుని నేఁగోల్చి బందినైతిఁ
దప్పులేక కుశీలవతాకనైతి
చెప్పరము మాని సకి నీవ చెప్పవమ్మ
కూసమేదిన వెలఁగికిఁ బ్రాణమేల ?

ఉత్తరోత్తర రసభావనిష్యందములగు నీమ వ్వారుకవుల సీసములు. నొకమాఱు చదువుకొని యభిజ్ఞులు రసతత్త్వమును జూఱలాడవలయును.

శాస్త్రిగారు నిరుపమానవర్ణనా సన్నివేశ సంధానధౌరేయులు. ఒకయెడఁ గాళిదాసుని దలఁపింతురు. ఒకయెడ భవభూతిని మఱపింతురు. అనిరుద్ధునకు స్వప్నములోఁ బ్రియురాలు గనఁబడెను. ఆమెయే యుష. సఖునితో నాసంగతిచెప్పుచు స్వప్నదృష్టయగు ప్రణయినిని వర్ణింప వలసివచ్చినది. అతఁడు పూఁదోఁటలో నున్నాఁడు. అది వెన్నెలరేయి. మంచుకురియుచున్నది. అట్టి సన్నివేశమున నిటులు వర్ణన.

మృషావలగ్న జిల్గుపైఁట మించునన్నమంచగున్
ఝుషాక్షిదట్ట మన్నసంజజాజులోని రేకగున్
తృషాకృదోష్ఠి భామగాళి రెక్కలున్ మెఱుంగులా
నుషావతార మంచుఁ గాంత నూహసేయుదున్ సఖా !

ఉషయై పరితపించుచున్నయనిరుద్ధున కప్పటికిఁ దెలియకున్నసుప్రియయు నుషయేనైనదఁట. అతిమాత్రప్రజ్ఞా సంపన్నులగు శాస్త్రిగారి భావనా శక్తి నీపద్య మొక్కటియే తార్కాణించుచున్నది. కనుకనే నాటక కర్త "యుషావివాహము" 'సిద్ధసుధా ప్రవాహ' మనుకొనినాఁడు.

బొబ్బిలినాటకములు మఱికొంద ఱిటీవలికవులు కూడ వ్రాసిరి. వానియన్నింట వేంకటరాయశాస్త్రిగారిది రసవత్తరము. 'ఆఁడుఁబురువు

లేదు పాతమయ్యో మగకూన కోటపాడయ్యో నింకేటి కిచట' ఇది చదువు కొని కంటనీరుపెట్టుకొను రసిక శూరులు నేఁడు పెక్కండ్రు కలరు. శాస్త్రిగారు శ్రవ్యకావ్యము వ్రాయలే దనువెలితి లేదు. వీరి యీపై మూఁడు నాటకములలోను గొప్పకవిత్వమున్నది. పండితేనివారికి వీరి కవిత యెటులుండినను, పండితకవులకుఁ బండువు "పండితుఁడు కవి కాఁడు" అను వాదమిపుడు నిలువదేమో !

వేంకటరాయశాస్త్రిగారి యఖండపాండితికిఁ దార్కాణముగా వారి ఆముక్తమాల్యదా, శృంగారనైషధవ్యాఖ్యలు చూపవచ్చును. ఆముక్తా దులలోనిపాఠములు కొన్ని వీరు స్వయముగా నవరించిరి. అది కొంత వీరిలోఁగలలోప మనక తప్పదు. "ఆముక్త" వ్యాఖ్య వీరు కొన్నేండ్లు చదివి నాలుగునెలలలో వ్రాసిరఁట. 24 - 6 - 1920 నాఁడు ప్రారంభించి 28 - 10 - 1920 నాఁటికిఁ బూర్తిచేసి రని వారిచరిత్రము చెప్పుచున్నది. అందులకే యపరమల్లినాథబిరుదము వారియెడ నన్వర్థమైనది.

శ్రీ వీరేశలింగము పంతులుగారు 'విధవావివాహ' ప్రచారము బాధముగాఁ జేయుచున్న సమయమున శాస్త్రులుగారు "స్త్రీపున ర్వివాహ దుర్వాదనిర్వాపణ" గ్రంథము బహుపరిశ్రమమునకుఁ బాల్పడి బహుగ్రంథములు పరిశీలించి ప్రకటించిరి. ఆప్రకటనమే శాస్త్రిగారి జీవితమునకు నూతన ప్రకరణమైనది. వారి ప్రతిభయుఁ బాండిత్యము లోకమునకుఁ దెలిపినది యీఘట్టమే. పునర్వివాహ వాదఖండనోపన్యాస ములవలననే శాస్త్రిగారికిఁ బెక్కుమంది మదరాసు మహాశయులమైత్రి కలిగినది. ఆపర్టు, మిల్లరు మున్నగు పాశ్చాత్యులకు వీరి గీర్వాణభాషా పాండిత్యము విదితమైనది. తత్ప్రతిఫలముగా 1887 నవంబరులో క్రైస్తవ కళాశాలా సంస్కృతోపాధ్యాయపదము శాస్త్రిగారికి లభించినది. ఈయుద్యోగముతో నూరకుండక యపారమగు భారతీసేవ గావించిరి. చెన్నపురజీవితము శాస్త్రులుగారికి గ్రంథరచనోత్సాహము హెచ్చించి నది. 1890 లో జ్యోతిష్మతి నప్రగ్రాంథయము తెలుగొలిపి కళాసగిల్యాగ

రాది గ్రంథములు తెలుఁగున వెలయించిరి. కొక్కొండ వేంకటరత్నము పంతులు గారును వీరును వాదోపవాదోద్యోగులు. శాస్త్రిగారు పంతులు గారి ప్రసన్న రాఘవమును ప్రత్యక్షరము విమర్శించి విడిచిరి. ఆ వాదము ముదురుపాకమునఁబడి పండితులకు బాధయనిపించినది. దూషణవాక్యములు తొలఁగించినచో 'ప్రసన్న రాఘవ విమర్శనము' ఆంధ్రికి స్వర్ణభూషణము. అప్పుడు ప్రసిద్ధిలోనున్న 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రిక యీభాషావివాదములను ప్రకటించినది. చింతామణి సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారు గొప్ప పండిత విమర్శకులు. వేంకటరాయశాస్త్రిగారికి వీరికి నొకటేప్రాణము.

శాస్త్రిగారు నాటకరంగమునకుఁ ప్రశస్తి దెచ్చిన కళాహృదయులు. ఇంచుమించు ముప్పదియేండ్లు సంస్కృతాంధ్ర నాటకములు తమ శిష్యులచేఁ ప్రదర్శింపఁజేసిరి. వీరి సర్వాధ్యక్షతతో నెల్లూరి 'ఆంధ్ర భాషాభిమాని సమాజము' నడచి రజతోత్సవము జరిపించుకొన్నది. పూండ్ల రామకృష్ణయ్యగారే యీసమాజస్థాపకులు. 1904 లో పరమ మిత్రులు రామకృష్ణయ్యగారు మరణించుటయు, చింతామణి యాఁగిపోవుటయు వేంకటరాయశాస్త్రిగారికి హృదయవేదనహేతువులైనవి. క్రైస్తవకళాశాలలో నిరువదినాలుగేండ్లనుండి పనిచేయుచు 1910 లో నాయుద్యోగమునుండి తప్పుకొనిరి. జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను పునరుద్ధరించి యెన్నో ప్రాక్తన గ్రంథములు సవ్యాఖ్యములుగా వెలువరించి భాషాసేవగావించిరి. వేంకటరాయశాస్త్రిగా రాంధ్రభాషా మధుమథనులు. ఆయనను మించిన పండితులుండవచ్చుఁగాక, ఆయనను శాదనిపించు కవులుండిరిగాక, ఆయన వలె భారతీపూజ గావించిన మహాభక్తుఁడు మాత్రము లేఁడు. ఆయన డెబ్బదియేండ్లు బ్రతికెను. కొన్నిశతాబ్దులు నిలుచు వాఙ్మయసేవ చేసెను. అహోరాత్రము లదేపసిగా వ్రాసినవాఁడు వ్రాసినట్లే యుండెను. చది

వినవాఁడు చదివినట్లేయుండెను. ఆపరిశ్రమము, దానికిఁదగిన యారో గ్యము, ఆ పాండిత్యము, దానికిఁ దగిన భావనాశక్తి మఱొకనియందుఁ జూడము. ఆయనమాటలాడిన మధు వొలికెడిది. ప్రతిపక్షిని చల్లఁగాఁ గొంతుకోయువాఁడు. సభలో నిలఁబడినచో సింహము. ఆయన రసవ త్సంభాషణములు వ్రాయుచో నొక మహాకావ్యము. స్వాతంత్ర్యము నెన్నఁడు చంపుకొనలేదు. పనిలేక యెవరినిఁ దూలనాడలేదు. ఆమేధ, ఆ ప్రతిభ, ఆ హాస్యవిలాసము, ఆ సమయస్ఫూర్తి యితరున కందవు. అవసరమునుబట్టి పెంకితనము చూపెను. ప్రాచీనాచారముల కతీతుఁడు. అట్లని నవీనాచారముల నాశ్రయింపనులేదు. సందర్భానుసారముగాఁ బోయెను. భాషావిషయమునను నిదియేత్రోవ. పాత్రోచితమని వ్యావ హారికము వాడెను. గ్రాంథికమును సమర్థించెను. గిడుగువారివలెఁగాక వీరు నియమసాపేక్షముగా గ్రామ్యము ప్రయోగింపవలెనని యుండిరి. భాషావిషయికముగాఁ గొంచె మభిప్రాయభేద మున్నను గురుజాడ అప్పారావుగారు వీరిని కడు గౌరవించిరి. వఝ్ఝల చినసీతారామ స్వామి శాస్త్రిగారును వీరియభిప్రాయముల నామతించిరి. బహుజనపల్లి సీతా రామాచార్యులవారు వీరి కాచార్యులు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారికి వీరాచార్యులు. కట్టమంచి రామలింగారెడ్డి ప్రభృతులు వీరికి శిష్యులు. అల్లాడి కృష్ణస్వామి ప్రముఖులు వీరి శాప్తులు.

ఈపుంభావసరస్వతికి లక్ష్మి ప్రసన్నత తక్కువ. శ్రీనాథునివలెఁ జివరికాలమునఁ జిక్కులఁ పడినారు. ఎంతచిక్కుపడినయైనను సరస్వతీపూజ నేమఱలేదు. ఇట్టి మహనీయచరిత్రునకు 1927 లో నాంధ్రవిశ్వవిద్యా లయము కళాప్రపూర్ణబిరుదమునిచ్చి సత్కరించుటలో విశేషములేదు.

నెల్లూరుమండలమున కెల్లఁ దిక్కనవలెఁ గీర్తిఁదెచ్చిన కవిపండితుఁ డీయన. శాస్త్రులుగారికృతులను బోషించిన రెడ్డివంశీయులయశము శాశ్వ తము. వేంకటరాయశాస్త్రిగారు 1919 లో ఆంధ్రసారస్వత పరిషత్తువారిచే

సన్మానితులై మహోపాధ్యాయ బిరుద మందిరి తమ వాగ్దేవతాపూజా విధాన మిట్లు నొడివిరి.

"ఆవాహనము శ్రీహర్షనాగానందాదిక వ్యాఖ్యానము - ఆసనసమర్పణము కథాసరిత్సాగరము - అర్ఘ్యము ప్రతాపరుద్రీయ నాటకము - పాద్యము మేఘసందేశాంధ్రటీక - అలంకారము ఆంధ్రప్రసన్న రాఘవ నాటకాదివిమర్శ కింకిణీగణ శింజాన శారదా కాంచిక - నైవేద్యము శృంగారనైషధ సర్వంకష వ్యాఖ్య."

ఉషానాటకమున వీరు జీవితవిషయ మిట్లు చెప్పించికొనినారు.

శాస్త్రసాహస్ర ప్రచారంబుగా నాట
కములందు దన్నిగమంబు గలిగినారు
సర్వజ్ఞసింగము సార్వభౌముని గద్దె
యెక్కినదొగ మది కెక్కినారు
పూర్ణరూపకరసం బుదరంబు నిండార
ద్రావి గట్టుగఁ ద్రేంచి తనిసినారు
టాటోటుఁగవులు పటాపంచలై మాయఁ
గాంచిక వాణి గర్వించినారు
బల్లారిభవ కవిపండిత సంఘంబు
మదరాసులో చూపుమాపినారు
కాళిదాసు శకుంతల నేలినారు
మించిన ప్రతాపకృతిని నిర్మించినారు
తగదొకో శాస్త్రిగారి గ్రంథమునుగోర
మహిత వస్తు పరాయణ మానసులకు.

---

# ధర్మవరము రామకృష్ణమాచార్యులు

## 1853-1912

వైష్ణవులు-తండ్రి: కృష్ణమాచార్యులు. తల్లి: లక్ష్మమ్మ. జన్మస్థానము: ధర్మపురి అగ్రహారము (తాడిపత్రి తాలూకా-అనంతపురము జిల్లా). నివాసము: బళ్లారి. జననము 1853 సం. (పరీధావి కార్తిక శు॥ ఏకాదశి) నిర్యాణము 1912 సం. విరచిత గ్రంథములు, ముద్రిత నాటకములు:—౧ చిత్రనళీయము, ౨ విషాదసారంగధరము, ౩ పాదుకా పట్టాభిషేకము, ౪ ప్రహ్లాద, ౫ సావిత్రీ చిత్రాశ్వము, ౬ మోహినీ రుక్మాంగద, ౭ బృహన్నల, ౮ ప్రమీలార్జునీయము, ౯ పాంచాలీ స్వయంవరము, ౧౦ ము ' వళి, ౧౧. చిరకారి నాటకము ౧౨ రోషనారా శివాజి, ౧౩ వరూధినీ నాటకము. అచ్చుకాని నాటకములు:— ౧ ఉషాపరిణయము ౨. సుశీలాజయపాలీయము, ౩ అజామిళ (వచన నాటకము), ౪ యుధిష్ఠిర యౌవరాజ్యము, ౫ సీతా స్వయంవరము, ౬. ఘోషయాత్ర, ౭ మదనవిలాస నాటకము, ౮ ఉన్మాదరామప్రేతశిక నాటకము, ౯ రాజ్యాభిషేకము. ౧౦ సుగ్రీవ పట్టాభిషేకము. ౧౧ విభీషణపట్టాభిషేకము, ౧౨ హరిశ్చంద్ర, కన్నడ నాటకములు: ౧ ఉపేంద్రవిజయము లేక వామనచరిత్ర, ౨ స్వప్నానిరుద్ధ నాటకము.

శ్రీమత్కృష్ణమాచార్యకవికిఁ బూర్వము తెలుఁగులో స్వతంత్రసంవిధానము గలనాటకములు లేవు. ఉన్న నాటకములు సంస్కృతమున కనువాదములు. ఆకారణమున నాంధ్రరంగస్థలములు విస్తరించి వెలయలేదు. పాశ్చాత్యసంప్రదాయము, ప్రాచీన సంప్రదాయము నెఱిఁగి యొకరకమగు క్రొత్తత్రోవదీసి నాటకములు రచించి స్వతంత్రనాటకరచయితలకు మార్గదర్శియనిపించుకొనిన మహాశయుఁ డీయన. వీరి కృషిని గుర్తించి గద్వాలమహారాజవరుఁడు 1910 లో నీయాచార్యకవిని, రత్నస్థగితమగు పతకముతో 'ఆంధ్రనాటక కవితాపితామహుఁ'డని బిరుద మొసఁగి గౌరవించెను. విచిత్రసమ్మేళనము గావించి నాటకపాత్రములకుఁ గేవ లాంధ్ర

త్వము నాపాదించి తొలుదొల్త స్వతంత్రనాటకములు రచించినవాఁ డగుటచే నీకవివరున కీబిరుద మనన్వర్థమని నామము పెక్కుపండితు లగ్గించిరి. పురప్రముఖులు ముగ్ధులై యొకకిరీటము నర్పించిరి. ఆచార్యులవారు నాటకకర్తలేకాక నటకులు కూడను. చిత్రనళీయములో బాహుకుఁడు, విషాదసారంగధరములో రాజనరేంద్రుఁడు, పాదుకాపట్టాభిషేకములో దశరథుఁడు, అభిజ్ఞాన మణిమంతములో నష్టబుద్ధి, ఈ పాత్రములు ప్రత్యేక ప్రశంసాపాత్రములుగా నటించెడివారు. దశరథ పాత్రధారియైన కృష్ణమాచార్యులవారికి సాటి కృష్ణమాచార్యులవారే యని పెక్కురు చెప్పుకొందురు. ఆచార్యులవారు తమమరణము నాటక రంగముననో న్యాయస్థానముననో యుండు నని యప్పు డప్పు డనుచుండువారు. అది తథ్యముగ వారు 1912 లో నొక యభియోగము నడపుటకు వెళ్ళి 'ఆలూరు' లో న్యాయస్థానమున నాకస్మికముగఁ గాలు జారి పడి 'రామచంద్రా' యనుచు నసువులఁ బాసిరి. వారిమృతకళేబరము నాలూరునుండి బళ్ళారికిఁ దెచ్చి యంత్యక్రియ నడపు సందర్భమున జరిగిన యూరేగింపుటుత్సవము పలువు రిప్పటికిఁ జెప్పుకొందురు. నాటకాచార్యుఁడై గడించినకీర్తియు, న్యాయవాదియై సంపాదించినపేరును నాఁడు ప్రకటితమైనవి. స్త్రీలు పురుషులు వృద్ధులు యువకులు నొకరననేమి, వేలకొలఁది పుష్పమాలికాదులచే నాచార్యకవి కంత్యసమ్మాన మొసంగిరి. ఇట్టి మహాశయుని శక్తియుక్తులు ముచ్చటించుకొందముగాక !

కృష్ణమాచార్యులవారి తండ్రిగారు మంచిపండితులు. తాత ముత్తాతలుకూడ విఖ్యాతవిద్వాంసులు. తండ్రిగారు బళ్లారి "వార్ధ లా కాలేజి" లో నాంధ్ర పండితపద మలంకరించిరి. జనకుని సన్నిధినే కృష్ణమాచార్యుఁడు సంస్కృతాంధ్రములు కఱచెను. మేధాశక్తి గొప్పది యగుట నిష్టె చక్కని సాహిత్య మలవడుట తటస్థించినది. దానివలన బహుగ్రంథపరిశీలనము గావించి పాండిత్యమునకు స్వయముగా మెఱుఁగు

పట్టుకొనెను. అష్టశతావధాన ప్రదర్శనము గావించి కొక్కొండ వేంకటరత్నము మహా మహోపాధ్యాయుని వంటివారిచే మెప్పులం గాంచెను. అదియటుండ, నీయన కాంగ్లభాషాభ్యాసము చేయవలయు నని యభినివేశము కలిగినది. పట్టుదల గలవారగుట ఎఫ్. ఏ పరీక్షలో నుత్తీర్ణత నందిరి. తరువాత ఆదవాని 'తాలూకాకచేరీ'లోఁ గొన్నాళ్లు లేఖకులుగాఁ గుదరవలసివచ్చినది. కవికి దౌర్గత్యముకూడ నొకకళ యైనదిగదా! పాపము నాఁటికి వీరిది పేదకుటుంబము. ఆదవానిలో సంసారము సరిగ జరుగక బళ్లారికి వచ్చి "కంటోన్మెంటు మేజిస్ట్రేటు కోర్టు"లో 'ప్రైవేటు వకీలు'గ పనిచేయ మొదలిడిరి. ఆయుద్యోగము వీరి దరిద్ర దేవతను దఱిమివైచినది. వకీలువృత్తియందు వీరికి లభించిన యుత్తేజనము "ఫస్ట్ గ్రేడ్ ప్లీడరుషిప్" పరీక్షకుఁ బురికొల్పి యందు త్తీర్ణుని గావించెను. నాఁటినుండి వీరిన్యాయవాదవృత్తి నిరాఘాటముగ సాఁగి న్యాయస్థానముల కెక్కు నభియోగము లన్నింటను వీరి దొక పక్ష ముండితీరునంత యున్నతికిఁ గొంపోయెను. ప్రతిపక్షులను సాక్షులను ప్రశ్నించుటలో వీరినేర్పు గొప్పది. వీరివాదము వినుటకుఁ బ్రజలు గుమిగూడి యుండువారఁట. బళ్లారిప్రాంతీయు లిప్పటికిని వీరిన్యాయవాద దక్షత వేనోళ్లఁ జెప్పుకొందురు.

ఈయాచార్యకవి యద్భుతమేధాశక్తి యనేకకళలను గ్రహించినది. ఆయుర్వేదము వీరులెస్సగ నెఱుంగుదురు. అది వీరి వంశపారంపర్యముగ వచ్చువిద్య. నాడీపరీక్షలో నీయన సిద్ధహస్తులఁట. జ్యోతిశ్శాస్త్రముననుు వీరి ప్రవేశము చాలగొప్పది. వారినాటకములలో నిందులకు నిదర్శనములు పెక్కుగలవు. చదరంగ మాడుట యన్న వీరికిఁ జెప్పరాని మక్కువ. నెలలతరబడి యనన్య మనస్కులై యాడుచుండువారని ప్రతీతి. అభినయశాస్త్రము వీరికిఁ బరిచితము. "డిబేటింగుసొసైటీ" నొకటి స్థాపించి పలువురు పురప్రముఖులనందు సభ్యులుగాఁ జేర్పించి 'షేక్సుపియరు' నాటకములలో ముఖ్యపాత్రముల నభినయించుచుండెడివారు. ఆ సరసవినోదినీసభకు నాఁడు పెద్దప్రఖ్యాతి వచ్చినది. నాటకజ్వరదముప్పై



గల దొల్లిటిపేరుప్రభావము తొలఁగింపని సభయే. ఈసభాముఖమున నొకసారి 'ఆంధ్రకవితాపితామహ సమ్మానము' ఆచార్యులవారి కతివిజృంభణముగా జరిపిరి. మఱొకసారి శ్రీ వావిలికొలను సుబ్బారావుగారి 'ఆంధ్ర వాల్మీకి రామాయణ' కృతిసమర్పణోత్సవమునకు వీరి నధ్యక్షులుగా నెన్నుకొనిరి. అప్పుడు వీరి "పాదుకా పట్టాభిషేకము" ప్రదర్శింపఁగా రూ 1500 వచ్చినవి. అవి కోదండరాముని కైంకర్యము నకే యర్పింపఁబడినవి. వీరినాటకములకు ప్రజాసామాన్యములోఁ గల గౌరవమున కిది మంచితార్కాణ. అంకములలోని కథ రంగములుగా విభజించుట వీరినాటకములలోని క్రొత్తపద్ధతి. ఇది పాశ్చాత్త్య సంప్రదాయము. నాటకము విషాదాంతముచేయుట వీరి కనభీష్టము కాదు. 'సారంగధర' ను జూచిన మనకిది యవగతము. కాళ్ళు చేతులు విఱుగఁ గొట్టఁబడి సారంగధరుఁడు చనిపోవును. అంతతో నాటకము సమాప్తము. మతియొకసంప్రదాయముగలవాఁడైనచో నిట్లు వ్రాసి యుండఁడు. ఇదియు నాంగ్లేయము. సారంగధరునిపై నింద మోపిన చిత్రాంగిని విచారించుటకు రాజనరేంద్రుఁ డొక న్యాయస్థానసభ చేసెను. అది సరిగ నిసర్గసుందరముగనుండి కృష్ణమాచార్యులుగారు గొప్ప న్యాయవాదియని సాక్ష్య మిచ్చుచున్నది.

వీరి నాటకచక్రములో 'చిత్రనళీయము' మున్నందిన ప్రఖ్యాతి గొన్నది. అందలి పద్యగద్యములు ప్రబంధములకు దీటువచ్చినవి. అది ప్రదర్శించుట కొకపాటినటకుఁడు పనికిరాఁడు. సంపూర్ణమైన యర్థజ్ఞానము కలిగి మరల నిట్టికవిత్వము వ్రాయఁగలనన్నవాఁడు వీరినాటకములు నోటఁబట్టఁగలఁడు. తెలుఁగులో ననువాదములు రెండుమూఁడు తప్ప స్వతంత్ర నాటకములు రచించుకలవారు నాఁటికి లేకుండుటచేఁ బ్రాబంధికవాసన వీరినాటకములలో ననసేల, ఆనాఁడు వ్రాసిన నలుగు రైదుగురు కవుల నాటకములలోఁగూడ వెల్లివిరిసినది.

ఆచార్యులుగారి చిత్రనళీయము చూడుఁడు! ప్రథమాంకములో స్వయంవరరంగమున భారతిచేత దమయంతికి భుజంగప్రియు లాదులైన యెన్ని ప్రాబంధికవృత్తములతోఁ జెప్పించెనో! ఇప్పుడు బొత్తిగా నాట

కములలోఁ బద్యములను బరిహరింపవలయు ననుచున్నారు, అది యౌచితీపోషక మని - అటువంటియిప్పుడు పృథ్వీవృత్తములు - మత్తకోకిలములు దృశ్యకావ్యములలో నుపయోగించుట యొకరకముగానుండును. నాఁటినటకులుకూడ సర్వసమర్థులు ఇప్పుడిట్టివి యాడువారు నూటికిఁ గోటికిని - ఇంచుమించుగా శ్రీనివాసరావుగారివి, కృష్ణమాచార్యులు గారివికూడఁ బద్యనాటకప్రాయములు. అడుగడుగునకుఁ బద్యము. తిరుపతివేంకటకవుల పాండవనాటకములలోను పద్యములపా లెక్కు-వయే. కాని వారు కొంతశైలి తేలికపఱిచిరి.

చిత్రనళీయము చతుర్థాంకములో 'శరద్రాత్రి' ని వారివారి యుపాలంభనములు జరుగునదియెడు పద్యములలో నాచార్యులవారు వర్ణించి వైచిరి. నిజముగా నాపద్యములు వసుచరిత్రాది ప్రబంధములకునందని యుదాత్తభావములు కలవి. భాషయు నట్టిదే. విరహవ్యథావిధురుఁడైన బాహుకభూమికాధారి యొక్క- పట్టున నాపద్యములు చదువవలయునన్న డొక్క- బ్రద్దలగును. నాఁటినటకులు కాఁబట్టి చిత్రనళీయాదుల కంతి ప్రఖ్యాతి ప్రజాసామాన్యములోఁగూడఁ దీసికొని రాఁగలిగిరి. నటకుత్రై ఖండాంతర ప్రసిద్ధిగాంచిన తాడిపర్తి రాఘవాచార్యులుగారికి మన ఆచార్యులుగారు మేనమామ. వీరి నాటకపద్యములు చాలమందికి నోటికి వచ్చినవే యై యుండును. అయినను రెండుమచ్చు:

అతిమాత్రంబుగ దుఃఖముల్ సుఖము దైవాధీనతం గర్మ సం
గతిమైఁ బ్రాణికిఁ గల్గుగా యిప్డు దుఃఖప్రాప్తి మల్గాడె శ్రీ
యుతుఁడా భూరమణుండు వెండియును నేఁడో రేపొ యాకాల దు
స్థితి దీఱంగను సర్వసౌఖ్యముల నిశ్చింతాత్మతం జెందఁడే ?
బలిరే కంటిసిగంటి సప్తజలధి ప్రావేష్టితాఖండ భూ
లలనాధీశ కిరీట వాటికాహారోలంబాయమానస ప్రభో
జ్జ్వలితారిందమనూపురాస్త్ర సదసేవాప్రీతగోత్రాధవుల్
నళభూమీధవు నాశ్రితౌఘ కరుణా నవ్య ప్రభామాధవున్ .

# దేవులపల్లి సోదరకవులు

# 1853 - 1909, 1856 - 1912

అగ్రజులు: దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులుగారు. తమ్ములు: తమ్మనశాస్త్రియను నామాంతరముగల వేంకటకృష్ణశాస్త్రిగారు. పెద్దవారిజననము 1853 సం. నిధనము 1909 సం. రెండవవారి పుట్టుక 1856 సం. నిర్యాణము 1912 సం. [illegible] కాలమున నివసించిన చంద్రమపాలెమున (గోదావరిమండలము) వీరి మనుగడ- తెలగాణ్యవైదికశాఖీయులు. కౌండిన్యసగోత్రులు. తండ్రి: వేంకటకృష్ణశాస్త్రి. మహేంద్రవిజయము (ఆంధ్రప్రబంధము) రామవంశముక్తావళి (సంస్కృతము-అచ్చుకాలేదు) మల్హణస్తవము (తెలుగుటీక) రామరాయవిలాసము, రామపంచాశత్తు (సంస్కృతము) ఇవి సుబ్బరాయశాస్త్రివిరచితములు- నయనోల్లాసము, యతిరాజవిజయము, రామవంశముక్తావళి (తెలుగు కావ్యము. అముద్రితము) మొ. [illegible]శతకము, ఇవి తమ్మనశాస్త్రి రచితములు.

వేఁగవు రాఘవుండు; పదివేలపురాణము లన్నియు నెన్న నీ
యేలిక లెన్న రాపుకులు లెప్పటివారల కిప్పు డేప్పు భూ
పాలి నిజంబుగాఁ దనకటంబును దేవులపల్లివంశ భూ
పాలి దలంచుచుండుఁ దనపాలిటి కీయుభయుంబె ప్రాపుగన్.

చూచితిరా సుబ్బరాయశాస్త్రివరుల రామభక్తివిశేషము? రామభక్తిని మించినది రాజభక్తి. ఈరెండింటి ప్రాపుచేతను, మహేంద్రవిజయాది మహోత్తమకృతులు రచించి, యాంధ్రదేశమున నక్షయకీర్తి నార్జించి మించిన మహాశయుఁ డీయన. గంగాధరరామరాయేంద్రుఁడు తనసింహాపీఠిపైఁ గూరుచుండఁబెట్టి "ప్రాజ్యతరంబగు రాజ్యము ల్లసిన్, దే గదా సుబ్బరాయసుకవీ!" యని యఖండసత్కార మొనరించినను అవలిప్తుఁడు కాని యభిజ్ఞశేఖరుఁ డీయన. సుబ్బరాయశాస్త్రిగా రాంధ్రభోజాభిఖ్యతో వెలయుచున్న నేఁటి సూర్యరాయమహారాజ

వరునకు సంస్కృతభాషాదేశికుఁడై యలరారిన యదృష్టవంతుఁడు. రామనామసంస్మరణము, రామరాయసందర్శనము నను దినకృత్యములుగా నెంచి పవిత్రజీవయాత్ర నెఱపినపండితుఁడు.

దేవులపల్లి వంశీయు లెల్లరు విద్వత్కవులు. పీఠికాపుర రాజ్యస్థాపకులు శ్రీరావు తెనుంగురాయణింగారి యాదరణముచే వీరివంశస్థులు పిఠాపురమునఁ బ్రవేశించిరి. సుబ్బారాయశాస్త్రిగారి తండ్రి గొప్పపండితుఁడు. శాస్త్రిలుగారు పితురంతేవాసులు. వారికడఁ గావ్యనాటకాలంకారాదులు, జ్యోతిర్విద్య నధికరించిరి. కవిత్వాభిరుచి యుగ్గుఁబాలతోఁ బెట్టినది. ఇఁక విశేషమేమన, ఆశువుగోఁ బ్రబంధశైలి శాస్త్రిగారి కలవడినది.

1879 లో శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారు పిఠాపురాస్థానమున నవధానము గావించిరి. అప్పుడు గంగాధర రామరాయేంద్రులు "మనయాస్థానమున నిట్టియవధానముచేయు ప్రతిభావంతు లుండిరే" యని ప్రశ్నించిరఁట. మరునాఁడు దేవులపల్లి సోదరుల శతావధానము ప్రారంభమైనది. అనన్యసామాన్యమగు కవితాధారతో నాయవధానము జయప్రదముగా నెఱవేరినది. వేంకటాచార్యులవారు సోదరకవుల ప్రతిభకు నివ్వెఱపోయిరి. మహారాజు తః సంస్థానకవులశక్తి కానందపడెను. అప్పటినుండియు నాస్థానమున వీరిపేరు మాఱుమ్రోసినది. సుబ్బారాయశాస్త్రిగారు 'రావువంశముక్తావళి' సంస్కృతమున సంతరించిరి. అది మహారాజు 1882 లోఁ గృతినందెను. ఆసందర్భమున నే ఈకవిరాజున కామహారాజు "రాజ్య మిచ్చితిఁ బుచ్చుకొ"మ్మనెను. 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్?'

1890 లో గంగాధరుఁ డస్తమించెను. ప్రభువియోగము భరింపలేక మనకవి పీఠికాపురాంగ్ల పాఠశాలోపాధ్యాయపదవి విడిచి యింటఁ గూర్చుండెను. ప్రభుభక్తి యిట్లుండవలయును. సుబ్బారాయశాస్త్రిగారి తమ్ములు తమ్మనశాస్త్రిగారిమొదలను పై విషయము లుపలక్షణ

విధిచే నన్వయించుకొందురని పునరుక్తి సేయలేము. ఈసోదరకవుల సౌభ్రాత్రము గొప్పదని చెప్పుకొందురు. తమ్మన్నశాస్త్రిగా రన్నిటను నాయన్నకుఁ దగిన తమ్ముఁడు. అవధానాది ప్రదర్శనములలో నన్నగారి కంటెఁ దమ్ముఁడేమిన్న యని జనశ్రుతి. పాండిత్యమున నగ్రజునిదే యగ్రతాంబూలము.

ఈకవిసోదరులు తమనాఁటికి సుప్రసిద్ధులైయున్న కూచిమంచి వేంకటరాయఁడు-శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి-మాడభూషి వేంకటాచార్యుఁడు- మొదలగువారి పరిచితిఁగలసెఁ దెలుఁగుకవిత్వమునఁ దొలఁకు వలు, కొన్ని క్రొత్తపోకడలు సంగ్రహించినారు. మాడభూషికవిని మించి యవధానము చేసినమని కృతార్థులైనారు. మదరాసునఁగల ప్రముఖులనుగూడ నవధాన ప్రదర్శనమున మెప్పించిరి. ఎన్నఁడో పదునాలవ శతాబ్దికిఁ బూర్వ మంకురితమై, మాడభూషికవిచేఁ బల్లవితమై, దేవులపల్లి సోదరులచేఁ గోరకితమై, తిరుపతి వేంకటేశ్వరాది కవులచేఁ గుసుమితమై యీయవధానవిద్యాలత కొన్నాళ్లు దెలుఁగు మన్నీల తల లూఁపించి క్రమముగా వెఱ్ఱితలలు వేయుస్థితి వచ్చినది.

సుబ్బరాయశాస్త్రిగారు ప్రభుల యభిషేకవిజయ వార్త విని వార్తాహారునకుఁ దమచేతుల నున్న బంగారుకంకణములు బహూకారముచేసిరఁట. ఆయన ప్రభుభక్తి యట్టిది. 'మహేంద్రవిజయ' ప్రబంధ మీవిషయమును దార్కాణించును. ఈ "మహేంద్రవిజయము" నవీనవాసన ముమ్మరముగా గల మధురకావ్యము. ఏకకృతినంతటికెల్ల నిది మేలుబంతి. మచ్చునకొకపద్యము చాలును.

తొలికోడి కానవై యెలుఁగెత్తి యుఁడుభం
గులఁ గుక్కుటేశుండు కొసరి కూసె
నాలమందలకెల్ల నధినేత కానవై
ఘాంకంబుగా నంది యంకెవైచెఁ

దీర్ఘంబు దెచ్చుహా స్తికిఁ బెద్ద తానైయె
లంబోదరుఁడు బృంహితంబొనర్చె
విహగంబులకు నెల్లఁ బెద్ద తానై కుహూ
రుని కేకి పిలుచ నిస్వన మొనర్చెఁ
దాని లింగార్చకులకుఁ బ్రాథమికుఁ డనుచుఁ
బ్రాతరనిలుండు కేతనాగ్రమున నున్న
ఘంట మ్రోయించె వందిమాగధులు తామె
యగుచు భక్తులు పేర్కొని రప్పుడుమ్ము.

మహేంద్రవిజయము. (౬-౨౩-౨)

శాస్త్రిప్రాదుల దేవభాషాకవితాధోరణి కొక శ్లోకము మూదలింతును.

జ్ఞాతార శ్శ్రోతార ప్ర్స్తోతారః కాంక్షితార్థ దాతారః
నేతార స్సంతి యదిఖ్యాతా రచయంతి సత్కృతీః కవయః

అన్నదమ్ము లిద్దరును సంస్కృతభాషా కవితలోఁ జేయితిరిగిన వారు. తమ్మునశాస్త్రిగారి ధారాశుద్ధి చూడుఁడు.

ఫణీశదరతారకా శశిమణీ ఘృణీధోరణీ
తృణీకరణనైపుణీ విలసితాపస వ్యాంగకమ్
గణాధిపసమర్చితం గణసుధీగణగ్రామణీ
పణాయితగుణాన్వితం మనసి కుక్కుటేశం భజే.

తమ్మునశాస్త్రిగారి తెలుఁగుకూర్పులలో నయనోల్లాసము, యతిరాజ విజయము, పేర్కొనఁ దగినవి. నయనోల్లాసము ప్రభుపట్టాభిషేకోత్సవ సమయమున వెలువడినది. అప్పుడు 'నయనోల్లాసము' సార్థకత నొందినది. ఇందలి పద్యములు ధారాళముగా నడచినవి. కాని వ్యర్థపదములు బహుళముగ దొరలినవి. వీరి 'యతిరాజవిజయము' చక్కనిశైలిలో నున్నది. ఇది మూఁడాశ్వాసములు వ్రాసి తమ్మునశాస్త్రిగారు గతించిరి. వారి తరువాతఁ బీఠికాపురసంస్థానకవులు వేంకటరామకృష్ణులు తక్కిన

యాశ్వాసము పూరించిరి. యతిరాజవిజయమునఁ దమ్మన శాస్త్రిగారు కృతిపతులచే నిట్లు చెప్పించుకొనిరి.

పదునాలుగేడులఁ బొదలు ప్రాయమునాఁడె
కడఁగినాఁడవుగదా కవితసేయఁ
బదునెన్మిదవయేఁట వ్యాకరుచ్చితివిగదా
సకలేశశతక మాశ్చర్యఘటితి
నిరువదైదవయేఁట విరచించితివిగదా
రావునకుల చరిత్ర ప్రబంధ
మొడనెడ వేనవే ల్నుడివినాఁడవుగదా
యనవమపద్యముల నత్యాశులీల
నేఁడు వేడుకఁ జేయుచున్నాఁడ వన్న
దనుమతిని నయనోల్లాస మనెడుకృతిని
క్షితిని బరికింప నతిశీఘ్రమగతిని బూని
సుకవితను గూర్చునేర్పు నీసొమ్ముగాదె !

అధిన వాంధ్రకవులలోఁ బ్రసిద్ధభావుకులగు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తమ్మన శాస్త్రిగారి తనూజు లని తెలియనివా రుండరు.

# పురాణపండ మల్లయ్యశాస్త్రి

# 1853 - 1925

ఆరామద్రావిడశాఖీయ బ్రాహ్మణుఁడు. తండ్రి: భద్రయ్యశాస్త్రి. తల్లి: రామమ్మ. జన్మస్థానము: పెదతాడేపల్లి. నివాసము: ఖండవల్లి, పిఠాపురము, రాజమహేంద్రవరము. జననము 1853 సం. అస్తమయము 1925 సం. గ్రంథములు: ఆంధ్రీకృతబ్రహ్మసూత్ర భాష్యము (4 సంపుటములు) ఉపనిషత్కథలు, శుక్రనీతిసారము ప్రభావతీప్రద్యుమ్న, భద్రాపరిణయములకు వ్యాఖ్యలు- ఇత్యాదులు.

మల్లయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో మహాపండితులు. వీరు ప్రఖ్యాతప్రాజ్ఞులైన వెంపరాల దక్షిణామూర్తిశాస్త్రిగారి సన్నిధిని సూత్రభాష్యము నియమపూర్వకముగ నధ్యయనించిరి. తర్కవ్యాకరణములు పఠించిరి. ప్రస్థానత్రయతత్త్వ మెఱింగిరి. ఇట్టివిద్యాధికారసంపత్తి కలిగినమీఁదట మల్లయ్యశాస్త్రిగారు పీఠికాపురాధిపతులయాజ్ఞచే శాంకరసూత్ర భాష్యమును దేటతెల్లముగఁ దెలుఁగున వ్రాసిరి. సూత్ర భాష్యమునకు మఱికొందఱుకూడ తెలుఁగు వ్రాసిరి. ఆ యనువాదములలో నీయదియే మేలైనది. బ్రహ్మసూత్ర భాష్యము ననువదించుటకు సామాన్యపరిజ్ఞానము చాలదు. సర్వశాస్త్ర ప్రవేశము, షడ్దర్శన పరిచయము నుండవలయును. అధీతిబోధాచరణ ప్రచారణము లున్నవారికిఁగాని యిట్టియుద్గ్రంథముల తత్త్వము తెలియదు. సర్వథా సామర్థ్యముకలిగి యాంధ్రవచసరచనలోఁగూడ నాఱితేఱినవారగుటచే మల్లయ్యశాస్త్రిగారు 'ఆంధ్రసూత్రభాష్య' మందుపాటులోనున్న శైలిలో రచింపఁగలిగిరి. విషయగౌరవ ప్రాశస్త్యాదులంబట్టియు నాంధ్రభాషకుఁ బుష్టికరమగుటంబట్టియు నీగ్రంథము శాశ్వతముగ నాంధ్రమున నుండఁగలదు. రచనావిశేషమున కీపంక్తులు పరికింపుఁడు.

" 'శాస్త్రయోనిత్వాత్' – ఋగ్వేదాది శాస్త్రమునకుం గర్తయగుటవలన (బ్రహ్మము సర్వజ్ఞము) బ్రహ్మస్వరూప జ్ఞానమునందు ఋగ్వేదాదిశాస్త్రమే ప్రమాణముగుటవలన దానిచేతనే జగజ్జన్మాది కారణమగుబ్రహ్మము తెలియంబడునేని అనియర్థము." భా. గొప్పది

యును పురాణన్యాయ మీమాంసాదులగు పెక్కు విద్యాస్థానములచే నుపకరింపఁబడినదియు దీపమువోలె సర్వార్థములఁ బ్రకాశింపఁజేయునదియు సర్వజ్ఞకల్పము నగు ఋగ్వేదాదిశాస్త్రమునకు బ్రహ్మము యోని=కారణము. సర్వజ్ఞునిగుణమగు సర్వార్థములం బ్రకాశింపఁజేయు శక్తితోఁగూడిన ఋగ్వేదాది శాస్త్రమునకు సర్వజ్ఞునిఁగాక వేఱొకదానినుండి యుత్పత్తి సంభవింపదు. పాణిని మొదలగు వారివలనఁ దెలియందగినవానిలో నొకభాగమగు వ్యాకరణాదికమువలెనే యేయేవిస్తారార్థమగుశాస్త్రమేయే పురుషునివలనఁ బుట్టుచున్నదో యాతఁడా శాస్త్రముకంటె నధికతరవిజ్ఞానము గలవాఁడని లోకమునం బ్రసిద్ధము..."

శాస్త్రిగారీరీతిగఁ బూసగ్రుచ్చినట్లు సూత్రభాష్యభావము కొలఁదిగ నుండఁ దెనిఁగించి యాంధ్రభాషకు నుపకారోపకృతి గావించిన మహాశయులు. మల్లయ్యశాస్త్రిగారు "ఉపనిషత్కథలు" వ్రాసిరి. 'శుకనీతిసారము' వచనమున రచించిరి. పింగళిసూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమునకు వ్యాఖ్యవ్రాసిరి. వీరి గ్రంథములన్నియు పీఠికాపురప్రభువులే ప్రకటించిరి. అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారి భద్రాపరిణయమునకు వ్యాఖ్యా విపులపీఠికలు రచించిరి. అనేకపాఠాంతరములతో ననుగుణమగు వ్యాఖ్యతో నాంధ్రభారతములోని కొన్నిపద్యములు వీరు పరిష్కరించిరి. ఈపీఠికలవల్ల వీరియాంధ్రకవిత్వ పరిశ్రమ తెల్లమగును. మల్లయ్యశాస్త్రిగారు పద్యకవిత్వమునఁ గృషిచేసిన కవులు కారు. అయినను నడుమనడుమఁ బద్యము లల్లుటలవా టున్నది. అల్లినపద్య మందముగనే యుండును.

శ్రీరఘువంశ వారినిధిశీతమయూఖుఁడు జానకీమన
స్సారసచంచరీకము నిశాచరమత్తకరీంద్ర సింహమున్
ధీరజనాగ్రగణ్యుఁడు సుధీజనసన్నుతకీర్తిశాలియౌ
నారఘురామమూర్తి మదినాదరముప్పఁగఁ గాచులోకముల్.

'ఆంధ్రసూత్రభాష్యారంభము'

శాస్త్రిగారి జనకులు గొప్పసంస్కృతాంధ్రవిద్వాంసులు. వారంధులు. తోలుతీఁడంఁడ్రిగారికడనే నునశాస్త్రిగారు విద్యాభ్యాసము గావించిరి. తరువాత విజయనగరమునఁ బెక్కువాళ్లు పఠించిరి. 1877 లో బెజవాడ కడనున్న కొండపల్లి మిషన్ హైస్కూలులో నధ్యాపకులు. తరువాత రాజమహేంద్రవర పాఠశాలలో వడ్డాది సుబ్బారాయకవిగారి స్థానమున 1884 వఱకుఁ బనిచేసిరి. పిమ్మట అమలాపురము హైస్కూలులో 1889 లోఁ బ్రవేశించి 1906 వఱకు నుండిరి. అటుతరువాత పిఠాపురాంగ్లపాఠశాలయం దాంధ్రాచార్యులై, ఆ సంస్థానమున నాంధ్ర గ్రంథ పరిశోధక వ్యాఖ్యాతలై శ్రీ సూర్యరాయాధిపతులచేఁ బరిపోషింపఁబడిరి. పిఠాపుర సంస్థానమంత్రి శ్రీ మొక్కపాటి సుబ్బారాయఁడుగారు వీరికిఁ బరమమిత్రము. సుబ్బారాయఁడుగారు మల్లయ్యశాస్త్రిగారికడ సూత్రభాష్య మధ్యయనించిరి. పోలవరాధీశులు కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావుబహద్దరువారు మల్లయ్యశాస్త్రిగారికి శిష్యులు. శాస్త్రిగారికి ఆముక్తమాల్యద పై నెక్కువయభిమానమనియు, వీరి మురారిపాఠము వినఁదగిన దనియుఁ బెక్కురు చెప్పుదురు. వీరి సంభాషణము విచిత్రతరమై హాస్యప్రచురమై యుండెడిదఁట.

చిలకమర్తి లక్ష్మీనరసింహకవి మల్లయ్యశాస్త్రిగారి మేనల్లుఁడు. అచ్చముగా, ఆయన మాటవాలిక మేనమామ పోలికయే. ప్రసన్నయాదవనాటకములో చిలకమర్తికవి యిటులు ప్రస్తావించెను.

గీ. శ్రీపురాణపండ కులాబ్ధి శీతకరుఁడు
పరమఁ డాంధ్రగీర్వాణ భాషావిదుండు
మల్లయార్యుండు నామేనమామ యగుటఁ
గవిత యెటులున్న నీకృతి గణుతిఁగాంచు.

పురాణపండ పండితుఁడు ఆంధ్రసూత్రభాష్యమువలన నవినాశమగు యశము సంపాదించుకొనిన రచయిత.

# పారనంది రామశాస్త్రి

# 1853–1930

కాసలనాటి వైదిక బ్రాహ్మణులు. అశ్వలాయన సూత్రులు. కాశ్యపసగోత్రులు. తల్లి: రామలక్ష్మమ్మ. తండ్రి: ముఖలింగేశ్వరుడు. జన్మస్థానము: పిండివాడ (పర్లాకిమిడి సంస్థానమునకు చెందినది). జననము: 1853 సం॥ (పరీధావి శ్రావణ శుక్ల నవమి) నిర్యాణము: 6-12-1930 సం. గ్రంథములు: 1. ఆంధ్రశబ్దచింతామణి (సుబోధినీ వ్యాఖ్య) 2. ఆంధ్రమహాభారత విమర్శనము 3. కురుక్షేత్రయుద్ధ కాల నిర్ణయము 4. మధుకేశ్వరీయము (నాటకము. అముద్రితము).

శ్రీ రామశాస్త్రిగారు పెద్దయాస్తికలవారు కాకపోయినను గొప్ప యాస్తికులు. పేరు మోసినపండితులు. శ్రోత్రియులు. తెలిసిన విమర్శకులు. సంస్కృతాంధ్రములలో సరితూకముగల పరిశ్రమ పాటవము గలవారు. తొలుత గావ్యపాఠము గావించి శాస్త్రపఠనముపై మనసు గూరి బొబ్బిలిచేరి శ్రీ నుసర్ల సీతారామశాస్త్రిగారిలో దర్శ్యాలంకార వేదాంతము లధ్యయనించిరి. సంస్కృతములో లోతులుగడవిన పాండితి సంపాదించి, పదపడి తెలుగుబాస పోలువులు గుర్తించినారు.

పర్లాకిమిడిరాజు రామశాస్త్రిగారి సామర్థ్యము నెఱిగి సంస్థానోన్నత విద్యాలయమున నుపాధ్యాయపదవి యిడి గౌరవించిరి. ఆయుద్యోగము 1853 మొదలు 1911 వఱకు విచ్ఛిత్తి లేకుండ గొనసాగినది. శ్రీశాస్త్రిగారు తాత్త్వికదృష్టిగల కర్మిష్ఠియగుటచే, తనకుమారుడు పట్టభద్రుడై, యుద్యోగియై, పదిరాళ్లు సంపాదించుకొను ప్రయోజకుడై యుండుటజూచి తనపని చాలించుకొనెను.

దేవీభాగవతమును దెలిగించిన త్రిపురాన తమ్మయదొర వీరిని గౌరవించి ధన్యుడయ్యెను. ఉర్లాము మున్నగు సంస్థానములలో వీరు ధర్మాదిశాస్త్రముల పరీక్షల నెగ్గి యుగ్గడింపబడిరి. పండితులతో శాస్త్రార్థ

ములు 'నీవా నేనా' యని చేయఁగల శ్రీ రామశాస్త్రిగారు చాలకాలము దాఁక తెలుఁగు నెఱుఁగరనుట యొక రహస్యము. గిడుగువారి వాద శంఖనాదములు చెవులఁబడి ఆంధ్రభారతము తీరెట్లుండునో యని చదువ నారంభించిరి. అదియాది, యగస్త్యునవలె యావదాంధ్ర వాఙ్మయ మహోదధిని రామశాస్త్రిగా రాపోశనించిరి. దానిఫలమే "ఆంధ్ర మహా భారత విమర్శనము" ఇది 500 పుటలు పైబడినకూర్పు. ఉద్యోగ పర్వ విమర్శనము మాత్రమే యచ్చువెలుఁగు చూచినది.

ఆంధ్రశబ్దచింతామణిపై 'ఉద్ద్యోతిని' అను గొప్ప వ్యాఖ్యా గ్రంథము వీరు రచించిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారు చింతామణి నన్నయ కృతము కాదనఁగా, ఆ వాదము పసిగాదని రామశాస్త్రిగారు సోదాహరణముగా నన్నయకృతమే యని నిరూపించిరి. ఇది తెలుఁగులో వీరి తొలిరచన. జంకులేనివిద్వాంసులగుటచే, వీరేమి వ్రాసినను స్వాతంత్ర్య రేఖలు స్పష్టముగ గోచరించును. 'జ్ఞ' యను వర్ణము కంఠ్యమా, తాలవ్యమా యను విషయమును జర్చించుచు గొప్ప విమర్శనము వెలువరించిరి. వీరి విమర్శన రచన లెన్నియో 'భారతి' ప్రభృతి పత్రికలలోఁ బ్రచురితములు. వీరి సంస్కృతరూపక రచనకు దోహదము చేసిన మహనీయులు పర్లాకిమిడి ప్రభువుల పిన్నతండ్రియగు నొక రాజుగారు. ఆయన గీర్వాణ వాఙ్మయాభిరుచి పెద్దగాఁగలవాఁడని ప్రసిద్ధి.

ధర్మశాస్త్రముపై రామశాస్త్రిగారికి మంచి యభినివేశము. నిరంతరము ధర్మగ్రంథావలోకనముతోఁ గాలక్షేపముచేసి, మహావ్యాఖ్యాతగా, విమర్శకుఁడుగాఁ బేరందిన పారనంది పండితుఁడు తెలుఁగుభూమిలో దాఁగిన చిరత్న రత్నము.

# వడ్డాది సుబ్బారాయకవి

## 1854-1938

నియోగిబ్రాహ్మణులు. హరితసగోత్రులు. తండ్రి: సూరపరాజు. తల్లి: లచ్చాంబ. జన్మస్థానము: నగరముతాలూకా లోని పాసర్లపూడి. నివాసము: రాజమహేంద్రవరము. జననము: 30-7-1854సం - (ఆనంద నామ సం. శ్రావణ శు. 9 ఆదివారము). నిధనము. 2-3-1938. కృతులు: ప్రబోధ చంద్రోదయము, ఆంధ్రవేణీసంహారము, అభిజ్ఞానశాకుంతలము, మల్లికామారుతము, విక్రమోర్వశీయము, చండకౌశిక నాటకము, నృసింహవిశ్వరూపము, గౌతమీ జలమహిమాను వర్ణనము, భక్తచింతామణి, ఆర్తరక్షామణి, మేఘసందేశము, నందనందనశతకము, సతీస్మృతి, సుతస్మృతి, వసురాయచాటూక్తిముక్తావళి, శ్రీసూక్తివసుప్రకాశిక, సుగుణప్రదర్శనము — ఇత్యాదులు.

ఉపాధ్యాయత్వమునఁ గవిత్వమున సుబ్బారాయుఁడుగారు చాల సమర్థులు. రాజమహేంద్రనగరమునందలి సర్వకళాశాల వీరి యధ్యాపకత్వమున కాశ్చర్యపోయెడిది. ఓ. జె. కూల్డ్రిదొరయంతవాఁడు వ. సు. రాయకవిగారి పాఠము వినుటకుఁ జెవికోసికొని తలుపుచాటున నక్కువాఁడనిప్రతీతి. అందులో నాయన భారతపాఠము మఱియు నద్భుతము. విని తీరవలె నని నాఁటి విద్యార్థులిప్పటికిఁ జెప్పుకొనుచుందురు.

మదరాసు గవర్నరైన సర్. కె. వి. రెడ్డినాయఁడు వీరికిఁ దెలుఁగున శిష్యుఁడు. విదేశీయుఁడు "హ్యామ్నెటు" దొర సుబ్బారాయుఁడు గారియొద్దఁ జాలకాల మాంధ్రభాష నభ్యసించెను. వీరికడ విద్యాభ్యాసము చేసి పైకివచ్చినవారు పెక్కండ్రు. ఎంతవారైన వీరియెడ నమ్రులై యుండవలసినదే. ఆయన యితరులకు లొంగలేదు. విద్యార్థులకు లోఁకువకాలేదు. ఆత్మగౌరవము కాపాడుకొనుచుఁ దా మేస్థానమున నుండవలయునో, యాస్థానమున నుండుట వారి సహజగుణము. మాట

లలోఁ బొందిక, నడతలో నార్జవము, జీవికలో నిరాడంబరము వ. సు. రాయకవికిఁ బెద్దమనుష్యులలోఁ జేరుదెచ్చినవి. నచ్చినవారి నదేపనిగా నుతించుట, నచ్చనివారినిఁ బట్టి దూషించుట వారిచేతఁగాదు. విద్యకుఁ దగినసుగుణసంపద యుండుటచే వసుకవి యశంశకీర్తి నందెను. సుబ్బారాయఁడుగారు తమ జీవితసంగ్రహము తెలియుట కీపద్యము వ్రాసికొనిరి.

పుట్టుక పాసెర్లపూఁడిలంకను, దండ్రి
బందుగులింట నానందయందు
మెత్తని పొత్తుల సత్తమిల్లుట, శైశ
వక్రీడ, పదునొండువత్సరములు
ప్రాయంబుదనుక కొ రంగ మాకోరంగిఁ
గన్నవారల వియోగంబు నటన
అక్షయ మొదలు పరాన్న మేడేండ్లు దొ
డ్డమ్మపేఁట దివాణమందు, శ్రీము
ఖాబ్దమున సొంతకాఁపుర మకొ్ౕటికనె
ప్రథమజాయావియోగవ్యాధ్య్వ్యథఁగు, భావ
రాణ్మహేంద్రంబునందు నాంధ్రంపుటొజ్జ
పదవి; వసురాయ చరితంబు ప్రథిత మవల.

సుబ్బారాయఁడుగారు చిన్ననాఁట దొడ్డమపేఁట దివాణమువారి పోష ణమున నుండి విద్యాభ్యాసముఁ చేసిరి. నాఁడు వీరిగురువులు వాసు దేవశాస్త్రులుగారు దొడ్డమపేఁటకు సమీపమునఁ గల 'భీమక్రోశపాలెము' లో భాగవతుల హరిశాస్త్రిగారను సుప్రసిద్ధవైయాకరణు లుండెడివారు. వారియొద్దఁ జదువుకొను విద్యార్థి యొకఁడు "శ్రీదక్షవాటినివేశ! శ్రీ భీమేశా!" యను సమస్యను మనకవిగారి కీయఁగా వీరు దానిని పదిరక ములుగాఁ బూరించి చూపించిరఁట. అప్పుడు వీరి గురువులు సంతసించి ముందుముందు నీవు కవిశేఖరుఁడ వౌదు వని యాశీర్వదించిరఁట.

అప్పటి కీయనవయస్సు పదుమూఁడేండ్లకు మించదు. ఈదిగువపద్యము ప్రస్తుతకవిగారి పుట్టుకను దెలుపుచు సంతయుందములగా నడచినది పరిశీలింపుఁడు.

గౌతమిఁ గట్టి కాలువలు 'కాటను' ద్రవ్వఁగఁ బూనుండె నం
భూతుండ నైనవాఁడఁ బదుమూఁడగు నేఁడులయీడు తల్లికిన్ ;
మాతకు లేమిఁ బా; లచట మంటిని స్నోసిడియుప్పరమ్మకే
ప్రీతిని నన్నుఁ జన్గుడిపి పెంచిరఁటేమి ఋణానుబంధమో !

వసుకవిగారికృతులలో 'భక్తచింతామణి' జీవము గలకృతి. దీనిలోని పద్యములు చాలమందికిఁ గంఠస్థములు. భక్తచింతామణి సామాన్య శతకము కాదు. "భావగాంభీర్యమందును దత్త్వబోధనమందును భక్తచింతామణి పద్యములు కొన్ని ప్రపంచ సాహిత్యమందలి యేకవితకును దీసిపోవు" అని విమర్శకులు వ్రాసియున్నారు.

తలిదండ్రుల్ బలెఁ దప్పులోఁగొనుచు వాత్సల్యంబునం బ్రోతు; న
చ్చెలియుంబోలె సుధామయోక్తులను నూనేమంబెలింగింతు ; శే
వలధర్మప్రభువట్లు నీప్రజలయిబ్బందుల్ తొలంగింతు ; ని
న్నలమిం గొల్వమి మాయభాగ్యదశగాదే, భక్తచింతామణీ !

సేవింతుర్ భవదీయపాదజలరుట్చింతాను పానంబులో
దేవా ! మందు; ననామయత్వము ప్రసాదింపంగదే మునికిన్
బ్రావృణ్మేఘువుఁ బ్రాపుగల్గినను, దావంబేర్చునే వృక్షముల్
నీవుండన్ వ్యాదినాకు వ్యాధిభయమున్నే ? భక్తచింతామణీ !

మున్నగు ననర్ఘమణులకుఁ దావల మీశతకము. ఇది భక్తిప్రధానమైన దైనను ననేకవిషయము లిందు సంధానింపఁబడినవి. పద్యభావము లన్నియు నుదారములు. భాష మృదుల గంభీరము. తెలుఁగున 'భక్త చింతామణి' వలె నధికముగ నమ్ముడువడిన గ్రంథములు తక్కువ.

సుబ్బారాయకవిశేఖరులు సూక్తిసుధానిధులు. ప్రౌఢతకు, భావసంపదకు వీరికవిత నిదానము. భట్టనారాయణుని 'వేణీసంహారము' వీరాంధ్రీక

రించిరి. ఆతనిశైలి ఈయనకు పరిపడినది. అభిజ్ఞానశాకుంతలము, మల్లికామారుతము, ప్రబోధచంద్రోదయము, విక్రమోర్వశీయము, కుందమాల మున్నగునాటకము లనువదించిరి. ఇవన్నియుఁ దెలుఁగువారికి శిరఃకంపన కారణములు, ఆంధ్రరంగస్థలములకు నలంకారములు, విశ్వవిద్యాలయములకుఁ బాఠ్యములునై యశస్సు నార్జించుకొనినవి. అన్ని నాటకములకంటెను వీరి 'వేణీసంహారము' వినుతి గనినది. సుబ్బారాయఁడుగారు చిన్ననాఁట నాటకములలో నభినయించువారఁట. వేణీసంహారమున ధర్మరాజపాత్రమును దామే నటించినట్లు చెప్పుదురు. ఈకళాభిమానమే యిన్ని నాటకములు వ్రాయించినది. నాటకకర్త నటకుఁడైనఁగాని నాటకము రసవత్తరముగా సంఘటింపలేదు. భవభూతికూడ నటకుఁడైనట్లు చారిత్రకులు చెప్పుదురు. సుబ్బారాయఁడుగారు పద్యములు చక్కఁగాఁ జదువు నలవాటు కలవారు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు 'స్వీయచరిత్ర' లో నిట్లు వ్రాయుచున్నారు: 'పద్యములు చదువుటలోను దండకములు చదువుటలోను మిక్కిలి నేర్పుగల సుబ్బారాయఁడుగారి నోటనుండి విని నప్పుడు నాయొడలు పరవశమైనది.'

రసానుగుణమైన శయ్యాసౌభాగ్యము వీరి కవితకు నిసర్గజమయిన సుగుణము. వేణీసంహారము లోని యీ భీమవాక్యము నరయునది.

తత ఘూర్ణద్ఘటవార్థి మధ్య విలుఠన్మందాచలధ్వాన ధీ
రతఁ గోణాహతమై జగత్ప్రళయ గర్జన్మేఘ సంఘట్ట చం
డతఁ దృప్యద్గ్రరుపాగ్ర దూత కురురాణ్ణాశంకరోత్పాత
నతి! మత్సంహారవానుకారి రణనిస్సాణం బిదే మ్రోగెడిన్.

మరల, దుర్యోధనుఁడు తండ్రిని బాసిన యశ్వత్థామను బరామర్శించు సివిలాపవాక్యమునుగూడ నరయునది.

దగ్గఱ రమ్మ; నాకతనఁదండ్రికిఁబాసినబిడ్డవైతె? నన్
బిగ్గఁగవుంగిలింపు సఖ! నీ కడుపొత్తని మేను హత్తఁగా

సద్గురు బాహులట్టి భవదాయత బాహులు మేను సోఁకినన్
గద్గురుపాటు సంభవముగా దెటులారట మొందు చుండినన్.

ఈ రెండు ఘట్టములలోఁ గవి వెలువరించిన కవితా శయ్యా భేదములు సహృదయాస్వాద్యములు.

రాజమహేంద్రవరమున నాధునికాంధ్రకవిత్రయ మని పేరొందినవారిలో వీరొకరు. ఆంగ్లభాషావిశారదులగు మిత్రులతో నిరంతరము సంభాషించుచుండుటవలన వీరికవిత్వమునకుఁ బాశ్చాత్యకవిత్వమునందలి నవీన భావములు కొన్ని యబ్బినవి. వీరి కవిత్వరచన కేవలము ప్రాచీనపక్కినే నడచిన దని చెప్ప వీలుకాదు. క్రొత్తభావము లెన్నో వీరిపద్యములలోఁ బరికింప వచ్చును. ఆశుకవిత యనిన సుబ్బారాయఁడుగా రసహ్యపడువారు. కబ్బం బల్లుదుఁగాని యాశుకవనోగ్రవ్యాఘ్రసంఘాళికే సబ్బబ్బా! గుటిగాను...... అని వీరు బాధపడినారు. ఆశుకవిత నందముగాఁ జెప్ప సమర్థులే యైనను దానియందు వారి కప్రీతి. ఇది కొందఱకు వింతగా నుండును. పద్యము చెప్పి నాలుగైదుమాసములు వెనుకముందు లాలోచించి సానఁబట్టినఁగాని వారెన్నఁడు ప్రకటింపలేదఁట. వ. సు. కవి తన ప్రతిభా ప్రభ నాంధ్రమునఁ బ్రపంచించి సహస్రమాసములు జీవించి చనిన మహాకవి. 1933 లో రాజమహేంద్రవరమున జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషన్మహాసభ కధ్యక్షతవహించి 38 లో జీవయాత్ర చాలించిరి. వ. సు. చరిత్రము మధురగంభీరమైనది. వ. సు. కవి సంకల్పసిద్ధుఁడు. వార్ధకమున నతఁడీ క్రిందివిధముగా దైవప్రార్థనము చేయువాఁడు.

గడచిననాళ్ళఁ బైఁబడిన కష్టములం దలపోయ నిప్డు నా
యొడలు గగుర్పొడంకుఁ జెమ రుప్పతిలుం గొడగొండలట్టినా
యిడుముల నెట్టు నన్ననిచి యీస్థితి నిల్పితో యంచు నబ్బురం
పడుదు, శుభాంతముం జలుపుమా వసునాటకముం జగత్ప్రభూ!

# కోలాచలము శ్రీనివాసరావు

## 1854 - 1919

జన్మస్థానము: హంపీవిరూపాక్ష క్షేత్రసమీపముననున్న కమలాపురము. జననము: 13-3-1854 సం. నిర్యాణము : 20-6-1919 సం. గ్రంథములు: సునందినీపరిణయము, పంచాలసాపరిణయము, శ్రీరామజననము, పాదుకాపట్టాభిషేకము, లంకాదహనము, ద్రౌపదీవస్త్రాపహరణము, కీచకవధ, బభ్రువాహననాటకము, హరిశ్చంద్ర, రుక్మాంగద, చంద్రహాస, శిలాదిత్య, ప్రతాపాగ్నరీయము, కాళిదాసు, ప్రహ్లాద, రామరాజుచరిత్ర, మైసూరురాజ్యము, చాందుబీబీ, కుశలవ (నాటకములు) హాస్యమంజూష, అగస్త్యబాలభారతశతకము, ఆంధ్రీకృతాగస్త్యబాలభారతము - మొదలగునవి.

పేరుమోసిన నాటకరచయితలిరువురు 'బళ్ళారి' ని పావనము చేసిరి. అందు మొదటివారు ధర్మవరమువారు. రెండవవారు శ్రీనివాసరావుగారు. వీరిరువురును న్యాయవాదులు. ఇరువురును నటకులు, ధనికులును. కృష్ణమాచార్యులవారి చిత్రనళీయ మెంతపేరు సంపాదించినదో, శ్రీనివాసరావుగారి రామరాజుచరిత్ర మంతప్రతిష్ఠ నార్జించినది. 'రామరాజుచరిత్రము' చారిత్రకము. తల్లికోటయుద్ధమునఁగీర్తిశేషుండైన యళియరామరాజుకథ యిందభివర్ణితము. వీరి మైసూరురాజ్యము, ప్రతాపాక్నరీయము చారిత్రకములు.

వీరు గ్రామ్యభాష నొప్పుకొనరు. కళాశాలలలో గ్రామ్యము నుపయోగింపవచ్చు నన్నప్పుడు మదరాసు విశ్వవిద్యాలయమువా రేర్పాటుచేసిన సంఘమునకు శ్రీనివాసరావుగారు సభాపతులై వ్యావహారికమును నిరసించివైచిరి. సంఘసంస్కారమును గూడ వీరు కోరినటులు లేదు. నాటకములు విషాదాంతములు చేయుట వీరి కనిష్టము. ప్రాకృతాదిభాషలకు బదులువ్యావహారిక ముపయోగించ వచ్చునన్న వేదమువారి మతముసైతము వీరికి సమ్మతముకాదు. చారిత్రకములు, సంఘసాంబంధికములు నగునాటకములే యీనాఁట వెలయువలెనని వీరు చెప్పిపోయినారు. తెలుఁగునకు శ్రీనివాసరావుగా రిచ్చిన సందేశము నకు సంగ్రహ మిది:

"భావను జెఱుచుట తప్పు. అశ్లీలము లుంట తప్పు. దుర్నీతికరములుగ నుంట తప్పు. బండుబూతుమాటల నీతిఁజెప్పుట తప్పు. పేరుపెట్టి దూషించి యెత్తివేయుట తప్పు. గ్రంథమునం దిత్యాదులు తప్పులగునుగాని మిగతవి తప్పులుగావు. విషయవైశద్యము కొంతవఱకు నుండినఁజాలు. లోపాములన్నియును స్వర్ణమయములు కాకపోయినను బనికిరాలినవి యెవ్వియునుగావు పూర్వకాలమునుండియు బుద్ధికుశలులని పేరందిన పండితులగ్రంథములు చదివి తమ బుద్ధిబలిమిని వానికిఁ జేర్చి యిప్పటివారు వ్రాయుగ్రంథములు చెడెనని చెప్పుట యసమంజసంబు."

శ్రీనివాసరావుగారు మల్లినాథసూరివంశీయులు. వీరిపూర్వజు లందఱును విజయనగరసంస్థానపండితులు. వీరు నాటకాంతసాహిత్యము నెఱిఁగి స్వాధ్యాయపాఠము చేసిరి. జ్యోతిషము తెలిసికొనిరి. 187౦ లో ఎఫ్. ఏ. పరీక్షలో నెగ్గిరి. రెవెన్యూడిపార్టుమెంటులోఁ బనిచేసి 1881 లో అనంతపురమండలము 'డిప్యూటికలెక్టరు' కడ దివానుగా నుద్యోగించిరి. 1888 లో రెండవతరగతి ప్లీడరుపరీక్షలోఁ దేలి బళ్ళారిని న్యాయవాదులైరి. అంతటినుండి వీరి సారస్వతసేవ యభ్యుదయ మార్గమునఁ బడినది. 1917లో కడపయందు జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్సభ శ్రీనివాసరావుగారి నధ్యక్షులుగా నాదరించినది. మండపాకపార్వతీశ్వరశాస్త్రి ప్రభృతులు వీరి కవిత్వమును గొండాడిరి.

శ్రీనివాసరావుగా రుదారభావులు. పండితులను సత్కరించిరి. కవులను సన్మానించిరి. పేదలను బోషించిరి. తెలుఁగునాఁట నాటకశబ్ద మున్నంతదాఁక శ్రీనివాసరావుగారి పేరు నిలఁబడుననుట నిశ్చయము. 'ప్రతాపాశ్చరీయము' లోని యొకపద్యముమచ్చు.

మారేడు మీసలన్పెనిచి ముప్పిరిగాఁబలుమారుదువ్వుచున్
నేరుపుమీఱ దుస్తులను నీటుగఁ గట్టుచు వాలుఁబట్టుచున్
ధీరులమంచు నోటికసిదీఱఁగఁ బ్రల్లదమాడునట్టి యా
భీరులఁ బోల కీవు రణభీకరవైతివి తక్కఁ గీర్తియున్.

# శొంఠి భద్రాద్రిరామశాస్త్రి

# 1856 - 1915

జననము 1856. నిధనము 1915. జన్మస్థానము: పిఠాపురము సమీపముననున్న కొమరగిరి. వెలనాటి వైదికులు. గౌతమగోత్రీయులు. తండ్రి: గంగరామయ్య. తల్లి: కామాంబ. రామచంద్రోపాఖ్యాన ప్రబంధకర్త వారణాసి వేంకటేశ్వరకవి యీయనకు మాతామహుడు. వంశీయులెల్లరు వేదవిదులు. కవికర్తృకగ్రంథములు: కాళిందీపరిణయము, శంతనూపాఖ్యానము (ఆంధ్రప్రబంధములు) చిత్రసీమ (కళాపూర్ణోదయమువంటి కల్పితకథా కావ్యము) శంబరాసుర విజయము (సంస్కృత చంపువు) శివరామశతకము, (ద్వ్యర్థి. అముద్రితము) ముక్తావళి (మదాలసకథగల సంస్కృతాంధ్ర నాటకములు—) మల్లిక (నవల–అముద్రితము) అహోబలపండితీయ వ్యాఖ్య–లఘుకౌముది(ఆంధ్రటీక) జగన్నాథక్షేత్ర మాహాత్మ్యము, శ్రావణమహోత్సవ తారావళి – ఇత్యాదులు.

తిరుపతి వేంకటకవులు 'భద్రాద్రిరాముకరుణ యున్నచో మాకు లోపముండ'దని యొక నమస్కారబాణము విసరి కాని పిఠాపురములో నవధానమునారంభింపలేదు. సిద్ధాంతకౌముదికి పాఠము వ్యాఖ్యానవిశేషములు క్రోడీకరించి చెప్పువారిలో నాడు భద్రాద్రిరామశాస్త్రిగారు ప్రౌఢలు. "కౌముదీ యది కంఠస్థా వృథా భాష్య పరిశ్రమః" అనుసూక్తి వీరిపట్ల సముచితముగ సమన్వయించును. ఈయన వినయసంపద పాండిత్యమును మించినది. కర్మాచరణము కవితాపాటవమును దాటినది. బ్రాహ్మముహూర్తమున లేచి సచ్ఛాత్త్రుడై పిఠాపురములోని పాదగయాక్షేత్రమునకు బోయి స్నానసంధ్యాదులు కావించి, కుక్కుటేశ్వర దర్శనము చేసి వచ్చి యింట గూర్చుండి విద్యార్థులకు పాఠములు చెప్పుకొనుచు సూర్యాలోకము లేకుండ జీవయాత్ర సాగించిన ధన్యుడీయన. అలంకారగ్రంథము లాయన పెక్కుమందికి పాఠము చెప్పెను.

కాని యాయనశిష్యులుమాత్ర మలంకారవిద్యార్థులు కారు. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు భద్రాద్రిరామశాస్త్రిగారి శిష్యులు.

శాస్త్రిగారు తమయిరువదవయేట ‘కాళిందీపరిణయ’ ప్రబంధము రచించిరి. మచ్చున కీపద్యములు తిలకింపుఁడు.

కాయచ్ఛాయల వెల్వరించు వలిపెఁగాటంపు సిరెండఁ గెం
జాయల్ పూనఁగఁదమ్మలంబుఁ బటవాసద్రవ్యముల్ గంధచ
ర్చాయుక్తిం బలుతావు లీన సఖిహస్తం బూని వాహ్యాళికై
సాయంవేళల వత్తురందుఁ దరుణుల్ జానొప్పఁ బూఁదోఁటలన్.

వలరాజు తనదువనులన్
మెలఁగింపం జెంపకుండ నేర్పున దారిన్
వలవైచి పట్టె ననఁగాఁ
దిలకింపం దగిరి దోమతెరమంచములన్.

శంతనూపాఖ్యానము 32 వ సంవత్సరమున సంతరించిరి. అది చక్కని ప్రబంధము. ఈకవివరుఁడు కేవల ప్రాచీనకవితా ధోరణికలవాఁడే గాక నవీనపథమునఁ గబ్బము లల్లుమేధావి కూడను. వీరి ‘చిత్రసీమ’ కావ్యము పరికించిన నిది స్పష్టపడును. చిత్రసీమ కళాపూర్ణోదయమును బోలు కల్పితకావ్యము. ఇందుఁ గృత్యాద్యవస్థ లేదు. ఇది క్రొత్తపద్ధతి. “కలదొక రాచకూఁతురు ..” అని కావ్యము నుపక్రమించినారు. ఇందలి యాశ్వాసములకు దళము లనిపేరు. అవియు ద్వితీయదళము మొదలు కొని యారంభింపఁ బడినవి. తత్కారణము గ్రంథములో విశదమగును. ‘మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే’ యనుచొప్పున నాది మధ్యాంతములందుఁ గృతినాయకుని స్తుతించుపద్యములు రచించె. ఆపద్యములు కేవలషష్ఠ్యంతములు గాక ద్వితీయాద్యంతములుగా వ్రాయుట మఱియు నూతనత. ఆపద్యములలో భూత భావికథలు సూచితములు. ఈకావ్యములోఁ గార్యముముందును, గాథ

ణము వెనుకను కన్పించుటచేఁ జదువుట కింపు పుట్టించుచుండును. ఇందు నాయకుఁడు చిత్రసీమ. ఈపేరులో నొకవిచిత్రము. సీమ నకారాంతము, ఆకారాంతము కూడ నుండుటచే స్త్రీత్వపుంస్త్వవ్యవహారముల కీపేరే యుపయోగించెను. ఇది యవశ్యపఠనీయకావ్యము. తెలుఁగుపలుకుబడి కొకమచ్చు.

క్రొవ్వెమెఱుంగుగ బ్బాలయు గుజ్జుగుమేనులతోడ నోరఁగా
దువ్వి శిఖల్ లతల్ ముడిచి దొడ్డగు నిత్తడిపోగులం జెవుల్
గవ్వలపేరుల న్నదుగుఁగప్పఁగ పఢకరబొట్లు దిద్ది పై
గువ్వలవన్నె చేలమిడి కొందఱు చెంచులు వచ్చి కొంకుచున్.

చిత్రసీమ. 3. ౭౮.

తెలుఁగువలెనే శాక సంస్కృతమునను వీరి కవితాధార ధారావాహిని. వీరి 'శంబరాసురవిజయచంపువు' చదివితీరవలయును. అందలి కవిత్వ మిటులు ప్రవహించును.

నిర్మంజీరస్వన మవచనం సన్నకాంచీనినాదం
పశ్చాదేత్య ప్రియతమదృశా వంబుజాక్షీ పిధాయ
కాహం బ్రూహీ త్యభిహితవతీ కంకణానాం విరావై
ర్జ్ఞాతా సద్యః పులకితలసద్గాత్రయష్టి ర్బభూవ.
వైదర్భ్యాదిసురీతి శ్చ్యుకావళ్యాద్యలంకృతిప్రఖ్యా
సుకుమారత్వాదిగుణా రసికమనో హారతు కావ్యకన్యా మే.

పరమనైష్ఠికుఁడై, పండితశ్రేష్ఠుఁడై, కవిగరిష్ఠుఁడై చనిన భద్రాద్రిరామ శాస్త్రిగారి కృతులు చిరకాలము తెలుఁగుపుడమి నిలునఁగలవనుటకు సందేహములేదు. పోతనవలె, కూచిమంచి కవివలెఁ దనకృతులు భగవచ్చిహ్నితము లొనర్చిన మహాపుణ్యుఁ డీయన. ఈకవి తనవిషయమును శ్రీరామస్తవమున లగింపఁజేసి వ్రాసిన యీపద్యము చూడుఁడు:

బాల్యంబునఁ గవిత్వపటిమ చూపి నొనర్చె
మృదుల కాళిందీ పరిణయకృతిని
సంస్కృతకవితోరుసామర్థ్య మెఱిఁగింప
విరచించె శంబరాసురవిజయము
శబ్దార్థముఃఖచిత్ర సరణికై శంతనూ
పాఖ్యాన నామకావ్యం బొనర్చె
రూపకకవితను జూప ముక్తావళి
రచియించె సంస్కృతాంధ్రములయందు
కల్పితకథాపటిష్ఠతఁ దెల్పఁ జిత్ర
సీమఁ గల్పించె మఱియును జేసెఁ బెక్కు
లెట్టి కవితను నిర్మింపనేని దగఁడె
రామపదసేవి భద్రాద్రిరామశాస్త్రి.

శాస్త్రిగారి ముక్తావళి యనునాటకము తెనుఁగుభాషలోను, సంస్కృతభాషలోను రచించుట మెచ్చఁదగినది. తెనుఁగు ముక్తావళిలోని పద్యములు హృద్యములు.

చ. నడఁకొదనంగఁ గొంచెముగ వంగిన గాత్రమునందు వన్నకక
ప్పడమును గప్పి పెన్విరహాభారముచేతఁ గృశత్వమంది యి
ప్పడఁతుక గ్రీష్మమేఘతతి వారిదగర్భమునందుఁ గాన వ
చ్చెడు తొలిమించుపోల్కిఁ గను దిక్కియుఁ గన్నులపండు
వయ్యెడున్.

# తాడూరి లక్ష్మీనరసింహారాయ కవి

## 1856 - 1936

మాధ్వమతస్థులు. తల్లి: సీతమాంబ. తండ్రి: రామారావు. నివాసము: రాజమహేంద్రవరము. జననము: 18 – 7 – 1856 సం॥ నల సంవత్సర – ఆషాఢ బహుళ ప్రతిపత్తు – శుక్రవారము. నిర్యాణము: 4–7-1936 సం॥ ధాతృసంవత్సర–ఆషాఢశుద్ధపూర్ణిమ.

కృతులు: ౧. శృంగారభూషణము. ౨. ఉన్మత్తరాఘవము. ౩. రుక్మిణీ స్వయంవరము. (ఈ మూఁడు నాటకములు) ౪. భోజకుమారము. ౫. లక్ష్మీసంవాదము. ౬. చంద్రాలోకము. ౭. మేఘసందేశము [పూర్వసర్గమాత్ర మాంధ్రీకృతము] ౮. దైవప్రార్థనము ౯. భగవద్గీత (ఆంధ్రీకృతి) ౧౦. శృంగారతిలకము. ౧౧. ఋతుసంహారము ౧౨. జ్ఞానోదయము [ఆంగ్ల 'అణు' కావ్యముల ఆంధ్రీకరణము] ౧౩. సనత్సుజాతీయము. ౧౪. నీతికథానిధి ౧౫. రసమంజరి [సంస్కృతమునకు తెలుఁగుసేఁత] ౧౬. చమత్కారచంద్రిక. ౧౭. పండితరాయశతకము. ౧౮. ఉద్యోగపర్వము [తెలిఁగింపు] ౧౯. బాలనీతి – ఇత్యాదులు.

నాఁటిరాజమహేంద్రవరము - నేఁటిరాజమహేంద్రవరము కవులను బెంచుచున్న చక్కని పట్టణము. రాజరాజనరేంద్రుని మొదలు నేఁటిదాఁక, ఆపుర మొకేతీరునఁ గవులకుఁ గాఁపురము.

శ్రీవీరేశలింగముగారితో పాటు, శ్రీ సుబ్బారాయుఁడుగారితో పాటు, వాసుదేవశాస్త్రిగారితో పాటు, లక్ష్మీనరసింహంగారితో పాటు రాజమహేంద్రవరమునఁ గొన్నాళ్ళు నివాసమున్న కవులలో తాడూరి లక్ష్మీనరసింహారావుగా రొకకవి. ఈయనకు కవిగాఁ బేరున్నదిగాని, వాస్తవమునకు రాజకీయోద్యోగి. ప్రభుత్వోద్యోగులై తెలుఁగు సాహిత్యమును, కవిత్వమును సేవించినవారు మనవారిలోఁ బెక్కురు.

జయంతి రామయ్యపంతులుగా రాజాతిలోవారు. ప్రకృతము మన తాడూరి లక్ష్మీనరసింహారాయకవివిషయము పరిశీలింతము. ఈయన

డిప్యూటీ తహసీలుదారు' గా; చింతలపూడి, భీమవరము, క్రొత్తపేట, కదిరి, కడప మున్నగు తావుల నుద్యోగించిరి. సాధారణముగా, ప్రతి మానవునకు అభిప్రాయమొకటి - చేయుచున్నపని రొండొకటి యగుట జరుగుచున్నది. లక్ష్మీనరసింహరాయకవికి స్వాతంత్ర్యతతో జీవింపవలెనని కాని, పరాధీనమైన సేవకవృత్తిలోఁ గొట్టుకొనవలెనని కాని తలఁపులేదు. కాని తప్పలేదు. 1912 సం॥ వఱకు తెలుఁగునేలలోఁ బలుప్రాంతములు పర్యటించి 'డిప్యూటీ తహశ్శీలుదారు' గాఁ బనిచేసి ప్రజలయాశీస్సులకు, అధికారుల యామోదమునకుఁ బాత్రుఁడై, గౌరవవేతనము పుచ్చుకొనెను. ఉద్యోగమునుండి విరమించిన 1912 మొదలు, ఇరువదినాలుగేండ్లు వీరుజీవించిరి. ఈయిరువది నాలుగేండ్లును సారస్వత సేవకై వినియోగపడినవి. సేవావృత్తిని తూలనాడుచు 'భోజకుమారము' లో వ్రాసిన వీరిపద్య మిది:

సీ. చందమామను మించునందంబు గలదానిఁ
జీ! కురూపినిగాఁగఁ జేయుదాన
అలనుమేరువునైన నడఁగించు దిట్టరిఁ
జీ! పదగాఁగను జేయుదాన
ఉక్కుమీఱి సురేంద్రు లెక్కసేయనివానిఁ
జీ! యస్వతంత్రునిఁ జేయుదాన
అల దేవగురునోర్చు నతిబుద్ధిశాలినిఁ
జీ! బుద్ధిహీనునిఁ జేయదాన
గీ. అల్ల సత్యహరిశ్చంద్రు నట్టివాఁడు
చెప్ప నిజమును జీ! బొంకు సేయుదాన
అవనినో సేవ! కటకటా! యక్కటకట!
కలదె? నీ చేయలేని యకార్యమొకటి.

ఈ నాటకమున సేవానైచ్యము- అధికార మదాంధత-నిరర్థ బిరుదప్రదానము - మున్నగునవి పేర్కొని, వానిని నిరసించిరి.

1905 తరువాత నీకవి భగద్గీత - సనత్సుజాతీయములు తెలిఁగించిరి. భారతమున నుద్యోగపర్వమును వీరాంధ్రీకరించిరి గాని, యది నేఁటి

దాఁక వెలువరింపఁబడలేదు. తిక్కన సోమయాజి తెనుఁగులోఁ గొన్ని వేదాంతఘట్టములు పరిత్యక్తములయి యుండుట సహింపక, జగద్ధితమునకై భగద్గీత, ప్రజాగరపర్వము, సనత్సుజాతీయము తాడూరికవి యాంధ్రీకరించెనఁట. ఇవి పరికించి కొందఱు ప్రోత్సహింపఁగా ఉద్యోగపర్వము సమగ్రముగా ననువదించెను. భారతపర్వములలో ఉద్యోగము సారవంతమని, లోకప్రవృత్తికి ముఖ్యమని యెంచి తెనిఁగించిరని కవి హృదయమును వారి కుమారులు వెలువరించిరి. ఈ తెనుఁగుసేఁత శ్లోకానుక్రమముగా నున్నది. ౧౯౦౫ లో ప్రథమపుత్రశోకము వలన విరక్తుఁడై యాకవి భగవద్గీతాదికృతులు తెనుఁగు సేసెనఁట. విదురనీతిలోని పద్యములు :

అవమానింపక యెట్టిదుర్బలుని ఛిద్రాన్వేషియై నేర్పుతో
నవనీనాయక బుద్ధిపూర్వముగ నొయ్యన్ వైరినిం గొల్చుచున్
భువిలోఁ జాల బలిష్ఠులౌ పగఱతోఁ బోరాడ నావిక్రమం
బవురా! మేల్తఱివేచి తానెఱపు నేఁడాతండు ధీరుండునూ॥
ఆపదవచ్చినప్పు డిసుమంతయునొవ్వక జాగరూకుఁడై
యోపుచు శోభనార్థమయి యొప్పుఁ బ్రయత్నము లాచరించుచున్
సైపుచు నష్టఁ గష్టమయిన న్వెలుఁగొందెడు నమ్మహాత్ముఁడో
భూప! ధురంధరుండు రిపుపుంజము నాతఁడు గెల్చునాతఁడే.

ఇఁక, ఋతుసంహారము నందలి శృంగారపద్యశైలి తీరు నారయునది.

ఒండొక పువ్వుఁబోఁడి సురతాగ్రతచే నొడలెల్ల డస్సి తా
మెండుగ రాత్రియెల్ల రతి మేల్కొనుట న్నయనంబు లెఱ్ఱనై
మండఁగఁ గొప్పువీడి భుజమండలిఁ దాండవ మాడుచుండ నీ
రెండ ప్రభాతవేళ మెయికింపుగఁ దాఁకఁగ నిద్రవోయెడిన్.

ఈ లక్ష్మీనరసింహారాయకవి కవిత యాత్మానందము నుద్దేశించి వ్రాయఁబడిన దగుటచేఁ దెలుఁగు ప్రజలు హెచ్చుగా జూడలేదు. ఈయన ధోరణిలో వ్యుత్పత్తికంటెఁ బ్రతిభాభ్యాసముల పాలు మిక్కిలిగా నుండును. అందచందములకంటె నావేశము హెచ్చు.

# కల్లూరి వేంకటరామశాస్త్రి

## 1857 - 1928

తల్లి: కామసోమదేవి. తండ్రి: వేంకటశాస్త్రులు. అభిజనము: గోదావరి మండలములోని 'ముగ్గుళ్ల'. నివాసము: రాజమహేంద్రవరము. పుట్టుక 16-9-1857. కడకాలము 29-5-1928. కృతులు: ౧ వంశముక్తావళి (అధ్యాత్మికపద్యకృతి) ౨ కోటిలింగేశ్వరశతకము. ౩ హాస్యకుముదాకరము (ప్రహసనము) ౪ బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక. ౫ మేఘసందేశము (ఆంధ్రపరివర్తనము).

కల్లూరి వేంకటరామశాస్త్రిగారి కీర్తి నల్లరికి గుప్తార్థప్రకాశిక యుపఘ్నము. బాలవ్యాకరణముపై వెలువడిన వ్యాఖ్యలలో నిది తొట్టతొలిది. వేంకటరామశాస్త్రిగారి సంస్కృతవ్యాకరణాభిజ్ఞత నిర్గళము. ఈవిషయమునకు గుప్తార్థప్రకాశిక ప్రత్యక్షరము సాక్ష్యమిచ్చును. వీరయభిప్రాయములలోఁ గొన్ని పొరపాటు లున్నవని విమర్శకు లెత్తిచూపిరి. అట్టివారిలో మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రి, వజ్ఝల చినసీతారామశాస్త్రిగారలు ప్రముఖులు. ప్రతివాదుల విమర్శనములను మనశాస్త్రిగారు మహోపాధ్యాయులుగానే చాలభాగము ప్రతిఘటించిరి. ఎవరేమన్నను గుప్తార్థప్రకాశిక గొప్ప వ్యాఖ్య. "బ్రహ్మశ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి పండితవర్య ప్రణీత హరికారికాంధ్రీభూత పరవస్తు చిన్నయసూరి కర్తృకబాలవ్యాకరణము" నకు వ్యాఖ్యానమని ముఖపత్త్రముపై వ్రాసికొనిగాని వేంకటరామశాస్త్రిగారు తృప్తిపడలేదు. బాలవ్యాకరణము చిన్నయోపజ్ఞము కాదనియు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి హరికారికల కనువాదప్రాయ మనియు వీరి యాశయము. దీనిని పెక్కుమంది పండితులు సోపపత్తికముగా 'గాదు కా' దని ప్రతిఘటించిరి. పట్టినపట్టు వదలక పాండిత్య విశేషముచే స్వమతప్రతిష్ఠాపనమున కెన్నో యుక్తులు ప్రకటించిరి. కాని యీవిషయమున మాత్రము వేంకటరామశాస్త్రిగారి పక్షము నెగ్గినట్లు తలంపఁబడదు.

వేద మధ్యయనించి, వేదాంత మభ్యసించి, భాష్యత్రయము పఠించి, సాహిత్యరత్నాకరము చుళుకించి మహోపాధ్యాయు లనిపించుకొనిన మహాశయులు వేంకటరామశాస్త్రిగారు. ఆంధ్రసారస్వతమున వీరి ప్రయోగపరిజ్ఞానపాటవము మిక్కిలి గొప్పది. గుప్తార్థప్రకాశికయే యీ వ్రాఁతను నిర్ధారించును. గుప్తార్థప్రకాశికవిషయమై విమర్శకులు వ్రాసిన విమర్శలకు "సమరాంగణ పార్థమూర్తి, ఘటా సూర్యప్రదర్శి, కస్నపల్లి వేంకటసీతాపతిశాస్త్రి" మున్నగు పేరులతో సమాధాన న్యాసములు వ్రాసిరి. ఈరచన లెల్ల శాస్త్రిగారి యసాధారణ ప్రజ్ఞా వైశద్యమును సహస్రముఖములఘోషించుచున్నవి. వేంకటరామశాస్త్రి గారిని మించిన పండితు లుండవచ్చును గాని చమత్కారముగా వీరి వలె 'కాసి దవు ననియు, నయినది కాదనియు' శాస్త్ర ప్రామాణ్యము చూపి సమర్థించువా రరుదు. 'సుమనోల్లాస' శబ్దసమర్థనమున నీశక్తి తెల్లమగును. ఈయన మేధాసంపత్తి యత్యద్భుత మని వీరిప్రత్యర్థు లగు పండితులే శ్లాఘించుచుందురు. వేదాంత మెఱిఁగిన విద్వాంసు లయ్యు శాస్త్రిగారు శివాద్వైతులు. ఈశ్వరాస్తిక్యవిషయమున వీరి వ్యాసరచన బహుళముగ సాగినది. 1885 మొదలు రాజమహేంద్రవర మున 'టౌన్‌స్కూలు'లో సంస్కృతోపాధ్యాయులై ట్రెయినింగు కాలేజిలో సంస్కృత ప్రధానోపదేశకులై, సర్వకళాశాలలో గీర్వాణభాషాగురు పదారూఢులై, కొవ్వూరు సంస్కృతకళాశాలలోఁ ప్రధానదేశికులై, విద్యార్థుల నెందఱనో విద్వాంసుల నొనరించిన యాచార్యశేఖరు డీయన. జ్యోతిశ్శాస్త్ర విదులైన నాఁటిపండితులలో మనశాస్త్రిగారిదే పై చేయి యన్నట్లు 'చతురస్యా' ది రచనలు చాటుచున్నవి.

వేంకటరామశాస్త్రి చరణుల తెలుఁగుకవితయు, గీర్వాణ కవితయు మాధురీభరితము.

పరిభాషావిధిశాస్త్రముల్ స్వపదసంబంధైకవాక్యత్వవై
ఖరితో రంజిలి కార్యకాల మనుపక్షం బందు నున్నట్లు ని
ర్భరరాగంబున నల్లుకొన్న రసిక ప్రాచీనజాయాపతుల్
పరశాఖ్యంబిడి(?)పోచుతన్ ! దివిని సు(?)బహ్వర్ణ్యక్వా(?) త్వేషాత్మ్యాజుల్(?).

ఈపద్యమునఁబాండితీప్రతిభ, కవితామాధురి యొకదాని నొకటి మించి పారపొచ్చెములు లేక పాలుపొందినది. వీ రనువదించిన మేఘసందేశము లోని యొక్క పద్యము పొందుపఱుతును.

తమ్ముఁడ మేఘుఁడా! తిథులఁ దద్దయు నెన్నుచు సాధ్విమన్నెదుం
జుమ్మి నిజంబుగా వదినెఁ జూచెదుపో గమనంబు సార్థమా
నెమ్మిని నిండి పుష్పసరణిః విరహాంబునఁ దీఁగఁబోండ్ల జీ
వ మ్మపుడూడఁ జూడ సుమబంధము వైఖరి నాన నిల్పుగా.

ఈ మహోపాధ్యాయులు ప్రతిదినము స్నాన సంధ్యాద్యనుష్ఠానము గావించి పార్థివలింగపూజ, లలితామంత్రజపము చేయుచుండెడివారు. ఈలలితానుతి కనుఁగొనుఁడు.

లలితాం కలితాం కదంబపుష్పై
ర్మిలితాం సాంబశివేన మాతరం
లలితాంబరధారిణీం లతాంగీం
ఫలితాం తాం రసవాచ మర్థయే.

తిక్కన సోమయాజికి గురునాథుఁడు లేఖకుఁడైనట్లు మన వేంకటరామ శాస్త్రిగారికి సుంకర రంగయ్యగారు లేఖకుఁడై గ్రంథరచనోత్సాహము కలిగించెనఁట. రంగయ్యగారు వీరికిఁ బ్రియశిష్యులు. 'సుప్తార్థప్రకాశిక' రంగయ్యగారి కర్తృత్వముద్రతో మొదట వెలువరింపఁబడినది. శాస్త్రి గారి ప్రియశిష్యుఁడగుటచే వారిగ్రంథము సంగ్రహించె నని వదంతి కాని రంగయ్యగారు పీఠికలో 'సంస్కృతవ్యాకరణవిషయ మున్నచోట గురువులు వేంకటరామశాస్త్రిగారు పూరించి పరిష్కరించి' రని వ్రాసికొనిరి. ఇట్టి గ్రంథచౌర్యము తొల్లిటినుండియు జరుగుచునే యున్నది. నేఁడు క్రొత్తగాదు.

వైయాకరణ శిరోభూషణులు, వ్యాఖ్యాతృశిఖామణులునగు వేంకట రామశాస్త్రిపాదుల కీర్తి జ్యోతిని శాశ్వతస్థితితోఁ బ్రకాశింపఁజేయునది బాలవ్యాకరణసుప్తార్థ ప్రకాశిక యొక్కటే.

# మచ్చా వేంకటకవి

# 1856 - 1903

తెలగాకులము. జననము 1856సం. రాక్షసనామసంవత్సరము. నిర్యాణము: 9. జనవరి 1903. తండ్రి: గంగయ్య, పుట్టినయూరు నైజాము మండలములోని జాల్నా. గ్రంథములు: ౧. శ్రీశుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన కుశచరిత్ర ౨. వైదర్భీ పరిణయము ౩. చెన్నకేశవ రామాయణము (రామాయణ సంగ్రహశతకము) ౪. ఛాయాపుత్ర శతకము (శనిస్తవము) ౫. రుక్మిణీనాటకము ౬. ద్రౌపదీవస్త్రాపహరణము ౭. మయూరధ్వజోపాఖ్యానము ౮. అంబరీషోపాఖ్యానము (పయిమూఁడును గాన ప్రబంధములు) ౯. ముఖలింగేశ్వరోదాహరణము. ౧౦. జావళీలు. ౧౧. హరిభజనకృతులు.

మచ్చా వేంకటకవి పేరు తలఁపుగొన్నపుడు మఱపురాని యీ క్రింది విషయము మామిత్రులవలన విన్నది ముందు మనవి సేయవలసియున్నది.

ఇది 1900 సం॥ ప్రాంతము లో జరిగిన ముచ్చట. ఇచ్ఛాపురగ్రామమున వేంకటకవియు, దర్భా వేంకటశాస్త్రియనుపేరుగల డిప్యూటీకలెక్టరు హోదాలోనున్న యొకరును గలసికొనిరి. వీరిరువురు స్వల్పమైన పరస్పర పరిచయము గలవారు. కలసికొనఁగానే వేంకటశాస్త్రిగారు వేంకటకవినిజూచి "ఓహో, మచ్చాకవి! యెప్పుడువచ్చితి" వనెను. వెను వెంటనే వేంకటకవి "ఓహో, దర్భాశాస్త్రి! మూనాళ్ళయి వచ్చితి" సని బదులుపలికెను. అపుడు కలెక్టరు హోదాలో నున్న పెద్దమనిసి 'వేంకటకవిగారూ! వేరుగాఁ దలంపకుఁడు. మీరు వయసున్నఁ జిన్నలగుటచేఁ జనవుగొని యిటులు సంబోధించితి' నని సర్దుకొనుచుండఁగా, వేంకటకవి యందుకొని "తామేల యిటులు భావించితిరి? 'వేంకట' శబ్దముపయి మీ కనాదరభావ ముండెనేమో యనుకొని యిటులు సంబోధించితి"నని ప్రత్యుత్తరముచెప్పెను. ఈసమయ స్ఫురణ

మునకుఁ బ్రక్కనున్నవారు విస్మయపడి నవ్విరి. అధికారి సరసుఁడగుటచే వేంకటకవి యాత్మగౌరవమునకు సంతసించెను.

ఇట్టిదే వేఱొక సన్నివేశము. శ్రీవిక్టోరియా మహారాజ్ఞి కాలధర్మ మించిన సందర్భమున పర్లాకిమిడి కళాశాలలో నొకసభామర్శసభ జరిగెను. ఆ యూరి రాజుగారును, మహోన్నతులయిన యాంగ్లోద్యోగులును, కవులును చెక్కు చక్కఁడ నుండిరి. మన వేంకటకవి యా కళాశాలలో ప్రధాన పండితుఁడుగా నుండెను. మహారాజ్ఞి నిర్యాణమును గూర్చి వేంకటకవియుఁ గొన్ని పద్యములు రచించి సభలోఁ జదువ నుండెను. కొంతతడవునకు వారివంతు రాఁగాఁ గాలిజోడు విడక గద్దెపై కెక్కి ముద్దులొలుకు గళస్వరముతోఁ దన మధురపద్యములను పఠింప మొదలిడెను. అపుడు రాజుగారి కార్యదర్శి చింతలపాటి హనుమంతరావుపంతులు గారు తొందరపాటున లేచి దేశభాషాపండితులకు వర్తమానగౌరవాచార పద్ధతి తెలియదనియు, నిట్టి వారిని వేదిక నెక్కింపరాదనియు నొక్కి సభలోఁ జెప్పెను. అంతట వేంకటకవి యేదో బదులు పలుకుచుండఁగా, ఆకళాశాలలో నపుడు ప్రథమ సహాయోపాధ్యాయులుగా నున్న శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు లేచి యిట్లు పలికెను: "వేంకటకవి సామాన్యకవి కాఁడు. ఆంధ్ర మండలములో నితనివంటి కవులు చాల తక్కువగానున్నారు. ఇతని కవిత్వ పటుత్వము నేటివారిలోఁ గొందఱకేగాని లేదు. ఇట్టివానికి స్వేచ్ఛ నీయవలయును." రామమూర్తి పంతులుగారి యీమాటల కచటి సభ్యులు నివ్వెఱపడి చూచుచుండిరి.

పైనుదాహరించిన రెండు ముచ్చటలవలనను మన వేంకటకవి మంచి సమయస్ఫురణము, నిరంకుశత కలవాఁడనుట స్పష్టము. కవి వ్యుత్పన్నుఁడయినపుడుగాని నిరంకుశత యొదగింపదు. కవిత్వము - వ్యుత్పత్తి రెండును గలవాఁడు మన వేంకటకవి.

ఈ కవిపూర్వులు నాటికి రెండునూర్లయేండ్లక్రితము మచిలీ బందరు నుండి విశాఖపట్టణమండలములో నున్న శ్రీకాకుళమునకుఁ బోయి

మహమ్మదీయ ప్రభుసైన్యములో సరదారులుగా నుద్యోగించిరఁట. ఈ కవి తండ్రి గంగయ్య పటాలములోఁ బనిచేయుచుండఁగా జాల్నా పురిలో నీయన జన్మము తటస్థించెను. ఈ గంగయ్య తెలుఁగు సారస్వతము కొంత యెఱిఁగినవాఁడు. బ్రౌనుదొరకు సమకాలికుఁడు. నాఁడు జిల్లా జడ్జీగానున్న బ్రౌనుతో రాజమహేంద్రవరమున నున్నపుడు చెలిమి కలుపుకొని మన్ననలు పొందెను. ఈ సందర్భము వేంకటకవి తన వైదర్భిపరిణయ కావ్యమున నిటులు ముచ్చటించెను.

శా. సీ. పీ. బ్రౌన్‌దొరగారు మండలపు జడ్జీ సుప్రమేయంబునం
దేపారం జని గంగయామాత్యుఁడు హాయింగాంచి తానాంధ్ర వి
ద్యాపాండిత్యము మీటి గ్రంథపఠనాద్యస్తోక నైపుణ్యమున్
జూపెన్ రాజమహేంద్ర పట్టణమునన్ సూర్యుత్తముల్ మేలనన్.

ఈ వేంకటకవి మూఁడేండ్ల పసిప్రాయమున నుండఁగా 'జాల్నా' లో నొకచోరుఁడు మిఠాయిపొట్లము తినఁజూపి యెత్తుకొనిపోయి, యొడలి బంగారము నూడఁబెరికికొని దవ్వుల నొక పాడునూతిలోఁ బాఱవైచెనఁట. ఆపసిబిడ్డ తండ్రులు సైనికోద్యోగులగుటచే నలువురు నాలుగు మూలలకు వెళ్ళి వెదకఁగా, నీరులేని పాడునూత నేడ్చుచున్న పిల్లవానిని బయటకులాగి బుజ్జగించుచున్న బాటసారులు, వారికాబిడ్డ నిచ్చి బహుమానితులయిరఁట. పసిబిడ్డ చెవుల నంటుజోళ్ళు చోరునిచేఁ ద్రెంచబడుట కారణముగా, చెవికమ్మలు వేంకటకవికి మఱి కలియలేదు. ఇట్టి గండము గడచిన పసిబిడ్డ పండితకవి కావలయునో?

వేంకటకవి తొట్టతొలుత దండ్రికడనే తెనుఁగు పొలుపులు గుర్తువట్టెను. సంస్కృతము తెలికిచర్ల శివరామశాస్త్రిగారి కడ నభ్యాసము. శ్రీకాకుళము హైస్కూలులో నాంగ్లభాషాపఠనము-గంజాముమండలము

లోని పురుషోత్తమ పురములో 'సబురిజిస్ట్రారు' గాఁ బనిచేయుచుండిన వేంకటకవి ధామమీఁద మక్కువతో, పర్లాకిమిడికళాశాలలో ప్రధాన పండితపదవి లభింపఁగా నది గ్రహించెను. అదిమొదలు వేంకటకవి సారస్వత వ్యవసాయమునకొక మెఱుఁగుఁగాలము. ఈయన రచనలు ప్రధానముగా నాఁటి అముద్రిత గ్రంథ చింతామణి (నెల్లూరు) పురుషార్థప్రదాయిని (బందరు) పత్రికలలోఁ గాన నగును. మన వేంకటకవికి సమస్యా పూరణములపై వేడుకమెండు. 'వార్తాలహరి' యను పత్రికలో త్రిపురాన తమ్మయకవి (ఆంధ్ర దేవీభాగవతగ్రంథకర్త) యొసఁగిన "ప్రద్యుమ్నాగారమందు భానుఁడు వాలెచెన్" అను సమస్యకు వేంకటకవి వ్రాసిన పూరణములెట్టి మధురధోరణిలో నున్నవో చదువుఁడు. ఏకారణముననో యివి వేంకటకవి తనశిష్యునిపేర వెలువరించెను.

క. మద్యమ్ముఁ ద్రావినావో
విద్యున్నేత్రల గుఱించి వెతఁ జెందితివో
విద్యావిహీన! యెక్కడి
ప్రద్యుమ్నాగారమందు భానుఁడు వాలెచెన్!

క. విద్యానిధి విటుఁ డొకసతిఁ
జోద్యమ్ముగఁ గూడునెడ రజోగుణ మింపచే
హృద్యమ్మగు నక్కీమలి
ప్రద్యుమ్నాగారమందు భానుఁడువాలెచెన్.

క. విద్యాధరార్చితా! యర
పద్యమ్మున నీసమస్య పరఁగ ముంగితున్
హృద్యమ్మగు ప్రాగ్గిరి దీ
ప్రద్యుమ్నాగారమందు భానుఁడు వాలెచెన్.

ఈవేంకటకవి సాహిత్య వివాదములు మొదలగునవి యానాఁటి ఆంధ్ర భాషాసంజీవని, హిందూజన సంస్కారిణి (చెన్నపురి) బుధవిధేయి మున్నగు పత్రికలలోఁ గననగును.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి యీవేంకటకవి నిటు లుట్టంకించెను :

మచ్చరము లేదు కవితలో మచ్చలేదు
మచ్చయిన లేదు నుతికి సామ్మచ్చలేదు
మచ్చయన మెచ్చఁదగు పుట్టుమచ్చగాన
మచ్చవేంకటకవినామ మచ్చమయ్యె॥

20. 2. 1894 సం॥

బొబ్బిలి

---

# ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి

## 1860-1916

ఆరామద్రావిడ శాఖీయులు. ఆశ్వలాయనసూత్రులు. ఆత్రేయస గోత్రులు. జన్మస్థానము: ఖండవిల్లి. నివాసస్థానము: శాకగపల్లి (తణుకు తాలూకా). రాజమహేంద్రవరమున నుద్యోగము. తల్లి: వేంకటాంబ. తండ్రి: వేంకటశాస్త్రి. జననము: 1860 సం. నిర్యాణము: 2-2-1916 సం. కవికర్తృక గ్రంథములు: శ్రీమహాభారతనవనీతము (పదునూఁడు పర్వములు) ప్రబోధచంద్రోదయము, అనర్ఘరాఘవము, శుద్ధాంధ్రఋతుసంహారము, గంగాలహరీస్తోత్రము, భామినీవిలాసము, అధ్యాత్మరామాయణము, సూర్యశతకము (మయూరకవికృత-ఆంధ్రీకృతము), భారతపక్షి (విమర్శ), పరాశరస్మృతి (తెనుఁగువచనము), కృష్ణాపుష్కర మాహాత్మ్యము.

చవులువుట్టఁ బ్రబోధచంద్రోదయముఁ జేసెఁ
 దెలుఁగులలోని నిగ్గులు ఘటించి
తెలిఁగించెఁ దలలూఁపఁ బలుకులఁ దులదూఁచి
 రమ్యభంగి ననర్ఘ రాఘవంబు
పండితరాజప్రబంధమ్ము లాంధ్రీక
 రించెఁ దత్తద్భావరీతు లెఱిఁగి
పరివర్తన మొనర్చె బాసలోనికి ఋతు
 సంహారకృతి నదోషత నెసంగ

నాంధ్రవాగ్దేవతా చతురాస్యుఁ డతఁడు
సంస్కృతోక్త్యభినవపతంజలి యతండు
ప్రథితవాగర్థరసమహోదధి యతండు
ధూర్తరిపుశాస్త్రి యావ్యాసమూర్తిశాస్త్రి.

'వ్యాసమూర్తిశాస్త్రిగారి కవిత్వము స్వయంపాకమువలె శుచిగా నుండునేగాని ద్రాక్షాపాకమువలె రుచిగానుండ' దని యొకవాడుక. ఈ వాడుకకు వారు మహాపండితులగుటయే కారణము. శాస్త్రులుగారు రాజమహేంద్రవర పురవీథిని నడచుచుండునపుడు ప్రక్కప్రక్కలఁ బోవు పండితులు 'అదిగో విజ్ఞానసర్వస్వము' అని చెప్పుకొనుచుండెడివారు. ఆ మహాశయునకు జోహారులనందుకొనుటయే సర్వకళాశాలలోని యుపాధ్యాయత్వమునకు మించిన పెద్దయుద్యోగ మైపోయినది. ఆ దివ్య తేజస్వి సారస్వతపీఠమునఁ గూరుచుండి సాహిత్యగోష్ఠి సల్పునపుడు సరస్వతి పుంభావమును బడసినటులు కనులపండు వయ్యెడిది. ఆయన మహామహోపాధ్యాయులు కారు. కళాప్రపూర్ణులునుగారు. ఈ మహా బిరుదములను దాఁటి యన్వర్థనాముఁడైన పండితమూర్ధరత్న మాయన. సంస్కృతాంధ్రములలో నఖండమైన పాండిత్యము. కవితారచనలో నసమానమైన వేగము. భాష్యత్రయమునకుఁ బాఠములు సెప్పినారు. అఱుశాస్త్రములలోఁ దగిన పరిచయము. వారినాఁట సంస్కృతాంధ్రములలో నెవరికే సందేహమువచ్చినను వీరు తీర్చుచుండెడివారు. ప్రమాణములు కావలసినను బ్రయోగములు కావలసినను నిఘంటువులు తిరుగవేయనక్కఱలేదు ఆయనదర్శనమునకుఁ బోయినఁ జాలును.

వ్యాసమూర్తిశాస్త్రిగారి కనర్ఘరాఘవ మభిమానగ్రంథము. దాని నాంధ్రీకరించిరికూడను. వ్యాసేశ్వరుఁ డిష్టదైవము. తమకృతులన్నియుఁ గోశనకుర్తి వ్యాసేశ్వరునకే యంకితములు. ఈ యాంధ్రవ్యాసుఁ డొక తుంగచాపపై నొకయుత్తరీయమును బఱచుకొని యొకవంక సంస్కృత మహాభారతమును జూచుకొనుచు సులోచనములజోడు జారిపోవుచుండఁగా నెట్టి సవరించుకొనుచు 'మహాభారతనవనీత' రచనా నిమగ్నుఁడై యున్నపుడు-ఆమహాశయుని దివ్యదృశ్యమును గనులారఁగాంచు భాగ్య మాంధ్రులకింక దురాపము. ఒకతుడుపుగాని యొక సవరింపుగాని

లేక తూచాలు తప్పక ఫుల్‌స్టాపులతో - శకటరేఫములతో - నరసున్నలతో నిప్పటికిని నవనవముగానున్న వారి భారతపుఁవ్రాఁత ప్రతిని నష్టపర్వముగా నవలోకించువారిదే యదృష్టము. పదుమూఁడు పర్వములు మాత్రము వ్రాఁతలోనున్నది. అచ్చుపడినది యాదిపర్వమొక్కటియే. మహాభారతమునుండి నవముగా నీతమైనదనుసర్థము వచ్చునట్లును, మహాభారతములోని నవనీత తుల్యమైన సారతరపదార్థ మనునూహ కలుగునట్లును దీనికి 'మహాభారతనవనీత' మనునామకరణము శాస్త్రులుగారు చేసియుందురు. ఇదిమూలమునకు ముక్కకు ముక్కగాఁజేసిన యాంధ్రీకృతి గాదు. ఈ వ్యాసభారతమునకుఁ బీఠిక వ్రాయుచుఁ బీఠికాపురసంస్థాన కవులు ఓలేటి వేంకటరామశాస్త్రిగారిట్టులనిరి.

"శ్రీవ్యాసమూర్తిశాస్త్రులవారు తొలుదొలుత నీభారత రచనమున నారంభించినపుడు నేనును నామేనత్తకుమారుఁడు రామకృష్ణశాస్త్రియును నస్మద్గురుదేవసమానులు, సత్యంతాప్తబంధువులు నగు శ్రీశాస్త్రులుగారి యొద్ద మాకుఁగలిగిన చనవునంజేసి 'ఆర్యా! కవిత్రయాంధ్రీకృతమహాభారతము సర్వాంగసుందరమై విరాజిల్లుచుండ మరల నీభారతనవనీతరచనకుఁ బూనుకొనుట యెందుల' కని నిర్భయముగా నడిగితిమి. అప్పుడు వారు సెలవిచ్చిన యుపపత్తు లివి: "వ్యాసభట్టారక ప్రోక్తమైన శ్రీ మహాభారతమును నన్నయభట్టారకాదులు నవరసభరితముగ నాంధ్రీకరించిన సంగతి వాస్తవమే. వారి కవితారచనాదులు నిరుపమానములై సర్వజనాహ్లాదకరములై యుండుటయు యథార్థమే. నేనిప్పుడు వారికవనమున లోపములు గలవనుతలంపుతోఁ గాని, వారికవిత్వము నతిశయింపవలయుననుకోరికతోఁగాని యిందులకుఁ బూనుకొనలేదు. పంచమ వేద క్షీరవారాశినుండి నేనును నాశక్తికొలఁది కొంత నవనీతము నెత్తఁ దలచితిని. ఆ గభీరవారాశిగర్భమున విలీనములైన నీతిరత్నములఁ గొన్నిటి నాంధ్రులకు వెల్లడిసేయుట యవసరమనితోఁచినది. ఇదియునుఁగాక,

నాయంతరంగమున నొకవిచిత్రమైనయభిలాషము సైతమున్నది. అది యేమనఁగా వ్యాసేశ్వరుఁడే మాకుఁ గులదేవత. ఆ వ్యాసభట్టారకుని యెడల నాకెంతయో భక్తికలదు. సంస్కృతభాషయందు వ్యాస ప్రోక్తమైయున్న మహాభారతమును దెనుఁగునఁగూడ వ్యాసప్రోక్త మొనరింపవలయు నని నాకు ముచ్చటగా నున్నది. ఆయీ కార ణములచే నీగ్రంథమును రచింప నారంభించితినిగాని మఱియొకటిగాదు. నాయీగ్రంథము శ్రీమహాభారతమునకు మూలానుగుణమగు నాంధ్రీ కరణమునుగాదు. ......"

వ్యాసమూర్తి శాస్త్రిగారికవిత్వము అన్వయకాఠిన్యము కలిగి యభూతపూర్వమైనదని కొందఱివిమర్శ. ఇంచుమించుగా నందఱి యభి ప్రాయము నదియే. దానికిఁగారణము తొట్టతొలుతఁ జేరుకొంటిని. వ్యర్థపదములు వారికవితలోనుండవు. అదిగాక భారతనవనీతము నిర్వచ నము. మొత్తముమీఁద శాస్త్రిగారికవితారచనము విలక్షణతాపాదక మనిచెప్పవలయును.

ఎఱుఁగక మేను, గిన్క ధరణీశుల నేఁ బొరిఁగొన్న పాతకం
బఱుతె మనన్ ఋచీకముఖు లావర మిచ్చిరి; తత్ప్రగొంత మే
పఱఁగు శమంతపంచకము; భారతసంగరమందె సెల్లె; యూ
పఱి రిరుతొమ్మిదుల్బలము లక్షపదాదిములై నయూహిణుల్.

"భారతనవనీతము"

పీఠికాపద్యములన్నియు నిట్లే నడచును. శాస్త్రిగారు తమకుమారుని వివాహమున శాహ్వానపత్రికపై వ్రాసినయీపద్యమెంతపొందికగా నిమిడినదో!

వినుఁడీ! కీలకమాఘశుద్ధదశమిన్ వేగ న్విధిన్ గుంభరా
శిని మత్పుత్రుఁడు కోటవెంకటసుతన్ జేనందికో వృద్ధమా
ననమయ్యోఁ జరుగున్వివాహము జగన్నాథాచలంబందుఁ గా
వున విచ్చేయుఁడు! బందులీనవయుగంబున్ లెన్నదీవింపఁగన్.

ఈపద్యము చదివి యావహూతులు కొందఱు వేగః విధిః అనుపదములకర్థము తెలియక వ్యర్థపదములని యాక్షేపించిరఁట. సహజపాండిత్యక స్వరూపులగు శాస్త్రులుగారు నవ్వుకొని వేగః అనఁగా తెల్లవారుజామనియు, విధి యనఁగా రోహిణీనక్షత్రమనియు వారి కెఱుఁగఁ జెప్పిరఁట. వీరికవిత్వములో నేగాక మాటలలోఁగూడ నిట్టిపాండిత్యమును జమత్కారములు నుండును. 'తమకు జీత మెంతయిత్తురండీ' యని యడుగ 'వయసునకు మించలేదులెండి' యనుచుండువారు.

ఈ శాస్త్రులవారు వేదుల సోమనాథశాస్త్రులవారితోఁ దర్కాలంకార శాస్త్రములు చదివిరి. ఉపనిషద్వేదాంతములు ఆదిభట్ల రామమూర్తి శాస్త్రులవారిసన్నిధిని పఠించిరి. వీరు మొట్టమొదట ఖండవిల్లిలోను, క్రొత్తపేటలోను కల పాఠశాలలోను నధ్యాపకులై యుండిరి. తరువాత 1880 మొదలు 1915 వఱకు రాజమహేంద్రవరము బోధనాభ్యాసన పాఠశాలా కళాశాలలలో సంస్కృత భాషాదేశికులై విద్యార్థుల నెందఱనో విద్వాంసుల నొనర్చి యుపకారవేతనము గొన్నారు.

వీ రనువదించిన అనర్ఘరాఘవము - ప్రబోధచంద్రోదయము సూర్యశతకము చూచిన కవిప్రతిభాపాండిత్యాదులు వెల్లడియగును. 'భారతఫక్కి' యనుపేర భారతముపై విమర్శగ్రంథము నొండు వ్రాసిరి. అది భాషోపాసకుల కుపయోగకరమైన కూర్పు. వ్యాసమూర్తిశాస్త్రి గారి భారతనవనీతము సంపూర్ణముగ నచ్చునకు వచ్చునట్లు వ్యాసేశ్వరుఁ డనుగ్రహించుఁగాక! పీఠికాపుర సంస్థానకవులు శతావధానులునగు వేంకట రామకృష్ణకవులలో నొకరగు వేదుల రామకృష్ణశాస్త్రిగారీ మహాభారత నవనీతకవికి అల్లుఁడని వెల్లడించుట యవసరము.

అదియటుంచి, శాస్త్రులుగారి సూర్యశతకము తెనుఁగుసేఁత నుండి గొప్పపద్యములు కొన్ని యెన్నుకొందము.

మ. పసివాళ్వాడు బిసాభమంచుదయనో, వాతాశిలోకంబు, పే
రసమర్థం బగునంచు నే పరము లోకాలోక భూభృత్తటి
న్వస నూర్ధ్వాబ్జజ భాండఖండదళనావేగంబునన్ ద్యోస్థలి
న్ప్రసఁగంగాఁ జొర కెందునేగు రవిచుక్కార్వారంబు మేల్కొకిదున్.

మ. జలధి న్విద్రుమముల్ ద్రుమాళిఁ జివురుల్ శైలంబునం జేవురుల్
బలభిత్కుంభ శిరంబునం దవిరళ ప్రత్యగ్రసిందూర ధూ
ళులు వింటన్ హరు వింటి పై డితళుకుల్, శోణద్యుతిన్ భాను దీ
ప్తి లవంబుల్ నటువాత నేవవి భవత్ప్రత్యావహాంబద్యోడిన్ !

మ. కులదైవంబొ, గురుండొ, తండ్రి, చెలియొ, కోర్కెయో, యర్యుఁడాచార్యుఁడో
వెలుఁగో చుట్టమొ రక్ష దివ్య బ్రతుకో బీజంబొ నేత్రంబొ వే
వెలుఁగి ల్లేమని నిర్ణయింపనగు నేవేళన్ సమస్తంబు లో
కుల కెల్లన్ నమకూర్చుఁ గోరికలు మీకు న్దేవుఁ డాతండిదుర్ !

# జయంతి రామయ్య

## 1860-1941

వెలనాటి బ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. కృష్ణయజుర్వేది. ఆపస్తంబ సూత్రుఁడు. తండ్రి : రామయ్య. తల్లి : సోమమ్మ. జననము : 18-7-1860 సం॥ రౌద్రినామ సంవత్సరమున ఆషాఢ బహుళ అమావాస్య సూర్యోదయకాలము. నిధనము 9-2-1941. అభిజనము : అమలాపురముతాలూకా ముక్తేశ్వరము. మృతినొందు కాలమునాఁటికి వీరివయస్సు 81 సంవత్సరములు. విరచితగ్రంథములు : 1 ముక్తేశ్వరశతకము. 2 ఉత్తరరామచరితము. 3 ఆంధ్రచంపూరామాయణము 4 అమరుకము. 5 ఆంధ్రవాఙ్మయ వికాసరేఖరి. 6 శాసనపద్యమంజరి (2భాగములు). 7 బాలరామాయణము. 8. Defence of Literary Tulegu. 9 Dravidian Lexicography- మున్నగునవి. దేశచరిత్ర స్వరూప ప్రయోజనములు – రాజరాజు, నందంపూడిశాసనము-ఆంధ్ర నిఘంటు నిర్మాణపద్ధతి-బమ్మెర పోతరాజు నివాసస్థానము-ఉత్తరరామ చరిత నాటకరస విచారము మొదలగు విషయములపై ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల మొత్తము 50. 1. The Southern School of Telugu Literature. 2. Krishnaraya మొదలగు వ్యాసములు ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి ప్రతికలోఁ బ్రకటింపఁబడినవి 5. 'ఎపిగ్రాఫియా ఇండికా' లో తెలుపరింపఁబడిన వ్యాసములు 8. ఉపోద్ఘాతములు వ్రాసిన గ్రంథములు : రాయవాచకము, సర్వేశ్వరశతకము, కవిజనాశ్రయము, విప్రనారాయణ చరితము, మన్నారుదాసవిలాసము మొదలగునవి.

ఆంధ్రభాషోద్ధరణాభిలాషులగు కొందఱు ప్రభువులచేతను, ఆంధ్రభాషా ప్రవర్ధకులగు కొందఱు ప్రముఖులచేతను 1911 లో ఆంధ్రసాహిత్య పరిషత్తు స్థాపింపఁబడినది. తదధ్యక్షులగు జయంతి రామయ్యపంతులు గారు నాఁటినుండియు నవిచ్ఛిన్నముగ నాంధ్రిసేవ చేయుచున్నారని తలంపవలయును. 'సాహిత్యపరిష' దుత్పత్తికిఁ బూర్వము పేర్కొనఁ

దగిన భాషాసంస్థలు రెండు మూఁడు మాత్రమే తెలుఁగునఁ గలవు. పరిషత్తు సేవాఫలిత మంతయు రామయ్యపంతులుగారిచేతను, పంతులు గారి గౌరవసేవయంతయుఁ బరిషత్తుచేతను బెక్కువత్సరము లనుభవింపఁ బడుచు వచ్చినది. ఆంధ్రసాహిత్యపరిషత్తును కౌమార్తెగాను, సూర్య రాయాంధ్ర నిఘంటువును గుమారునిగాను భావించుకొని పంతులుగారు తమయనపత్యతావ్యథను బాపుకొని మనుగడ సాగించినారు.

రామయ్యపంతులుగారు బి. ఏ. పట్టభద్రులు. చదువుచున్న సమయమున వీరిబుద్ధివిశేషమును వెలిఁబుచ్చు విశేష మొకటి వారి పెద్దలిట్లు చెప్పుకొందురు. బ్రహ్మసమాజమత ప్రబోధకుఁడగు పండిత శివనాథశాస్త్రి మతప్రచారమునకు 1881 లో రాజమహేంద్రవరము వచ్చి యాంగ్లేయభాషలో గంభీరోపన్యాసము గావించెనఁట. ఆకాలమున క్లుప్తలేఖనము లేకుండుటచే నెట్టియుపన్యాసములైన నచ్చులోనికి వచ్చుట కవకాశముండెడిది కాదు. మనపంతులుగా రప్పుడు రూళ్లపెని సిలు కాగితములు పుచ్చుకొని తూచాలు తప్పకుండ శివనాథశాస్త్రిగారి యుపన్యాసము లన్నియు వ్రాసి చెన్నపురిలోని యాంగ్ల పత్రికలకుఁ బంపిరఁట. శివనాథశాస్త్రిగారు తమ యుపన్యాసములు యథాతథ ముగా నాపత్రికలలో వెలువరింపఁబడుటఁ గని యబ్బురపడి యివి వ్రాసినవారెవ రని తెలిసికొన — బి. ఏ. తరగతి విద్యార్థి జయంతి రామయ్య వ్రాసె నని తేలినది. అప్పుడెల్లరు "ఈ చికిలికన్నుల చిన్నవాఁడేనా గంగాప్రవాహముఁ బోలు నీమహోపన్యాసము వ్రాసి నది" అని యాశ్చర్యచకితులైరఁట. పంతులుగారు చిన్ననాఁటఁ గన్నులు చికిలించెడివారని యెఱిఁగినవారు చెప్పుచుందురు.

రామయ్యపంతులుగారు 1886 లో బి. ఎల్. పరీక్షలో నుత్తీర్ణత నందిరి. ఆనాఁటి విచిత్ర మొకటి వీరినిగూర్చి చిలకమర్తి లక్ష్మీనర సింహముగారు చిఱునవ్వునవ్వుకొనుచు నిట్లుచెప్పుచుందురు. "రామయ్య

పంతులుగారు చదువునాఁటికి మదరాసు పోవుటకు రైలుత్రోవ లేదు. పాగవోడయే యాధారము. రామయ్యగారు పాగవోడలోఁ బ్రయాణము చేయుచుండ నొకసారి వోడమీఁదనుండి జారి సముద్రములోఁ బడిపోయిరి. ఓడకప్తాను చూచి తొందరగ వచ్చి పడిపోయిన పంతులు గారి జుట్టుపట్టుకొని మునిఁగి తేలుచున్న సమయమున బయటికి లాగి బ్రతికించెనఁట. ఆయనజుట్టే ప్రాణభిక్ష పెట్టినది" పరిశోధకపండితశిరోమణి కాఁదగిన యిట్టి మహాశయుఁడు జలగండము పాలగు టెట్లు సమకూడును?

పంతులుగారు ప్రథమమున మాధ్యమికపాఠశాలలో నధ్యాపకులు. తరువాత మండలాధికారి (జిల్లా మేజస్ట్రేటు) కచేరీలో లేఖకులు. అటుపై నచ్చటనే ప్రధానలేఖకులు. అనంతరము సహాయ మండలాధికారి (డిప్యూటి కలెక్టరు), తదనంతరము రాష్ట్రన్యాయాధికారి (ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు) పిమ్మట శాసనసభాసభ్యుఁడు (ఎమ్. ఎల్. ఎ.).

క్రమముగా నుపకారవేతనము పొంది కళాప్రపూర్ణుఁడై సలక్షణాంధ్ర భాషాప్రతిష్ఠాపకుఁడని యశస్సు గాంచెను. రామయ్యపంతులుగారు తెఱపిలేని రాజకీయోద్యోగములకుఁ దమ నవయౌవనమంతయు ధార వోసిన పట్టభద్రులు. ఏయుద్యోగమునే నున్నను వీరికి సాహిత్యోద్యోగము మాత్రము సన్నగిల్లలేదు. పగలెల్ల నుద్యోగధర్మము నిర్వహించుకొని రాత్రులు వీరు నిరంతరము సాహిత్యకృషి చేయుచుండెడివారు. ఉద్యోగధర్మమున నేగ్రామమున కేఁగినను నచటి పండితులను గవులను సందర్శించి వారితో నేవో భాషావ్యాసంగములు సేయుచుండుట వీరికలవాటు. వీరిభాషాభిలాష క్రమముగాఁ బెరిగినది. ఉద్యోగము నిర్వహించు నోపికయుఁ దఱిఁగినది. ముక్తేశ్వరమునఁ గాలు మీఁదఁ గాలు వైచుకొని గ్రంథసమీక్షకు, భాషాతత్త్వ పర్యవేక్షణమునకుఁ గడఁగి యనేకశాసనములు పరిశోధించి యనేకరహస్యములు

వెలికిఁదీసి వెలువరించిన మహాత్ముఁ డీయన. రామయ్యపంతులుగారి జీవిత కృతిలో 'ఆంధ్ర సాహిత్యపరిషత్తు' రసవదధ్యాయముగాన నీసందర్భమున దానిని స్మరించుకొనుట సముచితము.

పరిషత్తున కాదిలో నాంధ్రసంస్థానము లెన్నియో యార్థిక సాహాయ్య మొనరించినవి. పీఠికాపుర ప్రభువులు, బొబ్బిలిమహారాజులు, వేంకటగిరి సంస్థానాధిపతులు, ఉయ్యూరు జమీందారులు, తుని రాణిగారు మున్నగు వార లెందఱో చేయూఁత నిచ్చిరి. దానితో నాంధ్రసాహిత్యపరిషత్తు లేచినది. ఆంధ్రరచయిత లెల్లరు దాని యుత్పత్తికి గర్వించిరి. ఆంధ్ర దేశమునందలి తాళపత్త్రి గ్రంథములు, ప్రాచీన శాసనములు సంపాదించి సంశోధించి ముద్రించుట కీపరిషత్తు గొప్పపనిచేసినది. నేఁటికిని జేయుచున్నది. మొట్టమొదట నీపరిషత్కార్య నిర్వాహకసంఘములోఁ జేరుపోసినపండితు లెందఱో ప్రవేశించిరి. ఆకారణమున నీసంస్థ విశేష విఖ్యాతి గడించుకొనినది. గ్రాంథికాంధ్రమునకుఁ బరిషత్తు చేసినసేవ యపారము. అఖండము.

రామయ్యపంతులుగారు మొక్కవోని గ్రాంథి కాంధ్రవాదులు. గిడుగు రామమూర్తి పంతులుగారికి వీరికి జరిగిన వాద ప్రతివాదములు జగమెఱిఁగినవే. రామయ్యపంతులుగారి గ్రాంథికవాద సారాంశమిది. "దేశమభివృద్ధి నొందినకొలఁది జనుల యాచారములు, భాషలు మొదలగు వానిలోనున్న యంతర్భేదములు నశించి క్రమముగా నవి యేకాకారమును బొందుట లోకమర్యాదయైయున్నది. దీనికి వ్యతిరేకముగా. గ్రామ్యవాదులు చిరకాల సంప్రాప్తమైన యేకాకార గ్రాంథికాంధ్ర భాషను రూపుమాప యత్నించుచున్నారు. వీరియత్నము కొనసాగినచో నాంధ్రవాఙ్మయము భావికాలపుఁ దెలుఁగువారికి దురవగాహమై పఠనము లేక నశించి పోవలసివచ్చునుగదా ? లోకహితార్థము మహాకవు లించు మించుగ వేయిసంవత్సరములనుండి సంపాదించి మనపరముచేసిన సర్వాంగ

సుందర వాఙ్మయ భాగ్యమును మన మనుభవింపలేక పాడుచేసుకొన్న వార మగుదుము. తాను సంపాదించుట లేదుగదా పెద్దలు సంపాదించి యిచ్చిన దానినైనను నిలుపుకొనలేక చెడఁగొట్టుకొన్నవాఁడెట్టి ప్రజ్ఞా శాలియో యూహింపుఁడు. పెద్దలు కట్టిన దివ్యభవనమును బడఁగొట్టు కున్న పిమ్మట నిలువనీడ యెద్ది? ఎద్దియో యొకకొంప కట్టఁకొంద మందురా? దానికి సాధనసామగ్రియేది? అదియెన్నటికిఁ గొనసాగును? ఇఁకముందు గ్రామ్యకవులు గ్రంథములు రచింపవలసినది గ్రామ్యభాష యందేకదా? ఇది బహుముఖములుగా నున్నది. అందేభాషలో రచింతురు? గోదావరీ కృష్ణా మండలములలో విద్యాధికులు వాడుచుండు సంభాషణభాషయందఁట. ఆభాష యేకాకారముగ నున్నదా? ఆభాష లోనున్న గ్రంథము లితరమండలములలో నున్న తెనుఁగువారికి సులభముగా నర్థమగునా? గ్రాంధికభాషను బోగొట్టి తమకర్థముగాని గ్రామ్య భాష నేర్చుకొమ్మని బలవంతపెట్టుట వీరికి ముల్లుదీసికొఱ్ఱుకొట్టినట్లగును గదా? ఈవృథా ప్రయత్నమేల? వ్యావహారిక భాష సుగమమను గ్రామ్యవాదులలోనెంతమంది చంద్రశేఖరశతకము చదివి యన్వయింపఁ గలరో? భాషీయదండకమను చిన్న పొత్తము నెంతమంది యర్థము చేసికొనఁ గలరో? అధికసంఖ్యాకులకు సులభముగాఁ దెలియుటే ప్రయోజనమైనచో విద్యాధికుల వాడుకభాషయేల? విద్యావిహీనులైన ప్రాకృతజనుల భాష యేలకూడదు? ఏభాషను గ్రాంథికభాషగా గ్రహించినను గాలక్రమమున వానిరూపములు స్థిరపడి యిప్పటిగ్రాంథికభాష యందుఁగల వన్నదోషము లన్నియు దానికిని బట్టునుగదా? అట్లైచో నీనిరర్థకప్రయత్నమేల?

"ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి."

ఇది యటుంచి పంతులుగారి శాసన పరిశోధనశక్తి ముచ్చటించు కొందము. వీరు 1200 శాసనములవఱకుఁ బరిశోధించి తత్త్వవిశేష

ములు వెలిఁబుచ్చిరి. ఆ శాసనములలో 400 శాసనము లాంధ్రవిశ్వవిద్యా పీఠమునకుఁ బ్రచురణార్థ మొసఁగిరి. 'ఇండియా గవర్న మెంటు' వారు శ్రీపంతులుగారి శాసనపరిశీలన ప్రతిభ నెఱిఁగి యాంధ్రదేశమునకు సంబంధించిన 800 శాసనములు పరిష్కరించుటకు వీరి కొసఁగి యుండిరి. వాని నన్నిటిని సంశోధించి పీఠికలు, లఘువ్యాఖ్యలు వ్రాసి పంతులుగారు ప్రభుత్వమునకుఁ బంపిరి. అవి ముద్రితములగుట యాంధ్రులకుపకారకము. వీరు పరిశోధనము గావించిన శాసనములలో 'తొత్తరమూడిశాసనము' తొట్టతొలిది. "యుద్ధమల్లుని బెజవాడ శాసనము" ముఖ్యము. ఈశాసనపఠనమున వీరగపఱిచిన ప్రతిభోన్నతికి ప్రభుత్వము ప్రశంసించినది.

రామయ్యపంతులుగారు భాషాపోషకులుగాను, పరిశోధనపండితులుగాను కీర్తింపఁబడవలసినవారే కాని కవులుగాఁ బేర్కొనఁదగినవారు కారని కొందఱియుద్దేశము. కాని వీరు రచించిన పద్యకావ్యములును లేకపోలేదు. 'అమరుకము' ననువదించిరి. ఈ యుదాత్తకృతికన్యకను యతిలోకసుందరాకారున కర్పించి ధన్యులైరి. "తెలుఁగునను పుట్టి నీకృతి తొలుత ననెడి భావమాత్మఁ దోఁచె శుభంగిఁ జెలఁగి" నీశృంగార కావ్యమనువదించిరి. అమరుకమునకుఁగల యాంధ్రానువాదములలో మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి తరువాత వీరిదే సరసముగ నున్నది. ఈపద్యము లెంత హృద్యమగు శైలిలో నడచినవో చూడుఁడు.

అలకంబుల్ చెదరంగఁ గుండలయుగం బల్లాడ లేఁజెమ్మటం
దిలకంబించుకజాఱఁ గన్నుఁగవ మొంతేఁ దాంతమై యొప్పఁగా
జలజాతాంబక కేళి సల్పెదు సరోజాతాక్షి నెమ్మోము ని
చ్చలుమిమ్ముంగృప బ్రోచెడుం హరిహరస్రష్టాదులింకేటికిన్.
పొగరుంగుబ్బలు పొట్టిపై పులకలం బూనంగ నే నెంతయున్
బిగికౌఁగింటను గూర్పఁ జీర నడుము న్వీడి జాఱంగఁ దా
శఁగ లేనింకను మానుమానుమని బల్ దైన్యంబుగాఁ బల్కునీ
చిగురుంబోఁడికిమూర్ఛయో నిదురయో చిత్తమ్మునం జేరెనో!

"పలువురింతకుఁ బూర్వమే తెలుఁగు చేసినట్టిదీనిని మరలఁజేయుంగ నేల, యనిన నయ్యవి కావ్యంబు గుణగణంబు, తప్పు యగుఁగాని యరయ నాతప్పుగాదు." అనిచెప్పుకొని భవభూతి యుత్తరరామ చరితము నాంధ్రీకరించిరి. ఉన్నవానిలో నుత్తమమనుటకు వీలులేదు గాని వీరి యాంధ్రీకృతి చక్కఁగనున్నది. భాష బహుమృదువుగ నున్నది. సమాసములగడబిడ లేదు. మచ్చున కందలిపద్యమొకటి.

ఎండం బుల్గులు గూండ్లలోనొదిఁగి మొంతే స్రుక్కికూజింపఁగా
దండై శాకులక్రిందనీడఁబురువుల్ మేయుంగ మిట్టాడఁగా
గండూతిం గరులెల్లఁ దమ్ము నోరయుంగా రాలు పుష్పాళిచే
నండం గల్గినభూరుహంబు లివిగో యర్చించు గోదావరిన్.

మఱియొక ముఖ్యవిషయము: ఆంధ్రసాహిత్య పరిషత్పక్షమున 'శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు' వనుపేర నొకమహాకోశము రచింప బడుచున్న దని తెలుఁగుదేశ మెఱుఁగును. కొందఱు ప్రసిద్ధాంధ్రపండి తుల సాహాయ్యమున శ్రీ రామయ్యపంతులుగా రీనిఘంటువునకు సూత్రపాతము వేసి రెండుసంపుటములవఱకుఁ బ్రకటించిరి. ఈనిఘంటు కృతిభర్తలు శ్రీ పీఠికాపురాధీశ్వలు శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు. శ్రీ మహారాజావా రీకృతికై దగ్గఱగ రెండులక్షలు వ్యయించిరి. శ్రీ వారి యౌదార్యాతిశయమువను, పంతులు గారి సంకల్పబలమునను నీ బృహత్కోశము పూర్తియయి యాంధ్రి నలంకరించుఁగాక!

రామయ్యపంతులుగారు ధన్యులు. వీరిపేరు నిఘంటువుతో పాటు సుస్థిరస్థాయి. గ్రాంథికాంధ్రీభవనమునకు నాలుగే యాధార స్తంభములు. ఆంధ్రసాహిత్య పరిషత్తు. శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు. పీఠికా పురాధీశ్వరులు. జయంతి రామయ్యపంతులు.

పంతులుగారు "ఆధునికాంధ్రవాఙ్మయ వికాస వైఖరి" యను గ్రంథము వెలువఱిచిరి. నూతనాంధ్ర వాఙ్మయ మెట్లు పరిణమించి నదియుఁ జక్కఁగ నిందువివరించిరి. ఇది యుపయోగకరమగు కూర్పు.

1937 లో ఆంధ్రేతిహాస పరిశోధకమండలి పంతులుగారికి 25 వ జన్మదినోత్సవము గావించి యాంగ్లములో సభినందన సంపుటము ప్రకటించినది. ఆంధ్రవిశ్వవిద్యాలయము వీరికి కళాప్రపూర్ణ బిరుద మొసంగి సన్మానించినది. రామయ్యపంతులుగారిది ధన్యజీవితము. సంపూర్ణ విద్యాభ్యాసము గావించిరి. మహోన్నతపదవుల నాక్రమించిరి. దీర్ఘాయుర్భాగ్యముఁ బడసిరి. సంతతహరినామస్మరణము గావించిరి. గొప్పకీర్తిప్రతిష్ఠలు సంపాదించిరి. అనాయాసమరణము, అదైన్యజీవనము చేకుఱిన మహాశయుఁ డీయన.

ఈయన విశిష్టతను గుఱించి అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి 'చాటుధారాచమత్కారసార' గ్రంథమున నిటు లుపశ్లోకించెను-

శ్లో. జయంతిరామ కీర్తిస్తే సకలాశానువర్తినీ
సజాత్యపి రజోయుక్తా ప్రసూతేఽర్థి సుతాన్‌బహూన్.

శ్లో. శ్రీరామస్య గుణాస్స నామకలనాద్యస్మిన్ జయంతిశ్రితా
యజ్ఞాహ్వాంచల రంగనాట్యలలనా హాణీలసద్రామిడీ
గైర్వాణీ ఘనవైకృత ప్రభృతయో భాషా జయంత్యన్వయ
శ్రీరామార్యసుత స్సరామయసుధీర్లత్వా చిరంజీవతు!

శ్లో. యస్యాజ్ఞా నరపాలఫాల ఫలకాగ్రాంచన్మణీ పట్టికా
తాదృ "గ్యాపిలు" నామహూణనృపతే స్సమ్మానసంధానితాం,
డైప్టీం, కాల్కుటరీం వహన్ భువి జయంత్యన్వయ్యపేరార్యస
త్పుత్రః కాశికగోత్రజో విజయతే శ్రీరామయార్యాగ్రణీః॥

శ్లో. జయంతి రామార్య మనోవ్యచాంసి
జయంతి రామార్య లసద్వచాంసి
జయంతి రామార్యమనోవ్యశాంసి
జయంతి రామార్యరిస న్మహాంసి ॥

---

# పూండ్ల రామకృష్ణయ్య

## 1860-1904

ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. జన్మస్థానము: దువ్వూరు (నెల్లూరు మండలము). జననము 14–జూలై 1860 సంII నిధనము: 1 సెప్టెంబరు 1904 సంII ప్రచురణములు: అముద్రితగ్రంథచింతామణి పత్రిక. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి జీవితసంగ్రహము. గ్రంథపీఠికలు – మున్నగునవి.

పూండ్ల రామకృష్ణయ్యగారివంటి తెలుఁగుపండితు లెందఱో కలరు. కాని వారివంటి విమర్శకులు తక్కువ. వీరిది ముగమోటము లేని విమర్శనము. ఆంధ్రమున వీరిపాండితి నిరూఢము. ఈయన బహుశ్రద్ధతో వెలువరించిన 'అముద్రితగ్రంథ చింతామణి' పత్రికలలోని ప్రతిపత్రమును వేలకొలఁది విలువ కలది. ఈపత్రిక ౧౮౮౫ లో ఒడయారు వీర నాగయ్యగారి సహాయసంపాదకతతో శ్రీరామకృష్ణయ్యగా రారంభించిరి. ౧౮౯౦ లో వీరనాగయ్యగారీయుద్యమమునుండి తప్పుకొనిరి. శ్రీ వేంకటగిరిమహారాజా, శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్ర బహద్దరు వారు దీనికిఁ బోషకులు. [illegible] లో [illegible] వీరనాగయ్యగారు విరమించుకొనినను, రామకృష్ణయ్యగారు తమ నిర్యాణపర్యంతము ౧౯౦౪ వఱకు నముద్రితగ్రంథచింతామణి నపూర్వపద్ధతులతో వెలువరించిరి. శ్రీరామ కృష్ణపండితుని విమర్శకశక్తికి [illegible] చింతామణియే నికషోపలము. వీరేశలింగము పంతులుగారి వివేకవర్ధనియు, శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారి కళావతియుఁ బ్రచురింపఁబడుచుండునాళ్ళవి. ఎన్నిపత్రిక లున్నను విమర్శన విషయమున నముద్రితగ్రంథచింతామణిదే యగ్ర తాంబూలము. ఇం దెన్నో ప్రాక్తనాంధ్రగ్రంథములు ప్రకటింపఁబడినవి. [illegible]

జితనము మీఱంగ నము-
ద్రితసద్గ్రంథముల సేకరించి కమ్రం బర
ష్కృతములు గావించి యథా
మతిఁ బత్త్రికఁ గూర్చెదము క్రమంబుగ వ్రాసిన్.

తోరపు నూలుదారములతోఁ బదిలంబుగ గట్టి పెట్టియుం
జేరుప నందు జీర్ణదశఁ జెంది మొగిం క్రిమికీటకచ్ఛటా
పూరితమై వృథాసెసు సముద్రితపుస్తకపంక్తి నెంతయుం
గూరిమి మీఱ నచ్చునను గూర్చుట సెల్లదె పత్త్రికాకృతిన్.

అముద్రితగ్రంథప్రకటనము, వ్యాకరణచ్ఛందోవిషయవిమర్శనము సీపత్రిక ప్రధానోద్దేశములు, మండపాక పార్వతీశ్వరశాస్త్రి, వేదము వేంకటరాయ శాస్త్రి ప్రభృతులపాండిత్యశక్తి సీపత్రికయే చాటినది. రామకృష్ణయ్య గారి విమర్శకశక్తి 'మయూఖము' లలో వెల్లివిరిసినది. శ్యమంతక, శబ్ద విచారము, వటుశబ్దప్రయోగము, పరిఖా పరిఘ శబ్దద్వయసాధుత్వము బిల్వేశ్వరీయకృతి విమర్శనము ఇత్యాదులు రామకృష్ణయ్యగారికి విమర్శ శాగ్రేసర బిరుదము నీయఁగలవ్యాసములు. వీరి విమర్శనము కేవలశాబ్ది కమే కాదు. నాటకాదులలో గ్రామ్యభాషాప్రయోగము చేయవచ్చునా? ఇత్యాదివిషయములుకూడ వీరి నిశితవిమర్శకు విషయములైనవి. వేదము వేంకటరాయశాస్త్రిగారి 'నాగానందము' లోని పాత్రోచిత భాషను వీరు చక్కఁగ సప్రమాణముగ సమర్థించిరి. నాఁడు వీరివ్రాఁతే పండితులకు శాసనము.

అ. గ్ర. చింతామణిలో వెలువరించిన గ్రంథము లివి: ౧ ప్రబంధ రాజ వేంకటేశ్వరవిజయవిలాసము. (గణపవరపు వేంకటకవి) ౨. హరి శ్చంద్రనలోపాఖ్యానము. (రామరాజభూషణుఁడు) ౩. మిత్త్రవిందా

పరిణయము (కుందుర్తి వేంకటాచలకవి) ౪. చంద్రాంగదచరిత్రము (పైడిపట్టి వేంకటపతి) ౫. యాదవరాఘవపాండవీయము (నెల్లూరి వీరరాఘవకవి) ౬. వైజయంతీవిలాసము (సారంగు తమ్మయ) ఇవి ప్రాచీనములగు ప్రబంధములు. ఆధునికకృతులుకూడ నిందుఁ బ్రచురితములు. ఓగిరాల రంగనాథకవిగారి 'ద్విరేఫదర్పణము' మంతెపాక పార్వతీశ్వరకవిగారి శ్రీకృష్ణాభ్యుదయము మున్నగునవి.

సహజముగ నీయన చిన్నశక్తికలవాఁడని, కాని పద్యములు మధుర కంఠమునఁ జదువునపు డానందముగ నుండెడిదని చెప్పుకొనుట.

రామకృష్ణయ్యగారొనరించిన భాషాసేవ చిరస్మరణీయము. ఈయన కడకాలములో స్మృతితప్పి పడియున్నప్పుడు వేంకటగిరి ప్రభువు వీరికిఁ గొంతధనము పంపి వారిచెవికడ 'వేంకటగిరిరాజు పంపె' నని గట్టిగా నొక్కివేయుంచి యిచ్చుటకాజ్ఞ పెట్టెనఁట. ఆమహారాజున కీయనపై నంతయభిమానము.

[illegible]

# అల్లంరాజు రంగశాయి కవి

## 1860 - 1936

ఆరామ ద్రావిడ శాఖీయ బ్రాహ్మణులు. హారితసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. తల్లి: చిన్నమాంబ. తండ్రి: సుబ్రహ్మణ్యకవి. జన్మస్థానము: పిఠాపుర పరిసరమున నున్న చేబ్రోలు. జననము: 1860-రౌద్రి సంవత్సర నిజాశ్వయుజ శుక్లతృతీయా సౌమ్యవాసరము. నిర్యాణము: 1936. యువ చైత్రబహుళదశమి. గ్రంథములు: ౧. శ్రీమదాంధ్రచంపూభారతము [ఆంధ్రీకరణము. 1913 ముద్రి] ౨. రామాయణచంపువు [సంపూర్ణముగ ముద్రణమునకు రాలేదు] 3. రఘురామశతకము. ౪. పరమాత్మశతకము. ౫. సర్వేశ్వరశతకము. ౬. గోవిందశతకము. ౭. లక్ష్మీశతకము. ౮. మాధవశతకము. ౯. కుక్కుటలింగశతకము. ౧౦. గోపాలస్వామిశతకము. ౧౧. మల్లికార్జునశతకము. సంస్కృతగ్రంథములు: ౧. దైవస్తోత్రరత్నావళి ౨. నారాయణానందలహరి. 3. కవిమానసరంజని.

పండితుని పుత్రుఁడు పండితుఁడగు సంప్రదాయము లే దనుకొందురు. రంగశాయికవిగారి తండ్రి సుబ్రహ్మణ్యకవి. ఆయన భద్రాపరిణయాది మహాప్రబంధ ప్రణేత. అతనితండ్రి కవి. అతనితండ్రి కవి. వీరిచరిత్రము లన్నియు 'ఆంధ్రకవులచరిత్ర' గ్రంథము నలంకరించియున్నవి. వీరివంశమునఁ దరమున కొకకవి చొప్పున వచ్చుచున్నారు.

రంగశాయికవి సంస్కృతాంధ్రములు తలస్పర్శిగఁ జదివెను. కవిత యాయనకు నిసర్గముగ జనించినది, ఆయన ధారణాబలము, మేధాపటుత్వము శతవధానాష్టావధానములను నిర్ఘాటముగఁ జేయించినది. అపారమైన శ్రీనారాయణభక్తి రంగశాయికవిగారిచే నరాంకితము గావింపనీయలేదు. కవులలో నిట్టి సాత్త్వికమూర్తి తఱచు కనుపట్టఁడని పెక్కురవలన వినుకలి. అందఱుచేతను 'పాదస్పృశ్యబ్రాహ్మణుఁ' డనిపించు

కోఁబడిన కర్మిష్ఠి. ఈయన సత్యపరతగొప్పది. ఈయన జయపురము, నూజవీడు మున్నగు సంస్థానములలో సత్కారములొందె, గోడే గజపతి రావు ప్రభునొద్ద ముప్పది సంవత్సరములుండి బహుగౌరవములు వడసెను. బంధకవితయందును, చిత్రకవితయందును, సమస్యాపూరణ మందును, అవధానములందును రంగశాయికవి మంచినేర్పు గలవాఁడు. శ్రీ సూర్య రాయనిఘంటు కార్యస్థానమునఁ గొంతకాలము పండితపదవిలోనుండెను. అంతే, యీయన గావించిన భృతకవృత్తి మఱి, తదితరమైన యుద్యోగము లేవియుఁ జేసియెఱుఁగఁడు. ఉన్నదానితో సరిపెట్టుకొని, క్లుప్తముగ సంసారము దిద్దుకొనుచు, నయినవానిని కానివానిని యాచింపకుండ మర్యాదగఁ గాలక్షేపముచేసిన సంతుష్టద్విజుఁడాయన. కృతులు నరుల కీయలేదు. శతకములతో భగవద్ధ్యానము చేసికొని తరించెను. సంస్కృతాంధ్రములలో మొత్తమాయనకవి, పండ్రెండుశతకములువ్రాసికొనెను.

అనంతభట్టు రచించిన 'భారతచంపువు' సొంపుగాఁదెలిఁగించెను. భోజరాజు 'రామాయణచంపువు' కూడఁ దెలిఁగింప మొదలిడి బాలకాండము దాఁక రచించెనని వారి కుమారులవలన నేను విన్నవిషయము. రంగశాయికవిగారి కీర్తి శాశ్వతముగ నిలుపుటకు వారి 'భారతచంపువు' ఒకటిచాలును. ఆకావ్యములోని పద్యగద్యములసంఖ్య యించుమించు ౧౫౦౦ - శబ్దసంస్కార మచ్చట జాఱలేదు. కవిత ధారావాహికమై 'అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి' గారికి సరిపడినకుమారులు నిరూపించుచున్నది. చంపూభారతావతారికలో రంగశాయికవి గ్రంథరచనా కారణ మిటులు చెప్పికొనెను:

క. జనసన్నుఁ డగు మజ్జనకుఁడు
[illegible] చంపుభారతము నీవు తెనుం
[illegible] శ్రీర[illegible]
యనుపమతర సత్కృపమా యానతిచ్చుట[illegible]

మ. ఒక గీర్వాణపుశ్లోకముం దెనుఁగుగానూహించి పద్యంబు పొం
దికతోఁ జెప్పఁ బ్రయాసమౌ, నయిన దీనింగల్పనాలంక్రియా
దికముల్ వర్తిలుచున్న వన్నియును బూర్తింగల్గున ట్లెల్లవా
రికి నర్థంబగునట్లు నే సులభమౌరీతిం దెనింగించెదన్.

వ. అని యంగీకరించి పీఠికాపుర సమీపస్థిత చేబ్రోలు గ్రామంబున నివసింపుచు శాలివాహనశకంబునందు వేయు నెనిమిది నూటుల పదుమూఁడు వత్సరంబులు గడువ నడచు నందనసంవత్సర శ్రావణ శుద్ధ సప్తమీదినంబున నేతత్ప్రబంధంబుఁ దెనిఁగింప నారంభించితి......

అనఁగా, నీభారతచంపువు క్రీస్తుశకము 1891 లో నుపక్రమించి రని తెలియును. రచన కెన్నాళ్ళు పట్టినదో గాని, అచ్చుపడుట మాత్రము 1918 లో జరిగినది. సంస్కృతము లో ననంతభట్ట మహాకవి కవిత్వము చాల మాధుర్యముగలది. ఆ మాధుర్యమునకు వెలితిరాకుండఁ దెలుఁగులో రంగశాయికవి మిక్కిలిసొంపుగ దీనిని రచించెను. రెండు మచ్చు పద్యములు :

మ. ఘనరత్నోజ్జ్వల కుండలాఢ్య ధగయుక్తంబౌ సమస్తాంగ శో
భన కర్ణత్రితయుంబు గ్రమ్మ నిరుగ్రేవల్ పూను దుర్యోధనుం
డు నిజాకారగులైన తొంబదిపయిం దొమ్మండ్రు సోదర్యులుం
దను వేష్టింపఁగ వచ్చె సైన్యపటహాధ్వానావృతాకాశులై.

ఉ. పిమ్మట నెల్లచోట్లఁ బడవేసినపువ్వుల సౌరభంబులం
గ్రమ్మినదై స్వన త్పటహరాజితమై యగరూత్థధూపవా
హమ్మగు చందువల్ గలదియై మణిమంచనివిష్టరాట్టఁ దం
బమ్మను నా స్వయంవరపు మంటపమెక్కిరి పాండునందనుల్.

ద్వితీయస్తబకము. - ౮౬.౮౭

వీరి చిత్రకవిత్వమున కుదాహరణముగ నీపద్య మొకటి పైగ్రంథము లోనిదే యుదాహరించుచున్నాను.

క. మామా మీమో మామామా
మామా మిమ్మెమ్మెమ్మ మామమామామేమా
మేమెమ్మము మీమైమే
మేమే మమ్మెమ్మము మోము మిమ్మా మామా.

ఇది యేకాక్షర కందము. ఈకవిగారి 'చంపూభారతము' తెలుగు బాసకు ఇక్కనియలంకారమనుట యసంశయవిషయము.

అర్థము: మామా, మా=చంద్రునియొక్క, మా=శోభ, మీమేమా మాన్= మీముఖమందు అగును. 'అన్యస్యాపి క్వచిద్భవే ద్వాచ్యా' అనుసూత్రముచే నిచట ప్రథమకు సప్తమ్యర్థము. మామామా, మామా=మామారొయొక్క, మా=మేధ మిమ్మెమ్మెమ్మ, మిమ్మ=మిమ్మను, ఒమ్మన్ = అనుకూలించును. మామమామా = మామకు మామవైనటువంటి ఓ దేవా! మేమా మేమిమ్మము, మేము, అమా= గర్వమును, ఏమి=ఏమియును ఒమ్మము= అనుకూలించదు. మీమైమే= మీశరీరము మేమేమే=మేము, ఏమే. మమ్మ=మమ్మును, ఓము మోముము=రక్షింపుము రక్షింపుము, ఇమ్మామామా=అనుకూలము అగుమా అగుమా. నిఘంటువు: చంద్రేమాశ్చ మాః పుమాన్, మా స్త్రీ మాసేమ్మృతౌ వేలా మేధా శ్రీ మధ్య మాతృషు—అని నానార్థ రత్నమాల —

'తాతోపి పీతాయతే' అని సంస్కృత సమస్యను రంగశాయికవి గారి కేరో యిచ్చిరట. దాని నటులు పూరించెనో పరికింపుడు :

శ్లో. క్షీరాంభోధి తరంగ శీకరరుచా కాకోఽపి హంసాయతే
కాళిందీ కటినీ జత్రా స్తు కలయన్ హంసోఽపి కాకాయతే !
సంసక్త్యా తాం సమాకులో గిరి వరో మేరుక్షితి ధ్రాయతే
దావాళిప్త మహాదమా జ్వలన ధూమాతాతోపి పీతాయతే॥

ఈకవి శతకపద్యముల ధారాశుద్ధి కొక్కయుదాహరణ మిచ్చెదను.

శా. కాణాదర్శివర ప్రణీతమగు తర్కంబు చేనేయుంగంజుమీ
పాణిన్యారచితంబు వ్యాకరణ మొప్పం గొంచె మీాక్షించితిన్
వాణీనైపుణి లేదు రాజసభలన్ వాదింప లేనమ్మ యే
వాణిజ్యంబును సేయుంగ నీకనంబా! లక్ష్మి! రక్షింపుమా.

కవి గర్వరాహిత్య మీపద్యములోఁ బ్రస్ఫుట మగుచున్నది. కవి సత్య వాదియనుట కీపద్యమే గొప్ప యుదాహరణము. వాస్తవముగ, రంగ శాయికవికి కోటిభాటి తక్కువ. ఏదో వ్రాసికొనుచు నజ్ఞాతముగఁ గాల యాపనముచేయువాఁడే గాని, రాజసభలకుఁబోయి ఝుంకారముగ లేని పోని బొంకులాడి విత్తసంపాదనముచేయు దారు లీయన యెఱుఁగఁడు. ఈ కవివరుని సంస్కృత కవితాధోరణి మనోహరముగనున్నది. ఆభాషలో నీయన రచించినవి మూఁడు గ్రంథములు: 'నారాయణానందలహరి' లోనివి రెండు చూపెదను —

శ్లో. రసజ్ఞా స్మాకీనా మధురరసయుక్తానపి బహూన్
పదార్థన్నేచ్ఛంతీ తవరుచిరనామ్నో మధురతాం
విదిత్వా త్వామేవ స్మరతిఖలు శశ్వద్గతరుచి
ర్భవంతం సంస్తోతుం ప్రతికల మియం శాంతమతి హరే!

శ్లో. యథావీణాగానం తవహిత మభూ న్నారదమునే
ర్యథా ప్రహ్లాదోక్త స్తుతిఫణితి రాహాభ్యుపగమమ్!
యథా సమ్యక్ప్రీతి శ్శుకవచనరీతి స్సమభవత్
తథై వాస్మత్ప్రోక్త స్తుతిరపి మురారే భవతు తే॥

రంగశాయికవి శతకములు, తెనిఁగింపులు తప్ప స్వతంత్రకావ్య మొక్క టియు రచింపలేదు. అటులు రచించు నుద్దేశము కూడ నాయనకు లేదని విన్నాను. "అసత్య వస్తువులను వర్ణించి, అభూత కల్పనములు చేసి స్వతంత్రకావ్యములు రచించుట నా సత్యవ్రతమునకు భంగము కలిగించును

గాన మానివైచితి" నని సమాధానము చెప్పెడివాడఁట. నిజము; రంగశాయికవి మడికట్టుకొనిగాని కవిత్వము వ్రాయువాఁడు కాఁడు.

ఈయన పిఠాపురములో శ్రీ సూర్యరాయనిఘంటు కార్యస్థానమున నుద్యోగించిన నాళ్ళలోఁ, ద్రోవలో నేయంటరాని యాకో కాలికిఁ దగిలినటు లనుమానము తట్టిన నింటికివెళ్ళి సచేలస్నానముచేసి కార్యాలయమునకు వచ్చెడివాఁడని వింటిని. 'ఆఫీసు' సమయమున కాలస్యమైనను, దనయాచారమునకు లోటులేకుండఁ బ్రవర్తించిన యమాయకుఁడీయన: రాజకీయతంత్రములు, లౌకికయంత్రములు, తెలియక, శుద్ధవైదిక సంప్రదాయమున, జీవయాత్ర గడపిన పవిత్రమూర్తి రంగశాయికవి. ఆయన 1836 రాగనే, తనచంపూభారతములో, తనశతకములలోఁ దనజీవితము దాఁచుకొని మహాప్రస్థానము సాఁగించెను. "శుచిర్వ్రత శ్శుచిః కవిః".

# మేడేపల్లి వేంకటరమణాచార్యులు

## 1862-1943

గోలకొండవ్యాపారి వైష్ణవుఁడు. భారద్వాజసగోత్రుఁడు. ఆప స్తంబసూత్రుఁడు. తండ్రి: రఘునాథాచార్యులు. తల్లి: లచ్చమాంబ. జననము: 10-7-1862 సం. నిర్యాణము: 1943 సం. వీరి పూర్వుల నివాసము అనకాపల్లి. (విశాఖపట్టనము జిల్లా). వీరి నివాసము : విజయ నగరము. గ్రంథములు: పార్థసారథిశతకము, దేవవ్రతచరిత్రము (ప్రబంధము), సేతుబంధమహాకావ్యము (ప్రవరసేనరచిత ప్రాకృత కావ్యమున కాంధ్రపరివర్తనము), అలంకారశాస్త్ర చరిత్రము, హర్ష చరిత్రము (వచనము), కౌశికన్యాయవివరణము. సంస్కృతకృతులు: షేక్స్పియరు నాటకకథలకు సంస్కృతానువాదము, వకుళాభరణుల ద్రావిడ గాథా సహస్రమునకు సంస్కృతశ్లోకములు—ఇత్యాదులు.

వేంకటరమణాచార్యులుగారు ప్రబంధకవి. ప్రాచీన సంప్రదాయములు దాటకుండ 'దేవవ్రతచరిత్రము' పద్యకావ్యముగా రచించిరి. కవిత్వము నాతికఠినముగ నుండి రసవంత మని పెక్కుపండితులచేఁ బ్రశంసింపఁబడినది. గ్రంథకర్తలు సంస్కృతాంధ్రములయందుఁ దలస్పర్శియగు పరిజ్ఞానముకలవా రగుటచే ని దెన్నియో ప్రయోగవిశేషములు వాడిరి. 'చేతు' మున్నగునవి ధారాళముగా నుపయోగించిరి. ర. ఱ లకుఁ బ్రాసములు ర. ల లకుయతులు, అఖండవిరామములు వీరు త్రోసి వేయలేదు. భీష్మునిచరిత్రము నింతకుముందు రచించినవారు లేరు. భీష్మునిచరిత్రమేగాక సందర్భానుసారముగా ద్రౌపదీవస్త్రాపహరణాదులభివర్ణితములు, తిక్కనకు వచ్చినట్లే యీకవికిఁ గల వచ్చినది. కలలో శేషశైలపతి కనఁబడి దేవవ్రతచరిత్రము రచింపుమని చెప్పెనఁట. స్వప్న వృత్తాంతము, షష్ఠ్యంతములు మున్నగునిబంధనములను మీఱక నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయాది సమస్తవర్ణనములు గావించి వీరరస ప్రధానమైన యీప్రబంధము భావ భాషా బంధురముగా విరచించిరి.

కవిత్వమున నూతనత్వమును దెచ్చుటకుఁ బ్రయత్నించిన కవులుగారు వీరు. కాని శైలి ధారాళమైనది.

లీలాపాంగవిలోకనంబులఁ బ్రదపాలీలాస్యసందర్శన
భ్రూలాస్యంబుల మంజువాఙ్మధుధునీపూరాప్లుతిన్ బూరుషున్
లోలుంజేసి మృషాప్రతిజ్ఞల సతుల్ లోభంబుఁ బుట్టించి దు
ర్లీలం బ్రీతిని జూపి చేయరె నిజక్రీడాళకుంతంబుగన్.

దేవవ్రత. ౧-30.

ఈకావ్యమున మూఁడవయాశ్వాసములో జామదగ్న్యభీష్ముల కొంత సంభాషణ మున్నది. అచటఁ గొన్నిపద్యములు ప్రబంధపద్ధతిని గాక నాటకపద్ధతిని రచింపఁబడినవి.

భీష్ముఁడు :- మేలా యీసంరంభము
హేలానంతర్జితావనీశ్వర ! నీకున్
జామ :- బాలమణిఁ గైకొనుమీ
భీష్ముఁడు :- వాలాయము సేయునాన భార్గవ ! చెపుమా.

ఈ రకపు సంభాషణము నావుడు, అనవుడు ఇత్యాది పద విరహితముగాఁ బ్రబంధములలో నున్నట్లు కానము. ప్రవరసేన మహాకవి ప్రాకృతమున రచించిన సేతుబంధమహాకావ్యము వీరు తెనుఁగున రచించిరి. ప్రాకృతమునఁ గూడ సీతారామాచార్యకవికి మంచిపాండిత్యమున్నది. సంస్కృతమున మహామహోపాధ్యాయులైనను ప్రాకృత మెఱుఁగనివారెందఱో కలరు. వీరట్లుగాక ప్రాకృతము గురుముఖమున నభ్యసించి యందు కృషిచేసి 'ప్రాకృతభాషోత్పత్తి' యనుగ్రంథము కూడ రచించిరి.

ఆచార్యులుగారు వ్రాసిన 'లౌకిక న్యాయవివరణము' ను ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు 1939 లో వెలువరించిరి. అందు 282 సంస్కృత లోకోక్తులు, న్యాయములు, ఆభాణకములు కలవు. ఇది విద్యార్థులకు ఉపాసకులకును బహునియమాగు గ్రంథము.

ఉభయభాషావిషయకగ్రంథములు ప్రబంధములు వ్రాసి పేరు గాంచిన సీతారామాచార్యులవారు విజయనగరము మహారాజాంగ్ల కళాశాలలో 1894 లో [illegible] సంస్కృతోపాధ్యాయులుగాఁ

ప్రవేశించి క్రమముగా నాంధ్రపండితపదవికూడ నలంకరించి పందలకొలఁది విద్యార్థులను బండితులనుగాఁజేసి యించుమించు నలువది వత్సరము లుద్యోగధర్మము నిర్వహించిన యాచార్యశేఖరులు.

ఈయన విజయనగర సంస్కృతకళాశాలలోఁ గావ్యనాటకాదులు చదివెను. తరువాత నాంగ్లకళాశాలలోఁ బ్రవేశించి 1884 లో 'మెట్రిక్యులేషన్' లోఁ దేఱెను. పిమ్మటఁ దండ్రిగారు మరణించుటచేఁ జదువు కట్టిపెట్టి యుద్యోగము చేయవలసివచ్చెను. కొన్నాళ్లు భాండాగారికుఁడుగాఁ బనిచేసి క్రమముగాఁ గళాశాలాపండితుఁ డయ్యెను. ఈలోపున నిరంతరసాహిత్య కృషిమాత్రము మానలేదు.

వీరు సామాన్యసంస్కృత కావ్యనాటక సాహిత్యమేగాక సంఖ్యాది శాస్త్రజ్ఞానము, ఉత్తమసాహిత్యపాండిత్యము విజయనగరసంస్థానాస్థాన విద్వాంసులై మహాప్రఖ్యాతి నందిన ముడుంబై వేంకటరామ నృసింహాచార్యస్వామివారి సన్నిధిని నేర్చిరి. మనపండితాచార్యులు ప్రస్థాన త్రయము నిరంతరము పఠించుచు వ్యాసంగముచేయు నలవాటు కలవారు. స్వీయమతమున నభినివేశము కలవారైనను బరమతములను దూలనాడువారు కారు. వీరి భగవద్భక్తి చాల గొప్పది. ప్రాచీనాచారములు విసమైనను వ్యతిక్రమించుట కీయన యిచ్చగింపరు. విశిష్టాద్వైతద్రావిడ వేదాంతగ్రంథములు వీరు చక్కఁగాఁ జదివిరి. అందు వీరి గురువులు మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులవారు. శ్రీ పురాణము సూర్యనారాయణశిష్టులు మున్నగు విద్వత్కవు లెందఱో వేంకట రమణాచార్యులవారి యంతేవాసులు. శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారికి వీరు గురుపాదులు. ఎంతశక్తికలవారైనను నీయమవినయవాదము, గురుభక్తి గొప్పవి. ఇదిచూడుఁడు:

ప్రతిభ లేదు పెద్దపాండిత్యమును లేదు
కల్లశాస్త్రవిధులజాడ సెఱుఁగ
—శ్రీ ముడుంబ నారసింహుని కృపయె నా
కన్ని గూర్చి కృతికి వన్నె దెచ్చు. [ దేవవ్రతచరిత్ర. ]

# గిడుగు వేంకట రామమూర్తి పంతులు

## 1863-1940

వీరిపూర్వులు తూర్పుగోదావరీమండలములోని 'ఇందుపల్లి' కిఁజెందిన వారు. వీరి తండ్రిగారికి విజయనగర సంస్థానములో నుద్యోగము లభింప నక్కడకు వచ్చిరి. తండ్రి: వీరరాజు. పంతులుగారి జన్మస్థానము: ఉత్తరవిశాఖ మండలములోని పర్వతాలపేట. నివాసము: పర్లాకిమిడి, రాజమహేంద్రవరము. జననము 12-8-1863. మరణము 22-1-1940. రచించిన గ్రంథములు: 1. వ్యాససంగ్రహము 2. వ్యాసావళి 3. బాలకవి శరణ్యము 4. ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజము 5. గద్య చింతామణి, మఱియు ననేకవ్యాసములు.

రామమూర్తిపంతులుగారిచేయి నాలుగుదశాబ్దులు వాఙ్మయములో వెలిగినది. ఆంధ్రసాహిత్యపరిషత్తు నారంభములో రామమూర్తిగారు సభ్యులు. క్రమముగ నవ్యసాహిత్యపరిషత్తునకు వీరు ప్రతిష్ఠాపకులైరి. పంతులుగారు వ్యావహారిక భాషాసాధనిర్మితికివిశ్వకర్మలు. వీరు పాశ్చాత్య వాఙ్మయమును దఱచి ప్రాచీనభాషాతత్త్వము గాలించి యాంధ్రసారస్వత రంగమునఁ బ్రవేశించిరి. స్వయంకృషిచేత బి. యే. పరీక్షలో రాజధానికి రెండవవాఁడుగాఁ గృతార్థుఁడైన మేధానిధి. సగము రక్తమాంసములు భాషావాఙ్మయచరిత్ర పరిశోధనములకుఁ, బురాతన వస్తుశాస్త్రపరిశీలనములకు వెచ్చించిన దీక్షితుఁడు. కళింగసామ్రాజ్యమునకు ముఖ్యపట్టనము ముఖలింగక్షేత్రమని బహుళాధారములు చూపి [illegible] ఆటవికులైన సవరలకు లిపి వ్యాకరణములు సృష్టించి పుణ్యము కట్టుకొనిన [illegible] భాషానుశాసకు లీయన. వీరి పరిశ్రమను ప్రశంసించుచుఁ బ్రభుత్వము "కైజరీహిందుస్వర్ణపతకము" నొసఁగి బహూక [illegible] 1897 మొదలు 1911

వఱకుఁ బంతులుగారు పర్లాకిమిడి రాజావారి కళాశాలలో రాజకీయార్థిక చరిత్రాధ్యాపకులుగ నున్నారు. ప్రత్యేకరాష్ట్ర విభజనవిషయములోఁ బర్లాకిమిడిని ఓఢ్రులు పొట్టఁబెట్టుకొనుట వీరి కసహ్యమైనది. పర్లాకిమిడి తెలుఁగునేలలోఁ గలియుదాఁక దిరిగిరానని ప్రతిజ్ఞచేసి రాజమహేంద్రవరమునఁ బ్రవేశించినారు.

గిడుగు రామమూర్తిపంతులుగారిపేరు స్మరించినతోడనే వ్యావహారిక వాదము స్మరణకు వచ్చును. మొట్టమొదట నీవాదము ప్రతిపాదించిన వారు విశాఖపట్టణనివాసులు పి. టి. శ్రీనివాసయ్యంగారు, గురుజాడ అప్పారావుగారు, గిడుగురామమూర్తిగారును. కన్యాశుల్కము వ్రాసిన గురుజాడవారి కలము గిడుగువారి నూతనవాదమునకు సహస్రముఖముల సహకారియైనది. విశ్వవిద్యాలయములో వ్యావహారికము ప్రవేశపెట్టవలె నని రామమూర్తిపంతులుగారు గట్టిపట్టు పట్టిరి. కాని కొంత కాలమువఱకు ప్రయోజనము కలుగలేదు. మొత్తము మీఁద నిప్పుడు విశ్వమంతయు వ్యాపించిన దనవచ్చును. "గిడుగురామమూర్తి నుడువు నిల్వకపోయె, నోగి జయంతి రామమూర్తి గెలిచె" నని యప్పట్ల వజ్ఝాది సుబ్బారాయఁడుగారు తమపక్షమునకుఁ గలిగినవిజయమున కానందించినారు. అప్పుడు వాదమునకుఁ బ్రచారము సన్నగిల్లినను వాదికి మాత్రము నిరుత్సాహము కలుగలేదు. నాఁటికిని నేఁటికిని నెంత మార్పువచ్చినదో చూడుఁడు. పరోక్షమున నెవరెల్లు తిట్టుకొనినను ప్రత్యక్షముగా రామమూర్తిపంతులుగారి వాదమును నిరసించుటకు వీలు కలుగనీయలేదు. ఈసందర్భమున నలఁగినలఁగియున్న గ్రాంథికవ్యావహారిక వివాదములఁ జేర్కొని సదసన్నిర్ణయ మొనరించుట యప్రస్తుతము. కాని వీరి వాద మెట్లుండునో తెలిసికొనవలయును.

కవి ప్రయోగము తప్పు అని మరి వాదించకూడదు. అది దుష్ట వాదము. అది వ్యాకరణమునకు విరుద్ధముగానున్నా ఆక్షేపించరాదు.

కవివాడిన శబ్దములు చూచి అవి లక్ష్యముగాచేసికొని లక్షణము చెప్ప వలసినవాఁడు లక్ష్యము తప్పనడమునకు అధికారము కలవాఁడుకాఁడు. లక్షణములో అనేకదోషము లుండవచ్చును. చెప్పవలసినదంతా చెప్పక పోవడము ఒకదోషము. చెప్పకూడనిది చెప్పడము ఒకటి ...

'బాలకవి శరణ్యపీఠిక.'

ప్రాచీనకవుల కావ్యములు శ్రద్ధగాఁజదివి కోశకారులు లాక్షణికులు తప్పులని త్రోసివైచిన యనేక ప్రయోగములు వానిలోనుండి యేరి యవి వ్యాకరించిరి. అదియే 'బాలకవిశరణ్యము,' నన్నయాదులకుఁగూడ గ్రామ్యము వాడక తప్పలేదని వీరు ఘంటాపథముగాఁ జెప్పిరి. నోటి మాటయుఁజేతివ్రాతయు నొకరీతిగా నుండవలెననియు, గ్రంథములలో నున్న నలక్షణభాష పరమప్రాచీనమై యుండుటకు సందుపాటులో లే దనియుఁగనుక నదిపీడి వ్యవహారభాషలో గ్రంథరచనకావింపవలెనని వీరి వాదసారము. ఈవాదము బాగుగ నున్నదని నేఁటి పత్రికారచయితలు, నవకవులు, ఆంగ్లవిద్యాధికులు నెందఱో యాదారిని బోవుచున్నారు. ప్రాచ్యభాషాపండితులలోఁగూడ నీపద్ధతి నంగీకరించినవారు కలరు.

పక్షపాతములు వీడి తటస్థులమై రామమూర్తిపంతులు గారినిగూర్చి ముచ్చటించుకొనినచో నాయన గొప్ప వాఙ్మయవేత్త. గొప్ప స్థిర సంక ల్పుఁడు. గొప్పవిమర్శకుఁడు. గొప్పప్రయోగవిజ్ఞుఁడు. అన్నిశక్తులను మించినది వీరిలో జ్ఞాపకశక్తి. భారతము పదునెనిమిది పర్వములును వీరి హృదయఫలకమున నున్నవి. 'నాయనా, సీతాపతీ! శాంతిపర్వము షష్ఠాశ్వాసములో 'వేఁదుఱు' అన్న ప్రయోగము ౧౭ వ పద్య ములోఁ గాబోలు ఉండవలెను. చూడు' మని యీవిధముగా నను మానించువారి పలువురు చెప్పకొందురు. ప్రాచీన ప్రబంధములలోనే కాక ఆధునిక కావ్యములందును "ఈప్రయోగ మిన్నిసారు లిక్కడవి ప్రయోగించె" నని చెప్పఁగలవారు.

దృఢనిశ్చయము, కార్యదీక్ష, స్వతంత్రోద్రేకము, అహోరాత్ర పరిశ్రమము-ఇవన్నియుఁగూడి 'రామమూర్తి' రూపముదాల్చినవి. ఈయన నవకవులను వెనుకనుంచుకొని గ్రాంథికపండితులమీఁది కురికి శంఖనాదము చేసినారు. రామమూర్తిపంతులుగారి బధిరము వారి వాదమునకుఁ బెద్ద సాహాయ్య మొనరించినది. పంతులుగారు గంటలకొలఁది గంగాప్రవాహమువలె భాషింపఁగల వాగ్మి. ప్రతిపక్షు లెంతగోలపెట్టుచున్నను వారికి వినఁబడదు. వారిధోరణి వారిదే. ఈయన తనకువచ్చిన యుత్తరములుగూడఁ గంఠస్థము చేసికొనెడివారు. ప్రత్యుత్తరముల నకళ్లుకూడ భద్రపఱచెడివారు. ఈయననుగూర్చి మిత్రులొకరిట్లు వ్రాసిరి. "ఇతనిపండ్ల పటపటయందు వాడియైనతర్క మున్నది. ఈతని తీక్ష్ణదృక్కులందు మిలుమిట్లు గొలుపు సారస్వత మున్నది. ఈతని బల్లెంపుటుత్తులయందు కోసైన మీమాంస యున్నది. ఈతని పిడికిలి యందు బలమైన యాత్మవిశ్వాస మున్నది."

రామమూర్తిపంతులుగారికిఁ గల తెలుఁగు బాస తెలివిడికి వారి 'ప్రాఁదెనుఁగుఁ గమ్మ' మేలిమచ్చు. ఈకమ్మ నలక్షణాంధ్రభాషపై కత్తిగట్టి పోరినది. అచ్చతెనుఁగు కావ్యములు వ్రాసిన మహాకవులకు సైతము నిట్టిధారయు, భాషాజ్ఞానము నలవడలేదని దీనిని చూచినఁ దెలియఁగలదు.

పంతులుగారు గురుజాడ అప్పారావుగారి సహపాఠముతో 'మెట్రిక్యులేషన్' పరీక్షఁ దేలిరి. అప్పటికంతతోఁ జదువుచాలించి యాఱు నెలలు 'కలక్టరుకచేరి' లో గుమస్తాపని చేసిరి. 1880 లో పర్లాకిమిడి పాఠశాలలోఁ బ్రవేశించిరి. అక్కడ పనిచేయుచునే ఎఫ్. ఏ. లో నెగ్గిరి. 1892 లో సవరభాషనుగూర్చి తెలిసికొనఁదలఁచి గొప్ప కృషి చేసిరి. ముఖలింగదేవాలయముమీఁది శిలాశాసనలిపి చదువఁదొడఁగిరి. సవరభాషలోఁగల పాటలు సేకరించుటకును, తద్భాషాతత్త్వ మెఱుఁగు

టకును పంతులుగారు ఒకయేఁడు వేసవిసెలవులలోఁ గొండలకు బయలు దేఱి పోయిరి. అక్కడ వీరిని చలిజ్వరము పట్టి పీడించినది. చలిజ్వరమునకు 'క్వైనిను' బ్రహ్మాస్త్రము. ఆ మందు సేవించుటచే పంతులుగారికి బధిర రము ముదిరినది. సవరభాషను సంపాదింపవలయును నన్న పట్టుదలతో నొక యింద్రియమువని చెడఁగొట్టుకొనిన పండితుఁ డీయన. ఆభాషలో వ్యాకరణము, నిఘంటువు వ్రాసిరి. దానిలోనిపాటలు సేకరించిరి. 'తేడు' అను సవరవానిని నింటఁ బెట్టుకొని వీరు పాటలు వ్రాసికొనిరఁట. సవర లకు బడులు పెట్టించిరి. కొంద ఱాంగ్లేయులకు సవరభాష నేర్పించిరి. శబరభాషావాగనుశాసకుఁడగు రామమూర్తిగారు మనకుఁ జిరస్మర ణీయుఁడు. 1913 లో వీరిని ప్రభుత్వమువారు రావుసాహేబు అని సన్మానించిరి. వీరు భాషా సంస్కారవాదులే కాక వితంతూ ద్వాహము, హరిజనోద్ధరణము కోరిన సంఘసంస్కార ప్రియులు కూడను. కన్నేపల్లి వేంకటనరసింహముపంతులుగా రనఁబడు వీరి శిష్య్యు లొకరు ఇంగ్లండులో 'బారిష్టరు' చదువు చదువుకొని వచ్చిరి. వారిని పిలిచి రామమూర్తిగారు తమయింట విందుచేసిరి. అది సనాతను లిష్టపడక వీరిని నాఁడు వెలివెట్టిరి. పజ్రచిత్తున కిటువంటి వెలియొకలెక్కా? పర్లా కిమడి ఒరిస్సారాష్ట్రములో నన్యాయముగఁ గలిపివేయుటను సహింప లేక, రాజాగ్రహమును దిగదుడిచి రాజమహేంద్రవరము వచ్చి కూర్చుం డిన యేకైకవీరుఁడు రామమూర్తిపంతులుగారు. "భారతీశతకము", మఱికొన్ని గ్రంథ పీఠికలు, బహువ్యాసములు వ్రాసి పేరుపడయు శ్రీ సీతాపతి రావుగారు రామమూర్తిపంతులుగారి సత్సంతతి.

# కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి

## 1863-1940

తెలగాణ్యబ్రాహ్మణులు. గౌతమసగోత్రులు. అపస్తంబసూత్రులు. తండ్రి: బ్రహ్మావధాని. తల్లి: సుబ్బమ్మ. జననము 2-4-1863. నిధనము 29-10-1940. అభిజనము: తూర్పుగోదావరీ మండలములోని పలివెల గ్రామము. మనుగడ: కాకినాడలో. రచనలు: సంస్కారవిషయకముగా వీరువ్రాసినవ్యాసములు 24. అధ్యాత్మవిషయకవ్యాసములు 17. మతధర్మవిషయకవ్యాసములు 43. సాహిత్యవిషయక వ్యాసములు 60. కవిత్వవిషయక వ్యాసములు 16. ప్రకృతిశాస్త్రవిషయకవ్యాసములు 11. నన్నయ్యభట్టారక చరిత్రము, కురుపాండవ దాయభాగనిర్ణయము, మంగళాయి, సైంధవవధ (నాటకము) ఉపన్యాసపయోనిధి (1 సంపుటము) తారకతారావళి, పర్వతసందర్శనము, మనుమసుప్రకాశిక, పెద్దాపురసంస్థానచరిత్రము, ప్రాయశ్చిత్తపశునిర్ణయము, భాస్కరోదంతము మున్నగునవి ప్రత్యేకగ్రంథములు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-భారతి-శారద-ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలు-ముద్దుల మూట-ఉదయలక్ష్మి-సుజాత. ఈపత్రికలలో వీరిరచనలుగలవు.

"అల్పదోషమైనా కావ్యమందు సహించక విమర్శ చేసేటప్పుడు యమునికన్న ఎక్కువనిర్ఘృణుఁడని పేరుపొందిన పండితుఁ" లని బ్రహ్మయ్యశాస్త్రిగారిని గిడుగు రామమూర్తిపంతులుగారు ప్రశంసించిరి. వాస్తవముగా నీయన యంతటివాఁడే. హరిబ్రహ్మాదులు అడ్డుపడినను విమర్శచేయుటలో నీయనకు జంకులేదు. సముద్రపుటుప్పునకు నడవియుసిరికకుఁ గలిగినసంబంధము వలె "కాకినాడ ట్రెజరీ డిప్యూటీకచేరీ గుమాస్తా" పనికి శాస్త్రిగారి యపూర్వ సారస్వత విషయవిమర్శనమునకుఁ జిక్కని బాంధవము కుదిరినది. "అన్యథా చింతితం కార్యం దైవ మన్యత్ర" అనునట్లు భగవంతుఁడీ విమర్శకాగ్రేసరుని 'గుమాస్తా' పని చేసికొనుమని యాదేశించినాఁడు. శరీర మొకచోట — మనస్సు

మఱొకచోటఁ బనిచేయుట చాలచోట్ల నున్న దేగాని క్రొత్తదికాదు. జయంతి రామయ్య పంతులుగారికి యావజ్జీవము న్యాయవాదిగా నుండవలయునని సంకల్ప ముండెడిదఁట. అట్టియదృష్ట మాయనకుఁ బట్టనే లేదు. ఇంతకును జెప్పవలసిన దేమనః- బ్రహ్మయ్యశాస్త్రిగారు లేఖకవృత్తిలో నుండికూడ జగద్విఖ్యాతమైన విమర్శనము లొనరించి 'విమర్శకాగ్రేసరుఁ' డనిపించుకొనుట బహుధా శ్లాఘనీయము.

శాస్త్రిగారు 'మెట్రిక్యులేషన్' పరీక్షలో నుత్తీర్ణులై ఎఫ్. ఏ. పరీక్షకుఁ జదువుచుఁ గారణాంతరములచేఁ జదువువిరమించి యుద్యోగ బంధములోఁ బడవలసినవారైరి. అది యొకందులకు మేలైనది. కళాశాల చదువు కట్టిపెట్టిన తరువాతఁ గొముది కట్టుదిట్టముగఁ జదివి, సంస్కృతాంధ్రములలోఁ దలస్పర్శి యగు పాండిత్యము సంపాదించిరి. "రత్నత్యాహారమండన ముండన" మాకాలమున వ్రాసినదే. వీరు భాషాత్రయములో సమానము ససమానమునగు పాండిత్యము గడించి పండితు లనిపించుకొనినారు. ఈయనకు సాదృశ్య భాషాశాస్త్రముపై (Philology) మక్కువ హెచ్చు. ఆ సాదృశ్య పరిశీలనము భాషయందే గాక మతములయందుఁగూడఁ బ్రవేశపెట్టిరి. హిందూమతతత్త్వము లోఁతుముట్టఁబరికించిరి. వీరేశలింగంపంతులుగారికి వీరికినిఁ జాలకాలము హోరాహోరి యుద్ధము జరిగినదని తెలుఁగువారెఱిఁగినదే. నాఁటి బ్రహ్మయ్యశాస్త్రిగారి వాగ్వజ్రప్రయోగమును బండితు లెఱిఁగినదే. విమర్శలో నింత నిర్దాక్షిణ్యుఁడు లేఁడనికదా గిడుగువారు చెప్పిరి.

బ్రహ్మయ్యశాస్త్రిగారెంతనునిశితవిమర్శకుఁడో యంత కర్మవీరుఁడు. పెక్కుపత్రికలకు వ్యాసములు వ్రాయుచు, నుపన్యాసము లిచ్చుచు, సంస్థల స్థాపించుచు ధార్మికవైజ్ఞానికవిషయప్రబోధముచేసిన పుణ్యచరిత్రులు వీరు. చిన్ననాఁటనే నాటకకళాభిరుచికలిగి "ఆర్యబృందానంద సంధాయక" యను [illegible] రచన చెప్పుదురు. అందు వీరి

చేత నే వ్రాయఁబడిన "త్రిపురాసురవిజయవ్యాయోగము" వీరేశలింగము పంతులుగారి "శాకుంతలము" మున్నగునవి ప్రదర్శింపఁబడెనఁట. భగవద్భక్తినిగూర్చి ప్రజాసామాన్యమునకుఁ బ్రబోధము చేయఁదలఁచి 1880 లో 'భక్తసమాజము' పేరితో నొకసంస్థ నెలకొల్పి, దాని పక్షమునఁ బ్రతిగ్రామమునకుఁ బర్యటనము గావించుచు నుపన్యాసము లిచ్చుచుండెడివారఁట. 1888 'ఆర్యమత బోధిని' యను మఱొక సమాజము నిలిపి 'వివేకానంద పుస్తక భాండాగారము' వెలయఁజేసిరి. ఈరీతిగా హిందూమత ప్రచారమునకు యావచ్ఛక్తి వినియోగించి సత్ప్రచారము చేసిన సత్పురుషుఁడీయన. 'ఆర్యమతబోధిని' మాసపత్రిక 1905 లో వీరి సంపాదకత్వమున వెలువడుట మొదలయినది. ఈపత్రిక వలన బ్రహ్మయ్యశాస్త్రిగారి పేరు నలుమూలల వ్యాపించినది. సంఘ సంస్కర్తల యుద్దేశములు సన్నగిల్లఁజొచ్చినవి. వీరేశలింగముగారి సంఘసంస్కరణ మహోద్యమమునకు వ్యాప్తి తగ్గినది. ఆసమయమున నే పంతులుగారు 'సత్యవాదని' యనుపత్రికను స్థాపించుచు నిట్లు వ్రాసినారు. 'వెయ్యిగా వెయ్యిగా వెఱ్ఱివాఁడే గెలిచె నన్న ట్లీయనవ్రాఁతలు జనుల భ్రమపెట్టి నేను పూనినమహాకార్యమునకుఁగూడ విఘాతము కలిగించుచున్నందున....'

ఆనాఁడు 'ఆర్యమతబోధిని' చదువని యాంధ్రుఁ డుండియుండఁడు. ఆ పత్రిక యావిధముగాఁ బదునైదేండ్లు నడచి యమూల్యముగ సంఘ సేవ యొనరించినది. హిందూమతమును గూర్చి యెవరు నిరసనవ్యాసము వ్రాసినను బ్రహ్మయ్య శాస్త్రిగారే ప్రత్యుత్తరము విమర్శకులు నిరుత్తరులగునట్లు వ్రాసెడివారు. శ్రీ శాస్త్రిగారు మతమునే కాక సారస్వతమును గూడ నడుము కట్టి సేవించిరి.

మంత్రిభాస్కరుని గూర్చి 'కవులచరిత్ర' లో వ్రాసిన విషయములు సరిగా లేవని 'భాస్కరోదంతము' ప్రత్యేకముగా వ్రాసి వెలువరించిరి. వీరు రచించిన 'పన్నయ్యభట్టారక చరిత్రము' లో పనేకసిద్ధాంతములు

భాషాప్రపంచమునఁ జిరస్థాయులై నిలువఁగలిగినవి. 'కాగడా' శబ్దమును గుఱించి వీరు కూర్చిన చిన్నపొత్తము సరసిన వీరికిఁగల భాషాశాస్త్ర విషయ పరిజ్ఞానము విశదముకాఁగలదు.

ఈయన పద్యకవిత్వము కూడఁ జక్కనిశైలిలో వ్రాయఁగలరు. మంగతాయి నాటకమునుండి పద్యములు కొన్ని యెన్నికొందము.

గీ. వేశ్య కావిమోవి వెలయిచ్చువారెల్ల
వంటఁ బట్టి పీల్చు భంగిగాన
యేకపాత్రమునను యెంగిలి నాకరే
కాఫి త్రాగుచుంద్రు కలసి జనులు.

ఆ. వె. పణ్యభామినిచేఁబడ్డ పుణ్యశాలి
పుడమి గాఁభీర్యహీనుఁడై చెడకయున్న
జలజలత యంటినంతన సరసు లోగిని
నమిత గాంభీర్యహీనత నందినట్లు.

గీ. ఆటవెలఁదుల యిండ్లును నమ్మువారి
గుడులు గాలిగోపురములుఁ గోవెలలును
దోఁటలు పురమందిరములు పూఁటకూటి
యిండ్లు జూదంబునకుఁ దగు నిక్కులరయు.

వేశ్యలందు కలుగు మోజు । వేడ్క సేయు నా డిసీజు
పొందువలనఁ బుట్టు పుండు । మందు వేయుమానకుండు
దేహమెల్ల నాను పుల్ల । గేహమెల్ల నాను గుల్ల
కీర్తి యంత మాసిపోవు । నార్తి హెచ్చ వచ్చుఁ జావు
ఏమిలాభమనుచు నీవు । భూమి గణిక పొందుకావు
వలదువలదు వలదునూ । దానిఁ గూడఁ జనదు నూ॥

భారత[illegible]వగీతములు, గడ్డెరక, కోకిలగీతములు, గోమహిషసంవాదము, నా[illegible]బుధలోక సందర్శనము, మొదలగు ఖండకృతులు గనిన వీరి పద్య కవి[illegible] [illegible]. 'విబుధలోక సందర్శనము' ను గూర్చి యొ[illegible]విచిత్రగాగ[illegible]

1930 సం॥ సెప్టెంబరు నెలలో కాశీభట్ట లింగమూర్తి యను నాయన రాజమహేంద్రవరమున మరణించెను. హిందూపత్రికా లేఖకుఁడు పొరపాటున బ్రహ్మయ్యశాస్త్రిగారు చనిపోయినట్లు 'హిందూపత్రిక'కు లేఖ వ్రాసిపంపెను. 'హిందూ' పత్రికను జూచి 'ఆంధ్రపత్రిక' యు నావార్త వెలువరించినది. దానినిబట్టి నాలుగైదునాళ్లలో నీ కానివార్త నలుమూలల వ్యాపించినది. సంపాదకీయవ్యాసములు, సానుభూతిసభలు, సాంత్వనలేఖలు బయలుదేరినవి. బ్రహ్మయ్యశాస్త్రిగారు హాయిగాఁ గాకినాడలో గ్రంథరచనము చేసుకొనుచు నేయున్నారు. ఈక్షేమము మరల ఆంధ్రపత్రికకుఁ బంపఁబడినది. పత్రికాసంపాదకులు తామసత్య వార్తను విశ్వసించి యటులు వ్రాసినందులకు వగచుచు బ్రహ్మయ్య శాస్త్రులుగారు పూర్ణారోగ్యవంతులుగా నుండుటకుఁ బరమానందము ప్రకటించిరి. ఈ చమత్కారవిషయమును శాస్త్రిగారు 'నా విబుధలోక సందర్శన' మనుకావ్యమున వ్రాసి తమ మధురకవితాధారను తెలుఁగు వారికిఁ జూఱలిచ్చిరి.

తునిసంస్థానాధీశ్వరు లీవిమర్శకాగ్రేసరునిచే రెండువత్సరము లుద్యోగమునకు సెలవుపెట్టించి 'పెద్దాపుర సంస్థానచరిత్ర' వ్రాయించిరి. వీరి చారిత్రకపరిశోధన కది యాదర్శము. మాధవవిద్యారణ్యులు, శిష్టు కృష్ణమూర్తికవి, నారాయణభట్టు, నాచన సోముఁడు మున్నగువారి ప్రత్యేక జీవితములు వ్రాసిన చరిత్రజ్ఞుఁ డీయన. వీరి వక్తృత్వ మనన్య సామాన్యము. ఉపన్యాసము నడుమ నెవరైనఁ బ్రతిపక్షులు వికట ప్రశ్నలు వేయుఁగా వీరు సద్యస్స్ఫురణము కలిగి చక్కని సమాధానము చెప్పి మఱి మాటాడ నిచ్చెడివారుకారు. మాట మధురము. భావము తీవ్రము. దీనికి బ్రహ్మయ్యశాస్త్రిగారు పెట్టినది పేరు.

ఇట్టి మహాశయునియెడ విమర్శకాగ్రేసరుఁడని, మహోపాధ్యాయుఁడని, ఉపన్యాస పంచాననుఁడని, ఆర్య మతోద్ధారకుఁ డని బిరుదము లన్వర్థములు కాకుండు టెట్లు!

---

# వావిలికొలను సుబ్బారాయకవి

# 1863-1939

భారద్వాజగోత్రజాలు. ఆపస్తంబసూత్రులు. గోల్కొండవ్యాపారి. తల్లి: కనకాంబ. తండ్రి: రామచంద్రుఁడు. అభిజనము: కడప పోరుమామిళ్ళ(?)పేట. జననము: 1863. నిర్యాణము: 1939. విరచితకృతులు: శకుంతలచరిత్ర, సులభ వ్యాకరణము, సతీహితచర్య, ఆర్యకథానిధి (ఆఱు భాగములు), నలచరిత్ర, గర్భిణి, హరిశ్చంద్రచరిత్ర, ఆంధ్ర వాల్మీకిరామాయణము, కుమారహిత చర్య, కుమారాభ్యుదయము, కృష్ణలీలామృతము, కౌసల్యాపరిణయము, ఏకశిలానగరద్వయవివాదసంగ్రహము, హనుమంతచరిత్రము, భవతారక లీల, బాలకహితచర్య, భగవద్గీత, కృష్ణావతారతత్త్వము – మున్నగునవి.

శ్రీ సుబ్బారావుగారు పండితకవులుగాఁ బేరుసంపాదించిరి. భక్తాగ్రేసరులుగాఁ గీర్తిగాంచిరి. లోకమునఁ గొందఱకుఁ బాండిత్యకవిత్వములు పురాకృత విశేషమువలనఁ గలిగి యుండవచ్చును. అట్టివారాపాండిత్య కవిత్వ ప్రకర్షమును దేశమున వెల్లడించుటకు రామాయణము రచింపవచ్చును. భాగవతము వ్రాయవచ్చును. అంతమాత్రమున నట్టికవులకు దైవభక్తి దైవ విశ్వాసము సంపూర్ణముగ నుండు ననుట పొసఁగదు. అట్లుగాక, మన సుబ్బారావుగారి దైవభక్తి యవ్యాజసిద్ధమైనది. దైవభక్తియే వీరికిఁ గవిత్వలక్షణము చెప్పినది. దైవభక్తియే యీయనను బాండిత్యవంతు నొనరించినది. భాగవతరచయిత పోతనామాత్యుఁడే యిందులకుఁ బ్రథమోదాహరణము. వీరిని మొదట భాగవతులని, పిదపఁ బండితులని, చివరఁ గవులని చెప్పుట క్రమానుగుణము. సుబ్బారావుగారిఁ [illegible] బోతన్నపైఁ బెద్దయభిమాన మున్నది. నరకృతుల నీయక పోవుటలోను భగవద్భక్తి పారవశ్యములోను వీరిద్వరు సహపాఠులు. [illegible] వీరికి పెద్దయుంకర మున్నది. భాస్కర రామాయణమునకు [illegible] నుకను ముందుసుగాఁడ వెలుఁగులో నున్న

రామా యణములు వెలువడినవి. కాని తెలుఁగుభాగవత మొక్కపోతనా మాత్యరచనమే. ద్విపద భాగవత మెుం డున్న దనినను నది ప్రచారములో లేదు. ఆధునికులలో నైదాఱుగురు యథావాల్మీకిరామాయణములు రచించినవారును, రచించుచున్నవారును, రచింపఁదలంపు గలవారును గలరు. భాగవతము దరి కెవ్వరును బోఁజూచుటలేదు. ఇది పోతనమహా కవిలోని విశేష మేమో ? ఆ కవివరునిపై మన సుబ్బారావుగారెట్టి యభిప్రాయము ప్రకటించిరో చూడుఁడు!

తుచ్ఛులు పరిగా దసినను
స్వచ్ఛపుఁ బోతనకవిత్వసంపద చెడునే
నేచ్ఛ జఱచి దూషించిన
నచ్ఛపతివ్రతను బాప మంటుట యున్నే ?

(శ్రీరామాయణ పీఠిక.)

వా. సు. దాసుగారి చేతిలోఁ జాలమంది విషయరక్తులు పరమ భక్తులైరి. వీరు 'భక్తసంజీవని' యను మాసపత్త్రిక కొన్ని వత్సరములు వెలువరించిరి. దైవ, భాషాసేవ లొకదాని నొకటి మించునట్లు గావించి ధన్యులైన సుబ్బారాయకవిగారు వాల్మీకి రామాయణము యథా మాతృకముగా నాంధ్రీకరించిరి. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగా రొక రిట్లువ్రాసిరి. వా. సు. దాసుగారి రామాయణకవితలోఁ బ్రౌఢ తకు లోపములేదు. వీరు రామాయణము నిర్విఘ్నముగా రచించి తరించిరి.

సీ. కనులకుఁ గలఁకయు గరళంబు మదికిన్నై
తపి బెంపఁ జేయు విత్తమ్ము లేదు
కాళ్లు బందా లురిత్రాళ్లు కుత్తుకకునౌ
బిడ్డల జంజాట మడ్డు లేదు
మంచి సెక్కెర లెద స్ఫురియింపనీయని
యంతటి భోగంబు లమరలేదు

ఈపూఁట హరిహరీ! యేపాటఁ గడచునఁట
దారిద్ర్యభీతి యింతయును లేదు
రాముఁ దలఁపఁజేయు నామయం బుండఁగ
సౌఖ్య మరయుపొంటె జాయ యుండ
నింతవలను గలుగ నిప్పుడ శ్రీరాముఁ
దలఁపకున్న నెపుడు దలఁచువాఁడ.

(శ్రీరామాయణ శతక.)

రామాయణ రచనమున వీరి యుద్దేశమిది. వీరు యావజ్జీవమును గోదండ రామస్వామికే ధారవోసిన భక్తులు. ఆ యాలయము పునరుద్ధరించుటకు వీరు తెనుఁగు నాఁడు పర్యటించి పెక్కువేల ధనము సంపాదించి భగవదర్పితము గావించిరి.

పాపము! సుబ్బారావుగారికిఁ జిన్ననాఁటనే పితృవియోగము సంభవించినది. పినతండ్రి లక్ష్మణరావుగారి పెంపకమున విద్యాబుద్ధులఁ గఱచి పెద్ద చదువు చదివిరి. పదునొకండు సంవత్సరములు కడపమండలమున రెవెన్యూ ఇనస్పెక్టరుగాఁ బనిచేసి, చెన్నపురి సర్వకళాశాలలోఁ బ్రధానాంధ్రపండిత పదవి నలంకరించిరి. పుష్కలముగా ధన మార్జించిరి. చేతులార నర్థులకిచ్చుకొనిరి. ఒక ఆంధ్రవాల్మీకి రామాయణమేగాక వీరివి పేరు తెచ్చుకొన్న కబ్బములు కుమారాభ్యుదయము, కౌసల్యాపరిణయము, సుభద్రావిజయము మున్నగునవి కొన్ని యున్నవి. వీరి సులభవ్యాకరణము వజ్ఝల చినసీతారామశాస్త్రి ప్రభృతులు మెచ్చుకొనిరి. ఈయన రచనకృతు లనేకము పాఠ్యములుగా నున్నవి.

కడపకును నందలూరునకును నడుమనున్న పల్లెటూరు ఒంటిమిట్ట. కోదండ రామస్వామి యాలయ మచటనే యున్నది. ఈరామస్వామికే పోతన భాగవత మంకితము. ఈరామస్వామికే వా. సు. దాసు రామాయణ మంకితము. ఇరువురును చరితార్థులు.

# నాదెళ్ల పురుషోత్తమ కవి

## 1863-1938

హారితసగోత్రుఁడు. తల్లి. సుబ్బమాంబ: తండ్రి. కామయార్యుఁడు. జన్మస్థానము కృష్ణాతీరస్థమగు సీతారామపురాగ్రహారము. జననము: 1863 సం॥ ఏప్రిలు 23 గురువారము. నిర్యాణము 27-11-1938 సం॥ బహుధాన్యమార్గశీర్ష శుద్ధ పంచమి-ఆదిత్యవారము. గ్రంథములు: ఆంధ్ర ప్రబంధములు: ౧. అద్భుతోత్తర రామాయణము. ౨. గురుభక్తిప్రభావము ౩. కృష్ణానదీమాహాత్మ్యము ౪. యాదవాద్రిశోభాఖ్యానము. ౫. మాహేంద్ర పురాణము ౬. యామినీవినోదము ౭. బభ్రువాహనచరిత్ర ౮. రంగదాసీయము ౯. చతుర్ముఖ కందపద్యరామాయణము. ఆంధ్ర నాటకములు: ౧. అహల్యాసంక్రందననాటకము ౨. హరిశ్చంద్రనాటకము ౩. పారిజాతాపహరణము ౪. సారంగధరనాటకము. ఇత్యాదులు. శతకములు: ౧ సీతారామశతకము ౨. పూర్వకర్మశతకము ౩. మల్లికార్జునశతకము మున్నగునవి, మఱియు. స్తోత్రకృతులు, అభివర్ణనములు, కీర్తనలు, నిఘంటువులు, శాస్త్రగ్రంథములు, హిందీనాటకములు మొత్తము 112 గ్రంథములు గలవు. వీరి విశేషవిషయములు తెలియుటకు శ్రీ నాదెళ్ళ సుధాదక్షిణామూర్తి శాస్త్రిగారు సంధానించిన "ఉత్తమ యోగివృత్తము" అను కూర్పు పఠింపఁదగియును.

కవిత్వ మొకకళ. కళకును శాస్త్రమునకును నెంతో యంతరము. తొలినాఁడు శాస్త్రకారునకుఁ జూపిన గౌరవప్రపత్తులు, కళాకారునకుఁ జూపలేదనుట వాస్తవము. నటవిటగాయకుల గణములోనే కవుల పరిగణనము. నేఁడు తలక్రిందులై కళాజీవులు గద్దెలెక్కి కొండాడఁబడుచుండుటయు, శాస్త్రజీవులు అజ్ఞాతులై మూలలనుండుటయు జరుగుచున్నది. దీనిలోని రహస్యము, కళ వలన బ్రతుకువానికెడ నాముష్మిక దృష్టి లోపించి యుండుటవల్ల నేమోయని తోఁచును. కళగాని, శాస్త్రముగాని తాత్త్విక సరణికిఁ గొనిపోవలయును. అపుడు, ఆ కళాకారుఁడు, ఆ శాస్త్రకారుఁడు నొక శ్రేణిలోఁ గూర్చుండుటకర్హులగుదురు.

కవికి "సంధ్యావందనము బాపగారు" అని తిరుపతికవులు కాబోలు చెప్పినారు. ఇది ఇటులు సార్వత్రికమనుటకు వీలు లేకుండ మహానిష్ఠా గరిష్ఠులగు పురుషోత్తములు కొందఱు కవిలోకమున నుందురు. అట్టి వారిలో నాదెళ్ళ పురుషోత్తమకవిగారొకరు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు వీరిని గూర్చి వ్రాసిన యీపద్యములు సరిగా దూచిన ట్లున్నవి.

అతిశాంతుం, డతిదాంతుఁడు
కృతకృత్యుఁడు, సుకవి, యెన్ని యేని విషయముల్
మతి నెఱిఁగినవిద్వాంసుఁడు,
స్తుతియింపందగిన పూరుషుఁడు సుకవులకున్.

ఒకనికి లోఁగని శాంతియు
సకలమ్ము నతిక్రమించు చండత, కమున్
దికకర్మ నిష్ఠయుఁ బరో
పకృతియుఁ బురుషోత్తమునిస్వభావగుణమ్ముల్.

పురుషోత్తమకవి తొలుత రేపల్లె లోయరు సెకండరీస్కూలులో నుపాధ్యాయుఁడు. ఆపదవిలో నుండఁగానే జ్యోతిశ్శాస్త్రము, ధర్మశాస్త్రము మున్నగువానియందు పాండిత్యము సంగ్రహించెను. 1884 నుండి, బందరు వీరిని హిందీనాటక రచనకుఁ బ్రోత్సహించుచు వచ్చినది. అది వీరి జీవిత కార్యక్షేత్రమగుఁగు. "నేషనల్ థియేట్రికల్ సొసైటీ" అనుపేర బందరున నొకనాటక సమాజము వెలసినది. వారికి హిందీనాటకము లనువదింపఁజేసి ప్రదర్శింపవలయునని ప్రోత్సాహకమగు తలంపు కలిగినది. సమాజమువారి కోరిక ననుసరించి పురుషోత్తమకవి తొమ్మిది హిందీనాటకములు రచించెను. అవి చాల సుందరబంధములై పేరుగాంచినవి. మొత్తముగా వీరు రచించిన హిందీనాటకములసంఖ్య ముప్పది రెండు. ఈ హిందీనాటకరచన వెల్లిన 1897 వఱకు సాగి యాగినది.

పురుషోత్తమకవి యిప్పుడు తెల్గుఁగువాఁడై, "బుధవిధేయిని" యను పత్రిక సంపాదించుట కారంభించెను. ఆయన తెలుఁగు పత్రికా సంపాదకుఁడైనను భారతీయుఁడు. తన పత్రికలో "నేషనల్ కాంగ్రెసు" ను గూర్చి ప్రచార వ్యాసములు వ్రాసి ప్రకటించెను. కాంగ్రెసుపై ఉరుదు భాషలో మహమ్మదీయుల కుపన్యసించి చెప్పిన ప్రబోధకులు పురుషోత్తమ కవిగారు. కవికి జాతీయభావములు నిండార నుండవలయునుగదా !

పదపడి, వీరు 1887 మొదలు 1908 దాఁక హిందూబ్రాంచి స్కూలు హెడ్మాష్టరుగా శిష్యులను దిద్దెను. ఈయుద్యోగము లన్నియుఁ బురుషోత్తమున కార్థికములు. హార్దికముగా వీరునిర్వహించుచున్నది సారస్వతోద్యోగము. వీరు హెచ్చుగా బంధగర్భ కవిత్వాభిమానులు. చతుర్ముఖి కందపద్య రామాయణము, చిత్రకంద పద్యరత్నాకరము, మల్లికార్జున మకుటాంచ త్ర్యంధగీత గర్భితోత్పల చంపక మాలాష్టోత్తర శతకము ఇత్యాద్యులందుల కుదాహరణములు. చతుర్విధ కవితా ధురంధరులని వీరికిఁ గల బిరుదము. పురుషోత్తమకవి శతక కవితా ధోరణి యీరీతు గలయది:

చ. ఒగి నగుమోముతో ముదమునొందఁగఁ జేయును ముద్దుపాప తా
వగనగ నెట్టులేఁ గనెడువారి నడంబడుఁ గంటిపాప చూ
డఁగ దిగువ న్వడి న్నిలుకడం బగ కాదును నీటిపాప తాఁ
బగలెగురుంగదా మదిని బాఁపఁగఁ జేయకు మల్లికేశ్వరా !

క. నగు మోముతో ముదము నొం
దగఁ జేయును ముద్దుపాప-తా వగ నగనే
దిగువ న్వడి న్నిలుకడం
బగ కాదును నీటిపాప తాఁబగ లెగురన్.

గీ. ముదము నొందఁగఁ జేయును ముద్దుపాప
కనెడు వారి నడంబడుఁ గంటిపాప

నిలుకడం దగ కాదును నీటిపాప
మదిని బాపంగఁ జేయకు మల్లినాథ!

ఈపద్యములు మల్లికార్జున శతకములోనివి. చంపకమాలిక కడుపులో కంద - గీతములు రెండును నిమిడియున్నవి. జాగరూకతతో నీ మూఁడుపద్యములు చూచినచోఁ గవిగా రెంత పరిశ్రమించిరో వెల్లడి కాఁగలదు. సాధారణముగా బంధకవితలు రచన రామణీయకము గొఱవడి యుండును. పురుషోత్తమకవిగారి శైలిమాత్రము మధురధారకలది- బంధకవిత్వములో నీయన యందెవేసినవా రనుట కన్నో కృతులు సాక్షాణ లున్నవి. అది యటుండె; వీరి యద్భుతోత్తరరామాయణము నందలి వివిధవర్ణనాంశములు గల పద్యములు కొన్ని :

క. అసలధి వసంత మారుడను
బనరంగు సరింప విడిచెఁ బడఁ జల్లిన యు
ట్ల సదా యులరారుఁగదా
మిసమిస సదృశము లయ్యె మేదినిఁ దరువుల్.

క. వట ఫలము చుబుక మనునవు
నటు పటు దంతములు దాడిమాంచిత బీజో
త్కటముల్లు మౌక్తికకుంద
స్ఫుటముల్లు స్త్రీణిఁబోల్పఁ బొలుపగువళులన్.

క. మదగజముల గేరెడినో
కుదిరిక యంచరులకుఁ గూర్పఁగోరెడి నోయీ
పదముల యొదుగుడు గమనిక
కుదిరెడి నే నాగకవులకు స్వర్ణింపన్.

ఈవంవిధముగా మనోహరరీతిని చతుర్విధకవితలు సంతరించిన సుకవి పురుషోత్తమునిం కుమారరత్నము నాయిశ్య మేధా దక్షిణామూర్తి శాస్త్రి గారు తెలుఁగు రచయితల కెక్కఁగినవారు.

# శృంగారకవి సర్వారాయ కవి

## 1864-1939

ఆఱువేలనియోగి శాఖీయుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. తల్లి: రామాంబ. తండ్రి పల్లమరాజు. జన్మస్థానము: గోదావరీమండలములోని ఇంజరగ్రామము. జననము ; 1864 సం. రక్తాక్షి సంవత్సర ఆషాఢబహుళ చతుర్థి గురువారము. నిర్యాణము: 1939 మార్చి 13 వతేదీ–బహుధాన్య వత్సర ఫాల్గున బహుళాష్టమీ సోమవాసరము.

: స్వగ్రంథ సీసమాలిక :

పరికింపు లక్షణాపరిణయంబును, శివానందలహరి, మహిమ్నస్తవంబు,
మల్లేశశతకము, మతి ముకుందశతంబు, నీతిదర్పణము, స్త్రీనీతిదర్ప
ణము, సుభద్రా పరిణయము, దేవీ దండకము, నిందుముఖి వివాహమును, రామ
జననము, నవతార-చరితము, గీతతారావళియును, బదరత్నమాల,
యాంధ్ర పదకోశ(?)ంబు, వ్యాకృతి రాజంబు, నీతికథాళి, సునీతి-చంపు
జనరలు తెలుఁగు, ప్రసంగ రత్నావళి, ప్రశ్నోత్తర ప్రదీపమును, స్తుతిక
దంబము, చాటుముక్తాళి, విదుల, బాలదీపికయు, వివేకదీపికయును,
సామెతలు, స్వప్నవిజయము, ఛందోలక్షణంబు, నాటకలక్షణంబు, శబ్ద
లక్షణము, కావ్యలక్షణము, గుణప్రకాశిక, దివ్యభాగవత గీత,
రూపకమాల, కఠోపనిషత్తు (?) పురాణమణిమంజరి, గురుకుమారచరిత,
సీమరాణి, నివిక్సు, శ్రీ వేంకటేశ్వర శతకమ్ము, మానసశతకము, హరి
సేవాకలాపంబు, దైవస్తుతి, వినోదవల్లి, ప్రబంధ నిబంధనంబు,
కవి జీవిత త్రయి, కావ్యవిశిష్టంబు, సంఖ్యాప్రదీప, మీశ్వరశతంబు
పర్యనిర్వచనంబు, బంధనిబంధంబు, లలితసారస్వత లక్షణంబు,
చంద్రిక, బాలవాచకము, స్వచరిత భారతప్రయోగములు, పురాణకథలు,
ప్రహసనమాల, యుపన్యాసవితతి, వినాయకాళి విలాస నాటకంబు
సూక్తి ముక్తావళి, షోడశ రాజచరిత్ర, ప్రతాపరుద్రీయము, సుగు

ణ ప్రకాశిక, సూక్తి, కర్ణచరితంబు
ప్రమత కాత్యాయన పరిణయ, మనామ
యు, మను డెబ్బది యొకకృతులను రచించి
శాస్త్రిమాన్య నవేంద్రు సంఖ్యాప్రమాణ

పారాణ సంవత్సరమున కనూన భక్తి
నీకునర్పించితిని జామి నీరజాక్ష!

'స్వచారిత్రము' నుండి.

ఆత్మస్తుతి యగునని యో, యన్యు లేమనుకుందురో యనియో మన పూర్వు లెవరును స్వీయచరిత్రములు వ్రాసికొనినవారు కారు. ఆంగ్లేయులను జూచి మొట్టమొదట మన కందుకూరి వీరేశలింగము పంతులుగారు స్వీయచరిత్ర వ్రాసిరి. అదియాదిగా దేశములో రచయితలెందరో స్వీయచారిత్రములు వ్రాసుకొను నలవాటు చేసికొనిరి. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి 'స్వీయచరిత్రము' ప్రకటితమైనది. ఇట్టివింకను చాలమంది రచనలు ప్రచురితములు కాని యున్నవి. శృంగారకవి సర్వారాయకవి సంధానించుకొనిన 'స్వచారిత్రము' వారియనంతరము, చక్కగ నచ్చులోనికి వచ్చినది. కవి తాను తన యనుభవాదికము వ్రాసియుంచుకొనుట, యతని తరువాత నదియెవరో బయటబెట్టి ముద్రించుట యనునిది చక్కనిమార్గము. దానంజేసి, తత్కవి యాత్మస్తుతి చేసికొన్నవాడుగా గాఁపడు. మన సర్వారాయకవిగారి స్వచారిత్రము బహువిచిత్రమైనది. అందాత్మస్తుతిగాని, అన్యనిందగాని, అసత్యముగాని, అక్కఱలేనిదికాని యొక్క యక్కరము లేదు. ఏదో జ్ఞాపకార్థము దైనందినచర్య వ్రాసికొనినటులుండెను. ఆచారిత్ర గ్రంథమే యిపుడు నాకాధారపడినది.

శృంగారకవి యనునది పౌరుషనామము. విస్సాప్రగడవారు క్రమముగ నిటులైరి. వీరిపూర్వులలో వెంకయ్యగారనుబడు నొకరు శృంగార పద్యములు నాలుగు రచించి తాటియాకుపై లిఖించి తమ గ్రామమునకు వచ్చిన యొకమహమ్మదీయాధికారిదగ్గరకు వెళ్లి చదివిరట. ఆయన సంతసపడి 'శృంగారకవి వెంకయ్య' యని ప్రశంసించి వందుము [illegible] చేసెను. [illegible] సత్కరించెనట. నాటనుండియు [illegible] కలుపురుష [illegible] శృంగారకవివా రనుచుండిరట. అది యింటిపేరుగా స్థిరపడెను.

సర్వారాయుడు గారి తండ్రి [illegible] పన్నగాచలమంత్రి సంస్కృతాంధ్రములు చదువుకొనినవాడు. [illegible] శ్రద్ధగా [illegible].

చదువయినవెంటనే 1880 సం॥ మొదలు నర్సాపురము, కిర్లంపూడి, రాజమండ్రి, పెద్దాపురము ఆంగ్లపాఠశాలలలో నుపాధ్యాయపదవి నిర్వహించిరి. 1894 లో నారంభించి 1939 దాఁక కాకినాడ పిఠాపురంరాజావారి కళాశాలలో నధ్యాపకత సాగించి, యెందఱనో శిష్యులను ముందునకుఁ దీసికొనివచ్చిరి. నర్సారాయకవిగారు చాలమందికిఁ బద్యములు దిద్దిపెట్టినట్టుగ వారిచరిత్రయుఁ దెలుపుచున్నది. తచ్ఛిష్యులును జెప్పుచున్నారు. ఆయనిదట్టి యుపకారిబుద్ధి.

శృంగారకవిత వ్రాయుటలో వీరికి మంచిప్రవేశము కలదు. చమత్కృతిపై భాషించుట యందును వీరు నేర్పరులు. ఈవిషయములకు వీరి 'స్వచారిత్రము' లోని కొన్ని మాటలు తీసి వ్రాసెదను.

"ఒకప్పుడు ముత్తుస్వామిశాస్త్రిగారితో వీరేశలింగముగారింటికింబోవఁ దటస్థించినది. ఆయన నన్నుఁ గూర్చుండుమనలేదు. ఎవరువీ రని యడుగలేదు. ముత్తుస్వామిగారే వీరు మాన్యులుపండితులునుమండీ! యని ముచ్చటించిరి. అప్పుడు మీయింటిపే రెవరనిరి. శృంగారకవి వారంటిని.మీపూర్వులు శృంగారకవిత్వము చెప్పువారు కాఁబోలు నేయనిరి. పూర్వమె కా దిప్పుడును జెప్పుట కలదంటి. ఏమి చెప్పితి రనిరి. లక్షణాపరిణయము, ముకుందశతకము. శివానంద లహరి, మహిమ్నము మున్నగున వని చెప్పితి. మీపూర్వులేమి చెప్పిరనఁగాఁ బెక్కులున్నవి యని పల్కితిని. ఏదీ యొకపద్య మనిరి. "పరమా సురమా విరమా భరమా పరమాన్య నన్నుఁ బటుదయఁ బ్రోవన్ 'సురమానినీ నుతవిలాసరమా పరమాత్మ శ్రీవిజయగోపాలా'" యని చదువ నర్థము చెప్పుమనఁగాఁ జెప్పితి. కాని తొలుదొల్త గౌరవింపకుండుట, పదపడి పిల్లవానివలె నర్థము చెప్పు మనుట నాకుఁ గష్టమై వెంటనే —

"భరతా దరతా నరతా। విరతా మరతాపహరణ విమలహృదయ,
కుందరదా దరదా వరదా। శరదా శరదాభ శ్రీవిజయగోపాలా' యని చదివితి. అర్థమేదీ యనఁగానే మీముఖతః వినుటకుఁ జూడీ యంటి. 'ఇదే మనవారివెఱ్ఱి. ఇంత క్లిష్టముగాఁజెప్పుట యెందుకో' యనిరి. వెఱ్ఱియేమి? వివేకమే. కవిసమర్థత యిట్టివాని వలననేగదా తెలియునది యంటి. ఆయన మరల నర్థము మాట యెత్తక చాదివైచి ప్రబంధముల ధోరణిలోనికి దింపిరి. ప్రొద్దు పోవుటచే మేము వెడలి వచ్చితిమి."

ఈకవి మొత్తము చిన్నవి, పెద్దవి కలసి డెబ్బదియొక్క కృతి రచించెను. వీనిలోఁగొన్ని పాఠశాలాపాఠ్యములుగా నెన్నుకొనఁబడినవి. నాలుగైదుతక్కఁదక్కినవెల్ల నచ్చుపడినవి. ఏగ్రంథమునకుఁ బెద్ద ప్రఖ్యాతి వచ్చినటులు లేదు. కవిత నిర్దుష్టముగానుండి ధారాళముగ నడచును. అంతకుఁదప్ప రసభావముల యందము వారికవితలోఁ దక్కువ. కవి నైష్ఠికుఁడు, భక్తుఁడుగాన భగవత్పరములైన దండకములు, శతకములు పెక్కులు వ్రాసెను. ఒక్కటియుఁ గకుత్కారిలపతి నరాంకితములు సేయ లేదు. దైన్యముతో నన్యుల నచ్చుకొల్పకై యాచింపలేదు. అది యీ కవిలోఁగల విశిష్టగుణము. వీరాంధ్రీకరించిన దండియనామత్రయములో రెండు పద్యములివి.

ఉ. పంచశరుండు కొంచకరఁ బచ్చని వింట విమోహనాస్త్రమ
త్తించి యుహాంకరించి వెనుదీయక యేయఁగఁ బంచవక్త్ర! రో
షంచి కనన్ భవన్నయన చిహ్నశిఖాగ్నిని జెంది రక్తమా
ర్పంచికశోకమంజరి మహాస్థప ధూమ మిళిందమై చనన్.

శా. ఆలంకారపరా రావణాసురుఁడు శ్రీరామాంధి వీచీసమా
లోలస్త్రీయుతరాజ్యముల్ ప్రథితమాహాత్మ్యం దెల్పు పెద్దావమా

కైలాసంబుఁగదల్ప లోఁదెలసి త్రొక్కం దావకాంగుష్ఠ కే
ళీలంబడి మోములన్ రుధిర ముల్కన్ మొఱ్ఱలంబెట్టెఁడే !

సర్వారాయకవిగారి నిర్యాణ మతివిచిత్రతరమైనది. 1939 మార్చి 13 వ తేదీ సోమవారము యథాపూర్వముగ మేలుకని నిత్యకృత్యముఁ దీర్చెను. తీర్చి సూర్యనారాయణస్తుతి పఠించి స్నానముచేసి, ధౌత వస్త్రములు కట్టి దేవతార్చనముచేసి భోజనము మాత్రము చేయక భూమిమీఁద ప్రాక్ఛిరముగ శయనించి తనువువిడిచిరి. ఇట్టి యెఱిఁగిన మరణ మెవరికో గాని తటస్థింపదు. వీరికి జ్యోతిశ్శాస్త్రమున మంచి ప్రవేశమున్నది. ఆకారణమున నిర్యాణతిథి తెలిసికొని యిటులు జ్ఞాని వలె మరణించెను.

# దాసు శ్రీరామకవి

## 1864–1908

ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రోద్భవుఁడు. తండ్రి: కన్నయమంత్రి. తల్లి: కామాంబ. జననము 1864. నిధనము 1908. పుట్టుక: కృష్ణామండలములోని కూరాడలో. మృతి: గోదావరిమండలములోని ఉప్పు ఏలూరులో. ఈతని ప్రత్యేకగ్రంథములు ౩౪. ౧ ఆచారనిరుక్తి ౨. దురాశాపిశాచభంజని ౩. వైశ్యధర్మదీపిక ౪. ఆంధ్రవీథి ౫. అభినయదర్పణము ౬. కృతులు ౭. స్వరజతులు ౮. పదములు ౯. జానకీపరిణయనాటకము ౧౦. మనోలక్ష్మీవిలాసనాటకము ౧౧. అచ్చతెనుఁగు అభిజ్ఞాన శాకుంతలము ౧౨. రత్నావళి. ౧౩. మాలతీమాధవము ౧౪. మాళవికాగ్నిమిత్రము ౧౫ ముద్రారాక్షసము ౧౬. ఉత్తరరామచరితము ౧౭. మహావీరచరితము ౧౮. కురంగగౌరీశంకరము ౧౯. మంజరీమధుకరీయము ౨౦. సంగీతరసతరంగిణి యను బుద్ధనాటకము ౨౧. తర్కకౌముది ౨౨. అభినవగద్యప్రబంధము ౨౩. సాత్రాజితీవిలాసము ౨౪. లక్షణావిలాసము ౨౫. ఆంధ్రదేవీభాగవతము ౨౬ తెలుఁగునాఁడు ౨౭ సూర్యశతకము. ౨౮. భృంగరాజమహిమ, ౨౯ సంగీతరసతరంగిణి మున్నగునవి.

దేవీభాగవతము పదునెనిమిదివేల గ్రంథము. దాని నయిదునెలలలో గద్యపద్యాత్మకముగా నాంధ్రీకరించి యాఱవనెలలో నచ్చున కిచ్చిన యాశుకవిసింహులు దాసు శ్రీరాములుగారు. ఆశుకవితయైనను నంద మెచ్చటను గానఁబడలేదు. దేవీభాగవతమును మొట్టమొదటఁ దెలిఁగించిన కవి మూలుగు పాపయారాధ్యుఁడు. దేవీభాగవతమును మొత్తము మొదట ప్రచురించినకవి దాసు శ్రీరాములుగారు. తిరుపతి వేంకటకవులును వీని కవనమును హారముగా నమువదించిరి. నేఁటి కీముప్పురు కవుల గ్రంథములును ముద్రణము నందుచున్నవి. త్రిపురాన తమ్మన దొరగారు

కూడ దీని ననువదించినటుల తెలియును. అదికూడ నచ్చు పడినచో నాంధ్రీకృత ప్రకటిత దేవీభాగవతముల సంఖ్య నాలుగు.

శ్రీ రామకవిగారు తల్లిదండ్రుల కేకైకపుత్రులు. ఆకారణమునఁ జిన్ననాఁటినుండియుఁ గడు గారాబముగాఁ బెరిఁగిరి. కృష్ణామండలములోని 'అల్లూరు' వీరి పూర్వులకుఁ బూర్వప్రభువు లొసంగిరి. అందుచే వీరిజీవనమునకు లోటులేదు. తొలుత వీరిని బందరు నోబులుపాఠశాలకుఁ జదువునకుఁ బంపించిరి. అచ్చట నాంగ్లము, పారశీకము చదువుచుఁ బదిమాసములు గడపిరి. ఈకవివరుని కుశాగ్రమతికి నివ్వెఱపడి నోబిలు దొర తన యింటికి నడుమనడుమఁ దీసికొనిపోవుచు నితనికిఁ బుస్తకము లిచ్చి ఫలాహారములు పెట్టుచుండెడివాఁడఁట. ఇది యెఱిఁగి శ్రీరామ పండితుని తల్లిదండ్రులు క్రైస్తవమతవాసన వీని కెక్కుడఁ గలుగునో యని యాచదువునకు స్వస్తిచెప్పించి యింటికిఁ గొనిపోయిరఁట.

క్రమముగాఁ బండితసాహాయ్యమునఁ గొంతసంస్కృతాంధ్రజ్ఞానము నాకళించి కవిత నల్ల నారంభించినాఁ డీయన. 12 వ యేఁట వ్రాసినను వీరి సోమలింగేశ్వరశతకము ప్రౌఢముగానున్నది. ఆకాలమున శతావధానప్రదర్శనమునఁ బ్రసిద్ధినందిన మాడభూషి వేంకటాచార్యులవారు నూజవీడున సంస్థాన విద్వాంసులుగా నుండిరి. ఈయన పేరుఁబ్రతిష్ఠలు శ్రీరామకవిగారు తఱచువినుచుండెడివారు. వీరికిని శతావధానము చేయవలె నని సంకల్పము ప్రబలినది. సంస్కృతవిద్యాభ్యాసము గావింపవలె నని జిజ్ఞాసయు హెచ్చినది. ఒకనాఁటి తెల్లవాఱుజామునఁ దల్లిదండ్రు లెఱుఁగకుండ నూజవీటికిఁ బయనమయి వేంకటాచార్యులవారిని సందర్శించి వారియాదరమున నొక యవధానము గావించెను. అప్పుడాయన యీ కవికిశోరుని కవితాధారకు, మతినైశిత్యమునకు మెచ్చి "పదిరెండేడుల యీడునం గవితఁ జెప్పంజొచ్చి వ్యస్తాక్షరీ" ఇత్యాది పద్యముతోఁ బ్రశంసించెను. వారికడఁ గొంతసంస్కృతభాషాజ్ఞానము

నరపాదించి మరల నింటికి వచ్చి సాత్రాజితీవిలాసము, (యక్షగానము - 14 వ యేట వ్రాసినది) పంచనృసింహక్షేత్రము, శుకరంభాసంవాదము, కృష్ణార్జునసంగ్రహము మున్నగు కొన్నికబ్బము లల్లి 18 వ యేట నాగిరిపల్లి గీర్వాణవిద్యాపీఠమునకుఁ బోయి సాహిత్యగ్రంథములు, సిద్ధాంతకౌముది చదివి తనకవితకుఁ బాండిత్యపు మెఱుఁగు పెట్టెను.

తరువాత 'సెకండుగ్రేడుప్లీడరు' పరీక్షలో నుత్తీర్ణులై బందరులో న్యాయవాదిగాఁ బ్రవేశించిరి. బందరుపౌరులు నాఁడు వీరి పాదములు వెండిపూలచేఁ బూజించి, బంగారుపూలచే శిరము నర్చించి పల్లకి నెక్కించి బ్రహ్మరథము పట్టిరని విందుము. ఉద్యోగము చేసికొనుచు వ్యాఖ్యానపఠనము గావించుచుఁ గవితారచనము. 1884 లో జిల్లా కోర్టు పట్టా పొంది యేలూరు 'సబార్డినేటుకోర్టు' లోఁ బండ్రెండేం డ్లవిచ్ఛిన్నముగా నుద్యోగ ధర్మము నిర్వహించిన న్యాయవాది యీయన. శ్రీరామపండితుఁ డెంతధనసంపాదకుఁడో యంతదాత. పండితులకుఁ గవులకు నీయన యొసఁగు సన్మానములు గావించె. కవుల యెడ సహజముగ నుండునసూయాదిగుణములు వీరియెడఁ గనఁబడవు. సంగీతాభినయగ్రంథములు చాల రచించిన కళావిదుఁ డీయన. జ్యోతి శ్శాస్త్రమున మంచిప్రవేశము. 1901 లో "శ్రావణమాస మధికమా-ఆషాఢమాస మధికమా?" యనుచర్చ రాజమహేంద్రవరమున జరిగెను. దీని పరిష్కారణమునకు మున్నూరు పండితు లేర్పడిరి. నాఁడు వీరి సిద్ధాంతమే నెగ్గిన దని పలువురు ప్రశంసించిరి. ఇదిగాక సంఘసంస్కార [illegible], మతాచారములు, ధర్మము, [illegible] నీతులు మున్నగు విషయము [illegible] గతిలో వీరనేక వ్యాసములు వెలువరించిరి. 1880 సం॥లో "[illegible]వల్లి" యను పత్రిక ప్రకటించిరి. [illegible]ద్వ్యానము లిచ్చిరి.

[illegible] తెనుఁగున [illegible] యత్యంత మనోహర [illegible] కవీంద్రుఁ డీయన. మాలతీ

మాధవము, మహావీరచరిత్రము, మాళవికాగ్ని మిత్రము మొదలగు నాటకము లెన్నియో యాంధ్రీకరించి ఘనత గాంచిరి.

వీరి కావ్యప్రపంచమునఁ జిరస్థాయిగా నుండునది దేవీ భాగవతము. రసవిలసితముగా నున్నది "తెలుఁగునాఁడు". ఇది స్వతంత్రపుఁగబ్బము. ఇందలి పద్యములు స్వభావసిద్ధములు. మచ్చునకుఁ గొన్ని పొందు పఱుతును.

ముదికరణాలు రాముగుడిమోసల రచ్చలుదీర్చి, భారతాల్
చదువుచు, లోకవార్తల ప్రశంసల నంద్రుః తెలుఁగుబాస మం
చిది, మన పిల్లకాయలు వచించెడి యింగిలిపీసు పుస్పుసన్
బెదవులు దాఁట చెంతటి 'ఏఫేయు' 'బియే' 'ఎమియే' వచించినన్.

లేవరు 'లెండు లెం" డనిన లేచినవారయినం దటాలునం
బోవరు పోవుచున్నిలిచిపోదుము పోదుము త్రోయకుండటం
చీవరు సందు గేస్తునలయింతురు పెండిలిలో సదస్య సం
భావనవేళఁ జూడవలె బాపనసాముల సాములన్నియున్.

నమ్మిన నమ్మకున్న నది నావశమా? జను లాడికొన్నవా
క్యమ్మును నేనుఁ జెప్పెదభయంపడియో పడకో, నియోగిలో
క మ్మనివార్య కార్యఘటక మ్మవుగాని పరోపకార శూ
న్యమ్మును స్వప్రయోజన పరాయణమ్ముం దలపోయ నిద్ధరన్.

చెళ్ళపిళ్ళ కవి వ్రాసినట్లు లిక్కవికవిత జనరంజకము, లోకానుభవ వ్యంజకము నై యున్నది.

అస్సే చూస్నివషే వోంషే చెవుడషే అప్లాగషే యేమిషే
విస్సా వఝ్ఝలవారి బుజ్జీనవ ఆవిస్సాయి కిస్సారుషే

విన్నం డెంతటివాఁడ ? యేళ్ళు పదిష్టే.....

ఈపద్య మీయనదే.

ఈయన పోతనవలె సహజపాండిత్యుఁడు. అతఁడు భాగవతము నాంధ్రీక రించిన నితఁడు దేవీభాగవతము నాంధ్రీకరించినాఁడు. ఈయన కవితా సంపన్నుఁడేగాక మోహనరూప సంపన్నుఁడు కూడనని చూచినవారు చెప్పుదురు.

ధనము, రూపము, విద్య, వితరణము, వినయము, వివేకము కలిగిన ఈ శ్రీరామపండితునకుఁ బుత్రులాఱుగు రుదయించి పెంపొందుట యెంతటి యదృష్టమో పరికింపుఁడు. కుమారులకు కేశవనామములను నామములుగా నుంచెను. శ్రీరామకవి సర్వాధాధన్యుఁడైన కవివతంసుఁడు. ఆంధ్రదేవీభాగవత రచయితలగు శ్రీ ములుగు పాపయారాధ్యుఁడు, దాసు శ్రీరామకవి, తిరుపతి వేంకటకవులు, త్రిపురాన తమ్మనకవి తెలుఁగువారికి వందనీయులు.

# ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ

## 1864-1933

ఆరువేల నియోగిశాఖాబ్రాహ్మణులు. సాంఖ్యాయనసగోత్రులు. తండ్రి బాపిరాజు. తల్లి నరసాంబ. జననము 1864. నిర్యాణము 1933. వీరిపూర్వులు గోదావరీ మండలములోని ఆచంట గ్రామమునఁ గాఁపుర ముండెడివారు. సాంఖ్యాయనశర్మగారి తల్లిదండ్రులు నాగావళీనదీ ప్రాంతములకు తరలివచ్చిరి. కాఁగా వీరు విశాఖపట్టణమండల నివాసులు. గ్రంథములు: సుధానిధి (కావ్యము) మనోరమ (కావ్యము) పార్థపరాజయము, అవదాతకలభకము (స్వతంత్రనాటకములు) విక్రమోర్వశీయము, ఉత్తరరామచరిత్ర (ఆంధ్రీకరణములు) రహస్యదర్పణము, ఆంధ్ర పద్యావళి మున్నగునవి. ప్రచురించిన పత్రికలు: సుజనప్రమోదిని, కల్పలత.

వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు మహోపాధ్యాయులని ఆంధ్రభీష్ములని కొనియాడఁబడిన ప్రసిద్ధపండితులు. వీరు పండితులుగాను, కవులుగాను, ప్రతికాసంపాదకులుగాను, విమర్శకులుగాను, మహోపన్యాసకులుగాను తెలుఁగునాటఁ బేరు సంపాదించిరి. సాంఖ్యాయన శర్మగారు స్ఫురద్రూపి. ఆకారమున కనుగుణమగు ప్రజ్ఞ. ప్రజ్ఞకుఁదగిన వాక్చాతుర్యము. ఈయన యుపన్యాసవేదిక నెక్కినచో నెట్టివాఁడైన కిక్కురుమనుటకు వీలులేదు. సమయస్ఫురణము, పరేంగితజ్ఞతయుఁ గల యుపన్యాసకులలో నీయనయగ్రేసరుఁడు. సమయోచితము సరసమునగు హాస్యము వీరిమాటలలో నుండి యెదుటి వారిని ముగ్ధులనొనరించెను. సాంఖ్యాయనశర్మగారి వాక్స్థానమున నే యున్నతగ్రహము లున్నవో గాని యీయన యతియందముగాఁ బొందికగా మాటాడువారు. సరస సంభాషణమునకుఁ గూడ గొప్ప ప్రతిభ యుండవలయును. మహా మహోపాధ్యాయులు పరవస్తు వేంకటరంగాచార్యులు, కొక్కొండ వేంకటరత్నంపంతులు మనోహరముగా భాషించువారని విందుము.

మంగళంపల్లి సర్వేశ్వరశాస్త్రి, బులుసుపాపయ్యశాస్త్రి మాటలలో ధ్వను లుపయోగించెడివారఁట. "అర్ధ శుష్క ఫలకోమల స్తనీ, పెద్దిభొట్టుగృహిణీ విరాజతే" ఇత్యాది మహావాక్యములకుఁ గర్తలగు పెద్దిభొట్టుగారు చాటూక్తిచతురుఁడని ప్రసిద్ధి. ఇటీవలి చిలకమర్తి కవి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, వేదము వేంకట్రాయశాస్త్రి చతురభాషణములలోఁ బేరు మోసినవారు. వీరివాకులు కొన్ని లోకులు చెప్పుకొని యానందించుచుందురు. సాంఖ్యాయనశర్మగారిసంభాషణముకూడ దేశప్రసిద్ధమైనది. వీరిది పండితైకరంజకమైన వక్తృత్వముగాదు. ప్రజాసామాన్యమునకు సుబోధమగు మాటనేర్పు. పైని మన మనుకొనిన వారందఱును బండితపామరమనోరంజకముగా మాటాడువారే.

సాంఖ్యాయనశర్మగారు కవిత్వము వ్రాసెను. చిత్రలేఖనము నేర్చెను. సంగీతము నేర్చెను. నాట్యశాస్త్రము తెలిసికొనెను. పదార్థవిజ్ఞాన రసాయనశాస్త్రములు, భూవృత్త క్రిమికీటక ఖనిజతత్త్వము, ప్రాచీనాధునాతన హైందవరాజ్యాంగ విశేషములు చక్కఁగాఁ బరిశీలించెను. వీరి ప్రజ్ఞాదర్పణమునఁ బ్రతిఫలింపనికళ లేదు. కుశాగ్రబుద్ధియగుటచే సంస్కృతాంధ్రములలోఁ జిన్ననాఁటనే గొప్పసాహిత్య మలవఱచుకొనెను.

క్రీ. శ. 1880 ప్రాంతమునఁ దెలుఁగుదేశమున వ్యాప్తములోనున్న ఆంధ్రభాషాసంజీవిని (కొక్కొండ వెంకటరత్నముగారిచేఁ బ్రకటితము), మందారమంజరి, ప్రబంధకల్పవల్లి మున్నగుపత్రికలు చదువుచుండుటచే సాంఖ్యాయనశర్మగారికిఁ బత్రికా ప్రచురణోత్సాహము చిన్నతనముననే కలిగినది. నాఁటికాయన వయస్సు పదునెనిమిదియేండ్లకు లోఁబడియుండును. అప్పుడు 'సుజనప్రమోదిని' యను పేరితో నొకమాసపత్రిక నడుపనారంభించిరి. దాని తొలిసంచిక 10-6-1881 సం॥ నాఁడు వెలువడినది. 'సుజనప్రమోదిని' తో శర్మగారి నాంధ్రదేశము కొంచెము పరిచయించినది. 1885 లో వీరు శతఘంటకవిత్వము చెప్పిరఁట. ఆపద్యము

లలభ్యములు. ఆంగ్లభాషాకృషి నేయనెంచి 'మిడిల్‌స్కూలు' పరీక్షకుఁ బోయి రాజధానిలోఁ బ్రథములుగా నెగ్గిరి. తరువాత న్యాయవాది పరీక్షకుఁజదివి యుత్తీర్ణులై పార్వతీపురము మునసబుకోర్టునఁ బనిచేసిరి. ప్రాకికోద్యోగము చేయుచున్నను సాహిత్యవ్యవసాయము వీడక గ్రంథరచనము చేయుచు 1892 లో 'ఆంధ్రపద్యావళి' యను పేరఁ దమఖండ రచనల నొక సంపుటముగా వెలువరించిరి. తరువాత 'రహస్యదర్పణము' ముద్రించిరి. అం దదృశ్య ప్రపంచరహస్యములు, క్రిమికీటక పక్షి జంతు యాత్రాదిరహస్యములు మొదలగువానిపై నపూర్వపరిశోధనము కలదు. విక్రమోర్వశీయము, ఉత్తరరామచరిత్రము బాసలోనికిఁ బరివర్తించిరి. వీని కంతప్రశస్తి రాలేదు. 1903లో 'కల్పలత' యను విజ్ఞానవిషయక మాసపత్రిక నెలకొల్పిరి. ఆ కల్పలత రెండేండ్లలో యశోలతవలె యాఁగి పోయినది. మరల 1919లో దాని లేవఁదీసి కొంతకాలము నడపిరి.

శర్మగారు తెలుఁగున జరిగిన యెన్నో మహాసభలకు ఆధిపత్యము వహించిరి. 1923 లో గుంటూరుమండలమునందలి 'సండూరు'న జరిగిన యాఱవ యాంధ్రసారస్వతసభకు వీరధిపతులు. ఆపరిషత్తునవే వీరిని మహోపాధ్యాయ బిరుదమున సత్కరించిరి. 1924 లో ఆంధ్రసాహిత్య పరిషత్త్రయోదశ వార్షికోత్సవమునకు వీరు సభాపతులు. 1929 లోఁ దెనాలియందు జరిగిన ప్రథమాంధ్రనాటక కళాపరిషత్తునకు శర్మగారాధ్య క్ష్యము సభ్యప్రార్థనపై నంగీకరించి యద్భుతముగా సభనునిర్వహించిరి.

ఈవిధముగా మహాసభల కధ్యక్షులై, మహోపన్యాసకులై మహోపాధ్యాయుఁ డనిపించుకొనిన సాంఖ్యాయన శర్మగారి కవితా విశేషము లిఁకఁ జవిచూతము. ఈయన కవిత రసస్ఫోరకము. సరళపద భరితము.

పట్టిన దెల్లఁ బైడియగుభంగిని పల్కినపల్కు పద్యమై
యుట్టిపడంగఁ జెప్పినదె యొప్పినవేదముగాఁగ సత్కథల్
గొట్టినపిండిగాఁ గవితఁగూర్చిన ధన్యుల లోకమాన్యులన్
బుట్టను దిప్పనుం బాడమి పూజ్యతఁగాంచినవారి నెన్నెదన్.

"సుధానిధి"

ఆటవెలఁదు లున్న తేటగీతము లున్న
మనసు కరఁగిపోవు మంచుపగిది
ఆట లేక తేటపాటయు లేకున్న
వెలఁదు లున్నఁ జాలు వేవరాలు.

"ఆటవెలఁదులు తేటగీతములు"

సీ. నెలఁతలు చంటి బిడ్డలకుఁ బాల్గుడుపుటే
ప్రకృతిధర్మంబని పలుకరాదు
ప్రకృతశాస్త్రజ్ఞులౌ పండితుల్ డార్విను
మున్నగువారలు కొన్నిచోట్ల
పురుషులుం రొమ్మునం బాడమినపాలతో
శిశుపోషణం బని చెప్పినారు
ప్రకృతి ధర్మంబులు ప్రభవించు నశియించు
నభ్యాస పద్ధతి ననుసరించు

మగువల కెగాని చన్బాలు మగల కెందు
పొడమ వనుమాటలన్నియుఁ బూటకములు
పురుషు లికమీఁద స్తన్యంబు పొడమునట్లు
రొమ్ము సవరించుకొనుట కార్యమ్ముగాదె?

"సంఘసంస్కరణము"

బిందె బిందెడు కాఫీకి పిడుగు తునుక
కట్టచుట్టలఁ గాల్చెడి పుట్టుభోగి
బుట్టెఁడాకులు నమలెడి పుణ్యభోగి
నాగరికు లన్నవేత్తె యున్నారె, వీరె.

"బహిస్సర్వాకార ప్రవణరమణీయం వ్యవహారన్" అను భవభూతి శ్లోకమున కీకవియాంధ్రీకరణపుమచ్చు నిచ్చినచో వీరిశక్తి తెలియఁ గలదు.

మన సెటులుండనీ పయికి మాటలఁ జేఁతలచేత లోకరం
జన మొనరింపుచున్ దనరు స్వల్పపుదోషములైన దాఁచుచున్
జనులను మోనపుచ్చి యొరుచాడ్పున నేర్పరి తాఁ దటస్థుఁడై
తనపనిచక్కఁ బెట్టుకొనుఁ దాల్చును బిమ్మట మానముద్రయున్.

---

# పానుగంటి లక్ష్మీనరసింహారావు

## 1865–1940

మధ్వమతస్థులు. తండ్రి : వేంకటరమణాచార్యుఁడు. తల్లి : రత్నమాంబ. నివాసము రాజమహేంద్రవరము, పిఠాపురము. జననము : 1865 సం. నిర్యాణము : 1–1–1940 సం. రచితగ్రంథములు : సారంగధరచరిత్ర, వృద్ధ వివాహము, రాధాకృష్ణ, నర్మదాపురుకుత్సీయము, సరస్వతి, దుష్టప్రధాని, ఆనందనాథ, కల్యాణరాఘవము, కంఠాభరణము, విజయరాఘవము, కోకిల, విప్రనారాయణచరిత్ర, విచిత్ర సమావేశము, విచిత్ర మరణము, బుద్ధబోధసుధ, వీరమతి, పూర్ణిమ, ప్రచండ చాణక్యము, (ఇత్యాదినాటకములు.) హాస్యవల్లరి, పతనము, మంజువాణి, జగన్నాథమూర్తి, మోసము, జలజ, సాక్షి (6 భాగములు)

సాక్షివ్యాసములు చదువనియాంధ్రు లుండరు. జంఘాలశాస్త్రి గంభీరోపన్యాసము, వాణీదాసుఁడు, కాలాచార్యుఁడు, బొఱ్ఱయ్యసెట్టిగారల మాటలును తెలుఁగువా రెల్ల రెఱిఁగినవే. వారి నాటకముల మాట యటుండనిచ్చి సాక్షివలనఁ బానుగంటివారిని దలఁచుకొని నవ్వుకొనుచుందుము. ఆంధ్రపత్రికాపాఠకులు సాక్షివ్యాసములకొఱకుఁ గాళ్లు విఱుగఁద్రొక్కుకొనినదినము లెన్నియో యున్నవి. కాని పంతులుగారి షష్టిపూర్తిసందర్భమున కొకయాంధ్రుఁ డేని నడుము గట్టినపాపానఁ బోలేదు. సాక్షి యాంగ్లములోని spectator అను గ్రంథమునకుఁ డెలిసికొనఁజాలని ఛాయయని చెప్పుదుముగాక! అయిన నేమి? తెలుఁగుజాతికి 'సాక్షి' యొక్క యుజ్జ్వలవిజ్ఞానదీపము. మన సంఘమును, మనజాతిని, మనవాఙ్మయమును, మనదురాచారములను మొత్తమొత్తగా నెత్తిపొడుచుచు సంస్కరింపఁజూచిన మహాగ్రంథము 'సాక్షి'.

లక్ష్మీనరసింహారావుపంతులుగారు స్త్రీలు - మతము - నాగరకత - వేదాంతము - విద్యావిధానము - రాజకీయములు - మున్నగు విషయము

లను గూర్చి యెక్కువ చర్చింతుగు. పంతులుగారికి దేశభాషయం దింతింత యనరాని యభిమానము. దేశీయభాషలో నుపన్యసింపలేని యధ్యక్షునిగూర్చి పంతులుగారు ప్రకటించిన యాగ్రహ మనుపమానము. ఇది 'స్వభాష' యను (సాక్షి మూఁడవసంపుటము) వ్యాసమునఁ గాన నగును. స్నానసంధ్యాదినియమములు వదలివేయుట భారతీయులకు ధర్మము కాదని చెప్పు ప్రాచీనాచారపరాయణులు శ్రీ పంతులుగారు. వారివేదాంతోపన్యాసములను బట్టిచూచిన వారద్వైతవాదులు. కాని వస్తుతః వీరు ద్వైతమతస్థులు. నేఁటి విద్యావిధానమున దైవభక్తికి సంబంధించినగ్రంథములు లేవనియుఁ గనుకనే విద్యార్థులలో నాస్తికత ప్రబలుచున్న దనియు వీరు పలుమారు వ్రాయుచుందురు. రాజకీయ విషయములనుగూర్చి యెన్నికలనుగూర్చి వ్రాయుచు గాంధిగారి సిద్ధాంతములను దాము వివేకించునట్లు విలిఖించిరి. సాక్షిలో 'తోలుబొమ్మలాట' వ్యాసము చదివిన వీరి జానపదవిషయవివేకిత వెల్లడియగును.

పానుగంటిపంతులుగారు శబ్దవైచిత్రి వలచినకవి. ఆంధ్రవచన రచనలో వీరొకశ్రోత్రదారి త్రొక్కిరి. కందుకూరి వీరేశలింగము పంతులుగారు గద్యతిక్కనయేగాని యావిషయము వేఱు. చిలకమర్తికవి పెద్దనవలా రచయితేగాని యదియును వేఱే. పానుగంటివారి రచన మఱియొక విలక్షణమైనది. వీరు వ్యావహారికమునకు దగ్గఱగనుండు గ్రాంథికము వ్రాయుదురు. ప్రతిపదము పరిహాసగర్భితము. ఆక్షేపణ భరితము. చెప్పినదే మార్చి మార్చి భంగ్యంతరముగాఁ జెప్పుట వీరి రచనలోఁ గ్రొత్తదనము. చదివినకొలఁదిని జదువుట కుత్సాహము పుట్టించు రచనమే రచనము. అది పానుగంటికవి సొమ్ము. విషయము గప్పిపుచ్చకుండ, విసుగుపుట్టింపకుండ వేలకొలఁది నిదర్శనములఁ జూపుచు వ్రాయుటలోఁ బానుగంటివారిదే పైచెయ్యి. పాఠకున కొకవిధమైన యుత్సాహము చిత్తసంస్కృతి యావేశము గలిగింపఁజేయుట కీయన రచన యక్కఱైనది.

వీరికిఁ బాశ్చాత్య వాఙ్మయమునఁ గూలంకషమైన ప్రజ్ఞ. పంతులుగారు, భాషలోనేగాక వ్యవహారమునఁగూడ దిట్టమైనప్రజ్ఞకలవారు. కొంత కాలము 'అనెగొంది' యాస్థానమునఁ, గొన్నినాళ్లు ఉర్లాము ప్రభుత్వమునఁ, గొంతకాలము లక్ష్మీనరసాపురము సంస్థానమున మంత్రిగా పనిచేసిరి. తరువాతఁ బిఠాపురసంస్థానప్రభువులు వీరి వైదుష్యమున కానందించి చివరివఱకు నెలకు 116 రూప్యముల నిచ్చుచు సన్మానించిరి. పాశ్చాత్యభాషాప్రవీణులయ్యు నాంధ్రభాషాసేవ యమూల్యముగా నొనరించి తరించిన పండితు లీయన. అనుకరణము లీయన యామోదింపలేదు. అనువాదములు గావింపలేదు. 'ఆంధ్రి' ని మఱవలేదు. వీరు తీసికొనిన గాథలు పౌరాణికములు. కావ్యచిత్రణములు మాత్రము నవీనములు. వ్యాసములలోనే కాదు నాటకములలోనే కాదు హాస్యమునకుఁ బ్రాధాన్యము. సాక్షిలోని వ్యాసములకు హాస్యరస మతిమాత్రమైనను బ్రమాదములేదు. కాని వీరి కొన్ని నాటకములలోని హాస్యము ప్రధానరసతిరోధానము చేయుచు నత్యధికమైనది.

శ్రీ లక్ష్మీనరసింహము పంతులుగారి నాటకములలోని పద్యములు బండివానినుండి పండితునివఱకుఁ బాడుకొని యానందించుచుందురు. నాటకరచనకంటె సాక్షివ్యాసములతోఁ బానుగంటివారికి గొప్పపేరు వచ్చినది. సాక్షివ్యాసములకంటె నాటకరచనలో నరసింహారావు పంతులుగారిని రసవిదు లెల్ల మెచ్చుకొనిరి. పానుగంటివారి నాటకములకు కూచి నరసింహముగారు 'నాంది' వ్రాయుట యొక యాచారము. పంతులుగా రాంగ్లకవిశేఖరుఁడగు 'షేక్స్పియరు' వ్రాసిన యన్ని నాటకములు వ్రాయవలె నని సంకల్పించి యొకటిరెండించు మించులోఁ దమ సంకల్పము పూరించుకొనిరి. వానిలో నయిదాఱు నాటకములకు నఖండప్రశంస వచ్చినది. 'రాధాకృష్ణ' వీరి నాటకములలో నాయకరత్నము. దానియందు వీరి కవిత పండినది.

మెఱుఁగుఁగుండలముల మిసమిసల్ గండభా
గములపై నట్టిట్టు గంతులిడఁగ
రంగారుకటినుండి బంగారుపుట్టంబు
చిఱుబొజ్జనుండి కొంచెముగజాఱఁ
బవనపూరణమున జవుజవ్వుమని లేత
బుగ్గలు బూరెలై పూరటిల్ల
నిగనిగల్ గల గుజ్జుసిగ నున్న శిఖిపింఛ
మొయ్యారమునఁ దలయూఁపుచుండ

నుత్తమోత్తమజన్మమై యొప్పుమురళి
నధరమున మోపి జలుజల్లుమనఁగ జగతి
గానమును జేయుకల్యాణకాంతు లొలుకు
నీదువదనంబు జూపింపు నీరజాక్ష !

ఈపద్యమునఁ గవికి వేణుగానలోలుని విశ్వరూప మగపట్టినది. ఈ నాటక కర్తకు గోపాలబాలుని మురళీరవముపై నభిమానము. ఒక్కచో రాధ కృష్ణు నిట్లు ప్రార్థించినది.

సరసనంగీత మాధురీ సాధురీతి
నింక నొకసారి మురళి వాయింపుమయ్య
త్వన్ముఖామృతపూరంబు ద్రావుదాన
ఘనఘనాంబువు చాతకకాంతవోలె.

సుమధురము సుప్రసన్నము నగుభాషలో నాటకపద్యములు వ్రాయు నేర్పు పానుగంటి లక్ష్మీనరసింహారాయనికే చెల్లినది. తరువాత చిల కమర్తి లక్ష్మీనరసింహారాయనికే తగినది. అన్యుల కాశైలి యసహజము. వీరి నాటకములలోని సంభాషణములు సన్నివేశములు చాల సరసముగ నుండును. ఒక్కొక్కవిషయముద్రేకముతో రచింతురు. అట్టి సందర్భ ములయందు కొంత విరసముగనుండుటయుఁ దటస్థించును. పానుగంటి కవి సీసములు విశేషించి గీతములువ్రాయుచుండును. ఆగీతములు వచ నమువలె నడచుట వీరి కభిమతము. ప్రతిపద్యమున నుపమాన ముండి

తీరును. ఆయుపమలలోను నీచాధిక భేదములు పాటింపని యుపమలు. అందులకే వీరి పద్యములు పండితపామరరంజకములు. ఒకొ్కకచో వీరి హాస్యరసము వక్ర్తోడి పరిహాసాస్పద మగుచుండుటయుఁ గలదు. రాను రాను సాక్షి వ్యాసములలో నీగుణము మనకుఁ గనుపించును. కల్యాణ రాఘవము, పట్టభంగరాఘవము, వనవాసరాఘవము, విజయరాఘవము, రాధాకృష్ణ, సారంగధర, సరోజిని, నర్మదాపురుకుత్సీయము, విప్రనారాయణ ఇత్యాదులు పౌరాణికములు. ప్రచండచాణక్యము, చూడామణి ఇత్యాదులు చారిత్రకములు. కోకిల, సరస్వతి, వృద్ధవివాహము, మాలతీమాల, రాతిస్తంభము ఇత్యాదులు కల్పితములు. వీరి 'కంఠాభరణము' నాటక వాగ్దేవతకుఁ గంఠాభరణము. వీరికి బౌద్ధవాఙ్మయమునఁ గలయభిరుచికి 'బుద్ధబోధసుధ' నాటకమే సాక్షి.

పానుగంటికవి చాటూక్తి చతురుఁడు. 1922 లో ఆంధ్రసాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవసభకు వీరి నగ్రాసనాధిపతులుగా నెన్నుకొనిరి. అపుడు వా రుపన్యాసారంభమున నిటులు చెప్పిరి.

"......నేనుపండితుఁడనుగానని యీా యూరివా రెఱుఁగుదురు. పైగ్రామములవా రెఱుఁగుదురు. సాహిత్యహీనతలో జగమెఱిఁగిన వాఁడను గాని సాధారణుఁడను గాను. ఇట్టినన్నుఁ బరిషత్తువా రేల యెన్నుకొనవలయునో నాకుఁదెలియదు. తెలిసిన విషయ మేమిరో యంతకంటెఁ దెలియదు. వెనుక జరిగిన పదిపరిషత్సభలకుఁ బండితుల నెన్నుకొంటిమి గదా, యీాసారి యపండితు నెన్నుకొందము. ఇంతలోఁ జెడిపోవున దేమున్నదని యూహించి మార్పుకొఱకై నన్నెన్నుకొని యుందురేమో, ఎటులైన నేమి? అవిలంఘ్యమైన మహాజనులయాజ్ఞ తులసీదళము వలె శిరమున ధరించి యిట నిలువఁబడితిని......"

ఈ సంభాషణ మెంతయభిప్రాయ గర్భితము! లక్ష్మీనరసింహారావు గారు 'స్వీయచరిత్ర' వనవాస రాఘవ రచనము వఱకు వ్రాసికొని రని తెలిసినది. అది తుదముట్టకుండఁగనే వారుగతించుట తెలుఁగువారి దురదృష్టము.

# నాగపూఁడి కుప్పుస్వామయ్య

## 1865 - 1951

సామశాఖీయద్రావిడ బ్రాహ్మణులు. చిత్తూరుమండలములోని "చితతని"దరినున్న నాగపూఁడి వీరి నివాసము. తండ్రి యజ్ఞనారాయణ శాస్త్రి. జననము : 1865. నిర్యాణము : 1941.

కృతులు: ౧. భారతసారము ౨. భోజరాజీయము ౩. కాళహస్తీశ్వర శతకము ౪. స్తవరత్నావళి (సంస్కృతము) ౫. పారిజాతాపహరణ పరిమళోల్లాసము ౬. భాగవత,నిర్వచనోత్తరరామాయణాది ప్రాచీన గ్రంథముల పీఠికలు.

కుప్పుస్వామయ్యగారు విమర్శకాగ్రేసరులు. మదరాసులోని ఆనంద ముద్రాక్షరశాలాధికారులు వీరిచే గొప్ప సారస్వతసేవ చేయించిరి. వారు ప్రకటించిన భాగవతము, కంకంటి పాపరాజకృతోత్తర రామాయణము, నిర్వచనోత్తరరామాయణము మున్నగు ప్రాక్తన గ్రంథములను పాఠభేదములతో సరిచూచి నసిచేసి చక్కని పీఠికలు వ్రాసిన మహాశయులు వీరే. ఆంగ్లపద్ధతుల ననుసరించి యాంధ్ర గ్రంథముల కుపోద్ఘాతములు రచించినవారిలో కుప్పుస్వామయ్యగారిది యగ్రతాంబూలము. వీరి కావ్య-పురాణభూమికలు తరువాతవారి కొరవడి దిద్దె ననుటలో నత్యుక్తి లేదు. వీరి పాండిత్య-విమర్శకతా శక్తులను వేదము వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వేంకటరత్న ప్రభృతు లుగ్గడించిరి. శ్రీపీఠికాపురాధీశ్వరులు వీరిని గౌరవించిరి.

కుప్పుస్వామయ్య చెన్నపురి క్రైస్తవకళాశాలలోఁ జదివి పట్టభద్రులైరి. సంస్కృతాంధ్ర సాహిత్యము చాలవఱకు స్వయం సంపాదితము. నాఁడు తిరుపతి సంస్కృతకళాశాలాధ్యాపకులు పట్టిపల్లి నరకంఠీరవ

శాస్త్రిగారు, కాళహస్తి సంస్థానపండితులు శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారును వీరికి మిత్రులు. ఈకమ్మ యిందులకు దృష్టాంతము.

"సిరుల కిరవై, చదువులకుఁ గుదురై, యీవికిఁ దావలమై, దిట్ట తనమ్మునకు మనికిపట్టై, నీటునకుఁ జోటై, ఓరుపునకు మేరయై, ప్రేముడికి గీమై, నాణెములకుఁ దానకమై, పొంకంబులకుఁ డెంకియై, చల్లదనంబుల కిక్కై, మఱియు గొనమ్ముల కిమ్మై యిమ్మైఁ గ్రాలుచుఁ గతంబేనియు నాయెడం దద్దయుఁ బోరామి గారాములు నెఱపుచు వఱలు నాయనుఁగు నెయ్యునకు—శతఘంటము వేంకటరంగయ్య గారికి —"

నాగపూఁడి కుప్పుస్వామయ్య బి. ఏ.

పై నుదాహరింపఁబడిన యిరువురుశాస్త్రులవలనను నీయన తన సాహిత్యమునకు మెఱుఁగులు పెట్టుకొనెను. అసలు కుప్పుస్వామయ్యగారు 1918 దాఁక న్యాయవాదులై పేరు సంపాదించిరి. కాని, వారి కావృత్తి పై మనసులేదు. నిరంతరము భాషావ్యాసంగమే విహారరంగము. తిరుపతి సంస్కృతకళాశాలకు నాఁడు వీరు విచారణకర్తలుగ నుండిరి.

ఈవిమర్శకుని జీవిత మానందతుందిలమైనది. శిష్టానుష్ఠాన పరులు. శాంతహృదయులు. తెలుఁగన్నచో నెన్నరాని యభిమానము. వీరి కుటుంబములోని వారందఱు భారత భాగవతాదుల పారాయణముతోఁ గాలవ్యయము సేయుచుందురఁట. కుప్పుస్వామయ్యగారి భారత సారము, భోజరాజీయము నను వచనగ్రంథములు మధురశయ్యా బంధములు. "కవులకుగద్యము గీటురాయి" యని దండి పండితుని యాభాణకము. దానికిఁ దగినట్లుగా నీయన వచనధోరణి మంచియొంపుసొంపు వెడఁగులలో నుండెడిది. చిన్నయసూరివలె నీయనయుఁ జక్కని వచనరచయిత యని నాఁడు ప్రశంసించిరి. వ్యావహారిక వాద మీయన యాపాదింప

లేదు. ఉత్తరములుకూడ నీయన సలక్షణభాషలో రచించెను. సంస్కృతమున వీరి పాండితికిఁ దారకాణగా ‘ స్తవరత్నావళి ’ నారయవచ్చును. శ్రీ శృంగేరీ జగద్గురువులు - శ్రీ కుంభఘోణము జగద్గురువులును వీరి గీర్వాణవాణీప్రౌఢిమమునకు మెచ్చి గౌరవించిరి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి భారతమునకు వీరువ్రాసిన విపులభూమిక పరికింపఁదగినది. ఆనందముద్రాలయ, వావిళ్ళముద్రాలయ ప్రకటితములయిన పెక్కు కృతులు కుప్పుస్వామయ్యగారి పీఠికలతో నందగించుచున్నవి.

చెన్నపురి విశ్వవిద్యాలయమునఁ బ్రాచ్యవిద్వద్బిరుదపరీక్ష లుండ వలయునని పోరి పెట్టించినవారిలో మొదటివాఁడీ విమర్శకాగ్రేసరుఁడే. వీరిశిష్యులెందఱో వందలు నేఁడును చిత్తూరుమండలమున నుండిరనివాడుక.

ఆత్మశ్లాఘ నెఱుఁగని యీయన శిష్యులు వచ్చి “ మేము తమ శిష్యుల” మని చెప్పుకొనునప్పుడు “గురోస్తుమౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయాః” అని యనువారని విందుము. కాళహస్తి సంస్థాన ప్రభువులగు శ్రీ దామెర అక్కప్పనాయనింగారికి వీరు కొంతకాల మాంగ్లభాష గఱపిరి. ఈ నాగపూఁడివంశ మందారుని “పారిజాతాపహరణ పరిమళ వ్యాఖ్య” ఆంధ్రసాహిత్యమున కపూర్వభూష, వ్యాఖ్యానావతరణమున నీయన యనేక జ్ఞేయాంశములు వెలిబుచ్చిరి. ఇది వీరి పాండితికి స్ఫోరకము. అయినను, ఈ వినయవాదము వినఁదగినది.

తెలిసిన దానిని వ్రాసితిఁ  
దెలిసిన దని తలఁచి వ్రాసితిం దెలియక నా  
తెలియమిఁ బొలసిన నలుసులఁ  
దెలిపెద రని తలఁతు లెస్స తెలిసిన వారిన్.

---

# శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి

## 1866

వెలనాటి వైదిక బ్రాహ్మణులు. కౌశికసగోత్రులు, ఆపస్తంబ సూత్రులు. తల్లి: వేంకట సుబ్బ సోమిదమ్మ. తండ్రి: వేంకట సోమయాజి. జన్మస్థానము: ఎఱ్ఱగూడెమునొద్ద నున్న దేవరపల్లి. నివాసము:. రాజమహేంద్రవరము. విరచితగ్రంథముల సంఖ్య యించుమించుగా 200. అందలి ముద్రితగ్రంథములు కొన్ని:—౧ బొబ్బిలియుద్ధ నాటకము, ౨ వేణీసంహారము. ౩ కలభాషిణి. ౪ రాజభక్తి. ౫ భోజరాజ విజయము. ౬ శ్రీనాథ కవిరాజీయము (నాటకములు) ౭. గౌతమీ మహాత్మ్యము ౮. సత్యనారాయణోపాఖ్యానము ౯. గజానన విజయము ౧౦. శ్రీకృష్ణకవిరాజీయము ౧౧. సావిత్రీ చరిత్రము [పద్యప్రబంధములు] ౧౨. బ్రహ్మానందము [అచ్చతెనుఁగు కావ్యము] ౧౩. సంస్కృత కవి జీవితములు. ౧౪. కాళిదాస విలాసము. ౧౫. తెనాలి రామకృష్ణ చరిత్రము [వచనములు] ౧౬. శ్రీకృష్ణ మహాభారతము [అష్టాదశపర్వములు] ౧౭. శ్రీకృష్ణరామాయణము. ౧౮. శ్రీకృష్ణమహాభాగవతము [నేఁటి కముద్రితము] ౧౯. గణేశపురాణము – ఇత్యాదులు. ఈ కవిని గూర్చి విపుల విషయము తెలియుటకు అనంతపంతుల రామలింగస్వామి విరచితమైన 'శ్రీకృష్ణ కవిజీవితము' పరికింప వలయును.

అయిదాఱేఁడుల యీడునం బ్రతిదినం బా భారతామ్నాయమున్
నియమం బొప్పఁ బురాణము న్వినిచి నిర్ణిద్ర ప్రబోధాప్తి మా
యయ్యగా రర్థము సెప్పి తత్కథలు లో నంటింప నెంతేనియుం
బ్రియ మయ్యెంజుఁడి నాకు భారతముపై నిత్యానుబంధంబుగన్.

నేనాంధ్రంబునఁ గించి
న్మాన్యంబుగ నాకృతుల నున్నతి నొందం

గా నొనరించితి లోకము
వానిం జవిచూచి యెఱుఁగుఁ బలుకఁగనేలా!

అని, పదునెనిమిది పర్వములతో నిండిన మహాభారతము నొక్క-చేతిమీఁదుగా ననువదించి వెలువరించిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారివంటి భాగ్యవంతులు తెనుఁగు వారిలోఁ గంటికిఁ గనఁబడువా రరుదు. ఆశ్చర్యములపై నాశ్చర్యము మహాభారతమే కాక శ్రీమద్రామాయణము, భాగవతము కూడ శాస్త్రులుగారి చేతిమీఁద నాంధ్రీకరింపఁబడుట. భారత భాగవత రామాయణములు మూఁడును ముచ్చటగాఁ దెనిఁగించి యచ్చువేయించి సహస్రమాస జీవితోత్సవము జరిపించుకొనియు నదుము వంచని పండితులు కృష్ణమూర్తి శాస్త్రిగారు. మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు, కవి సార్వభౌములు నగు శ్రీపాద వారి శతాధికగ్రంథ రచనము కొందఱ కామోదము కలిగింప కున్నను భారత రామాయణా ద్యాంధ్రీకరణము మాత్ర మాశ్చర్యానందములు కలిగించిన దని చెప్పవచ్చును. వీరి తెనుఁగుసేఁత యథా మాతృకముగా సాగినది. తొల్లిటి కవిత్రయము పరివర్తనము సేయక విడిచిన భగవద్గీతాది ఘట్టములు సైతము శాస్త్రులుగారు తూచాలు తప్పక తెనిఁగించిరి. భారతాంధ్రీకరణములో నన్నయ తిక్కనలను మించి యౌచితిని చాటించితినని శాస్త్రులుగారి విశ్వాసము. కవిత్రయభారతము నందలి యౌచితీ సుందరత వేఱొక యాంధ్రగ్రంథముననే లేదని విమర్శకుల వ్రాఁతలు విమర్శనములు శాశ్వతముగా నుండవు. కృష్ణమూర్తి శాస్త్రులుగారు మహాభారత పీఠికలో నొకమాట చెప్పినారు.

నన్నయ తిక్కనాది కవినాథులకన్నను మిన్నగాఁ దెలుం
గు న్నుడువంగలాఁడ నధికుండను నేనని కాదు, గ్రంథమం

దు న్నరసుల్ గొలంతలును జోఁచునటంచని కాదు వెండియుం
బన్నట భారతేష్టతను బట్టిన చాపల మంచు నెంచుఁడీ.

శ్రీకృష్ణమహాభారతము పేరు కవిత్రయభారతము వెనుక సుస్థిరముగా నుండుననుటకు సందేహములేదు. భారతము వ్రాయుట మాటలతోఁ బనికాదు. భల్లూకపుఁబట్టు పట్టవలయును. ఏదేనొక మహోన్నత కార్యము తలపెట్టునపు డనేకాఘాతములు తగులుచుండును. అనేకాశయములు వెన్నాడుచుండును.

"ఆదరణీయసారవివిధార్థ గతిస్ఫురణముగా నౌచితిపోషణము చేసి కొనుచుఁ గవినాథులగు నన్నయాదులు మున్నె మహాభారత మనువదించి యాంధ్ర కవితాలోకమున నసశ్వరయశస్సు నార్జించుకొని యుండిరి. వాగనుశాసనుఁడగు నన్నయభట్టారకు నంతవాఁడుకూడ భారతాంభోనిధిని తుదముట్ట నీఁదలేఁడయ్యె. ఒకవేళ, మనమీ గ్రంథము పూర్వసుకృత బలమునఁ బూర్తిచేసినను గవిత్రయభారతమువలె రసికామోదము కలిగించునో, లేదో?"

ఇత్యాది ప్రశ్నములే తద్గ్రంథరచనారంభమునఁ బొడమి కవిమనస్సును గలఁచివైచుట సహజము. ఇదియననేల? ఏ మహోద్యమమందైన నిట్టి ప్రశ్నములేపుట్టి వ్యగ్రోత్సాహమును గొంత భగ్నమొనర్చు చుండుట తెలుచు. ఇట్టిస్థితిలో నీసంశయములు వేనికిని దాపీయక ధైర్యస్థైర్యములతో నక్షయదీక్షతో మహాభారత మంతయుఁ బదునైదేండ్లలో సమగ్రముగా ననువదించి చరితార్థులైన కృష్ణమూర్తి శాస్త్రిగారు వజ్ర సంకల్పులు. అరణ్యపర్వ రచనా కాలములో నీకవిరాజున కెన్నియో యిడుములు గలిగినవి. ద్రోణపర్వము వ్రాయుచున్నపు డిక్కవికి స్మరణీయమగు నొక విషాదఘట్టము.

అతికష్టంబుగ నిట్లు కాలమును ద్రోయంజాలి యున్నప్పుడున్
గృతినిర్మాణము మానకెట్లొ యిరుమూఁడౌ పర్వముల్ పూర్తిచే
సితి ద్రోణంబు దొడంగి యర్జుని వధంబున్ వ్రాయుచున్నప్డు నా
సుతునిం జెంద 'హతోఽసి మేసుత' యటంచున్ ఘల్లుమండేడిచెన్.

అది తెలిఁగించు నామనమునం దొకసందియ మావహిల్లె న
య్యదనున నాసుతా! యనక హాసుతయంచుఁ దెలుంగుసేయఁగా
మొదలిడినాఁడ; నాసుతుఁడు పొంత వసింపఁగ రాఁగ, నిప్పుడి
ప్పదనున నుండకించు నెడఁబాపుదు నైన దిగుల్మదిం బడెన్.

ఈసంశయముతో గ్రంథము రచించుచుండ దైవవశమున నీభారత కవి కుమారరత్నము 'సుదర్శనసుధి' యనునతఁడు స్వర్గతుఁడయ్యెను. ధైర్యశాలి యగు కవిరాజు గర్భశోకము డిగఁద్రావి భారతము సాంతము రచించెను.

శ్రీకృష్ణ మహాభారతమునకు రాజరాజ నరేంద్రుఁడు ముక్త్యాల సంస్థాన ప్రభువు శ్రీరాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదరావు. పాలకొల్లు వాస్తవ్యులు, వణిగ్వరులు నగు శ్రీరేపాక సత్యనారాయణ మూర్తి, శ్రీ చుండూరి నారాయణరావుగారలు భీష్మద్రోణపర్వములు, కర్ణశల్య సౌప్తిక స్త్రీపర్వములు మాత్రము కృతినొంది స్వర్ణాభిషేకముచేఁ గవిరాజును గౌరవించిరి. సంస్కృత మహాభారతము నన్నయభట్టారకాద్యాంధ్ర మహాకవిత్ర యాంధ్రీకృతమైన పిమ్మట మరల దానిని పద్యరూపముగ ననువదింప సాహసించి పరిపూర్ణముగాఁ గృతార్థులైనవారు వీ రొక్కరే. ఆంధ్రవ్యాసులని కొండాడఁ బడిన ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు 'ఆంధ్రమహాభారత నవనీత' మను పేరితోఁ బదుమూఁడు పర్వము లనువదించిరి. అం దాదిపర్వము మాత్ర మిటీవల నచ్చునకు వచ్చినది. శ్రీ తాడూరి లక్ష్మీనరసింహాకవి భారతాంధ్రీకరణమునకు దొరకొని

విరాటోద్యోగములు మాత్రము రచించిరి. అది నేఁటి కచ్చుకాలేదు. మతుకుమల్లి నృసింహకవి పితామహుఁడు మాధవకవి 'అభినవభారత' మను పేర భారత మాంధ్రీకరించె ననియు, నం దాదిపంచకము మిగిలి తక్కినది తాడిపర్తి గ్రామములోఁ దగులఁబడిన దనియుఁ దెలియు చున్న'ది. కవిత్రయభారతముతరువాత శ్రీకృష్ణభారతమే సంపూర్ణముగా రచింపఁబడి సమగ్రముగా ముద్రణమునకు వచ్చినది. నన్నయభట్టార కుఁడు గంటముపట్టి భారతరచనకుఁ గడఁగిన రాజమహేంద్రవరముననే కవిరాజు కలముపట్టి మహాభారతము పూర్తిచేయుట మెచ్చుకొనఁ దగి నది. శాస్త్రిగారి షష్టిపూర్తితో పాటు భారతరచనా పూర్తియు నగుట మఱియు మెచ్చుకోఁదగినది. ప్రాచీనభారతముతో శ్రీకృష్ణ భారతము కూడ రసికరంజన మొనరించుఁగాక! కృష్ణభారతకవిత యిటులు జాలు వాఱుచుండును.

ధృతరాష్ట్రుఁడు భీష్మపతనమునకు దుఃఖించు ఘట్టములోనివి:

చ. కురు వృషభుండు భీష్ముఁ డెటుకూలెనొ నేలకు నాశిఖండిచే
శరములచే హతుండయి విసంజ్ఞతనెల్లు వహించెనో సుతుల్
దొరనటు కోలుపోయి యెటు ద్రిమ్మరిలుచుండిరొ నీనుడు ల్వినం
గరము మదీయమానసము గంపమునొందెడు నార్తిఁగుందెడున్.

ఉ. ఎవ్వరతండు పాండవుల కేద్తెఁ ఱఁజూపుచుఁ దద్బలంబులం
ద్రెవ్వఁగనేయ నేఁగుతఱి ధీరతతో మునువోవఁ జాలిరో
యెవ్వరు వెంబడింజనిరొ యెవ్వరు వానికిఁ దోడుసూపిరో
యెవ్వరు వానిఁగ్రవ్వకొని యొప్పుడునుండిరొ చెప్పు సంజయా!

ఉ. వేఁడివెలుంగు పిండటుల వేయికరంబుల నూడ్చివచ్చిన
ట్లాడ కతండు శాత్రవుల యుబ్బరమెల్ల నడంచినైైచుచో

నేఁడు సమర్థుఁడై యెదుర నేయఁగ నుండెనొ పాండవేయు లే
పోఁడిమిఁ దాత కట్టివని పుట్టఁగఁజేసిరొ ముట్టఁజెప్పవే?

మ. పదినాళుల్ పడవాలుగా నిలిచి చాపంబూని కోపంబునం
బదులున్నూఱులు వేలుకోల లొకటంబాఱం బ్రయోగించుచుం
గదనంబుం బొనరించి శత్రుసమితింగారించి కారించి యా
పదినూనుండు ప్రశాంతుఁడయ్యె నకటా నా భాగ్యదోషంబునన్.

క. కాలాగ్నివోలెఁ బగఱం
దూలించుచుఁ గాల్చిపుచ్చి దుర మొనరించెన్
గాలికివిఱిగిన ప్రమాన్వోలెఁ
గూలెనఁటే నేల కతఁడు కుంఠితబలుఁడై.

వీరి కవితలోఁ దెలుఁగు పదములపాలు హెచ్చు. భావమున కంత గంభీరిమ లేకపోయినను, పద్యరచనములో మంచి ధారాళత గల తీరు కృష్ణమూర్తి శాస్త్రిగారికి నిసర్గజమైనది. కూర్చున్నవాఁడు కూర్చున్నటు లుండి లక్షలు పద్యములు రచించిన యీ కవిరాజు పట్టుదల తెలుఁగు కవుల కొకరొరవడి.

మొదటినుండియు శాస్త్రిగారికి శ్రీనాథునిపై నభిమానము మెండు. కవితారీతిలో శ్రీనాథునకు వీరికి నెంతోయంతరము. కొంతవఱకు శ్రీనాథుని జీవితముతో వీరిజీవితమున కున్న పోలిక నీపద్యము వెల్లడించుచున్నది.

గౌతమీ మాహాత్మ్యకర్త కంఠముఁజుట్టు
కొని యుండెనేగదా ఋణము చిలువ
కవిమిత్త్రి మేనెల్లఁ జవికించెనేగదా
యప్పులవారి వాక్యాయుధములు
శ్రౌతి మాన్యక్షేత్ర సమితి కొదువఁబెట్టఁ
బడెఁగదా వృషల సంభవునియొద్ద

అష్టశతావధా నాధ్యున కిప్పుడు
చేరియున్న దిగదా నీరసంబు
పేటలంకల పాట లీపాటు దెచ్చె
మాల పురువుల పాలయ్యె మఱిపోగాకు
అప్పు ముప్పదివేల రూప్యంబు లింక
నెట్లుదీర్చెడు శ్రీపాద కృష్ణమూర్తి.

ద్వితీయశ్రీనాథుఁడని శాస్త్రులుగారిని కొందరు ప్రశంసింతురు. కవిరాజ కవిసార్వభౌమాది బిరుదములు కొల్చుట, కనకాభిషేకముఁ బడయుట యివి యిందులకుఁ దార్కాణలు. అతనివలె నీఁతడు లంకవ్యవసాయము చేసి యుప్పులపాలాయెను. పయిపద్య మాసందర్భములోనిది. జీవితములో నిన్ని సన్మానములుచేయించుకొన్న కృష్ణమూర్తి శాస్త్రి గారు రెండవ శ్రీనాథుఁడే యనుటలో సంశయము లేదు.

1933 లో రాజమహేంద్రవరమున గౌతమీ గ్రంథాలయమునందు వీరికి జరిగిన గండపెండేరపుఁగానుకయు, నాఁటి సభామహోత్సవము తెలుఁగుచరిత్రములో నదృష్టమైన ప్రకరణములు. ఆసభకు యాజమాన్యము వహించిన శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కృష్ణమూర్తి శాస్త్రి డాకాలున గండపెండెరము నిందు పరిషత్తులోఁ దొడిగి తమ సహృదయతను వెల్లడించుకొనిరి. వేంకట శాస్త్రిగారివంటి శిష్యుఁ డుండుట శ్రీపాద కవికి దర్పకారణము. ఈ గురుశిష్యుల వాగ్వాదములు కొంతకాలమునకు దేశము మఱచిపోవును. ఇఁక మఱచిపోఁజాలనిది వారి శైష్యోపాధ్యాయిక. గండపెండెరము తొడిగించుకొన్న నాఁటి సభలో శ్రీపాద కవిరాజు చెప్పిన యీ పద్యము మహోదారమైనది.

శా. సాకిచ్చిన గండపెండెరమిలన్ సాత్వత్వ మేనాఁటికిం
గాకుండన్ విన్నుఁడేన ప్రాణములతోఁ గన్పట్టునందాఁక నా

డాకాల న్విలసిల్లు నెప్డుచెడకుండన్, దీని నాంధ్రావనీ
ప్రాకామ్యంబగు 'యూనివర్సిటి' వహింపంజెల్లు స్వత్వంబుగన్.

ప్రాచీనకాలమునఁ బెద్దనాది కవిపితామహులు పడసిన యిట్టి మహా మహిత సన్మానము లిపు డీకవిరాజు పొందుట యానందవిషయము. మఱియు నీయన స్వదేశసంస్థానములలోఁ గొన్నింట శతాష్టావధానములు ప్రదర్శించి సన్మానితులైరి. బంగాళా రాజధానిలో 'మయూరభంజ' (మహారోబంజి) పట్టణమునకుఁ బోయి యా సంస్థానాధీశుని ప్రేమాల సంస్కృతమున శతావధానము చేసి బహూకారము నందినటులు వారి చరిత్ర చెప్పుచున్నది. శాస్త్రులుగా రాయా సందర్భములలోఁ జెప్పిన సమస్యా పూరణములు, చాటువులు స్మరింపఁదగియున్నవి.

అవ్వాతాతా, డంకానగారా, రారా పోరా, మేనా సవారీ అను మాటలు వచ్చునటులుగా, ఊర్వశి యర్జునుంగోరి యతఁడు తనకు వశుఁడు గామింజేసి పడిన విరహమునుగూర్చి వ్రాయుమనఁగా శాస్త్రులుగా రిటులు వ్రాసిరి.

శా. ఆ పాకారి కుమారుఁడట్లు విభవం బవ్వారిగారాఁగ, రా
రాపోరా యను సందడిం బడు సుధర్మంజూచి నే నవ్వాతా
తా పాల్మాల వరింప కేగెనను వాఁ డంకానగారా కహా
మోహాలం బడితింజెలున్ మనుపరే మేనా సవారించితిన్.

"వడ్డాణ మలంకరించె వనితకుచములన్"— కులీరకుమారే కరివరిలునాతి పంచాననమ్" ఈసంస్కృతాంధ్ర సమస్యలకు కష్ణమూర్తి శాస్త్రిగారి పూరణము లుదాహరణీయములు.

క. వడ్డకులు పోరుచో భూ
రాడ్ధమ్మునను నుడువ నేఁగు రభసమ్మునను నా
నడ్డాకఁ దెగుడు మెడఁగొను
వడ్డాణ మలంకరించె వనితకుచములన్.

శ్లో. అహో మధుపసంచయః కవికులాధినాథం సదా
పదప్రచర ఉత్పతన్ హరిగతావధానస్థితమ్,
కరోతి యది చేత్తిరస్కృతి మిహాఘయుక్తే కథా
కుళీరకుహరే కరీ పరిలునాతి పంచాననమ్

బాలాత్రిపురసుందరీ దేవతోపాసకుఁ డగుటచే నీకవివరుఁ డన్నమాట విధిగా జరిగెడిదని కొన్నాళ్ళక్రిందటివాడుక. అదియటులుండ, శ్రీశాస్త్రులు గారు పత్రికాసంపాదకతచేఁ గొంతకీర్తి సంపాదించుకొనిరి. 'కళావతి' యను ముద్రణాలయమును మదరాసులో నెలకొలిపి పిమ్మట దానిని రాజమహేంద్రవరమునకు మార్చి యవిచ్ఛిన్నముగా దానిని పదియేండ్లు నడపిరి. 'గౌతమి' యను తెనుఁగుమాసపత్రిక 1908 లో నారంభించిరి. అది యొకయేఁడు నడచి యాఁగిపోయినది. వీరి వజ్రాయుధము, మానవ సేవ, వందేమాతరం అను పత్త్రికలు నాఁడు మంచి ప్రచారములోనికి వచ్చినవి.

ఈతీరునఁ బత్త్రికాసంపాదకులై, శతాధిక గ్రంథరచయితలై, భారత భాగవత రామాయణాంధ్రీకర్తలై, కవిరాజులై, కవిసార్వభౌములై, కళాప్రపూర్ణులై, మహామహోపాధ్యాయులై, ఆంధ్రవ్యాసులై, కన కాభిషిక్తులై, పూర్ణపురుషాయుషజీవులై విరాజిల్లుచున్న కృష్ణమూర్తి శాస్త్రిగారి సమగ్రజీవితము వ్రాసినచో మఱియొక మహాభారతము.

# కూచి నరసింహము

# 1866–1940

తల్లి: పుల్లమాంబ. తండ్రి: వెంకనార్యుఁడు. జన్మస్థానము కుంచెనపల్లి (కృష్ణాజిల్లా). నివాసము: పిఠాపురము. జననము 17–10–1866సం. నిధనము 7–10–1940 సం. గ్రంథములు: రూపలత, వనవాసి, గౌరాంగ చరిత్ర (2 భా) తెలుఁగుక్లాసుతమాషా, అగ్నేయాశుగములు, గ్రాంథిక భాష గ్రామ్యభాష. రామకృష్ణ పరమహంస చరిత్ర. ఆత్మనివేదనము, నానావిషయిక విరచనములు. వివేకానందస్వామి పౌరాణికోపన్యాస చతుష్కము, భీమప్రమోద ప్రహసనము, ఆదర్శ సుఖజీవనము – ఇత్యాదులు.

రాత్రి పదిగంటలవేళ సాలువఁ గప్పికొని చేతికఱ్ఱ పుచ్చుకొని మెల్ల మెల్లఁగ విద్యార్థులు చదువుకొనుగదులకడకు వచ్చి యెవరు చదువుచుండిరో, ఎవరు చదువుటలేదో బారెఁడుదూరమున నుండి పరిశీలించి, మరునాఁడు పాఠశాలకు వచ్చినపుడు విద్యార్థుల నొక్కొక్కరిని పిలచి "నాయనా! రాత్రి నీ వెన్ని పొగచుట్టలు తగులబెట్టితివి" అని చమత్కార గర్భముగ నడుగుచు, మొగమువాచునట్లు చీవాట్లు పెట్టుచుండువారఁట కూచి నరసింహము పంతులుగారు. ఉపాధ్యాయులలో నింత చండశాసనుఁ డుండఁడని వారి శిష్యులవలన వినికి. ఆయన యనపత్యుఁడు. శిష్యసంతానమే వారి సంతానము. విద్యార్థుల పురోఽభివృద్ధికి, వారి విజ్ఞానాభివృద్ధికి బంతులుగారనేకవిధములఁ బరిశ్రమించెడివారు. నయముననో భయముననో విద్యార్థుల నుద్ధరించుటయే ప్రధానాశయముగఁ బెట్టుకొనినారు. వీరు పెద్ద తరగతివారికంటెఁ జిన్నతరగతివారికే యెక్కువశ్రద్ధ తీసుకొని పాఠము చెప్పుచుండువారు. పునాది దిట్టముగ నుండినఁగాని గోడ నిలఁబడ దని వీ రెఱుఁగుదురు. పిఠాపురోన్నత పాఠశాలను ప్రశంసించుచు 1907 లోఁ జెన్నపుర పరీక్షా

శాఖాధికారులు యోగ్యతాపత్ర మొసఁగిరన్న సంగతి తెలుఁగువారింకను మఱచియుండరు. మన నరసింహము పంతులుగారి ప్రధానోపాధ్యాయత్వమే యీ పాఠశాల కీ గౌరవముఁ దెచ్చినది. పంతులుగారు పనిచేయుచున్నపుడు మెట్రిక్యులేషన్‌లో నూటికి నరువదిడెబ్బదివఱకు నుత్తీర్ణులసంఖ్య పెరిగినది. పంతులుగారు విద్యార్థులను పైతరగతిలోనికిఁ బంపుట కెంతకార్కశ్యము కనఁబఱచెడివారో, దానికిఁ బదిరెట్లు తీర్పులను జేయుటలోఁ గారుణ్యము కనఁబఱచెడివారు. వీరికి శిష్యులయం దెట్టి యాదరమో, వీరిపై వీరి శిష్యుల కట్టి భక్తి గౌరవములు. వీరి శిష్యులు నేఁడు మహాపదవులలో నుండి గౌరవింపఁబడుచున్నారు.

1938 లో నొకమారు పంతులుగారికిఁ గొప్ప జబ్బుచేసినది. అది తెలిసికొని కాకినాడనుండి ముగ్గురు శిష్యులు రాత్రికి రాత్రి బయలుదేఱి వచ్చి వీరి చేతిలో నూఱురూపాయలు పెట్టి 'తమ రివి స్వీకరింపక తప్పదు. మాప్రార్థనము విని నిఘంటుకార్యాలయములో నింకఁ బని చేయవలదు. నిరంతర భాషావ్యాసంగమే మీ యనారోగ్యమునకు హేతువు' అని చెప్పి వెళ్ళిపోయిరఁట. శిష్యప్రేమ యిట్టిదని పంతులుగారు మాటలవరుసలో నీవిషయము చెప్పిరి.

ఎలమంచిలి, నూజవీడు, నరసాపురము పాఠశాలలలోఁ బ్రధానోపాధ్యాయులుగా నుండి పిఠాపురాంగ్లపాఠశాలకు వచ్చి యచటఁ బెక్కువత్సరములు పనిచేసిరి. 1920 లో శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున బండితులుగాఁ బ్రవేశించిరి. వార్ధకదశచే నదియు నిర్వహింపలేక 1938 లో మానివైచిరి. నిఘంటుకార్యాలయమున వీరు చేసినకృషి యమూల్యమైనది.

పిఠాపురాధీశ్వరులు గంగాధర రామారావుగారు పంతులుగారికఁ జదువు చెప్పించి వీరి యభ్యుదయమునకు సర్వథా తోడ్పడిరి. 1888 లో

బి. ఎ. ప్రథమశ్రేణి నుత్తీర్ణులైరి. నరసింహము పంతులుగారి వంటి శ్రీరామభక్తుని మఱియొకని మనము చూడము. ఆయన గ్రంథము లన్నియు రామాంకితములే చేసెను. పంతులుగారి యభిమానవిష యము వేదాంతము. కళాశాలలో వీరి గురువులు కందుకూరి వీరేశ లింగముగారు, మెట్కాఫ్‌దొరగారు, విలియమ్స్‌పిళ్ల మున్నగు వారు. కవితాగురువులు వీరేశలింగ కవిగారేయఁట. ఈ సంగతి పంతులుగారు తమ 'రామకృష్ణ పరమహంస చరిత్రము' న నిటులు చెప్పినారు.

అందఱును నన్ను నరసింహ మంద్రు; కవిత
యందు నాసక్తిఁ బుట్టించినట్టి గురుఁడు
కందుకూరి వీరేశలింగ కవిమౌళి
స్థితిగతులు నీకు విన్నవించితిని రామ!

వీరేశలింగము పంతులుగా రొకనాఁడు బడిలో "ఆటవెలఁది" లక్ష ణము విద్యార్థులకు చెప్పి నల్లబల్లమీఁద నీరెండుచరణములును వ్రాసి యెవ్వరైన నిది పూరింపఁగలిగినఁ బూరింపుఁ డనిరఁట.

ఆటవెలఁది మీర లారసి చేయుఁడీ
చేయుకున్న మీకు సిగ్గుపాటు

దీనిని మన పంతులుగా రిటులు పూర్తిచేసిరి.

సిగ్గు లెన్నియున్నఁ జెదరిపోవునుగద
ఆటవెలఁది పొంత నార్యులార!

చూచితిరా, పూరణములోని చాతుర్యము! పువ్వుపుట్టినతోడనే దాని పరిమళమునుబట్టి యిది యీ జాతిపువ్వని కనిపెట్టవచ్చును.

పీఠికాపుర సంస్థానాశ్రయణము పంతులుగారికిఁ గవులలోఁ బెద్ద పేరు తెచ్చినది. వీరువ్రాసినగ్రంథములు చాలఁ బాఠ్యములుగా నిర్ణయింపఁ బడినవి. 1904 లో శ్రీ రామకృష్ణ పరమహంస చరిత్రము పద్యకావ్య

ముగ నావిష్కరించిరి. ఈ కబ్బమునఁ గవిత్వమునుగూర్చిన తమ యభి ప్రాయము నిటులు వెల్లడించికొనిరి.

మాణిక్యమకుటంబు మౌళిపైఁ దూఁకింప
రాజ్యంబునేలెడు రాజుకంటె
లలితలావణ్య విలాసినీ వక్షోజ
పరిరంభ సౌఖ్యానుభవునికంటె
సతతంబు నానంద సాగరాబ్ధిలోఁదోఁగు
భర్మహర్మ్యస్థ సంపన్నుకంటె
ధనపరోఁరూప సంతానాది భాగ్యాళిఁ
దనియు సంతుష్టుఁడౌ ధన్యుకంటె
మధురమృదువాక్యసంపద మనసుగరఁచు
కవిత యుబ్బిన కవిరాజు రెక్కువయటంచు
నెంచెదరుగానఁ దత్సుఖ మెంతసుఖమొ
స్వానుభవమునఁ గనుఁగొనఁ బూనవలదె.

శిశిరకుమారఘోషు ఆంగ్లములో రచించిన దానినిబట్టి 'గౌరాంగచరిత్రము' పద్యకావ్యముగఁ బంతులుగారు వంతరించిరి. పద్యకావ్యముతో గాక 'వనవాసి' 'రూపలత' మున్నగు నాటకములు వచనకృతులును నెక్కువరచియించిరి. మొత్తము వీరికృతులలో నాంగ్లానుకరణములను నెక్కువయనవచ్చును. ఈయన గ్రాంథికభాషా ప్రియుఁడు.

ఇన్ని చూచియే కూచి నరసింహమును, పానుగంటి లక్ష్మీనరసింహారావును, చిలకమర్తి లక్ష్మీనరసింహమును గలిపి 'సింహత్రయ' మని వ్యవహరించిరి. ఈ సింహత్రయమును పీఠికాపుర సంస్థానము భరించినది.

# చిలకమర్తి లక్ష్మీనరసింహము

## 1867-1946

ఆరామ ద్రావిడశాఖీయులు. కాశ్యపసగోత్రులు. ఆశ్వలాయన సూత్రులు. తల్లి: రత్నమ్మ. తండ్రి: వెంకయ్య. జన్మస్థానము : ఖండవల్లి. నివాసము : రాజమహేంద్రవరము. జననము : 26-9-1867 సం. (ప్రభవ సం॥ భాద్రపద బ॥ చతుర్దశి రాత్రి) - నిర్యాణము : 1946 జూన్ 17 వ తేదీ. కవికర్తృక గ్రంథములు మొత్తము సంఖ్య 90. రఘుకులచరిత్ర, స్వప్నవాసవదత్తము, సౌందర్యతిలక; హేమలత, భారతకథామంజరి, సర్వశాస్త్రార్థ సంగ్రహము, కృష్ణవేణి, సుధాశరచ్చంద్రము, అహల్యాబాయి, ప్రసన్నయాదవనాటకము, పారిజాతాపహరణము, పార్వతీనాటకము, మణిమంజరి, సువర్ణగుప్తుఁడు, నానకుచరిత్ర, నందనచరిత్ర, కర్పూరమంజరి, వినోదములు, వాల్మీకిరామాయణసంగ్రహము, గయోపాఖ్యానము, గణపతి, ప్రచ్ఛన్నపాండవము, గ్రీకుపురాణకథలు, మహాపురుషుల జీవితములు, మధ్యమవ్యాయోగము, వేమనకవి, రామచంద్రవిజయము, రాజా రామమోహనరాయి, రాజారత్నము, రాజస్థానకథావళి, స్వీయచరిత్రము, ఇత్యాదులు.

గయోపాఖ్యానము తెలుఁగులో బహుజనామోదము బడసిన నాటకరాజము. ఆంధ్రుల కీనాటకముపై నసాధారణాదరము కల దనుట కది నేఁటికి లక్షపైఁ బాతిక వేల్ప్రతు లమ్ముఁడుపడియుండుటయే తార్కాణ. రంగస్థలములపై రక్తికట్టునాటకములలో నిది మొట్టమొదటిది. గయోపాఖ్యానము చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు తమ యిరువది రెండవ యేఁట రచించిరి. ఈనాటకమే కవిగారిని మహాకీర్తిసంపన్నులను గావించినది. శ్రీకృష్ణుని సందేశముగొని యక్రూరుఁ డర్జునునితో "నీతో ముఖ్యముగా నీబావ చెప్పుమన్న సందేశము వినుము" అని యిట్లు చెప్పెను.

ప్రాతచుట్టాల మని నొక్కి పలుకు మనియొ
నొరులకై పగఁబూనుట యొప్పదనియొఁ
బడుచుఁదనపుబింకమ్ములు విడువు మనియొఁ
దలకు మీఱినపని చేయఁదగని దనియొ.

దీనికిఁ బత్యుత్తరముగా యుధిష్ఠిరుఁడు 'సీ. నళినగర్భుని గన్న నారాయణుఁడు తాను బాంధవుండగుట మా భాగ్య మనుము... గయునిక్షమియించి పార్థుని గావు మనుము.' అని వచించెను. ఆనమయమున నర్జునుఁడుకూడ బావ కిట్లు ప్రత్యుత్తర మంపెను.

"అతిరాగంబు సుభద్రపైఁ బొడము నన్యస్త్రాన్యకామస్థితిఁ
మతి యొక్కింతయుఁ బ్రాజ్యరాజ్యపదవిన్యస్తంబుగాకుండ నే
యతిగానుండినవేళలం బిలిచి నెయ్యంబొప్ప నక్క సోదరీ
పతిఁగాఁ జేసిననాఁటి మేటికృప నాపైఁ జూపవే శ్రీహరీ!

ప్రాణంబులు మాయధీనము చేసిన విపన్నుని బగతున కొప్పగించి శరణాగతత్రాణ బిరుదాంకమగు భరతవంశమునకుఁ గళంకము తేఁజాల నని మనవిచేయుము." ఈగద్యపద్యముల సొగసు పరికించితిరా?

సుభద్ర యర్జునుని గావుమని శ్రీకృష్ణునితోఁ జెప్పినది. అప్పు డతఁడు రోషావిష్టుఁడై చెల్లెలితో "ఔను, తప్పు నీమగనిది కాదు. నాదే-

నీనాథునకు నేను మేనమఱందినై
యుదయంబు నొందుట యొక్క తప్పు
అన్నయానతిఁ ద్రోసి యామహాత్మునకు ని
న్నుద్వాహ మొనరించు టొక్క తప్పు
ఖన్ననాఁటనుగోలెఁ జెలిమిమై వారికి
నుపకారము లొనరించు టొక్క తప్పు

గర్వితమతి వారు గావించు దౌష్ట్యంబు
నొప్పగించుట యొక్కతప్పు
ఒప్పులేమేను చేయుట యొక్కతప్పు
తప్పు చేయకయుంటయే గొప్పతప్పు
అన్నితప్పులు మాయందె యున్న వబల!
తలచి చూడఁ బార్థునియందుఁ దప్పుగలదె?"

అనెను. ద్రాక్షాపాకముతో, సుప్రసన్న శైలితో, సుమధురముగా నాటకపద్యములు నడపించుటలో లక్ష్మీనరసింహముగారిది గొప్పశక్తి. గయోపాఖ్యానమున కృష్ణార్జునుల క్రోధసంభాషణము చదువదగినది. 'సీ. నీచముచ్చము నాక రాచపాడి దొలంగి బిడియ మించుక లేక బిచ్చ మెత్తి...మీసహోదరులకు సాటి మీరె సుమ్ము.' అని కృష్ణుఁ డధిక్షేపించెను. 'సీ. అల్లుఁడారమ్మని యాదరమ్మునఁ బిల్వఁబంపు మామనుబట్టి చంపఁగలమె?' ఇత్యాదిగా నర్జునుఁ డాక్షేపించెను. ధీరోదాత్తులగు కృష్ణార్జునుల సంభాషణము హద్దుమీఱియున్నను గయోపాఖ్యానము సముచితవర్ణనాకరమై మనోహరముగ నున్నది. కనుకనే తెలుఁగున నీనాటక మింత ప్రశస్తి కెక్కినది.

లక్ష్మీనరసింహకవిగారు నాటకరచనలో నెట్టిదిట్టలో నవలారచనలో నంతకంటె నధికులు. వీరు కందుకూరి వీరేశలింగకవివలె నాంగ్లేయ గ్రంథానుసారముగఁ గాక చాల భాగము స్వతంత్రముగా నవలలు రచించిరి. వీరి చరిత్రాత్మకకథలలో కర్పూరమంజరి, కల్పితకథలలో గణపతియు నుత్తమస్థానము నలంకరింపఁదగిన రచనలు. కథనచాతుర్యము, కథాసృష్టి, రసపుష్టి గల గద్యరచనమున వీరు సిద్ధహస్తులు. లక్ష్మీనరసింహకవి హాస్యరసాదరము కలవాఁడు. వీరేశలింగముగారి హాస్యరచనయు, పానుగంటికవి హాస్యరచనయు కొంచెము మోటుమార్గమున

నడచినవి. చిలకమర్తికవి దట్టిదికాదు. మార్దవము తప్పని హాస్యముతో నీలక్ష్మీనరసింహకవి యెనుబదిమూఁడు ప్రహసనములు వ్రాసి ప్రకటించెను. జయంతి రామయ్యపంతులుగారు చెప్పినట్లు "వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము గిలిగింతలు పెట్టి నవ్వించును. వీరేశలింగముగారి హాస్యము గిల్లి బాధించును."

లక్ష్మీనరసింహముగారి "గ్రంథప్రకటనము" అను ప్రహసనమునుండి వారి హాస్యరచనకుఁ గొన్ని పంక్తులుదాహరించెద. "వెక్కిరింతల వెంకటప్పు" తాను రచించిన "వెట్టిపప్పీయ" మను గ్రంథముయొక్క ఔత్కృష్ట్యము ప్రకటించుచు నాగ్రంథమునుగూర్చి యిద్దఱుపండితులు లిచ్చిన యభిప్రాయములఁగూడఁ బ్రకటించినారు. నాఁటిలో మహామహోపాధ్యాయ కొంకనక్క గురులింగశాస్త్రిగారిట్లు వ్రాసినారు.

"మీ వెట్టిపప్పీయమును నేను సమగ్రముగాఁ జూచితిని. కాళిదాస, భవభూతి, మయూర, వ్యాస, వాల్మీకుల కవిత్వములకంటె నిందలికవిత్వము వేయిరెట్లధికముగా బాగున్నది. ఇందలి పద్యములు గారిముక్కలవలె నెంతో రుచిగా నున్నవి. వీనికి అల్లపుపచ్చడివలె చిన్నవ్యాఖ్యానముకూడ గ్రంథకర్తగారే రచించినందున సర్వజనగ్రాహ్యమైయున్నది. ఇట్టిగ్రంథము జన్మమెత్తి చూచి యెఱుఁగను. ఇఁక ముందు చూడఁబోను. ఇంకొకజన్మమునకుఁగూడఁ జూడఁగలనని నమ్మకము లేదు. ఇందలి వీరరసపద్యములు రెండు చదువఁగానే నా కావేశమెత్తి గొడ్డుగుకామతో నాభార్యను మెత్తగా మర్దించితిని. మీగ్రంథమందలి పైరెండుపద్యములను నేను చదువుచుండఁగా దగ్గరనుండి విన్న మా నీళ్ల బ్రాహ్మణుఁడుకూడ ఆరసము గ్రహించి కావడిబద్ద తిరగవేసి నన్ను వెన్నుపూస విరుగునట్లు కొట్టెను. కాఁబట్టి యీగ్రంథ మందఱు చూడఁదగినది

ఈ విధముగా నప్రయత్న ప్రహసనరచనాకౌశలము చిలకమర్తి కవి కలవడినది. లక్ష్మీనరసింహముగారు బహుచమత్కారభాషి. మాట మాటకుఁ జమత్కారము చూపి మాటాడుటలో వీరిది మేనమామ పోలిక. సుప్రసిద్ధపండితులైన పురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారు లక్ష్మీనరసింహకవికి మాతులుఁడు. వారి మాటనేర్పు నాంధ్రమండలిలోఁ జాలమంది యెఱుఁగుదురు.

లక్ష్మీనరసింహకవిగారి ధారణాబల మసాధారణము. తమ కుటుంబములోఁ గాని, తా మెఱిఁగియున్న బంధుమిత్రకవి కుటుంబములలోఁ గాని; యెవరే నాఁ డెన్నిగంటల యెన్ని నిమిషములకు జన్మించినదియు - ఎవ రెప్పుడేమేమి యొనరించినదియు మున్నగువిషయములు చెప్పుచు నత్యాశ్చర్యము గలిగించుచుఁ జక్కని ప్రస్తావనము సేయుచుందురు. వీరి ధారణాశక్తికి 1897 సంవత్సరమునాఁడు జరిగిన చిన్నకథ యిది.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు అతిప్రయత్నముమీఁద తంజావూరునుండి నాచనసోమనాథుని "ఉత్తరహరివంశము" సంపాదించి తెచ్చి రాజమహేంద్రవరములోఁ బ్రథమముద్రణము వేయించుచుండిరి. ఆసందర్భమున మన కవిగారు ఆముద్రాలయమున నున్న "ప్రూఫు రీడరు" నొద్దకుఁ బోయి యేనాఁటికానాఁడు మెల్లమెల్లఁగా ప్రూఫు కాగితము లింటికిఁ గొనివచ్చుచుఁ గవితాప్రౌఢత కబ్బురపడుచు హరివంశమంతయు నించుమించుగ ధారణపట్టిరి. గ్రంథముద్రణము పూర్తి కాఁగా వీరేశలింగముపంతులుగారు లక్ష్మీనరసింహముగారి కొకప్రతి యీయఁబోయిరఁట. అంతట మన కవివరుఁడు సోమనాథుని కవిత్వము నుగ్గడించుచు గ్రంథములోని పద్యములెన్నో గబగబ చదివి యుపన్యాసరీతిగా విశేషములు వెల్లడింప మొదలుపెట్టిరఁట. అది విని వీరేశలింగముగా రాశ్చర్యభరితులై 'ఉత్తర హరివంశము' ప్రాచీనపుఁ బ్రతి

మీయొద్ద నేదైనఁగలదా ? యని యడుగ "దమ రనుగ్రహించినదే" యని సమాధానముచెప్పి జరిగినకథ వెల్లడించిరఁట.

ఇంతకును జెప్పఁబోవున దేమన ? ఏనాఁడో యట్లు ధారణపట్టిన పద్యములు నేఁటికిని వారు చదువుచుఁ బ్రాచీనకవుల కవిత్వ విశేషములను శ్లాఘించుచుందురు.

పంతులుగారు గొప్ప యుపన్యాసకులు. వీరి యుపన్యాసము దూరాన్వయములు లేక మృదువుగానుండి హాస్యరస ప్రచురములగు నుదాహరణములతో శ్రోతల కానంద మొదవించును.

వీరు 'మెట్రుక్యులేషన్' పరీక్షలోఁ గృతార్థులై యాంగ్లసారస్వతమును లెస్సగా నెఱిఁగిరి. గురుశుశ్రూష చేసి సంస్కృతభాష నభ్యసింపక పోయినను నేత్రావరోధము వాటిల్లినతరువాతనే భాసకాళిదాస భవభూత్యాది సంస్కృతకవుల రచనలు చదివించి స్వారస్యములఁ దెలిసికొని భాసనాటకచక్రము (13 నాటకములు) మధురరీతి నాంధ్రీకరించి తమ యనల్పప్రతిభ వెల్లడించికొనిరి. కొన్నిపట్ల వీరి తెలుఁగునేత మూలానుకూలముగ నుండకున్నను నాటకరచనలో సిద్ధహస్తులగుటచే భాసనాటకాంధ్రీకరణము మనోహరముగా నున్నది. సీసపద్యముల దిగువ నెత్తుగీతములు లేకుండ వ్రాసిరి. ఇది క్రొత్తపద్ధతి.

హోమర్ (గ్రీకుజాతీయకవి), మేధావిభట్టు, కుమారదాసుఁడు, మిల్టను మున్నగు మహాకవులవలె లక్ష్మీనరసింహముగా రంధులయ్యును అంతరహస్యములు ప్రతిభాబలముచేఁ బ్రత్యక్షీకరించుకొని కవిత్వము చెప్పిన మహాకవులు. వీరు కొన్నిపద్యములు మనఃఫలకముమీఁద వ్రాసి దాఁచుకొని యెవరైన లేఖకు లున్నపుడు వెల్లవేసినపద్యములు చెప్పుచున్నట్లు చెప్పి వ్రాయించుచుందురు. ఇట్లే వీరు లెక్కలేనన్ని గ్రంథ

ములు వ్రాసిరి. లక్ష్మీనరసింహకవి జ్ఞానైకచక్షుష్కుఁడు. వీరికి 40 వత్సరముల యీడు వచ్చువఱకు సంపూర్ణనేత్రావరోధము కలుగలేదు. 1909 నుండి మాఱెను. 'కృపాంభోనిధి' నీకవి యీవిధముగఁ బ్రార్థించుచున్నాఁడు :

అన్నా ! నీదగుమూర్తి యెట్టిదియొ జాత్యంధుండు కాలాద్యవ
చ్ఛిన్నంబై జగదేకపూర్ణమగు నీ చిన్మాత్ర దివ్యాకృతిం
గన్నారం గనుఁ బుండరీకదళసంకాశ స్ఫురన్నేత్రుఁడున్
నిన్నుం జూడఁగలేఁడు చిత్ర మిది తండ్రీ! సత్కృపాంభోనిధీ!

అందలి యమృతనిష్యందులగు పద్యములు మఱికొన్ని:

శా. తోలుంగన్నులు చూడలేవుగద విద్యుత్కోటి భాస్వత్ప్రభా
జాలాతీత జగత్ప్రపూర్ణ ఘన తేజోరాశి నీమూర్తి నిన్;
నాలోఁగన్నయినం గనుంగొను నటన్నన్ జ్ఞాననేత్రంబు లే
నేలే; దేగతి నిన్నుఁజూడనగుఁ దండ్రీ సత్కృపాంభోనిధీ!

మ. బలిమిన్ రబ్బరు లాగ సాఁగి మొదటన్ స్వస్థానముంజేరు నా
వల, నట్లే బలిమి న్మనస్సును భవత్పాదద్వయి న్నిల్ప నా
స్థలమందయ్యది నిల్వ కెప్పటియటుల్ దార్గత్యముం జెందు, ని
ష్ఫలమా నాజతనం, బిఁకేమిగతి దేవా! సత్కృపాంభోనిధీ!

శా. ఆకుంబచ్చల పళ్లెరంబులఁ బ్రవాళాలి న్నివాళుల్ తగన్
నీకర్పించి, విహంగనాదమను మేల్గీతంబులం బాడి, తా
మేకాలంబును బూలు కాన్కలిడి తండ్రీ! భక్తివృక్షాంగనల్
నీ కాత్మీయకృతజ్ఞతం దెలిపెడు న్నేర్మిన్ కృపాంభోనిధీ!

మ. గగనం బద్భుతలీల నీదగు నిరాకారత్వమున్ గాలి నీ
దగు విష్ణుత్వము, నీరు నీకరుణ, దీవ్యద్వహ్ని నీ తేజు నీ
దగు శాంతిన్ ధర చాటుచున్నయవి, యాహా! పంచభూతంబులే
పొగడు న్నీగుణరాజి వందులయి శంభూ! సత్కృపాంభోనిధీ!

వర్ధమానులగు యువకవుల నాదరించి వారి నేదో విధముగ నభివృద్ధిలోనికిఁ దీసికొనిరాఁగోరు దయాహృదయులువీరు. వీరిమనను కడుమెత్తన. సజ్జనశబ్దమునకు లక్ష్మీనరసింహముగారు సరిపడిన యుదాహారణము. "మృదుళం నవనీతమిూరితం నవనీతాదపి సజ్జనస్య హృత్,"

పేదవారల కెందఱకో వీరు చదువులు చెప్పించిరి. నిరుద్యోగుల నెందఱనో వాక్సాహాయ్యముచే నుద్యోగుల నొనరించిరి. వీరు కేవల కవులే కాక వీరేశలింగముగారివలె సంస్కరణాభిమానులు; దేశసేవకులు. దేశమాత, మనోరమ మొదలగు పత్రికలు ప్రచురించి దేశభాషాసేవ గావించిరి. వీరేశలింగము పంతులుగారి సంస్కరణోద్యమ మందును, వారి భాషాసేవయందును వీరి కనుపమానమగుభక్తి. సర్వవిధముల వారి యుద్యమములను తృణ్ణముచేసినవారు వీరే. కందుకూరివారు ఖడ్గవాదులు. చిలకమర్తివారు కార్యవాదులు. ఇది యీ యిర్వుర కును గలతారతమ్యము. 'లక్ష్మీనరసింహముగారిది యీమతము' అని చెప్పుట కష్టము. ఆయన సంస్కారవాదులగు వీరేశలింగకవిగారికిఁ గుడిభుజముగఁ బనిచేసిరి. పీఠికాపుర ప్రభువులతోఁ జెలిమి పాటించిరి. దేశనాయకుఁడు టంగుటూరి ప్రకాశముపంతులుగారిని గౌరవించిరి. 'అన్యుల మనమున్ నొప్పింపక తా నొవ్వక తప్పించుక తిరుగువాఁడు' కాన లక్ష్మీనరసింహకవిగారి సేవివయమునను నాక్షేపించువారు లేరు.

చిలకమర్తికవి యార్జనము లక్షలు దాఁటినది. గ్రంథముల వలన నింతసంపాదనము చేసినవారు తెలుఁగువారిలోఁ దక్కువ.

మఱియొకవిషయము. 1907 లో వంగదేశమునుండి 'విపినచంద్రపాలు' అనునాతఁడు వచ్చి 'గోదావరీమండలమహాసభ'లో నుపన్యసించుచుండెను. ఉపన్యాససందర్భమున ఆశువుగ లక్ష్మీనరసింహముగారీపద్యము చదివిరి.

భరతఖండంబు చక్కనిపాడియావు
హిందువులు లేఁగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరిగొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.

నాఁడు కొన్నినాళ్లీగీతము చదువనివారు లేరు. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు తెల్లవారను = తెల్లవారఁగా, అను నర్థము చెప్పి ప్రభుత్వము నోదార్చిరి. అప్పుడే వీరిపేరు మాఱుమ్రోగినది. బహుజనముచే నాదరింపఁబడు కవితయే కవిత. అదియే శాశ్వతముగా నిలుచును. మన చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పద్య మొక్కటైన కంఠపాఠము చేసికొననివారు తెలుఁగువారిలో నుండరు.

తుహినాద్రిమొదలు సేతువుదాఁక రాజ్యంబు జరిపె నీయాంగ్లేయ దొరతనంబె, జాతిమతాచార సర్వస్వతంత్రముల్ నెఱపె నీయాంగ్లేయ దొరతనంబె, ఇత్యాది స్తుతులతో 1895 లో చిలకమర్తి కవి పద్యములు రచించెను. ఆ చిలకమర్తి కవి మఱలఁ గొన్నేండ్లు గడచిన తరువాత నాంగ్లేయప్రచురణసంస్థ వారొకరు వాచకములు వ్రాసిపెట్టుఁడని వేఁడఁగా "ఆంగ్లేయులు మనదేశములోనిగనులవలనను, టీ కాఫీలవల్లను, రైలుబండ్లవల్లను, మరి యితరసాధనముల వల్లను ధనమంతయు పట్టుకొని పోవుచున్నారు. తెనుగుదేశములో పుట్టి తెనుఁగుముక్కలు నాలుగు వ్రాయనేర్చిన మనము తెనుఁగుపుస్తకములవల్ల వచ్చు లాభము అనుభవించకుండ నదికూడ నాంగ్లేయులకే యీవలెనా? నేనెన్నఁడు నింగ్లీషు కంపెనీలకు గ్రంథములు వ్రాసి యీయను. స్వదేశీయు లెవరేని చేరి యొక కంపెనీ పెట్టినయెడల వారికి వ్రాసియిచ్చెదను. లేదా, నాకు నేనే వ్రాసికొనెదను." అని చెప్పివైచెను. ఈ విధమైన దేశాభిమాన మభినందనీయము.

నవలారచనమునను, నాటకకర్తృత్వమునను, ప్రహసనపు గూర్పునను సిద్ధహస్తుఁడై, దీనావనదీక్షితుఁడై, దీర్ఘాయుష్కుఁడైన లక్ష్మీనరసింహకవి కాంధ్ర విశ్వవిద్యాలయమువారు మొన్న 1943 లో కళాప్రపూర్ణ బిరుదము నొసఁగి సముచితముగ సత్కరించిరి. ఇట్టి యీమహాకవి వీరేశలింగకవి తరువాత 'స్వీయచరిత్ర' వ్రాసికొనెను. వీరి స్వీయచరిత్ర, ఆంధ్రకవుల చరిత్రయు-ఆంధ్రదేశచరిత్రయు నన గలిగి మహోపకారకమయిన గ్రంథము.

---

# చిలుకూరి వీరభద్రరావు

## 1872-1939

ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. అభిజనము: తణుకుతాలూకాలోని 'శేలంగి'. నివాసము: రాజమహేంద్రవరము, కొవ్వూరు. జననము 17-10-1872. నిర్యాణము: 1939 సం. రచితకృతులు: రాజమహేంద్ర పుర చరిత్రము. ఆంధ్రుల చరిత్రము - జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము. తిక్కన సోమయాజి, తిమ్మరుసు మంత్రి - శ్రీనాథకవి- శివాజీచరిత్ర, కర్ణసామ్రాజ్యము, నవరసిక మనోల్లాసిని, స్వయంసహాయము, వరలక్ష్మి విలాసము, హిందూసంసారము, హిందూగృహము, హాస్యతరంగిణి, సుమిత్ర, అళియ రామరాజులు, నాయకురాలి దర్పము.

వీరభద్రరావుగారు చరిత్రచతురాననులు. 'ఆంధ్రుల చరిత్ర' తో వీరికఖండకీర్తి వచ్చినది. ఆంధ్రులప్రాచీనచరిత్రమును బరిశోధించి వెలువరించినవారిలో నీయనయే కనిష్ఠికాధిష్ఠితులు. వీరియనంతపరిశోధనములనుండియే నేటి పలువురు రచయితలు చక్కనివిషయములు సంగ్రహించి పత్రికాపాఠకుల కిచ్చుచున్నారు.

వీరభద్రరావుగా రాంధ్రభాషకుఁ బ్రాణములు ధారవోసిరి. ఆంధ్ర జాతిపై వీరికవ్యాజమైన యాదరము. వీరు సంఘసంస్కృతినభిలషించిన సదాశయులు. జాతివికాసము కలిగింప నెంచి దేశోపకారి, విబుధరంజని, ఆంధ్ర కేసరి పత్రికలు ప్రకటించిరి.

పంతులుగారికలము జంకుగొంకులు లేనిది. వాదోప వాదములలో తెలయనాట్యము సలిపినది. కలములో నున్నంత నిరంకుశత నోటిలో లేదందురు- ఎంతయావేగముగా వాదించినను జివరకు నవ్వుకొనుచు హాస్యోచిత సంభాషణములోనికి మార్చివైచుటమాత్రము వారియెడఁ

గల మంచిగుణము. ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసము వీడక చేతలలో స్వాతంత్ర్యముచూపిన నిరంకుశుఁ డీయన. తెలుఁగువారిలోని కొన్ని జాతులను గుఱించియుఁ గొన్ని వర్ణములనుగుఱించియు మనరావుగారు వెలువరించిన నిర్ణయములు కొన్ని సంస్థానములకుఁ గోపకారణము లైనవి. సంస్థానప్రభువులు కొందఱు వీరభద్రరావుగారిపై నాగ్రహము చూపుచుండిరి. వారు తలఁచినచో నేమి చేయలేరు? వేదము వేంకటరాయశాస్త్రిగా రిది గుర్తించి 'వీరభద్రరావుగారు! ప్రమాదము సుమండీ' యని మందలించిరఁట. వీరది లెక్కసేయుదురా? సత్యప్రకటనమే సత్పరిశోధకలక్షణమని నమ్మిననిర్భీకుఁ డాయన. పంతులుగారు 'అళియరామరాయలు' అనుగ్రంథములో 'రివరెండుహీరాసు' గారి వ్రాఁతలను సయుక్తికముగ ఖండించిరి. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి వెలువఱిచిన కాకతీయసంచికపై వీరిఖండనము సప్రమాణమై మెచ్చు నందినది. వీరి 'జీర్ణకర్ణాటసామ్రాజ్యము' యాంధ్రాభిజ్ఞులు పెక్కు 'కౌ'ననిరి. ఇదియే వీరి తొలిరచనము.

పంతులుగారివిమర్శనశక్తి చవిచూడనివా రుండరు. వీరి యాంధ్రుల చరిత్రలోని కొన్నికొన్నిసిద్ధాంతములు నూతన పరిశోధనములవలన నిలుచునవిగావు. ప్రథమప్రయత్నము లన్నిటిలోను గొన్ని దోషము లుండుట క్రొత్తగాదు. అది యాక్షేపణీయమును గాదు. వీరివిమర్శలో మొగమోట మనునది పూజ్యము. సత్యపరిశోధనమునకుఁ దమయాస్తిని దమయారోగ్యమును దుదకుఁ దమప్రాణములను గోల్పోయిన మృతజీవులు. జననము మొదలు మరణమువఱకుఁ గష్టపరంపరలతో నిండిన జీవితము వీరిది. దానికి హేతువు నిరంతరపరిశోధనపరత్వమే. ఒక సభలో కట్టమంచి రామలింగారెడ్డి 'వీరభద్రరావుగారి విమర్శనశక్తి చాల గొప్పది. దానిని వర్ణింప నా కర్హతలే' దని యుట్టంకించినాఁడు. ఆంధ్రచరిత్రకారులలో వీరభద్రరావుగారు, లక్ష్మణరావుగారు,

రామయ్యపంతులుగారు, వీరేశలింగముపంతులుగారు నొక్క శ్రేణిఁ జెందినవారు.

వీరభద్రరావుగారు చదివినది 'స్కూలుఫైనలు' వఱకే యనుకొందుము. అయిననేమి? వారు చరిత్రచతురాననులు. పదవులకొఱకుఁ బ్రాకులాడక యాంధ్రచరిత్ర పరిశోధనమునకుఁ దమయావజ్జీవనము ధారవోసి తరించిన యిట్టిమహాపురుషుఁడు చిరస్మరణీయుఁడు.

వీరభద్రరావుపంతులుగారి 'ఆంధ్రులచరిత్ర' యే తెలుఁగువారిలో జాతీయావేశము రగుల్కొల్పినది. భావిచరిత్రనిర్మాతల కాంధ్రుల చరిత్ర మొకపెన్నిధి. చిలుకూరివారి చరిత్రపరిశోధనరంగములోఁ బ్రాచీనాంధ్రసౌభాగ్యము ప్రాచీనసామ్రాజ్య విభవము తెరను దెఱచుకొని వచ్చి మధురనాట్యము చేసినది.

ఆయన భౌతికదేహ మింక మనకు గానరాదు. ఆంధ్రుల చరిత్రము మాత్రమే యాంధ్రదేశమందెచ్చటఁ జూచినను గనవచ్చును. నేఁడు పరిశోధకులలోఁ జేరందుచున్న శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వీరభద్రరావుగారిత్రోవ నభినందింతురు. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ. గారు వీరిమేనల్లురు. వీరేశలింగము పంతులుగారి తరువాత నాంధ్ర చరిత్రకారులకు వీరభద్రరావుగా రాదర్శకులని యాంధ్రు లైకకంఠ్యముగా నంగీకరింపవలసినదే.

రాజమహేంద్రవరమునఁగల ఆంధ్రచరిత్రపరిశోధకసభా ప్రతిష్ఠాపకులలో శ్రీ వీరభద్రరావుగా రొకరు. ఇట్టి పంతులుగారికి 1928 లో నంద్యాలయందు సర్వేపల్లి రాధాకృష్ణుని యాజమాన్యమున జరిగిన 'ఆంధ్రమహాసభ'లో 'ఆంధ్రచరిత్రచతురానన' యను బిరుద మిచ్చి సత్కరించిరి.

# కొమర్రాజు వేంకట లక్ష్మణరావు

## 1877–1923

లింగధారినియోగి. తండ్రి: వెంకటప్పయ్య. జననస్థానము: పెనుగంచి ప్రోలు (కృష్ణామండలము). జననము: 1877 సం॥ నిర్యాణము: 12–7–1923 సం॥ విరచితకృతులు: ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము (2 సంపుటలు వీరిసంపాదకత్వమున వెలువడినవి). శివాజీచరిత్ర, హిందూదేశ కథాసంగ్రహము, మహారాష్ట్రవిజృంభణము, లక్ష్మణరాయ వ్యాసావళి, హిందూ మహమ్మదీయ యుగములు.

లక్ష్మణరావుగారు సిద్ధహస్తులైన యాంధ్ర రచయితలు. వీరు భాషా సేవకులలోఁ బ్రథమశ్రేణిని లెక్కింపఁదగినవారు. 'విజ్ఞానచంద్రిక' యాంధ్ర గ్రంథమాలలలో నెంత ప్రతిష్ఠ గడించినదో లక్ష్మణరావుగా రాంధ్ర చరిత్రోద్ధారకులలో నంతకీర్తి సంపాదించిరి. విజ్ఞానచంద్రికకు లక్ష్మణ రావుగారు జీవగఱ్ఱ. ఈ గ్రంథమాలలో నీపరిశోధకునిచేయి సోఁకని గ్రంథము లేదు. కలకత్తా యమ్. ఏ పరీక్షలో నుత్తీర్ణులైననాఁటి నుండియు వీరి హృదయక్షేత్రమున వాఙ్మయసేవాంకురములు రేకెత్తుచు వచ్చినవి అవియే 'విజ్ఞానచంద్రిక' కు శుక్లపక్షములైనవి. ఈగ్రంథ మాలలో పదార్థవిజ్ఞాన- పారిశ్రామిక- ప్రకృతి- భౌతిక- రసాయన- వృక్ష- జీవ- వైద్యశాస్త్రములకు సంబంధించినగ్రంథము లెన్నియో వెలువడినవి. ఈగ్రంథమాలలోఁ గావ్యనాటకములకుఁ జోటులేదు. దేశోద్ధారకులగు మహాపురుషులజీవితచరిత్రము లిందుఁ బెక్కు ప్రకటితములు. ఆయావిషయములలోఁ బ్రత్యేకప్రవీణులైన చిలుకూరి వీరభద్రరావు- కట్టమంచి రామలింగారెడ్డి- గురుజాడఅప్పారావు- ఆచంట లక్ష్మీపతి- అయ్యదేవర కాళేశ్వరరావు- గోటేటి జోగిరాజుపంతులు మున్నగువా రెందఱో దీనికి గ్రంథములు వ్రాసి యొసఁగిరి. 'విజ్ఞానచంద్రిక'

యాంధ్రి కఖండసేవఁజేసి యన్వర్థమైన స్మరణీయమహాసంస్థ. అప్రస్తుతమైనను లక్ష్మణరావుగారితోపాటు దీనిని సంస్తుతింపక తప్పదు.

లక్ష్మణరావుపంతులుగారికి వీరేశలింగముగారే లక్ష్య స్వరూపులు. వీరు తమరచనను సామాన్య గ్రాంథికముగ నడపించి జనబాహుళ్యము నాకర్షించిరి. కాని నాఁటికి, హెచ్చుపెరిగియున్న గ్రాంథికవ్యావహారిక వాదప్రతివాదసమరములోఁ జేయిచేసికొనలేదు. ఆ కాటస్థ్యమే వీరిచే నమూల్యమగు విజ్ఞానసేవ చేయించినది. దేశభాషయొక్క సర్వతోముఖాభ్యుదయము, దేశభాషయందు సర్వశాస్త్రములు వెలువరింపవలయునన్న యభినివేశము కలిగి కొంతవఱకుఁ గృతకృత్యుఁడైన సుకృతి యితఁడు. ఆయన యభిలషించినది భాషాజీవము, భాషాస్థిరత్వము. లక్ష్మణరావుగారుకూడఁ గొందఱవలెఁ దెగుదెంపులేని భాషావివాదవాగురలోఁ దగుల్కొనినచో 'విజ్ఞానచంద్రిక' యేతరగతిగ్రంథమాలలలో లెక్కింపఁ బడవలసియుండెడిదో!

మనభాషలోలేని శాస్త్రగ్రంథము లుండరాదనియు, నప్పుడే వాఙ్మయమునకు సుస్థిరత్వము చేకూరుట కవకాశముండుననియు. వీరి ప్రధానాశయము. ఈయాశయమే పంతులుగారికిఁ బ్రబంధములమీఁదను, ఖండకావ్యములమీఁదను మక్కువ తక్కువచేసినది. ఇంతమాత్రమున నీయనకుఁ గావ్యకళాదృష్టిగాని, కావ్యరసాస్వాదశక్తిగాని లేదనుటకు వీలుపడదు. లలితకళలనుగూర్చి వెలువరించిన వీరి ప్రత్యేక గ్రంథము, కావ్యకళనుగూర్చిన వీరి ప్రత్యేక వ్యాసములు వీరికిఁ గళాపరిశీలకులలో గౌరవస్థానము నీయకపోవు. కేవలకావ్యములవలన వాఙ్మయమునకు శాశ్వతత్వము కలుగదని యొక యభిప్రాయము పెట్టుకొని శాస్త్రగ్రంథరచన, ప్రకటనములకు జీవితమర్పించిరి.

ఆంధ్రదేశచరిత్రరచనకు శ్రీకారముచుట్టినమహాశయుఁడితఁడే. వీరు నాటినవిత్తు నేఁటికి మహావృక్షమైనది. ఈయన యేవిషయమును

భారపడియుండలేదు. పలుసారులు పరిశీలించికాని యేరచనము ప్రచురింపలేదు. కావున నీయనయక్షరములు శిలాక్షరములైనవి. పరిశోధకలక్షణములు వీరికిఁ బూర్తిగఁ బట్టినవి. పత్రికల కెక్కుట, ఉపన్యాసపీఠములపై గర్జించుట వీరికి లజ్జాకరము. ఈయన సంఘసంస్కారియే కాని వీరేశలింగాదులవలె సంస్కారవాదములో బయటకువచ్చి నడుము బిగింపలేదు. రాజకీయ - సాహిత్యరంగములు రెండింటను ముందడుగు వేయు స్వభావ మీయనిది. ఈయన వేషములో నొక విద్యాధికత యుండెడిది. ఆకారము స్వచ్ఛమైనది.

పంతులుగారు గౌరవకుటుంబములోనివారు. వీరి పితృపాదులు మునగాలరాజుగారి (శ్రీ నాయని వేంకటరంగారావు బహద్దరు) ముత్తవ తల్లిగారియొద్ద 'దివాను'గాఁ బనిచేసిన ప్రసిద్ధాంధ్రులు. శ్రీ మునగాల రాజుగారితో లక్ష్మణరావుగారికిఁ బెద్దనేస్తము. పంతులుగారివలెనే రాజుగారుకూడ భాషాభిమానులు. వీ రిర్వురకు నిరంతర సాహిత్యచర్చలతోఁ గొంతకాలము గడచినది. రావుగారిసద్వర్తనము భాషాపరిజ్ఞానము రాజుగారిమనస్సున కెక్కినవి. దానిచే వారియొద్ద నాంతరంగిక కార్యదర్శిగాను 'దివాను' గాను బనిచేయుట తటస్థించినది. లక్ష్మణరాయరంగరాయలు కృష్ణార్జునులవలె వర్తిల్లిరి. ఉద్యోగముచేయుచున్నను వీరు భాషావలోడనము వీడలేదు. మునగాలరాజావారి సాహిత్యాభిరుచి పంతులుగారి భాషాశాస్త్రపరిశోధనమునకు మీఁదుమిక్కిలి దోహద మొనరించె నని పెక్కురు వక్కాణింతురు.

లక్ష్మణరావుగారు స్వతంత్రాశయులు. ఛత్రపతిశివాజీకి జన్మదేశ మగు మహారాష్ట్రదేశమునఁ బంతులుగారు బాల్యకౌమారదశలఁ గడపిరి. కవయిత్రియగు తనయక్కగారి యాదరమునను, తమబావ బండారు మాధవరావుగారి యభిమానమునను లక్ష్మణరావుగారు నాగపూరు

నివాసముచేయుచు మహారాష్ట్రము మాతృభాషవలె ధారాళముగ నభ్యసించిరి. ఆభాషలో వీరనేక వ్యాసములు, పద్యములు రచించి నటులు తెలియును 'మారోపంత్' అనుమహారాష్ట్రకవి వ్రాసిన కర్ణ పర్వమునకు మన పంతులుగారు పరిష్కర్తలుగానుండి రన్న విషయము తెలిసినచో వారికాభాషలోఁగల పాండిత్యము తెలిసినట్లే యగును. వీరేశలింగముగారికి వంగభాషపై నెంతయభిమానమో, మహారాష్ట్రము మీఁద మనలక్ష్మణరావుగారి కంతమమకారము. ఆ దేశమందలి యభిమానము వీరిచే 'మహారాష్ట్ర విజృంభణము' వ్రాయించినది. ఈయన మధ్యపరగణాలలో బి. ఏ. పట్టభద్రుఁడై, వంగభాషాపరిషత్తులో ఎమ్. ఏ. పట్టము బడసిన మేధావి. సంస్కృత పరిచయము కలవాఁడు. మహారాష్ట్రములో మంచిప్రవేశముగల పండితుఁడు. ప్రాచీనులను నర్వాచీనులను సమముగా గౌరవించినలౌకికుఁడు. నైతికముగ తిలకుమహాశయునిశిష్యత్వ మంగీకరించిన బుద్ధిమంతుఁడు. నిరంతరశాసన పరిశీలనముతోను, నిరంతర చరిత్రపరిశోధనముతోను సంసారమునుమరచిన కర్మశీలి.

'ఆంధ్రబ్రాహ్మణులలోని నియోగి వైదిక భేద కాలనిర్ణయము' - 'కృష్ణరాయలనిధనకాలము' - 'ఏకశిలానగర మోరుగల్లే' — మున్నగు చారిత్రకవ్యాసములు 'త్రిలిఙ్గమునుండి తెలుఁగుపుట్టెనా? లేక తెలుఁగు నుండి త్రిలిఙ్గముపుట్టెనా?' ఇత్యాది భాషావ్యాసములు — ప్రకృతి శాస్త్రము- రసాయనశాస్త్రము-కర్మయోగము- లలితకళలు-పంచాంగ ము-మున్నగురచనలు లక్ష్మణరావుగారి వివిధవిషయ నివిష్టబుద్ధి కౌశలమును, సునిశిత విమర్శన పటుత్వమును వేనోళ్ళ నుద్ఘోషించుచున్నవి. ఎన్నఁడో ౧౨వ శతాబ్దినాఁటి శివతత్త్వసారమును ద్రవ్వి దానికి లక్ష్మణరావుగారు వ్రాసిన పీఠికయుఁ దత్పరిశోధనము కనుఁగొన్నచో వారి శక్తి బహుధా తెల్లముకాఁగలదు. 'లక్ష్మణరాయ వ్యాసావళి' విజ్ఞానచంద్రికా ప్రతిబింబము.

1913 లో విజ్ఞానసర్వస్వరచనోహ పంతులుగారికిఁ గలిగినది. వారి యావచ్ఛక్తి ఆంధ్రవిజ్ఞాన సర్వస్వసంపుటము లపహరించినవి. అది యసంపూర్ణమైనను నాయన యశస్సున కనశ్వరత్వ మీయఁగల కూర్పు. పంతులుగారి యెత్తుగడలన్నియు బ్రహ్మాండమును బోలునవి. పన్నుగడ వన్ని పట్టుపట్టి నిర్వహించుట వీరిలో మెచ్చఁదగిన సుగుణము. విజ్ఞాన సర్వస్వ పునరుద్ధరణమునకు మఱియొక లక్ష్మణరావు — ఇంకొక నాగేశ్వర రావు అవతరింపవలయును. ఆ యదృష్టమెన్నటికో?

ఈ మహాశయుఁ డుపక్రమించిన 'ఆంధ్రీ' సంపుట సంకలనము తుద ముట్టినచోఁ దెలుఁగు బాసకు వెలలేని తొడవయ్యెడిది. మల్లంపల్లి సోమశేఖర శర్మవంటివా రెందఱో లక్ష్మణరావుగారి లక్ష్యమున నడచి పరిశోధకులలోఁ బెద్దపద్దు సంపాదింపఁగలిగిరి. 'అబలా సచ్చరిత్ర రత్నమాల' రచించి తెలుఁగున మెచ్చులుగాంచిన బండారు అచ్చమాంబ గారు లక్ష్మణరావుగారి సోదరీమణి.

# కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు

## 1871 - 1919

ఆఱువేలనియోగి. దత్తతగొన్నతల్లి: కామాయమ్మ. తండ్రి : వేంకట జగన్నాథరావు. జన్మస్థానము : గోదావరీమండలములోని పోలవరము. జననము : 1871 నవంబరు 11 వ తేది. నిర్యాణము : 1919. గ్రంథములు: ౧. రాజతరంగిణి [కల్హణుని కాశ్మీరదేశప్రభుల చరిత్రమునకుఁ దెలుఁగు వచనము] ౨. అపవాద తరంగిణి [షెరిడనుకవి రచించిన స్కూల్ ఫర్ స్కాండల్ అను నాంగ్లనాటకమునకు వచన రూపాంధ్రీకరణము. ౧౯౦౧ ముద్రి.] 3. సాహసిక కథార్ణవము [రాజపుత్రస్థానములోని చక్కనికథలు] ౪. ప్రభువిశ్వాసము [ఆంగ్ల రాజ్యారంభమునుండి నేటిదనుక మనదేశమునకు గలుగు నుపకారము లిందు వర్ణితములు] వీరు 'సరస్వతి' యను మాసపత్రికను వెలువరించిరి.

తెలుఁగుదేశమునఁగల జమీందారులలో భాషాపాండితియుండి కవిత రచింపఁ గలవారలసంఖ్య మిక్కిలి కొలఁది. ఆ కొలఁదిమందిలోను పోలవరము ప్రభువులు వేంకటకృష్ణారావుగారు పేరుగన్నవలఁతి. ఆంగ్లములో నీయన బి. ఏ. పట్టము నందెను. సంస్కృతాంధ్రములలో నీయన పట్టములులేని భద్రులు. పండితుఁడై, పండితపోషకుఁడై, కవియై కవిపాలకుఁడై, రాజకీయవేత్తయై, ఈ కవిప్రభుని జీవితము తెలుఁగురచయితల కొందఱకో వెలుఁగుచూపినది.

పోలవరమున కధిపతులైన జగన్నాథరావుగారు పాతికయేండ్ల వయస్సు మీఱకుండఁగనే కాలధర్మము నందిరి. ఆయనధర్మపత్ని కామాయమ్మగారు తమ చెల్లెలికుమారుఁడగు మన వేంకట కృష్ణారావుగారిని దత్తపుత్త్రునిగ స్వీకరించి ఐదవయేఁట నుండియే పెంచి పెద్దవానిని జేసి చదువుచెప్పించి పోలవరము జమీకిఁ బ్రభువును జేసినది.

చిన్నతనమున మన కృష్ణారావుగారికి సంస్కృతాంధ్రములు, ఆంగ్లము నొకగురువునుంచి తల్లిగారింటికడనే చెప్పించిరి. పిమ్మట రాజమహేంద్ర వరము చదువునకు విడువలేక కుమారుని పంపిరి. అక్కడ నుండి మన ప్రభుకిశోరుఁడు శ్రద్ధగఁ జదివి 1887 లోఁ బ్రవేశపరీక్ష 'మెట్రిక్యులేషన్ ఎగ్జామినేషన్' యం దుత్తీర్ణుఁ డయ్యెను. గణితమందును, భాషావిషయ మందును మొదటినుండియు వీరికిఁ బట్టుదల హెచ్చు. 1888 లో రాజ మహేంద్రవర కళాశాలలోనే ఎఫ్. ఏ. చదువుట కుపక్రమించిరి. కాని, కాలకర్మవశమునఁ దల్లి కామాయమ్మగారు కాలధర్మమందుటయు, కృష్ణారావుగారి దత్తత చెల్లదగినది కాదని యెవరో యభియోగములకు దిగుటయు, ఆయా చిక్కులు తటస్థించుటచే మనోవైకల్యము కలిగి వ్యాధిబాధ కలుగుటయుఁ గారణములుగ మూఁడేండ్లదాఁక విద్యాభ్యా సము సాఁగినదికాదు. 1891 వ యేఁటిచివర వ్యవహారములెల్ల సానుకూల ముగఁ బరిష్కరింపఁబడి కృష్ణారావుగారికి మరల చదువుపై నభిలాష పెంచినవి. చెన్నపురి క్రైస్తవకళాశాలలోఁ బ్రవేశించి 1893 లో ఫఎ్. ఏ. యందు నెగ్గి 1896 నాఁటికిఁ బట్టభద్రులైరి. దేశచరిత్రలయందును బట్టము నందఁగోరి 1900 లోఁ జరితార్థులైరి. కృష్ణారావుగారు పట్టభద్రు లైన తరువాత 'కాకినాడ' లో మేడకట్టించుకొని యుండి సంస్థానమును స్వయముగఁ బరిపాలించుకొనుచు నుండిరి. అక్కడనుండి పోలవరము జమీందారుగారి పేరు పతాకనెత్తినది.

ఈయన దేశచరిత్రమందు మేరలేనియభిమానము కలవాఁడగుట భారతదేశ సంచారము గావించి ప్రధాన పట్టణముల నన్నియుఁ జూచి చారిత్రకముగ నాయావిశేషములెల్లఁ గనిపట్టెను. ఇంకను పెద్దచదువేదో చదివికొందమని యింగ్లండుదేశమునకుఁ బ్రయాణముకట్టెనుగాని, దైవి కముగాఁ గారణాంతరములచే నది చేకూరలేదు. భారతస్వాతంత్ర్య సంపా దనమునకు నడుముకట్టిన సంఘములతో నీయన చెలికారము చేసెను.

శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారి సంస్కరణములు కొన్నిటిపై నీ ప్రభువునకుఁ బరమప్రీతి. పంతులుగారు చెన్నపురిలో నెలకొలిపిన అనాథశరణాలయమునకు వీరు వేయిరూపాయలు విరాళ మిచ్చిరి. 1895 లో నిలువఁబడిన 'ఆంధ్రభాషోజ్జీవనీ' సంఘమునకు మన వేంకట కృష్ణారావుగారుపాధ్యక్షులు. ఇఁక నీప్రభువు సాంఘికముగను, సార స్వతముగనుజూచినచోఁ దెలుఁగుదేశమునకు మంచియుపకృతిగావించెను.

1898 లో నీకవిరాజు సంపాదకత్వమున 'సరస్వతి' తలసూపినది. ఆ పత్రికయే యీప్రభువునకుఁ గల సారస్వతాభిమానమునకు గీటు ఱాయి. తిరుపతివేంకటకవులు, వడ్డాది సుబ్బారాయకవి, కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు మున్నగాఁగల యాధునికు లెందఱో 'సరస్వతి' ని కృతిప్రసూనములచే నారాధించిరి. అదిగాక, శ్రీనాథునివి, అనంత భూపాలునివి, పినవీరభద్రునివి, మారనవి, కందుకూరి రుద్రయ్యవి కృతు లీ 'సరస్వతి' ద్వారమునఁ బ్రచుర ప్రచారము నందినవి. ఇటు లీ సరస్వతి యిరువదేండ్లదాఁక నడచినది. శ్రీకృష్ణారావుగారి 'సరస్వతి కారణమునఁ దెలుఁగు కవుల కెందఱకో యుత్సాహము పెరిఁగినది. దానితో సాహిత్య పత్రికల కఱవు తీరినది. పోలవరము జమీందారుగారు గొప్పరాజకవు లన్నపేరు 'నాలుగు ప్రాంతములందును మీఱినది. తిరు పతి వేంకటకవులను జేరఁదీసి యాస్థానకవులుగ నాదరించుచు వేంకట కృష్ణారావుగారు మఱింత ప్రఖ్యాతి నందిరి. విశేషించి, దివాకర్ల తిరు పతి శాస్త్రిగారు మన కవిప్రభుని సరస్వతికిఁ జేదోడువాదోడై యుండు వారు. 'సరస్వతి' లోఁ బ్రచురింపఁబడినగ్రంథములన్నిటియందును శ్రీతిరు పతి శాస్త్రిగారి పరిష్కరణముద్ర పడినదనవచ్చును. 'సరస్వతి' ఘనతకు శ్రీ శాస్త్రిగారును హేతుభూతు లనుట యిప్పుడు మనము చెప్పవలసిన మాట. తిరుపతి వేంకటకవుల గ్రంథములలో దేవీభాగవతము తరువాత బుద్ధచరిత్ర మొకటి బహుకాలము జీవించుగ్రంథమని విమర్శకుల యభి

ప్రాయము. అట్టి బుద్ధచరిత్రము కృతినందు నదృష్టము మన వేంకటకృష్ణారావుగారికిఁ బట్టినది.

సీ. ఎవని పురాణాగమాతివిభూతి తెల్పుఁ ద
త్ప్రాపకంబైన బి. ఏ పదంబు
ఎవని భాషాభిమాన విభవంబు వచించు
నెంచి చేయించు సత్కృతిచయంబు
ఎవని కవీంద్రగౌరవము చాటించు ము
ద్రాపిత ప్రాక్కవిగ్రంథపటలి
ఎవని యగణ్యపుణ్యవిశేష మెఱిఁగించు
నత్తికోడంద్ర యన్యోన్యమైత్రి
యతఁడు కొచ్చెర్లకోట వంశాంబురాశి
చంద్రుఁ డురుకీర్తి సాంద్రుఁడు శాంతిపరుఁడు
రామచంద్ర వేంకట కృష్ణ రామచంద్రుఁ
డనితరప్రతిభాశాలి యనియుఁ దలఁచి.

అంకిత మిచ్చిరి గాని, సామాన్యుల కీ బుద్ధ చరితము కృతిగొనుటకు వీలులేనిది. ఈ కృత్యాది పద్యములు రెండిటివలనను దిరుపతి వేంకట కవుల కీ ప్రభువుపైఁ గల గౌరవముతీరు విస్పష్టపడును.

చ. ఎవరికి నేని నిచ్చుపనియే మనవృత్తి యటంచు నెంచి స
త్కవులను బండితోత్తముల గాయకులం దనియించుఁగాని పో
లవరవిభుండు రక్షితకళావిదధీశుఁడు కృష్ణరావు మె
ప్పొ వడయునంతపాటి బుధ పుంగవులుం గలరే జగంబునన్.

క. ఇతఁ డతికవితాలోలుప
మతి యని వర్ణింపనేల మాటికి నీ నం

గతి ప్రతిమాసమున నర
స్వతియే ప్రతి దేశ మేఁగి చాటుచునుండన్.

జగత్ప్రసిద్ధులైన యీ కింకవీంద్ర ఘటాపంచాననులను స్వసంస్థాన కవులుగాఁ జేసికొనుభాగ్యము పోలవరముప్రభువున కొక్కనికే తక్కినది.

చ. తిరిగితి మొల్ల దేశము నదే పనిగా నిఁక మీఁద దేశసం
చరణ మొనర్పఁగా విసువు చాల మనంబునఁ గల్గెనయ్య! యీ
తిరుపతి వేంకటేశకవిధీగుల నొక్కడనుండఁ జేసి భూ
వరసభలందు ఖ్యాతిని నవశ్యము చెందుము! కృష్ణభూవరా!

అని చెప్పి దేశదేశములు తిరిగి విసిగివిసిగి యొకచో నుండఁగోరి వీరి నాశ్రయించి యుండిరని యీ పద్యమువలనఁ దెలుచున్నది.

శ్రీ వేంకటకృష్ణారాయ కవిప్రభువు కవిపోషకుఁడేగాక స్వయము చక్కని కవిత చెప్పఁగలవాఁడై కొన్ని కృతులుకూడ రచించెను. సంస్కృతములోని కల్హణరచితమైన 'రాజతరంగిణి' ని చక్కని వచనరచనలో సంధానించిరి. అందుఁ దరంగ ప్రారంభమునఁ గావించిన స్తుతులవలన నాయన కవితసొంపుపెంపు తెలియవచ్చును.

మ. అజగోశృంగములన్ ఘటించి విలు సేయంజాలునో యెవ్వఁడా
త్మజు దేహంబునఁ గూర్చెనో యెవఁడు మర్త్యత్వంబు దంతిత్వమున్
నిజదేహంబునఁ దాల్చెనో యెవఁడు తన్స్త్రీపుంస్వరూపంబు ల
ట్టి జగన్మాన్య విచిత్రకార్యకుశలున్ డెందంబున న్నిల్పెదన్.

ఉ. పాములు నీకురుల్ రుచికిఁ బాత్రము లే మదవుంస్పికంబు నా
గోమగు తావకీన గళగోవులకు న్వికసించెఁ జూడుమీ
పాములదృష్టి యంచు నొకవాక్యము ద్వ్యర్థిగ నిర్వురాడున
ట్టీమెయిఁ బల్కు నర్ధవని తేశ్వరు నాలుక మమ్ముఁ బ్రోవుతన్.

ఉ. గాలియు నాకులుం దినుచుఁ గానలలోఁ దపమున్న దానికిన్
మేలనుకోకు మట్టివె సుమీ చిలువల్ వృషభంబు వానికీఁ
జాలెన ; ప్రేమచేతఁజామి సామెయి నీకిదె భర్తృఁడంచు స్వ
స్త్రీలు నుతింపఁగా నలరు శీతగిరీంద్రకుమారి నెన్నెదన్.

ఈ 'రాజతరంగిణి' యేగాక సాహసిక కథార్ణవము, అపవాదతరంగిణి, ప్రభువిశ్వాసము మున్నగు పెక్కురచనలు గావించి కవిగా నీప్రభుమణి పేరుగాంచెను. రాజకీయమునఁగూడ నీయన మంచిపరిశ్రమను చేసి యెన్నోసభలలో నుపన్యాసము లొసఁగెను. శ్రీకృష్ణారావుగారి రాజభక్తి మెచ్చఁదగినది. శ్రీజార్జి చక్రవర్తి పట్టాభిషేక సమయమున 1911లోఁ దెలుఁగు కవులెందఱచేతనో పద్యములు వ్రాయించి తెప్పించి యా 'కారొనేషన్' సంచిక శ్రీప్రభువువారి కర్పించుకొనిరి. అప్పటి కృతి పద్య మిది యొకటి.

మ. పదుమూఁడేఁడుల యీడువచ్చెఁ జనివెన్ భాషాప్రపంచంబు దొ
డ్డది మా బ్రాహ్మవివాహకాల మది దాటంజేయఁగారాదు, నీ
పదదాస్యం బొనరించు చున్ మదమునన్ వర్ధిల్లఁగా నెంచుచు
న్నది జార్జీశ్వర ! మానరస్వతిని గాన్కంగ జేతుఁ గైకోఁగదే !

ఈవిధముగ రాజభక్తుఁడు, గ్రంథరచనాసక్తుఁడు, పండితపాలకుఁడు, ప్రభువరుఁడునైన శ్రీవేంకట కృష్ణారాయకవి ప్రభువులలోఁ బ్రభువు. పండితులలోఁ బండితుఁడు. రచయితలలో రచయిత. పాపము ! పోలవర సంస్థానకవి తిరుపతిశాస్త్రి 'శ్రీకృష్ణనిర్యాణము' ను గుఱించి యెంత వగచినాఁడో పరికింపుఁడు.

సీ. శతవిధాన మొనర్చు సరసులు కబురంపఁ
బంపకుండఁగ మానిపింపలేదు
సర్వదేశంబుల సభలకుఁ బోవుచో
వెంట రమ్మనకుండ విడువలేదు

పీటపైఁ గూర్చుండి పిలువనంపకయుండ
నేదినమ్మున భుజియింపలేదు
మొదటినుండియుఁ దుట్టతుదదాఁక నొకరీతి
గురుభావమున లోటు జరుపలేదు
ఇట్టిరీతిగఁ బదునెన్మిదేండ్లు జరిపి
కృష్ణభూపాలకుఁడు దివికేఁగె నేఁటి
కాయనకు నాకుఁ గల్గు ఋణానుబంధ
మక్కటా! దైవదౌర్బల్య మణఁచివైచె.

సీ. రచియించినాఁడ బుద్ధచరిత్ర కృతిగాఁగ
మేలినాటకములు మృచ్ఛకటిక
బాలరామాయణ పాండవవిజయము
ద్రారాతు నేదర్ధురాజమహాళి
పట్టాభిషేకముల్ పావనయుష్మదా
ఖ్యాభూషితమ్ములుగా నొనర్చి
నీ కీర్తికాంత కీలోకమ్మునందు వ
సించుసౌధమ్ము నిర్మించినాఁడఁ
బండితుఁడు కవి మిత్రుండు బాంధవుండ
నంగ మెలఁగితి దానికి నాకు నీవు
చేయు ప్రత్యుపకార మిదేనా! మహాత్మ!
వదలి దివి కేఁగుటా కృష్ణవసుమతీంద్ర!
గీ. శనిమహాదశ మంచియుచ్చదశ యంచుఁ
బలుకు కార్తాంతికుల పల్కుబడు లసత్యము
లనఁగ శనిదశలోని శస్త్యంతరమునఁ
గుజుఁడు పాపాత్ముఁడగుచు మాకొంప దీసె.

# జనమంచి వేంకటరామయ్య

## 1872 - 1933

కాశ్యపసగోత్రులు. తండ్రి: బ్రహ్మావధాని. తల్లి: మహాలక్ష్మి. నివాసము రాజమహేంద్రవరము. జననము 1872 సం. నిర్యాణము 1933 సం. కృతులు: ౧. నవకుసుమాంజలి [ఖండకావ్యసంపుటము] ౨. మాలతీమాధవము ౩. విద్ధసాలభంజిక [అనువాదములు] ౪. సుప్రభాతము [ఖండకావ్యము] ౫. మేఘదూత. ౬. ఉత్తరరామచరితము. ఇత్యాదులు.

కత్తికోఁతలేదు గాజుగోట్టము లేదు
మాతనెత్రు శోధనేఁత లేదు
ఒనరుప్రేమఁ బ్రకృతి యొడిఁజేరి చనుగ్రోలి
మేనుమఱచి నిదురకాని కవికి.

ప్రకృతి తనుఁబట్టి బాధించువారి కేదొ
కడుపునకుఁ బెట్టి కన్నీళ్లుదుడుచుఁగాని
దాఁచిపెట్టును దనపెన్నిధాన మింక
యోగమహితుఁడు గవివరేణ్యునకుఁగాను.

సుకృతిగాఁడె సుకవి ప్రకృతితో నేకాంత
గోష్ఠినుండుఁ గాన కోనలందుఁ
దపసివోలె నెపుడు తత్త్వంబె చింతించు
మధురరసముఁ గ్రోలు మధుపమట్లు.

తత్త్వవేత్తకు నేది సత్యముగఁ దోఁచు
నదియె సౌందర్యరూపమై యమరుఁ గవికిఁ
జండమార్తాండ తేజఃప్రసారమె గద
నిండుచందురు పండువెన్నెలగ మాఱు.

శ్రీ జనమంచి వేంకట రామయ్యగారి సర్వకవితాహృదయము పలు పద్యములలో సురక్షితమై యున్నది. ప్రకృతితత్త్వముతో సభిన్నుఁడైన యీ కవివరుని గుండెలో నమృతభాండముండె ననుటకు నిదర్శనము వీరి "నవకుసుమాంజలి." ఈ కూర్పు 23 ఖండకావ్యముల సంపుటము. ఇందలి ప్రతిపద్యము రసోత్తరము. పాలమీఁగడవలె చక్కని చిక్కని కమ్మని కవిత వేంకటరామయ్యగారి చేతిలోనున్నది. ఆయన యక్షరాక్షరము తూచితూచి వేయును. చ్యుతసంస్కారములు చేరనీయక, హాయిగలిగించు శయ్యలో వీరు మంచినేరుపు చేకూర్చుకొనిరి. వడ్డాది సుబ్బారాయఁడుగారివలె వీరుకూడఁ బద్యము మలచి మలచి మెఱుఁగు పెట్టి మఱి వెలువరింతురు. భావములలోఁ బ్రాతఁగ్రొత్తల సొగసుకలయిక వారి కవితకొక యందము. పద్యము నెత్తుకొనుటలోను, దింపుటలోను, ప్రస్తరించుటలోను వీరొక నూతనత్వమును సహజముగాఁ బ్రకటించిరి. ఆంగ్లభాషా ప్రవేశము వీరి భావనాపథమున కొక నవవికాసము కలిగించినదని చెప్పుచుందురు. జీవితము ఛాందసప్రవృత్తిలో నడపించినను, భావములు జాతీయమార్గమున మెఱుఁగులు దేఱినవి. "అమృతభాండ" మను ఖండకావ్యము వేంకటరామయ్యగారి జాతీయదృక్పథమునకుఁ బతాక. ఈ కావ్యహృదయము కవియే యిటులు ప్రకటించెను. "హైందవ స్వరాజ్యసమితివారి రాయబారమే యిందలి ప్రకృతవిషయము. ఈ ప్రకృతము, అప్రకృతమైన గరుడయాత్రాకథలోఁ గొన్నిపట్ల స్ఫుటముగాను, గొన్నిపట్ల సూచనగాను వర్ణింపఁబడినది. ప్రకృతాప్రకృతముల నొండొంటితో సందర్భింపఁజేసి కావ్యమును కడవఱకును నేకార్థసమవేతముగా నిర్వహించుటకై రెంటియందును గొన్ని యావశ్యకములైన మార్పులుచేయఁబడెను. కావ్యాదిని ప్రతిజ్ఞాతమైన దాస్యనివృత్తికి, కావ్యాంతమందు సిద్ధ్యసిద్ధి రూపముగాఁ జెప్పఁబడుటచే, పురాణకథకును బ్రస్తుతకథకును ఫలసమన్వయము కుదుర్పఁబడెను. ఇది

యెట్లంటేని, "వినతసమోద్మాదముద్రితాస్య, యగుచు వడ్డించెనమృతంబు" అని చెప్పఁబడుటచే దేశమున సంస్కరణముల తాత్కాలికాంగీకారము, గరుడుని బంధవిముక్తిచే లోకమాన్యుని తదనంతర నిర్యాణమును, శాద్రవేయుల యాశాభంగముచేఁ బ్రజల కిప్పటి ద్వంద్వపరిపాలనము వలని యల్పప్రయోజకత్వమును సూచితములు."

కవికి లోకజ్ఞత యుండవలసిన ముఖ్యలక్షణము. రాజకీయముగాఁ దటస్థించు సంస్కృతి నెప్పటికప్పుడు గుర్తించుకొనుచుండెడి వేంకట రామయ్యగారి కడుపులోని "అమృతభాండము" కలమునుండి వెలి కుబు కుటలో నాశ్చర్యమేమి? 'నాదారితోడు' అను కావ్యములో నంటరాని వారిపై వీరు వెలిబుచ్చిన యనుకంపాభావము మఱచిపోరానిది.

క. వెలివాడఁ బుట్టినంతనె
వెలిబెట్టున యాశుఁ డతనిప్రేమకుఁ బాత్రం
బులుగాని జంతు లిలలో
పలఁ గలవే? గాలిలేని బ్రదుకుంగలదే?

క. ఒక యీశ్వరుకృప నందఱ
మొకయోడనెక్కి దాఁటి యొక సంద్రమునే
యొకతీరము చేరఁగవలె
నిఁక నీసంశయములేల యిచ్చట మనకున్?

గీ. కాన సందేహపడక యోడోనవాఁడ!
యెక్కనివ్వుమి నాతోడ నెక్కనిమ్ము
ఎక్కనిచ్చిన నీకేమి యొగ్గులేదు
తఱచిచూచిన నాకేమి తగ్గులేదు.

గీ. ధర్మజునిపోల్కి నేఁగాను ధార్మికుఁడను
అంటరానిదిగా దింతి యతని వేఁపి

యట్టు; లటులయ్యు మే మెక్కి నట్టిదో నె
వారలెక్కిన తొలిమెట్టు స్వర్గమునకు.

వివిధవిషయ నివిష్టమతియగు కవిగారి పరిజ్ఞానమున కీ "నవకుసుమాంజలి" యాదర్శము. ఇదిగాక, వేంకటరామయ్యగారు మాలతీమాధవము, ఉత్తరరామచరితము. రాజశేఖరుని విద్ధసాలభంజిక రసోత్తరముగా ననువదించిరి. విద్ధసాలభంజిక ౧౯౦౫ లో రచితమై చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వెలువరించిన 'మనోరమ' పత్రికయందు బ్రకటింపబడినది. ఉత్తరరామచరిత్రాంధ్రీకృతి యసంపూర్ణము. వీరి రచనలు చాలవఱకు బరివర్తనములైనను, కయ్యలో స్వాతంత్ర్యము నిండుగా నుండుటచే రక్తిగట్టి శాశ్వతత్వము సంపాదించుకొనజాలియున్నవి. తెనిగింపులో నింతగా నింపు పుట్టించురచన యొండొకటి యులవడదు. ఈపొందిక కనుగొనుడు:

సీ. మఱుగఁ గాఁగినపాలమఱపించు కరముల
గిలిగింతనెవఁడు పొంగించుజలధి
భువనత్రితయము దివ్యభవనంబునకెవండు
నవసుధారస లేపనంపుఁగుంచె
సిద్ధౌషధంబయి చెలఁగి యెవ్వనివెల్గు
మదనపల్లి నిఫుల్ల పొదలఁజేయుఁ
జివురు విల్తుని కేళి భవనాంగణమునకుఁ
జాఁపుచందన పంకచర్చ యెవఁడు
గీ. అతఁడు వెలుఁగొందుఁ గుంకుమన్యాసగౌర
మానినీరమ్య వదనోపమానమూర్తి
ఘటితచక్రవాక మిథున పటుతరార్తి
సాంద్రతరకీర్తి యామినీచక్రవర్తి.

ఉ. ఆడదు పూవుఁదోఁట గొనియాడదు వెన్నెలతేట బోటులం
గూడదు కేళిమండపము గుమ్మమువంకను దొంగిచూడదున్,
వేడదు వేషపోషణము, వీడదు కెంజిగురాకుపాన్పుఁ, బూఁ
బోఁడి తదీయ నవ్యమృదు మోహన వేష విభావనారతిన్.

ఇట్టి మహాకవి రాజమహేంద్రవరము మునిసిపలుహైస్కూలు సహాయోపాధ్యాయుఁడై శిష్యబృందమునకు సాహిత్యభిక్ష నందించెను. కవితా సరస్వతినిగుఱించి యీ రచయితహృదయ మిట్లు నవకుసుమాంజలి పీఠికలో బయటఁబడినది.

"ఈ శూన్యప్రపంచమం దా దేవి యొక్కతెకే నేను కావలసినవాఁడను- నాకుఁ గావలసినదియు ఆ దేవియే. ఏమనఁగా, కవితయే నా జీవిత సర్వస్వము, కవితయే నాకు స్వర్గద్వారము, కవితయే నాకు మోక్ష సాధనము."

---

# తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య

## 1872 - 1921

తల్లి: శ్రీరంగమ్మ. తండ్రి రంగమన్నారయ్య. నివాసము: చెన్నపురి. జననము 1872. అంగీరసనామసంవత్సరము. అస్తమయము: 1921. రచనలు: ౧ భగవద్గీతవ్యాఖ్య ౨. వచనభాగవతము. ౩. వచనరామాయణము ౪. వచనభారతము. ౫. నన్నెచోడుఁడు (జీవితవిషయము) ౬. సర్వదర్శన సంగ్రహము. ౭. కర్ణచరిత్రము [అముద్రి] ౮. మను, వసు చరిత్రాదులకు వ్యాఖ్యానములు, పీఠికలు ఇత్యాదికము.

తేవప్పెరుమాళ్ళయ్యగారికి దేవరాజసుధి యని పండితుల వ్యవహారము. ప్రధానముగా నీసుధీమణి పీఠికాకారుఁడుగాను, వచన రచనా విశారదుఁడుగాను బేరందెను. మదరాసులో నానందముద్రాలయము వారి యాదరణమున నీయన మృదువగువచనములో భారత భాగవత రామాయణములు రచించెను. మను, వసు చరిత్రాది పూర్వకావ్యములకు వ్యాఖ్యలు గావించెను. నన్నెచోడుఁడు మున్నగు కవుల కాలనిర్ణయమును గూర్చిన వ్యాసములు 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక' 'భారతి' మొదలగువానిలో వెలువరించెను. రెండుభాషలయందును జిక్కని చిక్కని చాటుకవిత కొంత సంతరించెను. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమునఁ బండితుఁడై పదార్థవిచారము చేసెను. మొత్తము నలువదితొమ్మిదేండ్లు మాత్రము జీవించెను. సుకృతీ గతాయుః.

ఈ దేవరాజసుధి పూర్వులు తంజనగరరాజాస్థానమున సంగీత విద్వాంసులుగ నుండిరి. పెరితాతగారు తేవప్పెరుమాళ్ళయ్య యనఁ బడువారు. ఆయన మంచి పాండితి గలిగి, వాగ్ధాటియుండి భక్తియోగమున

గూర్చి యుపన్యాసము లిచ్చుచుండువారఁట. శతావధానము చేయఁగల రనియు వినికి. వీరికిఁ దంజనగరరాజ పోషణము పనిపడక చెన్నపట్టణము వచ్చివైచిరి. పట్టణమున బహుకాలము భగవద్విషయక ప్రవచనములతోఁ గాలక్షేపము చేసిరి. ఇట్టి యీ తాతగారిపేరు నిలఁబెట్టుటకు మన తేవప్పెరుమాళ్ళయ్యగారు పుట్టి, వారికంటె నూరురెట్టులు ధట్టుఁడై వెలసెను. మన దేవరాజసుధి పండితుఁడుగాని, పండితపుత్త్రుఁడు గాఁడు. ఇతనితండ్రి రంగమన్నారయ్యగారు వ్యాపారసరణిలోఁ జేయి తిరిగిన వారు. ఆయన శతసంవత్సర దీర్ఘాయువునంది మొన్న 1921 లోఁ బుత్త్రశోకమనుభవించి, రెండేఁడులుండి మఱి మరణించెను.

మన తేవప్పెరుమాళ్ళయ్యకు దేవరాజసుధి యను పేరున్నటులు మన మెఱుఁగుదుము. చిన్నతనములో నీయనకుఁ జిన్నయ్య యనికూడ వ్యావహారికనామ ముండెడిదఁట. శ్రీ పరవస్తు చిన్నయసూరిగారి శిష్యులును, విశ్వగుణాదర్శాంధ్రీకర్తలు నైన తేవప్పెరుమాళ్ళయ్యగారి కడ మన దేవరాజసుధి కావ్యనాటకాదులు, వ్యాకరణము పఠించెను. పదునాలుసంవత్సరములవయస్సు దాఁటకుండఁగనే 'మెట్రిక్యులేషన్' పరీక్ష ను త్తీర్ణుఁడై, ప్రవేశపరీక్షకుఁ జదువుచుండఁగా, సంసారపుఁజిక్కులు పెక్కు తటస్థించి, యాచదువు నంతతో నాఁపివేసినవి. విస్తారమగు బధిరత్వముండిన కారణమున దొరతనమువారి యుద్యోగముల కానపడక, దేవరాజసుధి సాహుకారులదగ్గర నాశ్రయము సంపాదించుకొని కొన్నేండ్లుగడపెను. ఆసమయముననే యాంగ్లము, అఱవము చక్కఁగాఁ గృషిచేసి, తెనుఁగెల్ల స్వయముగఁ జదివి చూచి, సంస్కృతములో శ్రద్ధమై సిద్ధాంతకౌముది పఠించి, కొంతతర్కము, కొంచెము మీమాంస గురుముఖమున నధ్యయనించెను. ఆ సాహిత్యపు సాహసముతో 'భగవద్గీత' తీసి విశేషార్థ ప్రతిపాదకముగ నొక వ్యాఖ్య వ్రాసెను. ఆరచనయే యానందముద్రాలయమువారికి దేవరాజసుధికిఁ జెలికారము

గఱపెను. తదాదిగ నీ దేవరాజు ప్రాచీన కావ్యములు, శతకములు, భారత భాగవతాది పురాణములు పాఠభేదములతో సరిచూచి సరస పాఠము లెత్తి, వలసినవానికి లఘువ్యాఖ్యలు వ్రాయుచుఁ దెలుఁగు విమర్శకుల కాదరణీయములగు భూమికలు వెలయించుచు, కవి జీవితములు ప్రమాణమాన్యములుగాఁ బ్రకటించుచు నానందముద్రాలయము మూలమునఁ దెలుఁగుబాసకు వాఙ్మయపువిందు లిచ్చెను. చిన్నయసూరివచనరచన నొరవడిగా నుంచుకొని, దానికంటె నొకమెట్టు దిగువనుండు సులభభాషలో సంపూర్ణముగా రామాయణ భాగవతములు హృద్యగద్యములో వ్రాసి వెలువరింపఁ జేసెను. వచనభారతము కొన్ని పర్వములు మాత్రమైనవి. మనదేవరాజసుధి వాఙ్మయసేవా సాధమునకు ఆనందముద్రాలయమువా రాధారస్తంభాయమానులు.

ఈయన చివరిదశలో శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు కార్యవ్యవహర్తగఁ బనిచేసి, తన్నిఘంటువునకు బహు గ్రంథపరిశీలనము గావించి పదపదార్థము లెత్తియిచ్చెను. పాండితిని మించిన వినయగరిమ కలవారీయన.

# వత్సవాయి వేంకట నీలాద్రిరాజు

## 1881-1939

క్షత్త్రియుఁడు. వసిష్ఠగోత్రుఁడు. తండ్రి: వేంకట సీతారామరాజు. జన్మస్థానము: మోడేకుఱ్ఱు. నివాసము: తుని. జననము: 1881. నిర్యాణము: 1939 సం. కృతులు: ౧. ఆంధ్రక్షత్త్రియులు [విమర్శనాత్మకము. 1920 ముద్రి.] ౨. ఆంధ్రమేఘసందేశము [1912 ముద్రి] 3. అభిజ్ఞానశాకుంతలము [1933 ముద్రి] ౪. విక్రమోర్వశీయము. ౫. మాళవికాగ్నిమిత్రము [అముద్రితములు]

ఈ నీలాద్రిరాజుగారికి దేశములోఁ గవిరాజని ప్రసిద్ధ వ్యవహారము. ఈయన తుని సంస్థాన విద్వత్కవి. రాజులలోఁ గవి యగుటయేఁ గాక, కవులలో రాజగుటయు నీయనకుఁ గవిరాజబిరుదము చరితార్థ మయినది. ఈ పద్యము వీరి వంశాది విశిష్టతను విస్పష్టపఱుచును.

సీ. రాజకేసరివర్మ రాజేంద్రచోళాది
జనపతుల్ కూటస్థ జనులు మాకు
భూలోక వైకుంఠపులు రంగ వేంకటే
శ్వరు లన్వవాయదైవములు మాకు
తెలుఁగురాయనరేంద్ర తిమ్మరాయుప జగ
త్పతు లన్వయప్రదీపకులు మాకు
భగవత్పదధ్యాన పర విశిష్టాద్వైత
మత మన్వయక్రమాగతము మాకు

గీ. ననికి వెనుకంజ వేయక యనుతృణములు
వదలి దివిఁజూఱకోలు సద్వ్రతము మాకు

తళుకుకనకంబునకు ( బరిమళము వోలె
కావ్యనిర్మాణ మతి యశస్కరము మీకు.

ఆంధ్ర మేఘసందేశ వావతారికలోఁ గవిరాజుగారు తమ సహాధ్యాయునిచేఁ జెప్పించుకొన్నటులు వ్రాసిన పద్య మిది.

ఈక్షత్త్రియకవి, మోడేకుఱ్ఱు సంస్కృత పాఠశాలా పండితులు ఆకొండి వ్యాసలింగశాస్త్రిగారిసన్నిధానమున సంస్కృతాంధ్రసాహితి సంగ్రహించెను. పాణినీయమునను గొంత ప్రవేశము కలిగించుకొనెను. కవిత్వము మంచి చిక్కని పలుకుబళ్ళతో నుండి చక్కఁగ నడపింపఁగల నేర్పరు లీయన. పెద్దన, తిమ్మనార్యుఁడు మున్నగు వారిశైలి వీరి కవితకొరవడి. భాష నిర్దుష్టము, శిష్టసమ్మతముగ నుండును. కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలము, మేఘ సందేశము ననువదించి వెలువరించిరి. విక్రమోర్వశీయము, మాళవికాగ్ని మిత్రము కూడఁ దెనిఁగించిరని తెలియ వచ్చును గాని యచ్చుపడలేదు.

కాళిదాసుని ప్రతికృతికి నెన్నో పరివర్తనములున్నవి. అందులో నభిజ్ఞాన శాకుంతలమునకు మన తెలుఁగులోఁ జేరుపడిన యనువాదములు పదిపదునైదుదాఁక నున్నవి. శ్రీ పరవస్తు రంగాచార్యులుగారు [వీరిది రెండంకములు మాత్రమే 'సకలవిద్యాభి వర్ధనీపత్రిక' లో వెలువరింపఁబడినది], కందుకూరి వీరేశలింగము గారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు, దాసు శ్రీరామకవిగారు, వడ్డాది సుబ్బారాయఁడుగారు, నిడమర్తి జలదుర్గా ప్రసాదరాయఁడుగారు, మంత్రిప్రెగడ భుజంగరావుగారు, కాంచనపల్లి కనకమ్మగారు, పేరి కాశీనాథశాస్త్రిగారు, వీరెల్లరును శాకుంతలాపరివర్తనకర్తలు. తరువాత మనకవిరాజుగారొకరు. వీరి తెలుఁగు సేఁతలో విశేషములు రెండున్నవి. కేవలము [illegible]గ ముక్కకు ముక్క తెలిఁగింపక,

వ్యాఖ్యానసాహాయ్యమున భాష్యప్రాయముగఁ బెంచి రచించుట యొకటి. సంస్కృతమునను, దెనుఁగునను దొల్లి ప్రచురితములగు ప్రతులన్నియుఁబట్టిచూచి, పాఠభేదములు, ప్రక్షిప్తప్రదేశము లెన్నఁగఁబరికించి పూర్వాపరసందర్భములు తాఱుమాఱుగాకుండఁజేయుట రెండవది. కవితాధార సంగతి వేఱె చెప్పనేల? ఈతీరున జాలువాఱుచుండును.

సీ. రాలియున్నయవి కీరముల తొఱ్ఱలనుండి
చదరి నీవారముల్ చెట్లక్రింద
తెలుపు చున్నయ వింగుదీ ఫలోద్భేదంబు
జిడ్డులై యందంద దొడ్డశిలలు
మెలఁగుచున్నయవి నమ్మికతోడ నెప్పటి
పగిది శబ్దమునైచి మృగములెల్ల
కలిగియున్నయవి వల్కల శిఖానిష్యంద
రేఖాంకముల నీళ్ళ రేవుదారులు
మాఱియున్నవి యాజ్యధూమంబువలనఁ
జివురుటాకుల కాంతులు చెన్నుదరిగి
తోఁగియున్నవి గాడ్పులఁ దోలఁకి పాఱు
బోదియలనీళ్ళఁ బాదపంబుల మొదళ్ళు.

'ప్రథమాంకము'

ఉ. ఘ్రాతముగాని పుష్పము, నఖంబులఁ ద్రుంపని పల్లవం బనూ
న్యాతముగాని రత్నము, రుచుల్గ్రుఱికోని నవాసవం బఖం
డాతత పుణ్యసత్ఫలము సట్లనఘున్మగు నాలతాంగి యా
పాతికయంబు నెవ్వనికి నంచు విరించి సృజించి యుంచెనో?

కవిరాజుగారి మేఘసందేశపుఁ దెలుఁగు సేఁతలోని మచ్చు పద్యములు మఱి రెండు:

శా. ఆవీట న్నడిరేయి వీథిఁబడి శాంతాగారమున్ జేరు న
వ్వ్బావుంబోణుల కల్లిబిల్లిగొని చూపున్ మావు పెంజీకటిన్
నీ వెంతే నొరగంటి పైఁడితళుకున్నిద్దంపు క్రొమ్మించునన్
ద్రోవంజూపుము వారలుల్కుదురు చిన్కున్ బ్రోంతలేకుంచుమీ!

ఉ. పైదలిబాసె వీఁడను కృపామతి కల్మినొ లేక చెల్మినో
కాదన కిట్టిపాటియుపకార మొనర్చి మదర్థనంబు పై
నాదట నిచ్చవచ్చు నెడలందుఁ జరింపుము కార్చిడంగుతో
లేదవుగాక క్రొమ్మెఱగు లేమవియోగము నీకు వ్రేల్మిడిన్.

కవిరాజుగారు చక్రనిరుద్ధము - కూర్చొని మున్నగు నెరసులు కొన్ని శాకుంతలకవితలో దొఁలించిరి. ఆనాటకములో నీచ పాత్రోచితమైన వాడుకభాష యెంతసొగసుగ నడచినదో?

క. ఇల నెంత పెద్దదైనను
కులవృత్తిని విడిచిపెట్ట గూడదుగందా?
తలచదుము చదుముకొని మేఁ
కలఁ జంపే బాపనయ్య కటికోఁడయ్యా!

నీలాద్రిరాజుగారు పిఠాపురమురాజ్యమును బరిపాలించిన శ్రీ రాజా వత్సవాయి వేంకటసింహాద్రి జగత్పతీంద్రుని యాదరమునఁ దుని సంస్థాన కవిగానుండి పేరందెను. తునిరాణి శ్రీ సుభద్రాంబిక యీకవిని బహుగౌరవముతోఁ జూచినది. నేఁటితునిరాజుగారు శ్రీ వత్సవాయి వేంకటసూర్యనారాయణ జగపతిరాజావారి పట్టాభిషేకసందర్భమునఁ బ్రదర్శనముచేయుటకై కవిరాజుగారు శాకుంతల మాంధ్రీకరించినటులు ప్రస్తావనలో నున్నది. శ్రీవారి సంస్థానమున నీయన జేగీయమానముగ శతావధానము గావించెను. ఆంధ్రభారతీ తీర్థవారు 'కవిభూషణ' యను బిరుదముతో నీయనను సత్కరించిరి. కవిరాజుగారు తాను శతావ ధాని నన్నసంగతి యీపద్యములలోఁ జేరుకొనెను.

శా. నానాసాధు సభాసదార్య సుమనోనాళీకనాళ ప్రణా
ళీ నిర్వ్యాజ నిపీయమాన సువచో లీలామృతా స్వాదనా
పానఃపున్యరసోదయుండ సుమనః పద్మైకసంవేశిత
శ్రీనాథుండ శతావధాన కవితా సింహాసనాధీశుఁడన్.

మ. తునిరాజేంద్రుశతావధాన కవితాతుష్టాత్ముఁ గావించి యా
యన సమ్మాన విభూతిమై 'సుకవితాయద్యస్తి రాజ్యేనకి'
మ్మనురీతిన్ గవిరాజటంచును జనం బాబాల గోపాలమున్
వినుతింప న్విలసిల్లువాఁడఁ గవితా విద్యానవద్యాకృతిన్.

నీలాద్రిరాజుగారు కవియు, శతావధానియుఁగాక మంచివిమర్శకుఁడని 'ఆంధ్రక్షత్రియులు' అనిన చిన్నపుస్తకమువలనఁ దెల్ల మగును. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు 'ఆంధ్రులచరిత్రము'' లో నాంధ్ర దేశమును బరిపాలించిన కాకతీయులు సూర్యవంశక్షత్రియులని తొలుత వ్రాసి, తరువాతఁ జతుర్థకులజులని మరలవ్రాసిరి. పరస్పరవిరుద్ధముగ నిటులు వ్రాయుటకుఁ గారణమేమని యడుగ మొదటిది భ్రమ యనియు, రెండవది ప్రమ యనియుఁ బిమ్మట వాదించిరి. అప్పుడు మన కవిరాజుగారు శ్రీ రావుగారి వ్రాఁతను నప్రమాణముగఁ గాదని వాదించి కాకతీయులు క్షత్రియులే యని యీ పుస్తకములోఁ దెల్పి వ్రాసిరి.

ఈ కూర్పునకుఁ బీఠిక వ్రాయుచు విమర్శకాగ్రేసరులు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు చిట్టచివర నిట్టులుత్తమయభిప్రాయము వెలిఁబుచ్చిరి.

"...ప్రతాపరుద్రాదులు శూద్రులను భ్రమ పల్వురకుఁ గలిగినది. నేనును నందులోని వాఁడనేగాని శ్రీ కవిరాజుగారు వ్రాసిన యీ గ్రంథము చూచినతరువాత నే నిదివఱకుఁ దలఁచినది తప్పని గ్రహించి దిద్దుకొన వలసినవాఁడ నయితిని.''

ఈ యుభయవాదములలోని సాధుతాసాధుతలు నిర్ణయించుకొనుట కిది సమయముగాదు. కవిరాజుగారు చక్కని విమర్శన శక్తి కలవారని

"ఆంధ్రక్షత్రియుల" వలనఁ బ్రత్యక్షమగును. అదేమనకుఁ బ్రస్తుత విషయము.

నీలాద్రిరాజుగారు అచ్చతెనుఁగులోను జక్కని చిక్కని కవిత నంతరింపఁగలరు. ఈ వృత్తాంత మీ చాటుపద్యము చాటుచున్నది.

ఉ. గూటిపులుంగులన్ మొఱఁగి కూళతనంబున నేయునట్టి వా
వేఁటలు గీటలున్ జమునివీటికి బాటలు రాచపాడికిన్
జేటులుగాక మార్తురెదఁ జిందఱవందఱవో రొదల్ దెసల్
బీఁటలువాఱఁగా ననికిఁ బెండ్లికిఁ బోయినయట్లు పోవలెన్
సూటి కొలందికిన్ దివియఁ జూచి నిగిడ్చిన మార్గుచేతి వా
లీటు తనంత తావలచి యొక్కటి పైఁబడు పూవుఁబోఁడి మే
మీటిన చన్నుదోయి వలె మీఁదికి రావలెనొక్కపెట్ట పై
పాటున క్రొత్తనెత్తురుకలవమ్ములు గ్రమ్మఁగఁ జేరుదమ్మునో
నాటవలెం దగం దనమనమ్మున మార్గణి ముమ్మరంపు మై
తీఁటలువోఁ బెనంగవలెఁ దేనియ తేటలవోలె నెత్తురుల్
నోటఁబడంగ నొగ్గఱచి మూల్గఁగావలె నీడబోని పో
రాటమునం దొడల్ విడిచి గ్రక్కున నక్కునఁ జేర్చు వేలుపుం
బోటి చనుంగవన్ మిగులఁ బొక్కవలెన్ మతి పేరసంబుతో
నోటమిలేక తా బ్రతికియుండినచో మగలెల్ల వీఁడపో
మేటిమగం డనంగఁ బుడమిం బసమీఱఁగ నేలఁగావలెన్
పాటుపడంగ నొవ్వ తమపాడికిఁ జాలక దుక్కముచ్చులై
కూటికిఁ గొంతలేక తిని కూర్చుని యొండొరు నెక్కసెక్కపున్
మాటలనాడికొంచు వెడనవ్వులతోడన ప్రొద్దుపుచ్చి మై
పాటున నెంతయున్ జమునిపాల్పడి పోవఁగ మేమె మేమె పో
మేటి కొలంబువార మని మీసలు ద్రువ్వెదు రాచవారికిన్
గాలికసయ్యనే యకట! కయ్యముతియ్యము నాఁడునాఁటికిన్.

# జనమంచి శేషాద్రిశర్మ

## 1882

తెలగాణ్య వైదిక శాఖీయులు. తల్లి: కామాక్షి. తండ్రి: సుబ్రహ్మణ్య శర్మ. జన్మస్థానము: నెల్లూరు మండలములోని కలువాయపురము. నివాసము: కడప. జననము 4 – 7 – 1882 సం॥ విరచిత కృతులు: ౧. బ్రహ్మపురాణము. ౨. బ్రహ్మాండ పురాణము. ౩. కౌమారికాఖండము (స్కాందాంతర్గతము) ౪. సర్వమంగళాపరిణయము [మహాకావ్యము] ౫. హాలాసమాహాత్మ్యము ౬. లలితోపాఖ్యానము ౭. శ్రీమద్రామాయణము ౮. సంగ్రహరామాయణము ౯. విచిత్రపాదుకాపట్టాభిషేకము ౧౦. పాండవాజ్ఞాతవాసము. ౧౧. దైవజ్ఞ సార్వభౌమ విజయము ౧౨. సీతా స్వయంవరము ౧౩. సువ్రత ౧౪. కీరవాణి ౧౫. మనోరంజని. ౧౬. యతిధర్మప్రదీపిక ౧౭. సతీతిలక. ౧౮. కడప మండల చరిత్ర ౧౯. ఉదయగిరిముట్టడి ౨౦. శ్రీకృష్ణావతార తత్త్వము ౨౧. శ్రీరామావతార తత్త్వము [కొన్ని యముద్రితములు] ౨౨. కేదారారుణాచల ఖండములు [స్కాందాంతర్గతములు] ౨౩. హృదయానందము. [కల్పిత ప్రబంధము–పద్యసంఖ్య మూడువేలు] ౨౪. శ్రీశంకర గురువరచరితము [3 వేలు పద్యములు] ౨౫. కవివిలాసము. ఇత్యాదులు.

అధునాతనాంధ్రకవులలోఁ బురాణవాఙ్మయమువంకఁ జూచినవారు నలుగు రైదుగురు మాత్రము. వారిలో భారతరామాయణముల నాదరించినవారి సంఖ్య పెద్దది. సంస్కృతములో అష్టాదశపురాణములు కలవు గదా! వానిని జూచుచున్నవారు తక్కువ నేఁ డనువాద వాఙ్మయమునకు, విశేషించి పౌరాణగాథలకు మనవా రంతగాఁ జెవులొగ్గకపోవుటచేఁ గాబోలు భారత రామాయణాదులైన నాలుగైదు పురాణములకంటెఁ దెలుఁగుబాసలోఁ బురాణములు లేవు.

ఈకొఱంత కొంతవఱకుఁ దీర్చినకళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు యావదాంధ్రమునకు నభివందనీయులు. వీరు ప్రస్తుతము కడపలోని

'లలితావిలాసము' న పుణ్యజీవనము గడుపుచున్నారు. వీరి యుభయ భాషాపాండిత్య మప్రతిమానము. పౌరాణికతత్త్వపరిజ్ఞాన మసమానము. ఉపనిషత్తులు చదివిరి. సూత్రభాష్యము నెఱిఁగిరి.

శేషాద్రిశర్మగారి యభినివేశ మాశ్చర్యకర మైనది. వీరు వ్రాసిన పద్యములు మొత్తము లక్షకు మించునేమో! "పాండిత్యమున నున్నవన కవిత్వమున లే" దని కొందఱివాదము. వస్తుస్థితి నిర్ణయించుట తరముకాదు. ఈ విమర్శ కాఁగినవారు పురాణకవులలో నెందఱుందురు!

వీరు శ్రీమద్రామాయణమును దెనిఁగించిరి. అది స్వేచ్ఛానువాదము గాదు. విద్యార్థులకు సైతము సులభముగాఁ దెలియుటకు శ్లోకమున కొక పద్యము చొప్పున వ్రాసిరి. విసువు విరామము లేక యిన్ని పద్యములు వ్రాయుట కవి కుండవలసిన గొప్పశక్తులలో నొకటి. శర్మగారు మూర్తీభవించినదైవభక్తి. వీరి గ్రంథము లన్నియు భగవత్పరములే. బ్రహ్మపురాణ మాంధ్రీకరించిరి. బ్రహ్మాండపురాణ మనువదించిరి. స్కాందమున కేతూత్పత్తి కౌమారికాఖండము కేదారారుణాచలఖండములు పరివర్తన మొనరించిరి. తాండవకృష్ణభాగవతము - సర్వమంగళాపరిణయము-హనుమద్విజయము-కృష్ణావతారతత్త్వము (12భాగములు)-రామావతారతత్త్వము (10భాగములు)-సంగ్రహ భారత భాగవత రామాయణములు - ఈగ్రంథములన్నియు భగవత్సంబంధములే గదా! చరిత్రవిషయముగూడ నెఱుఁగుదు నని కడపమండలచరిత్ర - ఉదయగిరి ముట్టడి రచించి చూపిరి. శర్మగారికి మనుచరిత్ర మనిన నెక్కుడ మక్కువ. పెద్దన వీరి దృష్టిలో మహామహాంధ్రకవి. ఇతని జన్మాదికమును గూర్చియు, నీతని కవిత్వవిశేషములనుగూర్చియు వీరు చక్కని పరిశోధనములఁ జేసియున్నారు. అవి సమంజసముగా నుండును. పెద్దన బళ్ళారి మండలమునఁ గల యాలూరుసీమనుండు 'దోరాల' గ్రామమునఁ బుట్టె నని వీ శేషలింగము పంతులు గారు వ్రాసిరి. ఈవిషయమున ననేక సత్య

పరిశోధనలఁ జేసి సప్రమాణముగా నాయనవాదమును గాదని వాదించిరి. ఇది వీరి చరిత్ర పరిజ్ఞానము వెల్లడించుటకుఁ బనికివచ్చును. వీరు ప్రత్యేకముగా 'మనుచరిత్ర హృదయావిష్కరణము' రచించిరి.

చిన్ననాఁట శేషాద్రి శర్మగారు కడపలో విద్యాభ్యాసము కొన్నాళ్లు చేసిరి. అక్కడ నసిగఁ జనువు సాఁగమి కాశీపట్టణమునకుఁ బదునొకండవ యేఁటఁ బయనము సాఁగించి, కాలినడకచే నాలుగేండ్లకు వారణాసిఁ జేరికొనిరఁట. అచ్చటఁ గొన్ని వత్సరము లుండి సంస్కృతవిద్యాధ్యయనముగావించి వచ్చి, విజయనగరము, కసిమికోటలలోఁ బండితసన్నిధిని స్కంధత్రయాత్మకజ్యోతిర్విద్య నభ్యసించిరి. జ్యోతిశ్శాస్త్రమున శర్మగారు చాలఁ బ్రజ్ఞావంతులు.

జ్యోతిషము చెప్పుచు నందఱ నాశ్రయించి తిరుగుట వీరి కిష్టము గాక కడపలోని యాంగ్ల పాఠశాలలో నాంధ్రపండితులుగాఁ బ్రవేశించిరి.

నెల్లూరికడనున్న జన్నవాడ క్షేత్రమునఁ బినాకినీతీరమున కామాక్షీ మల్లికార్జునుల సన్నిధిని వీరు నడుమనడుమఁ బెక్కు నెలలు వసించి తపము గావించుచుందురని వినికి. ఆయుపాసనామహిమచేతనే వీరు మహోత్సాహముతో గంటకువందలు పద్యములు వ్రాయుచున్నా రని చెప్పుదురు. ఒకమహాశయు లిట్లు వ్రాసిరి.

ఆ. వె. ఉన్నకవులలోనఁ జన్నకవులలోన
నిన్నికృతులు వ్రాయఁ గన్న దెవరు !
శాముఁ దల్లపోతరాజునకుంబోలెఁ
బలుకుఁదోడు మేలు ! లలిత నీకు.

వీరు నరాంకిత మొనరింపలేదు. జనమంచి శర్మగారు విద్వత్కవులేగాక సత్త్ములు, సహృదయులు, పరమభాగవతోత్తములు. దుర్వామర్శనములు దురహంకారములు వీరికినచ్చవు. ఒకప్పు డెక్కడో యొకసభలో

మన శర్మగారిని వ్యక్తిపరముగా దూషింప మొదలిడిరట. ఆ సభలో శర్మగారును గలరు. కాని వారు నవ్వుకొనుచు నూరకుండిరట. అయినను సభావేదికకుం బ్రక్కవారి ప్రోత్సాహముచే నెక్కక తప్పినది కాదు. లేచి చెప్పినమాట లివి: "మహాజనులారా! ఈసమయమున వాదప్రతివాదములు జరపుట నాకిష్టములేదు. ఏనాఁడో ఎన్నితరముల క్రితమో జనులయెడ మంచిగా మెలంగుచుండుటచే మాకు "జనమంచి" యను నింటిపేరు వచ్చినది. ఇప్పుడు నేను మొగముచెందుకొని వారివలె ననవసరముగా నా ప్రతిపక్షుల విమర్శించితి నేని మాయింటిపేరు నేతిబీఱకాయను జేసినవాఁడ నగుదును." ఈ వాక్యములలో శర్మగారి సహృదయత వ్యక్తమగుచున్నదిగదా? మహాకవులకు మంచితనము తోడైనచో వచింపనేల? శేషాద్రిశర్మగారు దత్తమండలమునకే గాక తెలుఁగు బుడమికి వన్నెదెచ్చు కవులు. నాస్తికతా ప్రాబల్యముతో నిండియున్న నేటికాలమునకు శర్మగారివంటి భాగవత కవులు, వారి గ్రంథములవంటి భక్తి రసపూరిత గ్రంథములు మిన్నగా జనింపవలసి యున్నది. శర్మగారి గ్రంథము లెల్ల వెలువరింప దీక్షించిన శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారి నభినందింపవలయును.

కళాప్రపూర్ణులు, కావ్యస్మృతి తీర్థులు నగు శేషాద్రిశర్మగారిని గూర్చి కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రశంస యుదహరింపఁదగినది. "వీరి కవిత్వమునకు వీరి వినయాతిశయము శోభను గలిగించుచున్నది. కవిత్వ పాండిత్యములకును, సౌజన్యమునకును నిత్యసంధి లేదనుట మనయెఱింగిన విషయమే. వీ రెవ్వరినిగాని యధిక్షేపించినట్లు, ఎవ్వరితోగాని వాదమునకుఁ బూనుకొన్నట్లు గానరాదు. సౌజన్యము వీరి కలంకారము. ప్రఖ్యాతికై ప్రాకులాడువారు కారు......"

శర్మగారి కవిత్వము ధారాళధోరణి గలది. వీరి గ్రంథము లన్నియు ననువాదములే యగుటచేఁ గల్పనాగరిమ వీ రెంతగాఁ బ్రదర్శింపలే

తెలిసికొనఁ జాలము. కౌమారికాఖండమునందలి గౌరీశంకర వివాహ ఘట్టమున వీరికవితాధార జాహ్నవి వలె నిట్లు పొంగారుచున్నది.

క. కనిపెట్టుచు బ్రాహ్మణపరు
లనూన పద్ధతిని సాగునట్లొనరుపఁగాఁ
దనయాన్వయములఁ జెప్పం
గను బూని హిమాద్రి యనియెఁ గన్యక దీనిన్.

క. పితరుల దౌహిత్రిగ నా
సుతగా నెఱుఁగంగఁ దగును శుభగుణ నిలయన్
మతిమద్వర్య నొసంగెద
హితమిది లోకాళి కన్న యిచ్చ పొలయుటన్.

క. అనియూరకుండె; నల్లుని
దనఁబడు వంశం బెఱుంగఁ దయ్యెంగానన్
మునిముఖుల నడిగె వంశం
బన నెయ్యది శంభుని దని యంద ఱెఱుఁగమిన్.

మ. వనజాక్షుం డిటు పల్కె ; నెవ్వరిని నీ వార్తన్ వచింపంగ నే
రని వారిం గని ప్రశ్న మీావడిగినన్ రా దుత్తరం బెవ్వరై
నను గుర్తింపఁగరాని యన్వయము వింతంగాంచు నీయల్లునే
యనుమోదంబునఁ బ్రశ్నచేయు; మతఁడే యావార్తలం జెప్పెడున్.

క. వినుమహీంద్రయే యహిపాదము
ల నెఱుంగుంగాని రెవఁ డిలాస్థలిఁ జెప్పం
గను జాలునె తెలియుదు; నని
తన గోత్రముఁ జెప్పఁజేని తగ మదప్పగినిన్.

క. ఓసఁగంగ రాదు; శంభున
కనమాన్వయుఁ డగుట; ననఁగ నమ్మాటకు నం

దెసఁగెను హాసధ్వను; లా
సుసమయ మావేశుకలకుఁ జోటయి యుండెన్.

చ. హరుఁడిపుడేమి యుత్తరము నారసి యిచ్చునొ వీనులార ని
త్తరుణమునందు విందమని తత్తఱమందుచు సభ్యులెల్ల నుం
డిరి; ధ్వని యద్ది తగ్గ నట సీలగళుండు విమర్శపద్ధతిన్
వరమతి నెన్ని భీతుఁడగువానివిధంబున నానతాస్యుఁడై.

గ్రంథవిస్తారరచనలో నచటనచటఁ గొన్ని వ్యర్థపదములు దొరలినను, శర్మగారి ధారావాహికమైన శయ్యలో నవి పరిగణింపఁ దగినవి కావు. కవిత్వమే తపస్సుగా భావించి, రూపికతో మనస్సు నిలఁబెట్టి యెన్నో మహాకృతులు రచించి యిచ్చుచున్న శేషాద్రిశర్మగారి సేవ రాయలసీమలో తెలుఁగుసీమలో విలువయిడరాని యొక మేలిరవ్వ.

# త్రిపురాన వేంకట సూర్యప్రసాదరాయకవి

## 1889 - 1945

తెలగా వంశీయుఁడు. తల్లి: నారాయణమ్మ. తండ్రి: తమ్మయ్య దొర. జన్మస్థానము: శ్రీకాకుళము తాలూకాలోని సిద్ధాంతము. జననము: 1889 అక్టోబరు 31 తేదీ. నిర్యాణము: 1945. ముద్రిత కృతులు: ౧. నిర్వచన కుమారసంభవము [౬ ఆశ్వాసములు. 1913 ముద్రి.] ౨. రఘూదయము [౪. ఆశ్వా. 1924 ముద్రి.] ౩. రతి విలాపము [ద్విపద కావ్యము 1926 ముద్రి] ౪. కోయిలరాయబారము [కాళిదాసుని మేఘ సందేశమునకు స్వతంత్ర దేశీయ గేయానువాదము. 1940 ముద్రి] అముద్రితములు: ౧. నిర్వచన రఘువంశము [శ్లోకమునకుఁ బద్యముగాఁ దెనిఁగించినది. 19 సర్గములు] ౨. ఇందుమతీమందారము [అజ చరిత్రము] ౩. ఉత్తరరామ చరిత్రము [భవభూతినాటకమున కాంధ్రీకృతి] ౪. కిరాతార్జునీయము [భారవికిఁ బద్యాంధ్రీకరణము] ౫. అజవిలాపము [ద్విపద ఇది 'భారతి' లోఁ బ్రకటించిరి] ౬. మృతజీవి జీవితామృతము [తమ్మయవిభూ! తండ్రీ! కవిగ్రామణీ!" అను మకుటముతోఁ దండ్రిగారి జీవితచరిత్ర ప్రతిబింబించునట్లు వ్రాయఁబడిన చిన్నగ్రంథము] ౭. శ్రీరామాశ్వమేధము [పద్మపురాణములోని పాతాళఖండము, ఇది యసంపూర్ణము] ౮. శ్రీభగవద్గీతామృతము [దేశీయచ్ఛందోగీతికలలో ద్విపాత్రనాటికగా రచింపఁబడినది].

శ్రీ సూర్యప్రసాదరాయకవి త్రిపురాన తమ్మయరాట్కవీంద్రునకుఁ దగిన తనయుఁడు. ఇంకను కొడుకు కళాప్రపూర్ణుఁడు కాలేదు, సరిగాఁ బదునాలుగు నెలలేని నిండలేదు. తమ్మయకవి భగవదాజ్ఞకు బద్ధుఁడయ్యెను. పాండితిలోఁ గవితలో వీరి రచనములను బట్టి పరికించినవారికి 'పుత్రాదిచ్ఛేత్పరాజయ' మ్మనిపించును. సూర్యప్రసాదరావుగారి జననం 1889లో. ఆయనకేమి? పరులకడకుఁ బోయి చేచాఁచనక్కఱలేకుండ, స్వేచ్ఛగాఁ దిని చేతులార నింత పెట్టుకొను శ్రీమంతుల వంగడములోఁ బుట్టెను.

పసితనముననే తండ్రిని బాసినవాఁడని కడుగారాబమునఁ బెంపఁబడెను. పదునైదేండ్లు వచ్చుదాఁక వేఁటమీఁదను, ఆటలమీఁదను గల వేడుక విద్యపై లేదు. "తమ్మనదొరగారికిఁ దప్పి పుట్టితివి నాయనా!" అని యొక పెద్దమానిసి వీథిఁబోవుచు నన్నమాట శూలముఁబోలెను. సూర్య ప్రసాదరావుగారు వెంటనే యింటికిఁబోయి తన బుద్ధి చదువు బాటపై నడిపించెను. మనోరథము మంచిది గానఁ దను యింటి పండితుఁడు శ్రీ ముక్కవిల్లి సాంబయశాస్త్రిగారి సారథ్యముతో నడక చక చక సాఁగినది.

గురుదేవులు సాంబయశాస్త్రిగారిని గూర్చి ప్రసాదరాయ కవి 'మృతజీవి జీవితామృతము' లోఁ గనఁబఱిచిన భక్తి గౌరవ మీ పద్యములలో నారయఁగలరు.

మ. హరిభక్తుండును శేముషీ గురుఁడు నీ యాస్థాన విద్వత్కవీ
శ్వరుఁడౌ సాంబయశాస్త్రి ముక్కవిలి వంశ స్వచ్ఛ రత్నమ్ము మ
ద్గురుఁడైనాఁడు సుమయ్య! యయ్యనఘుఁ గన్గొన్నప్డు నిన్గన్న యా
దరమున్ భక్తియుఁ గల్గుఁ దమ్మనయ విభూ! తండ్రీ! కవిగ్రామణీ!

మ. పదునై దేఁడుల యీడు వచ్చుదనుకన్ బాలోచితక్రీడలం
జదువుల్ మాని చరించునాకుఁ గవితాసక్తిం బ్రసాదించి యీ
ప్పదమాదారికిఁ ద్రిప్పి తాఁ జదువుచెప్పెన్ మద్గురుండెంతు నం
త దయాళుండు గలాఁడె తమ్మయ విభూ! తండ్రీ! కవిగ్రామణీ!

మ. ధన విచ్ఛిత్తిగాని యాతఁడిడు విద్యాబుద్ధులే నాకు నీ
ధన సంపత్తికి మీఱి కీర్తియు మహత్త్వమ్మౌనయుంగూర్చె, న
య్యనఘు న్నేన్నుఁ దలంప నెక్కుడతఁడేయౌఁ, గాని, నాకస్థియా
తని నీ విచ్ఛిత్తి గాదౌ తమ్మయ విభూ! తండ్రీ! కవిగ్రామణీ!

రఘువంశము మొదలగునవి, కావ్యములు, నాటకములు మున్నగాఁ జదువవలసినవెల్లఁ జదివిరి. తెనుఁగులు తనివితీఱ వినిరి. తండ్రిని స్మరణకుఁ దెచ్చుచు, పండితుల మెచ్చు లందుచు జానుదెనుఁగులోఁ దియ్యని కవిత్వము కట్టుటకుపక్రమించిరి. రఘువంశము, కుమారసంభవము, శ్లోకమునకుఁబద్యము చొప్పునఁ జెప్పిరి. మొన్న 1940 లో మేఘదూతమునకు కడుఁ గ్రొత్తరీతిని గేయములలో ననువాదము గావించి ప్రకటించిరి. ఆంధ్రకాళిదాసుఁడని యీయనకు బిరుదమున్నది. 'భారతీతీర్థము' లో శ్రీజయపురాధీశ్వరునివలన వీరికి 'కవిభూషణ' యను నుపాధి లభించినది. వానితోఁ బనేమి ? ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు 1943 లోఁ జిలకమర్తి కవితో పాటు వీరిని 'కళాప్రపూర్ణు' లని బిరుదనామ మిచ్చి మెచ్చిరి.

సూర్యప్రసాదరాయ కవి కవితాకళలోఁ బ్రపూర్ణుఁ డనుట కతని కృతులు పరమప్రమాణములు. ఇక్కవిమణికిఁ దిక్కనమఖికవిత యాదర్శముగా నుండియున్నట్లు పదము పదమునఁ గానవచ్చును. పొలుపు గల తెలుఁగు పలుకుఁ గూర్పులో మంచినేర్పు మన కవిగారి కున్నది. వీరి 'నిర్వచన కుమార సంభవము' లో నెల్లను కందములు, గీతములు, పెద్దవృత్తములు పెక్కు లేవు. ఉదాహరణమున కొక మెత్తని పద్యము చూడుఁడు :

క. కటముల తేఁటలు వో గజ
ఘటలు సరళతరుల రాయఁగాఁ బొల్వడి తత్
స్ఫుటతరపరిమళభర మ
చ్చోటున న్నుత్తములఁ జేయు సురభిళములుగాన్.

౧ ఆ. ౭౫ ప॥

'రఘూదయము' లోని వొక రెండు ప్రకటింతును :

మ. ఒకనాఁడొక్కమదాంధ సింధురము గండోద్భూత కండూతి కో
ర్వక యీ చెట్టునరాయ మాడె వలపారన్ దీనిపై పట్ట దా

నికి నీవార ధరాధిరాజసుత కన్నీరుట్ట శోకించె నక్కుం
దకుమారుండసురాశుగక్షతులు వొందం గుందు చందంబునన్.

ఉ. ఆదినమాదిగా నె త్రిపురారి ననుం గగిమైరిఁ జేసి కుం
భోదర యీహిమాద్రి గుహనుండి యిటన్ దరిఁజేరు జంతువున్
గాదన కారగించుచును గావుము దీని నటంచుఁ బంచెఁ దో
ష్ణో దయితాళపోలములతో నెలనవ్వులు వియ్యమందఁగన్.

—ర. అ. 3ఆ., 32 ప॥

వీరిగ్రంథములలో నే పట్టులు చట్టిచూచినను తియ్యని పలుకుబళ్ళతోఁ గనుపట్టుచున్నవి. ఈయన కృతు లన్నియు ననుసృతులైనను, దేనఁగు నేతలో నొక క్రొత్తఁదన ముండి యుందగించుచున్నది. మేఘదూతము నకు స్వాంతత్ర గేయరూపముగా వీరుగావించిన తెలుఁగు పరివర్తనము వీరి కృతుల కెల్లఁ గిరీటము. గేయరూపముగ నున్న నేఁటి సలక్షణ కావ్యములకును నిది మస్తక మాణిక్యము. శ్రీ జయపురమహారాజులు శ్రీ విక్రమదేవవర్మగారి కీ కృతిని పెంపుడుబిడ్డగ నంపిరి. వారు దానిని శ్రీరామచంద్రున కర్పించుకొనిరి. ఈకృతి తొలుత 'ఋయిలు ఋఱుఁగు' లలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నుడ్వటించినటులు "...కి యల్ల నల్లన విరియుచు వల్పులు గొల్పుచు నమృతబిందులొలుకు నలద రేకులఁబోలె సులలితములై జిలు జిలు మనఁ జలువలఁ జల్లుచుఁ జవులఁ జిందుచు విందులు గొల్పుచు నున్న పలుకుల పొలుపులో మురిపపు టొయ్యారపుటూపుఁదోఁపించు శయ్యతో దేశితెలుఁగుతీరునఁ గడు డియ్యమైన పాటసారుతో నీక నిట్లు తెలిఁగించు టన్యుల కసాధ్యమనఁ దగిన ట్లున్నది. ...."

సీ. పువుఁదేనె సోనలై చెవులపండువు సేయు
కలికిపలుకుల ముద్దులొలుక నేర్చుఁ

బద్దెమ్మలోఁ బాట పాటలోఁ బద్దెమ్మఁ
గూడి రా వాయిగాఁ బాడ నేర్చు
నరఁటిపం డొలిచి తానరచేత నిడురీతి
భావార్థములఁ దేటపఱుప నేర్చు
గానాభినయ నాట్య కవితాకళలఁగూర్చి
యరుదార నాటకా లాడ నేర్చు
సర్వగతుల నీకును సంతసమ్ముఁగూర్పఁ
గాళిదాస సత్కవి మేఘకావ్యకల్ప
పుష్పసౌరభ లహరికా మూర్తియైన
మా మొయిలుఁ గబ్బపుఁగన్నె భూమహేంద్ర!

మొయిలు రాయబారము.

వలువన్నె జోతిరేకల చుట్లతోఁగూడి
పాలుపారునే నెమిలిపురికన్ను పట్టూడి
(ఱు)లరాలఁ గొడుకుపైఁగల ప్రేముడిని దానిఁ
గలువతే కిడుచెవిం గయిసేయు నాగౌరి
సెలతాల్పు శిరసు వన్నెలలచే నెంతయుఁ
దెలుపారు కన్నుఁ గొల్కులతోడి గుహుని య
ప్పులుఁగుద త్తడి నవల మలగవుల మఱుమ్రోత
లలమ బిట్టుఱిమి గొండిలికిఁ దార్పఁగదన్న!

క్రొమ్మొఱపు...

ఇట్టికవితతోనున్న యీ 'మొయిలురాయబారము' క్రొత్తతీరుగలదై సచారువుగా నున్నదనుట నిర్వివాదము. యక్షుఁడు చిట్టచివర మేఘున కనుచున్న మాటల యందవుఁ బొందిక కనుఁగొనుఁడు! కాళిదాసుని కవితతో వియ్యమందుచున్నదిగదా!

మెయిలురాయఁడ! యిట్లు మొదటివియుక్తిఁ
జాలశోకించు నీనకియు నోదార్చి
నంది కోరాటలకా నలఁగు నా వెండి
మలనుండి వేవేగ మరలి యేతెంచి
తగినగుర్తులతోడఁ దరళాయతాక్షి!
పంపిన నేమఁవు వార్తలం దెల్పి
వేఁబోక తతిమల్లె విరివోలెఁ బ్రిదిలి
తలరు నాజీవము న్నిలువంగదయ్య!

* * * *

ఇట్లు నీదు మెఱుంగు టిల్లాలితోడ
నీకెన్నఁడు వియుక్తి లేకుండుఁగాక!

ఈ మెయిలు రాయబారములోని గేయముల తీరున నే "శ్రీ భగవద్గీతామృతము" కూడ రచించిరి. కృష్ణార్జును లిరువురు నిందుపాత్రలు. ఈ గ్రంథమింకను ముద్రణములోనికి రాలేదు.

శ్రీ సూర్యప్రసాదరావుగారు తెలుఁగుకవితలో మంచి మంచి మెలఁకువలు తెలిసిన సరసకవులు. కవితలో నధునాతన భావములు వీరియందున్నవిగాని, భాషావిషయకమైన సంస్కారము వీరికంగీకారము కాదు. 1927 లో బళ్ళారిని జరిగిన ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక మహాసభకు వీరి నధ్యక్షులుగా నెన్నుకొనిరి.

1922 సం॥ జూలై 18వ తేదీని జార్జిచక్రవర్తికుమారుఁడు 'ప్రిన్సు ఆఫ్ వేల్సు' మదరాసు సెనేటు హాలులో శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, చదలువాడ సుందరరామశాస్త్రి గారలతోపాటు మన ప్రసాదరావుగారికిని సువర్ణకంకణము, సాలువలు నొసఁగి గౌరవించిరి. [illegible]

నెనోన్నె సన్మానము లందిన ధన్యులువీరు. ఈయన ఇష్టదేవతాప్రార్థన మిట్లున్నది.

సీ. వాసస్థలంబు లక్ష్మీశ్రీ సరస్వతుల శు
ద్ధాంత మైనట్టి సిద్ధాంతమనియు
జననంబు విద్యాయశశ్శ్రీగుణాకరం
బగు త్రిపురాన వంశాబ్ధి యనియు
వక్తదేవీభాగవతముఁ దెల్గించి పెం
పెసఁగు తన్మాయరాట్కృతీంద్రుఁ డనియు
నిత్యకృత్యము భవత్ప్రీత్యర్థమై నవ్య
కృతి పుష్పపూజలర్పించు టని యుఁ
జెప్పికొనుట కుత్సాహంబుఁ జెందఁ దగిన
యిట్టి యౌన్నత్య గరిమ నా కిచ్చినావు
వినుతి సేయంగఁ దరమె నీ వినమ దమన
దక్ష సత్పక్ష కరుణా కటాక్ష మహిమ.

చ. కడుకొని యన్యులంగడుపు కక్కుటితిం జెయి సాఁపకుండఁ దాఁ
గుడువఁగఁ గట్టఁగా నొరులకుం దగఁ బెట్టఁగఁ జాలినంత యె
క్కుడుసిరు లిచ్చి దానఁ బ్రతికూల మదాది వికార చేష్టలం
బడి చెడనీక నీదుపదభక్తునిఁ జేసితి వింతయొప్పదే !

# తిరుపతి వేంకట కవులు

# 1871-1919
# 1870-1950

ఈజంటకవులలో మొదటివారు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు. రెండవ వారు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు. తిరుపతిశాస్త్రిగారిది వెలనాటిశాఖ. అభిజనము : ఎండగండి (కృష్ణామండలము). తల్లి : శేషమ్మ. తండ్రి : వేంకటావధాని. జననము : 1871 సం. నిర్యాణము : 1919. వేంకటశాస్త్రిగారిది ఆరామద్రావిడశాఖ. జన్మస్థానము : ఏనాము [ఫ్రెంచివారిది]. నివాసము : కడియము. తల్లి : చంద్రమ్మ. తండ్రి : కామయ్య. జననము 1870॥ ప్రమోదూత సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశీ సోమవాసరము. నిర్యాణము : 15 ఫిబ్రవరి 1950 సం॥ శివరాత్రి పుణ్యదినమున. విరచితగ్రంథములు : పాండవజననము, పాండవోద్యోగము, పాండవాశ్వమేధము, పాండవ రాజసూయము, పాండవ విజయము, పాండవ ప్రవాసము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, ప్రభావతీప్రద్యుమ్నము, బాలరామాయణము [నాటకములు]. బుద్ధచరిత్రము, లక్షణాపరిణయము, ఏలామహాత్మ్యము, శ్రీనివాసవిలాసము, దేవీభాగవతము, పతివ్రత, సుశీల, పూర్వహరిశ్చంద్రము, శివలీలలు, నానారాజసందర్శనము, శ్రవణానందము [పద్యకృతులు]. విక్రమాంకదేవ చరిత్రము, చంద్రప్రభాచరిత్రము, హర్ష చరిత్రము, [వచనగ్రంథములు]. గుంటూరిసీమ, గీరతము, శృంఖలాకృతీకరణము, పశ్యాం పుశ్యాం, పక్షశబ్దవిచారము, కనిగ్రహము [విమర్శగ్రంథములు]. శతావధానసారము, గుంటూరు శతావధానము, పిఠాపురము శతావధానము, వేమవరాగ్రహార శతావధానము [శతావధానకృతులు] ఇత్యాదులు.

దోసమటం చెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినార మీ
మీసము రెండు బాసలకు మేమె కవీంద్రులమంచుఁ దెల్పఁగా
రోసముకల్గినం గవివరుల్ మముఁ గెల్వుఁడు - గెల్చిరేని యీ
మీసము తీసి మీ పదసమీపములం దలలుంచి మ్రొక్కమే.

అని ప్రతినపట్టి కొన్నినా ళ్లాంధ్రకవితా సామ్రాజ్యము నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన తిరుపతి వేంకట కవులు జగమెఱిఁగిన బ్రాహ్మణులు. ఆంధ్ర దేశమున వీరి పేరు నెఱుఁగని యభిజ్ఞుఁడుండఁడు. అభినవాంధ్ర కవులలో వీరిని గురువులుగా భావించువారు వందలమీఁద నుందురు. తిరుపతి వేంకటకవుల శేకలవ్యశిష్యుల మని చెప్పుకొని గౌరవింపఁ బడువారు పెక్కుఱు. ఆంధ్రవసుంధరలో వీరు సందర్శింపని రాజాస్థానము లేదు. ఆరంభదశలోఁ దిరుపతి వేంకటకవులు "తిరుపతి వేంకటేశ్వరు" లనియే తెలుఁగునాఁట వాడుక. ఈజంటకవు లే మహారాజును లెక్క సేయలేదు. "అనుభవించితిమి దివ్యభోగములను రాజాధిరాజులకన్న నధికముగను" - "ఏనుఁగునెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము" అని చెప్పుకొనుచుఁ బ్రతిపట్టణము, ప్రతిగ్రామము తిరిగినారు; ప్రతిదాతను దర్శించినారు. వారిచేఁ దగినట్లు సన్మానింపఁ బడినసరే - లేనిచో సహజకవితా ధోరణిని మొగము వాచునట్లు తిట్టుఁబద్దెములు చెప్పుట, ఈ కవులు సిద్ధవాక్కులని వారువెఱచి పాదాక్రాంతులగుట పెక్కుచోట్ల జరిగినది. అనిదంపూర్వమైన వీరి యద్భుతశక్తి కబ్బురపడి యనేకకవులు 'శిష్యోఽహ' మ్మని చరణములఁ బడఁజొచ్చిరి. వీరి యవధాన ప్రతిభ నరసి తెనుఁగుమన్నీలెందఱో బిరుదముల నొసఁగిరి; సాలువలుగప్పిరి; సన్మానములు చేసిరి; ఏనుఁగులపై నూరేఁగించిరి.

తిరుపతికవుల జీవిత మొక మహాభారతము. ఇందే పర్వము పరిశీలించినను బ్రతిజ్ఞలుసేయుట, మీసములు దువ్వుకొనుట, ప్రతిపక్షులను బరిహసించుట, పద్మవ్యూహములు పన్నుట, వానిని భేదించుట, యెదిరి యెట్టివాఁడైన సాహసించి మీఁది కురుకుట—యివిచూతుము. ఈ భారతమునఁ గూడ రాయబారముల రభసలు, శతఘ్నుల చప్పుడులు, పాశుపతప్రయోగములు, అట్టహాసములు, తాలుకొట్టనములు కలవు. ఉద్యోగ

విజయములు, రాజసూయాశ్వమేధములు దీనిలోనివే. గీరతముకూడ నీ భారతములోనిదే. ఈ భారతసంగరమునకు 'గుంటూరిసీమ' కురుక్షేత్రము. వాగ్యుద్ధములవలనఁ దిరుపతికవుల యశశ్చంద్రికలు నలుమూలల వెల్లివిరిసినవి. ఇంత నిర్లక్ష్యముగా మహారాజులను, మహాపండితులను ధిక్కరించిన తెలుఁగు కవులు శ్రీనాథాదు లేకొందఱో మనకు వినఁబడుచున్నారు.

సంగరశక్తి లేదు, వ్యవసాయము సేయుట సున్న, సంతలో
సంగడి వేసి యమ్ముటది యంతకుమున్న వచ్చునుబడ్డి మ...కిన్
బొంగు బుజానవైచికొని పోయెద మెక్కడికేని ముష్టి చెం
బుం గొనిపెట్టు మొక్కటి యమోఘ మిదేకద, దంతిరాణ్ణృపా!

మహారాజునుగూర్చి చేసిన యీ మందలింపులో నెంతయర్థము దాఁగియున్నదో పరికింపుఁడు.

మ. అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యం గల్గు దేశమ్మునన్
జటులస్ఫూర్తి శతావధానములు మెచ్చం జేసియున్నట్టి మా
కిట రాజీయక యున్న దర్శనము నింకెవ్వానికీ రాజొసం
గుట? చెప్పంగదవయ్య పాలితబుధా, కోదండరామాభిదా!

శ్లో. రాజా విద్వాన్ భవాన్ విద్వాన్ నహో భాగ్యం మహాకవేః,
అత్రాపి దర్శనం నోచే త్కవితాన్మై నమోనమః.

విజయనగరప్రభుని దర్శించుటకు వెళ్ళినపుడు, వారు సభ చేయింపక సన్మానింపఁగా నపుడు దివాను కోదండరావుగారిని గూర్చి తిరుపతికవులు వ్రాసిన పద్యము లివి. రాజసందర్శనము ధనాపేక్షతోఁగాక, పాండితీ ప్రదర్శనమునకే జేసికొన్నట్లు పలు పద్యములు విశదము చేయుచున్నవి. ఈ జంటకవులలోని యొకలక్షణము నానారాజసందర్శనమువల్ల నిట్లు తెల్లమగుచున్నది. అవసరమగునపుడు, దాత యొక్క

నీచుఁడైనను వాని నింద్రుఁడుగా, చంద్రుఁడుగా స్తోత్రములు చేయుటయు, తిరస్కార భావము కనంబఱచిన రసిక ప్రభువునైనఁ దృణప్రాయముగాఁ దీసివైచుటయు వీరికి సహజము. ఇందులకు వందలు నిదర్శనములు.

వేంకటరామకృష్ణకవులతో, కొప్పరపుఁ గవులతో వీరు గావించిన వివాదములు భాషాచరిత్రములో శాశ్వతముగా నుండఁగలతీరున నున్నవి. గీరతము, గుంటూరుసీమ చూచునది. ఆ ప్రతిజ్ఞలు బహు భయంకరములుగ నుండును.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సీరంధ్రా వివేకాన్విత
స్వాంత భ్రాంత నిరంతరానృత వచః ప్రక్రాంత దుష్కల్పనా
ధ్వాంత క్రాంత కుశావ్య నవ్యరవి దీవ్య ద్భవ్య తేజోంచితా
హంతా దంతుర పాత్రప్రణాళికల సీహామ్మార్ప కేనాటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతి ద్విజుఁడు పర్యాయాదృతానేక సా
ధ్వంతేవాసి కృతావధాన సమయ వ్యాఖ్యాన విఖ్యాపితా
శాంతస్థాయి యశః ప్రసూన కవితా సౌందర్య రాజద్గళో
పాంతుల్ దేశికుఁగూర్చి వ్రాసిన యసత్యాల్ మాన్ప కేనాటికిన్.

శా. 'రావుల్ వీడు' మటంచు మిక్కడవు ధీరమ్మన్యుని న్నిన్ను దు
ర్వ్యాఖ్యాపారుల సభలోని కీడ్చి భవదార్ధబావవాదానృతా
లాపంబు ల్మొదలంటఁ గాల్చి వయి వాలాయంబు శిక్షించి నీ
పాపం బూన్చి నతుల్ గ్రహించునఁట! తత్త్వాగల్భ్య మూహించితే!

శా. 'రావుల్ వీడఁడు వేంకటాచల' మనారస్ఫార ఘోరానృతా
లాపాంతేవస దాన్య కర్కట విశాల శ్వభ్ర దుర్వ్యార్బహిః
ప్రాపత్త్రారతరా విలాంబు వృష దావత్త్రాపకాత్మీయ వా
గ్రూపాసార పరంపరా విభవముల్ గుప్పింప కేనాటికిన్.

శా. 'డంబాల్ మాను' మటంచు మిక్కడవు ప్రౌఢమ్మన్యతాదోషమూ
ఢంబై నట్టి భవన్మనంబునకు వ్రీడం బుట్టఁగాఁజేయ ని

న్నం బాండిత్య నిధాను లుండు సభయందుం బట్టి రెట్టించి గ
ర్వంబున్నాన్చి యనుగ్రహించునంట! తద్వాత్సల్య మూహించితే!

తిరుపతిశాస్త్రిగారు వెలనాటివారు, వేంకటశాస్త్రిగా రారామ ద్రావిడులు నైనను సోదరులవలె మెలంగుచుఁ బరస్పరసహాకారముతో నవధానములు, ఆశుకవితలు, ఆశాళపురాణములు ప్రదర్శించుటచే వీరి పేరు త్వరలోఁ బ్రశస్తికెక్కినది. అవధానకళకు గౌరవము తెచ్చినవారు, చులుకదనము కల్పించినవారును దిరుపతి వేంకటకవులే. వీరికిముందు మాడభూపి. వేంకటాచార్యులు, అంతకుమిక్కిలి ముందు రామరాజభూషణుఁడు మున్నగువారు శతలేఖినీ గ్రంథసంధానచాతురికలవా రున్నను, వారెవ్వరును దిరుపతి వేంకటకవులవలె జంటకవులుగా నుండి యవధానములు చేసినవారు కారు. పిఠాపురసంస్థాన కవులయిన దేవులపల్లి సోదరులును, వేంకటరామకృష్ణులు, అత్యద్భుతావధాన కవితా ప్రదర్శనముల గావించియున్నను తిరుపతికవుల తీరున నవధానవిద్యను జగద్విఖ్యాతము చేసినవారుకారు. రాయలకాలమున నంది మల్లయ్య, ఘంట సింగయ యను జంటకవులు ప్రబంధరచనము చేసిరి. వారవధానము లొనరించి యుండిరో, లేదో చెప్పఁజాలము. "జగదాశ్చర్యకరావధాన కవితాసంపత్తి" ఒక్క తిరుపతివేంకటకవియుగళమునకే తక్కినది.

'గోణము కట్టుటాది' వేంకటశాస్త్రిగారికిఁ గవితాభిలాష యుండెడిది. ప్రఖ్యాత శాస్త్రపండితులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారి యొద్ద నీ జంటకవుల వ్యాకరణాధ్యయనము. ఇరువురును మహామేధావులుగాన నచిరకాలములో నాభాష్య మధికరించిరి. దేవీభాగవతము నందు గురుస్తుతి యిట్లున్నది.

సీ. అఇఉణ్ మొదలుగాఁగ నాభాష్యపర్యంత
మే మహాత్ముఁడు మాకిచ్చె విద్య

కన్న సంతానమ్ముకన్న నెక్కుడుగాఁగ
నే దయాళుండు మమ్మాదరించె
పెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁజేసి
యే గుణనిధి మమ్ము బాగుచేసె
తిండికై యిల్లిల్లు దిరుగనీయకయన్న
మేయన్నదాత మాకింటనిడియె
గీ. సకలదిగ్దేశ రాజన్యసభలయందు
డంబుమీఱ శతావధానం బొనర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె
నట్టిగురునకుఁ గృతియిచ్చు టర్హమకద!

బ్రహ్మయ్యశాస్త్రిగారికీర్తి పరమశాశ్వతము చేసిన శిష్యులు తిరుపతి వేంకటకవులే. ఇదియటుండ, తిరుపతి కవులకే పరస్పరము శైష్యోపాధ్యాయికయున్నది. వయోధర్మముచే 'వేంకటతిరుపతికవులు' కావలసిన వారు వీరు. తిరుపతికవికంటె వేంకటశాస్త్రిగారు ఒక సంవత్సరము ముందు పుట్టినవారు. సహపాఠిదశలోఁ దిరుపతి శాస్త్రిగారికి బద్యలక్షణములు వేంకటశాస్త్రిగారే చెప్పినట్లు స్పష్టము. ఈ పద్యముదానికిఁ దారకాణ.

వితతాత్మీయ శతావధాన కవితా విద్యావయోరాశి, సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృత రసప్రీతాఖిలాంధ్ర క్షమా
ధృత రజ్యద్రసికావతంసకృత వందిస్తోత్రమాలా విభూ
షితు మా వేంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపంబునన్.

తిరుపతికవి యప్రతిమానమైన పాండితీ ప్రతిభయుఁ జెళ్లపిళ్లకవి యసాధారణమైన మేధాబలమును బలసి తిరుపతి వేంకటేశ్వరులను దెలుఁగుకవులలో నగ్రేసరుల నొనరించినది. తిరుపతి లేనిదే వేంకటేశ్వ

రుఁడు లేఁడు. వేంకటేశ్వరుఁడు లేనిదే తిరుపతి లేదు. ఈ జంట పేరులిట్లు కుదురుటయే వీరిఘనతకుఁ గారణమని చెప్పవలయును. ఎక్కడవినినను వారిపద్యములే. ఎక్కడఁజూచినను వారిశిష్యులే. ఏ ప్రాంతమునఁ దిరిగిన వారియసాధారణ ప్రశంసలే. "తిట్టుల్ తిట్టితిఁ దిట్టులంబడితి" నని యనేకుల హుంకరించినారు. అనేక పండితులను గద్దించినారు. "అటు గద్వాలిటు చెన్నపట్టనము మధ్యంగల్గు దేశమ్ము" నొక యూఁపూఁపినారు. పేరి కాశీనాథశాస్త్రివంటి యుద్దండపండితుల 'నబ్బా' యనిపించినారు. మహామహోపాధ్యాయులు సైతము మర్యాదగాఁ దప్పించుకొని తిరుగుచుండెడివారు. అది కేవలము వారిశాస్త్రపాండిత్యమునకు జంకియనుటకు వీలుగాదు. తిరుపతికవులు సంస్కృతాంధ్రములలోఁ బెద్దపాండిత్యము కలవారేయైనను శాస్త్రేతరములందుఁ బ్రత్యేకకోవిదులైన మహామహులను గూడ మాటాడనీయక పోవుట మాత్రమాంధ్రలోకమున కాశ్చర్యావహమైనది.

తిరుపతిశాస్త్రిగారు ప్రాచ్యపాశ్చాత్య భాషలయందు విద్వాంసులైన పోలవరము జమీందారు శ్రీ కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావు బహద్దరు వారికడ నిలయవిద్వాంసులుగా నుండిరి. కొన్నివత్సరములు వారియొద్ద గౌరవవేతనముఁ బడయుచు ననేకభంగుల సన్మానింపఁబడిరి. ఇంతలోఁ గాల మీ మహాకవిని మ్రింగివైచినది. తిరుపతిశాస్త్రి యస్తమయము చెళ్ళపిళ్లకవి హృదయమునకుఁ బట్టరాని కష్టపాటు కలిగించినది. ఇరువురు నభేదముగా సంచరించిన సోదరులు. వేంకటకవి దివాకరాస్తమయమును గుఱించి యిటులు పలవించెను.

నాకన్న ధీబలమ్మున
నే కాదు తనూబలమున నెంతయు హెచ్చౌ
లోకస్తుత్యుఁడు తిర్పతి
నాకన్నను మున్నె యెట్లు నాకము మున్గెన్.

ఏఁబది దాఁటెను నా, కతని కేఁబది కింక నెలల్ కొఱంత నా,
ల్గా బుధమాన్యుఁ డిందనుక నాఁగక సల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకట నుండియు నాతని చేతియూఁతఁ బ్ర
జ్ఞా బహుళావధానపుఁ బ్రసంగము దీర్చుచునుంటి నెట్టులో.

ఈ జంటకవుల సౌహార్ద మిట్టిది. "ఒక్కఁడు రచియించి రేని నది కాదగు దిర్పతి వేంకటీయమై" అను మాటలో నంతర్వాహినిగా వీరి సౌభ్రాత్రము వెల్లివిరియుచున్నది. తిరుపతి కవి నిర్యాణమున కిటీవల వేంకట శాస్త్రిగారు పెక్కు కృతులు రచించినారు. అవన్నియు జంటపేళ్ల తోడనే ప్రచురితములగుట యొక మహాదర్శము.

చెళ్లపిళ్ల కవి కవిత్వపుఁ గలను. అనగా, ఆయన నిలువెల్లఁ గవిత. పండు వయస్సులో నాయన కలము కొన్నివేల గద్యపద్యములు సృష్టించినది. వ్యాసునివలె వ్రాసినది తుడుచుట యాయన కలవాటులేదు. కడకాలమున విజయవాడ గవర్నరుపేటయందలి యద్దెయింటఁ గుక్కిమడత మంచముపై కౌపీనధారియై పరుండియుండెడి యా జరఠమూర్తి నెందఱో దర్శించి పోవుచుండెడివారు. ఆయన మెట్టిన ప్రదేశమే యొక దివ్యతీర్థము. మనసు వచ్చినచో వచ్చినమానిసిని బలుకరించును; లేనిచో బలుకరించుట కూడ నుండదు. వచ్చినవాఁడు వచ్చి కవిగారి చరణములు కనుల కద్దుకొని చక్కఁబోవును. ఆ యాగంతుకున కదే పదివేలు. యౌవనములో వేంకట శాస్త్రిగారి యుపన్యాసవాణి మేఘవాణి. ఆయన సభలో నుపన్యసించు నపుడు వేనవేలు విఱుఁగఁబడి వినవలసినదే. యౌవనములోనే కాదు, షష్టిపూర్తి దాటిన తరువాతఁ గూడ వారి కంఠస్వరములోని ఝుంకారము, మాధుర్యము సడలలేదు. ఎంతవానినైన నప్పటి కప్పుడు ముఖపిధానము చేయు శక్తి యాయనలో గొప్పగా నుండెడిది. వీరి ప్రతి పదము ధ్వనిపూరితము. వీరి పేరు విని బందరునందలి యున్నత పాఠశాల పండితులుగా దయచేయుఁడని యాహ్వానించినది.

అక్కడ పదునైదు సంవత్సరములు తెలుఁగుపండిత పదవి-ఆసందర్భమున ననేకులు వీరి చేతిలోఁ గవులైరి. విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతు లావిధముగా శిష్యులు. తిరుపతి కవుల శిష్యులము, విశేషించి వేంకట శాస్త్రిగారి శిష్యుల మనువారిలో అవ్వారి, వేటూరి, వేలూరి, కాటూరి, పింగళి కవులు ముఖ్యులు. బందరు వేంకట శాస్త్రిగారిని బ్రహ్మరథము పట్టినది. 'కృష్ణ' వీరి పలుకు విని పొంగిపోయినది. 19౩౭ సం॥న బందరు పౌరుల ప్రోత్సాహమునను, కవిశిష్యుల యభినివేశమునను శాస్త్రిగారికి జరిగిన షష్టిపూర్తి సన్మానము చరిత్రలో రమణీయము, నవిస్మరణీయము నయిన ప్రధానఘట్టము. ఆ సమయమున వీరి శిష్యప్రశిష్యు లనేకులు కావ్యోపహారము లర్పించి ధన్యులైరి. ఆ దివ్యమహామున నే —

పుడమిఱేఁడులు తల లడుగులు మోవంగ
నర్పించు కానుకల నందువాఁడు
అత్యద్భుతంబైన యవధానవిద్యకుఁ
బ్రభవకారణమైన ప్రతిభవాఁడు
వీనుదోయికిఁ దేనె సోనలు వర్షించు
వాఙ్మాధురికిఁ బేరు వడినవాఁడు
చిననాఁడె వలచి వచ్చిన కవితాకన్య
నేకపత్నిగఁ జేసి యేలువాఁడు
పూర్ణకాముండు త్యాగియు భోగియైన
గురుని ఋణ మీఁగుపొంటె నీ చిఱుతకబ్బ
మర్పణ గడించుకొనుఁగాక యాంధ్రవాణి
కడకనుల జాల్కొను ప్రసాదకణ లవాప్తి.

అని గురుదక్షిణగా 'సౌందరనంద' కావ్యము పింగళి కాటూరి కవి యుగళముచే వేంకటశాస్త్రిగారి కర్పింపఁబడినది. ఆ షష్టిపూర్త్యుత్సవము తెలుఁగువాణి కొక యుజ్జ్వలాలంకారము. ఇది యననేల? తిరుపతి

వేంకటకవులు తెలుఁగు భూమిలో నొందని సన్మానము లేదు. కృష్ణా పత్రికాధిపతులన్నటులు 'వీరి కవిత్వము ప్రాచీనకవితకు భరతవాక్యము. నవీనకవిత్వమునకు నాంది. వీరికవిత్వమందెచ్చటఁ జూచినను సాకు మార్యము పౌరుషము జీవము గోచరించుచుండును. ఈ విలక్షణములే యాంధ్ర దేశమున శిష్య సహస్రముల వెదచల్లినవి. వీరిరచన లెక్కు వగ వీరి జీవితమునకు సంబంధించిన వగుటచే నా కవిత్వ మాత్మగౌరవ మును బ్రతిష్ఠించు కొనినది. ''

ఈ శతావధానుల సారస్వత సమారాధనము 1949 సంవత్సరము నాఁటికి సంపూర్ణముగాఁ బండి, మదరాసు ప్రభుత్వముచే నిండుగా గుర్తింపఁబడినది. శ్రీ వేంకటశాస్త్రిగారిని మదరాసు దొరతనవుఁ బ్రథమ సంస్థానకవిగా గౌరవించుటలో భేదభావ మెవరును జూపకుండుట తిరుపతికవుల వాఙ్మయసేవ కొక విజయధ్వజము. తనయూరు దాఁటక యావత్ప్రభుత్వమును, యావత్కవిలోకమును విజయవాడకు రప్పించు కొనిన శ్రీ శాస్త్రిగారి వార్ధక శ్రీ తెలుఁగుదేశమునకు గర్వాభరణము. ఏమహాకవిని నిట్టిటీరుగా దేశము సన్మానింపలేదు. శిష్య ప్రశిష్యులు బ్రహ్మరథము పట్టిరి. మదరాసు ప్రధానమంత్రులు, మంత్రులు, విశ్వ విద్యాలయాధికారులు, మహాపండితులు, కవులు పరివేష్టించియున్న నాఁటి సన్మాన సభావృత్తాంతము సారస్వత చరిత్రములో నొక దివ్య ప్రకరణము. రాయలసీమనుండి వచ్చిన గడియారము వేంకటశేష శాస్త్రిగారు నాఁడిటులు ప్రశంసించినారు.

జయమేపార శతావధాన కవితా సామ్రాజ్యపీఠంబు న
చ్ఛయశోమూలముగాఁగ నేలిన మహాసారస్వత జ్యోతి రు
చ్చయమా వేంకటశాస్త్రి యాంధ్రకవితా స్థానిప్రభుండయ్యె, న
న్నయ తిక్కన్నల నాఁటి వైభవము లీనాఁడయ్యె వాగ్దేవికిన్.

* * * * *

కవిసభ లిచ్చు గౌరవముగా దిది, యొక్కనృపాలుఁ డిచ్చు గౌ
రవమునుగాదు, కావ్యరసరంజిత భావుక యావదాంధ్ర గౌ
రవమ ప్రజాప్రభుత్వము కరమ్మొన వేంకట శాస్త్రి గారికిఁ
నవ వరణ ప్రజ మ్మిది యనన్య మపూర్వముగా దె తెన్గునన్.

కవి సాధారణుల వలెఁ గాక "కవనార్థ మ్ముదయించితిన్; సుకవితా కార్యంబె నావృత్తి; మద్భవ మద్దానఁ దరింతుఁ; తద్భవము మద్భాగ్యంబు......" అని చెప్పుకొన్న మహాత్ముఁడు చెళ్ళపిళ్ళకవి. వ్యావహారిక భాషలో నాయన చివరి కాలమున రచించిన వివిధ వ్యాసముల బండ్లఁ దోలవచ్చును. అవన్నియుఁ గలిపి వెలువరించినచో 'విజ్ఞాన సర్వస్వము' పునరుద్ధరించినవార మగుదుము. అందుఁ గొన్ని రచనలు 'కథలు, గాథలు' గా నచ్చుపడుచున్నవి. వేంకటశాస్త్రిగారి వ్రాఁత తైయైన, సువ్యాపమైన నొకరకముగానే యుండును. విషయాంతరము లోనికి తఱచు దాటుచున్నను, ఎక్కడికక్కడ హృదయంగమముగా నుండునట్లు వ్రాయుటలో, మాటాడుటలో వారిని మించిన వారు లేరు. ఆయన యేమి మాటాడిన నది ధ్వనికావ్యము. వేయేల! ఆయనయుచ్ఛ్వాస నిశ్వాసములు, ఆయనపొడుముపట్టులు, ఆయన పొన్నుకఱ్ఱపట్టులు మహాకావ్యములుగా నైనవి. పద్యములు పఠించుటలో చెళ్ళపిళ్ళకవి దొక క్రొత్తతీరు. ఆయన ననకరించి యెందఱో నేఁటికందముగాఁ బద్యములు చదువుచుందురు. ప్రతివిషయమునను తనదొక ప్రత్యేకత యున్నటులు వేంకటశాస్త్రిగారు ప్రదర్శించినారు. ప్రభుత్వ సంస్థానకవి పదవీప్రదాన సందర్భములో వారుచెప్పినపద్యములు మహోదాత్తములై శాస్త్రిగారి సర్వహృదయమును దాఁచిపెట్టుకొని యున్నవి.

శా. నే నాస్థాన కవీంద్రుఁ జేసితి; వికఁ నా కాయురారోగ్య సం
పన్నత్వంబు నొసంగుటన్నది క్రమప్రాప్తంబు, నా యీడుపా

రున్నారెందఱో విజ్ఞులల్లఘనులం దొండొక్క రాస్థానమం
దున్నన్ దేహబలంబుఁ గోరుదురె? నిన్నో తల్లి! కామేశ్వరీ!

మ. పదొకండేడులపైని రెండిపుడు నా ప్రాయంబు, నాబోటికిన్
గదిలో మంచమె యెల్లలోక మగుచున్ గాలమ్ము వెళ్లించు వృ
ద్ధు దయార్ద్రంబగు దృష్టిఁ జూచి యిడితేదో గొప్పదాగద్దె నా
కది భుక్తంబగుదాఁక నాయువిసుమం చర్థింతుఁ గామేశ్వరీ!

మ. అనుకంపామృతవృష్టి నించినను నీ వాస్థాన విద్వత్కవీం
ద్రుని గావించితి; నేను తత్పదవియందున్ గూరుచుండంగ నే
ర్తునె మందిచ్చితి, తేనెఁగూడ నిడుసుందున్నిన్నె యీదృగ్భిష
క్షునులున్ మాదృశరుగ్ణులుం గలరునా, కల్యాణి, కామేశ్వరీ!

శా. సన్యాసిన్ వరుఁ జేయుచో నెరవెకా సర్వంబునా కిప్డు వి
ద్వన్నేతల్ కవులెల్లఁ గాఁదగిన "ఆస్థానంబు" నీఁ జేసితీ
యౌన్నత్యంబున కిమ్ము దీర్ఘతరమౌ నాయుష్య మట్లిచ్చుచో
నిన్నున్ మెచ్చు జగమ్మిఁ కెట్టివరమున్నేఁ గోరఁ గామేశ్వరీ!

మ. ప్రతిసంవత్సర మింకనాకిఁకఁ బ్రజారాజ్యంబు వేయారు లు
న్నత ముద్యోగముచేసి వాసిమెయిఁ "పెన్షన్" గొన్నబల్మేటికిన్
భృతకంబిచ్చు విధాన, దీనికి భవత్ప్రేమమ్ము తోడాచు దీ
ర్ఘతరంబాయు వొసంగఁగావలెఁ గృపార్ద్రా! తల్లి కామేశ్వరీ!

శా. ఆయుర్దాయము మూఁడు భాగములుసేయన్ దాన 'వన్థర్డు' బో
నేయంగా మిగిలెన్ శరీరము కడున్ జీర్ణించి శుష్కించె; శే
షాయుర్దాయము భోజ్యమౌట కడుగడ్డె తోఁచుఁ ద్వత్సన్నిధి
స్థాయింగా నొనరింపు మింటికిఁకన్ జాలంబు కామేశ్వరీ!

శా. కౌపీనంబుధరించి యీ సభకునేఁగ న్నన్నువీక్షించిఁ రూ
పహో పారుం డిటుమాటలనే! వయసుచే నొండొక్కరుండయ్యో వా

గ్వ్యాపారమ్మును మాటితీరుననుచున్ గారుణ్యముప్పార నా
వై పే చూతురు పంపుమమ్మ సభకున్ వందింతుఁ గామేశ్వరీ!

మ. కవులెల్లన్ జయపెట్టు వైభవ మొసంగన్ లేదో తచ్ఛివ్యవ
ర్గ విభూతిన్ గరుణింపవో తనుజను ర్భాగ్యంబు గై సేయవో
వివిధైశ్వర్యము లిచ్చితింక నొకటే విశ్వేశి! నీనన్నిధిన్
గవిగానుండ ననుగ్రహింపు మిదియే కామ్యంబు కామేశ్వరీ!

శ్రీ వేంకటశాస్త్రిగారి కామేశ్వరీభక్తి కీ పద్యములు నిదర్శనములు. ప్రభుత్వసంస్థాన కవితాపదవికి మొటుఁగువెట్టిన శాస్త్రిగారు, ఆపదవి వచ్చిన కొలఁదినెలలకే పరమపదముఁ జేరుట మనదురదృష్టము. ఆంధ్ర సారస్వతారామమున ననంతశోభతో వెలుఁగొందిన వసంతరేఖ యస్తమింపఁగా, ఆయన శిష్యుఁడు పింగళి లక్ష్మీకాంతకవి పాపము! ఎట్లు వగచెనో కనుఁడు.

మరలఁ దిరుపతి వేంకటేశ్వరులజంట
కలిసి, ముప్పదియేండ్ల పై కాలమునకు
సాగఁగలదింక దిక్పాల సభలయందు
అద్భుతావహ శతావధానాంధ్ర కవిత.

* *

మాగురుం డిల్డు దిగిన వాఙ్మయపుగద్దె
యుర్వి ననధిష్ఠితంబయి యుండఁగలదు;
ననభిగమ్యము నప్రధృష్యమ్ము నగుచు
విక్రమార్కుని సింహాసన క్రమమున.

* *

ఈజంటకవుల కావ్యములలో "బుద్ధచరిత్రము" చక్కనిపాకమునఁ బడినది. వీరి దేవీభాగవతముతో పాటు బుద్ధచరిత్రయు సారస్వత లోకమున స్థిరముగా నుండుననని చెప్పవలయును. తిరుపతి కవుల కావ్య

ములకంటె, వారినిగూర్చిన గాథలు, వారు చెప్పిన చాటువులు, వారి పీఠాలాపములు, వారి చమత్కార సంభాషణములు దేశములో నిలిచి పోఁగలవు. కవితకు జీవితమునకు భేదము లేదని నిర్ధారణము చేసినవా రొక్క తిరుపతి కవులే. ఈ జంటకవుల జీవిత - కవితా మాధుర్యములు పడుగుపేకల వలె విడదీయరానివై కలసియున్నవి. వీరు ప్రాచీన ప్రబంధ ధోరణి వీడి నవ్యమార్గములో వర్ణనాదులు కావించిరి. శ్రవణానందాదులలోని శృంగార వర్ణనములు కొంత హద్దుగడచి నటులు కనఁబడును. కాని, నాఁడవి రసవంతముగానే యఁగపట్టినవి. "రాజులెల్లరును భార్గవరాములే యన్నఁ దేజంపుఁబెంపు నుతింప వలెనె, కోమటులెల్ల జక్కులరాజులే యన్నవైశ్వర్యముల పెంపు లడుగ వలెనె......" ఈమొదలగు వర్ణనములు పూర్వవాసనా వాసితములు. "మనసా! వద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా!" మున్నగు పద్యములకుఁ దెలుఁగుదేశమున నాశనము లేదు.

'వ్యాకరణ మొకత్రోవ, మహాకవు లొకత్రోవ' యని చెప్పి తిరుపతి కవులు వ్యాకరణబంధములు నిరంకుశులై సడలించి గిడుగువారి వాదమున కాదరువునిచ్చిరి. ఈ కవకవుల జీవనజ్యోతి సర్వాభినవ కవిరత్న, వారి పద్యములు సర్వము శిష్య ప్రశిష్యద్వారమున లోకమెల్లెడ వ్యాప్తములై యచ్చులో లేకున్న, అయిదాఱు శతాబ్దులదాఁక నశింపని స్థితిలో నున్నవి. పాండవనాటకములు, శ్రవణానందము, మఱికొన్ని చాటువులు పారాయణము చేసికొనువారు చాలమంది కలరు. ఈక్రింది పద్యములు మఱచిపోలేము.

శతఘంట కవనమ్ము సల్పునంగతి యన్నఁ
"గరతలామలకమ్ము" గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
"నంబి కొండయ దండనంబు" మాకు

ఆశుధారా కవిత్వా డంబరంబన్న
"నల్లేరుపై బండి నడక" మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
"మద్రసోపేత భోజనము" మాకు
వ్యర్థమగువాదము లొనర్చు నట్టి వారి
డంబ మణఁగించు టాపోశనంబు మాకు
దాన రాధేయ! కవిసముదాయ గేయ!
పండితవిధేయ! రామభూపాలరాయ!

* * *

అభినవరామలింగ బిరుదాంకుఁడ నాకవనమ్మునందు నీ
యభణపుఁ గాండ్లు తప్పు లిడ నర్హులె? కాదని తప్పు దిద్ద మా
యుభయులలోన నొక్కఁడు మఱొక్కనికిం దగుఁగాక యొక్కచే
సభము శుభమ్మునుం దెలియ కార్చెడి దేశెలు మాకు లెక్కయే?

* * *

ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగొనినారము నీవలనన్ సరస్వతీ!

* * *

నవ్యకవితావతరణమునకు భగీరథులై, ఆంధ్ర సారస్వతమున కొక యపూర్వపు వెలుఁగు కలిగించిన తిరుపతి వేంకటకవులు బాల కలానిధులు, బాలసరస్వతులు, కింకవీంద్ర ఘటాపంచాననులు, కళాప్రపూర్ణులు, శతావధానులు, శాశ్వతులు.

# వేంకట రామకృష్ణ కవులు

## 1883-1939
## 1889-1918

మొదటివారు ఓలేటి వేంకటరామశాస్త్రీగారు. రెండవవారు వేదుల రామకృష్ణశాస్త్రీగారు. వీరు మేనత్త మేనమామ బిడ్డలు [వేంకటరామ శాస్త్రి తండ్రి రామకృష్ణశాస్త్రి మేనమామ. రామకృష్ణశాస్త్రి తల్లి వేంకటరామశాస్త్రికి మేనత్త] ఆరామద్రావిడశాఖీయ బ్రాహ్మణులు. మొదటికవి జన్మస్థానము: పల్లిపాలెము [కాకినాడతాలూకా] తల్లి: కామేశ్వరమ్మ. తండ్రి: నారాయణశాస్త్రి. జననము: 15-11-1883 సం॥ అస్తమయము: 3-12-1939 సం॥ రెండవకవి యభిజననము: కాకరపఱ్ఱు [తణుకుతాలూకా] తల్లి: సూరమ్మ. తండ్రి: రామచంద్ర శాస్త్రి. జననము: 1889. నిర్యాణము 1918. ఈ జంటకవుల నివాస గ్రామము పిఠాపురము. విరచితగ్రంథములు :- వ్యాసాభ్యుదయము, దమయంతీ కల్యాణము [అచ్చ తెనుఁగు కావ్యము] విశ్వగుణాదర్శము, ఉత్తరరామచరిత్ర, మదాలస, దమయంతి, ఇందిరాదేవి, శకుంతల, సుభద్ర, భోజచరిత్ర, కాత్యాయనచరిత్ర, కవికంఠాభరణము, సువృత్తి తిలకము, పాణిగృహీతి, కొండవీటి దండయాత్ర, అత్యద్భుత శతావధానము, శతఘ్ని, అట్టహాసము, పరాస్తపాశుపతము, రామకృష్ణ మహాభారతము, ఆంధ్రకథాసరిత్సాగరము [6 లంబకములు] ఇత్యాదులు.

ఆంధ్రభోజుని యాస్థాన విద్వత్కవులగు వేంకట రామకృష్ణ కవుల కవితాప్రతిభ, విమర్శనశక్తి తెలుఁగువారికిఁ దెలిసియే యుండును. 1909 సంవత్సరమున రామకృష్ణులు పిఠాపురసంస్థానమునఁ బ్రవేశించిరి. నాఁటికి వేంకటరామశాస్త్రిగారి వయస్సు ఇరువదియాఱు వత్సరములకు మించదు. రామకృష్ణ శాస్త్రిగారికిఁ బదునెనిమిదేండ్లు దాఁటినవి. సంస్థాన ప్రభువులు శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారాయేంద్రు లీ కవకవుల బుద్ధి చాకచక్యమునకుఁ, గవితాధోరణికి నానంద పడి యవధానవిశేషములఁ గాంచుట కనుమతించిరి.

ఏ సుముహూర్తమున నీ జంటకవులు ప్రభువుకంటc బడిరో యపుడే శ్రీవారి యనుగ్రహాంకురారము రామకృష్ణుల యభ్యుదయ క్షేత్రమునc బడినది. దిగ్దంతులవంటి పండితుల ప్రోల నా మహాస్థానమంటపమున సత్యద్భుతావధానము సేయునపుడు రామకృష్ణుల లీలలు పలువుర కానందాశ్చర్యములు కలిగించినవి. మహీనాథుc డవధానానంతరము మూcడు నూటపదియార్లు పట్టుసాలువలతో బహూకరించి యా కవులను దమ సంస్థానిలో నుండcగోరెను.

పిమ్మట సత్యద్భుత శతావధానము, శతవిధానము [గంటకు నూఱుపద్యములు చెప్పుట] శతప్రాసము [ఒకేప్రాసముమీcద నూఱు పాదములు గంటలోc జెప్పుట] అష్టావధానము మున్నగువానిచే మన కవులు మహారాజు చిత్తమును మఱింత రంజింపc జేసిరి. శతప్రాసము చెప్పుసందర్భమున "...ఇట్లిరవుగc గొన్ని పాదములనే మును గబ్బము తాత సెప్ప న, బ్బురపడి తత్సభాస్థలిని బోరన గద్దియ డిగ్గి గండ పెం, డెరమును గృష్ణరాయcడు తొడ్గె స్వఙ్ఘ్రిపవుంగవ!..." అని యభిప్రాయగర్భముగా నెట్లు చెప్పిరో పరికింపుcడు.

వేంకటరామకృష్ణులు పిఠాపురసంస్థానమునకుc బోవుచున్నటు లింటి యొద్దc బెద్దవారి కేరికినిc జెప్పనేలేదు. పట్టుసాలువలు కప్పుకొని సింగపుc బిల్లలవలె వచ్చుచున్న యా యువకవులc గని తలిదండ్రు లానందభరితులైరి. గ్రామస్థు లాశ్చర్యకలితులైరి. ఈ జంటలోc దొంటికవి ఓలేటి వేంకటరామశాస్త్రి, ద్వితీయుcడు వేదుల రామకృష్ణశాస్త్రి. వీరు మేనత్త మేనమామ బిడ్డలు. వీరిని స్మరించునపుడు నంది మల్లయ ఘంట సింగన జ్ఞప్తికి వత్తురు. జంటకవులలోc దిరుపతి వేంకట కవుల పేర్లు లెట్టులు కుదిరినవో రామ కృష్ణ కవుల నామము లట్లు సరిపడినవి. ఈ కవికోకిల యుగళము పిఠాపుర ప్రభుని ప్రోల మధురకంఠము లెత్తి యిట్లు పాడినది.

భోజనమాను నర్థి సురభూజునిఁ జూచితిరే ? పిఠాపురీ
రాజు గతండు మిమ్ముఁ గవిరాజుల నెట్లు బహూకరించెె ? నం
చోజను గోరువారికి సగుత్తర మిచ్చి తదాననంబులం
దేజరిలంగఁ జేసెదుగతి న్నము నీవును గారవింపుమా !

* * *

అక్షరలక్ష లిచ్చునృపుఁ డట్టి కవీంద్రులు కానరా రటం
చీ క్షితివారలెల్ల వచియించెదు సుద్దుల నాలకింతె హా
ర్యాక్షసదృక్ష ! నీవును దిరంబుగ నేమును గక్షగట్టి ప్ర
త్యక్షము నేయఁబూనెదమె ? తత్సములం గవుల న్నరేంద్రులన్.

* * *

ధారణతప్పరాదు, కవితారసమాధురి పోవరా, దలం
కారము లేగరాదు, కనఁగా నపశబ్దము లుండరాదు వా
గ్ధోరణి యాఁగరాదు తమతోడఁ బ్రగల్భములంటగాని, యె
వ్వారికినైన నిట్లు నొడువంగలవార మనంగఁ జెల్లునే ?

వీరు పిఠాపుర సంస్థానమునఁ బ్రవేశించిన వెనువెంటనే సుప్రసిద్ధులైన తిరుపతి వేంకటకవులతో వాగ్యుద్ధము తటస్థించినది. రామకృష్ణకవులు వయసునఁ బసివారయ్యును నా కవుల కృతులలోని దోసములు బయటఁ బెట్టి 'శతఘ్ని' యను ఖండన గ్రంథము ప్రకటించిరి. 'శతఘ్ని' శక్తి నాఁడు పెద్దపండితులను గూడఁ దల లూఁపించినది. ఈ సాహిత్య సమరముననే రామకృష్ణ భారతము, పాశుపతము, అట్టహాసము, శృంగభంగము, కోకిలకాకము మున్నుగా నెన్నో రచనలు వెలువడినవి. ఈ వివాదము తొలుతఁ జక్కని కృతివిమర్శనములతో నారంభమై క్రమక్రమముగా శ్రుతి మించి వ్యక్తిదూషణములకుఁ బాలుపడి ముదిరినది. ఏది యెటులయిన, నాఁటి యీ వివాదము సాహిత్య జిజ్ఞాస హెచ్చించి ముచ్చటగా సాఁగినది. ఈ వాక్సమరమున దేశము

లోని పండిత కవులెందఱో కలుగఁ జేసికొని పైకి వచ్చిరి. ఇది సారస్వత చరిత్రలో మఱువరాని సరసఘట్టము. ఈ వివాదారంభమున 'కవిత' యను మాసపత్రిక రామకృష్ణులు నెలకొలిపి నడపిరి. ఈ పత్రిక తొమ్మిది పదియేండ్లవిచ్ఛిన్నముగా సాఁగి యాఁగినది. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారికి, వేంకటరామశాస్త్రిగారికిఁ గల గురు శిష్య సంబంధమును బురస్కరించుకొని యీ వివాదము ప్రారంభమైనది.

ఎట్టో చదివితి మూన్నాళ్ళ పట్టపవలు
పట్టుమని రెండుముక్కలు పలుకకున్నఁ
దిరుగఁ డీకనెన్ని చెప్పిన గురుఁడ ననుచుఁ
దగులు కొన్నాఁడు నిన్నుసైతానులాగు.

రామకృష్ణ మహాభారతములోని యీపద్యము వేదుల రామకృష్ణశాస్త్రి ఓలేటి వేంకట రామశాస్త్రిగురించి చెప్పినది. ఈ పద్యములో యావద్విషయము గొప్పగా పరిస్ఫురిత మగుచున్నది. శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారు రామకృష్ణుల సాహిత్యగురువులు. రామడుగుల వీరేశ్వరశాస్త్రిగారు వ్యాకరణ గురువులు విశ్వపతిశాస్త్రిగారు న్యాయ శాస్త్ర గురువులు.

దేవులపల్లి సోదరకవుల తరువాత వీరు పిఠాపుర సంస్థాన కవులై పేరొందిరి. మొత్తము రామకృష్ణకవుల కృతులు ముప్పదివఱకునున్నవి. శ్లేషయమకచక్రవర్తి వేంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శమును దెనిఁగించిరి. వేంకటాధ్వరి రచనము నాంధ్రీకరించుట యేటి కెదురీఁదుట. ఆతని రచనలో యమకభేదమో, శ్లేషాలంకారభేదమో లేని పద్యములు మిక్కిలితక్కువ. అట్టివిశ్వగుణాదర్శమున కాదర్శప్రాయమగు నాంధ్రీకృతి గావించిన రామకృష్ణకవులు ప్రశంసనీయులు. తెనుఁగు మహాభారతము కోలాహలమునకు బాధములు మూలఫలింతును.

నిర్వర్తాధ్వరకృత్య ఋత్విజ మహా తీర్ణాపగో నావికం
యుద్ధార్తం సుభటం చ సిద్ధవిజయో వోఢార మాప్తస్థలః
వృద్ధం వారవధూజనంచ కితవో నిర్విష్ట తద్యౌవనో
ధ్వస్తాతంకచయ శ్చికిత్సక మపి ద్వేష్టి ప్రదేయార్థినమ్.

అవభృథస్నానంబు నాచరించిన సోమ
యాజికి ఋత్విజుండన్నఁ గలుక
యేఱంతయును దాఁటి తీరమ్ముఁ జేరిన
పాంథునకు తరంగు పైఁ జిరాకు
విజయమ్ముఁ గైకొని నిజపురమ్మున కేఁగు
నవనీపతికి బంటునం దసూయ
యిష్టదేశమ్మున కేఁగిన పిదప స్వా
మికి యానవాహకుమీఁద విసువు
యౌవన మ్మంతయును జూఱలాడినట్టి
కితవునకు వారసతి యెడఁ గేరడంబు
వ్యాధి కుదిరిన వానికి వైద్యుపట్ల
వెగటు తా మీయవలసిన విత్త మడుగ.

సంస్కృతమున క్షేమేంద్రుఁడు రచించిన ఔచిత్య విచారచర్చ, కవి కంఠాభరణము, సువృత్తతిలకము వీరు తెనుఁగుపఱిచిరి. ఇందిరాదేవి, సుభద్ర, శకుంతల, దమయంతి మున్నగు నవలలు వీరివి చదువఁదగినవి. వీరి యుత్తర రామచరిత్రాంధ్రీకరణము నాలు గంకములు మాత్రము వెలువడినవి. ఇవికాక, యీజంటకవులు కవితా పత్రికా మూలమున నెన్నో ప్రాచీనార్వాచీనకృతులు వెలువరించిరి. వానిలో మత్స్యపురాణము, పరమయోగివిలాసము, మైరావణచరిత్ర, అధ్యాత్మ రామాయణము, చంపూభారతము, భారతపక్కి, ప్రబోధ చంద్రోదయము, పరాశరస్మృతి ముఖ్యగ్రంథములు.

రామకృష్ణకవులు సారస్వతములోఁ గ్రొత్త క్రొత్త త్రోవలు తీయు నుద్దేశము గలవారు. కవిత్వములో సంస్కృతిని వీరు వలచియున్నారు. 'ఆంధ్రపత్రిక' కాలయుక్తి సంవత్సరాది సంచికలో వీరు "ఆంధ్రకవుల అపరాధములు" అను శీర్షికతోఁ గొన్ని పద్యములు ప్రకటించిరి. పరిహాస గర్భముగాఁ బ్రాచీనకవుల యపరాధము లందు వర్ణింపఁబడినవి. పద్యములు మొత్తము ముప్పదియే కాని తెలుఁగుదేశమున గొప్ప యలజడి రేపినవి. కొన్ని యుదాహరించుట యవసరము. రచనా చమత్క్రియకు మనము మెచ్చుకోవలయునుగదా!

గీ. ఆంధ్ర లోకోపకారమ్ము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుచున్నాఁడు సరియె; బడాయిగాక
తొలుత సంస్కృతపద్య మెందులకుఁ జెపుఁడి!

గీ. పామరుఁడువోలెఁ దిక్కనసోమయాజి
వెఱచి యాంధ్రీకరింపక విడిచినట్టి
భారతమ్మున వ్రేల్వెట్టఁ బట్టిగాని
యెఱ్ఱప్రెగ్గడ బండార మెవ రెఱుఁగరు?

గీ. అచ్చ తెనుఁగు పదంబుల నిచ్చకోలఁదిఁ
బుచ్చి తలతిక్క యన్వయంబులను బెట్టి
పాడుచేసెను నన్నయ్యభట్టుదారి
యుభయకవి మిత్రులవ! తిక్కయొజ్జగారు.

గీ. రావు సర్వజ్ఞసింహ భూరమణుతోడ
బావ శ్రీనాథ కవిసార్వభౌముఁ డేమొ
చెప్పి తత్కృపాపాత్రుఁ జేయుపిదప
భోగినీదండకము వ్రాసెఁ బోతరాజు.

వేంకట రామకృష్ణ కవులు

గీ. ఎఱచితినువార లేనియు నెమ్ముమెడకుఁ
గట్టుకొందురె? శ్రీనాథకవివరేణ్య!
సానికూఁతుల తగుల మీఁశానునకును
బలికితివి నీస్వభావము బయలుగాను.

గీ. ప్రాలుమాలికచేఁ దాళపత్రపుస్త
కాటవులనర్థపుందెరువాట్లు గొట్టి
కొఱఁతఁబడునని కుకవిని గొసరితిట్టి
పెద్దనయొసర్చినట్టి తప్పిదము నిదియె.

గీ. తనకు నంతఃపురమునకు మనసులందు
నెడమడుగు పుట్ట ముద్దులొల్కెడు నుడులను
బారిజాతాపహరణంబుఁ బల్కి మాన్చి
నట్టి తిమ్మనఋణము రా జెట్టుతీర్చు?

గీ. కృష్ణరాయఁడు చేసిన విష్ణుచిత్త
కావ్యమందలి భావము గ్రావ్యమెయగు
నెన్నిమార్లు పఠించిన నెఱుకపడని
వట్టి పాషాణపాక మెవ్వంశు నదువు?

గీ. శ్లేషకావ్యంబుఁ జేసి విశేషయశము
గనిన పింగళి సూరన గడుసువాఁడె
కాని శుభమస్తని యుదేమి గారుడంబుఁ
దెలుఁగుఁ జేసినవాఁడు వైదికుని పగిది.

గీ. తగని గర్వంబునం జేసి తన్నుఁదానె
పొగడుకొనువాఁ డటంచుఁ జెప్పుదురుగాక
నాలిపలుకులు రావు తెనాలి రామ
కృష్ణ కవినోట బంగారు గిలకదీట.

గీ. ఒకఁడు స్వప్నప్రకారము నుగ్గడింప
నెల్లవారలకుఁ గలవె తెల్లవార్లు
నవ్వుదురనుతలంపు లే దెవ్వరికిని
పేరుకొననేమిటికి నట్టి బీదకవుల ?

గీ. పూర్వకవిరాజులకు నిది భూషణంబొ
దూషణమొ యనుకొనుఁడు మీరెంచినట్లు
నన్నయాదుల పట్ల మాకన్నఁ గూర్మి
గలుగువారలు లేరు జగమ్మునందు.

ఈ యపరాధ పద్యములపై క్షమాపణము చెప్పవలసినదని ప్రతి పట్టనమున సభలు గావించి తీర్మానములు చేయుచుండిరి. అపు డీ కవకవులు కాళ్లు విరఁగఁ ద్రొక్కుకొను తెలుఁగుసోదరులఁ గని నవ్వుకొనుచు 'దేశభక్తి' యను నొకవ్యాఖ్య వ్రాసి "మేము చేసినది నిందాస్తుతిగాని కేవలనిందగాదు. ఈ విధముగా మేము ప్రాక్తనకవులనుగూర్చి వ్రాయుట యాధునికులకుఁ బ్రాచీన కవిసత్తములపై నెంతగా భక్తివిశ్వాసములు కలవో పరీక్షించుటకే" అని సమాధానము చెప్పిరి. అపుడీ నవీన పద్ధతిని గనిపెట్టి రామకృష్ణులను సరసు లభినందించిరి. విరసులు పరిహసించిరి. "కౌరవగౌరవ" మను పేరఁ బాండవులది యన్యాయమనియు, కౌరవులది న్యాయమనియు సమర్థించుచుఁ జక్కని పద్యములు 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక' లో నావిష్కరించిరి. అందలి విషయ మెట్లున్నను గవితా ధోరణి భారతమును బోలియున్నదని జయంతి రామయ్యపంతులుగారు మఱిమఱి ప్రస్తుతించిరి. ఇట్లే రామకృష్ణకవులు విలక్షణ భావనా పథ విహారులై యుండెడివారు. వీరి 'పాణిగృహీతి' యను ఖండకావ్యము తెలుఁగు వాఙ్మయమున నొక గళాభరణము. ప్రతిపద్యము నొక మహానర్ఘమణి. కొన్ని మణులు ముందుపెట్టెదను.

వధువు — పెండ్లికూఁతురు

ఏఁ గచ్చేరికి నేఁగఁ గావలయు నోసీ! పిల్లనిం బుచ్చుకో
"వేగన్ ర" మ్మని బామ్మ యొండిడు పరున్ విప్రోపదిష్టార్థయై
"యే గీతంబుల నేర్చికోవలయు నేఁడీ మీఁజవా? నెత్తుకో
నీఁ గాఁగూడదె?" యంచుఁ బల్కు వధు వెందిష్టాప్తి రంజిల్లుతన్.

సువాసిని — ఆఁడుపడుచు

ఒకసాయమ్మసివారి కేఁగిన మగండొక్కింత కేతెంచి పి
ల్వకయే తల్పును దట్టఁగా దయిత "యెవ్వార్వా" రనన్ లజ్జ మి
న్నకయుండన్ బతి; "పల్కవే" మని కృతన్యక్కారయై తల్పుఁ దీ
సి కడున్ వెల్వెలఁబాఱి పర్విడు మృగాక్షిన్ భర్తమన్నించుతన్.

మధ్యమ — కోమరాలు

అనువాదమ్ములలోఁ బురోహితుఁడు గర్భాధానఖండం బఠిం
చినమీఁదం గులపాలికల్ తమకుఁ బాసెం జేక పాత్రంబులోఁ
దిసఁ బెట్టన్ బతి గిన్నెలోనఁ దన చేతిం దాఁకు సారస్యమున్
గని యాపైఁ జెయి నేకదా యిడని ముగ్ధన్ నేత మోహించుతన్ !

స్నుష — కోడలు

కియుతిన్ వర్ణనసేయరానియవి యా కేళీవిలాసమ్ము ల
తృయమై యుండని మూఁడునిద్దురలు కాఁగా సారెయుం జీరయున్
గయికొం చెట్టులో పుట్టినిల్లు విడి సాత్త్వాల్లత్తిక్రనాఁ గానఁగా
నయి యత్తింటికి వచ్చు క్రొత్తడికిఁ జిత్తాహ్లాద మేపారుతన్ !

గుర్విణి — చూలాలు

నెలదప్పన్ బొరుగిండ్ల యాంద్రు "కడుపా నీదైన గారాబు కో
డలికిన్? జెప్పవు, చిన్ననాఁటనె యదృష్టం" బన్నచో నత్త "యాన్
దల లేర్పాటయి లోకులంబడినఁగాదా?" యన్నఁ, దన్నానుడిం
గల తీరడ్గెను గోల నేల నడువంగా నిచ్చునే యెట్టిఁడున్.

కుటుంబిని – ఇల్లాలు

"ఏలా నీకు భయంబుఁజెందఁ? దలపై నెక్కించుకొందు న్నినున్
బాలా! యత్తయు నాఁడుబిడ్డలును నీపంతంబు చెల్లింత్రు నా
శ్రీలన్నింటికి నీవె రాణి" వని పేర్మింబల్కి పండ్లాడి య
య్యాలిం గూలిపడంతికై వడిఁగనం బ్రాణంబు లెట్లొప్పెడిన్.

ఇది యటుండ, చెన్నపురమున నొక విద్వత్సమాజ మేర్పడి కృష్ణదేవరాయల కొండవీటి దండయాత్రను గూర్చి యొక కావ్యము రసోత్తరముగా రచించువారిలో నుత్తమశ్రేణికిఁజెందిన కవికి బంగారుపతకము బహూకరింతు మని ప్రకటించిరి. ఆ పందెములో మన కవుల రచనమే నెగ్గినది. అవు డిటులు చెప్పుకొన్నారు.

మద్రనగరాంధ్ర విద్వత్సమాజ దత్త
నూత్న విజయ క్రియాలబ్ధ రత్న ఖచిత
హేమబిరుదాభిరాములు, రామకృష్ణ
రచయితలు పీఠపుర యువరాజ గురులు.

ఇట్లీ మేనత్తమేనమామబిడ్డలు శ్రోత్రపోకడలతోఁ గవితాభారతి నారాధించుచుండ ౧౯౧౫ లో ద్వితీయుఁడగు రామకృష్ణకవి యకాలమృతికిఁ బాలుపడియెను. ఇతఁ డాచార్య శంకరులవలె నత్యంత తరుణ వయస్సుననే మరణించి యేకైకపుత్రకులు సజీవులునైన తలిదండ్రుల దుఃఖాబ్ధి ముంచినాఁడు. చనిపోవునప్పటికి కవికి ౨౯ ఏఁడుల యీడు. ఈ సందర్భమున నీతరుణకవి విశిష్టతఁజేర్కొనుట యప్రస్తుత ప్రశంస కాదు. ఇతఁడు తన పదునొకండవయేఁట 'నరకాసురవ్యాయోగము' నాంధ్రీకరించినాఁడు. పదునాల్గవయేఁట 'దమయంతీ కల్యాణము' అను నచ్చతెనుఁగు ప్రబంధము సంతరించినాఁడు. అసాధారణమైన మేధాసంపద గలవాఁడు. మూఁడు భాషలలోని మూఁడు పద్యములు కలిపివైచి 'వ్యస్తాక్షరి' యీయఁగా హేలఁగఁజెప్పిన బుద్ధిశాలి. కాకరపఱ్ఱున జిన్ననాఁట నితఁడు

వీథివెంబడిఁ బోవుచుండునపుడు అరుఁగులపైఁ బాలకములు చెప్పుచుండు పండితులు జంకుచుండెడివారఁట. ఇతని కబ్బినది ప్రాక్తన జన్మవిద్య గాని యభ్యస్తముగాదని యిచ్చటివారు ముచ్చటగాఁ జెప్పుచుందురు. ప్రాకృతమునఁ 'గుకవినిందనము' – సంస్కృతమున "కర్ణవిజయ వ్యాయోగము" వ్రాసినాఁడు. ఇవి యముద్రితములు. ఇంత చిన్న తనముననే బహుగ్రంథములు సంధానించి, సంస్థాన విద్వత్కవియై పేరు మోసిన కృష్ణుఁడు కవిలోక జిష్ణుఁడు. "కృష్ణకవి నోట బంగారు గిలక దీట." సహకవి యెడఁబాటు పిమ్మట, జంటలోఁ దొంటివారగు వేంకట రామశాస్త్రిగారు –

> అనఁగు మేనత్త కొమరుఁడై యాశుకవిత
> నాకుఁ జేదోడు వాదోడునై కడచిన
> కృతి సమర్థుండు మా రామ కృష్ణ శాస్త్రి
> యున్న నీ సాయ మర్థింతునోటు దేవి!

> చనియెఁ గదమ్మ నీ యవరజన్మవిలాసము మాకుఁజూప వ
> చ్చినగతి వచ్చి సత్కవితచేఁ గవికోటికివన్నె దెచ్చి యం
> తన యతఁడట్లు నీతనువునన్విలసిల్లిన నెవ్వ రింక నా
> పొనరుచు నీకృతి క్రియకుఁ బూనికఁ దోడ్పడువారు భారతీ!

అని దుఃఖించుచు సోమదేవ భట్టారక విరచితము, అష్టాదశలంబ కాత్మకము నగు 'కథాసరిత్సాగరము' నాంధ్రీకరింపఁ దొడఁగిరి. అందాఱు లంబకము లయినవి. ఆంధ్ర కథాసరిత్సాగరములోని కవితా శైలి నన్నయ కవిత్వపుఁ దెన్నునకు దీటు వచ్చునట్లున్నదని తెలుఁగు దేశములోని పండిత కవులెందఱో కొండాడియున్నారు. ఆ కృతిపీఠికలో నాధునిక కవిత్వమునుగూర్చి వేంకట రామశాస్త్రిగారి యభిప్రాయ మిట్లు తెలినది.

బంధము లెల్లవీడి బహుభావ సమృద్ధిగ నేఁడు మత్తపు
ష్ప్రంధయగీతి నా విరియఁబాఱుచు నున్నది తెన్గుఁగైత; మ
ద్గ్రంథముఁ గాంచుకాల మిదికా దటులైనను నేను బూర్వని
ర్బంధ కవిత్వపద్ధతులఁ బట్టియె గీచి రచింపఁ బూనితిన్.

ఈగ్రంథము నొకరురచించినను 'వేంకటరామకృష్ణ ప్రణీత' మనియే ప్రకటితమగుట వారి యభేదభావమునకుఁ జక్కని గుఱుతు. ఈ కృతి పీఠికాపుర యువరాజవరులు, ప్రియఛాత్రులు నగు రావు వేంకట గంగాధరరామరాయ కవిరాజుల కంకితము అందలి సుప్రసన్న శయ్యా తియ్యఁదన మిట్లున్నది:

శా. 'కానీచూత' మటంచు నీవడుగ వీక్షన్ జేతిలోఁ బోసితిన్
దీనారమ్ములు పెక్కు; వానికగు వృద్ధిం దే; వదట్లుండె; నా
దీనారమ్ముల నేని నాకిడవు; సందేహింప కీరీతిగా
నానా! వెండియు వచ్చితే యడుగ మూర్ఖా! సిగ్గులేదయ్యె నీ?

క. ఓ చెడుగా! యచ్చోఁ గల
యా చచ్చిన మూషకమ్ము నైనఁ బణముగాఁ
జూచుకొని కుశలుఁ డగువాఁ
డేచందంబుననొ ధనము నిట్టిగడించున్.

గీ. అట్టియెడ నీవు చేతిలో బెట్టినట్టి
సొమ్ము గడతేర్చి వెండియుఁ దెమ్మనంగ
వచ్చినాఁడవు; పోపొమ్ము చచ్చినాఁడ!
దాఁచఁ బెట్టితె యిచట నీతాత మూట?

క. అని కసరుచుండ నే నది
విని యామృత మూషకమ్ము వేఁడెద నా ॥

మ్మనఘా! యిదియ పణమ్ముగఁ
గొని సేవ ర్తకముఁ జేసికొందు నటంచున్.

క. వచ్చిన యామొలుకను నా
కిచ్చినయటు వద్దు వ్రాసి యిడి యతనికి, నేఁ
దెచ్చితి దానిం గని యతఁ
డచ్చెరువడి నవ్వు కొనుచు నభినందింపన్.

ఈతీరుగా మొత్తని నిర్దుష్ట కయ్యలో నీకృతి యున్నది. వారి చేతి మీఁదుగానే కృతి తుదముట్ట కుండుట దుర్విధి. 'నూటపదియార్లు' అనుపేరఁ బరమేశ్వరుని గూర్చి వీరు సీసములు రచించిరి. అవి సువర్ణములు. ఈ గ్రంథము తెనుఁగువారి డెందము లుబ్బింపఁగల గీతాంజలి. ప్రతిభాజన్య మయిన దీనికిఁ దగినంత ప్రశస్తి దేశమున లేదు.

హృదయ పాత్రంబులో నేమియున్నదో కాని
తొలకుచున్నది నిన్నుఁ దలఁచినపుడు
ఈ మనఃఫలకమం దేమి యున్నదో కాని
మ్రోఁగుచున్నది నిన్ను మ్రొక్కినపుడు
శీర్ష పేటిక నేమి చిత్రమున్నదో కాని
మూయుచున్నది నిన్ను ముట్టినపుడు
ఈ భావవీథిలో నేమియున్నదో కాని
తారుచున్నది నిన్నుఁ గోరినపుడు
రమ్ము! నాతండ్రి! నను జేరరమ్ము! ప్రణతిఁ
గొమ్ము! కరుణించి నన్నేలుకొమ్ము! చేర
నిమ్ము! నీదర్శనంబు నాకిమ్ము! నిన్నె
నమ్మినాఁడను శాశ్వతానందనిలయ!

# వేంకట పార్వతీశ్వర కవులు

## (౧) 1880
## (౨) 1882

నియోగి శాఖీయ బ్రాహ్మణులు. ఒకటివారు బాలాంత్రపు వేంకటరావుగారు. వాధూలసగోత్రులు. తల్లి: సూరమ్మ. తండ్రి: వేంకటనరసింహము. జన్మస్థానము: మల్లాము [పిఠాపుర పరిసరము] జననము 1880 సం. విక్రమవత్సరము. రెండవవారు ఓలేటి పార్వతీశముగారు గౌతమసగోత్రులు. తల్లి: వెంకమ్మ. తండ్రి: అచ్యుతరామయ్య. జన్మస్థానము: కొమరగిరి [పిఠాపుర ప్రాంతము] జననము: 1882 సం. చిత్రభాను వత్సరము.

గ్రంథములు: నవలలు: ఇందిర–ఆరణ్యక – ఉన్మాదిని – సీతారామము– సీతాదేవి వనవాసము– నీరద – నీలాంబరి–ప్రణయకోపము – ప్రతిజ్ఞాపాలనము – ప్రభావతి – ప్రమదావనము – శ్యామల – శకుంతల – చందమామ – రాజసింహ – వసుమతీ వసంతము – వీరపూజ – రాజభక్తి – వంగవిజేత – లక్షరూపాయలు – మనోరమ – మాతృమందిరము – మాయావి – హారావళి – రజని – సాధన – కృష్ణకాంతుని మరణశాసనము – పరిమళ – సంతాపకుఁడు – చిత్రకథాసుధాలహరి. మున్నగునవి. పద్యకావ్యములు: ౧. కావ్యకుసుమావళి [2 సంపుటములు 1924] ౨. బృందావనము [1935 ముద్రి] ౩. ఏకాంతసేవ [1922 ముద్రి] ౪. ధనాభిరామము [నాటకము: వేంకటరావుగారు ప్రత్యేకముగ రచించిరి] ౫. తారాశశాంకము. ౬. సువర్ణమాల [ఈ రెండు నాటకములు పార్వతీశ్వరకవిగారి ప్రత్యేకరచనములు] ౭. శ్రీ రామాయణము [వాల్మీకి రామాయణమునకుఁ జక్కని తెలుఁగుసేఁత; బాలకాండము పూర్తియై యిప్పుడయోధ్యకాండములో నున్నది రచన.]

వేంకటపార్వతీశ్వరకవుల కీర్తిపతాక నెత్తినది 'ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల'. 'ఆంధ్రప్రచారిణి' కీర్తి పేరుప్రతిష్ఠలు వచ్చుటకు వేంకట పార్వ

తీశ్వర కవులు కారణము. ఆంధ్రములో నభినవరీతులుగల నొకతీరు కవితకు అంకురార్పణము చేసినవా రీ జంట కవులే యని నేటి వారిలో మేటికవులు కొందఱభిప్రాయపడుచున్నారు. ఈయభిప్రాయమున కా యుగళము రచించిన 'ఏకాంతసేవ' యనుకృతి పట్టుగొమ్మ. అనుకృతి దారికిఁ బోక, సాజముగా వచ్చిన తియ్యని బాసతోఁ గొత్తవడువున భావవిలక్షణత రాణించు కవితను రచించు నేఁటివారిలో 'వేంకట పార్వతీశ్వరకవులు' కడుగౌరవనీయు లనుట స్వభావోక్తి. ఇఁక వీరి చరిత్రాదికముఁ గూర్చి ప్రకటించెదను.

బాలాంత్రపు వేంకటరావుగారు 'ప్లీడరుగుమస్తా' పని చేసుకొనుచు సేవో యల్లిబిల్లిపద్దెము లల్లుచుండెను. ఓలేటి పార్వతీశముగారు చెలికాని లచ్చారావుగారి దగ్గర నుండి యచ్చుపనులు చూచుచుండెను. 1908 సంవత్సరప్రాంతముదాఁక నీ కవకవు లొకరినొక రెఱుఁగరు. కాని, యిరువురు పిఠాపురమునకుఁ బరిసరములోనే యున్నారు. విమర్శకాగ్రేసరులని ప్రసిద్ధి వడసిన శ్రీ నడకుదిటి వీరరాజకవిగారు విద్వజ్జన మనోరంజనీ ముద్రాలయద్వారమున సారస్వతసేవ గావించుచు నాఁడు పిఠాపురముననే కాఁపురముండియున్నారు. ఈ మహాశయుఁడే మన ప్రస్తుత కవు లిరువురకు సేతుసంధానము చేసినవారు. ఆచంట సాంఖ్యాయన శర్మగారి సంపాదకత్వమున "కల్పలత" యను పత్త్రిక నడుచుచున్నతఱియది. ఆ కల్పలతలో భాషాసంబంధములగు ప్రశ్నములు, సమస్యలు వెలువరింపఁబడెడివి. ఒకనెలఁ గొన్ని ప్రశ్నములకు వీరరాజకవియును బిఠాపురము నుండి ప్రత్యుత్తరములు వ్రాసి పంపెను. వానికే పార్వతీశముగారు సమాధానము లంపిరి. వేంకటరావుగారు నెక్కడనుండియో వ్రాసి పంపించిరి. ఒకరివిషయ మొక రెఱుంగరు. పార్వతీశముగారికి ప్రథమ బహుమానము. వీరరాజకవికి రెండవబహుమానము. వేంకటరావుగారికి మూఁడవ బహుమానము నిచ్చినటులు పత్త్రికలోఁ బ్రకటితమైనది.

ఈ ముప్వురు నొకశాఖపై నున్న కోకిలములే. ఒకరి గానమాధురు లొకరు విని యానందపడినారు. వీరరాజ కవిగారి సహృదయత మల్లాము కవిని - కొమరగిరి కవిని తీసికొనివచ్చి సంధానము చేసినది. నాటి నుండి వేంకట పార్వతీశ్వర కవులు. ఈ జంట యేర్పడని సమయమున వేంకటరావుగారు 'ధనాభిరామము' నాటకము - 'సురస' యను నవల వ్రాసికొనిరి. పార్వతీశముగారు పిఠాపురము మహారాజుగారి పట్టాభిషేక మునకు 1907 లో 'సువర్ణమాల' యను నాటకమును, 'తారాశశాంకము' అను వేఱొకనాటకమును రచించిరి. ఇవియే ప్రత్యేకరచనలు. తరువాతి వన్నియు వేంకటపార్వతీశ్వర విరచితములే. కవ కలిసికొనడనే 'అను రూప' యను కావ్యము రచించిరి. అదియిపుడు 'చిత్రకథా సుధాలహరి' గాఁ బ్రచురింపఁబడినది. ఈ కవుల కూలి కలయికవలన 1911 లో నాంధ్ర ప్రచారిణి వెలసినది. కార్యస్థానమునకు సూత్రపాతము కొణుకులో జరిగి నది. అక్కడ నొకయేఁడుమాత్ర ముండి నిడదవోలు - రాజమండ్రి - కాకినాడ - పిఠాపురము క్రమక్రమముగ సంచారము చేసినది. 1930 సం॥ దాఁక నీగ్రంథమాల మహోన్నతస్థితిలో నున్నది. శ్రీ కొవ్వూరి చంద్రా రెడ్డిగారు తొట్టతొలుత 'ప్రచారిణి' కి సహాకృతి చేసిరి. ఆయన చేతిచలువ వలన నా గ్రంథమాల కట్టి ప్రఖ్యాతి వచ్చినది. చంద్రారెడ్డి తెలుఁగు వారికి స్మరణీయుఁడైన వ్యక్తి. ఆంధ్రప్రచారిణికి దీటువచ్చు గ్రంథ మాలలు మననేలలో రెండో మూఁడో. చక్కని వచన వాఙ్మయమును సేవించిన గ్రంథమాలలే తక్కువ. 1930 నాఁటికి ప్రచారిణి వెలువరించిన గ్రంథముల సంఖ్య 170. ఆంధ్రప్రచారిణికిఁ బ్రాణము వేంకట పార్వతీ శ్వర కవులు. ఈ జంటకవులకు నడుమనడుమఁ బొడముచుండు మానసిక ములగు కలఁతలను ప్రచారిణి మధ్యవర్తినియై తొలఁచుచుండెడిది. రెండు దశలు గ్రంథమాల జాతకము విఖ్యాతముగ వెలిఁగినది. వేంకట పార్వ తీశ్వరుల నవలలు "తెలుఁగు"లో నలుమూలలఁ బేరు సంపాదించుకొన్నవి.

ఈ కవు లిర్వురును గురుముఖమున సంస్కృతమునుగాని, ఆంగ్లమునుగాని యధ్యయనము చేయలేదు. వీరికి వంగభాష కొంచెము వచ్చును. మిత్రునివలనఁ గన్నడములో ననువదింపఁబడిన బంకించంద్రుని నవల నొకదానిని చదివించుకొని విని, వంగ వాఙ్మయపు సొగసులకు, బంకిం చంద్రుని కల్పనముల పొంకమునకు నివ్వెఱపడి మెల్ల మెల్లఁగ నాభాషలోఁ గృషి చేసిరి. ఆ కృషియైనను సాధారణమైనదే. ఏమైన నేమి! వంగము కాదు, ఆంగలముకాదు, అన్యభాష లెన్నో యెఱిఁగినవారికంటెఁ గూడ వీ రెక్కువ సేవ చేసిరి. వీరి నవలలలోని రచనసొంపు వేఱే నేను వక్కాణింప నక్కఱయుండదు.

అనువాదములు గావించిరి. కల్పనములును జేసిరి. వీని రచించినను సహజత్వము శైలిలో నుండుటచే వీరి రచనలు పాఠక హృదయములను హత్తుకొనఁ గలిగినవి. వీరి నవలావాఙ్మయము తెలుఁగుతల్లి విహారము నకుఁ 'బ్రమదావనము'. ఇఁక వీరి పద్యకావ్యముల సంగతి: 'అనసూయ' పత్రికలో మొట్టమొదట 'ఏకాంతసేవ' కావ్యము బయటఁబడినది. అదియాది వీరి నాధునికులు మెచ్చి కవులలో నొక మంచిస్థాన మిచ్చినారు. 1922 లో నా కృతి యచ్చుపడి తెలుఁగువారి కెల్లరకు నందుపాటు లోనికి వచ్చినది. వంగ సారస్వత మెఱుఁగరు. ఆంగలము తెలిసినవారు కారు. రవీంద్రుని భావోన్నతి వీరి కెట్టు లబ్బినదో యని యందఱబ్బుర పడినారు. 'ఏకాంతసేవ' నేఁటి కృతులలో రసభావపరిపూర్ణమై యున్న దని యెన్నుకొనినారు. ప్రకృతి పులకించునటులు భక్తుఁడు జీవితేశ్వరుఁ డైన యా పరమేశ్వరుని గూర్చి పాడుకొన్న ప్రణయ గీతముల సంపుట మీ 'యేకాంతసేవ'.

నా మెలంగుతోఁట నామాటలోఁ జేటు
నావరాలకొంగు నావెలుంగు

నావయాళి తేప నాచూపులోఁ బావ
నిలుచుఁగాక! తన్నుఁ గొలుచుదాఁక.

అని ప్రార్థించి కృతిగానమున కుపక్రమించిరి. కవుల భావకత యను పదమునఁ బాఠకులకుఁ దట్టుచుండును. నిశితమైన భావనాశక్తి గల కవులు వీరని 'యేకాంతసేవ' ఘోషించి చెప్పుచున్నది. ఈ పదములు చదువుఁడు :

తూరుపుఁగోనలో దుందుభిస్వనము
వీణాస్వనంబులో వినరాకయుండె
నానందవనములో నాగస్వరంబు
నూఁదకే కోకిలా యొక్కింత సేపు.

* *

శృంగారనదిలోన చిగురాకుదోనె
యే రాగజలధిలో నీఁదుచున్నదియొ
తలిరు జొంపంబులందలి గానలహరి
యే దివ్యసీమల కేఁగుచున్నదియొ!
పరువంపుఁ బూవులోపలి కమ్మతావి
యేవాయుపథమునం దెగయుచున్నదియొ
తారాపథంబునందలి తటిల్లతిక
యే మహాతేజమం దేనయుచున్నదియొ!
గాలిలో జాడలు కనిపెట్టఁగలుగు
దివ్యమూర్తికి నీకుఁ దెలియదేటమ్మ!
ప్రణయవనంబులోపలి పుష్పరథము
తుమ్మెదా! వేవేగ తోలితేవమ్మ!

ఏకాంతసేవకుఁ బీఠిక వ్రాసి వ్రాసి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చివర కిటులు తమ యభిప్రాయము తేల్చినారు. "ఇది విమర్శనాతీతము. వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో, మన యాంధ్రమున కీ మహాకవుల – భక్తుల యేకాంతసేవ యట్టిది"–

వేంకట పార్వతీశ్వర కవుల భావరాశి స్వాభావికమైనది కాని, యాంగ్ల వంగములనుండి దొంగిలిగొన్నది కాదని మన మనుకొనవలసిన విషయము. వీరి 'కావ్యకుసుమావళి' రెండు సంపుటములు చూడుఁడు! కవిత యెచ్చోటనేని సహజతలోఁ గొఱఁతవడినటులున్న దేమో!

తిన్నని సున్నని తెల్లని యెనలేని
మొగ్గలలోనుండి నిగ్గుఁదీసి
చక్కని చిక్కని సరిలేని కమ్మని
పూవులలోనుండి ప్రోవుఁజేసి
విఱుగని తఱుఁగని వెలలేని తీయని
తేనియలోనుండి తేటఁదీసి
నలఁగని తలఁగని నలిలేని తొలిలేని
చివురాకుదొన్నల సేకరించి—

ఆంధ్రకవితా సరస్వతి నమ్లానపుష్పోపహారములతో నర్చించిన కవివరులు వీరు. కవితలోఁదఱచుగఁ బదముల పునఃపునరావృత్తి వీరి కిష్టము. నవ్యకవితావతారమునకు ముందే యనేక నూతన విషయములపై వీరి లేఖిని 1909 సం॥ కంటెఁ దొల్లి పత్రికలలో వెల్లివిరిసినది. కొన్ని రకముల కవితామార్గములకు వేంకట పార్వతీశ్వర కవులు దర్శకులుగాని, వీరు వేఱొకరి కవితతీరు ననుకరించినటులు మన మనుకొనరాదు. అట్టి స్వాభావికత వారి రచనలోఁ బదముపదమునఁ బరికింపవచ్చును. ఈ జంట

కవుల యభ్యుదయము గుఱించి శ్రీ పీఠికాపురాధీశ్వరుఁడు వీరి కొక ముద్రాయంత్రమును గొనియిచ్చి తదుద్యమమునకుఁ జేయూఁత నొసఁగెను. నరసారావు పేటలో జరిగిన ఆంధ్రసారస్వత పరిషత్తున శ్రీ ఉయ్యూరు రాజావారి సభాధిపత్యమున నీకవులకు 'కవిరాజహంస' బిరుద మొసఁగఁ బడెను. 1948 లో రాజమహేంద్రవరమున వీరికి షష్టిపూర్తి సమ్మాన మహోత్సవము వైభవపూర్ణముగా సాఁగినది. అప్పుడు కూడిన యాధునిక కవివర్గము వీరికి "కవికులాలంకార" బిరుదము నిచ్చి గౌరవించిరి. ఈ బిరుదములు రెండును వీరియెడఁ దగినటులుండి యందగించుచున్నవి.

ఉ. పావనమూర్తి నీశ్వరుని బమ్మెర పోతన రామరాజుగా
భావనచేసి పాడుకొనె భాగవతంబును; నట్లె రామభూ
మీ వరు సద్గుణావళుల మేము జగత్ప్రభు లీలఁగాంచి బృం
దావన కావ్య మంకిత మొనర్చితి మాతని పెండ్లిపాటగన్.

అని చెప్పి శ్రీ పీఠికాపుర యువరాజు గంగాధర రామరాయ ప్రభునకు 'బృందావనకావ్యము' నంకితము గావించిరి. ఈ కబ్బము శ్రీ రఘునాథ రాయల కాలమున వెలసిన శృంగారకావ్యములను దలదన్ను చెన్నుగ నున్నది. ఈ కూర్పునేర్పు వరికింపుఁడు.

సీ. మణి కిరీటంబుపై మన్నింపలేదఁటే
కొరగాని పురిసిమ్మకోడి ఱెక్క,
అధరపల్లవముపై నానింపలేదఁటే
వెలిపోని నీరసంపు వెదురుపుల్ల,
శ్రీవత్సకాంతిపైఁ జెలఁగింపలేదఁటే
వెలలేని చిఱువోఁక తులసిరేక,
కల్యాణమూర్తిపైఁ గదియింపలేదఁటే
కొరరాని వసరాకుపురుగునూలు

అఖిలలోకవిభుని నతిభక్తి సేవింప
నాత్మవిభుని కరుణ నభిలషింపఁ
దగనివారుఁ బడయఁదగనివా రెవరమ్మ?
తరతరంబు లేల తడవెదమ్మ?

ఉ. వేంకట పార్వతీశ్వర కవిద్వయ నిర్మల వాఙ్మనః క్రియా
సంకలనంబునం బొడమి సమ్మతమై ఫలపుష్పశాఖికా
సంకుల సత్కవిప్రకర సాధునుతంబయి కామరాణ్మహేం
ద్రాంకితమైన యీ కృతిసురాగము మర్త్యులఁ దన్పుఁ గావుతన్!

మన తెనుఁగువారిలో నీకవులను దాఁటిన కవు లున్నారు. పండితు లున్నారు. భావకు లున్నారు. తెలుఁగుపలుకుబడి యింతమధురముగా, మృదువుగా, తేటతెల్లముగాఁ, దీగుతియ్యముగాఁ దీర్చి దిద్దినవారు తక్కువగ నున్నారు. పసిపిల్లవానినుండి, పండితునివఱకు నచ్చునట్లు తేలికబాసలో నింత సంతసగా సంతరించు కవిరాజహంసలు మన వారిలో నెందఱో లేరు. 'బాలగీతావళి' పలువురు చూచియుందురు. ఎంతసేపు, సాధారణజనబోధకముగా నుండునట్టి నడక వారి సొమ్ము. అట్టులని, యర్థగంభీరత యుండకుండునా? ప్రతిపద్యమునఁ జాల గాంభీర్యము. ఈ జంటకవులు తమ 'లేఖిని' కూర్చి యీ రీతి యుపదేశములు చేయుచుందురు.

వ్రాయుము నిర్మలభావ వి
ధేయమ్ముగ బుధజనాతిధేయముగ జగ
ద్గేయమ్ముగ లలితసుధా
ప్రాయమ్ముగఁ బాలకశ్రవణపేయముగన్.

ఇట్టి కరవులు గఱచిన లేఖినితో నీనడుమ వేంకటపార్వతీశ్వర కవి కోకిల యుగళము తెనుఁగులో నాదికావ్యగానము చేయఁదొడఁగినది. రచన నేఁటి కయోధ్యకాండములోనికి వచ్చినది. అది. సాంతమై గీటు ఱాతికి వచ్చుఁగాక!

---

# అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి

## 1883 - 1935

తెలగాణ్యశాఖీయబ్రాహ్మణుఁడు. కృష్ణయజుశ్శాఖీయుఁడు. భారద్వాజస గోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కన్నతల్లి: మహాలక్ష్మమ్మ. కన్నతండ్రి: రామయ్య. పెంచుకొన్న తల్లిదండ్రులు: లక్ష్మిదేవమ్మ, వెంకటప్పయ్యలు. అభిజనము: గార్లపాడు (బాపట్లతాలూకా) జననము: 1883- నిర్యాణము: 1935. కృతులు: ౧. జీవన్ముక్తి – విదేహముక్తి. ౨. సగుణోపాసన–నిర్గుణోపాసన ౩. దైవబలము (చిన్న పద్యకావ్యము). ౪. ఆంధ్రధ్వని (ధ్వన్యాలోకమున కనువాదము) ౫. తెనుఁగు కావ్యాదర్శము. ౬. కావ్యనాటకాది పరిశీలనము. ౭. మేఘము (కావ్యము-అముద్రితము).

ఆశుకవితలో నవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కాంధ్రమున మంచిపేరున్నది. ౧౯౧౦, ౧౧ సంవత్సరముల ప్రాంతమునఁ దిరుపతి వేంకట కవులకుఁ గొప్పరపు సోదరకవులకు నాశుకవితా విషయమున ఘోరాఘోరి యుద్ధము తటస్థించినది. 'గుంటూరుసీమ' పూర్వోత్తర రంగములు తన్మూలముననే రచింపఁబడినవని తెలుఁగువారి కెల్లరకుఁ దెలియును. కొప్పరపువారితోఁ గవిత్వపుఁబోటీకి నీ సుబ్రహ్మణ్యశాస్త్రులు గారిని నాఁడు తిరుపతి వేంకటకవులు పంపించిరి. వేమవరాగ్రహారమునఁ దత్ప్రదర్శనము గావింపఁబడినది. ఓహో! శాస్త్రులుగారి కవితాజవమునకుఁ బట్టబగ్గములు లేవు. కొప్పరపుఁగవు లోడిపోయిరి. శాస్త్రులుగారు నెగ్గివచ్చిరి. గురువులు తిరుపతి కవులు శిష్యుని మెచ్చుకొని యిట్లు వ్రాసి యిచ్చిరి.

అన్నం బెక్కడనో భుజించితివి విద్యన్నాకడ నేర్చి; తెం
డెం దున్నీయందు లవంబు గాననుజుమీ దోషంబు, దుశ్శాత్రవుల్
[illegible]నన్నున్ [illegible] వారి యాశువుల చందంబెల్ల నవ్వారి సు
బ్బన్నా గెల్చి ఋణంబు దీర్చితివి సుమ్మా! శిష్యచూడామణీ!

'వేంకటశాస్త్రి'

ప్రకటతరాశుధారను సభాసదులెల్లరు మెచ్చుచుండ, నా
యకమణి సంతసింపఁగ నయారె! రచించినవాఁడవీవు, వా
రక యరవింద సుందర మరంద ఝరంబు స్రవించుచుండు నీ
సుకవితఁ గాచుకోఁదగవె సుబ్బనశాస్త్రి! జగద్ధితంబుగన్.

'తిరుపతిశాస్త్రి'

ఇదిగాక, సికిందరాబాదు మున్నగు ప్రసిద్ధస్థలములలో వీరుగావించిన శతావధానములు, ఆశుకవితా ప్రదర్శనములు పలువుర ప్రశంసల నందుకొన్నవి. తెలుఁగునను సంస్కృతమునను వీరు సమాన వేగముననే కవితచెప్పఁగలిగిరి. ఎట్టివాఁడైన సంస్కృతములోఁ దడవు కొనకుండ మాటాడునలవాటు మనప్రాంతీయులలోఁ గడునరుదు. శాస్త్రులుగారు నిరాఘాట ధోరణి మాటాడునపుడు పండితులు దిగ్భ్రాంతి పడువారు. ఇది యత్యుక్తి కాదు. ఏలేశ్వరపు నరసింహశాస్త్రిగారొకరు సంస్కృతాశుధోరణిలోఁ బేరుపడ్డవారు. 'ఆశుకవితిలక' బిరుదాఢ్యులగు సుబ్రహ్మణశాస్త్రిగారు తమగురువుల నిటులు పేరుకొనిరి.

శ్రీయుతులు బొడ్డుపలి సుబ్బరాయబుధుని
కొలచల నృసింహశాస్త్రిని గురువరులను
స్తుతి యొనర్చి, యద్దేపల్లి సోమనాథ
తార్కికాగ్రణి దేశికుఁ దలఁతు మదిని. 'ఆంధ్రధ్వని'

తరువాత శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి సన్నిధికిఁజేరి, వేటూరి ప్రభాకరశాస్త్రి పాదుని సహాధ్యాయత్వమున 'సిద్ధాంతకౌముది' పాఠము చేసిరి. శ్రీ బ్రహ్మానంద తీర్థస్వాములతోఁ బ్రస్థానత్రయ మధ్యయనముగావించిరి. తర్క వ్యాకరణములు, వేదాంతము, ధర్మ శాస్త్రము, అలంకారము మున్నగు వివిధ శాఖలలో వీరి కనల్పమగు పరిజ్ఞాన మున్నదనియు, నాంధ్రములో వీరిపాండితి యుద్దండమైనదనియుఁ బండితు లెన్నుకొందురు. ఈయన ప్రాచీనవాఙ్మయమును దఱచిన లక్షణవేత్తయైనను, నూతనత్వమెఱుఁగని ఛాందసుఁడు కాఁడు.

ప్రస్థానములు పఠించిన వేదాంతి యైనను, రసతత్త్వము తెలియని శ్రోత్రియమాత్రుఁడు కాఁడు. మంచి లౌకిక విజ్ఞానము కలవాఁడు. గొప్ప దేశీయాభిమానము కలవాఁడు. పతితాంధ్ర సామ్రాజ్య విభవమును గూర్చి వగచు జాతీయ కవిశిరోమణి. 'ఎండ్లూరు' పూర్వసంపదను స్మరించుకొని రచించిన యీ సీసములు సువర్ణములు.

నీమట్టిలోఁ బుట్టి నిఖిలదేశంబుల
వెలిఁగించియుండెఁగా తెలుఁగు వెలుఁగు
నీనీట తేటయై నానాస్థలంబుల
నాక్రమించెనుగదా యాంధ్రకీర్తి
నీలోని గాలిలో లీలయై పలుచోట్లఁ
జెంగలించెనుగా, త్రిలింగదీప్తి
నీపై రువఁటల నిగ్గయి యెల్లచోఁ
దనరారియుండెఁగా, తెలుఁగుశక్తి
యే జెముడుపొదలక్రిందనో నిమిడి దాఁగి
యుండెనో యిప్పు డల్ల నీయుచ్ఛ్రయంబు
రామచంద్ర రాజేంద్రుని రామభద్రు
భూరమణుఁ గన్నతల్లి ! యెండ్లూరుపల్లి !
పుడమి వేల్పులకు నీపుత్త్రులొసంగిన
రమ్యమహాగ్రహారముల పేర్లు
జంగము కథలలో శృంగార పూరమై
పాడుచునుండెడి వీరరసము
తాతలనాఁటి కథల్ చెప్పుకొనుచుండు
కులవృద్ధుల బెడంగు గలుగు నుడులు
పౌత్త్రప్రియుల్ మది స్మరియించుకొని శిర
శ్చలనంబుతోఁ జేయు శ్లాఘనములు

నీడు చల్లని కాన్పున నెగడినట్టి
పౌరుషౌదార్యరేఖలఁ బ్రస్తుతించి
పోవునో యేమొ, నీపేరు పుడమి విడిచి
శూరగర్భ వౌకప్పు డెండ్లూరుతల్లి !

బళీ! ఏండ్లూరు పూర్వము శూరగర్భయఁట. నేఁడు జెముడుపొదలతో నిండియున్నదఁట. ఈ దుస్థితి కవి నెంత పరితపింపఁ జేసినదో ? ఆర్ద్రహృదయుఁడగు నీకవి హృదయ ప్రణాలికనుండి యుబికిన యీ సహజ కవితాప్రవాహము రసవిదులకుఁ దలమున్కలు చేయుచున్నది. ఇట్టి పద్యములు నాలుగే వ్రాయుఁగాక, అవినాలుగు కావ్యములుకావా ? శ్రీ శాస్త్రిగారు 'భారతి' లో వెలువరించిన యీసందేశము చదువుఁడు.

"......నవీనరహస్యములను గల్పనాప్రపంచముద్వారా వాఙ్మయ ప్రణాళికలోఁ బ్రవహింపఁజేయు సుకవుల సందేశము లుగ్గుఁబాలుగ నేజాతికి జీర్ణమగుచుండునో, వారిదే యభ్యుదయము, వారిదే స్వాతంత్ర్యము, వారిదే విజయము......" భారతిప్రభృతి పత్రికలలో నప్పుడప్పుడు ప్రకటించిన ఖండకావ్యములుగాక, వీరి పద్యకృతులు ప్రత్యేకముగ నచ్చుపడినవి కానరావు 'దైవబలము' అనుపేరుగల భక్తిప్రధానమగు చిన్నకావ్యమొకటి ప్రకటితము. "మేఘుఁడు" అనుఖండ కావ్యము నవీనమార్గములోఁ జివరికాలమున వీరు రచించినది ప్రచురింపఁబడలేదుగాని, శాస్త్రిగారిశిష్యపరంపర నోళ్ళలోనానుచున్న కొన్ని పద్యములు విన్నచో నది రసపరిప్లుతమగు కావ్యమని తోఁచును. వీరి యాంధ్రధ్వని, తెలుఁగుకావ్యాదర్శము, కావ్యనాటకాది పరిశీలనము మొదలుగాఁగల రచనములను జూచిన నలంకార శాస్త్రమున నీయన యెట్టి పరిశ్రమ గావించెనన్న దానికిఁ బ్రత్యుత్తరమిచ్చును. రసగంగాధర మాంధ్రీకరించిరని కూడఁ దెలియవచ్చినది. రామాయణకథను దీసికొని సంస్కృతమున నాటకములుగా నిబంధించిరనియుఁ జెప్పుకొందురు. మఱి, అవి

యన్నియు నెవ్వరికడనున్నవో? ఏమైనవో? — వేదాంతమున ననంతపరిశ్రమముగావించి గ్రంథములు, ననేకవ్యాసములు వీరు ప్రచురించిరి. శాస్త్రిగారు గద్వాల, ఆత్మకూరు, ముక్త్యాల మున్నగు వివిధసంస్థానములలోఁ బ్రతివాదిభయంకరముగాఁ గవితాప్రదర్శనము గావించుచు, బిరుదములు తాల్చుచుఁ గీర్తికాములై ప్రవృత్తిపథమున సంచరించిన వారుగా స్థూలదృష్టికిఁ దోఁచినను, సామాన్యులకు గోచరింపని నివృత్తిమార్గముననే వీరిచిత్తము సంచరించుచుండెడిదిదని యిక్కడ జెప్పఁదగిన రహస్యము. ఆయన సహజసాత్త్వికరూపము, శాంతగంభీరభాషణము, నిత్యభావ్యవర్యాలోచనము, కర్మాచరణము స్మరణీయములైనవి. ఇట్టి గర్వగహితుఁడు, నిష్ఠాసహితుఁడు పండితులలో నూటికిఁ గోటికి నుండుననుటకు సంశయపడను. వైశ్వదేవము చేయక వీరెన్నఁడు నన్నము తినలేదు. ఈయన యెప్పుడును 'తమపేరే'మనియడుగ 'సుబ్బయ్య' యనియే చెప్పెనుగాని సుబ్రహ్మణ్యశాస్త్రి యనుకొనలేదు. తమ యాంధ్రధ్వని మీఁదఁ బ్రతికూలాభిప్రాయము వెల్లడించి దొనఁగు లున్నవని యెన్ని పత్రికలోఁ బ్రచురించినపుడు, శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారికి లేఖమూలమున "మహాశయ! మీరు పత్రికాముఖమునఁ బ్రకటింపనేల? మీ వంటివారు ప్రత్యేకముగ నాకుఁ దెలిపిన సరిచేసికొనక పోయితినా?" యని వ్రాసి పంపిరఁట. మఱియొకసంగతి:-

కాట్రావులపల్లి (జగ్గంపేట) జమీందారు శ్రీ దామెర సీతారామస్వామిగారు రసికుఁడైన విద్వత్ప్రభువు. వారిదర్శనమునకు మన శాస్త్రిగారొకతూరి వెళ్లి, రాజగురువులను జూచి, ఆయన యేమి చదివితిరని ప్రశ్నింప "నేదో కొంచెము సాహిత్యము, కొంచెము వ్యాకరణము, కొంచెము కవిత్వనల్లుట గురుకటాక్షమున నేర్చుకొంటి" నని చెప్పిరఁట. అప్పుడాయన 'పిఠాపురపుఁ జరిత్ర' నొసఁగితిరా? యని యడిగిరి. లేదని శాస్త్రిగారు సమాధానము చెప్పిరి. లేనిచో మాతోని దర్శనముకాదని

యూసంస్థాన గురువు చెప్పిపోమ్మనెను. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నిప్పు వ్వలై పోఁదలఁచి పోవుచు, నూతనాస్థానకవి శ్రీ ద్వివేది రామశాస్త్రిగారొకచోటఁ గూర్చుండ నచ్చటకుఁజేరి, వారితో నేదో లోకవృత్తాంతము సంస్కృతభాషలోఁ బ్రసంగించిరఁట. ఆ రామశాస్త్రిగారు మన కవివరుని నిరర్గళధోరణికిఁ బాండితికి నాశ్చర్యపడి ప్రభువు దర్శనము చేయించిరనియు, నా ప్రభువు ఎదుట గోడమీఁదనున్న "శకుంతలా" ప్రతిమను వర్ణింపుఁడన నాయస మనసు గరఁగునటులు సంస్కృతములో శ్లోకములు రచించి చూపిరనియు, నప్పుడు శ్రీవారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వార్షిక మేర్పాటు చేసిరనియు శ్రీ రామశాస్త్రిగారు "అభినవభోజచరిత్ర" లో వ్రాసిరి. ఈగాథ శాస్త్రిగారి నిర్గర్వితకుఁ దారకాణగదా, యని పేరు కొనవలసి వచ్చినది.

వీరు తెనాలి సంస్కృతకళాశాలలోఁ గొన్నాళ్లును, బందరు "హిందూ హైస్కూలు" లోఁ గొన్నాళ్లును, బాపట్ల శంకరవిద్యాలయములోఁ గొన్నాళ్లును ఆచార్యులుగా నుద్యోగించిరి. తరువాత 1927లో కొవ్వూరు "ఆంధ్రగీర్వాణ విద్యాలయము" వారి యాహ్వానముపై వెళ్లి యచట సంస్కృతాంధ్రోపాధ్యాయులుగా నెనిమిది తొమ్మిది యేండ్లుండి 1935 లో జీవయాత్ర చాలించిరి. కొవ్వూరి కళాశాలలో నుండఁగా శాస్త్రి గారికి, కాకినాడ విద్యార్థులు మా 'కళాశాల' కుఁ దయచేయుఁడని యుత్తరములు వ్రాయ, "నేను గౌతమీస్నానమునకుఁ గొవ్వూరిలోఁ జేరితిని గాని, ఉద్యోగము చేయుటయే ప్రధానోద్దేశము కా" దని సమాధానము పంపిరని తెలిసినది.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నైష్ఠికులు. పండితులు. కవులు. రసహృదయులు. శాంతచిత్తులు. వారి పేరు తెలుఁగువారు మఱచిపోరు. వారి కృతులు మనభాషకు భూషలు. ఇట్టివాఁడు కనుకనే సుబ్రహ్మణ్య

శాస్త్రినిఘూర్చి కింకవీంద్రఘటాపంచాననుఁడు చెళ్ళపిళ్లకవి "పేరికతండు శిష్యుఁడని పేర్కొన కొొప్పక పోదుఁగాని నైౖ, వారము గాదు నాకతఁడు వారక దేశికువంటివాఁడె......" యని మెచ్చుకొనెను. సర్వధా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ధన్యులు. పుత్రసంతానములేని కొఱఁత వారి విషయములోఁ గొఱఁతయేగాదు. "పుత్రాత్సద్గతి రితిచేత్తదపి ప్రాయోఽస్తి యుక్త్యసహమ్" అను శాంకరసూక్తి నెఱిఁగిన వారి కటు లనుపించదు. సంగీతసాహిత్య తత్త్వవేత్త యగు శ్రీ హరి నాగభూషణముగారు వీరి యంతేవాసి. వారేకాదు, మఱియెందఱో శాస్త్రిగారి సేవాభాగ్యము వడసి, పండితులై కవులై పేరుపెంపులు గాంచిరి.

సుబ్రహ్మణ్య శాస్త్రిగా రవధాన సందర్భములలోఁ గావించిన దేవీస్తవము లివి పరికించినచో, ఆయన యెన్ని సంస్థానములలో సత్కారములు గాంచెనో వ్యక్తమగును.

సీ. ఏ దేవి దయ జయమిప్పించె సత్కళా
　　　పూర్ణమౌ "నెల్లూరు" పురమునందు
ఏతల్లి బిరుదంబు లెనయించె నల "పెద్ద
　　　పవని భూపాలుని" సవిధమందు
ఏయమ్మ కారుణ్య మేడుగడగ నుండె
　　　"కందుకూరి" వధాన కార్యమందు
ఏమాత ధారా సమృద్ధుల నొసఁగించె
　　　నెట్టన "కనిగిరి" పట్టణమున
గీ. అట్టి లోకైకజనని, హృదంబురుహ ని
రంతరాభ్యర్చ్యమాన పాదాంబుజాత
జాతరూపమణీ విభూషా విశేష
భూషితాకార నన్ సభఁ బ్రోచుఁగాక!

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి

"తెనుఁగు కావ్యాదర్శము" లోని పద్యము :-

సీ. లష్కరు నగరి కల్లవ్వసత్రంబున
షష్ట్యవధానంబు సంతరించి
గద్వాల నగరున విద్వత్సభ నశీతి
లేఖినీ కవన మల్లింపఁజేసి
ఆత్మకూరు నగరి నాశుకవిత్వ లీ
లాస్ఫూర్తి రాజవాల్లభ్య మొసఁగి
ముక్త్యాల నృపుచెంత మోహానంబైన యు
పన్యాసధోరణి వరలఁజేసి

గీ. తగఁగఁబలుచోట్ల నష్టావధాన సభల
నాశుధారాకవిత్వ మహాత్త్వ మిచ్చి
నన్నుమనుచు మాతల్లి మనఃప్రమోద
దానసంతాన వల్లీమతల్లిఁ గొలుతు.

---

# వేలూరి శివరామశాస్త్రి

## 1892

తల్లి : శ్రీవిశాలాక్షి. తండ్రి : వేంకటేశ్వరావధానులు. గ్రామము : చిరివాడ (కృష్ణామండలము). జననము : 1892 సంవత్సర ప్రాంతము. కృతులు : ముద్రితములు— ౧. సోముఁడులేక ఉత్తరహరివంశ విమర్శము (1919 లో విరచితము) ౨. ముక్తాలత (ప్రబంధము. 1910 లో విరచితము) ౩. తాలఁకట్టనము (విమర్శనము 1913 విర) ౪. తెనాలి శతావధానము, కొవ్వూరు, చట్రాయి, తెనాలి, బెజవాడ, గుంటూరు కాలేజీ శతావధానములు. ౫. కృతకసూత్రము (ఖండకావ్యము. 1910) ౬. మాధవవర్మ (నాటకము) – 1920 ముద్రితము.) ౭. ఉపగుప్త. ౮. బిడాలోపాఖ్యానము (పద్యకథ. 1911 ముద్రి.) ౯. ఆత్మకథ (మహాత్మా గాంధి జీవితము. వచనానువాదము. ౨ సంపుటములు) ౧౦. కథలు – గాథలు [రవీంద్రుని వంగభాషలోని 'కథా' యను గ్రంథమున కనువాదము 1940 ముద్రి.] ౧౧. ఏకావళి. [ఖండ కావ్య సంపుటి. 1940 ముద్రి.] ౧౨. రాముని బుద్ధి మంతనం. ౧౩. సర్వేను వీలునామా. ౧౪. తీరనికోరికలు. ౧౫. బాపనపిల్ల. [ఈ నాలుగును శ్రీ శరచ్చంద్రుని నవలల కనువాదములు.] ౧౬. కథా షట్కము. ౧౭. కథాసప్తకము.

శివరామశాస్త్రిగారు కావ్యరచనలోఁ గథారచనలోఁ గ్రొత్త వాటములు తీసిన గొప్ప రచయితలు. ఆంగ్ల వాఙ్మయమున, వంగ వాఙ్మయమున, పరాసు వాఙ్మయమున వా రెక్కడలేని గ్రంథములను జూచిరి. ' సంస్కృతమునఁ జెప్పనేల! వ్యాకరణము, న్యాయము, వేదాంతము గురుకుల క్లిష్టులై యధ్యయనముచేసిరి. ఆంధ్రవిషయమున వారి కృషిని గూర్చి వేఱే వ్రాయను. శతావధానములు పలుచోటులఁ బోటీగాఁ జేసిరి. ఆశుకవిత్వములు 'నీవా? నేనా?' యని ప్రదర్శించిరి. ప్రబంధములు, ఖండకావ్యములు నవీన రీతులతో నంతరించిరి. నంగీ

తము గురుముఖమున నేర్చికొని, రాగధోరణిని పద్యములు చదువుచు మధువు లొలికించిరి. నేఁడును శివరామశాస్త్రిగారు నూరవరపుఁ దోఁటలో నిల్లు కట్టుకొని యున్నారు. అపుడపుడు పత్త్రికలలోఁ బద్యములు, కథలు, సాహిత్య విమర్శములు వెలువరించుచున్నారు. నడుమ నడుమ సభలలోఁ బాల్గొని, తీయని గొంతెత్తి విసరుచున్నారు. కాని, మానసికముగాను, కాయికముగాను పూర్వోత్సాహము, పూర్వదార్ఢ్యము తఱఁగి "తేహినో దివసా గతాః" అనుకొనుచుఁ గాల క్షేపము చేయుచున్నారు. శాస్త్రిగారి జననము 1892 లో. అనఁగా నీ రచన నాఁటికి వారి కేఁబది యేడవ యేఁడు సాఁగుచున్నది. ౧౯౨౬వ సంవత్సరము శాస్త్రిగారి జీవికలో నొక పెద్ద మార్పు తెచ్చినది. ముప్పది నాల్గేండ్ల వయస్సు దాఁటిన తరువాత నున్న శివరామశాస్త్రి గారు వేఱు. దానికిఁ గారణము క్రమముగా ముందుఁ దెలిసికొందము.

శివరామశాస్త్రిగారు కలిగిన కుటుంబములోని వారు. వీరి పూర్వు లెల్ల మంచి శిష్టులు. వీరి తండ్రిగారు వేంకటేశ్వరావధానులుగారు. తగిన గురువులతోఁ గావ్యనాటకాదులు పఠించి, సిద్ధాంత కౌముది నధ్యయనించి శ్రీ జయంతి భగీరథ శాస్త్రిగారి సన్నిధిని 'వ్యాకరణ మహాభాష్యము' పాఠము చేసికొనిరి. ఈ లోపుననే తర్క-వేదాంత గ్రంథములు కొన్ని సందర్భము ననుసరించి యాయా పండితులకడఁ జది విరి. శ్రీ భగీరథశాస్త్రిగారి గురుత్వమే శివరామ కవికిఁ బేర్కొ-నఁ దగినదైనది. భార్యతోఁ గాఁపుర ముండి 'యింజరము' లో భగీరథ పండితునికడ మహాభాష్యము చదువుకొనుట, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి గురుత్వమున సాహిత్యపుఁ బోలుపులు, శతావధానపు మెలఁకువలు తెలిసికొనుట, శివరామ శాస్త్రిగారి విద్యార్థి దశలలోని విశేషములు. పేరునకు విద్యార్థి యన్నమాట గాని, యప్పటి కప్పుడే శివరామశాస్త్రి మంచిపండితుఁడై, మంచి కవియై చాలగ్రంథములు

రచించెను, రచించుచుండెను. వేంకటశాస్త్రిగారి వెనుక సభలకు, సంస్థానములకు, శతావధానములకుఁ దిరుగుచు ముందునకు వచ్చెను. వచ్చి 'గుంటూరు కళాశాల' లోఁ బ్రతిజ్ఞజేసి 'నహిప్రతి' యన్నట్లు శతావధానము గావించెను. అప్పటికి శివరామకవి కిరువదియేండ్లు దరిలో నుండును. 1911 సంవత్సర ప్రాంతము. తిరుపతివేంకటకవులకు, కొప్పరపు సోదరకవులకు వాగ్యుద్ధములు జరుగుచున్న సమయ మది. తిరుపతి కవులకు శిష్యుఁడగుట శివరామకవి గురువిరోధుల నెదురుకొని యిట్లు సింహగర్జనము గావించెను-

మ. అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన త్వదీయాహంత నాఁపుం దలం
పున నీ నీరస నిర్గుణాశుకవనంబుం జెప్పి నిన్గెల్వ నెం
చిన యస్మద్గురువర్యులన్ సుకవితా శ్రీధుర్యులన్ మానిపిం
చి నినుఁ గెల్వఁగ వచ్చినా నిదె సభం జేయింతువో? వత్తువో?

గుంటూరు కళాశాలలో నేర్పాటు చేయఁబడిన యవధాన మప్పటి పరీక్షార్థమే. నిరాక్షేపముగ శతావధానము కొనసాఁగినది. సభాసదులు సెబాసనిరి. గురువులు తిరుపతికవులు శిష్యుని శివరామకవిని మెచ్చి యిటులు దీవన లిచ్చిరి-

మ. జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గాన్కలం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిం జేర్చి హె
చ్చఁగ మాయేలిన యీవధాన కవితాసామ్రాజ్య భారంబు మో
యఁగఁ బూనంగదవయ్య! తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై.

శా. బాల్యోద్రేకముమై నెదిర్చితివి కొప్రంపుంగవిన్ గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొయని నీకై కొంకు నస్మన్మన
శ్శల్యం బిప్పటి కూడఁదీసితివి వత్సా! సత్సభాశోభివై
కళ్యాణంబులఁ బొందుమయ్య! యిఁకవీశన్ శిష్యచూడామణీ!

దానితో వేలూరికవి తెలుఁగువారికి బహుధా ప్రశంసనీయుఁ డయ్యెను. క్రమముగఁ దెనాలి, బెజవాడ, కొవ్వూరు, చట్రాయి మున్నగు పలుతావుల నవధానములు గావించెను. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి ప్రధానశిష్యులలో నొకరుగఁ బ్రకటకీర్తి నందెను. 1915 లో వ్యాకరణము ముగించి యింజరమునుండి చిరివాడ చేరికొనెను. ఇంజర ములో నున్నప్పటి వీరిచరిత్రము వినఁదగినది కలదు.

సదాచారసంపన్నుఁడగు నొకబ్రాహ్మణ కుమారుఁడు పెండ్లి చేసికొను టకు డబ్బులేక తంటాలు పడుచుండెను. అప్పుడతనికిఁ దమయింటఁగల బంగారునగ నమ్మివైచి వివాహమునకు వలసినంతసొమ్ము నొసఁగెను. అట్టియుదార హృదయ మాయనది. శతావధానము నభ్యాసము చేయుట కింజరములో నూఱుగురు పృచ్ఛకులు దొరకుదురా? పెద్ద మామిడితోఁటలోనికిఁ బోయి, యొకమిత్రునిచేఁ బ్రశ్నము లన్నియుఁ గాగితపుముక్కలపై వ్రాయించి కొమ్మలకుఁ గట్టించి పద్యములు చెప్పు చుండు వారు. అట్టి ధారణాబల మాయనది.

చిరివాడ చేరికొని వ్యాకరణ గ్రంథములు పాఠము చెప్పుచుఁ బద్మపురాణము నాంధ్రీకరించు కొనుచు, నాంగ్లము పఠించుచు శాస్త్రి గారు రెండేండ్లు గడపిరి. ఆంగ్ల, పరాసు భాషాగ్రంథములు చదువఁ జదువ సాధారణమైన తెలుఁగు కవితపై మన శాస్త్రిగారి కొకవిధమగు నేవము కలిగినది. అపుడు యతిప్రాసములు విడిచిపెట్టి మహాభార తములో నాది సభాపర్వములు, షేక్స్పియరు ననుకరించి, పదినాట కములు ఋగ్వేద ఋక్కులు కొన్నియుఁ దెనుఁగులో వ్రాసి వెనుదిరిగి చూచుకొనిరి. ఆవిప్లవ మాయన యంతరాత్మకే నచ్చలేదు. అప్పుడ నిబంధనములు విడువక 'మణిమేఖల' యను నేడాశ్వాసముల ప్రబంధము రసభావ బంధురముగ రచించిరి. అందలి కవిత్వపు సొగసును గూర్చి, నాఁడు విన్న వారివలన వినుకలియేగాని యా గ్రంథ విష

డుత్పన్నమై పోయినది. 'మణిమేఖల' రచించు కాలముననే 'సాహిత్య దర్పణము' సగము, 'రసగంగాధరము' ౧ ఆననము, 'ధ్వన్యాలోకము' సంపూర్ణముగను దెనిగించియుండిరి. పై గ్రంథములెల్ల 'మణిమేఖల' తో పాటు పెట్టెలోఁ బెట్టుకొని యేలూరు శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రుల వారి స్మృతి సభకు వెళ్ళియుటనున్నపుడు, మకాములోఁ గల యాపెట్టె ధనాశచే రాత్రి దొంగలెత్తుకొని పోయిరఁట. అది మొదలు శివరామకవికిఁ గొంతరోఁత కలిగినది. ధైర్యముతోఁ గానీ యనుకొని పిదప వంగ వాఙ్మయము చదివెను. పరాసు గద్యవాఙ్మయము చూచెను. చదివి చూచి యప్పుడే యించుమించు నూఱుకథలు, ఆఱు చిన్ననాటకములు సంఘటించెను. సాంఖ్య, న్యాయ, వైశేషిక దర్శనములు చదివి భాష్యములతోఁ దెనిఁగించెను. యోగవాశిష్ఠము నిర్వాణప్రకరణము వఱకు ననువదించెను. వేదాంతమునకు సంబంధించిన వేవేవో చిన్న చిన్న పుస్తకములు వ్రాసెను. పద్మపురాణమునఁ గొన్ని ఖండము లవుడు వ్రాఁతలో నున్నవి. ఆసమయములో గ్రంథభాండారముతో నిండిన వీరి యింటిపై నలిగి యగ్ని మండిపడినది. సంస్కృతాంధ్రాంగ్లాది భాషలకు సంబంధించిన గ్రంథము లెన్నో వీరి భాండారమున నున్నవి. శివరామ శాస్త్రిగారు నిత్యమక్కడనే కూర్చుండి ప్రతిగ్రంథము చదువుచుఁ, జదివిన గ్రంథముపైఁ దమ యభిప్రాయము వ్రాసి యా గ్రంథములోనే పెట్టి యుంచువారఁట. ఆయా గ్రంథములు తాము రచించి, యచ్చు వేయింత మనుకొనుచున్న గ్రంథములు సమస్తము 1926 సంవత్సరములో నగ్ని కాహుతియై క్షయించినవి.

ఈ పద్యము చదువుఁడు :

క. క్షయ వత్సరమున నాతప
భయమగు వైశాఖ కృష్ణపక్షంబున నూ

రయ దినమునన్ ద్వితీయో
దయమునఁ జిరివాడ యెల్ల దగ్ధంబాయెన్.

శివరామకవి నెత్తురుఁజుక్కలైన తన గ్రంథము లట్లు భస్మమైనపు డిటులు వగచెను :

ఉ. పెంచితిఁ బెద్దచేసితిని ; ప్రీతియుతంబుగ రాణివాసముం
దుంచితి రాజయోగ్యకును మోపవనంబులు క్రుమ్మరిల్ల ని
ర్మించితి విస్మరించితిని మేదిని మింటిని నొక్కపెట్ట న
ర్పించితి నిన్ను నగ్గికిని బెన్‌బలిగాఁ గవితాసరస్వతీ !

ఉ. కాల్చితి విల్లు సర్వమును గాల్చితి పాత్రము లూఁచుముట్టుగాఁ
గాల్చితి వెల్లయున్ ధనము కాల్చితి వెల్లయు ధాన్యరాసులన్
గాల్చితి వున్న వెల్లయును గాల్చినఁ గాల్చితికాక గ్రంథముల్
కాల్చిననీకు నోజ్వాలన ! కడ్పుది నిండెనో ? కాలునిండెనో ?

సీ. ఋగ్వేదమా ! యష్టదిగ్వీథులను నన్నుఁ
గన నెంతయడలితో కాలు నపుడు
వేదాంతమా ! నన్ను వీక్షింప యోగదృ
ష్టి నెంతపూనితో మాఁడు నపుడు
వ్యాకృతీ ! యలయుజ్ఞగంతమా 'దృశి' నెంత
వణఁకితో నాకయి చరమవేళ
కవితాకుమారి ! నన్ గనుపొంచు నెన్నిము
ఖాలదుఃఖించితో క్రాఁగుతఱిని

గీ. కట్ట ! సాహితిరో నన్నుఁ గౌఁగిలింప
నెంత చేతులు చాఁచితో యేమనందు
నన్నుఁ గంకాళమును జేసి చన్నవారె
పుస్తకములార ! విజ్ఞానపుటములార !

అంతనుండి శివరామకవి యుత్సాహము సన్నగిల్లెను. అగ్నిప్రమాదమున కొకసంవత్సరము వెనుకనే యేకాంతవాసము కోరి మనశాస్త్రిగారు నూరవరమున నొకతోటకొని యందు దిల్లుగట్టి నాలుగేండ్లం దొంటరిగ నుండిరి. మొదటియింటిపై నగ్ని కోపించినతరువాత భార్యతోఁ దోఁట యందే కాఁపురము స్థిరపడెను. ఏకాంతవాసమున కీకవి యిటులు పలవరించును:

ఉ. ఏయొకరుండు లేని యొక యేటిసమీపతలంబునం దర
ణ్యాయతవంబునందును దటాకతటంబునయందుఁ దోఁటయం
దాయతశైలశృంగమునయందు జనించు మహావనీజమం
దూయెల యొందు నాసనము నొందును దప్పక నాకుఁగావలెన్.

శివరామ శాస్త్రిగారు వ్యుత్పత్తియుఁ బ్రతిభావమునుగల కవి. భావనలో వారికి దీటు వచ్చువారు నేఁటివారిలోఁ దక్కువగనున్నారు. "ఒక్కభాషగాదు తక్కినభాషల నన్నిగూడ నేర్వుమయ్య యాంధ్ర" యని ప్రబోధించి యన్యవాఙ్మయము లెన్నిఁటి తోడనో పరిచయము గలిగించుకొన్న కవివరుఁడాయన. రవీంద్రుఁడు వంగభాషలో రచించిన 'కథా' యను గ్రంథమును 'కథలు, గాథలు' అనుపేరు పెట్టి తెనిఁగించెను. శ్రీ శరచ్చంద్రుని నవల లెన్నో తెలుఁగులోనికి మార్చెను. పరాసు వాఙ్మయపుఁ బోకడలతోఁ గథలు వచనమున వందలు వ్రాసెను. అన్నిరచనలయందుఁ దెలుఁగు స్వతంత్రతను ముద్రించుకొనెను గాని, యనువాదము లనిపించునట్లు రచింపలేదు. తెలుఁగు పలుకు చదువని యాంధ్రుని కవిగారు సహింపక యీ విధముగ నిలువఁ దీయుచున్నారు.

క. తెలివికి సంస్కృతమున్ మఱి
కలిమికి నాంగ్లేయమో యిఁకం దురకంబో

విలువ యిడి నేర్చి యీ నీ
తెలుఁగెవ్వరి పాలు చేసి తిరిగెద వాంధ్రా!

శివరామ కవిగారు 'పురాణ మిత్యేవ నసాధు సర్వం, నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్' అను సిద్ధాంతము కలవారు. వేదఋక్కుల నుండి, యుపనిషత్తులనుండి వాక్యము లెత్తిచూపి, నేఁటి 'భావ కవిత్వ' మనఁబడు నుత్తమజాతి కవితతో వానికి సామరస్యము చూపుదురు. ప్రాచీనాలంకారికులు పేర్కొనిన భావధ్వని – రసధ్వని యను వానికి నేఁటి భావకవితకు సాజాత్యము సప్రమాణముగఁ జూపి, యట్టి కవిత యిప్పటి వారిలోఁ దక్కువమంది కలవడినదని వీ రందురు. ఆంధ్ర భాషలో నేఁడు పొడచూపుచున్న విప్లవము లన్నియు శివరామశాస్త్రి గారికిఁ గ్రొత్త లనిపించవు. వీరి మనస్సులో నాంధ్ర కవిత్వముపై నెన్నో తడవలు విప్లవభావములు పుట్టినవి. అవి కార్యరూపమును గూడఁదాల్చినవి. యతి ప్రాస బంధములతో కవిత్వము వ్రాయుటయే గాక, ప్రాచీన ధోరణితో అష్టాదశ వర్ణనములతోఁ బ్రబంధము వ్రాయుటయు నీయన మనస్సునకు నచ్చినది కాదు. "ముక్తాలత" కల్పిత కావ్యము 1910 లో రచించెను. "అందు వచ్చు పాత్రలు ముగ్గురు. శమజయంతు లిరువురు సహాధ్యాయులు, చెలికాండ్రు. వారిలో శముఁడను వానిని 'ముక్తాలత' యను వారకామిని కామించెను. అది యెఱిఁగి ముక్తాలతపై మనసుంచుకొని జయంతుఁడు శముని జంపెను. మన మెందుల కని ముక్తాలత మడిసెను. దానితో జయంతుఁడును ప్రాణములు విడిచెను." ఈ కల్పనము మన పూర్వ కావ్యసంప్రదాయమునకు విరుద్ధము. 'మాధవవర్మ' యను నాటక మొకటి వీరు విషాదాంతముగా రచించిరి. ఈ రకముగఁ బాశ్చాత్య సంప్రదాయములు మన తెనుఁగులో నెన్నితో జొనిపి 'శివరామశాస్త్రి కూడ విప్లవకారుఁ' డన్న పేరు గన్నారు. శాస్త్రిగారికి గల యీ సంస్కృతిభావములకు

గురువు లొకరు లేరు. ఆంగ్ల, వంగాది భాషా గ్రంథావలోకనమే యక్కడ ముఖ్యకారణము. అది యటుండె, ఈయనకుఁ జాలకళలలోఁ జిక్కని తెలుక యున్నది. సంగీత మెఱుఁగుదురని వ్రాసియుంటిని. అభినయ కళలోఁ బ్రవేశమున్నది. నాటకము లన్నను, చలన చిత్రము లన్నను మక్కువ చూపుదురు. 'జయాపిల్ముస్' వారి 'జరాసంధ'కు కథాసంవిధానము గావించినది వీరేగదా? ఇంక కథారచనములో జెప్పవలసినపుడు వీరు సిద్ధహస్తు లనవలయును. ధ్వని ప్రాయముగ నున్న వారి పలుకుఁబళ్ళు కథలలో సైతము కావ్యత్వమును స్ఫురింపఁ జేయుచుండును. సాధారణముగ వీరి కథలెల్ల సలక్షణ భాషలోనె వ్రచబడినవి. ప్రతి కథ యందును; సాహిత్య వాసన యుండును. భావ గంభీరత యుండును. కథా కల్పనము విషయమున నీయనను మించినవారు లేదు కొందఱున్నారుగాని, వచన రచనా విషయమున నీయనను దాటిన వారు నా దృష్టిలో మిక్కిలి తక్కువ. భాష సలక్షణ మగుటయు, భావము గంభీర మగుటయుఁ, బలుకుబడి వింతముగా నుండుటయు, ధ్వనికిఁ బ్రాధాన్య మిచ్చుటయు వీరి వచనములోని ప్రచురగుణములు. మచ్చున కొక కథలోని పంక్తులు పది తీసి చూపెదను.

"నా బయటికెర [illegible] త్తాని పోయినదికాని నామనస్సుపై దట్టముగా నడచినది. వెన్నెల, [illegible]లమేళ్లు, ఉద్యానములు, తీవలు, పూవులు, మల్లె [illegible] [illegible]యువ్వలు, ఋతువులు, హంసలు, నెమళ్లు, కోయిలలు, [illegible] జలయంత్రశాలలు, అంగరాగములు, శయ్యలు పుటము పెట్టి [illegible] మూసలో నామానసము తుకతుక ఉడికిపోయెను. అపూర్వమైన [illegible] [illegible]ళము నా ప్రత్యంగమును గుడిచెను. [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

చెను. నాలో నేనే దహించుకొని పోయితిని. నా కీ జగతి యంతయు నిస్సారముగాఁ దోఁచెను. ధర్మారెడ్డి చిత్తరువేని లేనియెడల నామేడ చవుటిదిబ్బగా నుండెడిది. ఒకరేయి యంతయు నేనాచిత్తరువు నెదుట నుంచుకొని కూరుచుంటిని. కొంతసేపు దానితో వినోదించితిని. క్రమ క్రమముగా నాకనులవెంట బాష్పములు స్రవించినవి. తెల్లవారు లటులే కూరుచుంటిని. అపుడు మయూరము లొకటొకటి లేచి స్తంభ మెక్కి కూయఁదొడఁగెను... నేను స్వప్నమున ధర్మారెడ్డి కొక ఉత్తరమును వ్రాసితిని. వ్రాఁతకుపకరణము కలముకాదు. వ్రాఁత కుపయోగించినది కాగితమును గాదు. ఇచ్చ నా మానసముమీఁద నన్ను కరఁగించి కరఁ గించి కరకకాయ సిరాచేసి అక్షరములుగా పోసినది. అపుడు ధర్మారెడ్డి నాలో ఒకభాగముగా నుండెను. గాన దానిని పఠించెను...'క్షమాపణ' కథ 'భారతి' ప్రభృతులగు పత్రికలలో వెలువరింపఁబడిన వీరి కథానికలు కుప్పనఁగూరలు. వానినెల్ల సంపుటీకరించి ప్రచురించుట తెలుఁగు బాసకుఁ గడు మేలు సేఁత.

వ్యావహారికముకూడ శాస్త్రిగారు తఱచు వ్రాయుచుందురు. శ్రీ శరచ్చంద్రుని చిన్నినవలలు వాడుకభాషలోనే వ్రాసినారు. ఏమి వ్రాయునిందు, ఏభాషలో వ్రాయనిందు, తీరుతెయ్యములు గల నిండుఁ దెలుఁగులో రసవిలసితముగ వ్రాసి పాఠక హృదయముల వలపించి లాగుదురు.

గాంధిమహాత్ముని 'ఆత్మకథ' రెండుసంపుటములలో వీరు తెనిఁగించి 'ఆంధ్రగ్రంథమాల' వారి కిచ్చిరి. ఆదరి వచనరచన వీరి [illegible] బువ్వు వంటి మెత్తఁదనముతో [illegible] శాస్త్రిగారి ప్రకటిత గ్రంథములలో 'అల్పాక్షర' [illegible]. శివరామకవికి [illegible] తమైన [illegible]యున్నది. [illegible]మైన భావనా [illegible]. పద్య గద్యరచనలలో పాట మైన [illegible] ఆంధ్ర వాఙ్మయ కవితా రహస్యములలో

నెక్కడలేని యొఱుకయు నున్నది. కాని, వానికన్నిటికి ననురూపమైనది కాదు వారి సాహిత్యసేవ. యౌవనము ధారవోసి వ్రాసినగ్రంథము లెన్నో మసియైపోవుటయు దొంగలెత్తుకొని పోవుటయు జరిగి శాస్త్రిగారి యుత్సాహ మూడనిచ్చాడను. ఇప్పటికిఁ బది పండ్రెండేండ్లనుండియు హృదయ దౌర్బల్యముపాడయి మఱింత దిగాలుగనున్నారు. అయినను, ఓపిక వచ్చినపుడెల్లఁ గథయో, కావ్యమో, వ్యాసమో వ్రాసి తెలుఁగు వారికి విందు లొనర్పుచునే యున్నారు.

శ్రీ శాస్త్రిగారి ఖండకావ్యసంపుటము 'ఏకావళి' లోని 'పదములు' అను శీర్షికలో నున్నపద్యములలో నొకపద్యము చిట్టచివర స్మరణకుఁ దెచ్చుకొని చాలించెదను.

సీ. వీణియపైఁ జేయి వేయుడు వాగ్దేవి
మాకైన సంగీతమహిమ వింపు
నలినాననుని నాల్గునగుమోము లెక్కడె
క్కడ నంచుమాకు స్వాగత మొసంగు
మానవర్యులు మనోమందిరంబుల యందు
నలరింత్రు మాకు సింహాసనంబు
కవిరాజు లమృతంబు కడగాలఁ బెట్టి మ
మ్మాదరింతురు సభావమేదురముగ
మేము లేకున్న రాగాలు మూఁగలెల్ల
మేము వచ్చిన ప్రకృతుల్ మిఁగలెల్ల
మేము లేకుంటె మాటలు మంటగలసె
మేము కలమన్న మాటలు మధువాని.

# తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

## 1892

వెలనాటిశాఖీయ బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. భారద్వాజ సగోత్రుఁడు. తల్లి: లక్ష్మిదేవమ్మ. తండ్రి: కృష్ణశాస్త్రి. జన్మస్థానము: గుంటూరు మండలములో మంగళగిరి క్షేత్ర సమీపమున నున్న కాజ గ్రామము. జననము: నందన సంవత్సర భాద్రపద బహుళ షష్ఠీ సోమ వాసరము. 12-9-1892.

కృతులు : ౧. కావ్యావళి. [రెండు భాగములు] ౨. హృదయేశ్వరి [ఉపకావ్యము] ౩. పద్మావతీ చరణ చారణ చక్రవర్తి [పద్య నాటిక ౧౯౩౬ ముద్రి] ౪. రాజజామాత. ౫. సహజయానపంక్తి. ౬. నౌణక భార్య ౭. వరపరీక్ష [ఈ నాలుగు గీతి నాటికలు] ౮. వకుళమాల [గీతికావ్యగతము] ౯. రత్నాకరము [గీతికాసంవాదము] ౧౦. ఆవేదన [ఖండకావ్యము] ౧౧. కవిప్రియ [పద్యనాటిక] ౧౨. యక్షరాత్రి [గీతినాటిక] ౧౩. సాధకుడు [వాకోవాక్యము] ౧౪. కవిరాజు [సర్గబంధము ౧౫. వ్యాకరణ దర్శన చరిత్ర [ఆంధ్రీకరణము ఈ రెండును రచనలో నున్నవి] ౧౬. మహారాష్ట్ర జీవనప్రభాతము. ౧౭. జీవనసంధ్య. ౧౮. మాధవీ కంకణము ౧౯. రమాసుందరి. ౨౦. కాంచనమాల. ౨౧. కుంకుమభరణి [అచ్చుపడిన నవలలు] ఇత్యాదులు.

'శ్రీకృష్ణలీలాతరంగిణి' రచించిన శివనారాయణతీర్థులు పూర్వాశ్రమములో తల్లావఝ్ఝలవంశీయు లని ప్రసిద్ధి. రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయఁడుగారు ఈవంశము వారికి నాలుగువందల యకరముల మాగాణి బహుమానమిచ్చినారు. అది యిపుడు విచ్ఛిన్నమైపోయిన దేమో, కాని నేఁటికిని కాజగ్రామములో "తల్లావఝ్ఝలవారి చెఱువు" అని యున్నది. పెక్కుతరములనుండి తల్లావఝ్ఝలవారు సంగీతసాహిత్యములలో మంచి నిపుణతఁ గాంచి వచ్చుచున్న [illegible]ము.

శ్రీశివశంకరశాస్త్రిగారి ప్రతిభ [illegible] సాహిత్యలోకములోఁ ప్రత్యక్షముగఁ గనుచున్నాము. ఆయన మంచి సంస్కృత పండితుఁడని

వాడుక. వాడుకయేగాని రెడ్డిగముపై చుకొని శిష్యులకు బోధప్రవచనము చేసినవాఁడు కాఁడు. ఆయన, అధమపక్షము 'మెట్రికుక్యులేషన్' పరీక్షలో నైన సముత్తీర్ణుఁడు కాకపోయియుండఁడని కొందఱ నమ్మకము. నమ్మకమే కాని, నిజమునకాయన యటులు కాలేదు. పరీక్షకుఁగూరుచుండి "జామిట్రి' ప్రశ్నపత్రము చూచుసరికి విసుక్తి గలిగి, కాగితములపై బొమ్మలుగీసి యిచ్చివైచెనఁట. ఆ యుచితజ్ఞుఁడు రేఖాగణితమునకు రేఖలతో సమాధాన మీయవలయు ననుకొన్నాఁడు కాఁబోలు! శివశంకరశాస్త్రి గారికి పాఁప్రాకృతములు, వంగము, మహారాష్ట్రము, హిందీ, మున్నగు వాఙ్మయములతోఁ జక్కని పరిజ్ఞానమున్నదఁట. గ్రీకు, లాటిన్, జర్మన్ సారస్వతములు సవిమర్శముగ జూచిరఁట. శాస్త్రిగారు మహాకవులని నేఁటి సాహిత్య ప్రపంచమున నొక ప్రతీతి. ఆలోచించినచో నచ్చుపడినంతలో నాయనవి మహాకావ్యములు లేవు, ఉపకావ్యములు, ఖండకావ్యములు, గీతినాటికలు, పద్యనాటికలు తప్ప తల్లావఝ్ఝలవారు మంచికథకులని ఒక ములోఁ బ్రతీతి. వంగమునుండి హిందీనుండి యనువాదములే హెచ్చు. "నీలకంఠం కథలు" మాత్రము చాలవ్యాప్తిలోనికి వచ్చినవి. శాస్త్రిగారికి పం:తములో నుత్సాహమున్నదిగాని, మధురముగాఁ బద్యము చదువగ నేను వినలేదు. ఆయనకు శిల్ప-చిత్రకళలలో నవతెని యభిమానమున్నది. వానిలోఁ బ్రత్యేకమైన పరిజ్ఞానముకూడ సంపాదించిరి.

[illegible] శ్రీ శివశంకరశాస్త్రిగారి జీవన గ్రంథమునకిఁ [illegible] మైన నా [illegible] శాస్త్రిగారు [illegible] సవ్యసాహిత్య ప్రపంచ[illegible] కవులుగా, [illegible]గా, [illegible]గా, [illegible]గా, [illegible] [illegible] శివశంకర శాస్త్రిగారి [illegible]. ఆయన [illegible] గ్రంథసముగా [illegible] [illegible] [illegible] [illegible]

సరిచేసికొనుటయొకటి-అనేక వాఙ్మయములలో నచ్చుపడిన గ్రంథము లెల్లఁ జూచి, ఆయా సారస్వత రహస్యము లర్థము చేసికొని సంభావణసమయములో సాహిత్య సముద్రుఁడువలెఁ దోఁపింపఁజేసి కొనుట రెండు-పద్యరచనలో, వచనరచనలోఁ బత్రికా సంపాదకతలోఁ గ్రొత్తదారు లేఱిచూపుట మూఁడు- శివశంకరశాస్త్రిగారు ఏవంవిధ గుణత్రివేణీ సంగమ తీర్థము. ఈ తీర్థములో నవగాహించిన తెలుఁగు యువకు లెందఱో!

శాస్త్రిగారు పండ్రెండవయేఁటనే కవితకు శ్రీకారము చుట్టుకొనిరి. నోరి హనుచ్ఛాస్త్రిగారికడ ఛందస్సుకూడ నేరిచిరఁట. ఛందస్సుకూడ నొక శాస్త్రముగాన, ఆ శాస్త్రీయవిషయము లేవో కొన్ని గురుముఖమున వినుటయేగాని పద్యములల్లుట నేర్చుకొనఁగా వచ్చునది కాదు. అభ్యాసాగత మైనది యుక్లేయుండును. మన శాస్త్రిగారికిఁ గవితాగురువు ప్రతిభయే. వీరి కననేల! సహజకవుల కందఱకుఁ బ్రతిభయే గురుత్వము చేయును.

'మెట్రిక్యులేషన్' వఱకుఁజదివి శాస్త్రిగారంతతోఁ బాఠశాలచదువు చాలించి, కంభంపాటి సీతారామ శాస్త్రిగారు, వేదాంతం శ్రీరామ శాస్త్రిగారల సన్నిధిని సంస్కృత సాహిత్య గ్రంథము లధ్యయనము చేసిరి. వేదాంతము లక్ష్మీపతి శాస్త్రిగారియొద్ద వ్యాకరణము, శ్రీ జగద్గురు కల్యాణానంద భారతీ స్వాములతో వేదాంతము పాఠము చేసిరి. కురుగంటి శ్రీరామశాస్త్రిగారి కడ న్యాయాయిక గ్రంథములు చదువుకొనిరి. ఆతరువాత దర్శనములలో స్వయంకృషి. వినఁబడినభాష, కనఁబడిన గ్రంథము చదువక విడువలేదు. వివిధ సారస్వతములలో సొగసులు కనుపట్టి తెలుఁగులోఁ జొప్పు నేరుపు వీరి కధికముగనున్నది. 'సాహితీసమితి'కి సర్వాధికారము వహించి యువకవుల నెందఱనో ప్రోత్సహించెను. 'నవ్యసాహిత్యపరిషత్' ప్రవర్తక కర్తృకారులలోఁ బెద్ద

భారము మోసినవారు శివశంకర శాస్త్రిగారు. సాహితి, సఖ, పత్రికలకు వీరు సంపాదకత సాగించి నవ్యసాహిత్య పత్రికలకు మెఱవడిగల రౌరవడి పెట్టినారు. 'ప్రతిభ' కు సంపాదకవర్గములోనివా రని జగ మెఱుఁగును. ఆఖ్యాయికావరంపర, సాహితీ సమితి వరంపర, సరస్వతీ గ్రంథ మండలి, విశ్వజనీన గ్రంథావళి, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలలకుఁ బడిన శాస్త్రిగారి సంకలనముద్ర లోకవిదితమైనది. అదిగాక, శివశంకర శాస్త్రిగారి కచ్ఛపనులలో నసాధారణమైన తెలివియున్నది. ముద్రణ సౌందర్యము కొఱవడిన గ్రంథమాయన ముట్టఁడు. ఆయన వ్రాతపుస్తకము ముద్రిత పుస్తకములవలె సంతరించుకొనును. అచ్చుతప్పులున్న గ్రంథము నాయన మెచ్చఁడు సరికదా, అది తెలుఁగువారి యసడ్డయని విసుగుకొనును. తానుసంపాదించిన పత్రికలకుఁ బంపిన వ్యాసములకు సొంతముగా మఱియొక ప్రతివ్రాసి మఱి యచ్చున కిచ్చుచుండు నలవాటీయనలోనున్నది. రమణీయార్థము నెంత యారాధించునో, గ్రంథ బహిస్సౌందర్యము నంతగా నారాధించుకవివరులు శివశంకర శాస్త్రిగారు

కవితతోపాటు శిల్పము- చిత్రకళ ఈరెండు వీనిని వలపించిన కళలు. ప్రత్యేకించి యాకళలలో రెండుమూఁడేండ్లు పరిశ్రమించిరి. ప్రాచ్య పాశ్చాత్య శిల్ప-చిత్రకళలతో వీరికిఁగల పరిచితి, ఖండాంతర వాసుల పరిచయమును జేకూర్చినది. కాని, శాస్త్రిగారిది చేసిన శిల్పము, గీసిన చిత్రము నెవరయు లేదనుట చిత్రము కాదు. అయిననేమి! ఆ దూరకళా విజ్ఞాన సంబంధి గ్రంథము లెన్ని వాఙ్మయములలో వారు చదివి యుండు రనుటలో నాశ్చర్యము లేదు.

వయస్సుతో పాటు శాస్త్రిగారి [illegible]లో మార్పులు చాల వచ్చుచున్నవిగాని, భాషావిషయకముగ మనసు మార్చుకొనని నవ్య సాహిత్యోద్యమకారుఁ డాయన. పద్యము గ్రాంథికభాషలోను, గద్యము [illegible] భాషలోను, గేయము మిశ్రభాషలోను వ్రాయుట వీరి

మతము. యతిప్రాసములు, శబ్దాలంకారములు విసరి పాఱవేయ వలయు నన్నయభిప్రాయము వీరికిలేదు. పద్యములనడుమ వచనము నిఱికించు టను శాస్త్రిగారు సహింపరు. అందులకే వీరివన్నియుఁ బద్యనాటికలు, గీతినాటికలును. కావ్యాత్మ రసమన్న వాద మనుసరింతురు. ఉపాసనలో శైవము, మతములో నద్వైతము వీరారాధింతురు. రాధాకృష్ణ భక్తి యనిన యాసక్తిమెండు. "పద్మావతీ చరణ చారణచక్రవర్తి" రచనము నీభక్తియే పురికొల్పియుండవచ్చును. శాస్త్రిగారికి బౌద్ధములో మంచి ప్రవేశ మున్నది.

1930-1931 లోను, 1932 లోను రాజకీయవిషయకముగ నంచరించి కారాగార ప్రవేశము చేసిరి. అక్కడ యువకుల నెందఱనో కవులుగ, నటకులుగ, కథకులుగ దిద్ది ప్రోత్సహించినారు. తెలుఁగులో నన్నయ - తిక్కన - శ్రీనాథులు వీరి ప్రేమకు స్థానమైన కవులు. భట్టుమూర్తి మీఁద, అంతకంటె వేయిరెట్టులు పోతనమీఁద వీరికి భక్తి హెచ్చు.

అభినవాంధ్రకవి నిర్మాణమునకు శాస్త్రిగారొక యంత్రమని చెప్పుకొందురు. నాలుగు గేయములు గొలుకు కవిదగ్గరనుండి, మేలిమి కావ్యములు సంతరించు కవిదాఁక బుజ్జగించి చేరదీసి యోపికతో వారి రచనములు సరిచేసి, అవసరమైనచోఁ దా నొకప్రతి వ్రాసి, ప్రచు రణమున కుపాయములు సూచించు సహృదయత శాస్త్రిగారిలో ఘనముగ నున్నది. కృష్ణా గుంటూరు మండలములలో వీరిమూలమునఁ బేరునకు వచ్చిన రచయితలు చిక్కుఱున్నారు. శాస్త్రిగారి సెవతోగాని 'చాకిరేవు' అని పరిహాసము చేసిరఁట. దీని యంతరార్థము, "ఎందఱో కవులు తమరచన వస్త్రము లిక్కడ ఉదుకుకొని పోవుదు" రని - నవ్య సాహిత్య పరివర్తచురణములపై వీరిచేయి పడనిది లేదన వలయును.

శివశంకరశాస్త్రిగారు వంగభాషలోనుండి శ్రీ శరత్ చంద్ర చట్టో పాధ్యాయుని రచనములు తెలుఁగులోనికిఁ దెచ్చిన వారిలో మొట్ట

మొదటివారయి యుందురు. ఇది సిద్ధాంతము కాక పోవచ్చును. సరస్వతీ గ్రంథమండలివారు వీరి "అరక్షణీయ" వెలువరించిరి. ఎందఱో తరువాతఁ దరువాత శరత్ చంద్రుని పూర్తిగాఁ దెలుఁగు వానిఁగఁ జేసికొన్నారు. అన్య సారస్వతములలోని యంద మెఱిఁగి యా రచనలు తెలుఁగులోఁ బెట్టవలెనని ప్రోత్సాహము చేసినవారిలో శాస్త్రిగారొకరనుటలో సంశయింపఁ బనిలేదు. హిందీనుండి, వంగము నుండి చాల రచనలు వీరనువదించినవి ప్రచురితములై యున్నవి. శాస్త్రిగారి వచనరచన బహు - సుందరముగనుండి సులభముగ నర్థ మగు తీరున జాలువారును. పద్యరచనా సౌందర్యము వీరి కలములో నంతగా వెలయలే దని కొందఱి యభిప్రాయము. కాని, యఖండమైన వేదన నుండి వీరి కవిత ప్రాదుర్భవించినది. "హృదయేశ్వరి" యిందు లకు నిదర్శనము. ప్రణయ కవిత కీ కృతి యాకరము.

మన్మనమ్మున లీనమై మాటు వడిన
విమల కవితా ప్రవాహము వెగ్గలించు
నిన్ను వర్ణింప నెంచిన నిమిషమందు
నీవు నాకు సరస్వతీదేవి వమ్మ!

ఇది వారి విశ్వాసము. ప్రేయసి యీయన దృష్టిలో మహాదేవి. ఆమె నొక పవిత్ర దృష్టిలో సంభావించుట వారి తలఁపు. రాధా కృష్ణుల ప్రేమ సౌభాగ్యము శివశంకర శాస్త్రిగారికి మేలు బంతి.

నిన్ను ధ్యానించు కొలఁది నిర్నిద్ర మగుచు
ప్రమదమునఁ జేరు మానస బంభరంబు
రాధికానాథు పాద నీరజ యుగమ్ము;
వింత గొల్పెడి నా ముక్తికాంతవమ్మ!

జీవిత సర్వస్వమయిన హృదయేశ్వరి శాస్త్రిగారి దృక్పథములో నెట్లు నిలిచి యున్నదో, యీ పద్యములు తారకాణించును.

"తలఁచుచున్నాను నా ప్రియతమ వటంచు
ఎంచుచున్నాను నిన్ హృదయేశ్వరి గను
వలచుచున్నాను జీవితేశ్వరిగ నిన్ను
భావనము సేయుచుంటి నిన్ దేవిరీతి.
నీవు ప్రాణాధికవు నాకు నిశ్చయముగ
వాంఛనీయ సుఖాధి దైవతము నీవు
సాటిగానని నా సరస్వతివి నీవు
వాస్తవమ్ముగ భాగ్య దేవతవు నాకు.
నిన్ను ప్రేమించుచున్నాను నిశ్చయముగ
నీ యెడఁ జెలంగు నా ప్రేమ నిర్మలంబు
నిండు హృదయంబుతో నన్ను నీకె మున్ను
అర్పణము చేసికొంటి సహార్షముగను."

బిల్హణుని కథ పద్యనాటికగా వీరు సంతరించిరి. దాని పేరు కవిప్రియ. బహుళముగాఁ బద్యనాటికారచనమే శాస్త్రిగారి కిష్టము. సంభాషణము సర్వము ఛందోబంధితమై యుండుటచేఁ గవిత్వ చారుత్వము కొంత కొఱవడియుండుట సహజము. వీరి 'కావ్యావళి' ప్రథమ భాగము ముద్రితమైనది. భానుమతి, లోపాముద్ర, శిష్యురాలు ఇత్యాది శీర్షికలతో వీ రేఱుకొన్న ప్రతి చరిత్రయుఁ బ్రాచీన సంస్కృతిని గుఱుతింపఁ జేయునవి. రచన ప్రాబంధిక ధోరణీ సనాథము. 'దివ్యలోచనాలు' అను ఖండకావ్యములోని యీ వృత్తములు చిత్తరంజకములు.

భగవద్రామానుజులు

వరహూకారణ జాయమాన కరుణాపాంగ ప్రసారంబునన్
భరితాజ్ఞాన దురంత సంతమసమున్ భంజించుచున్, విష్టప
స్థిర సంరక్షణ భార మూనిన మహాశ్రీరంగనాథా! భవ
చ్చరణాబ్జంబుల కే నొనర్చెద నమస్కారంబు భక్తప్రియా!

అవలోకింపుము వత్స ! అల్లవె రమాహ్లాదానుసంధాన నై
భవముల్, ధిక్కృతభానుమండల రుచుల్, బ్రహ్మాండసందీపక
చ్ఛవులున్, భక్తిభరప్రసన్నజనతా సంరక్షణ ప్రాభవో
త్సవముల్, రంగశయాన దివ్యకరుణా సంఫుల్ల నేత్రాబ్జముల్.

ధనుర్దాసు

అహాహా ! యెంతమనోహరంబులు త్వదీయప్రస్ఫుర న్నేత్రముల్,
మిహిరప్రస్ఫుట చండమండల సముద్యన్మహ ప్రభల్ కల్గియుం
దుహినాంశుద్యుతి శీతలమ్ములయి సంతోషంబొసంగెన్ ; భవ
న్మహిమంబొప్పు మహాద్భుతమ్ముగను శ్రీమద్రంగధామప్రభో !

అవలోకింపఁగనైతి నేఁటి వఱ కాహాదుర్విపాకంబునన్
భువనత్రాణన భూరి శీతల కృపా పూర్ణ ప్రభావ స్ఫుర
ద్భవదక్షిద్వితయంబు ! దేశికదయాప్రస్యంది వాక్సాంద్రధురిన్
నవసౌభాగ్యముకల్గె నక్కజముగా నా కో జగన్నాయకా !

స్థిరతాత్పర్యముతోడఁ గన్గొనినచో దేవా, భవన్నేత్రముల్
తెరుగన్నేర్చునె బుద్ధి యన్యనయనోద్రిక్త ప్రమోదంబునన్ !
పరమప్రీతిని భృంగ మానసవసుధాపానాభిలాషన్ దళ
త్సరసీజంబుల వ్రాలుఁగాని యితరాబ్జాజంబులం జేరునే !

# దుర్భాక రాజశేఖర కవి

# 1888

ములికినాఁటి శాఖీయ బ్రాహ్మణులు. తల్లి: సుబ్బమాంబ. తండ్రి: వేంకటరామయ్య. జన్మస్థానము: జమ్ములమడుగు. నివాసము: ప్రొద్దుటూరు. జననము: 18-10-1888 సర్వధారి సంవత్సర కార్తిక శుద్ధ పంచమి. కృతులు: ౧. వీరమతీ-చరిత్రము [3 ఆశ్వాసముల పద్యకావ్యము] ౨. చండనృపాలచరిత్ర [పద్యకావ్యము] ౩. సీతాకల్యాణము ౪. సీతాపహరణము ౫. పద్మావతీ విజయము [ఈ మూఁడును నాటకములు] ౬. విలయమాధుర్యము [స్వప్నకావ్యము] ౭. వృద్ధిమూల సంవాదము [నాటకము] ౮. అవధానసారము ౯. రాణాప్రతాపచరిత్ర [౫ ఆశ్వాసముల పద్యకావ్యము] ౧౦. The Heroines of Hindusthan [ఆర్యావర్త వీరనారీమణులు – ఆంగ్లభాషా వచనగ్రంథము]

శ్రీ దుర్భాక రాజశేఖరముగారు తొలుతఁ గవియై, తరువాత నవధానియై, పిమ్మట మహాకవియై రాయలసీమలోను యావదాంధ్రసీమలోను మంచి యశస్సు నార్జించుకొన్నారు. వీరికి దేశము కావ్యకళానిధి, కవిసింహ, అవధాని పంచానన, కవిసార్వభౌమ, మహాకవి చూడామణి, వీరకవితా వీర, అభినవతిక్కన, వీరప్రబంధపరమేశ్వర, చారిత్రక కవిబ్రహ్మ, సుకవిరాజరాజ, కవితాసరస్వతి, వీరగాథా విధాత, చారిత్రక కవితాచార్య, వీరరస రత్నాకర, మహాకవి మార్తాండ మున్నగు నెన్నో యుపాధు లొసఁగి వందించుచున్నది. ఇది దేశమునకున్న వెఱ్ఱి గాని, రాజశేఖర కవి కివియేవియు నవసరము లేదు. కవి, దానిని దాఁటఁ దలఁచినచో 'మహాకవి' యన్న బిరుదము చాలును. దీనిమొదటఁ జై పట్టిక సర్వము వంది వాఙ్మయములోనికిఁ జేరును. దేశము తన కర్తవ్య మింతమాత్రమేయనుకొని కొంతవఱకు నాచరణలోఁ బెట్టికొన్నదేగాని, ఎవని నుద్దేశించి లోక మిట్టి బిరుద సంతాన

ప్రదానము గావించెనో, ఆయుద్దిష్ట కవి దృష్టికి మాత్రము 'ఆత్మ న్యప్రత్యయం చేతః' అనునక్షరములు కొట్టికొట్టులంత లేసి కనఁబడు ననుట వాస్తవము. ఆ తీరున నారయనివాఁడు అంతర్ముఖుఁడు కానివాఁడు.

శ్రీ రాజశేఖరకవి నావిమర్శన పథములోఁ జెక్కు-చోట్ల మహాకవి. అక్కడక్కడ కవి. ఒకానొక కవి తనజీవితమునెల్ల నొకే గ్రంథములో దాఁచఁబెట్టును. ఒకఁడు దానినే చిన్నచిన్న పది గ్రంథములకుఁ బంచి యిచ్చును. అసలు, ఒకఁడు గ్రంథములో బ్రతుకే పోయలేక పోవును. సంపూర్ణజీవదాతృత్వము గలమహాకవి జీమూతవాహనుని వంటివాఁడు. అతని వితరణమునకు బ్రహ్మాండ సుందరి హారతి పట్టును. జీవనదాతలగు కవులు నలువురున్నఁ జాలును. దేశము సువర్ణము పండును. మన రాజశేఖరకవి జీవనప్రదాత. ఆయన సారస్వతజీవితము రెండుగా వింగడించి వ్రాయఁబడుచున్నది. ఇందు, పూర్వార్ధము జీవి. ఉత్తరార్ధము జీవుఁడు నని కోవిదులకు వేఱుగా వివరింప నక్కఱయుండదు.

వీరికిఁ బ్రాథమికవిద్య ప్రసాదించిన యూళ్ళు జమ్ములమడుగు-ప్రొద్దుటూరును. తరువాతఁ గడప హైస్కూలులోఁ జదివి 1907 సం॥లో 'మెట్రిక్యులేషను' పరీక్షయందు నెగ్గి యాంగ్లముమీఁది మక్కువ యింకను జదువు మని హెచ్చరింపఁగా, మదరాసు క్రిస్టియన్ కళాశాలలో ఎఫ్. ఏ. చదువుటకుఁ బ్రవేశించిరి. "నాయనా! నాకడుపునఁ బుట్టినబిడ్డఁడవు. సవతాలి పలుకులకు మరఁగితివా?" యని తెలుఁగుదల్లి యొకనాఁడు రాజశేఖరుని బుజ్జగించి చెప్పినది. ఆనాఁటినుండి యాంగ్లపుఁ జదువునకు స్వస్తి చెప్పి వెనుకకువచ్చి వైచెను. ఈలోపువ 1904-07 నడుమ కందాళ్ళ దాసాచార్యులుగారి సన్నిధిని సంస్కృతాంధ్ర సాహితీ గ్రంథములు పాఠముచేసి కవిత్వము కట్టుటలో దిట్టతనము సంపాదించిరి. కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారికడఁ గూడఁ గొన్ని దినములు చదివిరి. 1908 లో ఆంగ్లము చదువు విరమించి మదరాసునుండి వచ్చి

ఆ యేఁడే ప్రొద్దుటూరు 'జిల్లా మునసబు కోర్టు' లో నుద్యోగించుట కుపక్రమించిరి. అది పదుమూఁడేండ్లు సాఁగినది. అదియే స్వరాజ్య సముద్రమునకు మంచి పోటుసమయము. మోహనదాసు కరుణా చంద్రుఁడు పదారుకళలతో స్వరాజ్యపు వెన్నెల వెలుఁగుతో భారతా కాశమున వెలుంగుచున్న పార్వణసమయము. అట్టి స్వతంత్రపుఁబోటులో కోర్టు ఉద్యోగమునకు రాజీనామా నిచ్చిన దేశాభిమానులు రాజశేఖర కవిగారు. కోర్టు ఉద్యోగసమయమునఁ గూడ సాహిత్యోద్యోగము నేమఱలేదు. అపుడే యవధాన ప్రదర్శన వాంఛ యంకురించి తమకుఁ దోడుగ శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు కూడిరాఁగా, "రాజ శేఖర వేంకటశేష కవులు" అను జంటపేరు పెట్టుకొని 1920 నుండి 1927 దాఁక దత్తమండల భాగముల కాహ్వానింపఁబడి యనేకావధాన ములు గావించిరి. తరువాతఁ దరువాత నవధానయుగము మాఱి యాకవు లెవరికి వారు స్వతంత్రకావ్యవిరచనమునకు దొరకొనిరి. కలసి యుండఁగా వీరికి గౌరవించి యిచ్చిన బిరుదములు కవిసింహ, అవధాని పంచానన ఇత్యాదులు. పిమ్మట నీజంట చెలికారముతోనే వేఱయినది. అవధానసార మను గ్రంథము నాఁటి వీరి కలయికకు గుఱుతు.

రాజశేఖరకవి వాఙ్మయమును దేశమును సమానప్రపత్తితో సేవించెను. దేశసేవకై యుద్యోగమునకు నీళ్ళువదలిరి. ప్రొద్దుటూరు మ్యునిసిపలు సంఘ సభ్యులుగాఁ బెక్కువత్సరములు పనిచేసి 1928 లో ఉపాధ్యక్షులు (Vice chairman) గా నెన్నుకోఁబడిరి. అదిగాక 1927 మొదలు 1932 దాఁక ప్రొద్దుటూరు తాలూకాబోర్డు ఉపాధ్య క్షులుగాఁ గూడ నుండిరి. పదపడి, మదరాసు సెనేటు సభ్యత - వేద పాఠశాలాకార్యదర్శిత మున్నగు ప్రజాహితోద్యోగములు వీరికిఁదక్కినవి.

నేఁటికి వీరి వయసు షష్టిదాఁటినది. దేశ - భాషాభిరతుఁడైన యీ మహాకవిని త్రిలిఙ్గలోకము గుర్తించి యెన్నోసారులు సన్మా

నముతో బ్రహ్మరథము పట్టినది. ఇంతసేయుట కాయనలో వెల్లివిరిసిన కవితావేశము కారణము. ఈ కవిసింహము 'వీరమతీచరిత్ర' మను పద్యకావ్య మొండు రచించెను. అందలి పద్యసంఖ్య తొమ్మిదినూఱులు. 'చండనృపాలచరిత్ర' యేడువందల గ్రంథము. వీరచరితములపై, దేశగాథలపై వీరికి మమకారము హెచ్చు. 'ఆర్యావర్త వీరనారీమణులు' అను వీరి యాంగ్లభాషాకృతి బహుప్రశస్తమయినది. వీ రేఱుకొన్న యితివృత్తములు పెక్కు వీరగాథలే. ఈ కవి మొత్తముం గవిత్వరచనలో నుండునవి రెండు దృక్పథములు. ఒకటి వీరము, రెండు భక్తి. సీతాకల్యాణాదులగు పౌరాణికనాటికలు రెండవదృక్పథమునకు సూచకములు. కాఁగా, మిగిలిన కృతులెల్ల వీరగాథా గ్రథితములు. ఆ కృతు లన్నింటిలో 'ప్రతాపసింహచరిత్రము' కన్నాకు. రాజశేఖరునకు జీవము పోసిన దా మహాకావ్య మొక్కటే. దాని ప్రశంస యిఁక నవసరము.

## రాణాప్రతాపసింహచరిత్ర

పఠితల కేకావ్యముమీఁదఁ బెద్దయభిమానముండునో, ఆ కావ్యము మీఁదఁ దత్కర్తకుఁ గూడ నంత మమకార ముండియుండునని యూహింపవలయును. యథా లాభముగా వ్రాసివైచిన గ్రంథముపై పాఠకునకు నంత యపేక్ష యుండదు. "నా కావ్యము ప్రతిరసికమానసము నావర్జింపవలయు" నను పట్టుదలతోఁ గవి రచన సాగించుచో నారచన మట్లు చేసితీరును. ప్రకృతము రాజశేఖరకవి 'రాణా ప్రతాపసింహ చరిత్ర' విషయము.

ప్రపంచ విఖ్యాతుఁడైన అక్బరు పాదుషాతో నిరువదైదు వత్సరములు సంగరము చేసి భారతస్వాతంత్ర్య పతాక నెగురవైచిన విశ్వవీరచూడామణి మహారాణా ప్రతాపసింహుఁడు. అట్టి ధర్మవీరుని చరిత్రాంశములు

కొన్నేండ్లుగా నూహించి భావించి ధ్యానించి తన్మయులై రాజశేఖర కవిగారు కవితలోఁ జొనిపి యతని నజరామరుని గావించిరి. పద్యచరిత్ర గ్రంథములకు నీ ప్రతాపసింహ చరిత్ర యొరవడి దిద్దెననుట సత్యమునకు సమీపస్థమగు మాట. తెనుఁగులోఁ బురాణయుగము వెంటఁ బ్రబంధ యుగము, దానివెంటఁ గావ్యయుగము, అనువాదయుగము తలనూపి ముంచివైచినవి. ఈ నవీనశకమున నెన్నో మార్పులు వెలసినవి. నేఁడు పురాణముల మీఁదఁ గంటె, చరిత్రకృతులపై మక్కువ యెక్కువగ నున్నది. భారతదేశ స్వాతంత్ర్యమునకు బహుధా పోరాడుచున్న కాలమున "ప్రతాపసింహచరిత్ర" వంటి కృతులు వెలసి యుపకరించినవి. ఇట్టి చరిత్రకావ్యములకు రాజశేఖరకవిగారిది మార్గదర్శకస్థానము.

ప్రతాపుఁడు పవిత్రనాయకుఁడు. ప్రాచీనధర్మత్రాణపరాయణుఁడు. పసి పూరి రొట్టెలు తిని యడవులలోఁ దపము చేసి యిరువదైదేండ్లు పాదుపాతో సంగ్రామము చేసి కృతకృత్యుఁడైన భగీరథుఁడు. అక్బరు ప్రతిపక్ష నాయకుఁడు. "ప్రతిపక్ష గుణవర్ణనము – తజ్జయమువలన నాయకోత్కర్షము" అని యాలంకారికులు. ఈసమయము రాజశేఖర కవిగారు చక్కఁగా నీ గ్రంథమున సమన్వయపఱిచి వివరించినారు. గ్రంథము కడముట్టఁ జదువుదాఁక, ఈ కబ్బములోని నాయకుఁడు అక్బరో, ప్రతాపుఁడో పాఠకునకుఁ దెలియదు. ఏసందర్భమునను బ్రతి నాయకుని దీసికట్టుగా వర్ణింపని కవిగారి యుదారహృదయమునకు మహమ్మదీయులు కృతజ్ఞులై యుండవలయును. శ్రీ గాంధి మహాత్ముని మనస్తత్త్వమును లెస్సగా గుఱుతించుకొని దేశసేవలో నలగినవారగుటచేఁ గవిగారిటులు సంతరింపఁగలిగినారు. ఈ చరిత్ర కావ్యమునఁ బ్రతాపునితోఁ పాటు అక్బరు, మానసింహప్రభృతు లమృతులగు నాయకోత్తములు.

ప్రతాపుఁడు చరిత్రపురుషుఁడైనను మనకవిగారి చూపుచేఁ బురాణ

పురుషుఁడుగా, నవతారపురుషుఁడుగాఁ జిత్రింపఁబడి యున్నాఁడు. భారత జాతీయధర్మము పరాధీనము కారాదను పట్టుదలతో ధర్మసమరము గావించిన లోకజ్ఞుఁడు ప్రతాపుఁడు. అక్బరుబలఁగముముందు ప్రతాపుని పక్షము చాలఁ దక్కువ. అతఁడు పాదుషాతోఁ బ్రతిఘటించి యుద్ధము చేయుటకుఁ గొంత జంకినాఁడు. కాని, ఓర్చి ధర్మసమరమే సేయవలయు ననుకొన్నాఁడు. క్షురకర్మ పరిత్యజించి నిద్రాహారములువిడిచి యడవులలోఁ దపించు జాతికి స్వాతంత్ర్యభిక్ష పెట్టినాఁడు. ప్రతాపుని కాలమునాఁడు మన కువరముగానో బ్రతికియుండుము గాని, నేఁడు ప్రతాపుఁడు లేఁడు. అతనిచరిత్ర మెఱుపు మెఱుపులుగా భారత దేశాకాశమున మెఱయు చున్నది. ఆమెఱుపుల నన్నిటిని కేంద్రీకరించి నిలువుచేసి తెలుఁగునేలతో మూటగట్టి పెట్టినవారు రాజశేఖర కవిగారు. వారిమేలు మఱవరానిది. నాయకునితోఁ దాదాత్మ్యము నంది రచించిన కృతియిది - ఈ పద్యములు చదువుఁడు:

నే నెల్లప్పుడు భావనాబలమునన్ నీరూప నామక్రియా
ధ్యానంబుం గొని తన్మయత్వమున నన్యాకాంక్ష లేకుంటి; నీ
వే నేనైతినో, నేన నీవయితినో! యూహింపఁగ నాకేల? యా ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతాపా! విశ్వలోకార్చితా!

దినరాజుంబలె నుగ్రకోపనుఁడవై తీండ్రించి శైలంబు నిం
డిన తౌరుష్కులఁ దాఁకి నీ నడపు హల్దీఘాటు యుద్ధాంగణం
బున విశ్వోన్నతమైన నీదువిభవంబుం గొంత నేఁ బంచుకోఁ
గనకున్న న్నినుఁగూర్చి యింతయనురాగం బిట్టు లుప్పొంగునే

ఇలఁగల వీరపుంగవుల నిట్టి బలోన్నతుఁ డిట్టి ధీరుఁడుం
గలుగఁ డటంచుఁ జేర్కొనిన గండడ వీవిఁక; నిల్లువీడి వీ
థులఁ జరియింపలేని కడుదుర్బల దేహుఁడ, నన్ను నెట్టులన్
వలచితొ; నీచరిత్రమును వర్ణనసేసి జగానఁ జాటఁగన్.

భవదుదార శౌర్యమును భావన మొనర్చి
రసమునను జొక్కి గ్రంథంబు వ్రాయునపుడు
త్వద్వశుండనై యానందబాష్ప వితతు
లాణిముత్యాల వలె రాల్తు నహరహంబు.

ఈ నాలుగు పద్యముల గర్భమునఁ బ్రతాపచరిత్రము, రాజశేఖర కవియు దాఁగియున్నారు. తాదాత్మ్యములేని పద్యము లీకృతిలో లెక్కకున్నవి. అట్టివి చరిత్రగతి కొఱకును, దృష్టిదోష పరిహృతికొఱకును గలవా యనిపించును. "నిజముగా తాము ప్రతాపుఁడే యనుకొని యాయా ఘట్టములు చదివి వినిపించుచు నానందబాష్పములు రాల్చుచుందు" రని రాజశేఖరకవిగారినిగూర్చి కొందఱు చెప్పఁగా విందుము. ఈ కబ్బమునందలి పద్యములు మంచి వాటముగా నడచినవి. సీసముల మీఁద హెచ్చుపాలు ప్రీతి ప్రదర్శింపఁబడినది. సర్వవృత్తములు తీవ సాఁగినట్లు సాఁగుచున్నవి.

మ. ఉదయాస్తాచల మధ్యగంబగు జగం బుట్టూఁత లూఁగించె; బె
ట్టిదుఁడౌ పుత్త్రుఁడు; ఘోరసంగర కిరీటిప్రాయుఁడై కీర్తి సం
పద నార్జించెను దండ్రి; యెట్లితఁడు మేవాడ్రాజ్య మందారశా
ఖఁ దినం బొచ్చిన పుప్పియట్లు వాడమెన్ గీర్తిం గళంకించుచున్.

ప్రథమాశ్వాసము.

మ. అకటా! నీమొడ నెయ్యపుంబలిమి నే నల్లాడితిం గాక యే
టికి నాప్రార్థన మియ్యకొంతు, వెపుడున్ డెందంబునన్, దేశమా
తకు వాటిల్లు విపత్తుకై వగచి చింతంగ్రాఁగు నీ వగ్గి క్రిం
గక స్వాతంత్ర్యము దక్కుదాఁక నొకచోఁ గాల్నాని కూర్చుండువే?

ద్వితీయాశ్వాసము.

మృదువు దప్పని జాతీయములు వాడుటలో రాజశేఖరకవిది మంచి నేర్పు. అభిమన్యుపై చేయి — ఇది పెదవి దాఁటు పల్లని మొపుడో విడిచి

తేమిసేయుదు నాభాగ్యమిట్టులుండె — ఎడ్డినైనన్న వెనంగొట్టమునందుఁ గట్టుఁ దనుచందంబయ్యె — తల్లిఁ జంపువానికిఁ బినతల్లి చేతులు గణింపఁ జెవుల్లను చొప్పెఱుంగవే? — మొదలన్నెత్తురు పంచుకొం చనుజుఁడై పుట్టొండె — నీసుఖము సందె ప్రొద్దు పోడుచునె? — పిల్లికిన్ జ్వరమనం గాఁజెల్లె — కాడుగా మాటి పాండవబీడుదేలె — చెంతఁజింతామణిని వీడి చిల్లిగవ్వ కేగుబుజము చూపనెవ్వాని మొగము వాచె — వట్టి పెదసరి కట్టె యన్నించుకొనుటె — ఇత్యాదులెన్నో ప్రతాపసింహచరిత్రలోని కవితకు సొగసుమెఱుఁగులు తెచ్చుచున్నవి. ఈక్రిందిగీతము లెంత మెలఁకువగా నడిపిరో కనుఁడు :

చూలువండిన యాహమీడా లతాంగిఁ
జిచ్చుమెండ కెడారిలోఁ దెచ్చు పెల్లఁ
బూఁప పిండెల గ్రొమ్మావి మొక్క నకట!
తీవ్రదావాగ్నిలో నీడ్చి తెచ్చుటయ్యె.

ఎట్టి బ్రహ్మ ప్రయత్నంబు నేనిఁ జేసి
యుదయపురలక్ష్మికిఁ గిరీట మొంతుఁ దలను
గాక దైవోపహతుఁ డనై కడిమి చెడిన
రక్తతతిఁ గూర్తు రతనాల రావిరేక.

వీరి సీనపు నడక శ్రీనాథుని స్మరణకుఁ దెచ్చుచుండును.

సీ. తప్పగోళము మించు గాఢాంధతమసంబు
 గరదివ్వతో నార్పఁ గడఁగునట్లు
అత్యగాధము సాగరానంత జలముల
 కేతమ్ము వేయ నూహించునట్లు
వసుధ భోగ్గుగఁ గాల్చు ప్రళయాగ్ని హోత్రంబు
 గన్నీటిచే నార్ప నున్నయట్లు

క్షయకాలమున రేఁగు సప్తసమారుతధాటిఁ
దేటిరెక్కల నాఁపఁ దివురునట్లు
గీ. లని జగము నన్నుఁ బరిహాసమాడుఁగాక!
యొక్కఁటిని నిల్చి బలమెల్ల నెదురువెట్టి
విధికి మాఱొడ్డి స్వాతంత్ర్య విజయలక్ష్మి
యడుగులకు నిత్తుఁ గల్యాణహారతులను.

ఇఁట 'హారతి' వైకృతము. కల్యాణ శబ్దముతో దీనిని సమసింపఁ జేసిన కవిగారి నిరంకుశత మెచ్చఁదగినది. ఆమాత్రము స్వాతంత్ర్యము కవి తీసుకోవలయును. 'వలువిధాలంకరణములు' మున్నగు ప్రయోగములు కొన్ని 'ప్రతాప' లోఁ జూపట్టును. సువర్ణఖండములవంటి యీ దిగువ సీసములు పఠింపఁదగినవి. రాజశేఖరకవిలో నకృతకమైన భావనావేశ ముండుటచే నాయనశైలి యమృత వాహినివలె నడచును. మఱి యివి యెంతబాగుగానున్నవి!

సీ. తెగినహారమున ముత్తియములువోలె భా
రతరాజ్య మది పెక్కు వ్రక్కలగుచుఁ
జనచిన్న పాయలై చెడె; రాష్ట్రపతులలో
నొండొరులకు మైత్రి యొదవదెపుడు;
నిత్యలక్ష్మి శుభనిలయములై యుండ
వలయు రాజ్యములు శాశ్వత రణముల
ధనజన వస్తువాహన శూన్యమై పాడు
వడి శ్మశానములట్లు ప్రభఁబోలంగ
గీ. నిట్టి కుబ్జావతారంబు లెల్లఁబోయి
భరతఖండ సుఖండైక భాగ్య విభవ
నిలయమై యుండఁ జూడఁగా వలయునను చుఁ
గడుపులోఁ గొండయుంటావు గలదు నాకు.

సీ. ఒక్కొక్కరుఁడు సమస్తోర్వీతలము నిండ
నిరుపమామోదంబు నెఱపునట్టి
పూవు లసంఖ్యముల్ పూచె, రాజస్థాన
నందన దేవ మందార తరువు;
తడవాకింతయు లేని తౌరుష్క వాహినీ
చైత్ర యాత్రా ప్రభంజనము ధాటిఁ
గూఁకటి వ్రేళ్ళతోఁగూడఁ గంపించె నై;
ట్టా పూవు లన్నియు నవనిరాలె
గీ. నీ వనడి దొడ్డ పూవైన నిలుచుఁ బొలుచు
విశ్వ విశ్వంభరా మోద విజయలక్ష్మి
నలుదెసల నించునం చని తలఁచుచుండ
నగ్బ రన్నడి ఝంఝానిలం బలమె నేఁడు.

ఇట్టి ధారాధారుత్వము గల పద్యములకుఁ బ్రతాపచరిత్రము పుట్టినిల్లు. ఈకావ్యమును మించు కావ్యములుపుట్టుచున్నవి. ఇంతయావేశముగల కవిత బయలుదేరుట మాత్రము కష్టము. అభినవ చరిత్ర కావ్య నిర్మాతలలో నీయన మొదటివాఁ డనుటలో నాక్షేపణ ముండదు. నన్నయ - తిక్కన - పోతనాముల కవితా శైలులు నలవఱుచుకొని, క్రొత్తపోకడలు పెక్కు లాకళించుకొని, చక్కని యితివృత్త మెరుకొని, యుగమున కనుగుణుఁ డైన నాయకుని సంపాదించుకొని, తియ్యని చిక్కని తెనుఁగులో నిట్టి యుదాత్త చరిత్ర కావ్యము సంతరించి తెలుఁగు మాతకుఁ గానుక పెట్టిన శ్రీ రాజశేఖరకవి కృతార్థ జీవి.

రాజశేఖర శతావధానులు చాల గ్రంథములు రచింపనిండు; రచించి యుండనిండు; వానియెల్ల ధురంధు 'ప్రతాప చరిత్ర' ధ్రువ తారంబై నిలఁబడు కబ్బము. కవిగారు తమ యీ కావ్యము కామేశ్వరీ దేవి కంకిత మిచ్చుచు వ్రాసిన యీ రసఘుటికలు విలువ కట్టరానివి:

సీ. కలశపాథోరాశి గర్భమందు జనించు
నలల బంగారు టుయ్యాలలందు
నల చతుర్దశ లోకములను బావన మొనచుఁ
దనరు మణిద్వీప తటములందు
గొడుగులు వంచినట్లడరు కదంబ వృ
క్ష వితాన శీతల చ్ఛాయలందు
శ్రీలఁ జెన్నారెడి చింతామణీ భద్ర
సింహాసనము పార్శ్వ సీమలందు
పాల కడలి చలువఁ దేలు తెమ్మెరలందు
సీడు లేని పసిఁడి మేడలందు
గౌరి లోకజనని కామేశ్వర స్వామిఁ
గ్రిప్పి కూర్మి నాదరించుఁ గాక !

క. ఈ మహనీయ గ్రంథముఁ
గై మోడ్చుచు నంకితమ్ముగా నిచ్చెద నేఁ
బ్రేమఁ బొనుప నోఁచని నా
కామేశ్వరు నత్తి పెంచు కామేశ్వరికిన్.

# గడియారము వేంకట శేష శాస్త్రి

## 1897

ములికినాఁటిశాఖీయ బ్రాహ్మణుఁడు. మైత్రేయసగోత్రుఁడు. అపస్తంబ సూత్రుఁడు. తల్లి: నరసమాంబ. తండ్రి: రామయ్య. జన్మస్థానము: కడపజిల్లా జంబులమడుగుతాలూకాలోని 'నెమళ్ళదిన్నె'. నివాసము: ప్రొద్దుటూరు. జననము: 8-4-1897 సం.

కృతులు: ౧. శ్రీ శివభారతము [8 ఆశ్వాసముల శివాజీప్రబంధము. 1943 ముద్రి.] ౨. మురారి. ౩. పుష్పబాణవిలాసము. ౪. వాస్తుజంత్రి [ఈ మూఁడును ముద్రితములు కాలేదు.] ౫. మల్లికామారుతము. ౬. వాల్మీకి [అసమగ్రములు] ౭. శ్రీకృష్ణదేవరాయ చరిత్రము [ప్రస్తుతము రచనలో నున్నది.]

౧౯౪౩ సంవత్సరమునకుఁ బూర్వము 'గడియారము వేంకటశేష శాస్త్రి' యనిన పేరు తెలుఁగువారిలో నెఱిఁగినవా రెందఱో. నామట్టుకు నేను వారినిగూర్చి విన్నవాఁడను గాను. ఎన్నఁడో, ఆయన 'అవధానిపంచానన' యని బిరుదమిచ్చి పండితులు మెచ్చుకొనిరఁట. ఆపేరైనను రాయలసీమ దాఁటి రాలేదు. మాడభూషి వారు, దేవులపల్లి వారు, తిరుపతివేంకటకవులు అవధానపుగారడితో నూరూరఁ బేరు గాంచిరి. వారినిజూచి, అందులో విశేషించి తిరుపతికవులను జూచి కవితచెప్ప నేర్చినవాఁ డెల్ల నవధానము చేసినఁగాని ముక్తిలే దనుకొని, ఆ కళ నభ్యాసముఁ జేసెను. అప్పటి యా తెలుఁగులోకము గతానుగతికము. పలువురతోపాటు శేషశాస్త్రిగారును విద్యాధ్యయనమైన పిమ్మట, సహజకవితలోఁ బ్రవీణత నందినపిమ్మట శతావధాన వ్యాయామముచేసెను. మఱియొకకవితోడుతీసుకొనిగాని, యవధానములు సేయుట నాఁడు తక్కువ. అప్పటియాచారప్రకారము తనకన్నింట సరిసాటియగు శ్రీ దుర్భాక రాజశేఖరకవితో జతపడి యవధానములు చేయసాఁగెను.

1920—1930 సంవత్సరముల నడిమికాల మది. 1932 నుండి ప్రొద్దుటూరు మ్యునిసిపలుహైస్కూలులో శేషశాస్త్రిగారికిఁ బండితపదవి కుదురుపడినది. నాలుగయిదవధానములు చేసినంతమాత్రన, పాఠశాలలోఁ బండితులైన మాత్రన, అనుకరణధోరణిలో నేవో ప్రబంధములు రచించినంతమాత్రన శేషశాస్త్రిగారి ప్రతిభోన్నతి తెలుఁగు జగ మేమియెఱుఁగును ?

వసంతమునఁగాని రసాలమువైపు తుమ్మెదలు చూడవు. కోకిలము గొంతెత్తదు. "...వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాతి.—" పేరుప్రతిష్ఠలకు దేశకాలములు ప్రధానకారణము. ౧౯౪౩లో 'శ్రీ శివ భారతము' వెలువడినది. అదిచూచి, తెలుఁగుమహాకవులెల్ల తెల్లతెల్ల వోయిరి. 'ఇట్టి మహాకవి యీావఱకుఁ బుట్టలేదని కాదు,' ఇన్నాళ్ల దాఁక నీ కవితావసంతుఁ డెసందుగోనుండె" నని. క్రమముగా నేఁటికి శేషశాస్త్రిగారి నెఱుఁగని పండితుఁడు, తెలియని కవి, వినని తెనుఁగు రసికుఁడు కోటి కొకఁడుండునేమో ! ఆయన 'శివభారత' కవిత సాహిత్య సభలలో గానముచేయుచున్నారు. హరికథగాఁ బాడుకొనుచున్నారు. పురాణముగాఁ బారాయణము గావించుచున్నారు. విన్నంతలో, కన్నంతలో శేషశాస్త్రిగారి 'శివభారతము' విని శిరఃకంపముగావింపని కవి లేఁడు. నేఁడు శాస్త్రిగారి యీాడు అయిదవపడి పైఁబడినది. శివ భారత మించుమించు నాలుగు దశాబ్దుల భారతీతపస్సు. ఈకృతి శతాబ్దులు, సహస్రాబ్దులు తెలుఁగువారల కడుపులు నిండించు రాయలసీమ పంట. గ్రంథకర్త విజ్ఞప్తి యిటు లున్నది :

'......ఈగ్రంథరచనవఱకు పదియొక కవితాతపస్సు. మూఁడుపర్వముల ప్రాయముతో అరణ్య — అజ్ఞాతవాసముల సంస్కారముతోఁ బక్వమయిన భారతగాథ — అది. సోమయాజి కవిత్వమున ఉత్తరగోగ్రహణముతో విధిగా నీ శివభారతరచనయారంభమైనది. ఇంతయు ధర్మదేవతా

వరప్రసాదము. అప్పటి నాయితరకృతులు లోకమెన్నఁడో చదువవచ్చును, నాకవిత్వ మనుపేర నిప్పటికి శివభారతము చాలును......'

ఈ పలుకులు విలువ గట్టరానివి. శివభారత మంతయు నొకయెత్తు. ఈ యక్షరములన్నియు నొకయెత్తు. ఇది చిత్తస్ఫూర్తిగ వ్రాసినమాట, వారికృతి పూర్తిగఁ జదివి చూచి నామనస్సులో నే ననుకొంటిని " శేష శాస్త్రిగారూ! నన్నయ్యమూర్త్యంతరమగు సోమయాజులా మీరు? కవి త్రయభారతమువలె 'జగము లున్నంతవఱకెల్లజనులు చదివి తనియుటకు' శివాజీ ప్రబంధము రచించి శివభారత మని పేరుపెట్టుకొంటిరా? ఎంత గడుసుఁదనము! ఔను. తిక్కన భావనాశక్తి, తిక్కన పలుకుబడి సొంపు, తిక్కన కళావేతృత్వము, తిక్కన రాజకీయపరిజ్ఞానము మీ రొక్కరే తక్కించుకొంటిరి కాఁబోలు! కానిచో, మీగ్రంథాది విజ్ఞప్తిలో నటులు వ్రాసికొనుట కెన్నిగుండె లుండవలయును!" అని—

శేషశాస్త్రిగారు 'నాంది' లో నన్నయాదిప్రాక్తనాద్యతనాంధ్ర కవుల నభినుతించినపిమ్మటఁ బ్రత్యేకముగ సోమయాజి కీ చంపకము కాన్క నిచ్చెను.

హరిహరనాథ శాంత మధురాకృతిలోపలి చూపునన్, బురా
చరిత తపఃఫలం బుభయ సత్కవిమిశ్రిత పెల్ల, ధ్యాన త
త్పరుఁడయి భారతాగమము వల్కెడు తిక్కన వాక్కువెంటఁ ద
క్కరమునఁ దాండవించు వరదాయిని లేఖిని, నే భజించెదన్.

తిక్కశర్మ పలుకుబడి యొరవడిగ, ఒక్కొకయెడ నూతనభావములు మెఱవడిగ, "ఉభయమార్గసమన్వయధోరణి గుణధ్యేయముగ", "భారతామ్నాయము దీటుగ" శివభారతము రచించి మాతృపితృ పూజానుమ స్రజంబుఁ జేసి కృతకృత్యులైరి. శివభారతము మహాకావ్యము. ఇందలి యెనిమిది యాశ్వాసములందును మొత్తము ౨౧౦౦ పద్యము లించు మించుగ నున్నవి. దీనికి ఉపోద్ఘాతము వ్రాసిన శ్రీ రాళ్లపల్లి అనంత

కృష్ణశర్మగారి హృదయ మిట్లున్నది: "......ఆధునికాంధ్ర సాహిత్య మందు నాకుఁగల యల్పానుభవములో మహాకావ్య మనుపేరున కింత తగిన గ్రంథమును నేఁజూడలేదు......ఈ భారతము భావ గొప్ప వర్చస్సుతో ప్రసన్నమధురముగా ప్రవహించుచున్నది. పలుచోట్ల 'తెలుఁగు కింత లగువు బిగువు కలదా' యని యాశ్చర్యపడునట్లు చేయు నుడికారము లిందుఁ గలవు..."

శ్రీ శాస్త్రిగారికి వశమైన కవితాకళ యెట్టిదో, యీ పద్యము స్పష్టపఱుచును.

చ. పరహిత, మాత్మనిర్వృతి, యపారయశోధన గౌరవాది వి
స్ఫురణము లందఁజేసి యిహామున్ బరమున్వెలయించి, మాధవున్
థరఁ జరితార్థుఁ జేయు కవితాకళ నావశమౌటఁ బంచమ
స్వరమున నాలపించెద వసంత వనాంతర సాలశాఖలన్.

'శ్రీ శివభారతము' వసంతకోకిల పంచమస్వరాలాపము. దాని మాధుర్యము నూరక పేరుకొనుట వ్యర్థాలాపము. అయినను, నాహృదయము విప్పక మానలేను.

'శివభారతము' మొదటినుండి తుదిదాఁక నొకే తీరుఁదీయముగల కవితతో సాఁగినది. గ్రంథమంతయు రసఘుటిక. విశేషించి, లుకజీ—జీజియాల సంభాషణము, దక్కనులో బహమనీ రాజ్యములు — పరిపాలన పరిస్థితి, శివాజీ పునహాలో రాజ్యాంగ శిక్షణము, దాదోజీ చరమదశ—శివాజీకృతజ్ఞత, రామదాసుదర్శనము — ధర్మోపదేశము, సయీబాయి సలహా-భవానీప్రార్థనము, శివాజి పాదుషా కుత్తరముప్రాయుట, షాజీ విడుదల, బాజీప్రభు మరణము, శివాజీ సానుభూతి, షాజీ మరణము, శివాజీవిచారము, శివాజీ పాదుషా కొల్వున కేఁగుట, తానాజీ ప్రతిజ్ఞ—సింహగడము లగ్గపట్టుట, సూర్యాజీ సింహగడము గెల్చుట, తానాజీ నిర్యాణము, శివాజీ సంతాపము, పట్టాభిషేక పూర్వరంగము, శివాజీ

భవాని కోవెల కేఁగి చేసిన విన్నపము - ఇవి బహు రసవద్ఘట్టములు, జాతీయసూక్తులు వాడుటలోఁ, జిక్కనిపలుకు లేటికొని పొదుగుటలో, వైపు వాటము లెఱిఁగి పద్యములు నడపుటలో, నడుమనడుమఁ బానక ములో మిరియపుఁ బలుకులవలె సంస్కృతపదములు సంధానించుటలో, నాఁటి, నేఁటి రాజ్యాంగవిధానముల సమన్వయ పఱచుటలో, ఔచితి పాటించుటలో శివభారతకవికిఁ గల జగజ్జాణతనము మన తెనుఁగునేలలో నీనాఁడు పలుచగ నున్నది. ఉభయ స్కంధముల బలిమితో సారస్వత సాగరము లోఁతులు ముట్టి రసామృతకలశమును జేపట్టిన మహాకవులలో శేషశాస్త్రిగారు నొక మహాకవి యని, శివభారతము జెండా నెగుర వైచినది, కొన్ని మచ్చులు.

లుకజీ తన్నుఁ జంపవచ్చినపుడు కూఁతురు జీజియా యనుచున్న మాటలు :

ఉ. కవ్వన హుంకరించి యడికించెద, వాయుధ మెత్తనుంటి వీ
వెవ్వరిపైన ? నీయెడఁద కింత వివేకము చాలదయ్యెనే ?
గువ్వలుఁగూడఁ గాన్పులను గూరిమిఁ బెంచు జగంబునందు నీ
వెవ్వఁడవయ్య ? యాదరణ కక్కెఱ యల్లుఁడు నాఁడుబిడ్డయున్.

చ. కనికర మింతలేని కొటికాఁడవు నన్నిటు పెంచనేల ? పు
ట్టినయపుడే గళ మ్మొటమటించినఁ బోవదె ? వెంటనంటి యి
య్యనువున వేఁటలాడ మనసయ్యె నె ? కన్ననిసుంగుఁద్రుంగు వ
ర్తన మది సర్పజాతికిఁ గదా ! రొయికమానవుఁ డిట్లు సేయునే ?

సీ. అనురాగ నిలయ నాజనని మహల్సాదేవి
కడుపులోఁ గార్చిచ్చుఁ గనలఁజేసి
కన్నీటిబుగ్గ బుగ్గలజాఱఁ గుమిలిపో
వెదు నన్న ' యజ్లోజి ' యెడఁదఁ ద్రుంచి

తల్లిదండ్రుల ప్రోపుఁ దలఁగని సాంభాజి
భావి జీవితనాశ భంగపఱచి
కమియుమాఁగినపండు గర్భపిండ మగల్చి
కటకుఁ గాఁకలదాలిఁ గ్రాఁగఁజేసి
ఇంత ప్రళయంబుఁ గలిగింప నేలనయ్య
కనికరము లేదొ, పాపసంకటము రాదొ,
కన్నతండ్రివికాదొ, యక్కసముపోదొ,
వలదు వలదయ్య వచ్చని యిలు రగుల్చ.

ప్రథమాశ్వాసము.

జీజియాబాయి చంటిబిడ్డ శివాజి కుగ్గుఁబాలతో, జోలపాటలతో, వీరచరితములు నూఱిపోసినది. దాదోజీ గురుత్వమున శివాజి చక్కఁగఁ జదువను వ్రాయను నేర్చి, అంకగణితము నెఱిఁగి రాజ్యాంగవిధానముల మెలఁకువలు తెలిసికొనెను. మాతృోపదేశము కరఁడుగట్టిన శివాజికి మతముమీఁద - దేశముమీఁద నున్నంత యభిమానము, పట్టుదల శాస్త్రములమీఁద నుండకపోవుట వింతగాదు -

మ. కలఁతం జెందెదు నాత్మదేశమతముల్ గాపాడ, శస్త్రాస్త్ర వి
ద్యలుఁ జాణక్య తపంబులున్ జదువు విద్వాంసుల్, మహారాష్ట్ర వీ
రులు వేదాంగము లెత్తి యర్థముల మార్పుం దీర్పు చర్చించు తా
తల తాటాకుల మీఁది గంటముల వ్రాఁతల్ గోఁతలున్ మెత్తురే!

ఈ నాలుగు పంక్తుల పద్యములోను గవిగారికి దేశస్వాతంత్ర్య కాంక్ష యెంత యున్నదో వెల్లడియగుచున్నది. వేదములు, వేదాంగములు, కళలు అన్నియు నొకమెట్టు - ఆత్మదేశ సంరక్షణ మొకమెట్టు. శేష శాస్త్రిగారీ ఘట్టమున శివాజీయయి వ్రాసియుండిరి.

పునహాలో శివాజీకి దాదోజి రాజ్యాంగపద్ధతులు శిక్షించినాఁడు. ఆ శిక్షణక్రమ మిటులున్నది:

సీ. ప్రత్యూష పవనముల్ పారాడఁ జలువ లూ
రిన వాలుకా వితర్దికలయందు
ఫలితోపవనవాటికల శీతలచ్ఛాయ
లలమిన హారిత శాద్వలములందుఁ
బరువంపు వెన్నెలల్ వాఱి చుక్కలుదేలు
పఱపైన మేడ యుప్పరిగలందుఁ
బొగఁజోపి చిఱువత్తు లెగఁద్రోసి చమురు దీ
పాలిడ్డ వీధి సోఫాలయందు

శిష్యగణముతో శివరాజుఁ జేర్చికొనుచు
భారతాదుల భావసంపదలఁ దెలిపి
ఘనుఁడు దాదోజి తనవిమర్శనము లిచ్చి
నవ్య సాహిత్య బోధసంతతుల నడిపె.

సీ. ఆవులించిన మాత్రఁ బ్రేవు లెంచఁగ నేర్చి
నీటిలో జాడలు నెమక నేర్చి
పాలు నీరును వేఱుపఱుచు నాణెము నేర్చి
కనుపాపనీడలఁ గాంచ నేర్చి
బాలెంత బెబ్బులి పాలు పిండఁగ నేర్చి
దశము లంటక తేనెఁ ద్రావనేర్చి
యెండసోఁకుల దప్పి వెడలింపఁగా నేర్చి
శిలలకు గిలిగింత గొలుపనేర్చి

పొత్తమునఁగాక ప్రకృతిలోఁ బుటలు విప్పి
పదములనుగాక భావముల్ పట్టి తరిచి,
యన్వయ వ్యతిరేక దృష్టాంత గతుల
నరసి, భావుక పండితుం డయ్యె శివుఁడు.

ఈ పద్యములలో 'నవ్యసాహిత్య యోధసంతతుల నడిపె' "భావుక పండితుండయ్యె శివుఁడు" అనుటలో. నెంతో యంతరర్థ మున్నది. కవిగారి సాహిత్యదృష్టి కీ పద్యములు రెండును గన్నులు.

సప్తమాశ్వాసమున : — — శివాజీపాదుషా కొలువునకు వెళ్ళినపుడు, వారియమర్యాదనసహింపక —

"పాదుషా యొక్కఁ డొకమాట పల్కుకున్నఁ
గొదువ మాకేమి? తనకేమిగొప్ప కలదు?
నమ్మికొలువున్న వారి మనంబులందు
మేలుకోనఁగాక యిర్వుర మేలు కీడు."

అనెను. పాదుషా కోపించి యెవరతఁ డనును. అప్పుడు రామసింగు పాదుషాతో నిట్లు చెప్పును: అక్కడి పద్య మిది:

మ. అమృతప్రాయ దరీఝరీ విపిన సహ్యా స్వైర సంచార ధీ
ర మహారాష్ట్ర మృగేంద్రుఁ డీయవన సమ్రాడంచితాస్థాన దు
ర్దమ సమ్మర్ద నిదాఘ దాహాలులిత ప్రత్యగ్ర ఘూమాయితాం
గములన్ గర్జిల సాఁగె, శీతల కటాక్షం బిందు సారింపుఁడీ!

వీరరస స్ఫోరకమగు నిట్టి దీర్ఘ సమాసములు పొదులవలె నక్కడక్కడఁ బొదిగించిరి. తక్కినపట్టుల నెక్కడఁ జూచినను జాను తెనుఁగు నొడి కారమే గౌరవస్థానమున నున్నది.

తానాజీ సింహగడము మీఁదికి యుద్ధయాత్రకట్టుట, కోటఁ బ్రాఁకి లోనికి వెళ్లుట, అక్కడ వెనుదీయక ఘోరముగాఁబోరుట మొదలగు ఘట్టములు చూచినచోఁ దిక్కనసోమయాజి స్మరణమునకు రాక మానఁడు. 'శివభారతము' పేరుసార్థకముగ నెన్నోఘట్టము లుదాహరింప వచ్చును. తానాజీ నిర్యాణానంతరము తమ్ముఁడు సూర్యాజీ పోరు సలుపును. ఆ ఘట్టము మఱియు రమణీయతరము. తానాజీ మరణము

విని శివాజీ పలవించిన ప్రకరణము చదివికొని కటికవాఁడు కంటనీరు పెట్టుకొనును. భారతములో, నభిమన్యువధ విన్నయర్జునుఁడుసైత మట్టు లేడువలేకపోయినాఁడేమో !

సీ. పరతంత్రతాభుగ్న భారతోద్ధరణోద్య
మమున నా నాయకత్వము వరించి
మొనలేని నీసర్వధన జనబల జీవి
తముల సర్వార్పణ ధారవోసి
రణరంగముల సంగరతుకతన్ బొంచి
కనుఱెప్పవోలె నన్ననుసరించి
దుస్సాధతర వైరి దుర్గ ఛేదన వజ్ర
పాతమై బహుళాహవముల గెలిచి
యనుచరుండవు — చమూనాథుఁ — డంగరక్ష
కుఁడవు — బహిఃప్రాణ మనఁగ నన్ గొలుచు నిన్నుఁ
గోలుపోయినయపుడ నేఁ గోలుపోని
దొకటి యున్నదే? తానజీ! యొంటినైతి.

గీ. శివపతి యొవండు? తానజీస్నిగ్ధహృదయ
బలముఁ ద్రావి, పెన్పొందిన భద్రమూర్తి,
నిజము; తానజీ! యీనాఁడు నీవులేని
శివపతి యొవండో! యెంతలో పవలు — రేయి.

* *

శా. తానా! నీవిఁకఁ బల్కు, వీహృదయ బాధల్ తీయు తీరేది? నీ
దీనానాథ కుటుంబ శోకదహనార్తిన్ బాపు ప్రాపేది? నా
సైనం బైకొను శత్రుసంహతులఁ గూల్పం డెంపు పెంపేది? యు
న్నా! నీయొక్కనిలేమి యుల్లడలఁ డాసైనె యొంత గుండించెడిన్.

శా. నా కీవంత — కొలంత వో; దయిన దానా! నీవుధన్యుండ; వ
ట్ఠ్రాంకల్ లోకువ లన్నియున్ దులిపి వీరస్వర్గముం గొంటి; వే
రైకస్థాన ముదాత్తవీర పురుషత్యాగార్హ భోగాంకమై
నీ కావ్యాసము వెట్టె, నేల్కొనుము తండ్రీ! వీరభోగ్యంబుగన్.

'సప్తమాశ్వాసము'

అష్టమాశ్వాసములో శివాజీరాజు పట్టాభిషేకము, గాంగభట్టు ధర్మనిర్వచనము మున్నగు ఘట్టములు కవిగారి శ్రుతిస్మృతిపురాణ నివిష్ట బుద్ధిని ప్రస్ఫుటీకరించుచున్నవి. ఎట్టి శుష్కవిషయమునైనను కళ కట్టించి కవితలో లలిత మనోహరముగాఁ బెట్టఁగల నేర్పు తీర్పు వేంకటశేషశాస్త్రిగారి కలివేలముగ నున్నది. నిజమునకు, శివాజీ చరిత్రములో వచ్చు వ్యక్తులలోఁ గవితకెక్కుఁదగ్గ కళాశక్తి లేదు. వారెల్ల మనకవి వసంతుని చేతిలోఁబడి పుష్పించి పరిమళించిరి.

పట్టాభిషిక్తుఁడగు శివరాజు భవాని కోవెలకేఁగి యిట్లు ప్రార్థించినాఁడు —

చ. చిఱునగవ్వూరు మోవి, వికసించిన చెక్కులు, సోఁగకన్నులం
గురియు దయామృతం, బలిక కుంకుమరేఖయుఁ జంద్రమఃకళా
పరిగత మౌళియున్ నయన పర్వముగా మది గోచరించి నా
యురగలిఁ బాపు నీయభయహస్తమునీడ భజింతు శాంకరీ!

ఈ శివాజీ ప్రబంధమునకు 'భారతము' అని పేరిడుటలో నొక విశేషమున్నది. ఇందుఁ దఱచుగ భారతములోని యుపమలే యూయఁ బడినవి. అవియెల్ల నిట నేఱిచూపను. తత్తదుదాహరణములకు గ్రంథము పఠింతురుగాక!

శ్రీ వేంకటశేషశాస్త్రిగారి జీవిత ప్రబంధములో 'శివభారతము' కీర్తనీయమైన స్వర్ణ ఖండము. దానిని తొలుతఁ బేర్కొనిగాని, వారి చరిత్రవిశేషములు ముచ్చటించిన సొగసు లేదు.

శాస్త్రిగారు 1897 లో జన్మించిరని తెలిసికొంటిమి. ఈగ్రంథరచన నాటికి వారికి, ఏఁబది మూఁడేండ్ల వయస్సు. శాస్త్రిగారు పదుమూఁడేండ్లు వచ్చినతరువాత 'సమళ్ళదిన్నె' నుండి ప్రొద్దుటూరు వచ్చి యచ్చట రూపావతారము శేషశాస్త్రులుగారి సన్నిధికిఁ జేరి కావ్య నాటకాలంకారసాహిత్యము, తర్క-వ్యాకరణశాస్త్ర నైపుణ్యము సంపాదించిరి. పిమ్మట షడ్దర్శనము వాసుదేవావధానులుగారిని సేవించి యజుస్సంహితామూలము, యజురారణ్యకోపనిషత్తులతో సప్రయోగ స్మార్తమంత్రపాఠము అధ్యయనించిరి. జాతక — ముహూర్త — వాస్తు ప్రకరణములు చదువుకొనిరి. సంస్కృత పాండితిలో గురుకులక్లేశము పడి గడిదేఱినతరువాత, ఆంధ్రకావ్యములు చూచి, మహాభారతము పారాయణము చేసి, ఛందశ్శాస్త్రము నేర్చి, తొలిజన్మము [illegible] వలచి వెంట వచ్చిన కవితాసుందరిని గిలిగింతలు పెట్టి చేరఁదీసికొన్నారు శాస్త్రిగారు.

1912 — 13 సంవత్సరప్రాంతములో శ్రీ దుర్భాక రాజశేఖర కవితో మన ప్రకృతకవికి నేస్తము తటస్థపడినది. "రాజశేఖర వెంకట శేషకవులు" అను జంట యేర్పడి కవితావ్యాసంగమున కుపక్రమించినారు. తపస్సున కొకఁడే యుండవలెను. అధ్యయనమున కిరువు రున్నఁ గాని సరిపడదు. 1915 లో బృందావనమున శరన్నవరాత్రమహోత్సవ సందర్భమున జరిగిన కవిత్వపుఁబోటీలోఁ దొలి బహుమానము మన కవ కవులు సంపాదించిరి. ఈకవులజంట విడనప్పుడు 'వీరమతీచరిత్రము' అను పద్యకావ్యము, సీతాపహరణము, కీచకవధ అను నాటకములు రచియించి యుండిరి. 1920 మొదలు 1926 దాఁక జతవిడక 'రాజశేఖర వెంకటశేషకవులు' అష్టశతావధానములు పలుచోట్లఁ గావించిరి. [illegible] [illegible] కవులకు వారికి సువర్ణకంకణములు [illegible]. [illegible] వారిలో 'అవధాన[illegible]' [illegible] బిరుద మిచ్చి[illegible]. [illegible] 'కవి[illegible]

బిరుద మొసఁగిరి. వేయి బిరుదము లిచ్చి నాలుగువేల సన్మానములు చేయనిండు. వేంకటశేషశాస్త్రిగారికిఁగల 'శివభారతకవి' యన్న బిరుదముతో నవిసరిరావు. రాజశేఖరకవిగారికున్న 'ప్రతాపసింహచరిత్ర కవి' యను బిరుదముతో నవి సరిరావు.

శేషశాస్త్రిగారు జన్మభూమిలోనుండి పోతనవలె హాలికవృత్తిఁ జేసికొనుచు, వీలుపడినపుడు పురములకుఁబోయి యవధానములు ప్రదర్శించుచు భారవి, మల్లికామారుతము, పుష్పబాణవిలాసము తెలుఁగు పఱిచిరి. 'హరికథలు' రచించి తమ అన్నగారు వేంకటసుబ్బాశాస్త్రులుగారిచే నాపరిసరమున నచట నచటఁ గాలక్షేపములు చేయించిరని వినుకలి.

1930 లో నెమ్మళ్ళదిన్నె విడిచి ప్రొద్దుటూరు చేరుకొని 'కన్యకాపరమేశ్వరీ సంస్కృతపాఠశాల'లో నధ్యాపకత నిర్వహించుచు, 'బ్రహ్మనందినీ' పత్రికకుఁ బ్రచ్ఛన్న సంపాదకత సాగించుచుఁ గాలము గడపిరి. 1932 లో, ప్రొద్దుటూరు 'మ్యునిసిపల్ హైస్కూలు'న ఆంధ్రోపాధ్యాయులుగాఁ బ్రవేశించి నేఁటికిని ఆపదవియందే యుండిరి.

వాస్తుజంత్రి, ఔర్మిళాలక్ష్మణము, అనర్ఘరాఘవాంధ్రీకరణము మున్నగు రచనలు రచించిరని తెలియవచ్చెను. కొన్ని యసమగ్రములు, కొన్ని యప్రకటితములు, కొన్ని యుత్పన్నములును ఈనాఁటికి సంపూర్ణముగ రచితమై చక్కఁగఁ బ్రచురితమైన గ్రంథ మొక శివభారతము మాత్రము. గడియారము వేంకట శేషశాస్త్రిగారి కీర్తి తెలుఁగునఁ గలకాలము నిలుపుట కీకృతి చాలును. ఇటీవల వారు రచించుచున్న 'శ్రీకృష్ణదేవరాయ చరిత్ర' పూర్తియై వెలువడినచో నది తెలుఁగు బాసకుఁ దొడవుపై తొడవు.

---

# విక్రమదేవవర్మ

## 1869

శ్రీ జయపుర సంస్థాన ప్రభువు. క్షత్రియుడు. కాత్యాయనసూత్రుడు. భారద్వాజసగోత్రుడు. తల్లి: రేఖాదేవి. తండ్రి: శ్రీకృష్ణచంద్రదేవ మహారాజు. జననము: 1869 జూన్ 28 వ తేది, [శుక్ల సంవత్సర జ్యేష్ఠ బహుళ తృతీయాగత చతుర్థీ భానువాసరము. గ్రంథములు: ౧. శ్రీనివాసకల్యాణము [నాటకము] ౨. మానవతీచరిత్ర ౩. సతీగీత ౪. శృంగారగీత ప్రాకృతము ౫. శ్రీ మహారాజ విక్రమదేవవర్మ రచనలు [1940 ముద్రితము] ౬. కృష్ణార్జున చరిత్ర టీక [మంత్రిప్రెగడ సూర్యప్రకాశ కవి రచించిన ద్వ్యర్థి కావ్యమునకు వ్యాఖ్యానము] ౭. రాధామాధవనాటకము [ఉత్కళము] ఇత్యాదులు.

ఆంధ్రరాజులలో 'కృష్ణదేవరాయలు' అద్వితీయుఁడుగాఁ బరిగణింపఁ బడినాఁడు. శౌర్యసంపదను మించిన యుత్సాహము, భాషాభిమానమును మించిన కవిత్వశక్తి, విద్వత్పోషణమును మించిన కళాదరము నతనియం దుండి తెలుఁగుమన్నీల కతని దొరతనపుఁ దెన్ను మేలుబంతియైనది. 'ఆముక్తమాల్యద' నీమహారాజశిరోమణి రచించినటులుగాఁ బరిశోధక మహాశయులు నిర్ధారించియున్నారు. ఈ వాస్తవవిషయమును మఱుఁగు పఱుచుటకు, ఆంధ్రకవితాపితామహుఁడు నాస్థానకవియునగు 'పెద్దన' [illegible] రచింపఁజేసి తనపేర వ్రాయించెనని విపరీతవిమర్శనములు బయలు [illegible] దీసిరి. వ్యాకరణవ్యసనశీలురు సమరలంపటులు నగు మహారాజులకు [illegible] కావ్యరచన యెక్కడ? అదిగాక, ప్రౌఢార్థబంధురమగు విష్ణుచిత్తీయము వంటి కావ్యము నొక పండితకవి రచించెనని చెప్పవలయును గాని, [illegible] ప్రభువు వ్రాసెననుట సమంజసము కాదని [illegible] వాదము. సత్యమేవ జయతు!

దేశీయసంస్థానములలో 'జయపురము' నకు మంచి పేరు కలదు. నేఁటి జయపురాధిపతులు శ్రీ విక్రమదేవవర్మగారు. ఈమహారాజున సాహిత్య

సభలలోఁ దఱచు చూచి యుందుము. ముదిమిచేఁ దటస్థించిన చిన్న యొదుగుగల మధుర కంఠస్వరముతో నీ మహారాజు తెలుఁగుభాషలో నభిభాషించునపుడు తెలియనివా రేమనుకొందురు? లక్షల కొలఁది రాఁబడి వచ్చు సంస్థానమునకుఁ బ్రభువు లని యూహింపఁగలరా? కాలు క్రిందఁ బెట్టనక్కఱలేని రాజ్యాధిపతి యని తలంపఁగలరా? ఏమను కొందురు? — చక్కఁగా నుపన్యసింపఁగల యెవరో వృద్ధవిద్వత్కవి యని మాత్రము తెలిసికొనఁ గలుగుదురు.

శ్రీ విక్రమదేవ వర్మగారు ఆంధ్రముననే కాదు, ఆంగ్లముననుమృదువుగా నుపన్యసింపఁ గలుగుదురు. ఉత్కళభాషలో వీరికి మంచి ప్రవేశ మున్నదని చెప్పుట ఆ భాషలో "రాధామాధవ నాటకము" సంఘటించినారని తెలియుచున్నది. సంస్కృతవాఙ్మయములో వీరికి ధారాళమైన సాహిత్య మున్నది. ఆభాషలో రచించిన వీరి శ్లోకములు చక్కని ధోరణిలో సాగినవి.

శ్లో. సంసృత్య పారజలధేః స్తరణైక పోతౌ
పాపాంధకార పటలీ దివసాధినాథౌ
భక్తాళినిత్య సుఖకైరవ షండసోమౌ
చైతన్య దేవచరణౌ శరణం ప్రపద్యే.

శ్లో. సంసార పాశబద్ధానాం ప్రాణినా మతిదుఃఖినాం
ముకుందనామ వర్ణాళి స్మరణం ముక్తిసాధనమ్.

వీరు సంగీతకళలోఁ గూడఁ బరిచితిగలవారు. జ్యోతిషము తెలియును. నాట్యము నెఱుఁగుదురు. ఇట్టి విజ్ఞతలు వారిలో నున్నవనుటకు రచనలు నిదర్శనములు. కావ్యరచనయందును, కథా గ్రథనమునందును వీరికి మంచిచాతుర్యము కలదు. పెక్కు గ్రంథములు వ్రాయలేదు కాని వ్రాసినవి నిర్దుష్టములై యుండును. వీరి కవితాశయ్యలో శుచిత్వము హెచ్చు. రుచి కొంచెము తక్కువ. వీరి మానవతీచరిత్రము, శ్రీనివాస

కల్యాణము పరికింపవలయును. 'రాజధర్మము'నుగూర్చి వీరి పద్యములు చూడుఁడు.

గీ. రాజు నిజదేశమునకును బ్రజలకు దొర
ననుచుఁ దలఁపక తన్ను శ్రీహరిజనులకు
సేవ చేయుట కొఱకే సృజించె నంచు
నెంచి విఱ్ఱవీఁగక సంచరించు టొప్పు.

గీ. ప్రజలు శ్రమపడి యార్జించి భక్తిఁ దనకు
నిచ్చినధనంబు వారికై వెచ్చపెట్ట
కాత్మభోగాళి కొఱకును ఖ్యాతికొఱకు
వమ్ముసేయుట తగునె నృపాలకులకు.

ఆ॥ వె॥ తనదు ప్రజలు వెతలఁ గనుచుండ వారిని
తలఁప కన్యదేశములకు నేగి
సామి యలరఁ దగునె? జనుల రంజింపని
వాని నృపుఁ డనంగఁ బాడి యగునె?

గీ. ప్రజల సుఖదుఃఖములు ధరావరుఁడు దనవి
గాఁ దలంచుచు నీతిమార్గమునఁ జనుచు
సజ్జనుల గౌరవించుచు స్వశ్రయము వదలక
పరమపురుషుని భక్తిచేఁ బరఁగవలయు.

ఈ రాజధర్మములగీటు దాటకుండఁ బ్రజాపాలనము చేసిన విక్రమదేవవర్మ యభినందనీయుఁడుగదా! ౧౯౩౦ సం॥లో "శ్రీమహారాజ విక్రమదేవవర్మ రచనలు" తలిసెట్టి రామారావుగారు ప్రచురించిరి. అందనేక గద్య పద్యము లున్నవి. "నేటి తెలుఁగు" అను శీర్షికతో శ్రీ విక్రమదేవవర్మగారు వెలువరించిన రచన నిచటఁ బ్రచురించెదను. ఈ వ్యాసములో నాధునికాంధ్రభాషను గూర్చి శ్రీవారి యభిప్రాయము

" సజీవ నిర్జీవ యుక్తంబగు జగంబు నియమయుతంబయి విలసిల్లు చుండుటవలన నియమ మత్యావశ్యక మనుట యతిశయోక్తి గాదు. అట్లగుటవలన విజ్ఞులు నియమమును విడనాడుట యసమంజసము. ప్రవర్తన నియమమును స్మృతి విధించునట్లు భాషానియమమును వ్యాకరణము శాసించెడిని. కనుక వ్యాకరణవిరుద్ధ పదములతోడ వెలయు కైత గర్హితమ యగును. నాణెములగు బాసలందు మిన్న యని యెన్నంబడు తెలుఁగుబాసకు సమగ్రమగు వ్యాకరణము నేఁటికిని లేకుండుట మిక్కిలి శోచనీయము. వ్యాకరణ మసమగ్ర మను నెపము చేత నున్న నియమములను మీఱుట యుక్తము గాదు...... 'వాఁడు' యొక్కయు 'అవి' యొక్కయు ద్వితీయావిభక్తిరూపము 'వానిని'. కనుక విభేదము కొఱకు 'అవి' యొక్క ద్వితీయావిభక్తిని "వాటిని" అని వ్యవహరించుట యుక్తము. "అయితే" — "కూఁతురును" మొదలగు కొన్ని రూపములు గ్రామ్యములని నాయాశయము. భాషాభిమానముగల పండితులొకచోటఁ గూడి గ్రహింపఁ దగిన రూపములను నిర్ణయింప వలెను. మఱి యవియే వాడఁ బడవలెను. అట్లు కానిచోఁ దెలుఁగు బాస కోదుబాస కంటె నీచతర మగును."

భాషావాద విషయములో విక్రమదేవవర్మగారిది మంచి పట్టుదల. గ్రామ్యవాదమును సహింపనేరరు. అదియటుండ, ఏగుధాతువు — అమరసింహుఁడు, ధారుణీహావము, నన్నయభట్టుయుగము మొదలగు రచనలవలన వీరి విమర్శన నైశిత్యము వెల్లడియగును. కథారచనలోఁగూడ వీరికిఁ జాతురి యున్నది. వయసువుఁ జెలికాఁడు — ముసలిమగఁడు అనునవి 'ఆంధ్ర' పత్రికలోఁ బ్రకటింపఁ బడినవి. మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి "సీతారామచరిత్ర" మను ద్వ్యర్థికావ్యము రచింపగా, దానికి వ్యాఖ్య వీరు రచించిరి. దానివలన వీరి పాండితీ విశేషము స్పష్టపడుచున్నది. ఆంధ్రసరస్వతిని వీరనేక రీతులఁ బోషించుచున్నారు.

'ఆంధ్ర విశ్వవిద్యాలయము' సాలునకు నూఱువేలు వీరి వలనఁ బడయుచున్నది. దానికి వీరు ప్రధానాధ్యక్షులు. విశ్వవిద్యాలయముమీఁది యభిమానముచేఁగాఁబోలు, ఈపండిత ప్రభువు 'విశాఖపట్టణము'లోఁ దఱచు మకాముచేయుచు 'హవామహాలు' విశాలమైన వరండాలో దర్శింపవచ్చిన విద్వాంసులను, కవులను, అర్థులను దత్తదుచితరీతి నాదరించి గౌరవించుచు నిరంతరము గ్రంథపఠనమునందో, గ్రంథ రచనమునందో నిమగ్నుఁడై యుండును. వీరు 8-6-1931. వ తేదీని జయపుర సామ్రాజ్య సింహాసనమునకు వచ్చిరి. రాజ్యమునకు వచ్చిన పూర్వము, పరముకూడ వీరి స్వభావము గర్వరహితమైనదే.

ఈయన "సాహిత్యసామ్రాట్టు" గాఁ బేరు మోసి యెందఱో తెలుఁగు కవుల వలన మధురకృతులు పొందిరి. రసజ్ఞుఁడు, విద్వాంసుఁడు, మహారాజు నగు నీ విక్రమదేవవర్మకు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'మేఘదూతము' కావ్యము సంకిత మొసఁగినారు. ఒసఁగుచు వారు వ్రాసిన పద్యమిది:—

ప్రజలు తెగడొంద యుద్ధ మంపటుఁడుగాని
కృష్ణరాయఁడు, తెలుఁగున మృదుల కవన
మును బూనర్పఁగ నేర్చిన భోజరాజు
తలఁప విక్రమదేవ విద్వత్ప్రభుండు.

కొండ వేంకటరత్నముగారు 'సింహాచలయాత్ర' విక్రమదేవ వర్మగారి కంకితము చేసిరి. విఖ్యాత విద్వాంసులగు బులుసు పాపయ్య శాస్త్రిగారు తాము రచించిన 'అలంకారసంగ్రహము' న నీ సాహిత్య సామ్రాట్టును లక్ష్యముగా నిడి [illegible]సినారు. ఆ కృతి మాఱుపేరు "విక్రమదేవవర్మ మహారాజీయము." ఇది ప్రతాపరుద్రీయ, చమత్కార చంద్రికా, సరసభూపాలీయాదులవలెఁ జిరస్థాయిగా నుండి యీ మహారాజుపేరు నిల్పెడిని. [illegible] కల్లూరి [illegible] శ్రీపురాణ వేంకటాచార్య

ప్రసాదరాయ కవి 'మొయిలురాయబారము' విక్రమదేవవర్మ కంకితము గావించెను. కృతికర్తయు, కృతిభర్తయు నగుట మంచియదృష్టము. అది పట్టిన మహారాజు విక్రమదేవవర్మ. సంస్కృతాంధ్రములు, ఆంగ్లము కాక 'హిందీ' కూడ వీరికి సుపరిచితమైన భాష. తులసీదాసుని వర్షఋతు వర్ణనము, శరదృతువర్ణనము పద్యరూపముగా వీ రనువదించిరి. బహుభాషాప్రవేశము గలవారే యసలు తక్కువ; మహారాజులలో మఱియుఁ దక్కువ.

శ్రీ విక్రమ దేవవర్మగారు పూరించిన యీసమస్యలు కొన్ని మీ ముందుపెట్టెదను. ఆయన యెట్టియాలోచన కలవారో నిర్ణయించు కొనుఁడు.

సమస్య :— కొడుకును దా వలచి యొక్కకూఁతుం గనియెన్.

క. పుడమికి మేనక యనియెడు
పడతుక దివినుండి వచ్చి పావనముగ కా
అడవిని నృపుఁడగు కుశికుని
కొడుకును దా వలచి యొక్కకూఁతుం గనియెన్.

సమస్య :— అంధుఁడు భాస్కరునిఁజూచి యానందించెన్.

క. అంధత్వహారుండగు రవి
బంధురకృప గ్రుడ్డితనము వాయఁగఁ గవితా
సింధువు మయూరుఁ డనెడు పు
రాంధుఁడు భాస్కరునిఁ జూచి యానందించెన్.

సమస్య :— తల్లీ! దండం బటంచు దారకు మ్రొక్కెన్.

క. ముల్లోకంబుల మేలున
కల్ల మహిష దనుజుఁ జంపు మను తఱియందే
యెల్ల సురలతో భర్గుఁడు
తల్లీ! దండం బటంచు దారకు మ్రొక్కెన్.

ప్రౌఢార్థప్రదీపితములు, భావభూషితములు నగు నీ జయపురాధీశ్వరుని పద్యరచనలు పరికించినచో "కృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయకృతికర్తకాఁ"డను దుర్వాదము సడలిపోవును. ఆ కవిరాజు వ్రాసికొన్న 'కవి జన్మకుండలి' యిం దుదహరించుట యొందుకేని మంచిది.

గీ. అజము లగ్న మచ్చోటనే యమరగురుఁడు
యుగ్మమున రవి బుధ శుక్రు లొప్పుచుండఁ
గర్కి రాహువు కుజుఁడు సింగంబునందు
వృశ్చికంబున శని కర్మ గృహమునందుఁ
జంద్ర కేతువు లుండంగఁ జంద్రనంద
శైల శశి శాలివాహన శకసమఁ దగు
మిధున మాసేషు శశిదిన మిళిత శుక్ల
పక్ష శుక్ర మూసా పరపక్షమందుఁ
జవితి నినవారమున ధనిష్ఠా ద్వితీయ
పాదమున విక్రమేశ్వరవర్మ వొడముఁ
గుజదశా శేషమగు నాలుగు సమ లైదు
నెలలు నిరువది యేడు నాళులు గణింప ॥

[శాలివాహనశకము ౧౭౭౧ శుక్ల సం॥ జ్యేష్ఠ బ ౪ ఆదిత్య]

# మంత్రిప్రెగడ భుజంగరావు.

## 1876-1940

ఆఱువేల నియోగి శాఖీయ బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు, హారితస గోత్రుఁడు. లక్కవరము జమీందారు. దత్తత గొన్న తల్లిదండ్రులు: విజయలక్ష్మమ్మ, మల్లికార్జున ప్రసాదరావు. కన్నతల్లి: వెంకమాంబ. కన్నతండ్రి: మల్లయామాత్యుఁడు. జన్మస్థానము: ఏలూరు. జననము: 1876, ధాతృసంవత్సర చైత్ర బహుళ పంచమీ గురువారము. నిర్యాణము: 1940 సం॥ గ్రంథములు: దిలీపచరిత్రము, స్తవరాజము, హరిశ్చంద్రనాటకము, మైరావణుఁడు, మోహలేఖావళి, మార్కుసువార్త, మార్కండేయేశ్వరచరిత్రము, పాండవాజ్ఞాతవాసము, పరమ పురుషాన్వేషణము, పదార్థ విజ్ఞాన శాస్త్రము, నిరపవాద ప్రహసనము, చిత్ర హరిశ్చంద్ర నాటకము, చారుమతీపరిణయము, ఉత్తరరామ చరితము, ఆధునిక కవిజీవితములు, కలియుగ నటనామృతము, విజయాంక సాహసము, అభిజ్ఞాన శాకుంతలము, వచననైషధము, వాసంతిక, వ్యవసాయ, మార్కండేయశతకము, రాజహంస, మధుప విహారము, తత్త్వమీమాంస, ఆంధ్ర కథా సరిత్సాగరము, గోఖలేచరిత్ర, లూకా సువార్త, దీనరక్షామణి శతకము, అగ్గిరాముని మరణావేదనము–ఇత్యాదినాటకములు, నవలలు, విమర్శనగ్రంథములు, వివిధవిషయక గ్రంథములు వీరివి శతాధికముగా నచ్చుపడినవి.

శ్రీ భుజంగరావుగారిని జమీందారులు గాను, కవులుగాను మన మెఱుఁగుదుము. వారు సామాన్య రచయితలుగాక శతాధిక గ్రంథ రచయితలు, దర్శనాచార్యులు, వితరణ చతురులు కూడను. వీరికి సంస్కృతాంధ్రములలోఁ దగిన సాహిత్యమున్నదని కృతులు ప్రకటించుచున్నవి. ఆంగ్లమునందును బ్రజ్ఞ గొప్పది. గ్రంథరచన మందే కాక 'మంజువాణి' పత్త్రికా ప్రచరణముచేఁ దమ ప్రతిభ వితతముగా వెలువరించుకొనిరి. అంతలోఁ దృప్తిపడక విలాసార్థ మవధానములు చేసినారు. వీరు చేసిన యష్టావధానమునకు సభాపతులైన కొక్కొండ

మహామహోపాధ్యాయుఁడు బంగారు వృత్తములో నిట్లు భుజంగరాయ కవి నుగ్గడించెను.

వాకట్టుఁ గట్టించి పరలెదవఁట నీవె
యందఱ కిష్ట మృష్టాన్నభుక్తిహర్షముగాఁ
గట్టింతు వఁట నీవె పుట్టంబులనె యొందఱనో
ప్రబంధుండన సెనయు ముదము, ఘనుఁడవుగా
మునుఁగు వేయించుచు నొనఁగెదవఁట నీవె
సత్పండితులకు సాలువులను శ్లాఘ్యముగాఁ
జేకట్టు కట్టించి చెలఁగెద వఁట నీవె
కవివరులకుఁ బైడి కడియములనె, ఖ్యాతిగదా
ధర్మభూయంత్రములను స్తంభన మొనర్చి వంద్యుఁడైయా
నాప్రభాకరునే యోఁగితేఁట యొటువలె నారసెదో
యొకక్కఁ దిక్కువిమణి నీకుఁ జిక్కి నిపుడు చక్కఁగాను
సత్కవీశ్వరరాజ భుజంగరాయ! సద్వాగేయ!

విశ్వతోముఖముగు బుద్ధిబలము బ్రసరింపఁజేసి కవులలోఁ గవులై, పండితులలోఁ బండితులై, విమర్శకులలో విమర్శకులై, ప్రభువులలో బ్రభువులై, దాతలలో దాతలై ఖ్యాతినందిన యదృష్ట జీవనులు భుజంగరావుగారు.

మత్తయిసువార్త, క్రైస్తవగూఢార్థదీపిక, మార్కుసువార్త, యోహానుసువార్త ఇవి వీరు పద్యములుగా వ్రాసి తమ క్రైస్తవ మతాభిమానమును జాటుకొనిరి. ఇట్లని ప్రాచీన మతాచార్యుల యాదర్శములను శిరసావహింపనివారు కారు. ఇటీవల వీరు వెలువరించిన యొనిమిది సర్గల పద్యములతోఁ గూడిన 'తత్త్వమీమాంస' మారుఁడు. ఇందు శంకర, రామానుజ, మధ్వాచార్య, చైతన్య, బుద్ధ, క్రైస్త, మహమ్మదుల మతాశయములు సరిచూపులో, బగి

లితము చేసి ప్రదర్శింపఁబడియున్నవి. వీరి శతాధికగ్రంథములలోఁ గల కవితాధారయెల్ల యతిప్రాసములకుఁ దడవుకోకుండ నడచిపోవుచున్నట్లుండును. రసభావదృష్టితో విమర్శించినచో నిలఁబడుపద్యములు మిక్కిలితక్కువగానుండును. చ్యుతసంస్కారములు దొరలు చుండుటయుఁ గలదు. కాని ధోరణి యెత్తు పల్లములు లేక యొకే తీరున సాగుట మెచ్చుకోఁ దగిన ముఖ్యవిషయము. బహుగ్రంథ రచనమునందే వీరికి వేడుక కలిగియుండిన కారణమున, శాశ్వతస్థాయిగా నుండఁగల గ్రంథ మొకటియు వ్రాయలేక పోయినారు. వ్రాసినవానిలోఁ గొన్ని కొంత పేరు సంపాదించుకొన్నవి యున్నవి. A History of telugu literature అనుపేర నీ యాంగ్లములో నొక గ్రంథము వెలువరించిరి. దాని రచనలో పి. చెంచయ్య గారు తోడ్పడిరి. అది కొంత పేరుగొన్న కూర్పు. "ఆధునికాంధ్ర కవిజీవితములు" అను పేరుపెట్టి వీ రొక గ్రంథము నచ్చు కొట్టించిరి. అది వీరి ప్రథమ పుత్రిక పరిణయ సందర్భమున సమావేశమై ౨౩౩ విద్వత్కవులు చేసిన యాశీస్సులు గల కృతి. అందు విశేషమేమనఁగా వారివారి సంక్షిప్త చరిత్రములు కూడఁ జేర్పఁబడి యున్నవి. ఆ కారణమున, అపుస్తకము దాఁచుకో వలసినదిగాఁ దోఁచును. కొమార్తెల వివాహములు మహావైభవముగాఁ జేసి భుజంగ రావుగారు మంచి పేరు కవిలోకములో సంపాదించుకొనిరి. ఒక కవి యిట్లు వ్రాసినాఁడు.

క. రాజా భుజంగరాట్కవి
భోజుఁ డహా! దేవదుందుభులు మ్రోగించెన్
భోజనములఁ బూజనముల
భోజనములఁ దనిపి ప్రథమపుత్రిక పెండ్లిన్.

అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామచరితము వీరు మధురముగా నాంధ్రీకరించిరి. 'తత్త్వమీమాంస' యనుకృతి పండువయస్సులో

వ్రాయఁబడినది. కావున నందుండి కొన్ని పద్యములు స్మరించుకొందము
ధారాళత యెంతో శ్రుతిసుఖముగా నుండును. విషయము సుపవిత్రము

సీ. ఏపరేశు నమోఘ హృదయ సంకల్పముల్
బ్రహ్మాండ మండలోత్పాదనములు
ఏచిదాత్ము కటాక్షవీక్షణాసారముల్
జీవకోట్లకు సుధాసేచనములు
ఏమహాత్ముని యుద్దామ వాగ్వైభవముల్
మునిజన సంశయోన్మూలనములు
ఏదయాళు నిరంకుశోదార కృత్యముల్
ప్రాణి సంరక్షా పరాయణములు
అట్టి పరమేష్ఠి వదనగహ్వర చతుష్ట
యంబునుండి యనాది కాలంబునందు
నాశుధారా ప్రవాహ సామ్యంబు దోఁప
నగణితామ్నాయ సముదాయ మవతరించె.

ఉ. ఆ నిగమంబు లెన్నఁగ ననంతములై వరధర్మ బోధనా
స్థానములై జగత్స్థితి విధానములై పురుషార్థ సాధనో
ద్యానములై మహాగుణ నిధానములై విలసిల్లి సంతతా
నూన కళావిలాసముల నొప్పుచునుండె జగత్త్రయంబునన్.

గీ. అట్టి యామ్నాయ నిచయ మహాంబురాశి
యందలి మహత్తరార్థంబు లఖిల జనుల
కాది నెంతయు దురవగాహములు గాఁగ,
వాని విభజించె నప్పుడా వ్యాసమౌని.

చ. ఎనసిన యబ్ధులట్లు భరియింపఁగ శక్యముగాని వేదరా
శిని విడఁదీసి కొంత నసిజేసిన వ్యాసమునీంద్రు దివ్యశో
భనము నోట నుండియు నుదారతర శ్రుతిసంచయంబు స
త్యనివహ తత్త్వ వేద్యులకు బోధయొనర్చుచునుండె కాదటన్

గీ. ఆకులారావు; గంటంబు లసలె కావు;
కాగితంబులు కలము లెక్కడను లేవు;
ఒక్కయక్కర మైన వ్రాయుపనిలేక
యెల్లశ్రుతులును వల్లించి రెల్ల ఋషులు.

గీ. తనువులకు జీవకళపోల్కి దరణి చంద్ర
ములకుఁ బ్రభవోలె నా వేదపుంజమునకు
నస్ఖలితమై వెలుంగు మహాస్వరంబె
ముఖ్యముగ నెన్నఁబడె ఋషిముఖులచేత.

ఈ రకమగు కవితాధారతో శ్రీభుజంగరావుగారు శతాధికములు కృతులు సంతరించి రనఁగా నది పురాజానుష మైన పుణ్యాఫలము. "కవియు రాజును, మంత్రిప్రగడ భుజంగ, రావు బహదూరు, హేలాపుర ప్రధాని, నయశతాధిక గ్రంథకర్త, యవధాని దర్శనాచార్యబిరుదమ్ముఁ దనరఁ బూనె." అని యాయన వ్రాసికొన్నట్లుగా సకలభాగ్యములు వీరికిఁ బట్టినవి. శ్రీ కొత్తపల్లి సుందరరావుఅను కవివరునొకని తనసంస్థానములోఁ బెట్టుకొని గౌరవించిన యీ కవిప్రభువు శీలసంపత్తి గణనీయము.

# ఆకొండి రామమూర్తి శాస్త్రి

## 1875

ఆరామ ద్రావిడశాఖీయబ్రాహ్మణులు. ఆత్రేయసగోత్రులు. జన్మస్థానము: కోనసమ్ముం పోలవరము. తల్లి: లచ్చమ్మ. తండ్రి: రామస్వామి. జననము: భావసంవత్సర కార్తిక శుద్ధ ప్రథమ. 1875 సం॥ రచనలు:— ౧. స్వప్నానసూయ [కావ్యము] ౨. దేవీభాగవత నవమస్కంధము [తిరుపతివేంకటకవుల దేవీభాగవతమున తొమ్మిదవ స్కంధము మాత్ర మీ కవి తెనిఁగించెను] 3. జీవానందన నాటకము [అముద్రితము.]

రామమూర్తి శాస్త్రిగారు ప్రత్యేకముగ రచించి ప్రకటించి కావ్యము "స్వప్నానసూయ" ఈ యొకకావ్యమునుబట్టియే కా దేవీభాగవత నవమస్కంధ రచనవలనఁగూడ నీయనకు రచయితలలో స్థానమేర్పడినది. నవమస్కంధము తెనిఁగించుటలో శాస్త్రిగారొక కాదు, వీరికి మఱియొకకవి సాయపడినాఁడు. ఆయనపేరు నిశ్శంకుల కృష్ణమూర్తి. వీరిరువురును కలసి రామకృష్ణకవులు.

తిరుపతి వేంకటకవులను వినని వారుండరు. వేంకటరామకృష్ణకవులను విద్వత్కవు లందఱు నెఱుఁగుదురు. ఇవుడీ "రామకృష్ణుల" జంట నెఱిఁగినవారు చాలఁ గొలఁదిమంది. దానికిఁ గారణము వీరు పెక్కు కృతులు రచింపనులేదు; పత్రికలలో వీరిపేరు మనము పరికించుచుండుటయు లేదు. చిత్రములు కవిత్వమందున్నను వృత్తులు వేఱగుటచే కవిలోకములో వీరికెక్కుడు పేరుఁ బెంపులు లేకపోయినవి. ఆకొండి రామమూర్తి శాస్త్రిగారు అనాదిప్రసిద్ధాయుర్వేద వైద్యములో సం చేసినచేయి. నిశ్శంకుల కృష్ణమూర్తిగారు కాలు కదప నక్కఱ లేకుండ మంచి వగటుగా గ్రామ కరణపుఁబని చేసికొనుచుండు నేర్పరి. ఇరువురు మురుమళ్ళ పోలవరము కాఁపురముగాఁ గలవారు. ఇరువుర

పెద్ద సంసారమునకుఁ జాలినంతయున్నవారు. శ్రీ ఉప్పులూరి రామ జోగన గురుముఖమున సంస్కృతాంధ్రములు చదువుకొని నిసర్గజమైన కవిత్వ ధోరణిని బెంపు చేసికొనిరి.

తిరుపతి వేంకట కవులతో రామమూర్తి శాస్త్రి గారికి మంచి మైత్రి. విశేషించి, వేంకట శాస్త్రిగారితో బాంధవము. చెళ్ళపిళ్ళకవి రామమూర్తి శాస్త్రి కడనే తఱచు ఔషధ సేవ చేయుచుండుట యలవాటు. 1902 లో వేంకటకవి కనారోగ్య మేర్పడి పోలవరము వెళ్ళి మందు సేవించుచు రెన్నెలలు నిలువయుండెను. శాస్త్రిగారి 'జాతకచర్య' యీవిషయమును దారకాణించుచున్నది. అప్పుడు తిరుపతివేంకటకవుల దేవీభాగవత రచన సాగుచున్న సమయము. నవమస్కంధాంధ్రీకరణము పీఠికలోని యీపద్యము లీ పూర్వోత్తర సందర్భమును బూసగ్రుచ్చినట్లు ముచ్చటించుచున్నవి :

గీ ... ... ... ... ... ...
ప్రథిత చరకాది వైద్యశాస్త్రప్రవీణుఁ
డమలమతి రామమూర్తి నామాంకితుండు.

క. తిరుపతి వేంకట కవులం
దిరువురిలో నొకఁడు వేంకటేశ్వరకవికిన్
జిరజీర్ణ కృచ్ఛ్ర రుజమును
సరసౌషధముల నొసంగి సాధించె వడిన్.

గీ. శ్రీలలితమైన యట్టి మాపోలవరము
నందు మానసద్వయం బుండి యౌషధంబు
పుచ్చుకొనియెను వేంకట బుధుఁడు మాకు
మువ్వురకు నేస్తమయ్యె నప్పుడు దృఢముగ.

క. నీరుజుఁడై విశ్వాసము
ప్రేరేపన్ జెళ్ళపిళ్ళ వేంకటకవి మా

లో రామమూర్తి గుణసం
భారము వ్రాయుచ్చు నొక్క మత్తేభమునన్.

వ. అది యెట్లంటేని –

మ. కవిత న్నైపుణిగాంచి చక్కఁ జతురంగంబాడఁగా మించి, గా
న విధిం బద్యములం బఠింపఁదగు విన్నాణంబు నార్జించి వం
శ పశంబై యెడఁబాయకున్న దగు వైద్యజ్యంబునం జక్రవ
ర్తివినై రాఁప్పితి రామమూర్తి! శమితార్తీ! కీర్తికి న్మూర్తివై.

ఉ. ఈవును గృష్ణమూర్తియును నేకముగా నొకచోఁ బఠించుచున్
భావము కబ్బ మొక్కగతి భాసిలు మిత్రులు మీర లిర్వురున్
గావున నిచ్చవచ్చు నొకస్కంధముఁజూచి తెలుంగు సేయుఁడీ
దేవిచరిత్ర మందు భవదీయ గుణోన్నతి వెల్లడిల్లెడున్.

అని వేంకటశాస్త్రిగారు రనురాగముతో నీ రామకృష్ణులకు నవమ స్కంధము నాంధ్రీకరింప నిచ్చిరి. ఆ కవులకు మెచ్చు వచ్చునటులు వీరాస్కంధము తెనిఁగించిరి. "ఈ కృతివరంబు, తెలుఁగుసేయుచు రామమూర్తియును. నేను రామకృష్ణులమైనవారము కలయిక" అని స్కంధాదిని వీరు వ్రాసికొన్నటుగా నీ కృతి రచనమునందు మాత్రమే యీ కవ యిటులు కూడినది. దీనికి ముందుగాని, వెనుకఁగాని, వీరు జతగా విరచించిన గ్రంథము లేదు. ప్రత్యేకముగా, కృష్ణకవి 'కీచకవధ' యనునాటకమును రచించెను. రామమూర్తి 'స్వప్నానసూయ' కావ్యము సంతరించెను.

1929 లో సహపాఠి స్వర్గస్థుఁడైన తరువాతనే రామమూర్తిగారు స్వప్నానసూయ రచన 1936 లోఁ గావించెను. పాలకొల్లువాస్తవ్యుఁడు శ్రీకృష్ణ భారతకృతిభర్తయు [కర్ణ–శల్య–సౌప్తిక–స్త్రీ పర్వములు] నగు చుండూరి నారాయణరావను వైశ్యవరుని కోర్కెపై పతివ్రతాధర్మ

భరితమగు చరిత్రముతో స్వప్నానసూయ రచింపఁబడినది. కృతిభర్త రామమూర్తికవికడకు వచ్చి సమ్మోదాశ్రు పూరిత నయనయుగళుఁడై

ప్రతిపదరమణీయము రం
జిత కమనీయార్థ గుణవిశేషము భవ ద
ద్భుత కవితాగుంఫన మో
కృతమతి ! నీ వెట్టి పరమ కృతకృత్యుఁడవో !

అనిప్రార్థించి యీ కావ్యము తన ధర్మపత్ని పేర వ్రాయఁ గోరును. నిర్దుష్టము, భావరసపరిపుష్టము నగు నందలి కవితాసృష్టి యిటు లుండును. ఇవి సీతాపాతివ్రత్యప్రభావ వర్ణనములోని పద్యములు.

సీ. అడ్డులేకొకపలుకు నాడింపలేదయ్యెఁ
భ్రాజ్యమై తేయ సామ్రాజ్యలక్ష్మి
కనుఁగొననైనఁ గన్గొనఁ జేయలేదయ్యె
భువనరమ్య కుబేర పుష్పకంబు
మాఱుమొగంబేని మరలింపలేదయ్యె
గంభీర దశకంఠ గౌరవంబు
ఒకపాటి తలనైన నూపింపలేదయ్యె
నతి కాద్రతర చంద్రహాసధార
యద్దిరా ! నిర్భర ప్రణయ ప్రఫుల్ల
రామచంద్ర పదాంభోజ రాగ భరిత
చరిత యగు సీత సౌశీల్య సద్గుణ ప్ర
తాప మహిత పతివ్రతాత్వ ప్రశస్తి.

* * *

సీ. ఒనర నాఁగేటిచాలున నయోనిజయయి.
పొడమె నీబోటి యన్ బుద్ధిఁగాదు
జనక నామక మహా చక్రవర్తి కుమారి
యనిరొమెు గౌరవంబునను గాదు

తులలేని త్రిభువన దుర్లభ సౌందర్య
　　　విభవంబు గలదన్న వేడ్కఁ గాదు
వివిధ విభ్రమ కళా విస్ఫురితాత్యద్భుత
　　　చాతుర్యవతి యను ప్రీతిగాదు
ప్రేమతత్త్వజ్ఞుఁడైన శ్రీరామమూర్తి
సీతయెడ నట్టి కూరిమి సేఁత యరయ
ధర్మసతి యంతరంగంబు మర్మ మెఱిఁగి
కాని, వేఱొండు కతమునఁ గాదు సూవె!

రామమూర్తి శాస్త్రిగారికి 1944 లో సప్తతి పూర్తి మహోత్సవ సన్మానము గావింపఁ బడినది. ఆసందర్భమున శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు వ్రాసిన పద్యములలో నీక్రిందివి పారాయణము చేయఁ దగినవి.

మ. ఇతఁ డస్మత్కులుఁ, డంతె, శిష్యగణమందే వాఁడునుం గాఁడు,తి
　　ర్పతితో పాటు కవిత్వపున్ రచనలో భాగస్థుఁ, డేతన్మహా
　　మతిసోదర్యుఁడొకండు శిష్యుఁడగుట న్మన్నించి దీవింప న
　　ర్హత నా కున్నది, వృద్ధుఁ డీతఁ డగుటన్ భ్రాజిష్ణుఁడున్ జిష్ణుఁడున్.

చ. తిరుపతి శాస్త్రిఁ దక్క గణుతింపని నే నితనిన్ గణించి మా
　　విరచన నున్న భాగవతవీధిని జోటు నొసంగినట్లు ధీ
　　వరమణు లెల్లవా రెఱుఁగు వారలె, వా కొననేల! దీనికిన్
　　దిరుపతిగూడ నొప్పుకొను దేవునిసైత మతండు మెచ్చునే!

చ. తిరుపతి యొండె వెంకనయొ తెల్గొనరింపక దంటకూడదు
　　స్థిరమని యెంచి వేఱొక భిషక్కునకున్ స్థలమీరు, రామమూ
　　ర్తి రసికుఁ డౌటచే నతని తేకువ తా గ్రహియించి వేంకటే
　　శ్వరుఁడిడెఁ జోటు తిర్పతియు సమ్మతిఁ జూపె యథార్థమింతియే.

చ. నలువురనోళ్ళలోఁ బడుట నచ్చదువో మనరామమూర్తి కి
య్యలఘుని యుత్సవంబునకునై తలపెట్టితి రుత్సవంబు మీ
రలు మహనీయు లీతఁడు భరంచని మీసభ కేఁగుదేర సి
గ్గిలి మొట డాఁగునో, తెలిసి కేల్గవ పట్టుక నిల్పుఁ డెట్టులో.

ఉ. ఈయన నూత్న నాగరక తేచ్ఛకు లోఁగెడివాఁడె మైనచోఁ
బాయని కీర్తితోడ నిరపాయపు రాఁబడి పోల్వరంపుఁ జూ
చాయుల వేలు లక్షలును సాగుచు మ్రొక్కుచుఁ దాండవించు, నే
మాయయు మర్మమున్ నలుపు మాటలతోఁ బనిలేదు లేశమున్.

గీ. ఈతనికి నాకు వియ్యంబు నెనయుకోర్కి
గలిగియుండెను లే వయఃకాలమందు
కైతలో నప్డు ఘటియించెఁ గడమలోటు
సునుమరాలు శ్రీమతి ద్వారమున ఘటించె.

ఇన్ని పద్యము లిటులు చెళ్ళపిళ్ళ కవివి యుదాహరించుట యెందుల కనఁగా, వీరిర్వుర హృదయ బంధుత లిట్టి వని చదువరులకుఁ దెలుపుటకే. వాస్తవమున లోకమహాకవిచే మెచ్చఁబడుటయే ఘనతకుఁ గారణముకాదు అసలు, రసికమానసములూఁపఁగల శక్తి యేదేని రచయితలో నుండవలయును. అదికొంత రామమూర్తిశాస్త్రిగారి స్వప్నానసూయలోఁ గనఁబడుచున్నది. ప్రధానమైన వైద్య వృత్తిలోనే యుండిపోయి, యథాలాభముగాఁ గవిత వ్రాయుచుండుట జరుగుటచేఁ గాఁబోలు, వీరిపద్యములు తెనుఁగునాఁట హెచ్చుగా నల్లుకొనలేదు. ఈసంగతి వారుకూడ గుర్తింపలేకపోలేదు.

"నా పాండిత్యము నాకవిత్వరచనా నైపుణ్యముం గాంచి మీ
రీపాటన్నను సత్కరింపఁదలఁచి యే యేనెంతు ; నోకింత యే
దో పేరున్నది నాకు దేశమున నాయుర్వేదమం, దద్దియుఁ
మాపిత్రార్జితవృత్తి యం చెఱిఁగి సంభావింపుఁడీ సోదరుల్ !

# చర్ల నారాయణశాస్త్రి

## 1881-1932

శ్రీరామచంద్రాపురం వైదికశాఖీయ బ్రాహ్మణుడు. జన్మస్థానము : కాకరపఱ్ఱు. తల్లి: వెంకమ్మ. తండ్రి : జనార్దనశాస్త్రి. జననము 1881, వృషసంవత్సరము. నిర్యాణము : 27 నవంబరు 1939, రచనలు : ౧. వృషభశతకము [ఆంధ్రీకరణము] ౨. నారాయణీయాంధ్ర వ్యాకరణము. 3. దూతాంగదము [ఆంధ్రీకృతనాటకము] ౪. భర్తృహరి నిర్వేదము [ఆంధ్రీకృతనాటకము] ౫. కావ్యాదర్శము ౬. నీలకంఠవిజయ చంపువు. ౭ మహాభారత మీమాంస [మొదటి రెండుకృతులే ముద్రితము లైనవి. తక్కినవి యింకను ముద్రింపబడలేదు].

నారాయణ శాస్త్రిగారు మంచి విమర్శకులు గాను, పండితులు గాను పేరుగాంచిరి. కవిగా వారికీ గలపేరు తక్కువ. ఆయన శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయమునం బండితాధికారిగాం జెక్కునాళ్లు పనిచేసి భారతికిం గావించినసేవ గొప్పవిలువ గలది.

“ మేకాధీశ ” శబ్దార్థమున సకలప్రపంచమును జోడించిచూపిన మహావిద్వాంసుఁడు చర్ల భాష్యకారశాస్త్రి మున్నగువారికి నెలవైన 'కాకరపఱ్ఱు' నారాయణశాస్త్రిగారియూరు. ఈయన పితామహుని సన్నిధిని కావ్యములు చదువుకొని, ఆకొండి వ్యాసలింగశాస్త్రితో నలంకార గ్రంథములు పాఠముచేసి, రామడుగులవీరయ్యశాస్త్రిగురువులదగ్గఱ వ్యాకరణ మభ్యసించి పండితస్థానము నందెను. సంస్కృతాంధ్రభాషలలో నిశితమైన పాండితీపాటవము. ఈ పాండిత్యమునకుం దోడు సంగీతాది కళలలోంగూడ జక్కని పరిచయము. మద్దెల వాయించుటయు గురుముఖమున నేర్చినారు. అంతటి కళాభిరుచి! ఒకచిత్ర మేమనంగా, నారాయణశాస్త్రిగారు నాఁడు ధైర్యవంతుఁడైన సంస్కారవాది. తణుకులో జరిగిన అస్పృశ్యతానివారణ మహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షత వీరిదే. ఆసమయము 1935 ప్రాంతము. సహాయనిరాకరణోద్యమములో వీరు నడుము కట్టి పనిచేసినారు. కాకరపఱ్ఱు

'పంచాయితీబోర్డు' నకు యాజమాన్యము. తణుకు జాతీయ పాఠశాల కార్యవర్గమునకు అధ్యక్షత. ఇవన్నియు మనము యోచించుకొన్నచో నారాయణశాస్త్రిగారు లౌకికప్రజ్ఞావంతులని విశదమగును. పండితుఁడై యుండి పాఠములు చెప్పుకొనుచుఁ గాలక్షేపము చేయకుండ, రాజకీయముగాఁ గలుగఁజేసికొనుట వీరి చరిత్రములో గమనింపఁదగిన సంగతి.

ఆంధ్రవైయాకరణులలో నారాయణశాస్త్రిగారికి గౌరవప్రదమైన తావు ఏర్పడియున్నది. దానికిఁ గారణము వారు శ్రమించి కూర్చిన నారాయణీయాంధ్ర వ్యాకరణము. సన్నయా ధర్వాణు లిరువురు సంస్కృతములో సంతరించిన "ఆంధ్రశబ్ద చింతామణి, వికృతివివేకము" అను వ్యాకరణముల కిది తెలుఁగుగ్రంథము. విశేషము, వీరిది పద్యరూపముగా సంధానించిరి. వారి కుమారులు గణపతిశాస్త్రిగారు దానికి వివరణము వ్రాసిరి. తండ్రికొడుకుల చేతులమీఁద నడచిన యీకృషి చూచుటకు ముచ్చటగా నున్నది. నారాయణశాస్త్రిగారి కవితారీతి యీ లక్షణగ్రంథములో నిటులు నడచుచున్నది. మనపూర్వులందఱుఁ వ్యాకరణము, ఛందస్సు, తదితరసమస్తశాస్త్రములు పద్యములలోనే నిబంధించి యున్నారు. లక్షణగ్రంథములు పద్యబంధములై యుండుట కవితాధారవాహితకు మిక్కిలి యడ్డు. కాని, మనవారు శ్రమించి దానికిఁ గొఱంత రాకుండఁ జూచుకొని కొంతవఱకు సఫలులైనారు.

క. సకలశ్రేయస్సాధన
ము కావ్య; మయ్యది యదోషము గుణాలంకా
రకలితము నైన వాగ
ర్థకాయమున నొప్పు; వాక్కు రసజీవ సుమీ!

క. రసముచెడకుండ నాయా
రసముల కనుగుణము లయిన రసవత్తర వా
గ్విసరంబు తోడఁ గావ్యము
రసికులు తముఁగోలఁది నుడువరాదో కో దానన్.

గీ. సిద్ధ సాధ్య భేదంబులఁ జెలఁగుచున్న
యర్ధ పూర్ణరూపంబుల నగు ద్వివిధము ;
హ్రస్వమువయి ఖండంబు పూర్ణంబు నగును ;
గాదు ఖండంబున కది దీర్ఘంబు మీఁద.

నారాయణశాస్త్రిగారు పీఠికాపురసంస్థాన విద్వత్కవు లగు వేంకట రామకృష్ణకవుల గురువులు. శాస్త్రిగారు తెనుఁగువఱచిన 'మహిష శతకము' చక్కనిగ్రంథము. మహిషముమీఁదఁ బెట్టి దురధికారులను దూషించు నన్యాపదేశశతక మది. అనువాదమే యైనను గవితాధోరణి సాధుమధురముగా నున్నది.

ఉ. కొండొక దున్నపోతు నినుఁ గూర్చి ప్రబంధశతంబుఁ జేయు న
ద్దండత నుత్సహింతు నిది త్వన్మహిమంబునఁ జేసికాదు ; క్రూ
రుం డొకఁ డాధికారికుఁడు ద్రోహముసర్పఁగఁ గోపగించి వా
గ్దండముఁ ద్వత్తిరస్కృతిపథంబున ముప్ప్రభులందు వైవఁగన్.

చ. అతివిభవాభిమానులు దురాగ్రహు లంతిమ జాతిసంభవుల్
వితత కఠోరభావనులు వేరలా యూ చెడుగండ్ల మోములన్
క్షితిఁ బరికించుకంటెఁ బరికించుటమేలగు నీదు పృష్ఠ ; మ
కృతమునఁ బొట్టనిండ దొరకంగల దన్నము సైరిభేశ్వరా !

ఉ. సైరిభ ! నీవు తాపమునుసైఁచి గడింపఁగ ధాన్యముల్ సుబే
దారుఁడు కొంతసొమ్ముగవలెఁ దత్సకలంబు హరించెదున్ బలా
త్కారముఁ జేసి, దాని కొకకారణ మున్నది విన్ము పిత్ర్యముగా
దారకులే హరింతురు గదా విభుఁ జెల్మినో కల్మినో లేక బల్మినో.

ఈతీరుగల శయ్యలో దూతాంగదము, భర్తృహరినిర్వేదము శాస్త్రి గారు తెనుఁగున ననువదించిరి. ఇవియెల్ల నొకయెత్తు ; నారాయణ శాస్త్రిగారి నారాయణీయాంధ్రవ్యాకరణ మొకయెత్తును. తెలుఁగు లాక్షణికులలో శాస్త్రిగారికీర్తి నిలఁబడుట కీ కూర్పు చాలును.

# వడ్డెపాటి నిరంజన శాస్త్రి

## 1877 - 1937

స్వర్ణకారవంశీయుఁడు. తల్లి: భద్రమ్మ. తండ్రి: కోటయ్య. జన్మ స్థానము: తెనాలితాలూకాలోని దుగ్గిరాల. జననము: 14-10-1877, ఈశ్వర సంవత్సరాశ్వయుజ శుక్లాష్టమీ భానువాసరము. నిర్యాణము: 17-10-1937 సం. ఈశ్వరసంవత్సరాశ్వయుజ శుక్లత్రయోదశీ భానువాసరము. ప్రకటితగ్రంథములు: ౧. కల్యాంధకౌముది [కావ్యము] ౨. కుమారాభ్యుదయము [కావ్యము] ౩. బ్రహ్మానందలీలలు. [ఎనిమిదంకముల నాటకము 1937 ముద్రి] అముద్రితములు: ౧. ధర్మపాల చరిత్రము. ౨. భీష్మోదయము. ౩. మాఘమాహాత్మ్యము. ౪. సూర్యశతకము. 'శ్రీ నిరంజనవిజయము' కొండూరి వీరరాఘవాచార్యులు రచించినది చూడవచ్చును.

వడ్డెపాటి వారిది విశ్వబ్రాహ్మణవంశము. ఆవంశమునఁ బుట్టిన నిరంజనశాస్త్రి తండ్రి కోటయ్య యనునతఁడు కమ్మరీఁడు. అతఁడు కులోచితమగు కమ్మరముచేసికొనుచు స్మార్తము గురుముఖమున నధ్యయనము చేసినవాఁడు. ధనసంపత్తి విషయములో నతనికుటుంబము సామాన్యమైనది. నిరంజనశాస్త్రి తండ్రికడనే పసితనమునఁ జదువుకొని, యువనీతుఁడైన పిమ్మట వేదాధ్యయనమున కుపక్రమించెను. వేదము పాఠము చేయుచునే జ్యోతిశ్శాస్త్రమును గేరళమును సొంతముగఁ జదువుకొని, తెలియనిది తజ్జ్ఞులవలనఁ దెలిసికొనుచుండెను. 'బంగారువంటి కోమటి సంగీతముచేత చేరసారము లుడిగి' నటులు కాకుండఁ గులవృత్తి యగు కమ్మరమునుగూడ నిరంజనశాస్త్రి వీలుకలిగినపుడెల్ల నలవాటు చేసికొనుచుండెను. క్రమముగ వయసు వచ్చుచున్నకొలఁది సంస్కృతవిద్యపై నభిలాషము పెరిఁగి నిరంజనశాస్త్రి పండితుల దరికేఁగి కావ్యములు, నాటకములు, కొన్ని యలంకారగ్రంథములు బహుశ్రద్ధగఁ జదువుకొని, ఆ సాహిత్యమునకు మెఱుఁగుపెట్టు కొంచెము వ్యాకరణపరిచయము కలి

గించుకొనెను. తరువాత బందగుసందుండి 'పర్వతము నృసింహశాస్త్రి' యను పేరుగలవారియొద్ద నాధానపంచకము, శ్రౌతగృహ్యధర్మసూత్రములు మున్నగు వైదికక్రియావిధానములను సంపూర్ణముగ నభ్యసించెను. మొదటినుండియు సహజముగు కవితచెప్పు నేర్పు కలవాడు గావునఁ బదునెనిమిదవ యేఁటనే 'కల్యాంధకౌముది' యను పేరు పెట్టి కావ్యము వ్రాయ మొదలిడెను. ఇందలి యితివృత్తము వీరేశ్వర లీలావర్ణనము. అది యెన్నో ప్రసారములుగ రచింప నారభించి యొక ప్రసారముతో సమాప్తి చేసెను.

మ. ఇది శ్రీ సానగగోత్ర సంజనిత కోటీశార్య సంతాన సం
 పద, వీరేశ్వరయోగి పాదయుగ సేవాశీలి, నిర్వ్యాజకో
 విద విశ్వాసి నిరంజనుండు సమవాప్తింజేయు కల్యాంధకౌ
 ముది లోనం బ్రథమప్రసారము ప్రజామోదంబు సంధించుతన్.

'పౌరుషేయాన్వయ మహాపురుష రత్నమాల' అను గ్రంథము రచింతమని ప్రారంభించెను. ఆ గ్రంథ మనతారికా పద్యములవఱకు వచ్చి యాఁగిపోయినదఁట. తరువాత 'కుమారాభ్యుదయము' అను నాటకమొకటి శైవమత సమ్మతముగా రచించెను. అది ప్రచురింపఁబడినది. ధర్మపాలచరితము, భీష్మోదయము, సూర్యశతకము, మాఘమాహాత్మ్యము మున్నగు పెక్కు కృతులు రచించుట కుపక్రమించుటయు, నిందులో నొకకృతియుఁ దుదిముట్టక, నట్టనడుమనో, మొట్టమొదటనో యాఁగిపోవుటయు, దటస్థించినటులు 'శ్రీనిరంజన విజయము' అను జీవిత చరిత్రమువలనఁ దెలియుచున్నది. నిరంజనశాస్త్రివని ప్రచురింపఁ బడినవి కుమారాభ్యుదయనాటకము గాక, 'బ్రహ్మానంద లీలలు' అను మఱొకనాటకము. తక్కినవెల్ల సముద్రితములు, నసంపూర్ణములును. ఈ రెండునాటకములలోని కవితతీరును, మిగిలిన యసంపూర్ణకావ్యములలోని రచనతీరును బరికింప నిరంజన శాస్త్రిగారు మంచి రచయితలని

తోఁచుచున్నది. తాను రచించు 'మాఘమాహాత్మ్యము' నిడుద్రోలు వాస్తవ్యులు శ్రీ పామలపాటి సుబ్బరాయఁడుగారి కంకితమీయఁదలఁచి 'సుబ్బరాయతారావళి' యను పద్యములు చెప్పెను. అవి యెంత సొగసుగ నడచినవో, రెండుదాహరించెదను జూడుఁడు.

మ. అరి నిర్భేద్యము నీదుగుట్టు, సకలవ్యాపారసౌకర్య దు
స్తర పాండిత్యము నీదుకట్టు, నిఖిలాశామండలీ మండన
స్ఫుర కీర్తిప్రభ నీదురట్టు, ముదివేల్పుం జెట్టు నీపెట్టు, బల్
సిరి నీవాఁకిటి కాటపట్టు, బళిరా! శ్రీ సుబ్బరాయాగ్రణీ!

మ. కవితాకన్యక లెందఱో నిను సమాకర్షించి పెంపొంది రం
చు విచారించి బహుప్రియారతుఁడవై శోభిల్లు నీదౌ రాడ్కి వై
భవ మబ్బున్ నిజచాకచక్యనిపుణీభావంబు జూపింప వ
చ్చె వరింపందగు మత్కవిత్వరమణిన్ శ్రీ సుబ్బరాయాగ్రణీ!

అసంపూర్ణమైన వీరి 'మాఘమాహాత్మ్యము' లోని పద్యములు మచ్చు చూపినచో నిరంజనశాస్త్రికి విశ్వబ్రాహ్మణ సంఘసభలో నొసఁగఁబడిన 'కవిశేఖర' బిరుద మన్వర్థమే యనిపించును.

[మాఘమహిమ. వర్ణనము]

సీ. పారాడునిసువు లబ్రవు ముద్దుఁ బలుకులఁ
గిలకిల లాడు ముంగిళులు గలిగి
సిరులు దుటూరింప విరిఁబోండ్లయాటలఁ
దలతలల్ తోలఁకు మోసలలు గలిగి
పాటలప్రామిన్కు పదటుల మిన్నంది
కనకనల్ గొను శుభధ్వనులు గలిగి
తనివాఱ మెసవి గట్టునఁ బ్రేఁపునతిథుల
మెడ నెడఁ దొడరుసందడులు గలిగి

వెలయుగీముల నిండారు వేడ్కలలర
రోహిణీదేవి శచియు నరుంధతియు వె
లందిలోకంబులందు వలంతులగుట
మాఘమునఁ గ్రుంకువెట్టిన మహిమగాదె ;

[పెండ్లికాలపుఁ జేరటాంధ్రవర్ణనము]

సీ. పసిమి జిగ్గుల రొయిడల్ పసుపునీటఁ దోలంచి
గడిమడుంగులు రింగు లడరఁగట్టి
జిలుగుపట్టంచు రైకలు గుత్తముగఁ దొడ్గి
వలఁతికుంకుమబొట్టు లలరవెట్టి
విరిగుత్తిగుబ్బల విరిసరుల్ తవణించి
పలుచగందమ్ము చెక్కుల నలంది
క్రొమ్ముడిఁ గెందమ్మి తెమ్మ లిమ్ముగఁ జెక్కి
పసపుఁ బారాణిని పదముల నిడి
మృదులవాక్కుల వినయమ్ము బహిరపఱచి
కులపురంధ్రులు నట్టింట నిలిచినపుడె
సదన మతిదీవ్యమానమై సందడించెఁ
బెండిలికిఁ జేరటాంధ్రలోకొ నిండుసొగసు.

ఈ నిరంజనకవి తన గోత్రఋషియగు సానగ మహర్షిని బ్రతి గ్రంథాదిని ప్రార్థించెను. ఇతఁడు విశ్వబ్రాహ్మణసంఘము నుద్ధరించుటకు 'ప్రబోధిని' యనుపత్రిక 1907 నుండి నడపనారంభించెను. మహాసభలఁ జేయించెను. ఏతత్పత్రికాద్వారమునను, సభాసమావేశములమునను విశ్వబ్రాహ్మణ సమాజమునకు నిరంజనకవి గావించిన సేవ గొప్పదని చెప్పవిందుము. ఇతఁడు దుగ్గిరాల స్థానిక సంఘోన్నత పాఠశాలలోఁ బ్రధానాంధ్రోపాధ్యాయుఁడుగా నించుమించు పదునైదుసంవత్సరములు పనిచేసెను.

నిరంజనకవి ఆంధ్ర కర్నాట మహారాష్ట్రాది దేశములు పర్యటించి శిల్పగ్రంథము లెన్నో సంగ్రహించెను. ఇతఁడు విశ్వబ్రాహ్మణ సంఘము నకు, సారస్వతమునకు శ్రద్ధమెయి సేవచేసికొని తరించెను. కవిత్వము జాను తెనుఁగులో బహుమృదు మధురముగఁ జెప్పి మహాకవులను మెప్పించెను. మొత్తముమీఁద నిరంజనకవి వ్యుత్పత్తిని దాఁటిన ప్రతిభ కలవాఁడని చెప్పనొప్పును. అచ్చుపడిన యతని 'బ్రహ్మానంద లీలలు' నాటకమునుండి మూఁడు పద్యములిచ్చెదను.

మ. తమ మాయామహిమన్ జనించునవి, కాంతాకాంతరావాసు లు
    త్తమగార్హస్థ్యజనుల్ భజించునవి, యద్వైతామృతంబున్ సమ
    స్తమతార్థ్యంబులఁ గుమ్మరించునవి, సిద్ధశ్రీ మనోమంగళా
    ర్థ్యము లైనట్టివి దన్వీఁగాత! మిము బ్రహ్మానంద లీలావిధుల్.

ఉ. పాటిదొలంగి వాసనలు పైఁబడ సంసృతిఁగుంకు నీ ప్రజా
    కోటి కసంతమోద మొసగూర్పఁగ మోక్షకవాట పాటవో
    ద్ఘాటన దివ్యరంగముఁ బ్రదర్శనముం బొనరించు నాజగ
    న్నాటక కర్త యీకథకు నాయకుఁడౌట యెఱుంగవే సఖీ!

గీ. ప్రకృతి చెలువ వెంటఁ బ్రాఁకులాడకయున్న
    జగము బ్రహ్మమెట్లు జరుపనేర్చు?
    దానగాదె లోకతత్పర క్రీడమై
    బాలుఁడౌట మునులపజ్జఁగనుట.

# ఉమర్ అలీషా కవి

# 1885 - 1945

ఇస్లాంమతస్థులు. తండ్రి: మొహియుద్దీన్. నివాసము: పిఠాపురము. పుట్టుక: 1885 సం. నిర్యాణము: 23 జనవరి 1945 సం॥ గ్రంథములు: పద్మావతి, మణిమాల, స్వర్గమాత, విషాదసౌందర్యము, మదాలస బ్రహ్మవిద్యావిలాసము, శాంత, చంద్రగుప్త, విచిత్ర బిల్హణీయము, దానవవధ, సూఫీ వేదాంతదర్శము, ఇలాబాల్ గుల్భా, ముసద్దాస్ అలి, ఉరుపత్తూరు చక్రవర్తి, శ్రీమద్వాల్మీకిరామాయణము. మున్నగునవి.

అలీషాకవి మాతృభాష ఉరుదు. మతము ఇస్లాము. ఇట్టివాఁడు తెలుఁగు బాసలో దిట్టమైన సాహిత్యము కలిగించుకొని కవిత్వము గట్టి పేరు సంపాదించుట మెచ్చుకోఁదగిన సంగతి. ఈయన తెనుఁగులో నొకటి రెండు పుస్తకములు కాదు, ఏబఁది గ్రంథములవఱకు సంతరించిరనఁగా నతిశయోక్తము కాదు. కవితాధోరణియు సులభరమణీయమైనది. భావనావేశము సరేసరి. గ్రంథరచనా విషయ మటులుండి, యీయన తెనుఁగులో నుపన్యసించుట విన్నవారున్నచో నడుగవచ్చును అచ్చమైన మధువాహిని పొడిగిలునటులుండెడిది. భాషలో నిర్దుష్టత - పలుకుబడిలోఁ గ్రొత్తవెడఁగు, ధారాళత వీరియుపన్యాసములకు మెఱుఁగులు తెచ్చినవి. మాటనేరుపు, వ్రాఁతతీరువు పరిపాకముగా నలవడిన యీ కవి ధన్యుఁడు. తెలుఁగుబాస కడుపునఁ బుట్టిపెరిగినవారికే దిక్కు లేదు. ఈయన యంతసొగసుగాఁ గవిత కట్టును! అలీషాకవి తండ్రి అరబ్బీ పారశీక సంస్కృతములు చదువుకొనెను. ఒక ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు వీరి కుటుంబము వారిది యాచార్యత్వము. తండ్రి సాహచర్యమునను, మఱికొందఱు గురువుల సేవ వలనను మన ప్రకృత కవి అరబ్బీ పారశీకములు, సంస్కృతాంధ్రములు, ఆంగ్లము తగిన తీరునఁ జదువుకొనెను. ఈ చదువునకు సహజమైన కవితాధోరణి తోడు. పదునాఱవ

యేటనే కవిత్వమునకు శ్రీకారము చుట్టుకొనెను. పదునెన్మిదవయేట 'మణిమాల' యనునాటకము వ్రాసెను. అదిమొదలు క్రమముగా బహు గ్రంథరచన. దేశమును భాషను సమ్యక్ఫతిపత్తితో సేవించుకొనుచున్న వీరినిఁ జాలమంది పిలిచి యుద్యోగము నిత్తుమని యడిగిరి. అల్పములైన పనుల కిష్టపడక 1934 సం॥లో వీరు అఖిలభారత శాసనసభకు సభ్యులై యానురణ మాయుద్యోగమే నిర్వహించిరి. 1936 సం॥లో, International Academy of America ఉమర్ అలీషాకవికి Doctor of Literature బిరుదమునిచ్చి మెచ్చినది. 'సూఫీవేదాంత దర్శము' అనుపద్యకావ్యము మొదల నీకవి స్వీయగాథ కొన్ని పద్యములలో హృద్యముగా వర్ణించుకొనెను. అవి మన కవసర పడును.

క. ఆ మొహియుద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హిత వి
ద్యామతి 'ఉమ్రాలిషా' మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాఁడను కల్పనాసక్తమతి పది
నాటకంబులను గర్ణాట ఫక్కి-
కూర్చినాఁడను గళా కోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిఁగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికు లలర

గీ. రసము పెంపార నవధాన క్రమములందు
నాశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాససీమ లెక్కి-
యుపని "ఉమ్రాలిషా కవి" యనఁగ నేను.

# ఉమర్ అలీషా కవి

## 1885 - 1945

ఇస్లాంమతస్థులు. తండ్రి: మొహియుద్దీన్. నివాసము: పిఠాపురము. పుట్టుక: 1885 సం. నిర్యాణము: 23 జనవరి 1945 సం॥ గ్రంథములు: పద్మావతి, మణిమాల, స్వర్గమాత, విషాదసౌందర్యము, మదాలస బ్రహ్మవిద్యావిలాసము, శాంత, చంద్రగుప్త, విచిత్ర బిల్హణీయము, దానవవధ. సూఫీ వేదాంతదర్శము, ఇలాజాల్ గుల్బా, ముసద్దాస్ అలి, ఉరుపత్తూరు చక్రవర్తి, శ్రీమద్వాల్మీకిరామాయణము. మున్నగునవి.

అలీషాకవి మాతృభాష ఉరుదు. మతము ఇస్లాము. ఇట్టివాఁడు తెలుఁగు బాసలో దిట్టమైన సాహిత్యము కలిగించుకొని కవిత్వము చెప్పి పేరు సంపాదించుట మెచ్చుకోఁదగిన సంగతి. ఈయన తెనుఁగులో నొకటి రెండు పుస్తకములు కాదు, ఏఁబది గ్రంథములవఱకు సంతరించి రనఁగా నతిశయోక్తము కాదు. కవితాధోరణి చాల సులభరమణీయమైనది. భావనావేశము సరేసరి. గ్రంథరచనా విషయ మటులుంచి, యీయన తెనుఁగులో నుపన్యసించుట విన్నవారున్నచో నడుగవచ్చును అచ్ఛమైన మధువాహిని జాలువాఱునటులుండెడిది. భాషలో నిర్దుష్టత - పలుకుబడిలోఁ గ్రొత్తబెడఁగు, ధారాళత వీరియుపన్యాసమునకు మెఱుఁగులు తెచ్చినవి. మాటనేరుపు, వ్రాఁతతీరువు సరితూఁకముగా నలవడిన యీ కవి ధన్యుఁడు. తెలుఁగుబాస కడుపునఁ బుట్టిపెరిగినవారికే దిక్కు లేదు. ఈయన యంతసొగసుగాఁ గవిత కట్టుట! అలీషాకవి తండ్రి అరబ్బీ పారశీక సంస్కృతములు చదువుకొనెను. ఒక ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు వీరి కుటుంబము వారిది యాచార్యత్వము. తండ్రి సాహచర్యమునను, మఱికొందఱు గురువుల సేవ వలనను మన ప్రకృత కవి అరబ్బీ పారశీకములు, సంస్కృతాంధ్రములు, ఆంగ్లము తగిన తీరునఁ జదువుకొనెను. ఈ చదువునకు సహజమైన కవితాధోరణి తోడు. పదునాఱవ

యేటనే కవిత్వమునకు శ్రీకారము చుట్టుకొనెను. పదునెన్మిదవయేట 'మణిమాల' యనునాటకము వ్రాసెను. అదిమొదలు క్రమముగా బహు గ్రంథరచన. దేశమును భాషను సమ్రుతిపత్తితో సేవించుకొనుచున్న వీరినిఁ జాలమంది పిలిచి యుద్యోగము నిత్తుమని యడిగిరి. అల్పములైన పనుల కిష్టపడక 1934 సం॥లో వీరు అఖిలభారత శాసనసభకు సభ్యులై యామరణ మాయుద్యోగమే నిర్వహించిరి. 1936 సం॥లో, International Academy of America ఉమర్ అలీషాకవికి Doctor of Literature బిరుదమునిచ్చి మెచ్చినది. 'సూఫీ వేదాంత దర్శము' అనుపద్యకావ్యము మొదల నీకవి స్వీయగాథ కొన్ని పద్యములలో హృద్యముగా వర్ణించుకొనెను. అవి మన కవసర పడును.

క. ఆ మొహియుద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హిత వి
ద్యామతి 'ఉమ్రాలిషా' మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాఁడను కల్పనాశక్తిమతి పది
నాటకంబులను గర్ణాట ఫక్కి
కూర్చినాఁడను గళా కోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిఁగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికు లలర

గీ. రసము పెంపార నవధాన క్రమములందు
నాశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాససీమ లెక్క
యువని "ఉమ్రాలిషా కవి" యనఁగ నేను.

ఉ. రాజులఁజూచితిన్ సుకవిరాజుల నొర్చితిఁ జేరఁబ్రోయు, రా
రాజుల యోలగంబున విరాజిత పండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మాలపీబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేశమునీఱ సభ్యుఁడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వ రసైక చారు వి
న్యాసములుఁ మతాంతర మహాపరివర్తన తత్త్వ సూపకో
పానసముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను 'ఉగ్రమలిపా' కవీంద్రుఁడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ నెక్కి మతిని చక్కాడి యూడి
బోధించితిని జ్ఞాన సాధన క్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పిచెప్పి
సవరించితిని పెద్ద సారస్వతంబును
శబ్ద శాస్త్రంబులు చదివిచదివి
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్లప్ర
భుత్వంబు ముంగర మోపిమోపి

గీ. ఇప్పుడప్పుడె నలువదియేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాఁటికైన
శాంతి గలుగదు నీకథాధ్వాంతమందు
జీవితము తెన్ను నుడిబోవు నావఁబోలు.

ఉ. ఏను హిమాలయంబుపయి నెక్కి తపస్వులఁ జూచి వారి వి
జ్ఞానములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాఁడ నా
నా నవకావ్య మార్గములనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడు నట్లు దృశంబు మార్చుచున్.

---

# వఝ్ఝుల చిన సీతారామస్వామి శాస్త్రి

## 1878

ఆరామద్రావిడ శాఖీయుఁడు. తల్లి: వేంకటాంబిక. తండ్రి: ముఖలింగేశ్వరుఁడు. నివాసము విశాఖపట్టనము. జననము: 1878 జూను 25వ తేదీ, బహుధాన్య సంవత్సర జ్యేష్ఠ బహుళ చతుర్థి. గ్రంథములు : ౧. చింతామణీ విషయ పరిశోధనము. ౨. వైయాకరణ పారిజాతము ౩. కర్ణచరిత్రము ౪. మార్గోపదేశిక ౫. స్త్రీవివాహవయోనియమనము. ౬. వీరసింహుఁడు [కావ్యము] ౭. బాలసరస్వతీయ, అథర్వణకారికావళి, హరిశ్చంద్రనలోపాఖ్యానాది గ్రంథములకు భూమికలు.

సీతారామశాస్త్రిగారిలో మహావిమర్శకునకుండవలసిన లక్షణములు సంపూర్ణముగ నున్నవి. కావున వీరు లక్షణవాఙ్మయమున కఖండమగు సేవ గావింపఁగలుగుచున్నారు. తమ సిద్ధాంతములపై రాద్ధాంతములు పత్రికలలో వెలువడుచుండును. వానికి సాధారణముగాఁ బ్రతివిమర్శనములు ప్రకటించుటకు వీరిచ్ఛగింపరు. తానొకధోరణిలో వ్రాసికొనిపోవుచు, వచ్చిన ‘ టపా ’ కూడఁ బరికింపఁడని వీరినిగూర్చి చెప్పుకొందురు. అంత యేకతానత! వీరిమేధ నిరంతరము నాలోచనానిమగ్నము. ఐరోపామహాసంగ్రామము వారి కలజడి కలిగింపదు. ప్రత్యేకరాష్ట్రాందోళనము వారి చెవుల కెక్కదు. వారి పరిశోధనమే వారిది. తెలుఁగు వ్యాకరణముల యాస్తికతకు వీరు పెట్టినది భిక్ష. పాణినీయము, ముగ్ధబోధము మున్నగు సంస్కృతవ్యాకరణములు పరిశ్రమించి పఠించినవారగుటచే బాలవ్యాకరణ-చింతామణ్యాదులు బాగుగా విమర్శించి నిగ్గు వెల్లడింపఁ గలుగుచున్నారు. వీరు రచించిన “ చింతామణీ విషయ పరిశోధనము ” వలన వీరి విశ్వతోముఖాంధ్ర వ్యాకరణ సమీక్షాపాటవము సుస్పష్టమగుచున్నది. చింతామణికిఁ బూర్వము తెలుఁగు వ్యాకరణములు లేవని వీరాధారములు చూపిరి. “ వైయాకరణ పారిజాతము ”

తోలిసంపుటము ఆంధ్రవిశ్వవిద్యాలయము వెలువఱిచినది. ఇది సమగ్రముగా వ్రాయఁబడినచో శాస్త్రిగారి యభిప్రాయ వ్యక్తీకరణమునకు నిలువుటద్దము వంటిది కాఁగలదు. వీరి యభిప్రాయ సామ్రాజ్యమున నన్నయభట్టారకునకుఁ బ్రాజ్యగౌరవమున్నది. అతని శబ్దశాసన బిరుద పౌర్వాపర్య విషయమునఁ బ్రచురించిన వీరి సిద్ధాంతములు మెచ్చుకోలు పడఁదగినవి.

బాలసరస్వతీయమునకు, అథర్వణకారికావళికి, హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వీరు వ్రాసిన పీఠికలు విపుల విషయములను జర్చించుచున్నయవి. వీరి యొక్కొక పీఠిక యొక్కొక గ్రంథము. సమాజ సారస్వతమునఁగూడఁ గొన్నాళ్లు వీరు పరిశ్రమము సలిపిరి. "స్త్రీవివాహ వయోనియమము" దీనికి సాక్షి. "రజస్వలానంతర వివాహమే ధర్మశాస్త్రముచే నుత్తమకోటి నధిరోహించుచున్నది. ప్రకృతమున ఋతుమతీ వివాహ మంతరించిన మాత్రమున నది యాపత్కల్పమనుట యసంగతము. శారదాబిల్లు క్షేమకరము." ఇది సీతారామశాస్త్రిగారి యాశయము. సమాజముగా నీయనకు వైదిక కర్మనిష్ఠ తక్కువ. కర్మిష్ఠులనిన గౌరవము లేనివారు మాత్రము కారు. వ్యావహారికవాదము నిష్టపడరు. కాని, వ్యావహారికముపై కత్తినూరువారి నొకపట్టుపట్టును. గిడుగువారి 'ప్రాఁదెనుఁగుకమ్మ' పై 'అంపగమి' వెలువిన పడింతుఁడీయనయే.

పెక్కేండ్లు విజయనగర సంస్కృతకళాశాలాంధ్ర పండిత పదవి నిర్వహించిరి. అప్పుడే వీరిమూలమునఁ బెద్దశిష్యులు బయటఁబడిరి. స్వర్గీయులు దూసిరామమూర్తిశాస్త్రిగారు వీరి శిష్యులు. ఆయనరచించిన "బాలవ్యాకరణ సారస్యసర్వస్వపేటిక"లో "వజ్ఝుల వారిశిష్యుఁ" డన్నవిషయము పుట పుటకుఁ దట్టుచుండును. విజయనగరసంస్కృత కళాశాలలోనే యుద్యోగించి విశ్రాంతి గయికొనుచున్న ఆకొండి వేంకటశాస్త్రిగారికి వీరు గురువులు. ఆంధ్రవిశ్వ విద్యాలయముచే నేఁ డాదరింపఁబడుచున్న

పండితులు శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు వజ్ఝలవారి యను యాయులు. ఈ తీరున నెందఱో మన శాస్త్రిలుగారి యాచార్యకముచే విద్వత్ప్రదవులలో నున్నారు.

వీరు చెన్నపురి విశ్వవిద్యాలయాంధ్ర భాషాపరిశోధకసభ్యులు, ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర పరిశోధకపండితులు నై ప్రతిష్ఠ సంపాదించినారు. విశ్వకళాపరిషత్తు నుండి విశ్రాంతితీసికొని ప్రస్తుతము వ్యాకరణ సమగ్రతా రచనకుఁబూనుకొని యున్నారు.

ఈయన కాంగ్లభాషాప్రవేశము లేక పోయినను, పాశ్చాత్య విమర్శన విధానములు తెలియును. వసుచరిత్ర విమర్శనములో నిది తెల్లము కాఁగలదు. వీరివ్యాకరణ శాస్త్రపరిశోధనము నేఁటి భాషాతత్త్వశాస్త్రము ననుసరించియుండును. కవిత్వము కూడ వ్రాయఁగలనని 'వీరసింహుఁడు' కావ్యముగాఁ గట్టి చూపిరి. శ్రీశాస్త్రిగారి పితామహభ్రాతృసుతుఁడైన చింతామణిశాస్త్రి యుపదేశమహత్త్వము, మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి యుపదేశ మహత్త్వము వీరిలోఁబడి ఫలవంతము లైనవి. తెలుఁగు వ్యాకరణముల కొఱకే యవతరించిన విచక్షణులు సీతారామస్వామి శాస్త్రిగారు!

---

# కోటగిరి వేంకట కృష్ణారావు

## 1890

పద్మనాయక వంశీయుఁడు. గంపలగూడెము జమీందారు. కన్న తల్లి సుబ్బయ్యమ్మారావు. దత్తతగొన్న తల్లి: సుబ్బయ్యమ్మా రావు. కన్నతండ్రి: చిన్నయ్యారావు. దత్తతగొన్నతండ్రి: జగన్నాథరాయిణింగారు. జన్మస్థానము: నూజవీడు. జననము: 1890 సం. ఖర సంవత్సర ఫాల్గుణ బహుళ ప్రథమ. గ్రంథములు: ౧. శృంగార తిలకము. [ఆంధ్రీకృతి 1915 ముద్రి] ౨. యౌవననిగ్రహణము 3. చాటుపద్యములు ౪. శ్రీకృష్ణరాయనాటకావళి [అభినవ పాండవీయము–పాదుషాపరాభవము _ బొబ్బిలి–ప్రణయాదర్శము అను నాలుగు నాటకముల సంపుటము] ౫. మాతృదేశము ౬. విధి [పద్య కావ్యము] ౭. దేవదాసి [నాటకము] ౮. ఘోషావ్యాస ఖండనము [అముద్రితము].

జననం బందితిఁ గీర్తికెక్కిన సువంశంబందు; రవ్వంత స
జ్జన సాంగత్యము చేతనే తెలుఁగు బాసన్ జ్ఞాన మొక్కింత గ
ల్గెను; నన్నింకను స్వైరిణీరమణి పాల్సేయంగఁ బోకమ్మ, యౌ
వనమా! సాహస మింత కూడదు సుమా, బాగోగు లూహింపుమా.

ఈపద్యము 'యౌవననిగ్రహణ' మను చిన్నపుస్తకము లోనిది.

సీ. కైత యందునఁ బ్రొద్దు గడపెద నందునా
భావనాశక్తి నీపైకి మరలు
వ్యాయామ మొనరింపవలె నను కొందునా,
యడుగులు నీ యుక్కయుండె చేరు
గ్రంథావలోకన కార్యంబుఁ దలఁతునా
చిత్తమ్ము నీయందు హత్తియుండు
హితదర్శనా యత్తహృదయుండ నైతినా
నీ రూపమే యెదుట నిలచియుండు

నవయవములే పరాధీన మయ్యెనాకు
నింక నాస్థితి నీవ యూహించు కొనుము
యీావు మాత్రము వేఱె యూహింపనేల
పడఁతి! నాయుల్లి స్వానుభవంబు గాదె!

ఈపద్యము 'చాటుపద్యములు' అనుచిన్న పొత్తమునందలిది. పై యౌవననిగ్రహణము, ఈ చాటుపద్యములు అను రెండుకృతులే కాక 'శృంగారతిలకము' అను కృతితో మొత్తము మూఁడు శృంగారగ్రంథములు కోటగిరి వేంకట కృష్ణారావుగారు రచించిరి. ఈమూఁడును వీరి తొలికృతులు. ఇవి చదివినవారికి కృష్ణారావుగారు శ్రీనాథుని వంటి వాఁడని యనిపించును. చాటుపద్యములను బట్టి స్వభావమును లెక్కించుట కొందఱి యభిప్రాయము. క్రీడాభిరామమును బట్టి శ్రీనాథుఁడు పచ్చిశృంగారి యని మనము నిశ్చయించివైచుటకు వీలుపడదు.

శృంగార – వీరములే కవి కుపాస్యములైన రసములు. మన కోటగిరి శృంగారరస మెంతసొగసుగాఁ గవితలో జాలువాఱించెనో, వీరరస మంతకు మిగులఁగా బ్రదర్శించెను. పాదుషాపరాభవము, బొబ్బిలి యను వీరినాటకములు చూచినవారి కీ రహస్యము తేలిపోవును. ఈ కవి సామాన్యుఁడు కాఁడు. గంపలగూడెము జమీాందారయి బహుమహాకవులను గౌరవించుచున్న కవి. నాటకాంతకవిత్వము వ్రాసిన మహాకవి. ఈయన కవిత కింత బిగువులుగువులు వచ్చుటకుఁ బూర్వజన్మసుకృతమే హేతువు. ఏ మహావిద్వాంసుఁడు వాడలేని యటులు మంచి పాంకముగాఁ బింకముగాఁ బదసంధానముగావించును. సమాసభూయస్త్వము వీరికవితకుఁ దఱచుగా నుండు గుణము. ఆ గుణము వీరరస భరితములైన వీరినాటకములు కొన్నింటికి గొప్ప రమణీయత నిచ్చినది. 'శ్రీకృష్ణరాయనాటకావళి' యనుపేర వీరు రచించి పకటించిన నాలుగు నాటకములు చాలగొప్పవి. వీనికి శ్రీ విశ్వనాథ

సత్యనారాయణగారు మహోదాత్తమైన పీఠిక వ్రాసినారు. దానియందు సర్వవిషయములు విమృష్టములు. 'బొబ్బిలి' లోనున్న పద్యములు కొన్ని యేప్రబంధకవులు వ్రాయ నేరని తీరులలో వీరువ్రాసిరి.

సీ. ఆత్మగౌరవ రక్షణార్థమై యుసురు త్రృ
ణప్రాయ మంచుఁ బెనంగవలయు
వెల్మ కుల ద్వేషి విజయరాముని సంహ
రింపఁ గంకణము ధరింపవలయుఁ
బాశ్చాత్యసేనకు భరతపుత్త్రుల బలో
ద్రేక మింతూరి బోధింపవలయుఁ
జచ్చియో పగతుఁజ్రచ్చియో దశదిగ్వి
కద యశశ్ఛట వెదచల్లవలయు

గీ. మరణ మున్న దొకప్పుడు మానవులకు
సద్యశం బొక్కటే చిరస్థాయి గాన
యుద్ధరంగాని కుఱుక సన్నద్ధ పడుఁడు
దళిత పరిపంధులార! ఓవెలమలార!

శా. వాలున్ డాలును గేలఁ గీల్కొలిపి దుర్వారాహవ ప్రాభవో
ద్వేలాభీల కరాళ విక్రమ కళావిస్తారులై భారతీ
యాలోక ప్రతిభావిశేషమున రాజ్యస్థాపనోత్సాహులై
లేలెండీ! యిఁక వెల్మవీరులు యశోలేశంబు నాసింపుఁడీ!

* * *

సీ. హైదరు జంగు పాదాశ్రయ మొనరించి
దురముఁ గల్పించిన ద్రోహబుద్ధి
యున్నంతలోఁ దృప్తి నొందక వెలమరా
జ్యం బేలఁ గోరు దురాశయంటు

ఖండాంతరుల మైత్రిఁ గావించి భారతీ
యుల కెగ్గు రోసిన తులువతనము
పద్మనాయకకుల ప్రాభవ ధ్వంసనో
పాయ పంకిలమయా పాపవృత్తి
గీ. యొకట్రైపై విధిబలము చేయూఁతనొసఁగ
తాంధ్రకులుఁడు నిమిత్తమాత్రంబుగాఁగ
నీదు వధ విధానంబును నిర్వహించు,
నాత్మ సంరక్షణోపాయ మరసికొనుము.

* * * *

మ. తిరమానేనియు రామరాజు వరరక్తస్నిగ్ధ కాషాయ వి
స్ఫుర దాభీల తను ప్రకాశితుఁడనై చూపట్టునన్ దాఁకుఁ డో
పరివంధుల్ ! చవిగొంద్రు తాంధ్రకుల పాపారాయ బాహాభయం
కర శాస్త్రీయ రణ ప్రభాకలిత తీక్ష్ణక్రోధ విక్రాంతినిన్.

# వేంకటాద్రి అప్పారావు

## 1893

నూజవీడు సంస్థానమునకు సంబంధించిన 'ఉయ్యూరు' జమీందారు. పెంచినతండ్రి : శ్రీరాజా రంగయ్యప్పారావు, వెలమవంశీయులు. నివాసము : నూజవీడు. జననము 1893 ఏప్రిలు 29 వ తేదీ. గ్రంథములు: గోవర్ధనోద్ధారణము, దుర్యోధనాంతము, పృథ్వీరాయుని యంతము, స్నేహలత, శ్రీశోభనాచలమాహాత్మ్యము, జ్యోతిర్లీల, ఆంధ్రాష్టపదులు-ఇత్యాదులు.

ఉయ్యూరు సంస్థానాధిపతులు రంగయ్యప్పారావుగారి సంస్కృతాంధ్రభాషాభిరతి కొంతప్రసిద్ధమైనది. 'సర్విస్'లో వారు గడిదేరిన విద్వాంసులట. ఆవాఙ్మయమున బ్రసిద్ధినందిన "షాహనామా" యను చరిత్రగ్రంథము కొంతభాగము నాంధ్రీకరించి ప్రకటించుట యందులకుఁ దారకాణ. వీరి తరువాత వేంకటాద్రి అప్పారావుగారు సంస్థానమునకు వచ్చిరి. ఈయనకుఁ గవితాధార నిసర్గముగాఁ బుట్టినది. ఆకారణమున వట్టి 'మెట్రిక్యులేషన్' పరీక్షాపాఠ్యములతోఁ దృప్తిపడక సంస్కృతాంధ్రములు చదువుకొనవలసిన శ్రద్ధ కలిగినది. గురుముఖమునఁ గొంత వఱకుఁ బఠించి వలయు పాండిత్యమును గలిగించుకొనిరి. ఆపిమ్మట గోవర్ధనోద్ధారణము, శోభనాచలమాహాత్మ్యము, జ్యోతిర్లీల మొదలగు నాటక-కావ్యాదులు రచించెను. ఈయనకు నాట్యము, జ్యోతిషము, చిత్రకళ, సంగీతము మొదలగు విద్యలలో మంచిప్రవేశమున్నది. ఈకళ లెల్ల వీరిని స్వయంవరించినవి. చిత్రకళలో వీరికిఁగల స్వాజనశక్తికంటె నభిమానము హెచ్చు. కవితావిషయమున వీరు గావించిన పరిపుష్టికంటె రచనాసృష్టి యున్నతస్థానమున నుండఁదగినది. వీరి సంగీతసాహిత్యాభిమానములకు 'ఆంధ్రాష్టపదులు' దృష్టాంతము. ఇటీవల నందమైన

యాకృతిలోఁ దీర్చిదిద్ది యాంధ్రి కర్పించిరి. వచస్సందర్భశుద్ధి నెఱిఁగిన జయదేవుని మధురగేయములను దెనుఁగుఁబాటలుగాను, శ్లోకములను బద్యములుగాను మార్చి 'ఆంధ్రజయదేవుఁ' డనిపించుకొన్నా రప్పారావుగారు. ఈ రాజకవి రసోత్సేకమైన రచనా రామణీయకమున కీపద్యము సాక్షి:—

జారెన్ బిల్లనగ్రోవి చేసడలి కన్సైగన్ వ్రజస్త్రీతతిన్
ఓరం దోల్గగ కన్బొమ్మల్ మెలచి యెంతో భీతి లేకెమ్మటల్
గారన్ నన్గని సిగ్గు చిన్నగవున్ గన్నోద్దుప్ప తబ్బిబ్బులన్
దోరంబా హరిఁ జూడ లోఁగలఁగె సంతోషంబు రోషంబునున్.

తెనిఁగింపు పొందికగా నుండి యింపు పుట్టించుచున్నను నాత్మప్రత్యయము చాలక "ఆ జయదేవునక్కవన మాధుర్య శైలియు భావరక్తియున్ సైజ మనోహర ప్రతిభ నా తెనిఁగింపునకెట్లు వచ్చు?" నని వినయముగాఁ జెప్పుకొన్నారు.

ఈయన రాధాకృష్ణప్రేమోపాసకుఁడు. వీరి చిత్రకళా నికేతనము దీనికిఁ బతాక. రసికత నెఱిఁగిన కవి యాట శృంగారరసవిలసితములైన యితివృత్తములే వీరి రచనలకు సమధిక ప్రోత్సాహమిచ్చినవి. వంశము పౌరుషవంతమైనదగుట వీరగాథలు కూడ వీ గేలుకొని కబ్బములుగాఁ గూరిచినారు. ఎఱ్ఱపంచె కట్టి, తెల్లని పొట్టి చేతులచొక్కా తొడిగి, చిన్న తువ్వాలు పయిని పడవైచికొనియుండు నీ భాగ్యవంతుని వేసము దేశమున కొరవడి. ఈయన జ్యోతిర్లీల నాటకము మొదట నిటులు చెప్పుకొనెను.

సీ. కన్నారు నన్ను వేంకటరంగయప్ప రా
యలు నారయామ్మ నిర్మల విభవులు

రాజ రంగయ్యప్పరాయ బహద్దరు చెల్ల
యామ్మ ప్రేమను బెంచి రధిపదవికి
ధీరతా ధీయుతా సారంబు గూర్చిరి
గురువర్యు లెందఱో కోవిదులును
మత్స్యాభవార్థసమ్మతులు నయ్యార్యాది
బహుజనపదవాటి రహితుకోటి.

గీ. వంశవర్ధనుల్ సుతులను వరతిసయుల
నేలు గృహవర్తి వేణుగోపాలమూర్తి
వేంకటాద్ర్యప్పరాయఁడ, విశ్వ సుజన
హిత విధేయుఁడ వైష్ణవమతపరుండ.

1927 సం॥ లో కాకినాడయందు జరిగిన ఆంధ్రసాహిత్య పరిష ద్వార్షిక మహాసభకు వీ రధ్యక్షులుగా నుండి నెఱపిన యుపన్యాసము తెనుఁగు భాషకుఁ గైనేఁత.

# గురుజాడ వేంకట అప్పారావు

## 1865–1915

నియోగిశాఖీయులు. నివాసము: విజయనగరము. రచనలు:- ౧. కన్యాశుల్కము ౨. కొండుభట్టీయము 3. బిల్హణీయము ౪. ముత్యాలసరములు – చిన్నకథ ౫. నీలగిరిపాటలు ౬. సుభద్రాపరిణయము [అముద్రిత ప్రబంధము] మున్నగునవి.

అప్పారావుగారిని 'గురుజాడవాల్మీకి' యనికూడ వ్యవహరింతురు. వాస్తవమున కాయన నవీనాంధ్ర వాఙ్మయమునకు వాల్మీకివలె నాది కావ్యము రచించి పోయినాఁడు. ఆ యాదికావ్యము కన్యాశుల్కము. అది దృశ్యకావ్యమే యైనను 'శ్రీమద్రామాయణము' వలె నేఁడు పారాయణగ్రంథమై యున్నది. 'ముత్యాలసరములు' తీసికొని వచ్చిన వారప్పారావుగారు. ఆదికవి నోటినుండి "మానిషాదప్రతిష్ఠాం త్వ" మ్మనుఛంద స్సప్రయత్నముగా వెలువడినటులు గురుజాడ కవినుండి యపూర్వవృత్తములు వెలువడి లోకమును గదలించినవి. ఆ యీ కారణములు చూచుకొని యప్పారావుగారిని 'వాల్మీకి' యని యందురు.

౧౯౧౪ సం॥లోఁ బ్రభుత్వము సంస్కృత భాష యొక్కయుఁ దత్సంబంధులైన యితరభాషల యొక్కయుఁ బరిశోధనమున కొక పండితపదవి నియమించినది. ఆపదవికి మనదేశమునుండి దరఖాస్తులు వెళ్ళినవి. దరఖాస్తు పెట్టినవారిలో నెవ్వరు సమర్థులు వారికిఁ గనఁబడలేదఁట. వయోనియమమును బట్టి గిడుగు రామమూర్తి పంతులుగా రా స్థానమునకుఁ బోవ పిలుపడలేదు. మఱి, తెలుఁగువారి కేరికిని తత్పదవి దొరకలేదు. ఏయఱవయో, ఏకన్నడియో యా స్థానము నలంకరించి యాంధ్రభాషాతత్త్వమును బరిశోధించుటకు సిద్ధపడును. సిద్ధపడుటయేకాదు, తెలుఁగు భాష దేశభాషలలో నక్కఱ

మాలినదిగా నతఁడు సిద్ధాంతము చేయును. ఈవిషయమున అప్పారావు పంతులుగా రెంతో సంతాపపడి తెలుఁగుచదువరి కొఱకు బహుయత్నములు చేసిరి. కడకు, బధిర శంఖారావము!

శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారికి వ్యావహారిక వాదమునఁ గుడిబుజముగాఁ బనిచేసిన వ్యక్తి అప్పారావుగారు. రామమూర్తిగారు లక్షణము—అప్పారావుగారు లక్ష్యము. వీరి కన్యాశుల్కము, ముత్యాల సరములు రామమూర్తి పంతులుగారికి నాఁడు వాదాధారములైనవి. గురుజాడ కవి పిండలి కట్టిన రసజీవనసీమ కన్యాశుల్కము. వీరివలన 'గిరిశము' శాశ్వతుఁడాయెను. గిరీశము నేఁటికి తెలుఁగు నాఁట జాతీయములుగాఁ బాదుకొనెను. అప్పారావుగారికి వేఱే పేరు లేదు, 'గిరీశమే' ఆయన పేరు. సమాజజీవనమున కింత దగ్గఱగానుండి, గుండియలకుఁ బట్టుకొను వీరిరచన వేఱొకరికి లభించుట సంభవము కాదు. కన్యాశుల్కమునకుఁ బూర్వము సాధారణముగా 'కంపెనీకవులు' నాటకములు రచించుచుండువారు. ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయముల నెఱిఁగిన అప్పారావుగారివంటి వారు నాటకరచనకుఁ బూనుకొనుట సంఘమునకు మంచి మేలిచ్చినది. కేవలము సంఘసేవయే యీరచనలోఁ గలయుద్దేశము. ఇది క్రమముగా సారస్వత పరిణామమునకుఁగూడ దారితీయించినది. గిరీశము పలుకుబళ్ళు పెక్కులు తెలుఁగువారిలో నామ్నాయములుగా నుండుటకు అప్పారావుగారి కలములోఁగల నైసర్గిక ప్రతిభ హేతువు. ఇదిగాక కొండుభట్టీయము, బిల్హణీయము ననురచనలు వీరివి మఱిరెండున్నవఁట. విజయనగరము మహారాజ్ఞిని నవ్వించుటకు 'కొండుభట్టీయము' రచించుచుండెడివారని చెప్పుదురు. ఏలికయగు నారాణి యీహాస్యములో నాయాఘట్టములు విన్నపుడు మహానందము పొందుచుండెడిదఁట. 'బిల్హణీయము' కొంత భాగము ప్రచురితమైనది. శృంగార ప్రధానమైన యితివృత్తము తీసి

కొని వ్యావహారికములో గొప్పతీరుగా వీరీనాటకము వ్రాయుటకు దొరకొన్నారు. కాని పూర్తి కాలేదు.

విజయనగర రాజ్యమునకు సంబంధించిన కీవులు, నాఁటి విశేషములు నెన్నో కథలుగా, కావ్యములుగా వీరువ్రాయుటకు సంకల్పించికొని రని తెలియుచున్నది. పంతులుఁగారికి తెలుగునాటకరంగమును నూతన విధానములతోఁ దీర్చి దిద్దవలయునని గాఢాభిలాషయున్నటులు స్పష్టపడిన సంగతి. విజయనగరము మహారాజు ఆనందగజపతి నిరంతర సాహిత్య వ్యాసంగి. ఆయనకు అప్పారావుగారు హృదయము. ఆనందగజపతి యానందమునకు నాటకములు వ్రాయవలెనని అప్పారావుగారి తలఁపు. ఈతలఁపుతో నీయన నాటకరచన కుపక్రమించినను, క్రమముగాఁ బుణ్య వశమున నది యాపదాంధ్రమునకు ఆనందకారణమైనది. గ్రీకు, రోమన్, ఇంగ్లీషు నాటకములు నిశితదృష్టితోఁ బరిశీలించుచు, నెప్పుడును నవ్య తకుఁద్రోవలు చూచు నలవాటు అప్పారావుగారిలో నున్నటులు విన్నాను. ఆయనవ్రాసికొన్న "డైరీలు" చాలభాగము శ్రీ బుర్రా శేష గిరిరావుగారు ప్రకటించిరి. అది గొప్ప మేలుసేఁత. ఈ దినచర్యలలో నెన్నోక్రొత్తవిషయములు గోచరించును. 1895 సం॥ ఏప్రిల్ 29 తేదీని వీరి 'డైరీ' యిటులున్నది. "నాటకములలో నాయికలు తక్కువ—వసంత సేన భోగముపిల్ల – భూమిక ఆకర్షణీయమే. కాళిదాసుని నాయికలు శృంగారమునకే ప్రసిద్ధి — నాటకములలో దాంపత్య శృంగారమే — సంఘటనములు తక్కువ — నాయిక లేకుండా నాటకము — గ్రీకునాటక ములలో గ్రీకుల సాంఘిక పరిస్థితులు — ఇంగ్లీషులో ఆంగ్లులవి — ఇండి యను నాటకములలో హిందూపరిస్థితులు కనఁబడతవి."

నటకులను గూర్చి, అభినయమునుగూర్చి రంగస్థలమును గూర్చి వీరు వ్రాసికొన్న యక్షరములు శిలాక్షరములుగా నున్నవి. ఇవి అప్పారావు గారి 'డైరీ'ల యందలివని శేషగిరిరావుగారు చూపిరి.

"వచనం సరసంగా, సహజంగా, యాసలేకుండా పాత్రోచితంగా చెప్పడము వీళ్లెవళ్లకీ తెలియదు. గబగబా స్కూలు పిల్లలు పరీక్షాధికారి యెదుట యేకరువు పెట్టిన ట్లంటారు. పందెంపెట్టి యెవరు ముందు ముగించుతారా అన్నట్లు చెబతారు. నిలుపులు సక్రమంగాఉండవు. యాసగా ఉంటుని. మదరాసీలకు దీర్ఘోపన్యాసాలూ, పాటలూ తప్ప మరియేవి నుడి కెక్కవు. కేవలం వచననాటకి మంటే వీ రా స్మరంతికే పోరేమో!" "నాటకపుజట్టులోనికి పడుపు కన్యలను చేర్చుట చాలా ప్రమాదకరమని నాభావం. అంతకత్తెయై తెలివైన నటి పడుపుకన్యయైతే సంఘమునకు చాలా ముప్పు తేగలదు. ఆమెకు ఎన్నికైన సౌందర్యం లావణ్యం నాగరికతా వుంటే కలుగగల అల్లర్లకు మేర వుండదు."

"బాలామణి జట్టులో దుష్యంతుడుగా బాలామణిచెల్లెలు వచ్చింది. రూపము వికారంగా ఉంది. నడక రంగేలాతనంగా ఉంది. కంఠం విప్పితే ఆడది అని తెలిసిపోతూ వుంది. బాలామణి తప్ప ఆ జట్టులో చెప్ప తగ్గ మరివొక మనిషి కనబడలేదు. కల్యాణరామయ్య జట్టులో దుష్యంతుణ్ణికూడా చూస్తిని. అతని వేషం మరీ పాడుగా వుండెను. అట్టి మనిషి కావేషం ఎందుకు వేసిరా అనిపించినది. అతడే వాళ్లలో 'హీరో' కాబోలు. నల్లగా లేడు కాని అందమైనవాడు కాడు. వేషం మీద రూపం అందంగా కనబడేటట్లు చేసుకోవడం కూడా ఎరిగినట్లు తోచదు. సాక్సు, నల్ల ట్రౌజరు, కోటూ వేసుకుని మిలటరీ ఆఫీసరులాగ దిగబడ్డాడు. తలమీద టోపీ కూడాను. చిన్న పలుచని మీసకట్టూ, నుదుట తిరుచూర్ణమూ—నూవేపు సాతానిభిక్షువుని జ్ఞాపకమునకు తెచ్చినది. మూతి కొంచెం ముందు కుంటుంది. మీదిపెదవి గుండ్రము; పెదవులలో ఇముడని పొడుగుపళ్లు—ఇట్టి ముఖములో లావణ్యము గాని చురుకుతనముగాని యేలాగు కనబడవు! ఈతనిలో ధీమాగాని,

చలాకీగాని, పౌరుషంగాని వెతికితే కానరావు. వేషంలో మోటుతనము గాని యుక్తతయేమీ లేదు. ”

ఇది యిటుండఁగా, 1895 సం॥లో అప్పారావుగారు చమత్కారము నకు వ్రాసికొన్న కొన్ని 'డైరీ' లోనివిషయములు శ్రీ శేషగిరిరావు గారు వెలువరించినవే మనయుపయోగార్థము చూపించెదను. నిజమునకు, వారిచరిత్రమునుగూర్చి తెలిసీ తెలియని సంగతులువేర్కొనుట కన్న, వారివ్రాఁతలే యిచట నుదాహరించుట వినోదముగానుండును.

“ 19.4.'95' పదిహేనో తేదీని ఒకసంగతి జరిగినది. తలుచుకుంటే నవ్వు వస్తున్నది. పచ్చయ్యప్ప కాలేజీలో మీటింగుకు వెళ్ళి యింకా కొంత వ్యవధి ఉంటే “ యీవినింగు బజారులో తచ్చాడుతూ ఉంటిని. ఒకపుస్తకాల స్టాలువద్ద వుండఁగా ఒక బికారివాడివంటివాడు వచ్చి ఆ అంగడివాని కొక కళ్ళజోడు అమ్మజూపినాడు. అతడు రు. 1-6-0 యిస్తానంటే వాడు రు. 3/- యిమ్మన్నాడు. నేను రు. 1-8-0 ఇస్తా నంటిని. వాడు కొంచెం గొణుగుకొని యిచ్చివేసినాడు. అది వెంటనే కళ్ళకు పెట్టుకొని చూస్తిని: సరిపడలేదు. ఎట్లు సరిపడును ? నా కప్ప టికి చత్వారమూలేదు. హ్రస్వదృష్టీలేదు. బూట్సూ, స్పెక్టెకిల్సుతో యేదో లేనిఘనత వచ్చినట్లు మహాదర్జాగా అవి కళ్ళకు వుంచుకొని కాలేజీలోకి వెళ్ళపోయినాను. కాని ఆ కళ్ళజోడులో దూరపుచూపున కొక ముక్కా, చదవడమున కొక ముక్కా అతికివుండడముచేత దృష్టి చెదిరి మెట్ల మీదనే ద్వారములోనే జారి చాలా హాస్యాస్పదముగా చతికిల బడిపోయినాను ! ”

“ముఖమునకు కనుబొమలు కొంత అందం యిస్తవి. పొటకరించు కొని బొద్దుగా ఉండేవి బాగుండవు. చర్మమునకు అంటుకొని పోయి నట్లుంటే క్రూరత్వమును సూచిస్తవి. అతి సున్నితముగా పెన్సిల్‌గీత వలె వుంటే చులకన మనిషి అని సూచన. క్రమముగా విల్లువలె వంగి

సాధారణవు దశనరి కలిగి కండ్లకు అతిదూరముగాగాని, అతిదగ్గరగాగాని కాకుండావుంటే అదీ ముఖమున కందమిస్తుంది. ఏక వరుసగా లయినుగా కాకుండా మెగుడుదిగుడుగా వుంటే తెలివితేటలను సూచించును."

"14 తేదీ మెయి : క్రిస్టియను కాలేజీలో కెల్లెటుగారిని చూస్తిని. ఒకగంట సేపు చాలసంగతులు మాట్లాడితిమి. * * * పోలికల్లూ భేదములూ నిరూపించుతూ గ్రీసు రోము రాజ్యముల చరిత్ర నన్ను వ్రాయమని వారు ప్రోత్సహించిరి. అది నాశక్తికి మించినపని అంటిని- 'కాదు - మీరు వ్రాయగలవారు' అనిరి."

అప్పారావుపంతులుగారీ తీరుగా నెన్నో సూక్ష్మాతిసూక్ష్మ విషయములు హృదయమునకుంబట్టించుకొని, మానసికతత్త్వములు గుర్తించుకొని 'డైరీ' లలో దాంచుకొన్నారు. విజయనగరము కళాశాలలోం జెక్కునాళ్ళు ఉపన్యాసకులుగా నుద్యోగించి, విజయనగరప్రభువు ఆనంద గజపతి మహారాజున కాంతరిక మిత్రుండై యాయన రాజయోగముతో మెలంగెను.

1895 సం॥ ప్రాంతములో పంతులుగారు మహారాజు సొంతపనులను నిర్వహించుటకును, ఔషధసేవ చేయుటకు మదరాసులో మకాము చేయవలసి వచ్చినది. ఆసమయమున వీరు క్రిస్టియను కాలేజి, ప్రెసిడెన్సీ కాలేజి, పచ్చయప్ప కాలేజి, బెంగుళూరు కాలేజి-యివన్నియుం జూచి యక్కడి ప్రొఫెసరులతో పాఠప్రవచనములను గూర్చి, విద్యావిధానములను గూర్చి చర్చలు సలిపి వచ్చిరట. వీరిసేవ విజయనగర కళాశాలా యశస్సునకు దివ్యసౌరభము.

ఎంతచులకనైన విషయమైనను లోతుగుండెతో విమర్శింపంగల అప్పారావు పంతులుగారు 'కన్యాశుల్కము' నట్లు వ్రాసెననంగా నబ్బురము కాదు. మానవసంఘములోని క్రుళ్లు కడిగి దేశమున కొక్క పవిత్ర సందేశము నందీయవలెనని యాయన యూహించెను. 'గిరీశము!

వలన సంఘసంస్కరణోద్యమము వేళాకోళము లోనికి దిగి దేశమున కుపకృతికి మాఱు అపకృతియే ఘటిల్లె" ననియు, "కన్యాశుల్క మసలు నాటకమే కా" దనియుఁ గొన్ని విమర్శనములు లోకములో నున్నవి. ప్రకృతమున కవి యక్కఱలేని సంగతులు. మన మొకటి యనుకొన వచ్చును. 'కన్యాశుల్కము' సాంఘికముగాఁ బెద్ద విప్లవమేమియుఁ గలిగింపఁ జాలలేదుగాని, భాషావిషయకముగా గిడుగువారి వాదమునకు మూదల యైనది. 'కన్యాశుల్కము' సంఘములోఁగూడ మంచి సంస్కృతి నిచ్చినదని యన్నచో నేను కాదనను. ఆ రచన, ఆ పాత్రపోషణము, ఆ జాతీయములు, ఆ సంవిధానము 'కన్యాశుల్కము'ను తెలుఁగు వారి జీవితములతో నభిన్నమును జేసివైచినవి. గిరీశము-రామప్పంతులు-కరకటశాస్త్రి-మధురవాణి వీరందఱు అప్పారావుగారి ధర్మమా యని చరిత్ర పురుషులు పురాణపురుషులుగా నయిపోయిరి. ఆయన కలములో సత్తి పాటవ మున్నది. కన్యాశుల్కము తరువాత వేదమువారి ప్రతాపరుద్రీయము కొంత ఖ్యాతిగడించుకొన్నది. ఎవరెన్ని వ్రాయునిండు! అప్పారావుగారిదే యావిషయమున నగ్రస్థానము.

కాఁగా, నవ్యకవిత్వమునకు 'నాంది' పాఠము చేసినకవి అప్పారావుగారే యని నూతన కవుల వ్యవహారము. "వైతాళికులను" మేలుకొలిపినవాఁ డనియు, మార్గదర్శియనియు, చక్కని వాడుకభాషను ప్రవేశపెట్టి ముత్యాలసరాలు కూర్చి భాషకు శాశ్వతోపకారము చేసిన వాఁడనియు నేఁటివారికి గురుజాడకవిమీఁద మంచి ప్రత్యయ మున్నది. "కొత్త పాటలమేలు కలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మఁగా" వీరి కవిత యువకహృదయములఁ గదలించినది. క్రొత్తతీరు వృత్తములైన ముత్యాల సరములతోఁ దెలుగునాఁట నొక సంచలనము రేఁగినది. అప్పారాయకవి నాశ్రయముగాఁ జేసికొని బసవరాజు, అధికార్ల వారు మున్నగా గేయములు పాడఁజొచ్చినారు. కథారూపముగా విషయము ప్రబోధించి దేశభక్తిని పుట్టించుటకు వీరి ముత్యాలసరములు తగినటు లుండును.

దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్! గట్టిమేల్ తలపెట్టవోయ్!

*

పాడిపంటలు పొంగిపొర్లే, దారిలో నువు పాటు పడవోయ్
తిండి కలిగితె కండ కలదోయ్, కండ గలవాడేను మనిషోయ్!

*

యీసురోమని మనుషులుంటే, దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు, దేశిసరుకులు నించవోయ్!

*

దేశాభిమానం నాకు కద్దని వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్,
పూని యేదైనాను వొకమేల్ కూర్చి జనులకు చూపవోయ్!

*

ఆకులందున అణగి మణగీ కవితకోవిల పలకవలెనోయ్,
పలుకులను విని దేశమం దభిమానములు మొలకెత్తవలెనోయ్!

ఈగీతములలో రసికమానసముల లోఁతులు కదలించు శక్తి యంతగా లేకున్నను, దేశీయులను మేలు కొలుపఁగలరక్తి యేదో యున్నది. మరల, నీ దిగువ గేయము పాడుకొనునెడు కొంత రొమదలోఁతులకుఁ జొచ్చుకొను గుణ మిా పాటలో నున్నది.

ప్రేమ పెన్నిధి, గాని యింటను
నేర్ప రీకళ, ఒజ్జ లెవ్వరు
లేరు, శాస్త్రము లిందు గూరిచి
తొల్చె మానము, నేను నేర్చితి
భాగ్యవశమున కవులకృపగని ;
హృదయమెల్లను నించినాఁడను

ప్రేమ యను రతనాల, కొమ్మా!
తొడవులుగ నవి మేన తాల్చుట
యెటుల నంటివొ, తాల్చి తదె, నా
కంట చూడుము! సతులకౌ రను
కమల వనముకు పతుల ప్రేమయె
వేవెలుగు!

ప్రేమ కలుగక బ్రతుకు చీకటి!

కవిత్వము రసికాధికారులకే కాక సాధారణులకుఁగూడ నుపకరింప వలయునని తలఁపు అప్పారావు పంతులుగారిలో నుండి వ్యవహారభాషలో నెన్నోగీతములు వారిచే వ్రాయించినది. వీరి 'నీలగిరి పాటలు' ప్రసిద్ధి లోనికి వచ్చినవి. వీరి పాటలు నాటకములు సంఘసంస్కారమున కుప యుక్తమగునటులు వ్రాయఁబడినవి. చాటుమాటులు లేకుండ నూటిగా అప్పారావుగారు చెప్పఁదలఁచిన విషయమును చెప్పఁగలరు. ఆయన పాటలతోఁగంటె "కన్యాశుల్క-నాటకము" తో నమృతకీర్తి నైనటులు భావించెదము.

విజయనగర కళాశాలలో పన్యాసకులు గాను, ఎస్టేటు ఎపిగ్రాఫిస్టు గాను, శ్రీమదానందగజపతి ప్రాణప్రాణముగాను, తెలుఁగుదేశములో నాదర్శవ్యక్తిగాను, నాటకకర్తగాను విస్మరింపరాని మహోదయులు అప్పారావుగారు.

# విశ్వనాథ సత్యనారాయణ

# 1893

వెలనాటి శాఖీయులు. తండ్రి : శోభనాద్రి. జన్మస్థానము : నందమూరు. నివాసము: బెజవాడ. జననము: 1893సం. గ్రంథములు:-నవలలు: ౧. వేయిపడగలు ౨. చెలియలికట్ట 3. మాబాబు ४. ఏకవీర ౫. జేబుదొంగలు ౬. హాహాహూహూ ౭. స్వర్గానికినిచ్చెనమెట్లు ౮. ధర్మచక్రము-ఇత్యాదులు. నాటకములు :- ౧. నర్తనశాల. ౨. సౌప్తికప్రళయము 3. అనార్కలీ ४. వేనరాజు. ౫. త్రిశూలము. ౬. కళింగరాజ్యము-ఇత్యాదులు. పద్యకావ్యములు :- ౧. ఆంధ్ర ప్రశస్తి ౨. ఆంధ్రపౌరుషము 3. గిరికుమారుని ప్రేమగీతాలు ४. వరలక్ష్మీ త్రిశతి ౫. శృంగారవీధి. ౬. విశ్వేశ్వర శతకము ౭. శశిదూతము ౮. ఋతుసంహారము. ౯. శ్రీమద్రామాయణ కల్పవృక్షము మున్నగునవి. పాటలు :- ౧. కిన్నెరసాని పాటలు. కోకిలమ్మ పెండ్లి, ఖండకావ్యములు, కథలు, వ్యాసములు మున్నగునవి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని నవలారచయిత లెఱుఁగుదురు. నాటకకర్త లెఱుఁగుదురు. ప్రబంధకవు లెఱుఁగుదురు. పత్రికాసంపాదకు లెఱుఁగుదురు. ఉపన్యాసకు లెఱుఁగుదురు. విమర్శకు లెఱుఁగుదురు. సనాతను లెఱుఁగుదురు. సంస్కర్త లెఱుఁగుదురు.

సత్యనారాయణగారు నేటి యాంధ్ర సారస్వతమున విశిష్టస్థానము నాక్రమించిన రచయిత. వీరికి నవీన వాఙ్మయముపై నెంత యభిమానమో, ప్రాచీన సాహిత్యములో నంత యభినివేశము. వీరి కవిత్వములో నాముక్తమాల్యదా కాఠిన్య ముండును; పెద్దనగారి ముద్దుపలుకుల పొందికయు నుండును. ప్రాయికరచన గ్రాంథికము. వ్యావహారికము నిషిద్ధము కాదు. నవ్యకవుల ఖండకావ్యముల ధోరణి చక్కఁగా సాగింతురు. గేయములు హాయిగా వ్రాయుదురు. శతకములు వ్రాసిరి. నేడు రామాయణము మహాప్రబంధముగా రచించుచున్నారు.

ఆంధ్ర భాషోద్ధారకులలో "కాశీనాథునివా" రెట్టివారో, ఆంధ్ర భాషా కవులలో విశ్వనాథవా రట్టివారు. నాగేశ్వరరావుగా రాంధ్ర సాహిత్య పరిషత్తును గౌరవించిరి ; నవ్యసాహిత్యపరిషత్తు బహూకరించిరి; కాంగ్రెసుతోఁ గేలు గలిపిరి ; మతిరియొక పక్షమును మర్యాదచేసిరి. మంచియే వారి కుపాదేయము. 'విశ్వనాథ' కవికిని సనాతనాథునాతన కవితల యందు సమభావమే. కాశీనాథునివారు శైవమతావలంబకులు. విశ్వనాథ వారి 'త్రిశూలము' దానికిఁ దారకాణము.

కవి వివిధవిషయ నివిష్టబుద్ధి కావలయును. అట్టివారు నేఁటికవులలో లెక్కకుమాత్రమే కలరు. వారిలో సత్యనారాయణ గారొక్కరు. నేఁడు ప్రాచీనకవితలను 'హూంష్' అనువారు కొందఱును, నవీన కవిత్వమును 'అబ్బే' యనువారు కొందఱును. వారికి రసాస్వాదకులలో గణన యుండదు. సారస్య మెచట నున్నదో యరసి దాని నాస్వాదించుట రసికధర్మము. పూర్వ- నవ్య విచారణముతో నతనికిఁ బనియుండరాదు.

పద్యము వ్రాయు కవి గద్యము వ్రాయలేకపోవచ్చును. గద్యము రచించుకవికిఁ బద్యము సాగకపోవచ్చును. గద్యపద్య రచయిత యైనను నాటకము రచింపలేకపోవచ్చును. నాటకకర్త విమర్శనశక్తి కలవాఁడు కాకపోవచ్చును. సర్వతోముఖసమర్థత కలవాఁడు దీక్షతో గ్రంథములు వ్రాసి లోకమున కందీయఁజాలక పోవచ్చును. ఇవన్నియుఁ బట్టినవాఁడు సమగ్ర కళాప్రపూర్ణుఁడైన జాబిల్లివంటివాఁడు. సత్యనారాయణగారు నవలారచయితలలో నేఁడు మంచి పేరు సంపాదించుకొన్నారు. ఆయన 'వేయి పడగలు' మెచ్చుకొని ఆంధ్ర విశ్వ విద్యాలయము వసదన మిచ్చినది. విశ్వవిద్యాలయముమెప్పు మనకక్కఱలేదు. అది యొక 'నవల' మాత్రము కాదు. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమునకు మాఱుపేరుగా వెలసిన గ్రంథము. దానిలో సత్యనారాయణగారి సారస్వత—సాంఘిక సిద్ధాంతము లన్నియుఁ గరడుగట్టి యున్నవి. గొప్ప యెత్తుగడతోఁ గడదాఁక

సూత్రవిచ్ఛిత్తి చేసికొనకుండఁ జూచుకొనుచు నిట్టి మహత్తరగ్రంథము సంధానించుట బహుకష్టమైన కృషి. ఈ కృషిలో వీరి ప్రాపంచిక విజ్ఞానము పంట పండినది. సత్యనారాయణగారి వచన రచనలో నాక క్రొత్తదనము, చిక్కదనము గోచరించును. తిక్కన పద్యరచనలో వలె వీరి రచనలోఁ గ్రియాపద బాహుళ్యము. ఎక్కడికక్కడ భావము తెగి పోయి పాఠకునిలో మెల్ల మెల్లగాఁ జొచ్చుకొనును. ఈయన భావన యగాధమైనది. దానిని భాషలోఁబెట్టునపుడు కొంత క్లిష్టతయనివార్యము. 'పాషాణపాకప్రభువు' అను ఖ్యాతి సత్యనారాయణగారికి వచ్చుటలో నర్థమున్నది. ఆయన శిరీషకుసుమపేశలముగా వ్రాసికొని పోవుచుఁ, బట్టరాని భావనాపథమునకుఁ బడినపుడు బ్రహ్మాండమువంటి సమాసము లుపయోగించును. ఆ యుపయోగము ప్రయత్నించి తెచ్చుకొన్నది కాదు. ఆయన కది యాజానజము. పద్య-గద్య రచనలు రెండింటను వీ రీయాచారముతో సాగుదురు. గమనింపవలసిన దేమనఁగా, పాఠకుని నిలఁబడనీయకుండ లాగుకొనిపోవుశక్తి వారి వచనములోఁ బ్రచురముగా జాలువాఱు చుండు ననుట. ఈ ధోరణిలో 'వేయి పడగలు' గాక మఱి తొమ్మిది పది నవలలు వీరు రచించిరి. 'చెలియలి కట్ట' సాంఘికము. 'ఏకవీర' పై నవలల మొదటఁ బసిబిడ్డయే, కాని విశ్వనాథవారి 'నవలా' సంతానములో నిది మొటికవంటి రచన. చరిత్రాత్మకమైన యీకూర్పులో అప్రసిద్ధములై యణఁగియున్న దేశమర్యాదలు పెక్కు పేర్కొనఁబడినవి. ఆంధ్రుల పరిపాలనము, వారిప్రతిభ యిందు రమణీయ దృశ్యముగాఁ గనఁబడును. కథాసంవిధానము, పాత్రపోషణము గొప్పవి. 'ఏకవీర' లో సందర్భోచితముగా వర్ణితమైన కూచిపూఁడి భాగవతుల భామ కలాపము, గొల్ల కలాపము సత్యనారాయణగారి ప్రాచీన కళాభిజ్ఞతకు గుఱుతులు. 'ఏకవీర' యే విశ్వనాథవారికి 'నవలా' కారులలో కుర్చీ వేయుంచి కూర్చుండఁబెట్టినది. తరువాత వేయి పడగలలోఁ

ప్రధానపీఠాలంకరణము. ఈ విషయమునఁ గొందఱు భేదాశయు లుండవచ్చును! 'చెలియలి కట్ట' లో రత్నావళిని సాహిత్యవేదినిగాను గవయిత్రిగాను వీరు చిత్రించిరి. శాస్త్రి రత్నావళికిఁ జదువు చెప్పె నని చెప్పుచు ఆంగ్లకవులు, ఆంధ్రకవులు, వివిధకావ్యములు మున్నగా నెన్ని సంగతులో జోడించిరి. ఏదో విధముగాఁ బ్రతికథనమునను సాహిత్య వాసన యనుబంధింపఁజేయుట వారి యలవాటు. వేయి పడగల లోని ధర్మారావు మహోత్తమాదర్శములుగల భాషావేత్తగాఁ జిత్రితుఁడు. అతఁడు ఆముక్తమాల్యద – పాండురంగమాహాత్మ్యము, భాగవతము మున్నగు తెలుఁగు గ్రంథములమీఁద లోతయిన చర్చలు చేయును. విగ్రహారాధనము, స్త్రీ స్వాతంత్ర్యము మొదలయిన సమస్య లెన్నో యిందు విమృష్టములు. ఆయా సిద్ధాంతములు ప్రదర్శించునపుడు సత్యనారాయణగారి కలము మంచి మెలఁకువతోఁ బొలపముగా సాగును.

విశ్వనాధవారి నాటకములలో 'నర్తనశాల' కు మంచిపేరు వచ్చినది. ఉత్తరా పాత్ర ప్రవేశ మీ నాటకమున కొక మెఱుఁగు తెచ్చినది. క్షేమేంద్రుని మెప్పింపఁగల యౌచిత్య శోభ సత్యనారాయణగారి రచన కందినది. అనార్కలీ, వేనరాజు, త్రిశూలము మధురనాటకములు. 'త్రిశూలము' ప్రారంభమున వీ రిటులు చెప్పుకొనిరి.

నన్ను నెఱుఁగరో! యీ తెల్లనాఁట మీరు
విశ్వనాథ కులాంభోధి విధుని బహు వి
చిత్ర చిత్ర ధ్వని బహు విచ్ఛిత్తి మన్మ
హాకృతి ప్రణేత సత్యనారాయణకవి.

నాటక నవలా రచనలలో నందెవేసిన యీ చేయి పద్యకావ్యరచనలోఁ గూడఁ బటుతరమైన పదవి నందుకొనఁగలుగుట విశేషము. సత్య నారాయణగారి ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము తొలినాళ్ళలోఁ బారా యణ గ్రంథములుగా నుండెడివి. ఎందఱికో యందలి పద్యములు కంఠస్థ

ములు. జాతీయ కవితాశాఖ నధిష్ఠించి కూసిన కలకంఠములలో విశ్వనాథకవి తొలివాఁడో, మలివాఁడో !

సీ. గోదావరీ పావనోదార వాఃపూర
అఖిలభారతము మాదన్నవాఁడు
తుంగభద్రానముత్తుంగ రావముతోడ
కవులగానము శ్రుతి గలయునాఁడు
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
శ్రేణిలోఁ దెన్గు వాసించునాఁడు
కృష్ణాతరంగ నిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలి పూజ సేయునాఁడు
అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి ?
విమల కృష్ణానదీ సైకతములయందు
కోకిలపుఁబాట పిచ్చుకగూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు.

'వేగిక్షేత్రము' పురావైభవము తలఁచుకొని విశ్వనాథకవి గుండె జల్లు మన్నది. ఆర్ద్రిమానసుఁడైన కవి కార్చిన వేఁడి కన్నీళ్లు కరళ్లుకటి యిట్టులు పద్యము లయినవి.

సీ. ఏరాజు వంచెనో యిచట శౌర్యపుఁ బాయ
సమ్ములు నాగుల చవితినాళ్ళ
ఏ మెట్టసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళఁ బారాణు లిడిరో,
చిత్రరథ స్వామి శ్రీరథోత్సవములో
తెలుఁగుపిల్లలు కత్తిత్రిప్పి రెపుడో,
ఏ రెండు జాముల యినుని వేఁడిమి వచ్చి
కలిసిపోయెనో త్రిలింగ ప్రభువుల

నాజగచ్ఛ్రేయసంబులై యలరు తొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్భితమ్మైన యీ భూమి ఖండమందు
నశ్రువులు జార్తు జీవచ్ఛవాంధ్ర జనులు.

*

ఇట వేఁగీశుల పాదచిహ్నములు లేవే! లేవుపో! భావనా
స్ఫుట మూర్తిత్వమునైనఁ బొందవు నెదో పూర్వాహ్ణదుష్కాలవుం
ఘటికల్ గర్భమునం దిముడ్చుకొనియెం గాఁబోలు నీవల్లచో
టట లోకాద్భుతదివ్య దర్శన మఁటే యాభోగ మేలాటిదో!

*

సీ. ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనం బుండి స్మృత్యర్థ మనెనో,
ఈ నా దృగావృతంబైన భూములలోన
నే శౌర్యధనులు శిక్షింపఁబడిరో,
ఈ నా శరీరమం దివతళించిన గాలి
యెంత పౌరాతన్య మేచుకొనెనో,
ఈ నా తనూపూర్ణమైన యాకాశమ్ము
నే క్రతుధ్వనులు శబ్దించినవియొ
అస్మ దజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్పు
నీ పునీతావనీఖండ; మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నా యాంధ్రశక్తి
నన్నుఁ గంపింపఁ జేయుచున్నది భృశమ్ము.

ఈ రకమైన కవితాశయ్య భావులకుఁగాని దొరకని భావపటుత్వము కలది. అన్వయములోఁ గొంత కఠినత, పదప్రయోగములోఁ గొంత బిగువు నుండుటచే 'విష్ణుచిత్తీయ' పాకము వలె వీరిది సుఖము మరగిన సుకుమారులకు ఆపాతమధురముగా నుండఁజాలదు. సత్యనారాయణ

గారు సంస్కృతవాణి నెంత స్వాధీనముఁ జేసికొని వాడుదురో, జాను తెనుఁగు కూడ నంత ప్రీతితో వాడఁగలరు. "మూఁగనోము" నుండి రెండు పద్యములు:—

బియ్యపు గింజలన్ జిగురు పేడిన గందపు వచ్చి బొట్టుతో
తియ్యని చిన్ని నీ నొసలి తీరులు కుంకుమ తీర్చి ముంగిలన్
తొయ్యలి! నోము చాటికలతో వసపాడిన ముద్దరాలు నీ
వయ్యెద వ్రాల నీవు నతి పట్టిన దీవన లీయఁ జూచెదన్!

*

నీ తెలిపట్టు చీర మెయి నీడలు పారి మసుంగు సంజ క్రొం
బూతల తెల్ల తే మొగిలుపోలిక వాలిక గాలిఁ దూలిపో
నేత బెడంగు కుచ్చెలలు నీ చిఱుకాళుల ముద్దు తోఁచెనో,
లేతపొరాడు పయ్యెద చలించిన వచ్చని తాళి తోఁచెనో!

ఈతీరుగా 'విశ్వనాథ' కవి కవితాహేతి రెండువైపుల వాఁడి కలది. శృంగారవీధి - శశిదూత్యము - ఋతుసంహారము ఇత్యాదులలోని కవితారీతిలో నీ రెండురకములైన రచనలు కనఁబడుచుండును. ఈయన వ్రాసిన నెన్నో కావ్యఘట్టములు భట్టి కావ్యమును జ్ఞప్తికిఁ దెచ్చు ప్రయోగములతో నిండియుండును. నేఁటి - నాఁటి సాధారణ కవులు, అసాధారణ కవులుకూడ వీరివలె ప్రయోగ వైచిత్రీవ్యామోహము కలవారు తక్కువ దాక్షిణాత్యులవలెఁ బ్రియతద్ధితులు వీరు. రామాయణ కల్పవృక్షము చూచి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారన్నారఁట చమత్కారమునకు: "ఈగ్రంథమునకు వైశ్వనాథ సాత్యనారాయణీయ—మని పేరు పెట్టుట బాగుగనుండు" నని — రామాయణ పీఠికలో వీరు వ్రాయుచున్నారుగదా,

నన్నయ్యయుఁ దిక్కన్నయు
నన్నావేశించిరి పరిణామా మనస్సం

ఘనృత వారలుపోయిన
తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచుఁ బోదున్.

నన్నయ తిక్కనల యొరవడి సత్యనారాయణగారి కవితకు శయ్యా సౌభాగ్యములోనా? భావనావైభవములోనా? యని మనసంశయము. అక్కడక్కడ నన్నయ్య తిక్కనల నడకతో నున్నకొన్ని పద్యములున్నవికాక! మొత్తముమీఁద సత్యనారాయణగారి కవితాశయ్యకు రామకృష్ణుఁడు - కృష్ణరాయలు - శ్రీనాథుఁడు - నాచన సోమనాథుఁడు వీరే యాదర్శ కవులుగాఁ దోఁచెదరు. ఇఁక, భావనావైభవములో వీరి దొక ప్రత్యేకత. "దీపితాలాతమువోలె నామది విలంబనమోర్వదు నిత్యవేగి నాచేతము శబ్దమేరుటకుఁ జిన్నము నిల్వదు భావతీవ్రతన్" అని రామాయణ పీఠికలో. ఇంతభావతీవ్రతగల కవి శబ్దము లేరుకొని శైలిచేయు పరమార్థ మనుకొన లేఁడు. అది యటుండె,

శ్రీ సత్యనారాయణగారి కవితాగురువులు చెళ్ళపిళ్ళవారు. వేంకటశాస్త్రిగారిని గూర్చిన యీకవి హృదయము మహోదారమైనది.

తనయొరవొల్ల మెత్తన కృతప్రతిపద్యము సంతకాలు మె
త్తన తనశిష్యులన్న నెడఁదం గలప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రు పర్వత శతారము సత్కవి చెళ్ళపిళ్ళ వేం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాఁడునన్.

*

అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతార ధిషణా హంకార సంభార దో
హల బ్రాహ్మీమయ మూర్తి శిష్యుఁడయినాఁ డన్నట్టి [illegible]
కలచాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళ్ళవంశస్వామి కన్నట్లుగన్.

ఈ రెండవపద్యములో సత్యనారాయణగారి కవితా[illegible] కట్టియున్నది. ఈ అహంకారము వాస్తవమైన [illegible],

కాదు. సత్యనారాయణగారి 'అహం' కారము కేవల కవితాపరము, లౌకికము నగు నర్థము కలదికాదు. ఆయన సత్యమైన 'అహం' పదార్థ జిజ్ఞాసకల వ్యక్తి. రామాయణ కల్పవృక్షము బాలకాండాంతమున నిట్లు విశ్వేశ్వర ప్రార్థనము చేసినారు.

అమరీ కైశిక పారిజాత కుసుమామోదాస్వాదు వీబాలకాం
డము నీభక్తుఁడు శోభనాద్రి దగు సంతానంబు జన్మాద్యపా
యము తప్పించుత! యెన్నిపుట్టువుల పెట్టితిన్ శివా! యేమికా
మము? కోపం బదియేమి? యేమియగునీ మాత్సర్యమోహాలో, ప్రభూ!

ఇది మెచ్చెదరో మెచ్చరొ
యిదియును జదివెదరు చదువరేలా నాక
య్యది? నామొద మీతో రా
చెద నద్దానికి ఫలంబుఁ జెందించు శివా!

హాళిఁ జరించుఁ గావ్యరచనాత్త యశఃకృత నాకసౌఖ్య వాం
ఛా లులితంపుటాత్మమె పొసంగదు నాదెసఁ బొందుగాక ము
క్త్యాలధరాధినాయకుఁ డదంతయు; నాతపమొల్లఁ బంతి యు
ద్వేలజనూరుజావితతి విచ్చెడినట్టు లనుగ్రహింపవే!

ఈవిధమైన కోరికతో 'విశ్వనాథ' కవి రామాయణము రచించుచుండె ననఁగా నది వట్టి కావ్యమాత్రముకాదు, రసాఖండమైన మహాకావ్యమునుగాదు, ఆధ్యాత్మిక తత్త్వమునకు మహాభాష్య రచనయేకాఁగలదు. "కృతిచే నచూత్తమగుఁ గీరితి స్వర్గ, ద మంతె; సేవరింపను స్వర్గం బతిరాత్మ చింతనాగ్రస్థిత తేజము శివుఁడు నన్నుఁ జెందెతుఁ గాతన్!" అన్నవాంఛ యుత్తమ జాతి మహాకవికిఁ గాని పొడమదు. "అన్నృషిః కావ్యము రచింపలేఁ" డను మాటపరుసకు నిట్టిసందర్భములో నెంతో వ్యాఖ్య చేయవలసి యున్నది! ఇపుడు వలదు. అంతయు

రచయితలనుండి కొన్ని పద్యములేటి పాఠకుల ముచ్చటకై యిచ్చుట యీ రచనలోని యాచారము. ప్రసంగములో సత్యనారాయణగారి పద్యములు మున్నె కొన్ని చెప్పితిని. వారి ప్రత్యక్షరము నన్నుఁ దగ్గదే రైనను 'రామాయణ కల్పవృక్షము' నొకకొమ్మదులిపి కొన్నిపూలు రాలిచెదను.

క. పరసుఖ దశా పరీపా
క రామణీయక మెఱుంగుఁ గచసాన్నిధ్యా
త్తరమణిఁ బ్రథమ స్పర్శ
ప్రమోదిఁ పొడవాలిచె సూత్రబంధనవేళన్.

గీ. కరరుహంబులు చర్మంబు గాకపోయె
నవియుఁ బులకించునేమొ ప్రియాగళాత్త
మైన స్పర్శసుఖాప్తిఁ బ్రియాగళంబు
నంటి బాధించు నీని కేలా! సుఖంబు.

క. తలఁ బ్రాల వేళఁ బడుచును
నలఘుచ్ఛవి నెగురు ముత్తియంబుల మించే
నలు కేళకుళులు వ్రాలెడు
నలుగురు దంపతులు మోహన స్తంభములై.

గీ. నాలుగవ పాలుగా నింద్రనీలమణులు
మణులు కలియుంగఁబోసిరో యనఁగ బాలిచె
ముత్తెములు చతుర్దంపతి ముగ్ధతను స
మాత్తనీల రక్తచ్ఛవుల్ హత్తుకొనఁగ.

గీ. అలువములు రెండు మూఁడు ముత్యాలు నిలిచి
సీతపాపటలోఁ జిఱుచెమట పోసె
హత్తుకొని గండపూఁత ముత్యాలు రెండు
రామచంద్రుని మోఁ దారకలు పోలిచె.

మ. పదిదోసిళ్లకు నొక్కదోసిలి త్రపాపర్యంతమై సేసప్రా
లాదిగించెన్ జనకాత్మజాత పతిపై నొయ్యారపున్ లజ్జయున్
జదురా తొల్లిటి మెట్టు డిగ్గుచుఁ ద్రపాశైథిల్య మార్గంబునన్
బెన రావేళకుఁ దీరినట్టి కనులన్ వీక్షించుచున్ రాఘవున్.

ఆ॥వె. చంద్రరేఖపైని సన్నని తెలిమొయి
ల్లాడినట్లు ముత్తియమ్ములాడఁ
దల్లిమేనిపైని నల్లనియాకాశ
మట్లు రామచంద్రుఁ డందెయుండ.

ఉ. అల్లవివాహమంటపమునై చనుచోటికిఁ జిత్ర చిత్రముల్
కొల్లలుగాఁగ వచ్చె వెలుఁగుల్ వెసఁ బెండిలివారలెల్ల ద్వా
ర్వేల్లితదృష్టులై చినుకు వెక్కసమౌ చిఱు జల్లువానలో
ఫుల్లవిచిత్రవర్ణములు పూవులు చూచిరి లంబమాలలన్.

క. ప్రతిచైత్రశుద్ధ నవమికి
వితతంబుగఁ దెలుఁగునేల విరిసెడుజల్లుల్
సితముక్తా సదృశంబులు
ప్రతినులు తలఁబ్రాలవేళ వచ్చెఁ జిటపటల్.

* * *

సత్యనారాయణగారి కిన్నరసానిపాటలు తెలుఁగునాఁటఁ బ్రాకినవి. సభలలో నాయన యుపన్యాసము చెప్పి యూరకున్న తరువాతనో నట్ట నడుమనో సభ్యులలో నెవరో లేచి కిన్నరసానిపాటలు పాడవలయునని శాసింతురు. ఆయన వీలుగా నున్నచోఁ బాడుదురు. లేనిచో కన్నుమందురు. 'విశ్వనాథ' కవి యుపన్యాసవాణి పటుత్వము కలది. ఆధ్యాత్మ్యము వహించుటకుఁదగిన బిగువు వారిలో నున్నది. "విప్రుని యలుకయుఁ దృణాహుతాశనంబు దీర్ఘమగునె!" ఈయెఱుక కలవానికి సత్యనారాయణగారు వెన్నవంటిహృదయము కలవారు.

ప్రకృతము. వారియుద్యోగము బెజవాడ కాలేజీయందు. ఇదివరలో రెండు మూఁడు సారులు స్వాతంత్ర్యవాంఛా ప్రభంజనము రేఁగి కొన్ని యుద్యోగముల నూడిపైచినది. మహోదారము, స్వతంత్రము నైన హృదయము గల సత్యనారాయణగారు ఎమ్. ఏ. పట్టభద్రులయినా రన్న విషయము కొందఱు సనాతను లెఱుఁగరు. సభావేదికమీఁద నాయన మాటాడునపుడు సాధారణముగా నాంగ్లవాసన వేయనీయరు. శుద్ధ శ్రౌతి - కర్మిష్ఠి లోకజ్ఞత గలిగి సంభాషించుచుండెనా యనుకొందుము. సత్యనారాయణగారు శ్రౌతధర్మములు పెక్కులు తెలిసికొనిరి. స్మార్తము పాఠము జేసిరనియు వినుకలి. ఇన్ని యర్హతలు గలవా రాధునికులలో " ద్విత్రాఃపంచషావా. "

నన్నయభట్టారకుని యుత్తరాత్తరము సత్యనారాయణగారు పరిశీలించి " ప్రసన్న కథాకలితార్థయుక్తి "—" నానారుచిరార్థసూక్తినిధి " అనువాని నాధారముగాఁ దీసికొని ' భారతి ' లో వెలువరించిన యమోఘవ్యాసములు వీరి లోఁతుగుండెకు సూచికలు. ' అమృతశర్మిష్ఠ ' యని పేరుపెట్టి శర్మిష్ఠాయయాతి చరిత్రము వీరు సంస్కృతభాషలో నాటకముగా సంతరించిరి. వేయిపడగలుగా విప్పారుకొన్న సత్యనారాయణగారి ప్రతిభావ్యుత్పత్తులను గుర్తించి ' కవిసామ్రాట్ ' బిరుదము నిచ్చి మెచ్చుటయు, గజారోహణోత్సవము గావించుటయుఁ దెనుఁగుభూమి చేసిన ఘనకార్యములు !

# కట్టమంచి రామలింగారెడ్డి.

## 1880

పాకనాటిరెడ్డి. తండ్రి: సుబ్రహ్మణ్యారెడ్డి. జన్మస్థానము: కట్టమంచి. నివాసము: చిత్తూరు. జననము : 1880. రచనలు : ౧. కవిత్వతత్త్వ విచారము ౨. వ్యాసమంజరి ౩. ముసలమ్మ మరణము ౪. నవయామిని [ఖండకావ్యములు] ఇత్యాదులు.

ఒకజాతీయ నాయకుఁడుగా, అంతర్జాతీయ రాజకీయ వేత్తగా నుండువాని ప్రశస్తి రామలింగారెడ్డిగారి కున్నది. రచయితగా ఆయనకుఁ గల ప్రసిద్ధియుఁ జక్కనిది. రెడ్డిగారు తెలుఁగువారే కాని, ఆంగ్లభాషా కోవిదులైన భారతీయ లేవదిమందిలోని యొకరు. ప్రభుత్వము బహుమాన వేతన మీయఁగా 'ఇంగ్లండు' నకుఁ బోయి పాశ్చాత్య శాస్త్ర తత్త్వము పుడిసిలించి వచ్చిన పండితు లీయన. ఖండాంతరములలో నున్నను, తెలుఁగుఁగలకండపుఁదీపి మఱచిపోయినవాఁడు కాఁడు. అది-మన విశ్వవిద్యాలయపు భాగ్యము. రాధాకృష్ణపండితుఁడు 'ఆక్సుఫర్డు' లో వేదాంత విద్యాగురుత్వము వహించుచున్నను, కాశీ విశ్వకళా పరిష దుపాధ్యక్షతా పదవిలో నున్నను, రష్యా రాయబారిగా నున్నను ఆంధ్ర జనయిత్రి కడుపు చుమ్మలు వాఱఁ గన్నబిడ్డఁడే !

మన రామలింగారెడ్డిగా రేండ్లతరమునఁ బాశ్చాత్యదేశమున నున్నవారే యైనను మానసములో మాతృపూజ మానలేదు. కళాపూర్ణోదయ కథా సంవిధాన సమీక్ష చేయుచునే యుండెడివాఁడు. "కవిత్వతత్త్వవిచార" బీజము లప్పుడే యీయన హృదయక్షేత్రమునఁ బడినవి. పింగళి సూరనార్యునితోఁ గట్టమంచి కవికి బ్రహ్మాండమంత మైత్రి. అందువలననే యతనిలోఁ బొరపాటులని తోఁచినవి మొగమోటమి లేకుండ మొగముముందఱఁ జెప్పివైచుటకు సాహసము. ఇది కొంత

లకు మోటుగానుండును గాని, కవితావిమర్శకున కుండవలసిన లక్షణ ములలో నిదియొక మంచిలక్షణము. ఆయన విమర్శనములోఁ బాశ్చాత్య సంస్కారవాసన పాలు చాలఁగాఁ గనుపట్టుచుండును. అట్టులని, వారి సంస్కృతులన్నియు నితఁడు సహింపనేరఁడు. సహ్యాముగాని శృంగారవర్ణనములు చేయుటను రామలింగారెడ్డి రోయును. ఈ శ్రోవకు గుఱిగాని వారొక భారత కవులే. వారిలోను 'కవిబ్రహ్మ' రెడ్డిగారి దృష్టిలో విశిష్టుఁడు. "ఆంధ్రలోక పరిశుద్ధ తపఃపరిపాక రూపుఁడు — కవితాప్రపంచరవి" తిక్కనయే యఁట. తిక్కన 'కడిది యశః కాంతివలన వ్యక్తములైన విశేషములతో కవిత్వ తత్త్వ విచారము వీరు విరచించి రఁట. ఈ తత్త్వవిచారములోఁ దేలిన సిద్ధాంతములపై రాద్ధాంతములు వెలువడకపోలేదు. అగుఁగాక! కట్టమంచి రచయిత యే సమీక్ష మైనను నిష్పాక్షికమై నిశితమై యుండుననుట నిర్వివాదము. రాజకీయ ముగాఁ గూడ రెడ్డిమాటలు సూటిగా, వేఁడిగా నాటుకొనుచుండును.

జాతీయ కవితాభిమాని యగు రెడ్డియూహాలో వేమనకవి కారణ విమర్శనశక్తికిఁ బట్టాభిషేకము చేసిన మహాత్ముఁడు, ప్రతిభాశాలియు నగు మహాకవి. "ప్రకృతి యనఁగా మనవారి కనేకులకు నిఘంటువు లలో నుండు ప్రకృతియేగాని, మాలింటికి బయట నున్న ప్రకృతియెట్టిదో తమసొంత కన్నులతోఁ జూచిన పాపమునఁ బోరు. అట్టివారికి వేమన యనుసరణీయుమైన శ్రోవచూపినా డనుటలో నించుకయు గుణాధిక్య స్తుతి లేదు" ఇది కట్టమంచి విమర్శకుని వాఙ్మూలము. ఈ రచయిత అర్థశాస్త్రము నాంధ్రీకరించి యాకృతి స్మరణీయ యగు ప్రేయసి కొసఁగినాఁడు. దానికొఱకై వ్రాసిన యంకితపద్యములు పదో పంద్రెండో. అన్నియుఁ జక్కనివి. ఒక్కటిమాత్రము వ్రాసెదను.

కల్లోల మాలికాకరముల వీచుచు
నెలుఁగెత్తి పిలిచెడు జలధినుండి-

నిండార నెఱపిన పండువెన్నెల డాఁగి
          నవ్వెదు నాతోడ నభమునుండి
గుసగుసల్ వోవుదు కోర్కెనై సురభి శీ
          తల మంద మారుతావళుల నుండి
తేనెలఁ దావుల జానగు పువుల హి
          మాశ్రు లుర్లఁగఁ జూచె దవనినుండి
ఛట ఛట రవరాజి ప్రస్ఫుటముగాఁగ
ననుచితము సేయఁ గోపింతు వగ్నినుండి
సకల భూత మయాకార సార మహిమ
నీవు లేకయు నాకు నున్నా వెపుడును.

*

'నవయామిని' రామలింగారెడ్డిగారు 1936 లో రచించిన ఖండ కావ్యము. ఇది బిల్హణీయ కావ్యమునకు మార్పుచేసిన కథాసందర్భము గల కృతి. ప్రాచీనకావ్యమగు బిల్హణీయము అనాదరణీయమైన కావ్యమనియు, మంచిదికాదనియు, కల్పన సత్యమునకు నైజమునకు విరుద్ధమనియు రెడ్డిగారి యభిప్రాయము. ఆకథ నంతను సాంతయూహతో మార్పుచేసి 'నవయామిని' కూర్పులోఁ బ్రదర్శించినారు. రెడ్డిగారి భావాంబరవీథి విహరించు యామినీ బిల్హణుల ప్రకృతు లివ్వి:—

౧. బిల్హణుఁడు:— పండితుఁడు. వయస్సు చెల్లినవాఁడు కాకున్నను కొంతవఱకు ముదిరినవాఁడు. ధర్మబుద్ధి నిగ్రహశక్తి ఏమాత్రములేని విషయలోలుఁడుకాఁడు. నిజశీలము చలితమయ్యే నేని పునరాలోచనమై సమర్థించుకొనఁ జాలిన నిగ్రహపరుఁడు.

౨. యామిని:— వయస్సునను, వర్తనమునను ఆర్య. పరిశుభ్ర మనోగతి గలది. నచ్ఛీల. గయ్యాళి కాదు. మృదుత్వము స్థిరత్వము కలిసిన హృదయము కలది. భావములు వెన్న. పల్కులు తేనెలు. ధర్మసంకల్పము వజ్రము వంటిది.

ఈ ప్రకృతులు గల నవయామినీ—బిల్హణులతో నీ కావ్యము రెడ్డిగారు సంతరించిరి. కథానిర్మాణము ప్రకృతము మనము చూడవలదు. ఆయన కటులు తోఁచినది. పూర్వపు బిల్హణీయకథ యనౌచితీ దుష్ట మని యాయన నమ్మినాఁడు. కాదు కాదని విమర్శకులు వాదములు చేయుచున్నారు. పోనీ ! అందలి కవితావైభవ మెట్లున్నది ! ఈ ఖండ కృతిలో మొత్తము ముప్పది పద్యములకంటె మించిలేవు. కాని, మంచి కండగల రచన.

పరవశుఁడగాక యిన్నేండ్లు బ్రతికి, నేఁడు
నాకు నీవశంబగుట సంతసము కాని ;
కాఁపుతప్పి, కాలము సెడి కర్షకుండు
విత్తు చల్లిన ఫలమున్న ? వెఱ్ఱిగాదె ?

*

నీవు మనోజ్ఞమూర్తివి, వినిర్మల కీర్తివి జ్ఞానమందు వి
ద్యా విభవంబునందుఁ బరమాద్భుతశక్తివి ; నాకుఁ జూడఁగా
దైవముఁ, దండ్రియున్, గురువుఁ, దల్లియు నీవ సఖుండవున్ సదా ;
కావున సాహసించితిని కర్మము ధర్మము పూని తెల్పఁగన్.

నీప్రతిబింబము గద నే
నో పావనమూర్తి, కినియునోపుదె నాపై
నీపోషించిన లతికను
నీ పట్టున నలరనిమ్ము నిర్మల నియితిన్.

*

చిటునవ్వు రేకులఁ జెన్నారు మొగము దా
మర సౌరభము మది కరఁగ నాని
కలికి తనము మీటఁ దెలివి మెఱుంగులఁ
జెలఁగించు కనుల కాంతులకుఁ దలఁకి

నవ్యముల్ హృద్యముల్ నర్మగర్భితములౌ
తళుకు పల్కుల తీపిఁ దవిలి చిక్కి
మనసు మైనము చెంద మచ్చుమాయలఁ జల్లు
తెలియని ముగ్ధ చేష్టలకు భ్రమసి
బుద్ధి వెనుకకుఁ జిత్తంబు ముందునకును
బోవు భిన్నత శాంతి గోల్పోయి, తగును
దగద యను నిలుకడ లేమిఁ దాల్మి వోలియఁ
గోర రాదని తెలిసియుఁ గోరినాఁడఁ
జేర రాదని తెలిసియుఁ జేరనాఁడ.

*

మెత్తని, తియ్యని, చల్లని
చిత్తముఁ, జిఱునవ్వుల రుచులు, సిగ్గు మొగముఁ, గ
న్నెత్తని రూపము, హృదయో
న్మత్తతఁ గలిగింప నిట్టి మాటలు ప్రేలెన్.

*

రెడ్డిగారి రచనలలో 'ముసలమ్మ మరణము' నకు మంచి యశస్సు వచ్చినది. ఈ చిన్న కబ్బము చెన్నపురి క్రైస్తవ కళాశాలకు సంబంధించిన ఆంధ్రభాషాభిరంజనీ సమాజము నెలకొల్పిన బహుమాన కావ్యపద్ధతిలో నెగ్గినది. నాఁడు తత్సమాజపోషకుఁడు సమర్థి రంగయ్యసెట్టి. బ్రౌను దొరగారు ప్రకటించిన 'అనంతపురచరిత్ర' యను గ్రంథము నుండి యీ యితివృత్తము కైకొనఁ బడె నని రెడ్డిగారు పీఠికలో వ్రాయుచున్నారు. ఈ కృతి బాల్యములో రచింపఁబడిన దగుటచేఁ బ్రాచీన కావ్యానుకరణఫక్కి మెండుగానుండెను. హృదయము నూఁపించు స్తోత్ర వర్ణనములును గలవు.

కట్టమంచి రామలింగారెడ్డి

మచ్చునకు :—

లేఁగమైనాకుచు లీలమై మెడ మలం
చిన గోవుఁ బిండెడు వనరుహాక్షి
బొండు మల్లెల తోఁటఁ బువ్వులు గోయుచు
వనలక్ష్మి యన నొప్పు వనజగంధి
బీదసాదుల నెల్ల నాదరించుచుఁ గూడు
గడుపారఁ బెట్టెడు కన్నతల్లి
వ్యాధి బాధల నెవరైన నడల రెప్ప
వేయక కాచెడు వినుత చరిత

బిడ్డలెల్లరు తమవారి విడిచి చేరఁ
జంక నిడుకొని ముద్దాడు సదయహృదయ!
అమ్మ! నీ కిట్లు వ్రాయంగ నౌనె బ్రహ్మ
కనుచు నూరివారందఱు నడలియడలి.

*

కన్నెఱ్ఱ వాఱిన ఖర కరోదయకాల
మల్లన మ్రింగు జాబిల్లి యనఁగ
జ్వాలదగ్ని శిఖలపై నెలనవ్వుతోఁ బోవు
ధాత్రీ మహాదేవి తనయ యనఁగ
కెందామరల బారు సుందర మగు లీల
నల్ల నల్లనఁ జొచ్చు నంచ యనఁగ
కాలమహా స్వర్ణకారకుం డగ్నిలోఁ
కరఁగించు బంగారు కణిక యనఁగ

ప్రళయకాలానల ప్రభా భాసురోగ్ర
రంగ దుత్తుంగ భంగ సంవ్రాతములకుఁ
గలఁక నొందక దరహాస మలర, మంద
మందగతిఁ బోయి, చొచ్చె నమ్మఁగువ సీత.

ఈ తీరున విద్వాంసుఁడై కావ్యరచనము గావించిన కట్టమంచి కవి వంగడము సాహిత్యాభిరుచి కొన్నితరములనుండి కలిగి వచ్చుచున్నది. దానికిఁ దారకాణగా మన రామలింగారెడ్డి యుపుడపుడు వ్రాసిన కృతి పీఠికలలోని కొన్ని బంతులు గమనింతము.

"ఒకానొకప్పుడు శిష్యులైన కుప్పనయ్యంగార్లు బురదలో దిగఁబడి నడవఁజాలక, గనిమమీఁదఁ బోవుచుండిన రామలింగారెడ్డిగారిని [మన రెడ్డిముత్తాత] వచ్చి చేయూఁత నిమ్మని సంస్కృతములో నాక్రోశించిరి. ఆకూత నవ్యాకరణముగా లేనందున, దానిని దిద్ది పునశ్చరణము చేసిననే కాని రానని కోపించుకొనిరఁట. ఈయితిహాసము కుప్పనయ్యంగారే యొకానొకప్పుడు క్లాసులోఁ జెప్పిరి. ప్రాణాలకైనను వ్యాకరణము హెచ్చేమో యాకాలపు గురువునకు! ఈయన మహాకవి యని మాబంధువులలో గొప్పప్రసిద్ధి. నేనుపుట్టిన లగ్నమును, మఱికొన్ని చిహ్నములును, భావిపాండిత్య సూచకములని కుప్పనయ్యంగార్లు వారిపేరు నాకుఁ బెట్టిరి."

*

"కవిత్వము మహాసాహస కార్యమని నాతండ్రికి భయము. ఒకవిధముగాఁ జూచిన నిజమే! కాని, వారి కారణములు వేఱు. విషగణములు పడి యెవరికేచేటు వాటిల్లునో యని వెఱువు పెద్ద. తెనుఁగులో నాకుండు పాటవముఁ జూచి వీఁడెప్పుడు కవిత్వరచనకుఁ బ్రారంభించి నాశనమగునో యని దిగులు చెందుచుండును. సాక్షాత్తు తన కంఠస్వరముతోనే తాను జదివెడు మూడ్కనే భారతమును నేను జదువునప్పుడు పరమానందమును, నీతుంటరి కవిత్వమును మొదలుపెట్టి యిల్లు కూల్చునో యనుసంశయమును జనిపోవువఱకుఁ దాల్చియుండెను. కవిత్వ మనఁగా మరణయోగములలో నొకటి!"

"మాతంగ్రి గారు ప్రచురించిన గ్రంథములు రెండు. భారతసార రత్నావళి, భాగవతసారముక్తావళి. సొంతకవనము సొంతఁ బోఁగూడదను నియమముఁ దాల్చినవా రగుటవలన, నీ సంపుటీకరణములతోఁ దృప్తిఁజెందిరి."

*

"ఆంధ్రలోక గురువులలో వేమన మొదటివాఁడందుమేని, సుమతి రెండవ వాఁడు ...... మావంశమున కేదివచ్చిన రానిండు. తెలుఁగు భాష యొక్కఁటిమాత్ర మక్షయముగ నిలిచియుండినఁ జాలును."

*

రెడ్డిగారి 'వ్యాసమంజరి' నైదుఖండములుగా విభజింపఁబడి యున్నది. పూర్వఖండము, అభిజనఖండము, భాషాఖండము, ఆధునిక కవితాఖండము, సాంఘికఖండము నని - ఈరచన లన్నింట నొక్కొక్క క్రొత్త తెన్ను కనఁబడును. విషయము సూటిగా మొగమోటమి విడిచి వ్రాయుటలో రెడ్డిగారిదొక ప్రత్యేకత. ఆయన మాటలో వలె వ్రాఁతలో సున్నితమైన ధ్వనిమర్యాద యుండును; హాస్య రేఖలు నుండును. వచనపు నడక చాలదొడ్డది రెడ్డిగారి కలవడినది. పరిశుద్ధమైన లక్షణావిరుద్ధభాషలోనే వీరి రచనలెల్ల సాగినవి.

వీరి వ్యాసమంజరికి ఉపోద్ఘాతము వ్రాయుచు పింగళి లక్ష్మీకాంతముగారు: "విమర్శకులలో వీరికెంత ప్రాధాన్యమున్నదో వ్యాస రచయితలలోను అంతప్రాధాన్యమున్నది. సాహిత్యాంగముగాఁ బరిగణింపఁదగినవ్యాసరచన ఆంగ్లభాషలోవలె మనభాషలో ఇంకను పరిణతావస్థకు రాకున్నను, జరిగినంతవఱకు దానిపెంపునకుఁ గారణభూతులైన విద్వాంసులలో వీరొకరు. గ్రంథములకుఁ బీఠికలు వ్రాసినను పత్రికలకు వ్యాసములు వ్రాసినను, తాత్త్వికముగా విషయుచాలన మొనర్చి పటుత్వముగల భాషలో సోపపత్తికమైన సిద్ధాంతము చేయు నేర్పు వీరి

వాక్కునకు సహజగుణము. వీరివ్యాసములకు ఇదియే ప్రథమాలంకారము. రెండవది శైలి..." ఇత్యాదిగా ప్రశంస చేసినారు.

ఉచితనియమనిబద్ధమయిన రెడ్డిగారి వచనశైలిలో మాధుర్య రేఖలు తఱచుగా నగపడుచుండుననుటలో నెవ్వరికి సంశయముండదు. ఈవిధముగా విమర్శకులలో, వ్యాసరచయితలలో, కవులలో నొక మంచి తావు నేర్పఱచు కొన్న 'కట్టమంచి' రచయిత జీవితమును వేఱొక చూపుతోఁ జూచినచో, ఆయన పెక్కేండ్లు ఆంధ్ర విశ్వ విద్యాలయోపాధ్యక్షులా పదవి నిస్సామాన్య ప్రతిభతోఁ బరిపాలించి, యిపుడు మైసూరు విశ్వవిద్యాలయమునకుఁ గూడ నదే పదవిలో నుండి సేవ గావించుచున్న మహావ్యక్తి. ఈ రెడ్డివంటి స్వాతంత్ర్య కాంక్షిని తఱచుగా మనము చూడఁ జాలము. రసలుబ్ధుఁడైన యీతని సౌహార్దము కొందఱభినవాంధ్రకవులకు మూలశక్తియైనది. రాయప్రోలు - అబ్బూరి - దువ్వూరి - పింగళి - మున్నగువారి యభ్యున్నతి కీయన 'అనరా' మేలయినది. సుప్రసిద్ధ కవులు విశ్వనాథ సత్యనారాయణగారు 'ఋతుసంహార' కావ్యము రామలింగారెడ్డి కంకితము చేసిరి - రాయప్రోలు సుబ్బారావుగారు కట్టమంచి కవిని గూర్చి యిటు లుట్టంకించిరి.

పిండీ పిండని పాఁడి యాంబోదుఁగులన్ బింబింపఁ గాదంబినీ
కాండం బుర్వర పచ్చ కోకలను సింగారింప నీవేళఁ బూ
దండల్ దక్కనుద్వారబంధముల సంధానించి ప్రేమోదయా
ఖండ స్వాగత మిత్తు రాంధ్రు లనురాగస్ఫూర్తి రెడ్డ్యగ్రణీ!

*

ఆజీన్ మార్గోన్మగమీక, దిగ్విజయ కన్యా కంచుకంబౌ కుసుం
బాజెండా నెగఁగట్టి వాఙ్మయ సరో మాధ్వీ పిపాసారతిన్
మోజుల్ మీఱఁగ మాయనుంగుఁ దెనుఁగుం బూఁదోటఁ బోషించి రే
రాజుల్ తత్ప్రతిభాంక రెడ్డికులధీర ప్రాచురీచ్ఛాయ నీ
తేజోరూపమునందు చూచెదము ప్రీతిన్ రామలింగాగ్రణీ!

# మల్లాది సూర్యనారాయణ శాస్త్రి

## 1880

వెలనాటి వైదిక బ్రాహ్మణులు. తల్లి: వెంకమాంబ. తండ్రి: శ్రీరామావధానులు. జన్మస్థలము: చినకడియపులంక [దీనికి బుఱ్ఱిలంక-మల్లాదివారిలంక యని నామాంతరములు] జననము 20. 2. 1880 సం॥ ప్రమాథి మాఘశుద్ధదశమి. గ్రంథములు: ౧. సంస్కృతవాఙ్మయచరిత్ర [2 భాగములు. ఆంధ్రవిశ్వకళా పరిషత్ప్రచురణములు. ౧. వైదిక భాగము. ౨. లౌకికభాగము] ౨. ఆంధ్రభాషానుశాసనము [2 భాగములు. చరిత్రాత్మకవ్యాకరణము] ౩. ఆంధ్రదశరూపకము [తెనుఁగు సేఁత] ౪. భాసనాటకకథలు[వచనము. 2 భాగములు] ౫. ప్రేమతత్త్వము [స్వతంత్ర పద్యకావ్యము] ౬. ఉత్తరరామచరిత్ర [ఆంధ్రీకృతి] ౭. భీష్మప్రతిజ్ఞ [స్వతంత్రనాటకము] ౮. ఆంధ్రభవిష్యపర్వము [పద్యప్రబంధము] ౯. భవభూతినాటకవచనము. ౧౦. విదురనీతి. ౧౧. స్త్రీధర్మబోధిని. ౧౨. సత్యకీర్తినాటిక. ౧౩. కవివిడంబనము. ౧౪. మహాభారత విమర్శనము.

సంస్కృతరచనములు: ౧. బ్రహ్మసూత్రార్థదీపిక. ౨. రజోఽనన్తర వివాహము. ౩. సంస్కృతభాష [ఇవి 'షష్టిపూర్తి' సంపుటములో ముద్రితములు] అనేక పత్రికలలో వ్యాస రచనలు.

శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములయందుఁ గావలసినంత నికరమైన పాండిత్యము గలవారు. ఈ పాండిత్యమునకు దీటయినది వారికిఁ గల యభినివేశము. సంస్కృతవాఙ్మయ చరిత్ర, ఆంధ్రభాషానుశాసనము మున్నుగా వారు రచించిన కృతులు శాస్త్రిగారి పట్టుదలను బ్రదర్శించుటకుఁ బట్టుగొమ్మలయినవి. ఆయనకుఁ గవిగానున్న కీర్తి కంటె, నధ్యాపకుఁడుగా విమర్శకుఁడుగానున్న పేరు పెంపులు పెద్దవి. ఏమనఁగా, సూర్యనారాయణశాస్త్రిగారు నలువది సంవత్సరములు ఉపాధ్యాయ పదవి నిర్వహించిరి. ఆ నిర్వహణములో

వారికిఁగల శ్రద్ధానియమములు చక్కనివి. మహా పండితులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి సన్నిధిని వ్యాకరణశాస్త్రాధ్యయనము చేసి, తెనుఁగులు స్వయంకృషినిజూచి యుభయభాషావిశారదులై 1900 లో అమలాపురము హైస్కూలున నుపాధ్యాయులుగాఁ బ్రవేశించిరి. అది నాలుగేండ్లయినతర్వాత ఆంధ్రసాహిత్యపరిషత్తు వ్యవహర్తగా నొకయేఁ డుద్యోగ నిర్వాహణము. 1915 లో, రాజమండ్రి ట్రైనింగుకాలేజిలో నధ్యాపకత. ఆపదవి యొక వత్సరము. పదపడి, అనంతపురము కళా శాలలో మూఁడేండ్లు. మరల రాజమహేంద్రవరము ఆర్ట్సు కాలేజిలో 1919–1931 నడుమ పండ్రెండు వత్సరములు పండితస్థానము. అక్కడి నుండి ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలలో పదియేండ్లపాటు విద్వ త్పదవి. మొత్తముమీఁద నాలుగుదశాబ్దులు పఠనపాఠనములలో శాస్త్రిలుగా రాఱితేఱిరి. ఈలోపుననే వీరు కొన్ని గౌరవోద్యోగములు నిర్వహించిరి. వేంకటగిరి రాజావారి సంస్థాన కవితాపదవి 1909–1919 మధ్య. జటప్రోలు సంస్థానవిద్వత్ స్థానము 1910–1917 నడుమ. నారయ్యప్పారావు సంస్థాన విద్వత్కవిత్వ పట్టము 1919–1926 నడుమ. ఈవిధముగా సంస్థానకవులై యుపాధ్యాయులై యుంతేవాసులకెందఱకో విద్యాభిక్ష పెట్టియుండుటచే సూర్యనారాయణ శాస్త్రిగారికి సుస్థిర మైన యశస్సు చేకుఱినది. దీనికిఁదోడు గ్రంథరచన. శాస్త్రిగా రను వాదములేకాక స్వతంత్రరచనలు కూడఁ గావించిరి. వారి కృతులన్నియుఁ బాఠ్యములుగా నిర్ణీతములు, 'సంస్కృత వాఙ్మయచరిత్రము' వీరిది శాశ్వతముగా నుండఁ దగినగ్రంథము. ఒకదశాబ్దము చేసిన నిరంతరకృషి ఫలము. వైదికవాఙ్మయము, లౌకికవాఙ్మయమునని రెండుభాగములుగా నీ గ్రంథము విభజింపఁబడి వ్రాయఁబడినది. ఆంగ్లములో నీవఱకు సంస్కృతవాఙ్మయ చరిత్రమునఁ గలపొరపాటులు పేరుకొని, మనో హరము నిర్దుష్టము నగు పక్కిలో నీ గ్రంథము సంధానించిరి.

శ్రీ వెంకటగిరి సంస్థానాధిపతుల ప్రోత్సాహముచే "సంస్కృత కవిజీవితములు" శ్రీశాస్త్రిలుగారు తెనుఁగులో రచించి వెలువరించిరి. ఈ రెండు గ్రంథములు సూర్యనారాయణ శాస్త్రిలుగారి యశోలతకుఁ బ్రాకులు.

పింగళి సూరనార్యుని 'కళాపూర్ణోదయము' ముద్రణదోషముల తోను, విరుద్ధపాఠభేదములతోను నుండి యర్థావగతికిఁ గష్టపెట్టుచున్నదని శాస్త్రులుగారు పరిశ్రమించి, పాఠభేదములు గుర్తించి సరిపఱిచి భావప్రకాశిక యను టీకతో, ఆమహాకావ్యమును లెస్సయగు తీరు లోనికిఁ గొనితెచ్చిరి. ఇది ముద్రింపించినవారు పీఠికాపురాధీశ్వరులు. మల్లాదివారి పాఠములు కొన్ని నసిద్ధమైనవి కావని తరువాత విమర్శనములు తలనూపినవి. ముఖేముఖే సరస్వతీ! శాస్త్రులుగారి వాఙ్మయ వ్యవసాయము నిస్సామాన్య మైనదికాని, అందఱకు నందునది కాదు. ప్రాచ్య భాషాపండితులలో నిట్టి ప్రగాఢ మైన యభినివేశము గలవారు పెక్కురు లేరు; ఇట్టి లోకజ్ఞతాసంపత్తి గలవారును దక్కువగా నుందురు. వీరు ఆంధ్రవిశ్వకళా పరిషత్తు 'సెనేటు అకడమిక్కు-కౌన్సిలు, ఓరియంటల్ ఫాకల్టీ' మొదలగువానిలో సభ్యత నంది పండితులకు మన సంస్కృతాంధ్రములకు సంబంధించిన తీరుమానములు తెచ్చుచు నందు గొన్నింటిని సఫలము కావించి యున్నారని ప్రముఖులు చెప్పుచున్నారు. ఇది శాస్త్రులుగారి లోకజ్ఞతకును గుఱుతు. 1927 సం॥లో శాస్త్రిగారి యధ్యక్షతనంది "ఉపాధ్యాయ పండిత పరిషత్తు" నేఁడు తెలుఁగునేలలో నలుమూలలఁ బ్రాకి దొరతనము వారిచేఁ గొన్ని యుపయోగములు చేయించుకొన్నది.

శాస్త్రులుగారి 'సంస్కృత భాషారచనలు' వారి షష్టిపూర్తి సన్మానసంచిక చివరఁ బ్రచురితములయినవి. అవిచూచినచో గీర్వాణ వాణిలో వారికిఁ గల సైశిత్యము నైపుణి వెల్లడి కాఁగలవు.

'ఆంధ్ర భాషానుశాసనము' అను పేరుగల వీరి వ్యాకరణగ్రంథము నకు గొప్పప్రతిష్ఠ వచ్చినది. ఈయనుశాసనమునకు శాస్త్రులుగారు పడిన పరిశ్రమ మనంతము. ఎన్నో ప్రాచీనాధునాతన గ్రంథములనుండి ప్రయోగములు సేకరించిరి. ఈకృషి వ్యావహారిక పదశాసకముగా నుండుటవలనఁ గొందఱు గ్రాంథికవాదవీరులు శాస్త్రులుగారిని మెచ్చరు. పోనీ, వారికి మెచ్చులక్కఱలేదు. తోఁచి గొప్పకృషి చేసినారు. ముందు నాళ్ళు వారి శాసనము శిరసావహించఁగల వని నేఁడు సూచనలు కనఁబడుచున్నవి.

ఉత్తరరామచంద్రాంధ్రీకరణము వీరిది చక్కఁగానున్నది. 'అద్వైతం సుఖదుఃఖయో' రిత్యాదిశ్లోకమునకు శాస్త్రులుగారి యనువాదపుఁ బోందిక యెంత సుందరముగానున్నది!

సకలావస్థల నేది కష్టసుఖముల్ సైరించునో యేకమై
వికలంబైన మనంబు నెందుఁ గనునో విశ్రాంతి యెందో వ్వా
ర్ధక మందుం దమిఁ బెండ్లియాది మృతి పర్యంతంబుగాఁ బ్రేమసా
ర్థకమౌ నెయ్యది నిత్యభద్రమయి యాదాంపత్య మేపారెడున్.

---

# వేటూరి ప్రభాకరశాస్త్రి

## 1883

వైదికబ్రాహ్మణులు. తల్లి: శేషమ్మ. తండ్రి: సుందరశాస్త్రి. నివాసస్థానము: తిరుపతి. జననము: 1883 ఫిబ్రవరి, సర్వజిన్నామ సంవత్సరమాఘ బహుళైకాదశీ మంగళవాసరము. గ్రంథములు: ౧. నీతినిధి [ వచనము ] ౨. కడుపుతీపు. 3 కపోతకథ. ౪. విశ్వాసము. ౫. మాన్నాళ్ళముచ్చట [ ఈనాలుగును ఖండకావ్యములు ] ౬. ప్రతిమానాటకము. ౭. కర్ణభారము. ౮. మధ్యమవ్యాయోగము [ ఈమూఁడును భాసకృతులకనువాదములు ] ౯. భగవదజ్జుకము [ బోధాయనకృత ప్రహసనమునకనువాదము ] ౧౦. శృంగారశ్రీనాధము. [ శ్రీనాధుని కాలము, కృతులు మున్నగు విషయములపై విపులవిమర్శనము ] ౧౧. తంజావూరు ఆంధ్ర రాజుల చరిత్రము. ౧౨. కనకాభిషేకము [ శ్రీనాధునకుసంబంధించిన చరిత్రము ] ౧౩. చాటుపద్యమణి మంజిరి. ౧౪. ప్రబంధరత్నావళి. ౧౫. తెలుఁగు మెఱుఁగులు ఇత్యాదులు.

ఎడతెఱిపిలేని భాషాపరిశ్రమము—గడిదేఱిన యుభయసారస్వత పాండిత్యములు — వడిగల కార్యదీక్షా దక్షత — చెడిపోని తలంపులు— ఒడిదొడుకులు లేని తేఁటతెనుఁగు కవితారచన — కడదాఁకిన తాత్త్వికదృష్టి — ఈ విశిష్టలక్షణములతోఁ బుట్టిన మహారచయితలు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. ద్రావిడము నెఱుఁగుదురు. ఆంగ్లమున వలసినంత పరిచయము. అచ్చుయంత్రముల మొగమెఱుఁగక మట్టిద్రుంగిన తాటియాకులను బట్టుకొని కన్నులు చిల్లులుచేసికొనెడి నిరంతర వ్యవసాయము. దానికి సాయము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ బరిశోధకపదవి. పెక్కు వత్సరములు ప్రభాకరశాస్త్రిగారావదవిలోనుండి మదరాసు పండితులచే జోహారులు చేయించుకొనుచుఁ బరిశోధనము గావించినారు. ఈ పరిశోధన ఫలితము శృంగార శ్రీనాథాదిగ్రంథద్వారమునఁ దెలుఁగు వారు చూఱలాడుచున్నారు.

శ్రీనాథుఁడు ప్రభాకరశాస్త్రిగారికి నచ్చిన మహాకవి. ఆయనపద్యములలోని రహస్యపుమెలఁకువ లెన్నో యెన్నుకొని శాస్త్రిగారి శరీరము పులకితమగును. 'క్రీడాభిరామము' నకు సువిశాలమైన పీఠికవ్రాసి దానికి వెలుఁగుచూపిన మహాశయులు వీరు. "హరవిలాసము" వీరు సరిపఱుపఁగా నానందముద్రణాలయమువా రచ్చువేసిరి. వీరొకతీరునకుఁ దెచ్చిన కాశీఖండము వావిళ్లవారు వెలువరించిరి. శ్రీనాథుని గ్రంథములలో నెన్నో పాఠములు ప్రభాకరశాస్త్రిగా రమూల్యపరిశోధనము గావించి యెత్తిచూపిరి.

ప్రబంధరత్నావళి — చాటుపద్యమణిమంజరి — శాస్త్రిగారి పరిశోధనపుఁ బంటలు. 'తంజావూరి యాంధ్రరాజులచరిత్ర' కు వీరురచించిన 'తోడిమ' గొప్పది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రకటించిన 'రంగనాథరామాయణము' నకు వీరిసహాయితి పెద్దలు ప్రశంసించిరి. 'తెలుఁగు మెఱుఁగులు' అనుకూర్పులోఁ జాలఁగ్రొత్త విషయములు మనము గ్రహింపఁగలుగుదుము. 'దేశికవిత' సేకరింపవలెనన్న యాశ వీరికిఁ గొండంతయున్నది. ఇది యిటులుండఁగా, శాస్త్రిగారియాధ్యాత్మికదృష్టి సాధారణుల కందరానిది. పరమేశ్వరప్రీత్యర్థమను సంకల్పములో వీరు ప్రతి కార్యము చేయుదురు. యోగనిష్ఠాగరిష్ఠత యున్నది. మానసిక శాంతి శారీరకస్వాస్థ్యము వీడినవారు వీరివాగమృతముచే నుపరితృప్తులగుచుండుట కనుచున్నాము. 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' ఈయాభాణకము శాస్త్రిగారి పట్ల వర్తించును. మానవసంఘము విజ్ఞానవిలసితము కావలయు ననఁగా ప్రభాకరశాస్త్రిగారి వంటి రచయితలె తెలుఁగునేలకవసరము. గాంధిమహాత్ముని పవిత్రాశయములు వీటూరివారి కొజ్జబంతులు. వీరి 'గాంధిరామాయణ' సంకలనవిషయము నిటీవల వినియుందురు. ఈశ్వర తత్త్వము గుర్తించిన మహాత్ముఁడు గాంధియే యుని వారివిస్రంభము. ఎట్టి శక్తియున్నను, ఆకుమాల పిందివలె నడఁ

యడఁకువతోఁ దన పాండితీ ప్రతిభలు దాచుకొనుచున్న పండితుఁడు ప్రభాకరశాస్త్రి — ఈ వినయవాదము వినుఁడు.

" ......అఱవము వాడుకభాష తప్ప గ్రాంథిక భాష నాకురాదు. ఇంగ్లీషు అసలేరాదు. చిరశ్రవణమున నేదో గుటికిఁ గొంతయెడముగా నర్థమగుట గాని యందు నా కేమాత్రము నెఱుకలేదు. తెలుఁగులో నేదోకొంత తంటాలు పడితి ననుట తథ్యము. ఆంధ్రవాఙ్మయ సౌధ నిర్మాణ కర్మకారులలో నేను నొకఁడ నగుదు ననుకొని కొన్నాళ్లు కూలి పనిచేసి మట్టి ముద్దలు మోసితిని. చేతులు కడిగికొను దశలో నివ్వుడున్నాను — నా యాధ్యాత్మిక పరిశ్రమమునకు సంబంధించిన విషయము లితరులకుఁ దెలియవలసినవి గావు......... తెలుఁగు నేను నేర్చిన నాలుగు ముక్కలకు పూజ్యులు, గురువర్యులు నగు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి గురుత్వానుగ్రహము ప్రధానకారణము.........వాఙ్మయవిషయమున నాపైఁ గొన్ని యప్పులున్నవి. అవి యెప్పుడో తీర్పవలసినవి. కాని పెక్కండ్లనుండి యుపేక్షతోనే యుంటిని. ఈశ్వరానుగ్రహమున్న నందుఁ గొన్నింటినేని యిఁకఁ దీర్చుకొనఁగలుగుదు నేమో!"

'భారతి' ప్రమాధి కార్తికము.

నిరాడంబరమైన యిట్టిబ్రతుకు ఆర్థికముగా ముందునకు సాగకపోయి నను, ఆధ్యాత్మికముగా నందన వనము వంటిది. 'వేటూరి' వారికి సతీర్థ్యులగు విశ్వనాథ సత్యనారాయణగారు 'త్రిశూలము' పీఠికలోఁ బ్రభాకరశాస్త్రిగారి యుపేక్ష కిటులు చింతించినారు.

వేటురి వారి వ్యాఖ్యలును పీఠికలుం దెలుఁగుం బొలంతికిన్
చేటులురేఁగు గందవొడి పెట్టిన పూఁతలు; నంతయయ్యు వా
కేటికొ వట్టి పేదతనమే భజయింతురు, నెంతయయ్యు నో
నాటకు నక్కటో! తెలుఁగునాఁటికి నాఁటికి నాఁటి కక్కటా!

భాషాపరిశోధకులు, విమర్శకులు కవులుగా నగుట యరుదు. ఆ యదృష్టము ఒక్క ప్రభాకరశాస్త్రిగారికే పట్టినది. కడుపు తీపు-కపోత కథ - మూన్నాళ్ల ముచ్చట - మత్త విలాసము - భగవదజ్జుకము - ప్రతిమా నాటకము మున్నగు కృతులు శాస్త్రిగారు వెలయించినారు. వీనిలో సగము ఆంధ్రీ కృతులు - సగము ఖండకృతులును. ఖండకావ్యములు కలకండములు. వేటూరి కవి తెనుఁగుతునుకుల కూర్పునేర్పు నబ్బురముగా నభ్యించుకొన్న చతురుఁడు. పద్య - గద్యముల రచన మంచి చిక్కగ నుండును. పెద్దనవలె రచనకు గొప్ప బింకము నిచ్చు సమర్థత యున్నది. ఎటుకేఁ దవిలిన కౌంకసీసము వ్రాసెద.

కురులు చిక్కార్చి దిక్కులు గాంచి చేలాంచ
    లము లద్దుకొని కంచెలం దొలంచి
మొగము మంగళసూత్రమును నోలగందంబు
    పసుపునఁ బూసి మన్ వినగిసైచి
గుమురొత్తు పులకల నిమిరి పొక్కిలిబంటి
    నీట నీరెండ సైనాట డిగ్గి
గుమ్మడి మూటగాఁ గూర్చుండి చిగురాకు
    దొప్పదోసిళ్ళ నీ రప్పళించి
దరిని గల బ్రాహ్మణుండు మంత్రములు పలుక
నల కనకగాత్రి కృష్ణలో జలక మాడెఁ
గరఁగఁ బోసిన పొంగు బంగార మనఁగ
నంగ కాంతులతోడఁ దరంగలాడ.

'కడుపుతీపు' లోనిది.

పదముల కుదిరికను, భావము పొదుపును గ్రింది పద్యములలో నరయవచ్చును.

బాలింతతనము తోడనె
నూలింత తనమ్ము వచ్చి పోలించుట ని
ల్లాలికిఁ బని తోడని నెల
కూలికి నొకదాసినమ్ము చూఁ గుదిరిచె నతఁడున్.

ఎల్లి దాని పేరు నల్లనిచాయది
వయసు పదియు నాలు వత్సరములు
కూలి నాలి చేసుకొనుచుండెడిది గానఁ
జిక్కి నయిన మేని చెలువు గలది-

'మూన్నాళ్ల ముచ్చట' నుండి —

ఇవిగాక్క నీలాగుననుండఁగా, శాస్త్రిగారు 'నాగతి' యను శీర్షికతోఁ గొన్ని పద్యములు రచించిరి. వానిలోఁ గొన్నింటినే యిటఁ బ్రదర్శింతును. సాహిత్య పరమార్థము నేవిధముగా వారు గుర్తింపఁగలిగిరో తెలియఁ గలుగును.

అంబన్ సరస్వతీ భా
వాంబరవీథీ విహార సక్తి ధ్యానిం
పం బూనితి నా భావం
బంబరవీథిన్ సుహావిహారము సలిపెన్.

*

ఆకసము కేసి సూచితిఁ
బైకిఁ బయికి నింకఁ బైకిఁ బయికిం బయికిన్
దూకుచు నెట్టో పోయిన
పోకై నాభావ మెందో పోయెం బోయెన్.

*

అనంతమైన యాకసంబునందు నెందొ యెట్లొ యే
మనన్ గలన్ సుపాకి గుంటి యంతకంటె వేగమై

కనుంగొనంగ రాక పోక గంద్రగోళమయ్యె ; నా
మనంబు, నేను, లేమ — యేమొ మాయమయ్యె నయ్యెడన్.

*

మూర్ఛయేమొ లోన మూల్గు వినంబడె
ననుఱు గల దొకింత మసలినాఁడ
తోఁచ నొడలిలో నదో చేతన—యెటో గ్ర
హింప నాస్వభావ మింఁపు లోలిక

*

దానిగుర్తు పట్టి యానంద మందితి
నట్టు దాని నంటి పట్టి కొంటి
ప్రజ్ఞ వెలసెఁ గన్ను పఱపితి ; నది లోన
లోన కాంచు వెలికి రాని రాదు.

ప్రభాకరశాస్త్రిగారి తాత్త్వికదృష్టి యీ పద్యములలో సుస్పష్ట పడుచున్నది. కవితాపారమ్యమును గుఱించి వారి సందేశము మనము మననము చేసికోవలసియున్నది.

"...తాత్త్వికునిలో కవితాంశములును, కవిలో తాత్త్వికతాంశములును గూడ ననుగతములై యుండవచ్చును....., తాత్త్వికుల తత్త్వజ్ఞానము పెరుగఁగా పెరుగఁగా, తన్మూలముగను కవితలో తాత్త్వికతాంశములు పెరుగఁగా పెరుగఁగా నాఘమున తాత్త్వికతాశ్రద్ధ పెచ్చు పెరుగును. అపుడు కవిత తేట దేరి క్రమపరిణామముతోఁ బరమార్థ పరాయణ మగును. కృత్రిమ కవితావిడంబనముల కపుడు తా వుండదు. కవి కపుడు సత్యప్రతికృతి కల్పన మనావశ్యక మగును. సౌందర్య సముచిత మయిన యీ పరమార్థమే, అనఁగా సత్యమే యప్పుడు వాఙ్మయాకృతిఁ దాల్చును. పదునాఱువన్నె బంగారమును మించిన మేనిసొరు గల శుద్ధసాత్త్విక తేజో విరాజితునకు బంగారపు టలంకారములతోఁ బనియేమి?........."

ఇట్టి దివ్యసందేశము లందిచ్చు రచయితలు మహాత్ములు కారా ? ప్రభాకరశాస్త్రిగారి జీవితము మనరచయితల కొఱవడి గానుండవలసినది. తిరుపతి కళాశాలలో నుపాధ్యాయవృత్తిలో నిపు డున్నారు. గ్రంథముల వలనఁ గొంతరాఁబడి వచ్చుచున్నది. ఇది యంతయు నతిథ్యభ్యాగతుల సత్కారమునకు వినియోగింపఁ బడుచున్నది. భోగ త్యాగములు సరిగా నలవఱచుకొన్నవారిలో శాస్త్రిగారిది యుత్తమస్థానము. మఱి యొకటి : సమాజసంస్కారమును వాంఛించుటయే కాక, ఆచరించి చూపుట వీరిలో గొప్ప విశేషము. శ్రీవిస్సా అప్పారావుగారు, ప్రభాకరశాస్త్రిలుగారును విభిన్నశాఖీయు లయ్యును వియ్యమంది రనుట చెప్పఁదగిన విషయము. ఎన్నో విశిష్టలక్షణములతో నిండారియున్న వేటూరి పండితుని సాహిత్యసేవ శాశ్వతమైనది. ఆయన రెడ్డి రాజ్య చరిత్ర పరిశీలనము, చారిత్రకులకు మేలిబాట చూపినది. ఆయన పీఠికలు మహాగ్రంథములై పొలుపారుచున్నవి. ఆంధ్రకవిత, అరసున్న, ఆంధ్ర లిపి సంస్కారము, వింతనిఘంటువులు మున్నగువిషయములపై వారు చర్చించి ప్రకటించిన సత్యములు మఱచిపోరానివి. ముద్దుముద్దుగా, రస కుల్యలుగాఁ బ్రవహింపఁ జేసిన వారి ఖండకావ్య రచనలు సమాస్వాదింపఁ దగినవి. భాషా—సారస్వత పరిశోధనములందు ప్రసిద్ధులైన ప్రభాకరశాస్త్రిగారి జీవనము విద్వత్కవిలోకమునకు విజయమై జయయంతిక.

# చిలుకూరి నారాయణరావు

# 1890

జన్మస్థానము : విశాఖపట్టణ మండలములోని పొందూరు దగ్గఱనున్న ఆనందపురము. ప్రకృతనివాసము : అనంతపురము. జననము : 1890 సం॥ గ్రంథములు : మతము :— ౧. అథర్వవేదము [మూలము ప్రతిపదార్థము తాత్పర్యము] ౨. ఋగ్వేదసాయన [భాష్యవ్యాఖ్యానమునకు తెలుగు] 3. భగవద్గీత [ఆంధ్రవచనము] ఇత్యాదులు. స్మృతిగ్రంథములు : ఆపస్తంబ ధర్మసూత్రములు ౨. గౌతమధర్మసూత్రములు [తెలుగు వచనము] ఇత్యాదులు. ఇతర మతగ్రంథములు :— ౧. త్రిపిటకములు ౨. ధమ్మపదము 3. అశోకుని ధర్మశాసనములు [పాలిమూలము, సంస్కృతము తెలుగు] ౪. గౌతమ బుద్ధునిజీవితము ౫. జైనమతము ౬. జైనసిద్ధాంతము ౭. బసవేశ్వరుని చరిత్రము ౮. అద్వైతసిద్ధాంతము ౯. ఖురాను షరీపు [ఇస్లాముమూలగ్రంథమునకు తెలుగు] ౧౦. బైబులు [ప్రాత క్రొత్తనిబంధనలకు తెలుగు] ౧౧. సర్వమత సామరస్యము— సంస్కృత భాషాకృతులు :— ౧. సిద్ధాంతకౌముది [మూలము, తెనుగు వివరణము] ౨. విక్రమాశ్వత్థామీయము— ఇత్యాదులు. శాస్త్రగ్రంథములు :— ౧. తర్కసంగ్రహము ౨. శకునశాస్త్రము 3. ప్రసవశాస్త్రము ఇత్యాదులు 25 శాస్త్రగ్రంథములు. చరిత్రకృతులు :— రోము, గ్రీసు, రష్యా, చీనా, జపాను, బర్మా, ఆంధ్ర ఇత్యాది దేశ చరిత్రములు మొత్తము 20. జీవితచరిత్రములు ; గాంధీ చరిత్ర, టాల్‌స్టాయి చరిత్ర మున్నగునవి 8. భాషాశాస్త్రకృతులు :— ౧. ఆంధ్రభాషా చరిత్ర [2 భాగములు] ఇత్యాదులు మొత్తము 8. సంస్కృత ప్రాకృతాది వాఙ్మయ చరిత్ర గ్రంథములు 14. భాషాస్వయంబోధినులు 15. విద్యావిధాన గ్రంథములు మొత్తము 10. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము [10 సంపుటములు] కవి జీవితగ్రంథములు మొత్తము 20. నాటకములు :— ౧. అంబ లేక కొండిశిఖండి ౨. అశ్వత్థామ 3. ఆచ్చి లేక కాపురకలపు ౪. పెండ్లి ౫. వాడే [పరిశోధకము] ౬. నాటక నాటకము. [హాస్యము] ౭. తిమ్మరుసు. ౮. బొమ్మపాత్రికలు ౯. మధురాంతకి ఇత్యాదులు మొత్తము 20. పద్యకావ్యములు :— ౧. రుబాయత్ [ఉమార్ ఖయామ్

౨. తుకారాం 3. జపానుదేశ కవిత [తొలిసంజ- తెలిచాయలు] ఇత్యాదులు మొత్తము 11. నిఘంటువులు :- ౧. సంస్కృతాంధ్ర నిఘంటువు. ౨. అచ్చికపద నిఘంటువు. 3. నన్నయ భారత పద కోశము ౪. తెనుఁగుసామెతలు [1,50,000 సామెతలు తెలుఁగుదేశము లోనివి] ఇత్యాదులు 18.

## WORKS IN ENGLISH

(1) Translations from Tikkana. (2) Translations from Potana. (3) The songs of Tyagaraja (4) The dance of the Rain-drops (Modern Poetry,) (5) A Survey of Telugu Literature (6) Modern trends in Telugu literature—

పయిని పేర్కొనఁ బడిన గ్రంథములలోఁ గొన్ని మాత్రము ముద్రితములు.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి పేరు తెలియనివారుండరు. ఆయన ఎమ్. ఏ. పి హెచ్, డి, ఎల్. టి. అనంతపురము 'ఆత్రేయాశ్రమము' వారి యునికి. కాని, ఆంధ్రభాషాచరిత్ర ప్రచారమునకు నారాయణరావుగారు యావదాంధ్రము సంచారము చేయుచుందురు. ఇప్పటికి, వారి వయస్సు షష్టి. ఈమధ్యమిధ్యలో భావవృష్టి కలిమిఁ, దెలుఁగు దేశమే కాదు భారతభూమి సర్వము పర్యటింపఁ గలుగుచున్నారు. ఈమానిసి భౌతికముగా ద్రష్టుఁడు కాఁడు. 'దర్భపుల్ల' వలె సన్నమైన గాత్రము. ఒకకన్ను కొంచెము మెల్ల. మఱి, వ్యక్తిని జూడఁగా, సపాద లక్ష-పుటల పరిమితిగల వాఙ్మయమును సృష్టించిన మహారచయిత యీయనయేనా, అని సంశయించుకొనునంతటి చిత్రము. ఈ నడుమనే కర్ణాటక దేశయాత్రలో ధార్వాడ, హుబ్బళ్ళి, బిజాపురము, బెళ్గాఁవు మున్నగా నెన్నో పట్టణముల సంచారము గావించి యాంధ్రవాఙ్మయ ప్రశస్తి నుగ్గడించివచ్చినారు. దర్భంగ, వారణాసి మున్నగానున్న

పట్టణములలోనున్న అఖిలభాగముల రచయితలుగల మహాసభలో బాలుగొని తెలుఁగు దేశభాష పరిస్థితి యిట్టిదా! యని సిగ్గింపఁ జేయునటులు మాటలాడినారు. ఆంధ్రరాష్ట్ర ప్రత్యేకతకై నడుముకట్టిపనిచేయు కర్మ వీరులలో నారాయణరావుగారు నొకరు. ఆయనది వజ్రసంకల్పము. ఆయన కావించిన భాషా—వాఙ్మయ చరిత్ర పరిశోధనము లనంతములు. ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రకటించిన రెండు పెద్ద సంపుటములలో నారాయణరావుగారి భాషాచరిత్రపరిశీలనము రూపము గట్టియున్నది. ఈ గ్రంథము రావుగారి సేవకు లక్ష్యమే కాకుండ, మనభాషకు మండనమును. ఈ గ్రంథములో గతానుగతికమైన విమర్శనము కాక, సొంతమైన పరిశ్రమము హెచ్చుగా నున్నది. అది కారణముగా నిట్టి కృతులు పెక్కుకాలము సమారాధన యోగ్యములు కాఁగలయవి. తెనుఁగునకు ద్రావిడ భాషా సంబంధమునుగురించి నెఱపిన 'కాల్‌డ్వెల్' సిద్ధాంతమును గాదనుచు నారాయణరావుగారు చేసిన యమోఘ కృషికి వారి 'ఆంధ్రభాషాచరిత్ర' మేలిపంట. వీరి సిద్ధాంతములపై రాద్ధాంతములు వెలువడుచుండుటయు గమనించుచున్నారము. ఏమైనను, ఒకరి దారి ననుకరించుచుఁ జేసిన విమర్శనముకంటె, స్వతంత్రుఁడై చేసిన విమర్శనము హృదయములకు హత్తుకొని నిలవగా నుండుటకును వీలగును. ఇట్టి స్వతంత్ర పరిశ్రమము నారాయణరావుగారిని వలచినది. వాఙ్మయ చరిత్ర విషయములో నారాయణరావుగారి దారులు కొన్ని ప్రామాణికములు కావనుకొందురు. ఈ విషయమున నేను బొత్తిగా నజ్ఞుఁడను.

చరిత్రపరిశోధన యొక బండపనియనియు, చరిత్ర పరిశోధకుల హృదయములు రసార్ద్రములు కావనియు ననుకొనుట పరిపాటి. అది నేటి కాలమున చాలభాగము తగ్గినది. శ్రీ ప్రభాకరశాస్త్రి, సోమశేఖరశర్మ ప్రభృతులు ఇరువైపుల వాఁడిగల పండితులు. నారాయణరావుగారినిగూర్చి యోచించినపుడు, వీరేశలింగముపంతులుగారు స్మర

ణకు వత్తురు. పంతులుగారు పేరుగొన్న చరిత్రశోధకులే. వారి కవితా కళాభిరతియు జగద్విఖ్యాతము. కావ్యములు, ప్రహసనములు, నవలలు, నాటకములు వందలుగా రచించిరి. వారివలెనే పరిశోధనశక్తికిఁ దోడు కవితా సౌందర్యము నుపాసించిన కవులు నారాయణరావుగారు. వీరి 'అంబ' — 'అచ్చి' మొదలయిన నాటకములకుఁ దెలుఁగునాఁటఁ బేరు వచ్చినది. నవ్యసాహిత్యపరిషత్తు సంస్థాపకులలో, అధ్యక్షగణములో నారాయణరావుగారొకరు. అభ్యుదయ రచయితలలోను వీరికి సభ్యత యున్నది. అనఁగా ఆధునిక సాహిత్యదృష్టి వీరి కత్యధికముగా నున్న దనుట. ఆయన పద్యములు ఛందోబంధమున వ్రాసెను. పాటలును వ్రాయును. 'మహానటుని మయూరనృత్యము' అను పేరుతో కాశిలో జరిగిన అఖిల భారత రచయితల మహాసభలో ఆశువుగాఁ బాడినగేయ మొకటి నారాయణరావుగారు ప్రకటించినారు. అది కొన్ని చరణములు మనవిచేసెదను. అఱువదియేండ్లు నిండిన రావుగారు, ఈపాటలో ఇరువది యేండ్ల యువకుఁడై కనిపించుచుండె నని నా కానందము.

ఈసదామహాశ్మశాన - వాసి కాశికావిభుండు
విశ్వనాథుఁడిప్పు డిదేమొ - యీ చిదంబర ప్రచండ
కాలమేఘరాశి జూచి - యానందం బంతకంత
కతిశయింపగా మయూర - నృత్యముతో మొదలించి
నందికేశనాట్యరీతి - దుంఠినాథ లాస్యఫణితి
మించి తాండవించె నేఁ డిదేమొ - రండు, గణనాథులు!

*

కాళ్ళకు గజ్జెలు - కటిపై పులితోల్
హస్త, కంఠ, భుజ - మస్తక ఘూత్కృ
త్సర్పభూషణుఁడు - మహానటుడు
నృత్యమాడు లాస్యమాడు తాండవించు

నోంకార శ్రుతితో నారాయణ రాయరచిత
గీతమునకు నా సహృదయసభ్యులెల్ల
తాళగతుల జతులతోడ మనోవీథి
తామకూడ తాండవింప.. ఇదిగో నృత్యము
భారత భూమీ నాయన్య దిశా
ప్రచలిత ఝుంఝూ మారుత ప్రేరితంబై
భారభారాలసంబై ఘూనదృక్ క్షోభితంబై
తధిగిణ తళంగ్
తళంగ్ ! తళంగ్ ! తళంగ్

*

ఇదిగో, ఇదిగో ప్రచండ తాండవ మిదిగో,
పాకీస్థాన్ - ద్రవిడస్థాన్
ఖాల్టిస్థాన్ - చంపేస్థాన్
ఖణేల్ ! ఖణేల్ !
ధమా ! ధామ్.

ఈ యావేశము నవీన కవులలో నందఱికిని లభింపని యావేశము. నారాయణరావుగారికి దేశ మనఁగా భాష యనఁగా నెక్కుడలేని యుత్సాహము పుట్టుకొని వచ్చును. వీరు వ్యావహారికభాషావాదులు. గిడుగువారి గురుత్వము. వ్యావహారికభాషలో రసవంతమైనట్టిదియు, జీవ వంతమైనట్టిదియు నగు మార్గము గ్రంథరచనానుకూలమైనది యున్నదని నారాయణరావుగారు సనిదర్శనముగాఁ జాటుచుందురు. ఈయన విమర్శనము మోమోటము లేకుండ సూటిగాఁ బోవును. 'సజీవభాష' ను గూర్చి నారాయణరావుగారు నిష్కర్షించి ప్రకటించిన యభిప్రాయమిది:-

"...సజీవభాషయనఁగా...జీవముతో కూడిన భాష. ప్రాకృత జన భాషితమైనభాష. ఆ ప్రాకృతజను డిప్పటివాడే కానక్కరలేదు. ఏనాటి

వాడైనా కావచ్చు. ప్రాకృతానుభవములు నాభాషలో ఎన్నడైనా వ్యక్తపరచిఉంటే అది సజీవభాషే అవుతుంది. కాబట్టి యీలక్షణము కలిగి ఉన్నంతసేపున్నూ కావ్యభాష సజీవభాష కాదనడానికి వీలులేదు. కావ్యములలో ఉపయోగింపబడక పోయినంతమాత్రముచేత అది సజీవ భాష కాకపోదు. భాషాప్రయోజనము సిద్ధిస్తున్నంతసేపున్నూ అది సజీవ భాషే. కాని, ఆభాష కేవలవ్యావహారికమై స్థూలజగత్ప్రచారములో ఉన్నా కావ్యజగత్తులో తాండవించి సూక్ష్మేంద్రియగ్రాహ్యము మాత్రమే అయినా సంస్కృతవాణికి లక్షణములుగా ఆలంకారికు లేర్పరచిన దశవిధ గుణభూషితమై దశవిధ దోషవర్జితమై మనోహర రస, రీతి, పాకశయ్యాలంకార శోభితమైఉంటే అంత ఆదర పాత్ర మౌతుందని వేరే చెప్పనక్కరలేదు. భాషాశోభ కుపకరించి దాని జీవమును ప్రకటించే విధానము నాలంకారికు లేర్పరించియున్నారు. ”

భాషా — వాఙ్మయములకు నిరంతరసేవ గావించు నారాయణరావు గారి విద్యాభ్యాసాదులను గూర్చి ముచ్చటించు కొనవలయును. ఆయన జన్మస్థానము విశాఖపట్టణ మండలములోని ఆనందపురము. కాని, ఆయనకు రాయలసీమవారుగానే పరిగణనము. నేనిట్లనను. నారాయణ రావుగారిది తెలుఁగుదేశము సర్వమును. ఈసీమల ద్వైతభావము నశించినఁగాని మనకు ముక్తిలేదు.

పర్లాకిమిడి కళాశాలలోను, విజయనగరము మహారాజ కళాశాల లోను రావుగారి ఆంగ్ల విద్యాభ్యాసము. విజయనగరములో నుండగనే సాహిత్య కృషికి బీజావాపము జరిగెను. మదరాసు విశ్వవిద్యాలయ మున, తెలుఁగు, కన్నడములలోఁ బట్టభద్రతా లాభము. తరువాత కొలఁది కాలమునకే నారాయణరావుగారు "డాక్టరు అఫ్ ఫిలాసఫీ". ఈ బిరుదము 14 వ శతకములోని తెలుఁగు రచనను గూర్చి చేసిన పరిశోధ

వచునకుఁ బంట అనలు, నసిపాటినుండి రావుగారికి భాషా—సారస్వత చరిత్రపరిశోధకతతో మంచియభ్యాస. బోధనచాతుర్యము వీరిది గొప్పది. విశాఖమండలములోని 'అరనవిల్లి'లో రెండుపాఠశాలలు నారాయణ రావుగారు నెలకొల్పిరనఁగా, ఆయన సేవాపరాయణత యెట్టిదో భావింపఁదగును. ఆపాఠశాలలో నొకటి రైతుపిల్లలకు, రెండవది హరిజనులకు నుపయోగించునవి. వ్యవసాయము మీఁద రావుగారి కెంతో మక్కువ. గంజాం జిల్లాలో జరిగిన నూతన వ్యవసాయ పరిశోధనపుఁ బోటీలో వీరికి బంగారు పతకము బహూకృతి లభించినది. ఉత్తరసర్కారు జిల్లాలో ఇంగ్లీషు బోధనశక్తి ప్రచారము చేయుటకుఁగా "ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు" ఉద్యోగము రావుగారి కీయఁబడినది. ఈ యవకాశములో వీరు జర్మను—అమెరికా సంయుక్తరాష్ట్ర విద్యావిధానములను గూర్చి తెలుఁగునఁ బ్రచారముగావించిరి. తరువాత, అనంతపురము కళాశాలలో నాచార్యకము. సుగృహీతనామధేయులగు నెందఱో శిష్యులు రావుగారి పేరు చెప్పుకొనుచున్నారు. ఈయదృష్టము వారిది మెచ్చఁదగినది. మదరాసు, మైసూరు, ఉస్మానియా విశ్వవిద్యాలయములలో నెన్నో సంఘములకు వీరు సభ్యులుగా నుండి గౌరవముల నందిరి. రాజమహేంద్రవరము నందలి 'ఆంధ్రేతిహాస పరిశోధకమండలి' కిఁ జెక్కుకాలము అధ్యక్షులుగా నుండి నారాయణరావుగారు చేసిన పరిశోధన కృషి యమోఘమైనది. ఆ మండలికి తాళపత్రగ్రంథములు, కొన్ని వందలు వీరు దారవోసిరి. చాల కాలమునుండి సేకరించిన శిలా—తామ్ర శాసనములు, నాణెములు మండలికే యిచ్చివైచిరి. ఈ యౌదార్యము చారిత్రకులకు శిరోధార్యమైనది. రాయలసీమలోని కృష్ణదేవరాయ విద్యాపీఠసంస్థకు స్థాపకత్వము, అధ్యక్షత్వము నారాయణ రావుగారిది. ఇట్టి భాషా లోకోపకారకములగు కార్యముల వలనఁ జిలుకూరి వంశ తిలకుఁడు మాయని యశస్సు సంపాదించెను.

నారాయణరావుగారు వ్రాసిన గ్రంథములు శతాధికములుగా నున్నవి. ఆయన సారస్వతమునకు సంబంధించిన ప్రతిశాఖలోను విలువ గల వ్యవసాయముచేసి యెన్నో కృతులు పండించెను. నవలలు—నాటకములు—జీవిత చరిత్రములు—భాషాచరిత్రములు—పద్యకావ్యములు—గేయములు—ఇవన్నియు వ్రాసికొన్నారు. ఉపనిషత్తులు, భగవద్గీత, అధర్వ వేదము ననువదించినారు. 'ప్రపంచమతగ్రంథమాల' నెలకొలపి పెక్కు వాఙ్మయములలోని రచనలు తెలుఁగులోనికి బాగుగా బరివర్తనముచేసి యిచ్చినారు. కురాను షరీఫు—జెండా వెస్తా ఇత్యాదులు. నారాయణరావుగారి లేఖిని శతాధిక గ్రంథములు సృష్టించినది. ఆయన వాఙ్మయ తపస్వి; సారస్వతయాజి; వాఙ్మయద్వారమున దేశారాధనము, ఈశ్వరసేవ సాగించుచున్న మహాశయుఁడు.

శ్రీ రావుగారి కృషిని గుర్తించి బ్రిటిషుదొరతనము 1947 జూనులో 'మహామహోపాధ్యాయ' బిరుదము నిచ్చినది. నాఁడు ఇండియా ప్రభుత్వము, పరప్రభుత్వములిచ్చిన బిరుదములను నిషేధించినందు వలన వీరు దానిని స్వీకరింపలేదు. 1947 నవంబరులో కాశీ సంస్కృత విద్యాపీఠము 'మహోపాధ్యాయ' బిరుదముతో జోడు సాలువల నిచ్చి రావుగారిని సన్మానించినది. వీరి నాటకరచన, విమర్శన శక్తి గమనించి "ఆంధ్ర బెర్నార్డుషా" యనియు వ్యవహరింతురు. సత్యమైన సేవా పరాయణత గల కళాప్రపూర్ణులకు బిరుదభారముతో పనియుండదు. ఓరిమి — పరిశ్రమ పేరిమి — ప్రతిభా వ్యుత్పత్తుల నేరిమి కలసి చిలుకూరి నారాయణరావు పేర వెలసినది. అనంతపురమున, ఆత్రేయాశ్రమ వాసములో సుపవిత్ర జీవితము గడుపుచున్న చరితార్థులు వారు.

---

# మల్లంపల్లి సోమశేఖర శర్మ

# 1891

జన్మస్థానము : మినుమించిలిపాడు అగ్రహారము. నివాసము ప్రకృతము మదరాసు. జననము: 1891 సం. రచనలు :— ౧. ఆంధ్రవీరులు ౨. అమరావతీస్తూపము. 3. చారిత్రకవ్యాసములు ౪. ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము ౫. రోహిణీచంద్రగుప్తము [నవల] ఎన్నోవ్యాసములు, శాసన పరిష్కారములు, పీఠికలు మొదలగునవి. ఆంగ్లగ్రంథములు :— 1. Forgotten Chapter of Andhra country. 2. The History of the Reddy Kingdoms.

నేంటిచరిత్రపరిశీలకులలో సోమశేఖరశర్మగారి స్థానము మహోత్తమమైనది. కొమర్రాజు లక్ష్మణరావుగారి తరువాతఁ బ్రామాణికత వీరిదే యని తెలుఁగువారికిఁ జక్కని విశ్వాసము కలదు. లక్ష్మణరావుగారు, వీరభద్రరావుగారు తొలుత శర్మగారికి లక్ష్యభూతులు. విజ్ఞానసర్వస్వ రచనలోఁ బెద్దకాలము లక్ష్మణరావుగారికి శర్మగారి సాహాయ్యసంపత్తి చేకుఱినది. నిశితమైన చూపు — నిర్మలమైన మనస్సు — సహజమైన కళారసికత — సందర్భశుద్ధమయిన వాక్కు — నిక్కమయిన చరిత్రజ్ఞాన — నిరంతరాయమైన పరిశోధనము — ఇన్ని సుగుణములరాశి, శర్మగారనఁగా సాధారణుఁడు కాఁడు. శాసనపరిష్కారములో నేఁడున్న వారిలో వారినిదాఁటినవా రుండరు. లిపిశాస్త్రము వీరాయన చక్కఁగా నెఱుఁగును. 'శాసన దర్శనమునకు లిపిరహస్యజ్ఞత సుధాంజనము. ఆ మేలి కాటుక శర్మగారి సొంతము. ఈయనసంగ్రహించి ప్రకటించిన శాసనము లిన్ని యన్ని యని యెన్నఁజాలము. ప్రాచీనదక్షిణహిందూ దేశ చరిత్రము సర్వము శర్మగారికిఁ గరబదరము. బౌద్ధయుగమును గూర్చిన వీరిపరిశీలనము గొప్పవిలువగలది. రెడ్డియుగమును గూర్చిన వీరి

యమోఘము, నపూర్వమునగు విస్పష్టవిషయ సందోహము మహాగ్రంథమైనది. శాతవాహనులు — చాళుక్యులు — కళింగ గాంగులు — కాకతీయులు — వీఁవీరియుగములను గాలించి పరమరహస్యము లెన్నో వెల్లడించిన పరిశోధకతల్లజులు మల్లంపల్లివారు. నిజమున కాయన గొప్ప యుద్యోగములో నుండవలసినది; లేదా, మహాధనవంతుఁడుగా నైన నుండఁగిదనవాఁడు. ప్రస్తుతమీ రెండును నెఱసున్నలు. ఆయునకు విడవరాని మహోద్యోగము పరిశోధన యొక్కటే. ఆయనకున్న మహాధనము ఆంధ్రవాఙ్మయ మొక్కటే. తెలుఁగువారి పూర్వసంస్కృతి త్రవ్వి త్రవ్వి తండములయిన వ్యాసములలో మనకందిచ్చిన శర్మగారు పూజనీయులు. శాసనపరిశోధకులు, భాషాపరిశీలకులు నైనవారికి సాధారణముగాఁ గళావిలాసములు తెలియవు. అది హేతువుగా, రచనా సౌందర్యమును వారు ప్రదర్శింపలేక పోవుదురు. శర్మగారి కటులు కాదు. ఈయన యెన్నఁదగిన కళార్ద్రహృదయముగల వ్యక్తి. కవిత్వము లోఁతు లెఱుఁగును; కళల నెన్నింటనో పరిచితియున్నది. అందుకే, యీయనరచన సహృదయ హృదయములను స్పందింపఁజేయు మాధురీ మార్దవములు పొదిగించుకొన్నరచన. గ్రాంథిక — వ్యావహారికములు రెండును వడిగా, వాఁడిగా వ్రాయఁగలుగుదురు. గహనములయిన చరిత్రవిషయములు వీరి కవిత్వములోఁబడి సౌలభ్య వాల్లభ్యములై ప్రజాసాధారణమునకు సుఖలభ్యములగును. ఆవేశోత్సాహములు జనింపఁజేయు నింపయిన రచన శర్మగారిచేతిలో నున్నది - ముచ్చటకుఁ గొన్ని మచ్చుపంక్తులు :-

"......వామనుఁడు తనపాదత్రయముచే ముల్లోకముల నావరించినట్లు భారతధర్మ సంస్కృతి యీమూఁడు ప్రస్థానములయందును దిశాష్టకము నాక్రమించి యతిశయిల్లినది. అప్పటికి నిప్పటికిఁ బ్రపంచ చారిత్రమున ధర్మ సామ్రాజ్యమును స్థాపింప యత్నించిన వారును, స్థాపించినవారు నొక్క భారతీయులే. భారతీయుల ధర్మసంస్కృతి

సామ్రాజ్య చారిత్రము అపూర్వమైన యొక ధర్మ విజయ గీతము; ఒక అహింసావిజయగాథ. అది భారతీయుల మంజుల మధుర మనోహర స్వాప్నిక గానము.

ఏమో ఎవ్వరెఱుఁగుదురు, ఎప్పుడు పుట్టిపెరిగి అంతటి పెద్దవాఁడయ్యెనో? ఎంత కాలమునుండి యచ్చట నివాసముండెనో? చరిత్రకు కొంత ప్రాజ్ఞత వచ్చునాఁటికే ఆయుష్మంతుఁడయిన ఆర్యకుమారుఁడు భారతభూమిని పచ్చనిపైరుచేల నడుమ, వనలక్ష్మి అంగాలు దిద్దుకొని సాంద్రాటవీ సీమల మధ్య ఆశ్రమపదములు నిర్మించుకొని పర్ణకుటీరములందు కర్మపరతంత్రుఁడై విరాజిల్లెను. ముం దగ్నిహోత్రముతో పార్శ్వములయం దధ్యయన పరాయణమైన ఛాత్ర బృందముతో వేదఋక్కులు వల్లెవేయుచు, నెడనెడ సామగానము నాలపించుచు తాను త్రొక్కినంత మేర భూతలమును కర్మనిబద్ధముగను, ధర్మనిబద్ధముగను గావించి తనచూపు ప్రాఁకినంత లెక్క తానే పెద్దనని గడ్డము సవరించుకొనుచు దర్పముతో ప్రవర్తించిన కర్మవీరుఁ డతఁడు. జగత్తంతయు నిద్రాపరవశమై యుండఁగనే తొలుదొలుత మేలుకాంచి తెలివి తెచ్చుకొని పెద్దఱికము వహించిన ప్రోఢ యతఁడు. ఎవ్వ రెఱుఁగుదురు? ఎప్పుడు పుట్టి పెరిగి యంతటిపెద్ద వాఁ డయ్యెనో? ఎంతకాలమునుండి యచ్చట నివాసముండెనో?......"

'చారిత్రకవ్యాసములు' 3 పుట

చక్కని తీరుదల యిట్టిరచనలో నెన్నో క్రొత్తవిషయములు శర్మగారు తెలుఁగువారి కిచ్చుచున్నారు. విజ్ఞాన దృష్టికి మల్లంపల్లి వారి జీవిత మొక వసంతారామము. ఆర్థిక దృష్టిలో, ఆయన నిరంతర శ్రమజీవి. బాల్యమునుండియుఁ బేదఱికిఁ జాలువడి విజ్ఞాన సమార్జనము చేసికొనెను. మనుగడలో నొడుదొడుకులు, ఢుందుడుకులు రానిచ్చుకొనని స్వభావము మొదటి నుండియు నున్నది. ఆంగ్ల విద్యలో నున్నత

పట్టములు పడయు నలయుననెడి తీవ్రాశను, ధనాభావము సన్నవడఁ జేసినది. పసినాఁట సంస్కృత విద్యాభ్యాసము. మేనమామగారి సహకారముతో "స్కూలుఫైనలు" ఉత్తీర్ణత. అప్పటి శర్మగారి యీడు పదునాలేండ్లు. ఆలేతవయస్సులో నుద్యోగము కోసము నవసి నవసి మెచ్చుటను స్థిరపడక యుండెను. నాఁటి జాతీయ మహోద్యమ నాదములు శర్మగారిలో నొక నూతనచైతన్యము రేఁపినవి. 1911 సం॥ ప్రాంతములో నుద్యోగ గవేషణము వదలుకొని మదరాసు ప్రయాణము. అచట, ఆంధ్రులచరిత్ర గ్రంథము సంధానించుచున్న మహామహుఁడు చిలుకూరి వీరభద్రరాయనితోఁ బరిచితి యేర్పడినది. శర్మగారికి రావుగారితోఁ జరిత్రపరిశోధనము గావింపఁ దలంపు కలిగినది. ఆదిలో, "కన్నమరా గ్రంథాలయము" న నచ్చుగాని కృతులకుఁ బ్రతులు వ్రాయుట శర్మగారి యుద్యోగము. చాలీ చాలని యక్కడి జీతముతో జీవితము సాగించుకొనుచు నున్న శర్మగారికి, లక్ష్మణరావు గారి చెలికారము భావ్యర్థ సమవలంబమైనది. 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ' రచనా సహకృతితో శర్మగారికి లక్ష్మణరావుగారు రజతసింహాసన మిచ్చి యభినందించిరి.

1912 లో, ఆంధ్రుల చరిత్ర రచన ముగిసి వీరభద్రరావుగారు రాజమహేంద్రవరము వచ్చివేసినారు. శర్మగారును మదరాసు మకాము మాని రాజమహేంద్రవరమే వచ్చి యుండి 1914 మొదలు నాలుగేండ్లు చిలకమర్తి లక్ష్మీనరసింహారావుగారి 'దేశమాత' పత్త్రికకు సంపాదకత నిర్వహించిరి. ఈ సంపాదకత్వము శర్మగారి పరిశోధన రచనా ప్రణాళికకుఁ జక్కని త్రోవలు తీయించినది. మఱియొకటి చెప్పఁదగిన సంగతి; వీరు "ఆంధ్రాభ్యుదయ గ్రంథమాల" నెలకొలిపి ఆంధ్రవీరులు, ప్రాచీన విద్యాపీఠములు, ప్రాచీనాంధ్ర నౌకా జీవనము మున్నగాఁ గొన్ని గ్రంథములు వెలువరించిరి. ఈతీరున సారస్వతమును సేవించు మల్లంపల్లి

శర్మగారికి, మరల మదరాసునుండి కోమట్రాజు వారి యాహ్వానము. దుర్నియతి యటులుండి, శర్మగారు చెన్నపురి చేరిన కొలఁది నాళ్ళకే లక్ష్మణరావుగారి యస్తమయము. అది 1923 సంవత్సరప్రాంతము. 'విజ్ఞాన చంద్రిక' సన్నవడినది. విజ్ఞానసర్వస్వమునకు అదియాది పెక్కేండ్లు శర్మగారు చేసిన కృషి మఱచి పోరానిది. ఈ వ్యవసాయమునకు ఫలముగా ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు చారిత్రపరిశీలక పండితులుగా రమ్మని శర్మగారిని పిలిచిరి. వారచటఁ గావించిన యమోఘ పరిశ్రమమునకు సాక్షులు "ఎ ఫర్గాటన్‌చాప్టర్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ"–"ది హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్‌డమ్స్"–అను రెండుచరిత్రగ్రంథములు.

శర్మగారిది సంస్కృతాంధ్రాంగ్లభాషలలో 'డిగ్రీలు' లేని నిశితప్రజ్ఞ. ఆంధ్రవీరులు, రోహిణీచంద్రగుప్తము, కొన్ని చిన్నకథలు వీరి కళారచనాభిరతిని దృష్టాంతీకరించుచున్నవి.

ఈయన చారిత్రకవ్యాసములలో బౌద్ధ సంస్కృతి రూపు కట్టియున్నది. 'రేడియో' లోఁ బ్రసారితమగు వీరి 'ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము' సంగ్రహమైనను బహూపయోగియగు కూర్పు. సహృదయులు, చరిత్రపరిశీలక శేఖరులు నగు వారి యునికి ప్రకృతము చెన్నపురిలో. నిర్బంధోద్యోగపు టుచ్చులలో నిచ్చలు ఉండలేని స్వతంత్రజీవులు శర్మగారు. ఆంధ్రచరిత్ర– సంస్కృతులను గూర్చి యింక నెన్నో నూత్నవిషయములు మనకు వారీయఁగలరు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారితో శర్మగారికి మంచి నేస్తము. ఆయన 'ఆంధ్ర ప్రశస్తి' యీయనకుఁ గృతియిచ్చుచు నిట్లు వ్రాసెను:–

నీ వనుకోను లేదు, మఱి నే నిది చెప్పను లేదు, కాని య
న్నా, వినవయ్య నేఁటి కిది నా చిఱు పొత్తము నీకు నంకితం
బై వెలయింపఁ జేతు హృదయంబులు నీకును నాకు మాతృదే
శావిల దుఃఖ దారితములై శ్రుతిగల్పి విషాద గీతికన్.

*

మల్లంపల్లి సోమశేఖరశర్మ

డిగ్రీలు లేనిపాండిత్యంబు వన్నెకు
రాని యీ పాడుకాలానఁ బుట్టి
నీ చరిత్ర జ్ఞాన నిర్మలాంభఃపూర
మూపర క్షేత్రవర్గోదకమయి
చాడీలకు ముఖప్రశంసల కీర్ష్యకు
స్థానమై నట్టి లోకాన నుండి
నీయచ్ఛతర కమనీయ శీల జ్యోత్స్న
అడవి గాసిన వెన్నెలగుచు చెలఁగి
అంతె కాని గాఢశంకరాచ్ఛ శృంగ
తుంగము త్వదీయుచు మనస్సు పొంగి తెలుఁగు
నాఁటి పూర్వ చరిత్ర కాణాచి యెల్ల
త్రవ్వి తలకెత్త లేదె యాంధ్రజనములకు.

*

కొదమ తుమ్మెద రెక్కలఁ గుస్తరించు
మీసముల నీప్రసన్నగంభీర ముఖము
కన్నులంటఁగఁ గట్టినట్లున్న నిన్ను
మఱచి పోలేను జన్మ జన్మములకైన.

---

# రాయప్రోలు సుబ్బారావు

## 1892

జననము: 1892. నివాసము: హైదరాబాదు. గ్రంథములు: ౧. కవితాంజలి [తృణకంకణము, స్నేహలతాదేవి, స్వప్నకుమారము గల సంపుటము] ౨. జడకుచ్చులు ౩. మధుకలశము ౪. రమ్యాలోకము ౫. తెనుగుతోట ౬. ఆంధ్రావళి ౭. లలిత ౮. వనమాల ౯. మధురయాత్ర ౧౦. మాధురీదర్శనము – ఇత్యాదులు.

అభినవాంధ్ర కవితావతరణమునకు దారిచూపినవారిలో రాయప్రోలు సుబ్బారావుగా రొకరు. సారస్వతపురోహితులగు సుబ్బారావుగారే యొకజాతి తెలుఁగుకైతకు 'భావకవిత్వము' అను నామకరణ చేసినట్లు విందుము. నేఁడు 'భావకవిత్వము' సర్వతోముఖముగా విస్తరిల్లినది. కవిత్వములో నవ్యమార్గము గురుజాడ అప్పారావుగారితో నారంభమైనదని కొందఱు, సుబ్బారావుగారితోఁబుట్టినదని కొందఱును. అదియెట్టు లయినను, సుబ్బారావుగారితో నూతనకవిత్వమున నొకమెఱుఁగు వచ్చినదని చెప్పవచ్చును. ఈగౌరవము వారిమీఁద మన తెనుఁగు వారిలోఁ జాలమందికిఁ బొందుపడినది. సుబ్బారావుగారి వ్రాఁతలు క్రొత్తలో యువకవుల హృదయములలో నూతన సంస్కృతి బీజములునాఁటినవి. ఈయన కలిగించిన సంస్కారమువలనఁ గలిగిన యొగ్గు లగ్గులు ప్రస్తుతము ముచ్చటింపరాదు.

భావకవిత్వ మనుపేరిలోనే పెద్దపోరు. "భారతాదులలోఁ గవిత్వము లేదా? భావములేదా?" అని ప్రశ్నములు చాలఁబుట్టినవి. అందు గొన్ని సందర్భములేని ప్రశ్నములు. ఆలంకారికదృష్టిలేనివారు మాత్రమే 'భావకవిత్వము' అనుపేరు లెస్సగా లేదనుటకుసాహసింతురు. కాని ఒకటి, 'నవ్యకవిత్వము నాస్తిక కవిత్వము' అనునూహ కొందఱిలో కలిగించినది మనవారే. భాషాసంస్కారము బహుస్వల్పముగానున్న కొందఱు

నూతనకవులు చేకఁగాని వ్రాఁతలు వ్రాసి, వానిపై భావకవిత్వ ముఁద్రవేసి బ్రతుకు తెరువు చూచుకొనుచుండుటవలన నీ కొంపమునక మైనది.

రాయప్రోలువారు పరిపక్వమతులు; పాశ్చాత్య సాహిత్యవిశారదులు; నవ్యకవితోపాసకులు. పడమటి కవులలోని ప్రకృత్యారాధన వరత్వము వీరిలోఁబుంజీభవించినది. వీరిభావన గభీరమధురమైనది. స్వరకల్పనము అభినవమైనది. వీరికవితకు ద్రాక్షా-కదళీపాకములు సహజములు.

మామిడి కొమ్మ పైన గల మంత్రపరాయణుఁడైన కోకిల
స్వామికి మ్రొక్కి నేనభినవస్వర కల్పన కుద్యమించితిన్
గోమల గోస్తనీ రుచులకుం గదళీఫలపాక సిద్ధికిన్
లేమల దేరు మా తెలుఁగు లేఁతముదల్లు వెలార్చు వేడుకన్.

రమ్యాలోకము

1912 సం॥న నవ్యకవిత్వ నేపథ్యమునుండి క్రొత్త నడలతోఁ గొత్తవిలాసములతోఁ గ్రొత్తహావభావములతో ' లలిత ' కావ్యము రంగమునకు వచ్చినది. తోడనే రసజ్ఞభావుకుల చక్షూరాజీవములు దానిపైఁ బడినవి. ' లలిత ' తో యువకవు లువ్విళులూరిరి. ప్రాచీనసాహిత్య పరాయణులు ' లలిత ' స్వేచ్ఛాప్రవృత్తికి లోలోపల బాధపడిరి. ఆంగ్లేయువాసన పట్టి క్రమముగాఁదెలుఁగువారు నవ్యకావ్య పఠనమున కలవాటు పడినారు. ' తృణకంకణము ' వెలువడినది. శాబ్దికముగాఁ గొన్నిదోసఁగులు దొరలినను సుబ్బారావుగారిది మంచి నిబ్బరమైన కవితా ధోరణి యగుటచే యువకుల గుండెలకుఁ బట్టుకొన్నది. కష్టకమల — స్నేహలతాదేవి — స్వప్నకుమారము — తెలుఁగుతోట — ఆంధ్రావళి — రమ్యాలోకము మున్నగా నెన్నోకృతులు వీరివి విరివిగా వ్యాపించినవి.

రాయప్రోలు కవి 'శాంతినికేతనము 'నఁ గొంతకాలముండి రవీంద్ర సాహచర్య మనుభవించెను. ఆ సాహచర్యము వీరికవితా శక్తికి వికాసము. పెక్కుభాషల నెఱిఁగి ప్రకృతిరహస్యముల నాకళించి రవికవి

కవితాచ్ఛాయలు తెనుఁగునకు దింపుచు రాయప్రోలుకవి పలువురపాగ ద్దలకుఁ బాత్రుఁ డయ్యెను. కట్టమంచి రామలింగారెడ్డి యీయనను స్తుతించినాఁడు.

మఱియొకటి: శ్రీ సుబ్బారావుగారిలో జాతీయాభిమానము సహజమైనది. ఈయన అచ్చముగాఁ దెనుఁగువాఁడుగా వర్తించును. ఆంధ్రోద్యమము వీరి కవితకు రంగస్థానమైనది. 1918 నాఁటికి "రాయప్రోలు" జాతీయ కవితావాహిని పొంగినది. ప్రాంచీనాంధ్ర సామ్రాజ్యమహోన్నతి, ప్రాచీనసాహిత్యకళోన్నతి కన్నుల కెదురుగాఁ గట్టి యీ కవి మురిసిపోవును. "జారిన దేశగౌరవము చక్కఁగ దిద్ది మహాంధ్రమండలీ, భారము శ్లాఘనీయముగఁ బాలన చేసి సమానరాష్ట్రముల్, కూరిమి నాసఁ జేయఁ దెలుఁగుంబుడమిన్." సముద్ధరింపుఁడని తెలుఁగువారికి మేలుకొలుపు పాడిన రాయప్రోలు 'జాతీయకవు' లలో మొదటివాఁడు. ఈయన 'ప్రబోధము' సూర్యకిరణము వంటిది.

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
 విద్యాలయములు స్థాపించునాఁడు
ఓరుఁ గల్లున రాజవీర లాంఛనముగాఁ
 బలు శస్త్రశాలలు నిలుపునాఁడు
విద్యానగరరాజ వీథులఁ గవితకుఁ
 బెండ్లి పందిళ్లు కప్పించునాఁడు
పోట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
 దిగ్జయస్తంభ మెత్తించునాఁడు,
ఆంధ్రసంతతి కే మహిమాభిమాన
దివ్య దీక్షాసుఖ స్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుఁ డాంధ్రలోకమున నక్షతలు నేఁడు.

తనగీతి యఖిల జాతిని పాటకులను గా
దిద్ది వర్ధిల్లిన తెనుఁగు వాణి
తనపోటులు విరోధి తండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగు కత్తి
తనయందములు ప్రాంతజనుల కభిరుచి వా
సన నేర్ప నలరిన తెనుఁగు రేఖ
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయఁ జెలఁగిన తెనుఁగు భూమి
అస్మదార్ద్రి మనోవీధి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాఁడ ; చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర !
హృదయములు చీల్చి చదువుఁడో సదయులార!

రాయప్రోలు కవిగారి యీప్రబోధము ప్రజలనే కాక, యువకవు లను సైతము తొలి దినములలో లేపినది. పయిపద్యములు జీవన్మూర్తులై నేఁడు తెలుఁగునాఁడున సంచరించుచున్నవి. సుబ్బారావుగారి రచనలు రెండుగా వేఱువఱుచుకొన్నచో నొకటి జాతీయ రచనల సంపుటము, రెండు ప్రేమకావ్యసంపుటము కాఁగలదు. వీరి ప్రేమ తత్త్వ సిద్ధాంతములు పవిత్రములయినవి. ఆధ్యాత్మిక తత్త్వ జిజ్ఞాస రాయప్రోలు కవీంద్రునిలో నుండవలసినంతగా నున్నది. "సచ్చిదానంద కల్యాణ సదన మయిన, యీ మనోహర జగతికి నేగుదెంచి ప్రేమలక్ష్మి నారాధింపవేమి యకట !" యిది వీరి యభిప్రాయము. కావ్యములలో సుబ్బారావుగారు ప్రదర్శించిన ప్రేమ లౌకిక సాధారణమైనదికాదు.

నడచి బడలిన యాయాస మెడలలేదు,
చీర చెఱఁగుల తడి యైన నాఱలేదు,

లేడి సరసిన యపుడె ముద్దాడికొనియె,
నహహా ! యెంతటి ప్రేమార్ద్రి మాయె మనను.

'తృణకంకణము'

*

ప్రియముతోఁ బెంచి కొన్న తీవియలు కొన్ని
విషలతలటంచుఁ దోఁచి నన్ బెరికి వైతొ ?
పూలు పూయవా ? పరిమళంబులను విడవా ?
చూడ సుందరములు కావా ? సొగసులాడి !

'కష్టకమల'

*

నరనారీ సంబంధము
పరిభావింపుము దిశావిభాగము వరుసన్
ధర, జననీ భగినీ సహ
చరీ కుమారీ క్రమము నిజం బగుట సఖా !

'మాధురీదర్శనము'

*

తేనెమీఁద సుతావంపు తీవి నిలిచి
పగలఁ బడి నవ్వు పువ్వుపై కెగయు అళిని ;
ప్రియుఁడు ప్రియురాలి నట్లు చేర్చె నొక సుకవి,
బిడ్డ తల్లిని భాతి కల్పె మరొకండు.

'రమ్యాలోకము'

పవిత్ర ప్రేమతత్త్వమును గనుఁగొన్న రాయప్రోలుకవి ధన్యజీవి. ఈ కవిశేఖరునిలోని ఆధ్యాత్మికదృష్టికి అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి యనుగ్రహము పుష్టి నిచ్చినది. శాస్త్రిగారు సుబ్బారావుగారి మేన మామ. ఆబ్రహ్మణ్యునిపోలిక యీయనలోఁ జాలభాగ మున్నది. మేన మామతోఁగలసి కొంతకాల మవధాన ప్రదర్శన యాత్రసాగించి, ఋచ్చి

రెడ్డి పాలెములో మనస్సు హఠాత్పరివర్తనము పొందఁగా నాశకవితా సన్న్యాసము చేసిరని సుబ్బారావుగారిని గూర్చి చెప్పుకొందురు. దైవ దయ నిండారుటవలనఁ గలిగిన యీ మార్పు సుబ్బారావుగారిచే రస భావ భరితమైన కబ్బములు వ్రాయించినది. రవీంద్రుఁడు – విధుశేఖర భట్టాచార్యులు – ఆంధ్రరత్న గోపాలకృష్ణుఁడు – సముద్రాల అప్పలా చార్యులు మున్నగాఁగల సహృదయుల సాహచర్యము సుబ్బారావు గారి భావమణులకు శాణోపలము. సాహితీ సమితి కార్యదర్శి నోరి నరిసింహా శాస్త్రిగారు వీరిని గుఱించి యిట్లు ముచ్చటించుచున్నారు.

"సుబ్బారాయ కవిశేఖరునకు కవితావతారము, అక్షరరమ్యత అభి మాన పాత్రములైన విశిష్ట విషయములు. వీని నీకవి రమణీయమార్గ మున బహుముఖముల ప్రదర్శించుచుండును. కవులు ఉత్తమ విషయ ములను సందర్భానుసారముగా లోకమునకు ఆస్థ దృఢమగుటకు వివిధ వివిధములవర్ణించుట మనపురాణకవుల నాఁటినుండియు సంప్రదాయ సిద్ధమే. ఈకవి ప్రకృతి శోభను మైత్రిని భక్తిని, జగత్కల్యాణమును కావ్యసందోహములో నిబద్ధముచేసి రమణీయోపదేశవ్యంజనచే ఉత్తమ బోద్ధ అయినాఁడు."

శ్రీ సుబ్బారావుగారి కబ్బములకు మొదటిదశలో నున్న ప్రజాదర ణము నేడు కొంత కొఱవడినది. అనఁగా, తెలుఁగు చదువరులలోని భావుకత సన్నగిల్లుచున్నదనియే విచారింపు డని యొక పెద్ద మానిసి సమాధానము. ఆధ్యాత్మిక శక్తి సంవలితమైన యీయన యగాధభావన, అక్షరరూపము తాల్చునపుడు మిక్కిలి చిక్కగా బిగు వుగా నుండును. అది పాఠకసాధారణ్యమున కందదు. అదిగాక యన్వ యములోఁ గొంతతిరుగుడు. దాన, దీన – సుఖవంతుఁడైన చదువరి రాయప్రోలు వారి రచనలు నేఁడు పాడుకొనుట తగ్గించినాఁడు. ఈనాఁటి పాఠకునకు ఆపాతరుచిరమైన శైలి కావలయు నఁట! దానిలో, పిండి యున్నను లేకున్నను వాని కిబ్బందిలేదు!

ఇందాఁక, సుబ్బారావుగారి యాశుకవితా సన్న్యాసమును గూర్చి యనుకొంటిమి. ఈ పద్యము లాసన్ని వేశములోనివి :—

*

నతమున్ ధేనువ కొండవారి నిజవాసంబందు మృష్టాన్న సం
గతసౌఖ్యం బమరెన్, వధానమును సాంగం బయ్యె వట్సాభిరె
డ్డి తురాసాహుని ప్రోల నాశుకవితోద్దీన క్రియావేళ నా
యత వాగ్బంధనమున్ దవిల్చితి తుషారాహార్యపుత్రీ! యిదే
హితమం చెంచితె బుచ్చిరెడ్డి నగరీ శృంగాటకంబందునన్.

*

తెనుఁగే తీయని దండు పద్యపద రీతిక్రీడ లత్యంత మో
హనముల్ శోభనముల్ తదీయరసరక్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థ కళా కలాప జయలక్ష్మిన్ గాలికిం బుత్తునే
జననీ, యేమిటి కింక, ఆశుకవితా సన్న్యాస మిప్పింపవే!

*

రసమో, భావమొ, జీవదర్థ సుకుమార వ్యంజనా మంజు శ
బ్ద సమాసారచనంబొ, సాధు హృదయస్పంద ప్రతిష్ఠా కథా
వినరంబో సకలార్థశూన్యమగు నీ వేగాతివేగోక్తి దు
ర్వ్యసనం బేటికి త్రిప్పు మింక జననీ, రమ్యాక్షరక్షోణికిన్.

ఈపరిణామముతో నక్షరరమ్యత సుబ్బారావుగారిని వలచివచ్చినది. పద్యబంధములేకాక, పాటలుకూడ రాయిప్రోలుకవి తియ్యగాఁ బాడుకొనెను.

పదవేసలి, కాళ్ళగజ్జియల్, రవళింపఁగ వెదుళ్ళవల్లికిన్
తొలి ప్రొద్దుల చల్ది యన్నమున్, తిని త్రిమ్మరవచ్చు స్వేచ్ఛగా
మధుమాసపు కన్నెయెండలో, ఎలకొబ్బరితోట నీడలన్
వనుపాడిన నిమ్మచెంగటన్, పయసారిన మావిపొత్తునన్

ఎల కోయిల యీల నేర్పఁగా, పసితెమ్మెర సేద తీర్పగా
చెయి చేయి బిగించి యింపుగా, విహరింతము తోడు తోడుగా.
మనరూపము వ్రాయగా సొనల్, మన వేసము దాచగా పొదల్
మనసోపని వచ్చి ముచ్చటల్, తనివోవగ చెప్పికొందమో!

కవితలో నవీనరుచులు పొదిగించిన యీ కవికోకిలము ఉస్మానియా విశ్వవిద్యాలయమున నుపన్యాసకుఁడుగా నుండి ప్రకృతము విశ్రాంతి గయికొనుచుండెను. 'త్రివేణి' లో వీరి ఆంగ్ల రచనలు ప్రచురితము లయినవి. ఆంగ్లసాహిత్యమున లోఁతులు ముట్టి ప్రాచ్యభాషాపాండిత్యము సంపాదించి సుబ్బారావుగారు కృతిగాఁ బేరుపెంపులు సమార్జించిరి.

"శాంతి నికేతనము" రవీంద్రుఁడు ఈయక్షరము లాయన యొడలు పొంగించుచుండును. రవీంద్రాస్తమయమునకు 'రాయప్రోలు' ఇటులు వగచినాఁడు.

సీ. ఆరిపోయినది దివ్య స్నేహశృంగార
దీపంబు నివ్వాళి తీసి నట్లు
పండిరాలినది పక్వప్రసాదఫలంబు
మొలక మోజున క్రమ్మరిలినయట్లు
నిష్క్రమించినది నాందీముఖోజ్జ్వల తార
చిత్రాంక యవనిక చినిగి నట్లు
తెగి జాఱినది జగత్ప్రియ రాగ మాలిక
గాంధర్వ జీవాళి కదలినట్లు
సోలినది శ్రీరవీందుని సుస్వరంబు
వ్రాలినది సుకవీంద్రుని రమ్యరచన
మ్లానమయ్యె నుపాసనామందిరంబు
ఖిన్న మయ్యెను శాంతి నికేతనంబు.

నిమిరించున్ శ్రుతులాపి కిన్నెరలు, వన్నెల్ చిత్రపాత్రంబులన్
చెదరుల్ చిన్నెలు మాఱె, కావ్యకలకంఠీ కంఠ రాగంబు గ
ద్గదికాలాపము నంది కుందును రవీంద్రా! సర్వసౌభాగ్య సం
పద నూనం బగు తావకీన చరితాశ్వాసాంత సంధ్యాగతిన్.

# రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ

## 1893

శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. శఠమర్షణగోత్రులు. సామశాఖ. తండ్రి: అనంతాచార్యులు. అభిజనము: రాళ్ళపల్లి [అనంతపుర మండలము కల్యాణ దుర్గము తాలూకాలోనిది] కన్నతండ్రి: శ్రీవత్సగోత్రులు కర్నమడకల కృష్ణమాచార్యులు. కన్నతల్లి: అలమేలమ్మ. జననము. 23 జనవరి 1893 సం. నందన సంవత్సర మాఘ శుక్ల షష్ఠి. ప్రకృత నివాసము: మైసూరు. రచనలు:— ౧. తారాదేవి ౨. మీరాబాయి [పద్య కావ్యములు] 3. లీల [కథనము-కల్పితగాథ] ౪. వేమన ౫. సారస్వతోపన్యాసములు ౬. నాటకోపన్యాసములు. ౭. శాలివాహన గాథా సప్తశతి [400 పద్యములు-ఆంధ్రీకరణము] ౮. స్వప్న కావ్యము [సంస్కృతము] ౯. మహీశూర రాజ్యాభ్యుదయాదర్శము ౧౦. రఘువంశ భాషాంతరీకరణము [చివరి రెంటును ముద్రితములు కాలేదు].

మాధురీ మార్దవములకుఁ దావలమైన వచనరచన యెవనిసొమ్మనఁగా, అది రాయలసీమలో నుదయించి మైసూరున నివసించువారిదని వెంటనే వచ్చు సమాధానము. రసభావములకు నిదానమైన పద్యరచన యెవని సొత్తనఁగా, ప్రత్యుత్తరము నను వెంటనే రాలేదు. నేఁటి తెలుఁగునాఁట, పద్యరచయితలు పెక్కురనియు, గద్యరచయితలు తక్కువ యనియు దీని పరమార్థము. సర్వాంధ్రము నుత్తమున, వచనరచనా విశారదుఁడు ఒక్కఁడే యనుట యతిశయోక్తికి జేరుమాట. ఇట్టి చిక్కులు రాకుండు పరిష్కార ముండనేయున్నది. అది, "అనంతకృష్ణశర్మగారు నేఁటి ప్రముఖ వచనరచయితలు నలువురైదుగురిలో నొక్క" రనుట. శర్మగారు మంచి వచనము వ్రాయుదురు. వీరి పద్యరచనయు బహు మనోహరము. ఈ కూర్పు నేర్పులకు వారికిఁ గల కోవిదత్వము దోహద మిచ్చుచున్నది. సంస్కృతాంధ్రములలో పారు చేసినది. గీటుతాఁకి వచ్చు మేలి బంగరువు వంటి కృతి; ప్రాకృత సారస్వతపు లోఁతులు

తెలిసినవారు; ఆంగ్లములోని మెలఁకువలు వినుపించుకొన్నవారు.
పైగా, సంగీతకళలో నఖండమైన యెఱుక. నోటిపాట వీరిది తీయనై
శ్రుతి పేయముగానుండును. సంగీత—సాహిత్యములలో పరిపాకముగల
విన్నాణము శర్మగారిలోనే రాణించుచున్నది. ఈ సౌభాగ్యము చేకురి
నవా రసికులు లేరు. అనంతకృష్ణశర్మగారి విమర్శన వైయాత్యమునకు
వారి 'వేమన' సాక్షిగ్రంథము. తెలుఁగులో నిట్టి విమర్శన కృతు లీవఱకు
లేవనుటయు సాహసము కాదు. "ఈ పద్యము హృద్యముగా నున్నది.
ఈభావము రమణీయముగా నున్నది-" ఇత్యాది గతానుగతిక వైతాళిక
ఘోష విమర్శన వేషముతో సంచారము చేయుట సహింపరానిది.
మన విమర్శకుల దృక్పథమును మంచిదారులకుఁ జేరఁబెట్టిన 'రాళ్ళపల్లి'
వారి మేలు మఱవరానిది. నాచన సోమనాథుని కవితా తత్త్వమునకు
వీరు గావించిన భాష్యము 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' వారి బహు
మానమునకుఁ బాత్రమైనది. ప్రక్కపాటు లేని నిక్కపు విమర్శనము
శర్మగారి చేతిలో నిగ్గులు దేఱి 'ఉత్తరహరివంశ' సమీక్షారూపమున
బయటికి వచ్చినదని జయంతి రామయ్యపంతులు మున్నగువారు నాఁడు
మెచ్చుకొనిరి. ఇంత దిట్టమైన విమర్శన శక్తికల మానిసికి రసవంతమైన
కవితాప్రాభవమును జేతనుండుట యొక సుయోగము.

శర్మగారు రచించిన 'మీరాబాయి'—'తార'—ఈ రెండు కావ్యములు
రెండు మధుకుల్యలు. ఆయన ప్రాకృతమునుండి తెనుఁగుపఱిచిన 'గాథా
సప్తశతీసారము' వాడని మల్లెపూలప్రోవు. శిరీషపేశలమైన తన తెనుఁగు
పదబంధమునకు సరిపడిన కావ్యము నేరుకొనిరని నాకుముచ్చట. రచయిత
యేరుకొన్న యితివృత్తములోనే, ఆతని హృదయ మత్తుకొని యుండును.
'సప్తశతి' లోని మృదు ముగ్ధమైన జాను తెనుఁగుఁదనము, ఇదిగో!

పసపు నీళ్ళాడి దువ్వైన పండ్లు నడుమఁ
జిక్కుకొనియున్న మైలను జిన్నముల్లు

గ్రుచ్చి తీసెన పెన్వాని కోర్కె పండఁ
జేయుచున్నావు తెల్పవే చిన్నదాన !

*

పత్తి చేను దున్నఁ నలసి మంచిదినాన
మడకపూజ చేయుఁ దొడఁగినపుడు
కోర్కులాత్మ గుబులుకొన గడగడమని
వడఁకఁ దొడఁగెఁ గాపు చెడిపె కేలు.

*

కొండసెలయేటి నుడికిఁ జిక్కుకొని కలఁగి
తిరుగుచును కేసరంబులు విఱిగిపోవ
కొంత మునుగుచుఁ దేలుచుఁ గోదమతేటి
వెంట నంటఁ గడిమిపూవు వెళ్లబోయె.

*

అద్దమందు నీడ యంటున జెల్వాని
యాత్మ నొరుల వగపు లంటుకొనవొ
అట్టివాని తోడ నెట్టు నెప్పుడు నత్త,
మనసు ప్రక్కలయిన మాని గాని.

*

పూని యాడేదు నెఱజాణ! ప్రొయ్యి మీఁద
నలుక గొనఁ బోకు; రక్త పాటల సుగంధ
మైన నీయూర్పుఁ జవులకు నాసగొనుచు
పొగ లెగయుఁ గాని మండ దీ ప్రొయ్యి నగ్గి.

*

కనులు కానరాని కటికి చీఁకటిరేయి;
వలస! పోయె మగఁడు; వట్టి యిల్లు;

దొంగ లెవ్వరైన దోతురు సుమ్ము ; ని
ద్రింప వలదు ప్రక్కయింటి వాఁడ !

ఇంత తియ్యనైన తెనుఁగు శయ్య ప్రాకృత పుణ్యవాసన కలిమి అనంత కృష్ణశర్మ గారి కందినది. ప్రమాణమునందు నయి పద్యములు పొట్టి వైనను, గుణమునందు గట్టివి. కట్టమంచికవి శర్మగారి సప్తశతీ సారమునకుఁ బ్రస్తావన సేయుచు నిటులనెను : "...ఈగాథసప్తశతి బౌద్ధయుగమునాఁటి యుత్కృష్ట జీవితమును దెలుపుచున్నది. భావములు కోమలములు. వానికి దీటైనది అనంతకృష్ణ శర్మగారి శైలి — మధురము, లలితము, రమణీయము. వీరి సరసత్వము అర్థాతకోలఁది పొగడుట అసాధ్యము................ఒక్కపద్యమే వ్రాయవలయును. అది మెఱుఁగుఁ దీఁగవలె మనలఁ గ్రమ్మియుండు నంధకారము నొక్కక్షణము పోఁద్రోలి నూతనలోకమును హఠాత్తుగ గోచరింపఁ జేయవలయును. ఆలోకము, ఒక్కనిమిషము మాత్ర మెదుట నున్న నేమి ? దాని రామణీయకము జీవము నంతయు నాక్రమించి చచ్చు వఱకును తదేక ధ్యానములో మునుఁగున ట్లొనరించును. అట్టిదియు కవిత. గుణము ప్రధానము. రాశి కాదు ..."

శ్రీ రామలింగారెడ్డిగారికి, శర్మగారికి మంచి యనుబంధము. శర్మగారిని సరససాహిత్య ప్రచారమునకుఁ బ్రేరేచినది 'కట్టమంచి' వారి సౌహార్ద మేయఁట ! సహజ ప్రతిభామనోజ్ఞత కలిగి కవితాగానము చేయుచున్న అనంత కృష్ణశర్మగారి శమీపూజ, పెనుగొండ పాట — మొదలైనవి తెలుఁగులో నిలిచి వెలుఁగొందు మెఱుపులవంటివని పెద్దల హృదయము. ఇది యిటుండ, రసికత్వ - కవిత్వములకు విజయపతాక నెత్తిన అనంతకృష్ణుని సంసార మాధురియు భావించుకోఁ దగినది.

అనంతపుర మండలములోని రాళ్ళపల్లి వీరియభిజనము. వీరి మాతామహులు అనంతాచార్యుల వారి కాయూరు వంశ పరంపరగా వచ్చిన శ్రోత్రియ గ్రామము. పుంసంతానము లేమి నా యనంతా

చార్యులగు శర్మగారు స్వీకృతపుత్త్రుఁడాయెను. ఆ కారణమున 'రాళ్ళపల్లి' వీరికి సంక్రమించినది. శర్మగారిఁగన్న తలిదండ్రులు ధన్యులు. వారికిఁ బుట్టిన నలుఁగురు బిడ్డలలో వీరు ద్వితీయులు. వీరి యన్నగారు గోపాల కృష్ణమాచార్యులును సుప్రసిద్ధులు. అనంతపురపు రెవిన్యూ శాఖలో హుజూరు శిరస్తాదారులుగా పనిచేసి యిపుడు వారు విశ్రాంతివేతనము పుచ్చుకొనుచున్నారు. సంస్కృతాంధ్ర సాహితీ సంపన్నులు. ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్రపు సిద్ధాంత ఫలభాగములం దసాధారణ పరిచయము గలవారు. 'భారతి' లోఁ బ్రచురితము లగుచుండు వారి రచనలు తెలుఁగు వారికి విందులు. 'రాళ్ళపల్లివారి' దట్టి విద్వ దన్వయము. మన శర్మగారు చిన్ననాఁట పితురంతేవాసియై సంస్కృతాంధ్రములు వ్యాసంగించెను. తరువాత మైసూరు పాఠశాలలో సంస్కృత ప్రాకృత వ్యాకరణములు, అలంకార గ్రంథములు పాఠము చేసినారు. 1912 సం॥ లో మైసూరు కళాశాలలో బండితపదవీ లాభము. నేఁటికిని వారాపదవిలోనే యున్నారు. సంగీత సాహిత్యములలో శర్మగారుచేయుచున్న సాధనము తెలుఁగువారి కారాధ్యమైనదని యామోదము ప్రకటించుచు 'వేమన' లోని వారి దివ్యవాచకములు కొన్ని స్మరించెదను.

"......త్యాగరాజు వంటివారి కీర్తనలలో భక్తి యెంత యున్నను వారి గానపాండిత్యము దానిని గప్పి పెట్టినది. పల్లవిదాటులను జూపుద మనిపించునే కాని, వానిని పాడునపుడు ప్రాయికముగ భక్తిని ప్రకటింత మనిపింపదు."

"......వేమన పద్యము లట్టివికావు. అతనివి చిటికలో ముగింపఁగల చిన్న పలుకులు; అచ్చ తెనుఁగు పద్యపునడక; గుండుదెబ్బ వలె గుఱి తప్పని చిక్కని చక్కనిమాటలు. నోరుగల తెలుఁగువారందఱును నేర్వవచ్చును."

"బాలవ్యాకరణము, అప్పకవీయము మొదలగువాని దెబ్బలకు వేమన పద్యము లెంత నులినులి యైనవో చెప్పలేము."

"మనలో నయముతోడి హాస్యము లేదని మొదలే విన్నవించితిని. నవరసములలో హాస్యమును గూడఁ జేర్చియున్నను ప్రాచీనుల హాస్యము అసహ్యములను అసభ్యములను వర్ణించుట యందు మాత్రము చరితార్థ మయినది."

"నిజముగా తెనుఁగు భాషకు పుట్టమొదట హాస్యరసము చవి చూచిన ధీరుఁడు గురుజాడ అప్పారావుగారే. వారి కన్యాశుల్కమునం దున్నంత హాస్యరసనైర్మల్యము తక్కిన యెవరిగ్రంథములందును లేదనుట యతిశయోక్తి కాదు."

తెలుఁగువంటి బ్రతికియుండు భాషలలో 'ఇవే యపశబ్దములు, ఇవే సుశబ్దములు' అని నికరముగా శాశ్వతముగా నిర్ణయించుటకుఁ బూనుకొనుట వట్టి వెఱ్ఱితనని యిన్నాళ్ళకును తెలిసికొనలేకపోవుట మనతప్పు గదా!"

ఇవియెల్ల అనంతకృష్ణశర్మగారి హృదయమునుండి చిందిలిన సందేశ సుధాబిందువులు. 'ప్రబంధకవి' సి గూర్చిన శర్మగారి యాశయము తెలుపు గీతములతో నీక నీ వ్రాయుసము ముగియుచున్నది.

ఇంతవృద్ధుఁడ వంతయు నెఱిఁగినావు
తెలిసికోఁ జాలవేమి మా తెలివిలేమి!
అర్థమే కాని పద్యము లల్లనేల?
వీథివీథుల వినువారి వెదకనేల!
అచ్చుతేటల కాశించునట్టి మమ్ము
తాటియాకుల కంతలో దార్పఁ గలవె?
పూత లేనట్టి వ్రాఁతలో పొలుపు నెఱుగు
కన్ను లెవ్వరికున్న వీ కాలమందు:
భావములు మ్రింగియున్నట్టి బంధములను,
ఆదియంతము లేని నానార్థములును
నోరు తిరుగని పదముల తీపులును
విచ్చి చూపేవు గాని నీవెంట దిరిగి
తెలిసికొనిన మాకు బ్రదుకులో తీరికేది?
మఱచిపోయిన జ్ఞాపించు మార్గమేది?

# పింగళి లక్ష్మీకాంతము
## —
# కాటూరి వేంకటేశ్వరరావు

# 1894
# 1895

ఇరువురు, ఆఱువేల నియోగులు. లక్ష్మీకాంతముగారు గౌతమస గోత్రులు. అభిజనము: కృష్ణాజిల్లా చల్లపల్లి తాలూకాలోని చిట్టిగూడూరు. నివాసము; విశాఖపట్టణము. తల్లి: కుటుంబమ్మ. తండ్రి: వెంకటరత్నము పంతులు. జననము: 10-1-1894 సం॥ తేది.

వేంకటేశ్వరరావుగారు శ్రీవత్సగోత్రులు. తండ్రి వేంకటకృష్ణయ్య. పాలించిన తల్లిదండ్రులు: లక్ష్మమ్మ, రాంచయ్య. జన్మస్థానము: కృష్ణామండలములోని కాటూరు. జననము 15 అక్టోబరు 1895 సం॥ రచనలు:- ౧. సౌందరనందము ౨. శాలస్తన్యాదయము ౩. తొలకరి [ఈమూడుకావ్యములు ఇరువురిపేరం బ్రచురితములు] ౧. బగ్ డారలు [ఆంగ్ల నవలకు ఆంధ్రీకరణము] ౨. ప్రతిజ్ఞాయౌగంధరాయణము ౩. స్వప్నవాసవదత్త [భాసనాటకములకుం దెలుఁగుసేఁతలు) ౪. నల్లగలువ [ఆంగ్లమునుండి తెనుఁగు-వయిని, ఒక-వేంకటేశ్వరరావుగారి పేరనే ప్రకటితములు) ౧. మధుర పండితరాజ్యము-ఇత్యాదులు లక్ష్మీకాంతముగారి సొంతము.

ఇటీవలి సంప్రదాయము ననుసరించి 'లక్ష్మీకాంత వేంకటేశ్వర కవులో' - 'పింగళికాటూరి కవులో' కావలసినవారు వీరు. అదీగాక, వీరు తిరుపతి వేంకటకవుల శిష్యులగుట కారణముగా, విధిగా జంటపేరు సంధించుకొనవలసి యున్నది. అటులు చేయక — స్వేచ్ఛముగా నిరువురు వేఱువేఱు పేరులు కృతుల ముఖపత్త్రములపై వేసికొనుట — వీరి గతానుగతికధర్మాసహిష్ణుతకు, పురాతన సంప్రదాయకృతశ్రద్ధాగౌరవ దృష్టికిని గుఱుతులు. తెలుఁగునఁ బ్రబోధచంద్రోదయ ప్రబంధ రచయితలగు

జంట కవుల హృదయము లంటుకొనియుండ లేదా! పట్టి - పెళ్లు జతపఱిచి నంతమాత్రమునఁ గాదు; కవితాస్నిగ్ధములయిన మొదలు శబ్దార్థముల వలె విడఁదీయరానివి కావలయును; అదియే జీవాత్మలజంట వంటి జంట. నా కొక విషయము ముచ్చటగానుండును. సౌందరనందాదులగు కొన్ని కావ్యములు పింగళి – కాటూరి కవులు కవగా వ్రాసిరి. కొన్ని యెవరి మట్టునకు వారు విడిగా వ్రాసికొనిరి. తత్త్వదృష్టికి నిది యొక యందమే యని నా యానందము. "ఒక్కరు రచియించిరేని యది కాదగుఁ దిర్పతివేంకటీయమై" అన్న జంటకవులప్రతిజ్ఞలోని పరమార్థము హార్దము కావలయునుగాని, కాపీరైటు తగవులాటలకు దిగునది కారాదుకదా! ప్రకృత కవుల గురువులు తిరుపతివేంకటకవులు సర్వథా అభిన్నులెట్టు లైరో, పింగళికాటూరి కవులు నట్టివారని రుజువు చేయుదును. ఇందు లకు సౌందరనందములోని - యీ పద్యములు నాకుఁ బ్రధానమైన యాధారముగాఁ గనిపించినవి.

మేలేర్చి నందుండు పూలు గోసి యొసంగ
　　　నరము లందముగ సుందరి రచించు
పొంలఁతి వర్ణమ్ములు మేళవించి యిడంగ
　　　హారువుమై నతఁడు చిత్తరువు వ్రాయుఁ
బతి యపురూపభావము వచించిన నను
　　　రూప పద్యమునఁ గూర్చును లతాంగి
అతివ చక్కనిరాగ మాలపించిన వీణ
　　　పలికించు నతఁడు మై పులకరింప
నెట్టిసెరల నందుని చూపు లింతి యాన
నేందునకుఁ గెంపు నివాళులెత్త, నతివ
కజ్జలవుఁ జూడ్కి ప్రియుని వక్షఃకవాటిఁ
గట్టుఁ దోరణములు నల్లకల్వపూల.

*

ప్రాలేయ గిరికందరా వినోదవిహార
పరులైన సిద్ధ దంపతు లనంగ
విబుధ తరంగిణీవీచికా డోలలఁ
దూఁగెడి రాయంచదోయి యనఁగ
కవి మనఃపంకజాసవ సిక్తమై రసా
గ్రముల నాడెడి పదార్థము లనంగ
నానంద పరిఫుల్ల నవానీంద్ర దహర తా
రాధ్వమం దాడు జీవాత్మ లనఁగఁ
జీకుచింతల దిగఁ ద్రావి, చెన్ను మిగిలి
హృదయ సంవేద్య మయ్యు నాత్మైకగమ్య
మైన యన్వయ సౌఖ్య రసామృతమ్ము
ననుభవింతురు వారు నిరంతరముగ.

*

ఈ అభినవ కవుల కవ తొలుత మైత్రీబంధముతోను, పిదప బాంధవముతోను గలసి వచ్చినది. అనఁగా, కాటూరి కవి మేనకోడలు పింగళికవి భావమఱఁదికి భార్య. ఈ చుట్టఱికము సాహిత్య బంధుత్వము కంటె గట్టిదని నే నననూ. ఇట్టివీరి కలయిక నవ్య కవితా లోకమునకు తొలకరి. అదే హేతువుగా వీరి తొలికృతికిఁ దొలకరి యని పేరు వచ్చియుండ వచ్చును. ఇది కొన్ని ఖండ కావ్యముల రాశి. అవి యన్నియు భిన్నవిభిన్న విషయకములు. ఈ ఖండకావ్య రచనాభక్తి వీరి నుండియే వచ్చెననఁగాదు. మఱికొందరును, దారు లేరుపఱిచిరి, వానిలో వీరిదియు నొకటి. సాక్షాత్కారసంపర్క లబ్ధమైన యీ మేలి వెలుఁగు తెలుఁగునాఁట మిక్కిలిగా నేఁడు నెలకొన్నది. రసిక మానసా కర్షకమైన పదబంధము పింగళి కాటూరి కవుల కవితలోఁ దొట్ట తొల్తుతఁ దొలకరించిన గుణము. అది మెల్లగా 'సౌందర నందము' నకుఁ

జేరుసరికి భావరస వర్షావారివాహ మైనది. 'తొలకరి' నాఁడు, కవితను గురించిన యీ జంట కవుల తలఁపు లిటులున్నవి :—

సీ. చూతురా, దీనిని జూతపల్లవ ఖాది
ని పికాంగనా గాన నిస్వనంబు
కొందురా, దీనిని గ్రొమ్మొఱుంగుల జిల్గు
పనికిఁ గాఁదగిన కుందనపుఁ దళ్కు
కావలెనా, యిద్ది, కలువపూ రేకు ఘా
త్తములఁ జిప్పిలెడు మెత్తందనమ్ము
వలయునా, మలయ పర్వత సానువులనుండి
దిగుమతి యగు కమ్మ తెమ్మెర లివి
తీయుదుర, దీనివెన్నెల తేట నిగ్గు
ఒరయుదుర, దీనిఁ బచ్చ కప్పురపుఁదావి
కోరికొందుర, దీనిఁ బటీరజలము
త్రావిచూతుర, తీయని పూవుఁదేనె.

'తొలకరి' కిఁ దొలిపలుకు వ్రాయుచు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి చిట్టచివర నిట్టులని ముగించెను.

"ఈకవులు నిక్కముగా స్వతంత్రులు. ఆర్యాంగ్లేయాది వాఙ్మయముల సారములఁ బీల్చి తమయందు లీనమగునట్లు చేసి దానిచేఁ గలిగిన పుష్టిచేఁ బుష్కలముగా వ్రాయువారు. వీరి కవిత్వమున నిక్కంపు మంచి నీలము లున్నవి. తళుకు బెళుకు జాళ్ళు లేవు. అయినను, రత్న పరీక్షయందు సమర్థులగువారికిఁ గాని సామాన్యులకు వానిగుణము నెఱుంగ నలవికాదు. సుకవిభోగ్యము లిచటి వస్తువులు, నలిపివేయకుఁ డటు నిటు కలచివైచి—"

'సౌందరనంద' రచనతో వీరికి, సిద్ధహస్తులయిన మహాకవులుగాఁ బరిగణనము వచ్చినది. ఆకావ్యమునకుఁ దెలుఁగుదేశమున రావలసిన

స్థానమును వచ్చియున్నది. ప్రతిభావ్యుత్పత్తులు నికరముగా నున్నవాఁడు కాని కవి రాణింపఁడు. వీనిలో, కొనిపాలు వెలితిపడినను, అది కవికి గొంతెయే. ప్రకృతము, పింగళి కాటూరి కవులను గుఱించి. వారు మంచి ప్రతిభానము గల మేధావులు. దానికిఁ దగినటులు వ్యుత్పన్న తయుఁ జిక్కినది. ఈ గుణద్వయమునకుఁ దోడు పీడని యభ్యాస మొకటి. 'సౌందరనంద' మీ సమ్మేళనము పండినపంటయై, నందనారామమై పండువుచేయుచున్నది. 'బుద్ధచరిత్ర' రచయితలు తిరుపతి వేంకటకవుల కీకావ్యము గురూపహారముగా నీయఁబడినది. కాదేని, వారిలో నభిన్నులుగానుండిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికే 'గురు దక్షిణ' యనుకొందము. గురువుగారి షష్టిపూర్త్యుత్సవావసరమున నీకబ్బ మప్పనము సేయఁబడ్డది. అప్పటి సమర్పణ పద్యము, శిష్యుల జంట యుగాధనిసయు మధురహృదయములను దోయిళ్ళఁ బట్టికొన్నది. అందలివి కొన్ని:—

కేతనతోడి పొత్తునకుఁ గేల్ కలపం దలపోసికాదు, నీ
చేతము మెచ్చఁగాఁ గవిత చెప్పఁగ నేర్తు మటంచుఁగాదు, వి
ఖ్యాతికిఁగా, దిఁకేమనిన, నద్యతనాంధ్ర కవిప్రపంచ ని
ర్మాతకు భక్తిమై నుడుగరల్ ఘటియించెడి పూన్కియే సుమీ!

*

సంచితపూర్వపుణ్యము లొసంగు ఫలమ్ములు వోలె వాసనల్
మించుకొనన్ నవప్రసవముల్ విరబూచుచునున్న దీవు క
ల్పించిన పాదులందుఁ బ్రభవించిన నూత్న కవిత్వ వల్లి; యీ
కొంచెపుఁ బూలమాలఁ గయికొమ్ము గళాభరణమ్ముగా గురూ!
భావ విశుద్ధి దోఁపఁగ భవత్పదముల్ భజియించునాఁటి మా
సేవలు మెచ్చి యాదర విశేష మెలర్పఁగ నల్పినట్టి మీ
దీవన నిక్కమై యొసఁగెఁ దియ్యని కావ్యఫలమ్ము నేటికిన్;
నీ విడిన భిక్షయిది నీకె యొసంగెద మిమ్ము విందుగాన్.

సంస్కృతమున అశ్వఘోష మహాకవి సౌందరనంద కావ్యము సంతరించెను. అందముగా నున్నదని యాగ్రంథనామము వీరు పెట్టుకొనిరి ఇతివృత్తములో దానితోఁ గొంత పోలిక. ఇంతే. ఇఁక మిగిలిన యావత్కవితాచమత్క్రియయు వీరిసొంతము. కథావస్తువు ధర్మనిష్ఠ కలయది. కవిత్వము తగినట్లు రసపుష్టమైనది. కావ్యము, రాశిలో వాసియైనది కాకపోవచ్చును, గుణసంపత్తిలో నుత్తమజాతికిఁ జెందుచున్నది. ప్రాచీన సంప్రదాయములు తూలనాడకపోవుట - క్రొత్త దారులలోని మేలు నేరుకొనుట యీజంటకవులకుఁ గల విశాలగుణము. అభ్యుదయపథములో నంగలు వేసికొనుచున్నార మన్నకొందఱు వీరి కవిత నేమందురు! - కవిత నిత్యనవీనము కావలయును, అనఁగా పురాణము కావలయును. నేలవీడి సాముచేసిన వీలుకాదు. 'సౌందర నందము' పురాతనాధునాతన కవితలకు సేతుబంధము.

అలనాటినడిరేయి నశ్వరాజము వెన్ను
చమరి వీడ్కొని నట్టి స్థలము దాఁటి
చెన్నఱి దాలఁ దోఁచిన రాజగృహలక్ష్మి
పులుకు పులుకనఁ దన్నుఁ బోల్చికొనఁగ
నెలగోలు మూఁకల యెల్గుల సౌధ వా
తాయనమ్ము లపావృతములు గాఁగఁ
దలుపులు తెఱచి పౌరుల కిమితి బ్రువా
ణులగుచు వెఱగంది నిలిచి చూడ
నాత్తపరతత్త్వ బోధమహా నాత్మతేజ
మానసేందుని పరివేషమై భజింపఁ
బురము చొత్తెంచి నిలిచిన బోధి సత్త్వుఁ
గనుకనిన్ గని పౌరులు గములు గూడి—

'ప్రథమసర్గము'

నడపుల రాజహంస, తెలినవ్వుల వెన్నెలవాక, ప్రేమలూ
రెడు నునుఁబల్కుఁ దేనెపిర, రెమ్మలువైచు విలాసవల్లి, ప్రే
ల్మిడి హృదయమ్ము నుబ్బిచను మేలిమిచూపు మదాళియైన యా
పడఁతుక నందభాస్కురుని బాయఁగ నోర్వదు ఛాయయుం బలెన్.
తానా, సుందర నందుఁ; డవ్వెలఁదియా, తన్వంగ మాధుర్య లీ
లా నందైక నిధాన; మొండొరులు ప్రేమాలాప కేళీ వినో
దానూనాను భవమ్ములా, మదన విద్యా దైశికమ్ముల్; సముల్
కానన్ రారుగదోయి, కామిజనలోకమ్మందు నాడోయికిన్.

*

పద్యములకుఁ బ్రకరణము స్పష్ట పడుచుండుటచే వ్రాయుటలేదు. మఱి కొన్ని యుదాహరించుటకు మనసు పడుచున్నాను. రసభావాభ్యుదయ మిందెంతదాఁక సాగుచున్నదో మీరే యెన్ను కొనవలయును.

బ్రతుకు నిక్కమ్మయేని యువ్వారిపట్ల
విరతిలేని స్వప్నమ్మునా జరుగఁ బోలు
బ్రతుకు నిక్కముగాక స్వప్నమగునేని
సత్యమై తోఁచఁబోలు నాజంపతులకు.

*

రాగరంజిత మన్మనోరత్న మింత
యింత శకలమ్ము లొనరించి యింతి! నీదు
కంఠహారమ్ము నొనరింతుఁ, గడమ యిడక
వినుతు హృదయ ప్రబంధమ్ము విశద ఫణితి!
పొలది! యీ రాగలతలు పుష్పించు నట్టు
లీ మనోరథములు ఫలియించు నట్లు
దరు లొరసి పాఱు నీ మమతాస్రవంతిఁ
జేలిపోదము పెఱతలంపేల మనకు!

*

ఎన్ని విధాలనో హృదయమిచ్చి భజించితి విట్టి క్రూరునిన్
నిన్నుఁ దలంచి చిత్త సరణిన్ విలపింతున, జాలి నింతునా ?
ఇన్ని విధమ్ములన్ హృదయ మిచ్చిన ప్రేయసి వీటఁ బుచ్చితిన్
నన్ను గుఱించి పల్లటిలనా, పెనుసిగ్గున మ్రగ్గిపోదునా ?
ఎన్నఁగరాని కూర్మి నిలువెల్ల నొకింతగ రాగపూర్ణమౌ
పొన్నపుఁ బానపాత్రయగుచున్ గరయుగ్మమునందు నిల్చి నా
సన్నిధి, నిష్టదైవమును వీడెడినై యిటు పాఱవైచికొం
టి, నిరుపేదనై యలమటించెద దిక్కఱి రిత్తజోగినై.
వలపుల్ వడ్డికిఁ బాఱఁ గౌఁగిట గదింపం బాత్రవై, నిండుచూ
పులకున్ వెన్నెలవై, శ్రవోయుగళి కింపుల్ నింపు గానమ్మవై
యలరుందావివియయ్యు నూర్పులకుఁ, బై నాత్మైక భోగ్యంబవై
తలఁపుల్ దాఁటి, యభిన్నవై, తుది మదాత్మా! నాకు లేవైతివే.

*

వసివాళ్వాడ, దొకప్పుడుఁ
గసు గందదు, మేల్మిచాయ కగ్గదు, తావుల్
కొసరు, మరందము చిలుకును
విసువక యెదఁ దాల్తు నట్టి ప్రేమసుమమ్మున్.

నాకలోకముతోఁ బనేమి, వినుమన్నా ! పాలమున్నీటిలో
నేకాంతమ్మగుచోఁ బ్రవాళములచే నేపారు ద్వీపమ్ములో
నాకుల్ రాలని పూలువాడని వసంతారామ మధ్యమ్ములో
రాకాచంద్ర సహస్రముల్ వెలుఁగు హర్మ్యాగ్రంబునం దొక్కటన్.
నాకుం బ్రాణము ప్రాణమైన చెలితో నానాసుఖమ్ముల్ లతా
నీకమ్ము పెనఁగొన్న డోలికలలో నిఃఖేద దివ్యామృత
స్వీకారమ్ము భజింపుచున్ సమయముల్ సీమల్ వెసన్ దాఁటి,
సాకారమ్మును నిత్యమై నెగడు నయ్యానంద మర్థించెదన్.

*

ఇటు లుదాహరించుకొనుచుఁబోవుచో, సౌందరనందమునెసమగ్రముగా నిచటఁ బ్రతిపాయవలసినవాఁడ నగుదును. తొంటి కవిత్వమున కనుకరణముగాఁ గనిపించు పద్యములిందు తక్కువ. వానిలోఁగూడ ననుసరణచ్ఛాయలు తోఁపనీయని స్వతంత్రతియే యెక్కువ. కథావస్తువు, గ్రథననైపుణి శుచిత్వ రుచిత్వ సంవలితములగుటవలన సౌందరనంద ముత్తమకావ్యమయినది. మఱి, యేతత్కావ్యకర్తల గురుకులవాస క్లేశము లెంతటివి!

పింగళిలక్ష్మీకాంతముగారు రామయామాత్యనందనులు. వీరి తండ్రి చల్లపల్లి జమీనుకుఁ జెందిన 'అముదార్లంక' లో మనుగడ సాగించుచు, నాయకారఁ బెత్తనము వహించిన వ్యవహర్త. అన్నదానములో నాయన పలుకుబడి గొప్పది. ఆయన యన్నదాన వ్రతమును ఫలింపఁజేసిన కుటుంబిని కుటుంబమ్మగారు. లక్ష్మీకాంతకవి యీ దొడ్డతల్లి కడుపు. ఆమె మోచర్ల వారి యాఁడుఁబడుచు. మోచర్ల — పింగళి వంగడముల వారికి వియ్యము నాలుగైదు తరములనుండి వచ్చుచున్నది. లక్ష్మీకాంత కవిగారి భార్య లక్ష్మీనరసమ్మగారు కొంత సాహిత్యము తెలిసిన యామె. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కంటిజబ్బు చికిత్సకై 1933 లో విశాఖపట్టణమునఁ గొంతకాల ముండెను. మకాము లక్ష్మీకాంతముగారి యింట. అపుడు వారికి లక్ష్మీకాంతముగారి యిల్లాలు చేసిన యుపచార గౌరవము గొప్పదనియు, శాస్త్రులుగారు ఆమెకు సంస్కృతకావ్యములు పాఠములు చెప్పి శిష్యురాలిని జేసికొనిరనియు 'జాతకచర్య' ఇటీవలి భాగమునఁ గనఁబడినది.

లక్ష్మీకాంతముగారి యాంగలపుఁ జదువు స్కూలుఫైనలు దాఁక బందరు హిందూస్కూలులో. ఎఫ్. ఏ; బి. ఏ లు బందరునందే యున్న నోబిలు కళాశాలలో. మూఁడవ 'ఫారము' చదువుచుండఁగా 1909 లో లక్ష్మీకాంత మున్న హైస్కూలులో తిరుపతి వేంకటకవులు శతావ

ధానము చేయుట తటస్థించినది. ఆప్రదర్శనము చూచిన వెంటనే యాతనికిఁ గవితాస్థ యంకురించినది అదియాది, వేంకటశాస్త్రిగారి యాదరాశీస్సులంది మూఁడేండ్లు మూఁడునెలలు గురుకులక్లిష్టుఁడై సంస్కృతాంధ్రములు చదువుకొనెను. ఆ గురు సేవాప్రసాదము లక్ష్మీకాంతమును నేఁడు మహారచయితగా దిద్దఁగలిగినది. 1912 లో, స్కూలుఫైనలు పరీక్షో త్తీర్ణతనంది, వెంటనే 'ఇంటరు'న, చేరఁ జాలక రెండేండ్లకుఁ జేరి 1919 నాఁటికి పింగళికవి బి. ఏ. పట్టభద్రుఁడయ్యెను. ఆ వెంటనే 'నోబిలుపాఠశాల'లోఁ బ్రధానాంధ్రపండితస్థానలాభము. మఱి నాలుగేండ్లకు, కళాశాలలోఁగూడ నధ్యాపకత. అచట నొకనాలు గేండ్లు. పదపడి మదరాసు విశ్వవిద్యాలయమునఁ దెలుఁగు పరిశోధక శాఖలో 'ఫెల్లో' పదవి. అది మూఁడేండ్లతో సయిపోఁగా, తంజావూరు సరస్వతీమహాలునఁ గూరుచుండి నాయకరాజులనాఁటి తెలుఁగు తాటి యాకుఁ బొత్తములు చదివి యెన్నో క్రొత్తవిషయములు లక్ష్మీకాంత కవి సేకరించెను. మదరాసులో నుండఁగనే 1930 లో ఎం. ఏ మొదటి తరగతిలో నుత్తీర్ణుఁడై యుండిన హేతువున, 1931 సంవత్సరముననే ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు — ఏర్పాటు చేసిన తెలుఁగుశాఖలో నాచార్యస్థాన మొసఁగిరి. తంజావూరిలో లక్ష్మీకాంతకవి నాఁడు చదివిన చదువే, ఆంధ్రవిశ్వవిద్యాలయము అచ్చటివాఙ్మయ మంతయు 'కాపీ' చేయించి తెప్పించి ప్రకటింపఁబూనుకొనునటులు సేయుటకు హేతువైన దని చెప్పెదరు. ఆమహాప్రయత్నమున మొదటిదిగా 'ద్విపదభారతము' మొదటిసంచిక యచ్చునకు వచ్చినది. దానికి లక్ష్మీకాంతముగారిపీఠిక విపులమైనది యున్నది. తంజావూరి యక్షగానములను గురించి యీయన యెంతో వ్రాయఁగలవారు. శ్రీ ప్రభాకరశాస్త్రి పరిష్కృత మైన 'రంగనాథరామాయణము'నకు వీరి భూమిక యాభరణమై యున్నది. ఎన్నో పీఠికలలో, ఎన్నో పత్త్రికా ప్రచురిత రచనలలో లక్ష్మీకాంతముగారి వాఙ్మయపరిశ్రమము విశదమగుచున్నది.

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారిదియు సుపరినిష్ఠితమైన సారస్వతవ్యాసంగము. ఆయన భోగి త్యాగులకు నలయునంత యున్నవాఁడు. అదిలో, వీరు కలపటపువారు. నాలుగైదు తరములుగా 'కాటూరు' చేరిన తరువాత 'కాటూరి' యని యింటిపేరు మారినది. పినమాతామహగారికి దత్తుఁడై వేంకటేశ్వరరావుగారు పెంపొందెను. సంపత్తితోపాటు సాహిత్యవిత్త్వమునకు వలయునంత వ్యుత్పత్తియు నున్నవాఁడు. గురువుల నాశ్రయించి చదువుకొన్నవాఁడు. పింగళి కవియు, నీయనయు సతీర్థ్యులు కావుట విశేషము. వీరికిని చెళ్ళపిళ్ళ శాస్త్రులుగారే సంస్కృతాంధ్ర సాహిత్యాభిజ్ఞ ప్రదాతలు. వేంకటేశ్వరరావుగారు బి. ఎ. సీనియరు చదువుచు 1921 లో, సహాయనిరాకరణోద్యమమునఁ జదువు విరమించివైచిరి. 1930 లో జరిగిన యుద్యమమున నాలుగు నెలల కారావాసదండనము. కాటూరికవి దంతటి దేశాభిమానము. 1932 మొదలు 39 వఱకు ఆంధ్రోపాధ్యాయుఁడుగా, 39 సం|| మొదలు 43 సం|| దాఁక ప్రిన్సిపాలుగా బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో నుద్యోగనిర్వహణము. ప్రకృతము కృష్ణాపత్రికా సంపాదకత. ఆంగ్లభాషలోని యుదాత్త సాహిత్యము నీయన తనివారఁ జూఱలాడియు, నార్యసంప్రదాయములు వీడక కవితాగ్రథనముఁ గావించెను. కావలసినంత స్వస్థాన వేషభాషాభిరతి కల వ్యక్తి వేంకటేశ్వరరావుగారు. మెత్తని హృదయము, మఱీమెత్తని పలుకుబడి. ఒడలెఱుఁగని యుపన్యాసధోరణి సాగించుగుణము లేదు కాని, తియ్యతియ్యగాఁ బద్యపాఠము చేసి సభ్యుల నూరించును. నిర్లిప్తుఁడు ; ఒకరి లక్ష్యము లేదు. అట్లని, ఎవరిని జెందనాడఁడు. వచనశైలిలో పింగళి వారిది, పద్యశయ్యలో కాటూరి వారిది పైచేయిగా నుండునని దేశమునఁ బలుచనైన యొక వాడుకయున్నది. రసజ్ఞుల చెవుల కిట్టి వాడుకలు వినఁ బడవు. వారిరువురిది సరియగుజత. సౌందరనంద

మొకటి మాత్రము, యీ యిద్దఱి కీర్తికిని పతాక. కలసి వ్రాసిన 'పౌలస్త్యహృదయ' మను చిన్నకావ్యమునుండియు రెండు రత్నముల నిచ్చి యిఁకఁ జాలింతును.

[శ్రీరాముఁడు లంకపై నెత్తివచ్చుట చూచి సముద్రుఁడు రావణునితోఁ జెప్పఁబోఁగా రావణుఁ డనినమాటలు]

వసవాఁడు చెక్కిళ్ళ వయసున లజ్జమై
మునియాజ్ఞ దాఁటక తునుము సొగసు
జనపాలుప్రేలు నీడున శైవచాపమ్ము
విఱిచిన శృంగార వీరమహిమ
పసవు బట్టల నిగ్గు పవన భార్గవక్రోధ
సంధ్య మాయించిన శౌర్యసార
మాలిఁ బాసిన క్రొత్త యులఁతమై వజ్రసా
రుసి వాలి నొక కోలఁ దునుము పటిమ
వింటి వేమొకాని — ఇన్నిటికంటె రాచ
పట్టముదొరంగి నారలు గట్టి కాన
మొట్టినట్టి వెక్కసమైన దిట్టతనము
వింటి — సామికే తగుననుకొంటకాని,—

శ్యామలకాంతి మోహనము, సౌమ్యగభీరము సుప్రసన్నరే
ఖామృదు హాసభాసురము, గన్నులపండువునైన రాము నె
మ్మోమును మున్నుఁ బోలెఁ గన నోమను గాదె; కఠోరవృత్తినై
సామిని మున్నె ఘోరగరణ సత్రనిమంత్రితుఁ జేసి యుండుటన్.

# మాడపాటి హనుమంతరావు

# 1885

బ్రాహ్మణులు. తల్లి: సుబ్బమ్మ. తండ్రి: వెంకటప్పయ్య. జన్మస్థానము: కృష్ణాజిల్లా, నందిగామ తాలూకాలోని పొకునూరు. నివాసము: హైదరాబాదు. జననతిథి: తారణసంవత్సర మాఘశుద్ధ సప్తమి. 1885 జనవరి. రచనలు:— ముద్రితములు: ౧ మల్లికాగుచ్ఛము ౨ మాలతీగుచ్ఛము 3. సూత్రకాలపు హిందూవ్యాగ్యాను. ౪. తెలంగాణా ఆంధ్రోద్యమము (1 భా॥ అముద్రితములు: ౧. గ్యారిబాల్డి చరిత్రము ౨. మహాభారత సమాలోచనము. 3 తెలంగాణా ఆంధ్రోద్యమము. (౨వ భాగము) ౪. రోమక సామ్రాజ్యచరిత్రము (అసంపూర్ణము)

జన్మదేశము కృష్ణామండల మైనను, హనుమంతరావుగారు హైదరాబాదు నివాసులు. నిజాము రాజ్యములో రాజకీయ ప్రాముఖ్యము వహించిన తెలుగువారిలో వీరు ప్రథమశ్రేణికి జెందినవారు. ఆయనను రచయితలుగా నెక్కువమంది వినియుండరు. ఏమనంగా, హనుమంతరావుగారు రచించిన గ్రంథములు పుటల ప్రమాణములో దక్కువ. అవియైనను, సాహిత్యసంబంధము కలవికావు. ఎక్కువ, దేశభక్తి సముత్తేజకములు. చరిత్ర విషయకములును. ఆంధ్రోద్యమము వీరి ప్రాణప్రాణము. తెలంగాణా ఆంధ్రోద్యమము వీరిది ప్రథమ భాగము ముద్రితమైనది. మల్లికా — మాలతీ గుచ్ఛములు రెండును ముద్దయిన గ్రంథములు. అందలికథలు ప్రాచీనాంధ్రుల విశిష్టతకు మహాదర్శములు. తెలుగులో గ్రాంథికశైలి వీరిది తీరుగానుండి విందుసేయును. మల్లికాగుచ్ఛమున చారిత్రకములు సాంఘికములు నగుకథలు మధురధోరణిలో నున్నవి. రుద్రమదేవి మున్నగా నున్న గాథలు వీరి చరిత్ర దృష్టికి మంచి నిదర్శనములు.

హనుమంతరావుగారు బి. ఏ., బి. యల్. పట్టమునందిన న్యాయవాదులు. ౧౯ వత్సరముల యీడునుండి యిరువది తొమ్మిదేండ్ల యీడు

వచ్చువఱకుఁ బ్రభుత్వము వారి విద్యాశాఖలో నుద్యోగము. అంతటి నుండి, యాఱు వత్సరములు హైదరాబాదు శాసన నిర్మాణ సభలో నాంధ్రానువాదక పదవీనిర్వహణము. పిమ్మట నిరువదినాలు గేండ్లు నిండుగా హైకోర్టు వకీలువృత్తి. ప్రకృతము విశ్రాంతి. హనుమంత రావుగారికి ఆంగ్లము, ఆంధ్రము నందేకాక సంస్కృతము, ఉరుదూ భాషలందుఁగూడ మంచిపాండితి యున్నది. వీరికి శ్రీ కందుకూరి వీరేశ లింగము పంతులుగారి రచనా విధానము ఆదర్శమఁట. వ్యావహారిక భాషయం దెక్కువ యాదరముగాని దాని యుపయోగమును గూర్చి యెక్కువ విశ్వాసముగాని కలవారు కారు.

విశేషమేమనఁగా హనుమంతరావుగారు హైదరాబాదు రాజ్యములో నేఁటి ప్రజోద్యమములయందుఁ బాలుగొని గొప్ప కీర్తి గడించినారు. రచయితలలో వారికీయఁదగిన గౌరవము, ఆకీర్తిని బట్టి కాక సాహిత్య-చరిత్ర సంబంధమైన వారి మల్లికా గుచ్ఛ, మహా భారత నవీనాంధ్రాది కృతి రచనమువలన నని గుర్తింపవలయును.

---

# సురవరము ప్రతాపరెడ్డి

## 1896

రెడ్డివంశీయులు. తలిదండ్రులు గంగమ్మ, నారాయణరెడ్డి. జన్మస్థానము గద్వాల సంస్థానములోని బోరవెల్లి. జననము దుర్ముఖి - అధికజ్యేష్ఠ బహుళ ప్రతిపత్తు. 1896 సం. రచనలు: ౧. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. ౨. హైందవధర్మవీరులు. ౩. రామాయణ విశేషములు. ౪. హిందువుల పండుగలు. ౫. ప్రజాధికారములు. ౬. తుకారాము [నాటకము] ౭. ఉచ్ఛల విషాదము [నాటకము] ౮. యువజన విజ్ఞానం. ౯. మొంగలాయి కథలు. ఇత్యాదులు.

హైదరాబాదు, ఆంధ్రసాహిత్య రచయితలు — అను తలంపులో తొట్టతొలుత సురవరము ప్రతాపరెడ్డిగారు తగిలి వేతాళరు తట్టెదరు. “ఆంధ్రుల సాంఘిక చరిత్ర” గ్రంథరచనతో — మెఱపు మెఱపులుగా విరిసియున్న ప్రతాపరెడ్డిగారి యశస్సు స్థిరపడి నిలిచినది. ఇట్టి యుత్తమ రచయిత జీవన సింధువునుండి యథాశక్తి నేఱుకొన్న కొన్ని బిందువు లీక్రిందివి.

ప్రతాపరెడ్డి గద్వాల సంస్థానములోని బోరవెల్లి గ్రామములో జన్మించి, యేడేండ్లదాఁక నచటనే పెరిగెను. మొదటి గురుత్వము తండ్రిది. పిదప నెనిమిదవయేట 'కర్నూలు' లోఁ జేరి 'మెట్రికు' వఱకు విద్యాభ్యాసము. ఎఫ్. ఏ. హైదరాబాదునందు, బి. ఏ. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీయందు చదువుట. బి, ఏ వఱకును సంస్కృతము ద్వితీయ భాషగా గ్రహించి పఠించుటచే నాభాషలోని మెలఁకువలు ప్రతాపరెడ్డిగారికిఁ దెలియును. అదిగాక, గురుముఖమునఁ గావ్యపంచకము లఘుకౌముదియును జదువుకొని తమశక్తికి మెఱుఁగుపెట్టుకొనెను. బి. ఏ చదువుచుండఁగనే 'ఉచ్ఛల' నాటకము వీరు సంఘటించిరి. న్యాయవాది పట్టము వడసి హైదరాబాదులోనే, ఉర్దూభాషలో నెనిమిదేండ్లు

స్త్రీ డరుపని చేసిరనఁగా, ప్రతాపరెడ్డిగారి కాభాషలోని ప్రవేశ మెంతటిదో తెలియఁగలదు. 'పార్సీ' యందును వీరి పరిశ్రమము ప్రశంసనీయమైనది. మొత్తముమీఁద సంస్కృతము, ఉర్దూ, పార్సీ, ఆంధ్రము, ఆంగ్లము - భాషలలోఁ జక్కని పరిచయము ప్రతాపరెడ్డిగారి కున్నయది. ఇట్టి విజ్ఞతలతో నీతుస సారస్వతోద్యోగము నిర్వహించుచున్నారు. రాజకీయోద్యోగములు కోరిన మానిసి కాకపోవుటచే ప్రతాపరెడ్డి లక్షల కధికారి కాలేకపోయెను. పోనిండు! ఆయన గ్రంథములు వేనవేలు విలువకలవి కావచ్చును.

నిండుగా నిరువది నాలుగేండ్లు ప్రతాపరెడ్డిగారు నెఱపిన మహోద్యోగ మొకఁ డున్నది. అది "గోలకొండ" పత్రికాసంపాదకత. వీరి యధికారములో 'గోలకొండ' అర్ధవార పత్రికయై మంచి ప్రఖ్యాతి ప్రచారములు వడసివచ్చినది. ఇటు లుండఁగా 'లిమిటెడ్ కంపెనీ' వారు వచ్చి దానిని దినపత్రికగా మార్చుచేసి నడపుచున్నారు. కారణాంతరములచే వారితోఁ గుదురక రెడ్డిగారు సంపాదకత వదలుకొని 'ఇటికాలపాడు' అను గ్రామములోఁ బ్రకృతము గడపుచున్నారు.

చరిత్ర, పరిశోధనము—అనఁగా వీరి కెంతో సంబరము. వీరియిల్లొక చరిత్ర భాండారమని చెప్ప వచ్చును. ప్రతాపరెడ్డిగారి కథలు, సారస్వత వ్యాసములు, చరిత్ర, పరిశోధన రచనలు మొత్తము మున్నూట సంఖ్యకుఁ జైబడియున్నది. నాటకములు వ్రాసిరి. పద్యరచనచేసిరి. 'ప్రజాధికారములు' మున్నగా నెన్నో రాజకీయ విషయములపై చర్చాగ్రంథములు వెలువఱచిరి. హైందవ ధర్మవీరులు, రామాయణ విశేషములు, హిందువుల పండుగలు మున్నగు రెడ్డిగారి కూర్పులు వారి వివిధవిషయజ్ఞతకు నిదర్శనములైనవి. ఈయన పద్యకవితయు సాధుమధురమైనది. తెనుఁగు భాషామతల్లిపై వ్రాసిన యీసీసము చూడవలయును:

పరిపూర్ణ పావనాంభ స్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
ఆలంపురీ నందనారామ విభ్రాజి
వల్లోబ ఫలరాజి మధురరుచికి
ఆంధ్రీ కుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సు మాధుర్యమునకు
ఖండ శర్కర, జాతి, ఖర్జూర, గోక్షీర
ద్రాక్షాదియుత రామ రసమునకును
అమృత నిష్యంది వల్లకీ హ్లాదమునకు
రాగిణీ దివ్య సమ్మోహరాగమునకు
తేనె తేటల నవకంపు సోనలకును
సాటి యగును మా తెనుంగు భాషామతల్లి.

'ప్రణయిని' పై వీరు కట్టిన కవిత యెట్టులున్నదో యరయవచ్చును:

ఉ. నీ నును జెక్కులున్ మరియు నీ చిరునవ్వును దంతకాంతియున్
నీ నయగారముల్ కలికి! నీదు బిటారపు గుబ్బదోయియున్
నీ నడయాడుకా నరయు నీ చికురంబును కెంపుమోవియున్
చానరో! నాకు నాయెడంద సంశయ ముండిన చీల్చి చూడుమా!

ఉ. ఎచ్చటి కేగినన్ మరియు నేమి యొనర్చిన నీదు రూపమే
యిచ్చ దలంచుచుందు, కృపయించుక పూన వదేమొ, ఓర్వగా
వచ్చునె యీ మనోవ్యథల వారిజలోచన! నీకటాక్షమున్
నచ్చితి నింక తాళగలనా, లలనా! చలమూన పాడియే!

ఉ. నీ సరసంపు ముచ్చటలు నీ తగళాయిత నేత్రయుగ్మమున్
వీసరవోని మోహమున వేమరు చిత్తములో స్మరించుచున్
వేసర కెల్లవేళలను ప్రేయసి! నిన్ గనఁగోరు నాకహో!
ఆసలుగొల్పి యేచదగునా, మగువా! వగ పెంచుచున్నదే!

ప్రతాపరెడ్డిగారి, ఇత్యాదికమైన కవిత్వ మంతయు నొకయెత్తు, వారి 'ఆంధ్రుల సాంఘికచరిత్ర' గ్రంథ మొకయెత్తును. 1929 సంవత్సరమునుండియు రెడ్డిగారు తెలుఁగువారి సంఘమర్యాదలను, ఆయా కవుల గ్రంథముల ద్వారమును గుర్తించుకొనుచు వ్యాసరూపమున వెలువరించుచున్నారు. ఆ కృషియంతయు 1949 నాటికి పంటకు వచ్చి యేతద్గ్రంథరూపమున మనకు భుక్తమైనది. కాకతీయ సామ్రాజ్యము నాఁడు, రెడ్లపాలనమునాఁడు, విజయనగరరాజుల యేలుబడినాఁడు, మఱి వివిధప్రభుత్వములనాఁడు సాంఘికముగాఁ దెలుఁగుల మర్యాదలు, నడతలు నెట్టివో యీ కూర్పున హృదయంగమఫక్కిని ప్రదర్శింపఁ బడినవి. ఈ రచనవిషయమై రెడ్డిగారు కావించిన కావ్యపరిశీలనము, చరిత్ర పరిశోధనము గణనీయములైనవి. ఈకృతి చిరకాలస్థాయిగానుండి తెలుఁగువారి కుపయోగపడు ననుటలో విప్రతిపన్ను లుండరు. వీరి రచనయు నింపుగా సొంపుగా నడచినది. వారు వ్రాసినటులు—

"రాజుల రాజ్యాల చరిత్ర వ్రాయుట అంతకష్టము కాదు. కాని సాంఘికచరిత్రము వ్రాయుట కష్టము. దీని కాధారములు తక్కువ. తెనుఁగు సారస్వతము, శాసనములు, స్థానిక చరిత్రలు (కైఫీయత్తులు) విదేశీజనులు చూచి వ్రాసిన వ్రాఁతలు, శిల్పములు, చిత్తరువులు, నాణెములు, సామెతలు, ఇతర వాఙ్మయములలోని సూచనలు, దానపత్రములు, సుద్దులు, జంగముకథలు, పాటలు, చాటువులు, పూర్వ వస్తు సంచయములు (Collections) — ఇవి సాంఘిక చరిత్రకు పనికి వచ్చు సాధనములు"

ఇంత సామగ్రితో శ్రమించి సంధానించిన రెడ్డిగారి సాంఘిక చరిత్రము నేఁటి సారస్వత కృతి సంభారమున నొక వెలుఁగు నిచ్చి, మెచ్చుకోలు పడయఁదగిన గ్రంథమై, వారి యశోలతకు మాఁజాకు హత్తించునదిగ నున్నది.

# దువ్వూరి రామిరెడ్డి

## 1895-1947

రెడ్డి బిడ్డ. జన్మభూమి: నెల్లూరిమండలములోని పెమ్మారెడ్డి పాళెము. జననము: 9. నవంబరు 1895 సం. నిర్యాణము: 1947. రచనలు: ౧. పానశాల-౨. కృషీవలుఁడు ౩. కుంభరాణా ౪. వనకుమారి ౫. సీతా వనవాసము ౬. నలజారమ్మఅగ్నిప్రవేశము. ౭.పలితకేశము ౮. Voice of the Read [ఆంగ్లకవితాసంపుటము] మున్నగునవి.

అభినవాంధ్ర కవితారసాలశాఖ నధిరోహించి మధురగానము చేసిన కవిపుంస్కోకిలము దువ్వూరి రామిరెడ్డిగారిజీవితము స్మరణీయమైనది.

ఆయన కలిగినరైతుబిడ్డ. ఆకలిమీఁదోడు విజ్ఞానసంపత్తి. ఆసంపత్తికి సాయము తీయనైన కవితాధోరణి. ఈసమ్మేళనము చక్కనైనది. ఇది కవిసామాన్యమున కందని విందు. నెల్లూరిజిల్లాలోని పెమ్మారెడ్డి పాలెములో రామిరెడ్డిగారి పుట్టుక. అచటి పల్లెబ్రతుకుల మెలఁకువలో, వారికవిత యుట్టియలమీఁద నవనీతము మనవి యార్ద్రమైనది. మెత్తని హృదయము; మెత్తని రచనాసంపత్తి. ఈభాగ్యముతో నాయన ఖండకావ్యము లెన్నో నంతరించెను. నాటికలు, కథానికలు, వ్యాసములు రచించెను. ఏమివ్రాసినను, స్వాతంత్ర్య దీప్తి ప్రదర్శించెడి నేర్పు కలములో నున్నది. నిసర్గమధురమైన పదబంధము రామిరెడ్డిగారికి జన్మతోభవము. ఈసిద్ధివలన నీయన పూర్వపద్ధతులను దాఁటి నడచుచున్నానని సాహసముతో వచించెను. ఈదిగువ పద్యములు పరికించునది:

చ. వనలతమైన నాకవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణమయి తేజరిలెన్ సహజ ప్రరోహవ
ర్ధన నియమాను సారముగఁ దల్లతయెన్నఁడుఁ దోఁటమాలి పా
ణిని గనుఁగొని నవ్యరమణీయతఁ జిల్కు నపూర్వ పద్ధతిన్.

గీ. పంజర నిబద్ధ కీరంబు బయలుగాంచి
యడ్డుకమ్ముల దాటంగ నాశచేయు
నటు బహిర్నియమంబుల నతికరించి
మన్మనంబు స్వాతంత్ర్య సీమకుఁ జరించు.

గీ. కాన నెవరేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ; గాల మనంతము; ఇల విశాల;
భావలోకము, క్రమముగాఁ బడయుమార్పు
ఏలహృదయంబు వెలిపుచ్చు నింతయల్కకు.

ఈచివరి పద్యభావము భవభూతిని స్మరింపఁ జేయునదికదా! ఈయన వ్రాసికొన్నంతగా భాషా—భావ స్వాతంత్ర్యములు హెచ్చు తీసికొన కుండఁగనే సంప్రదాయములు పాటించుచుఁ గవిత సాగించుట కాన నగును. ప్రాచీన కవితారీతులపై దండెత్తి యుత్ప్రేక్షగా నక్షత్ర వీథులలో నెగురు కొందఱవంటి వాఁడు కాఁడు రామిరెడ్డిగారు. ఆయన భావ వైభవావేశమునకు సరిపడు భాషాభార ప్రవేశము కలవాఁడు. ఆంగ్ల పారసీక వాఙ్మయములలోని పలుకుబళ్ళు లెస్సగా గుర్తించిన వాఁడు. సంస్కృత వాఙ్మయపుఁ బొలుపులును దెలిసికొన్నవాఁడు. సహజముగా సౌజన్యమూర్తి. ఈపయిని, కవిత్వమెటులుండునో భావింపుఁడు. ఈకవి యభిప్రాయమిది:

వేగుజామున వికసించు విరులయందు
రేకు విడలించు సంజపూరెమ్మలందు
కావ్యమునఁ బోలెఁ బఠియింతు కౌతుకమున
ప్రకృతి సామ్రాజ్య పాలన పద్ధతులను.

చటులకల్లోల రసనల సాగరంబు
పవలు రేయి నాలాపించుపాటలందు
అనితర గ్రాహ్యధర్మంబులై చెలంగు
విశ్వసృష్టి ప్రకారముల్ వినుచునుందు.

గుజురుతుంపర ముత్యాల కాన్క లిడుచు
తరలు సెలయేటి పాటలో దాగియున్న
రాగతత్త్వంబు నామని రాత్రులందు
కూయు కోయిల కడ నేర్చికొందు వనుల.

*

ఇట్టి తత్త్వముతో నీ రెడ్డి కవి కోకిలము మధురకావ్యగానముచేసినది. వీరి కృషీవలుఁడు - పానశాల మున్నగునవి కృతులు చాలఁ బ్రశస్తి కెక్కియున్నవి. పల్లెటూరి రైతుబ్రదుకు 'కృషీవలుఁడు' కావ్యమున మూట కట్టినట్లులు ముచ్చటగాఁ గనవచ్చును.

అన్నా హాలిక! నీదు జీవితము నెయ్యం బార వర్ణింప మే
కొన్నన్ నిర్ఝర సారవేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుఁ గాని, యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గన్గొని పక్షపాతి యని నిందావాక్యముల్ పల్కరే?

రామిరెడ్డి కవిత్వమునకు హాలికుఁడు ఉద్దీపకుఁడైనాఁడు. గతానుగతిక మార్గమున సాగక, దేశకాలస్థితులు గుర్తించి తన తీయని కైతలో జానపద వాతావరణము రాణింపఁ జేసిన యీ రెడ్డికవి మఱవరాని వాఁడు. ఈయన కవిత వివిధవిషయములయందును బ్రసరించినది. 'ప్రణయాహ్వానము' ఎంత మెత్తగా నున్నదో, చూడనగును:

చంద్రికా ముగ్ధ శర్వరీచ్ఛాయలందు
జీవలోకంబు సుఖసుప్తి చెందుచుండ
కవి మనంబును బ్రకృతియు కలయుచుండ
పోదమా కాంత, సెలయేటి పొదలదరికి.

పులుఁగులు గూళులం జెదరిపోయిన రెక్కల నొత్తికొంచు, గొం
తులను పరస్పరంబు బిగితోఁ బెనవైచెడి వేళ, సవ్వడిం
దెలుపని వ్యాఘ్రహాస్యముల తిన్నగ వీనులవిందు సేయ నా
చెలి సెలయేటి సైకతము చేరుదమా, మనకేలి యాత్రలన్.

జిలిబిలి కమ్మగానములు చేసెడి యా సెలయేటి యొడ్డునన్
పులకల విస్తరిల్లి నను బోడిమి జూపెడు నీదు బుగ్గలన్
దోలకెడిసిగ్గడాలు కడదోపని ముద్దుల గ్రుమ్మరించి యి
వ్వల మధురోక్తులం గడిగి వైచెదఁ గోమలి, రమ్ము మెల్లగన్.

*

శ్రీ రామిరెడ్డిగారికిఁ బెక్కుసారస్వతములతోఁ బరిచితి యున్నది. ఈయన ఆంగ్లకవితయు స్తుతిపాత్రమై యున్నది. విజ్ఞానశాస్త్ర పరిశోధనము లన్నచో నీయన కధికప్రీతి. శాస్త్రపరిశోధకుల గౌరవనిధి పది వేలు మీఁదుగట్టి యుంచిన యీ రెడ్డిమహోదారత తెలుఁగునాఁట రత్నజ్యోతియై నిలువఁగలదు. శ్రీమత్కుటుంబమున జనించి, చేతులనిండ విత్తమార్జించి, దుర్వ్యసనములకుఁ బోక విజ్ఞాన నిక్షేపముగా వెచ్చించిన రామిరెడ్డి సాహిత్యధనము పవిత్రమైనది; స్థిరతరమైనదియును. కవితా కళయుండే కాక, లోకవ్యవహారములందును వీరికిఁ జాతుర్యము కలిగి యుండెడిది. 'సినిమా' దర్శకత్వములో నిరూపితమైన యీయన నైపుణ్యము గణ్యమై యున్నదిగదా!

విజ్ఞాన పరిశోధన ఫలము కవిత్వకళలో రంగరించి పొంగారఁజేసి యీమధురకవి వ్రాసిన "పలితకేశము"—"రవి, కవి," యను కావ్యములు చక్కనివి. రెండవ కావ్యమునుండి రెండుపద్యములు:

చ. మునుపటినుండి మానవ సమూహము గాంచిన యున్నతస్థితుల్
పొనరిచినట్టి కార్యము లపూర్వ మనోబలసిద్ధులుం, జిరం
తనమగు దేశనాగరికతల్ బహుశాస్త్ర సమార్జనంబు జె
ప్పినఁ బదియేండ్లు పట్టుఁ; బృథివింగల దంతయుఁ జెప్పసాధ్యమే!

ఉ. వీనికి మూలకారకులు విశ్రుతబుద్ధి వివేక పూర్ణ వి
ద్యానిలయుల్ సమర్థులు నుదారగుణాఢ్యులు పూజ్యులైన మా
మానవులేగదా, తెలివిమాలి వచించితి వింతసేపు నో
భానుఁడ! చాలు చాలు, నికఁ బల్కకు మేల వృథాప్రయాసముల్.

# దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

# 1897

తెల్లగాణ్య శాఖీయ బ్రాహ్మణులు: తండ్రి: తమ్మనశాస్త్రి అను నామాంతరముగల వెంకటకృష్ణశాస్త్రి. జన్మస్థానము: చంద్రమపాలెము. నివాసము: పిఠాపురము, మదరాసు. జననము: 1897 సం. రచనలు:- ౧. కన్నీరు ౨. కృష్ణపక్షము. ౩. ప్రవాసము; ఊర్వశి. ౪. ఋగ్వీధి. [ముద్రితములు] ౧. మహతి [గేయ సంపుటి] ౨. శర్మిష్ఠ ౩. అళలి [జాతీయగీతములు] ౪. బదరిక [పద్యగాథ] ౫. రేడియోనాటికలు ౬. సుప్రియ [సాహిత్య వ్యాసములు – అముద్రితములు] మొదలగునవి.

నేటి కవిలోకమున కృష్ణశాస్త్రిగారి దొక ప్రత్యేక స్థానము. దేవులపల్లిసోదరులను పీఠికాపుర సంస్థాన విద్వత్కవులుగా వింటిమి. ఈ జంటలో రెండవవారైన తమ్మనశాస్త్రిగారి కుమారుఁ డీయన. తమ్మనశాస్త్రిగారి యసలు పేరు వేంకటకృష్ణశాస్త్రి. తండ్రికొడుకుల పేరు లొకటే. నాఁడు తండ్రిపేరు కంటె, నేఁడు కొడుకుపేరు విన్నవారి జనసంఖ్య పెద్దది. కాని, తండ్రిముందు కొడుకు వ్యుత్పత్తిలోఁ బేదవాఁడు. శివస్వరూపుఁడైన తమ్మనశాస్త్రి తేజస్సు ముందు కృష్ణశాస్త్రి కుమారమూర్తి. ఆయన కూర్చుండుటకు మేలిజాతి మణివితర్దిక కావలయును. ఇతనికి మెత్తని పూలపానుపుమీఁదఁ గాని నిదుర పట్టదు.

కృష్ణశాస్త్రికిఁ దొలుతొలుత పిఠాపురము హైస్కూలులో ఆంగ్లపుఁ జదువు. నాఁడు కూచి నరసింహముగారి గురుత్వము కళార్థుల నెందఱనో భావుకులనుగా దిద్దినది. ఆయన యంతేవాసియై యాంగ్ల కావ్య నాటకములలోని మెలఁకువలు గుఱుతించి కృష్ణశాస్త్రి తన ప్రతిభకు మెఱుఁగు పెట్టుకొనెను. 'స్కూలుఫైనలు' వఱకుఁ దండ్రితో నుండి

సాహిత్యతత్త్వము తెలిసికొను భాగ్యము. ఆపిమ్మట నాయనగారి నిర్యాణము. పెదతండ్రి సుబ్బారాయశాస్త్రిగారుకూడ గతించినారు. తండ్రుల నెడబాసిన తనయుఁడు వారి యుపదేశములు నెమరునకుఁ దెచ్చుకొనుచు, వారి రచనలు పారాయణము చేసికొనుచుఁ గొంత కాలము గడపెను. కూచివారి యాచార్యకము కృష్ణశాస్త్రి యనూచానమైన ప్రతిభాసంపదకు మెఱవడి కలిగించినది. మంచి చుఱుకైన బుద్ధి. విన్నది కన్నది వెంటనే పట్టుకొను నైశిత్యము! అప్పటి కప్పుడే కనఁబడిన గ్రంథమెల్లఁ జదివినాఁడు. 'స్కూలుఫైనలు' పరీక్షలో ను త్తీర్ణుఁడైన నాఁటికి వయస్సు పదునైదు సంవత్సరములు. పయిచదువున కొకయేఁడు ఆఁగవలసి వచ్చినది. ఈ సంవత్సరములో నాంధ్రసాహిత్య పఠనము. గ్రాంథిక వ్యావహారిక భాషావివాదము పెల్లురేఁగు నా కాలము కృష్ణశాస్త్రి ప్రభృతులకు వినోదస్థానము.

నాఁడు కాకినాడలోని కళాశాలకు రఘుపతి వేంకటరత్నము నాయఁడు గారి యాధ్యక్ష్యము. నాయఁడుగారి యుపన్యాసములు కృష్ణశాస్త్రికిఁ గ్రొత్త యుత్తేజనము కలిగించినవి. ఆయనలోని యాధ్యాత్మిక జిజ్ఞాస, మార్గదర్శకమైనది. 1919 లో 'ఇంటరు' లో గెలుపు. 1918 నాఁటికి బి. ఏ. పట్టభద్రత. విద్యార్థిదశలోనే బైబిలు, కురాన్, భగవద్గీతలలోని మెలఁకువలు, వెలుఁగులు నాయఁడుగారు చూపించినారు. రామమోహనరాయల సిద్ధాంతములు, సాహిత్యములో అప్పారావుగారి పోకడలు గుండెకు పట్టుకొన్నవి.

ఇంక, విద్యార్థిదశదాఁటిన కృష్ణశాస్త్రిగారికి భాషా-సంఘసంస్కారములు కావలయునన్న భావము దృఢపడినది. కాకినాడలో బ్రహ్మసమాజము నాటకసమాజము వీరి సంస్కరణోద్దేశమున కొకదీప్తి కలిగించినవి. మొదట 'మిషన్' స్కూలులో నుద్యోగము. బ్రహ్మసమాజములో విడుమర లేని కృషి. 1919 సంవత్సరమునుండి కృష్ణశాస్త్రిగారి జీవితములో

నొక నూతన ప్రకరణ మారంభమైనది. గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారిక వాదముపై సంపూర్ణమైన విశ్వాసము పాదుకొన్నది. చింతా దీక్షితులుగారి సాహచర్యముతో వ్యావహారిక రచనా ప్రాచుర్యము కొనసాగించిరి. నేటికి, రవీంద్రుడు—షెల్లీ, భవభూతి, పెద్దన, గురుజాడ అప్పారావు ఇత్యాదు లందఱు కృష్ణశాస్త్రిగారిలోఁ దీయతీయని తలఁపులు రేపిరి. దాని ఫలమే 'కృష్ణపక్షము'. కొవ్వూరిలో నుండి యథాపథ సేవ చేసికొనుచు 'కృష్ణపక్షము' సాగించిరట. 1921 జాతీయోద్యమమునకు వీరిని పురికొల్పిన వత్సరము. ఆయేఁడే దైవవశమున కృష్ణశాస్త్రిగారికి సతీవియోగము. ఆ పిదప పిఠాపురము హైస్కూలులో ఉద్యోగధర్మము; ద్వితీయవివాహమును. మహారాజు కృష్ణశాస్త్రిగారి జాతీయభావములు సహింపలేక యుద్యోగమునుండి తొలఁగించివైచెను. తరువాత మఱికొన్ని సంవత్సరములకు 1932 మొదలు 1941 వఱకు కాకినాడ కళాశాలోద్యోగము. అంతటితో దానికిని స్వస్తి. ఆత్మగౌరవమును బాటించుకొన నని కృష్ణశాస్త్రిగారు ప్రతిజ్ఞపట్టినచో, ఆయనకీపాటికి 'ప్రిన్సిపాలు' పదవి వచ్చియుండవచ్చును. ఆదురదృష్ట మాయనకుఁ బట్టలేదు. ఇది కృష్ణశాస్త్రిగారి జీవితములోఁ గొందఱికే విందుగూర్చు భాగము. ఈ పయిది భావుకులకు విడువరాని యాతిథ్యము.

“ తలిరాకు జొంపములు సం
దుల త్రోవల నేలువాలు తుహిన కిరణ కో
మలరేఖవో! పువుదీవవో!
వెలఁదీ, యెవ్వతెవు నీవవిటవీ వనిలోన్.

కారు మొయిళ్ళ కాటుగ పొగల్ వెలిగ్రక్కు తమాలవాటి నే
దారియుఁ గానరాదు, నెలఁతా! యెటు వోయెద వర్ధరాత్రి? వి
స్ఫార విలోచనాంధ తమసమ్ములఁ జిమ్ముచు వేఁడివేఁడి ని
ట్టూరుపులన్ నిశీథ పవనోర్మి వితానము మేలుకొల్పుచున్.

అది శరద్రాత్రి ; శీతచంద్రాత పాంత
రాళరమణీయ రజత తల్పంబు నందుఁ
జల్లఁగా నిద్రవోవు ప్రేవల్లెవాఁడ
సకల గోపాల గోపికా గణముతోడ.

*

ఎలదేటి చిఱుపాట సెలయేటి కెరటాలఁ
బడిపోవు విరికన్నె వలపు వోలె,
తీయని మల్లెపూఁ దేనె సోనల పైని
తూగాడు తలిరాకుదోనె వోలె,
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలోఁ బయనమై
పరువెత్తు కోయిల పాట వోలె
వెల్లువలై పాఱు వెలఁది వెన్నెలలోన
మునిఁగిపోయిన మబ్బుతునక వోలె,
చిఱుత తొలకరివానగాఁ, జిన్నిసోనగ,
పొంగి పొరలెడు గాల్వగా, నింగి కెగయు
కడలిగాఁ బిల్లగ్రోవిని వెడలు వింత
తీయఁదనముల లీనమైపోయె నెడఁద.

*

జిలిబిలి పట్టురేకుల వెంట దొట్రిలు
మల్లియయెద దాఁగు మధుపరవము
కనుచూపు దాటు నామనిఁబాయు కోయిల
గొంతులోఁ జిక్కు వసంతగీతి
విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి
కడుపులో నడఁగిన కడలి మ్రోత

జేనికై వెదకెడు దిక్కు చూపులలోనఁ
జెఱివడ్డ నిండుచందురుని పోల
యిట్లు నీ దీన గోపికా హృదయ మంది
రాంతరాళములోనఁ ద్రుళ్లింతలాడు
వేణు నాదంబు వినిపించు విశ్వమోహ
నాకృతిఁ గిశోరగాయకు నరయు చుంటి.
ఇది నాచరితము, విని, నీ
వదరెదు, తొట్రిలెదు, వడఁకు, దటు నిటు కనులన్
చెదరెడు చూపుల నేదో
వెదకెదు, ఎవ్వతెవు నీపవిటపిస్థలిలోన్.

‘అన్వేషణము’ అను శీర్షికతోనున్న ఖండకావ్యమునందలి కొన్ని పద్యములివి. ఈరచనలోఁ దొల్లిటి ప్రబంధముల వాసన లేత లేతగా నున్నది. శైలిలోఁ దెనుఁగుఁదనము, కొన్నిశబ్దములలోఁ గ్రొత్తఁదనము, సంవిధానములోఁ డియ్యఁదనము జతగూడి శ్రుతుల కతిథి గౌరవము నొనఁగుచున్నవి. కృష్ణశాస్త్రిగారి భావన ‘అన్వేషణము’ తో నారంభమై నేటికి లోతులు ముట్టినది. ఈయన తెలుఁగు వారి కిచ్చిన కావ్యములు ప్రధానములైనవి: ప్రవాసము; ఊర్వశి — కృష్ణపక్షము. ఈ కవినుండి యుబికిన యక్షరములు తక్కువ. కాని, వాని బరువెంతో యెక్కువ. ఆయన ప్రత్యక్షరము ముట్టి చూచినచో నార్ద్రమైన యొక్కొక్క కలువపు రేకు చుట్టినటులు తోఁచును. కాఠిన్యము సహింపని యీ కవి జయదేవుని వలె పదములేఱుకొని, భవభూతి వలె పాడినాఁడు. క్షీరసాగరము వంటి హృదయము; చెమ్మగిల్లుచున్న కన్నులు! బ్రతుకుపై నిరాశ!

ఏను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొఱకు చెమ్మగిల నయనమ్ములేదు;

పసిఁడివేఁకువ పెండ్లిండ్ల బడిన యెవరు
కరగనేర్తురు జరఠాంధకారమృతికి?
నామరణశయ్య పఱచుకొన్నాను నేన!
నేన నాకు వీడ్కోలుపు విన్పించినాను!
నేన నాపయి వాలినా, నేన జాలి
నెద నెద గదించినాను, రోదించినాను.
బ్రతికియున్న మృత్యువునైన ప్రవాస తిమిర
నీరవ సమాధిఁ గ్రుక్కి క్రుంగినపుడేని
నిను పిలిచినాన, నామూల్గు నీడ ముసిరి
క్షణములు నేమొ నీ గానోత్సవముల ననుచు
ఇదియె నాచితి, పేర్చితి నేన దీని
వదలిపోని యావసాన వాంఛ గాఁగ;
వడకని కరాలు రగులుచు దుడుకు చిచ్చు
లాలనల నింత మసిగాఁగ కాలు త్రుటిని!
అలయు వాతెఱ యూర్పు గాలులు కదల్చి
రేపునంతె నా కాష్ఠాల రేగుమంట
మును బ్రతుకునట్లు నా దేహమును దహింపు!
వడదులే ఆర్పగా నొక బాష్పమేని!

పడమటికవులు షెల్లీ, బైరను మొదలగువారిట్టి యీభావనకు దారి చూపినవారనుట సత్యమగుఁగాక! మన కృష్ణశాస్త్రిగారి కెందఱికో యందని తేనెబిందువులు దొరకినవి. అవి యాయన కవితలో నక్షరములై వెలికుబుకును. ఆయన పద్యము కాదు పాటకాదు మలచి మలచి, తూకము సరిపెట్టుకొని బయటఁ బెట్టునలవాటు గలవ్యక్తి. భావన. లోఁతునకు, పదముల కూరుపునకు హెచ్చు కుందు లుండవు. ఆ సుగుణముగల కవులు తక్కువ సంఖ్యలో నున్నారు. రచనలోని యూశిల్పము తీరు చూడుఁడు.

రేయికడుపున చీకటి చాయవోలె
తమపు డెడఁద దివాంధగీతము విధాన
ఘూక రావాన వలవంత రేక రీతి
నా విషాదమ్ములో దాగినాఁడ నేన!

దేవులపల్లి కవితాగానము ముప్పాతికపాలు కరుణాత్మకము. కరుణలోనే మధురిమ నించి పాఠకుల నూరింపఁజేయు శక్తి ఆయన కలములోఁ దులకాడుచుండును. దేవులపల్లి కవి యాత్రోవ నవీన కవులెందఱో యనుసరించినారు. "కవి మృతుఁడైనను చవిపోవరా" దని కృష్ణశాస్త్రిగారి వాణి. బ్రతికియుండియు మరణించుచున్న—జీవచ్ఛవములైన కవులను జూచి కృష్ణశాస్త్రిగారికి జాలి. రవీంద్రుని యడుగు జాడలలో పీరినడక. తెనుఁగు కవులలో నన్నయ—రామకృష్ణుఁడు ఇత్యాదులు కొందఱే యీయన దృష్టిలో మహాకవులు. జయదేవుఁడు, అమరకుఁడు, కాళిదాసు, భవభూతి వీరిపేర్లు చెప్పి కృష్ణశాస్త్రిగారు పొంగిపోదురు. వేంకటరత్నము నాయఁడుగారు గురుస్థానము. ఆయనమీఁద గొప్ప హృదయముతో నీయన రచించిన పద్యములు భావింపఁ దగినవి; విస్మరింప రానివియును.

ఈ జడజీవితమ్ము పలికించితి, వీ యఘుపంకమందు నం
భోజము పుల్వఁజేసితి, వపూర్వము నీదయ, యీనిశీథి నీ
రాజన మెత్తినావు, విపులమ్మగు నీయెద నిండె నే శర
ద్రాజిత చంద్రకాంతు లమృతమ్ములు స్వర్గలతాంత వాసనల్.

*

నాయెదలోఁ ద్వదీయ చరణమ్ముల చిహ్నము లెన్నఁడేనియున్
మాయవ, యేనిశీథపుఁ దమస్సులు మూసినఁగాని జీవయా
త్రాయత వీథి నొక్కఁడఁ బ్రయాణము సేయుదు నక్షయంపుఁ బా
థేయముగా గ్రహించి గురుదేవ ముఖస్రుత గీతికాసుధల్.

*

ప్రతిఫల మ్మిసుమంత వలవక కర్మముల్
సేయు నీమెయి కురుక్షేత్ర మగును,
ఆశాంతములకుఁ జరాచరమ్ములకును
దరలు నీయెడఁద బృందావనమగు,
వివిధ ధర్మజ్ఞాన వేణీ సమాశ్లేష
మైన నీమనసు ప్రయాగ యగును,
పాతాళమును స్వర్గపద మొక ముడిలోన
నతుకు నీవే వారణాసి వౌదు
నీవు కన్పడ నెదురుగా నిలిచినట్లె
మ్రోలను పురాణ భారత పుణ్యభూమి!
మాకు దినదిన దివ్యయాత్రా కృతోత్స
వానుభూతి నొసంగు బ్రహ్మర్షి నీవు.

గురువునెడల దేవులపల్లికవి భక్తిప్రపత్తులకే కాక, ఆధ్యాత్మిక దృష్టి నైశిత్యమునకుఁగూడ నీరచన తారకాణ. కృష్ణశాస్త్రిగారిలో నొక విశేషమున్నది; వీరి భావన మృదుల మృదులముగా నుండి శ్రోతల నంటుకొనును. ఆ పలుకుల మెత్తఁదనము హాయి యనిపించును. ఎంతసేపు, కవికి శైలిపై చూపు. ఆయనపాట లందుకే తెనుఁగునాఁట ముచ్చటగాఁ బాడుకొనుచుందురు.

ఎవరో వారో, ఈ నిశీధి
నెగసి నీడవోలె నిలిచి
పిలుతు రెవరో, మూగకనులు
వోయలేని చూపులతో
ఎవరో వారో! ఎవరో వారో!
ఇపుడా నను బలుకరింతురు!

ప్రోయలేని నీరవగళ
మున జరించు కోరికలో
ఇపుడా నను బలుకరింతురు!
ఎవరని ఈ రేయి నిదుర
హృదయ మదర, వేయి చేయి
చాయలాడ పెనుచీకటి
సైగలతో నాకన్నుల
రక్తమురల లాగికొందురు!

* * * *

ఇది మున్నుగా నెన్నో కృష్ణశాస్త్రిగారి పాటలు ప్రశస్తి గాని యున్నవి. "జయజయజయ ప్రియభారత జనయిత్రీ!" "యువపతాక నవ పతాక, అరుణారుణ జయపతాక" ఈపాటలు గానము చేయని సభలు నేడు తక్కువ.

అభినవాంధ్ర కవులలో నొక ప్రత్యేకత సంపాదించుకొన్న దేవుల పల్లి కవి పరసేవాహైన్యము ననుభవింపలేని ఆత్మగౌరవశీలి అయినను 1932 మొదలు 1941 దాక పి. ఆర్. కాలేజిలో ఉపన్యాసక పదవిలో నుండవలసి వచ్చినది. వెనుకటి యుద్యోగముల వలెనే యీ పదవికూడ స్వాతంత్ర్య మారుతము ధాటి కాగలేక పోయినది. ఆ తరువాత కృష్ణశాస్త్రిగారి మనుగడ మదరాసులో. 'మల్లేశ్వరి' మొదలగు చలన చిత్రములకు పాటలు, మాటలు వ్రాసి యిచ్చుచు, రేడియోలో నాటికలు ప్రసారముచేయుచుఁ గాలక్షేపము. చిన్నచిన్న కావ్యము లేవో కొన్ని రచించి, యొక రకమైన కవితాపథమునకు దర్శకత్వము సంపాదించెనే కాని, కృష్ణశాస్త్రిగారు రెండుకము వేసికొని మహాగ్రంథ మేదియు వ్రాయలేకపోవుట యొక కొఱవ యని కొందఱి విమర్శ.

సంపుటములు పెంచకపోయినను, బయటఁబెట్టిన యక్షరములు రస స్రోతస్సులు! ఆయన యిట్లు పాడుకొనుచున్నాఁడు.

నా హృదయమందు విశ్వ వీణాగళమ్ము
ఘోరు ఘోరున నీనాఁడు మ్రోఁత వెట్టు
దశదిశా తంత్రు లొక్క సుధాశ్రుతిని బె
నంగి చుక్కల మెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ములఁ జరించు.

*

వెలుఁగులో, అమృతాలో, తావులో, మరేవో
కురియు జడులు జడులు గాఁగ, పొరలిపాఱు
కాలువలు గాఁగ, పూర్ణకల్లోలములుగ
కలదు నాలోన క్షీరసాగరము నేఁడు.

# గుర్రం జాషువ కవి

## 1895

జననీజనకులు : లింగమాంబా, వీరయ్యలు. జన్మస్థానము : వినుకొండ. జననము : 1895 అక్టోబరు 28 తేది. కృతులు : ౧. ఖండకావ్యము [మూఁడుభాగములు] ౨. పిరదౌసి ౩. గబ్బిలము ౪. స్వప్నకథ ౫. కాందిశీకుఁడు ౬. ముంటాజమహాలు ౭. నేతాజీ ౮. స్వయంవరము ౯. బాపూజీ [ఖండ కావ్యములు] ౧౦. వీరాబాయి [చరిత్రాత్మక నాటకము] ౧౧. తెరచాటు [సాంఘిక నాటకము] ఇత్యాదులు మొత్తము నేఁటికి రచితములు ౨౧ గ్రంథములు.

నేఁడుసాగుచున్న యిరువదవ శతకమునకు ఖండకావ్యశకమని పేరు పెట్టుటలో నాక్షేప ముండదు. మహాకవి కాళిదాసు 'మేఘదూతము' ఈ నూతన శకము మేలుబంతి. ఈ కాలమున జనించిన మహాకావ్యములు వ్రేళ్ళలెక్కకు వచ్చునవి. ఖండకావ్యము లసంఖ్యాకములు. అనేక కారణములవలన నేఁటి పాఠకులు సుకుమార హృదయులైనారు. పాఠకుల చిత్తవృత్తుల కనుగుణముగా రచయితలును. లేదా, కొన్ని హేతువు లుండి రచయితలు కవితలో మితభాషులుగానున్నారు. రచయితల ననుసరించి పఠితలును. నేఁటికవుల చూపులలోఁ గొత్త మెఱుఁగు లున్నవి. వా తెలిసికొనవలసిన యితివృత్తములే వేఱు. జాతీయమైన సంచలనము, రాజకీయమైన పరిణామము, భాషీయమైన వికాసము - ఇత్యాదు లెన్నో తెనుఁగున వెల్లిగొని కవిత్వమున నూత్న మార్గములు తీచినవి. పెఱ వాఙ్మయములతో మన కేర్పడిన సాన్నిహిత్యము కూడ నీ నవోదయమునకుఁ జేయూఁతనఁ దగిన యూఁదరువు. దాన, దీన - స్వల్పకాల పఠన సాధ్యమగు ఖండకావ్యగానమునకు నేఁడు సుప్రచారప్రశస్తులు పరిఢవిల్లుచున్నవి. ఖండకావ్యములు రెండు మూఁడు పద్యములనుండి, రెండు మూఁడు నూఱుల పద్యముల వఱకు నున్నవి

యీనాఁడు వెలువడుచున్నవి. పద్యముల రాశితోనే కావ్యత్వ సిద్ధి యనరాదుగదా! "అమరుక కవేరేక శ్లోకః ప్రబంధశతాయ తే." కావ్యముయొక్క ఏకదేశానుసారియైనది ఖండకావ్య మని సాహిత్య దర్పణకారుఁడు. దీనికే సంఘాత మని నామాంతరము. ఇది యపూర్వము కాకపోయినను, పూర్వ కవులలో ఖండకావ్య రచయితలు మిక్కిలి తక్కువ. నేఁడో మూఁడువంతులు ఖండకావ్యముల కారు.

ఏతాదృశ కావ్య వాఙ్మయ మధుమాసమున 'జాషువకవి'కషాయ కంఠమున గాన మొనరించుచున్న పుంస్కోకము. ఆయన ఉభయ భాషా ప్రవీణులు, కవితా విశారదులును. చరిత్ర ప్రసిద్ధమైన వినుకొండలో జాషువకవి జన్మించుట పేర్కొనఁ దగినది. ఈ ధన్యత్వము, ఆయన గుర్తులో నుంచుకొని యిట్లు వ్రాసికొనెను:

శ్రీరాముఁ డేకొండ శిఖరానఁ గన్నీట
నాలించె సీతాపహరణగాథ
దాటించె నేపీటి దాపున నైతమ్మ
పట్టి మేల్పొట్టేలి వాహనంబు
కోట కొమ్మలమీఁద గ్రుచ్చినా రేపీటి
తెలుఁగురాజుల విరోధుల శిరాలు
ముత్యాలతో నారబోసినా రేవీటి
నృపతు లేటేటఁ బండిన యశస్సు
భాస్కరుని దానధార కేపట్టణంబు
చారు చరితకు బంగారు నీరు వోసె
నట్టి వినుకొండ కడుపునఁ బుట్టుకతన
ధన్యుఁడను నేన యుత్తమోత్తముఁడ నేన.

జన్మస్థానము వినుకొండ యగుఁగాక, తెలుఁగుమండలము సర్వము జాషువకవి కీర్తికి స్థానమైయున్నది. సాధారణ ప్రజానీకములోనైతము

మెచ్చుకోలువడయఁగల కవితారచన జాషువకవిగారికి నైసర్గికమైయుండి వచ్చినది. రసికవిద్వాంసులు వీరికృతులు చూచి మురిసిపోవుదురు. ఏమనఁగా, తియ్యనైన శయ్యావైభవముతో, నిర్దుష్టమైన భాషాప్రాభవముతో హృదయములో నున్న విషయమంతయుఁ బాఠకున కందీయఁగల కూర్పునేర్పు వీరి కబ్బినది. అబ్బిన చాతుర్యమును నిరంతరాభ్యాసమువలనఁ బెంపుచేసికొనిరి. దానితో, ఆయన ప్రతిపద్యము హాయి యనిపించునట్లు వ్రాయఁగలుగును. బంగారు తీగవంటి యేదో కోమలధారాళత! వృత్తములు, విశేషించి సీసములు, శ్రోత్రధోరణిలో శ్రోత్రసొంపులు పెట్టి వ్రాయుటలో నీ కవి పేరుపడెను. ఈయన రచించిన ఖండకావ్యములన్నింటను శైలి సరిగా నొకేతీరున సాగుచుండుట గమనింపఁదగినది. ఆయన పలుకుబడులు, జాతీయములు, విదేశీయపద ప్రయోగములు, ఎత్తుగడలు — ఎక్కడకు వెళ్లినను మారిపోవు. అదీ ఆయన ప్రత్యేకత. ఈ పద్యములు కొన్ని చూడుఁడు:

వేగిరాజుల సతీ వితతికి గరువంపు
నడక నేర్పినది నన్నయ్యరచన
తెనుఁగుభాషా పదమ్ములకు జారని వన్నె
బట్టించినది కవిబ్రహ్మపలుకు
కంచుఢక్కల నోరు కట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీనాథుజిహ్వ
ప్రతిలేని యపవర్గ పదవి వంకకు రహ
దారి తీసినది పోతన చరిత్ర
విజయనగరాధిపుల పురావేదికలకు
నందలంబుల మోయు మర్యాద గరపి
తనివి గొన్నది మొన్న పెద్దన కవిత్వ
మాంధ్ర భారతి! నీ తేజ మద్భుతంబు.

విజయ విలాసుని వినుతింపఁ దలఁచిన
జక్కన్న కోరమీసాలుదువ్వె
జక్కన్న కవనంబు చక్కనిదని పల్క
పినవీరకవి నాల్క వెళ్లఁ బెట్టె
పినవీరకవి పల్కు వెలఁదికిముగఁ డన్న
గండ పెండారంబు ఘల్లు మనియె
పెద్దన్న కవితకుఁబెద తాత యనిపల్క
రామభూషణుఁ డంబరంబు సూచె
భట్టు మూర్తికి గవిరాజుపట్ట మీయ
తెట్టి లింగడు చేపల బుట్ట నూపె
నందఱందఱు మహనీయు లని తలంచి
యొక నమస్కార మొనరించి యూరకుంటి.

*

కరుడై పోయిన వీరలోకమునకై కన్నీరు వర్షించుచున్
గరముల్ మోడుచు మందభాగ్యదశ కింకన్ దావు లేకుండఁగా
దొరకె న్నాకు విచిత్ర దిగ్విజయ వస్తుశ్రేణి బాపూజిచే
తరమే మమ్మెదిరింప నన్యులకు ఛత్రగ్రాహి ఖండాళికిన్.

"స్వయంవరము"

*

అడంగుల్ కలవారి తోయ్యలు లసూర్యంపశ్యలై, హాయిగా
మాడీలం బరదాలలో మెరయు శంపావల్లులై యొప్పగా
నాడుం గొండల కోనలన్ గృషికకాంతల్ మూపులం బావల
ల్లాడం గష్టము చేయు దృశ్యములు నాయాత్మం బ్రబోధించెడిన్.

"కాందిశీకుడు"

*

ఇట్టి శయ్యాసౌష్ఠవము తఱచుగా నేఁడు మనము చూడఁజాలము. విజాతీయ పదములకు మాఱుపోసి తెలుఁగుముద్ర వేసినకవి జాషువయే. ఆయన ఖండకృతులలోఁ దొలుత మంచిపేరువచ్చినది "పిరదౌసి". దాని వెనుకఁ జాలకృతులాయన వెలువరించెను. ఇవియెల్ల 'పిరదౌసి' కావ్యమునకు అనుక్రమితములు. గబ్బిలము – అనసూయయు మున్నగు వీరిరచనలు వ్యథాభరితమైన హృదయమునుండి పొంగి వచ్చినవిగాఁ దోఁచును. ఆయన కెంత యుత్సాహోద్రేకము లున్నవో, అంత యావేదన మున్నది. ఆ వేదనమునుండి సముత్పన్నమగు కవిత రసార్ద్రమైయుండి రసిక మానసములు కరగించుటకు సమర్థమగును. కర్ణుని గూర్చి ఆయన రచించిన పద్యములు గొప్పవి. శ్రుతిసుఖమైన జాషువకవి కోకిలము కవిత్వ గానము విద్యార్థులు, విద్వాంసులు, పామరులు ధీమంతులు కూడ విని తనియుటకుఁ దగినది. అన్వయములో పెడసుతనము, పదముద్రలో బిరుసుఁదనము లేక కమ్మచ్చునఁ దీసినట్టులు నడచు వీరి కవితాశైలి తెలుఁగువారి పారాయణముగాఁ జాలువాఱుచున్నది.

జాషువకవి యుభయభాషాప్రవీణ బిరుద విభ్రాజితుఁడు. 1919 నుండి గుంటూరున ట్రైనింగుస్కూలులో 1928 వఱకు నుద్యోగించెను. తరువాత, 29 సం॥ నుండి 15 సంవత్సరములు గుంటూరు జిల్లా బోర్డు పాఠశాలలో తెలుఁగుపండితపదవి. 42 సం॥ నుండి మూఁడు వత్సరములు మదరాసున యుద్ధవిషయకమైన ప్రచారశాఖలో పాటలు వ్రాయుచు, ఉపన్యాసములిచ్చుచుఁ గడపెను. 47 నుండి యుద్యోగ విరమణము. ఈవిశ్రాంతిలో నెన్నో కావ్యములు రచించుటకు వీరు సమర్థులు.

కావ్యరచనోద్యోగము ముందు, ఈ యుద్యోగములన్నియు లెక్కలేనివి. ఆయన ఆధునిక కవులలోఁ జెఱిగిపోని తఱిగిపోని యశస్సు సమార్జించుకొన్న కవి. గండపెండరములు తొడిగి, ఏనుఁగు నెక్కించి, కనకాభిషేకముచేసి, సహస్రద్రవ్యములు కానుకగానిచ్చి, తెలుఁగునేల జాషువకవిగారిని గౌరవించుచున్నది. ఈ గౌరవములకు వారికావ్యములు దోయిలించుచున్నవి.

# అడివి బాపిరాజు

## 1895

నియోగి బ్రాహ్మణుఁడు. తల్లి: సుబ్బమ్మ. తండ్రి: కృష్ణయ్య. జన్మ స్థానము: భీమవరము. జననము: 8 అక్టోబరు 1895 సం. రచనలు :— ౧. నారాయణరావు ౨. హిమబిందు ౩. తుపాను. ౪. కోనంగి. ౫. గోనగన్నారెడ్డి. ౬. అడివి శాంతిశ్రీ ౭. మధురవాణి [ఇత్యాదులు నవలలు] ౮. అంజలి. ౯. రాగమాలిక. ౧౦. తరంగిణి [ఇత్యాదులు కథలు] ౧౧. తొలకరి ౧౨. హారతి. ౧౩. గోధూళి [ఇత్యాదులు పాటల సంపుటములు] ౧౪. తీర్థయాత్ర. [వ్యాస సంపుటము.] ౧. ఆంధ్రసామ్రాజ్ఞి. ౨. కృతిసమర్పణం. ౩. భగీరథీలోయ ౪. దుక్కిటెద్దులు. ౫. ఉషాసుందరి. [ఇత్యాదులు రేడియో నాటికలు.]

శ్రీ బాపిరాజుగారు కళాప్రపూర్ణులు. ఈ బిరుదము విశ్వవిద్యాలయ ప్రసాదము వలనఁ జేకుఱినది కాదు. అసలు, సహజముగా నాయన బహు కళాప్రపూర్ణులు. కవిత్వము, శిల్పము, చిత్రకళ, గానము, నాట్యము మొదలగు నెన్నో కళలలో బాపిరాజుగారు సువరిణతమైన యెఱుక గలవారు. దేశభక్తి, రచనాశక్తి, యీయనలో మూర్తికట్టుకొని యున్నవి. చరిత్రముపై వీరికి గొప్ప యభిమానము. శాస్త్రములపై మంచి విశ్వాసము. రసార్ద్రమైన హృదయము. తియ్యని పలుకుబడి. ఇన్ని విశిష్ట లక్షణములు గల రసికుఁడు గ్రంథరచన గావించుచో, మఱి యవి సుధాభాండములుగా నుండవా?

పాశ్చాత్య సారస్వతమునను, ప్రాచ్య సాహిత్యమునను సమానముగానే వీరు పరిశ్రమించినవారు కావున, ఆయన కృతులలో సంప్రదాయ సిద్ధమైన సౌందర్యము, వింత కలిగించు క్రొత్తపోకడలు కూడ నుండును. ఈయన 'శశిబాల' నుపాసించును. గోదావరి, యనఁగా బాపిరాజుగారి కెంతో యాప్యాయము. ఈకవి చిక్కని పాటలు వ్రాయును; చక్కఁగాఁ బాడును.

ఉప్పొంగి పోయింది గోదావరీ తాను
తెప్పున్న ఎగిసింది గోదావరీ.
కొండల్లు ఉరికింది కోనల్లు నిండింది
ఆకాశ గంగతో హస్తాలు కలిపింది — ఉప్పొంగి॥
అడవిచెట్లన్నీని జడలలో ముడిచింది
ఊళ్లు దండల గుచ్చి మెళ్ళోన తాల్చింది — ఉప్పొంగి॥
వడులలో గర్వాన నడలలో సుడులలో
పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తు వచ్చింది — ఉప్పొంగి॥
శంఖాలు పూరించి కిన్నరలు మీటించి
శంకరాభరణ రాగాలాప కంఠయై — ఉప్పొంగి॥
సరమానవుని పనులు సిరిమొగ్గి వణకాయు
కరమెత్తి దీవించి కడలికే నడిచింది — ఉప్పొంగి॥

ఈ మొదలగు పాటలు వీరివి పరివ్యాప్తములై యున్నవి. సన్నని స్త్రీకంఠస్వరముతో, అభినయము చేయుచుం గూడ బాపిరాజుగారు పాడుచున్నపుడు, ఈపాట లెంతో ముచ్చటగా వినవేసుక. ఆయన పద్య బంధములు వ్రాయుటకుం దఱచుగా నిచ్ఛగింపనివారు.

ఇంక, బాపిరాజుగారి ప్రతిష్ఠకుం బతాక నెత్తిన రచనలు నారాయణరావు, హిమబిందు, గోన గన్నారెడ్డి, తుపాను, కోనంగి మున్నగు నవలలు, "నారాయణరావు" రచనతో వీరిపేరు సుప్రతిష్ఠితమై వెలసినది. అది యాంధ్ర విశ్వవిద్యాలయమువారి సత్కారమునకు భాజన మగుటయేకాక, ఆంధ్ర ప్రజల డెందము దూపించిన కూర్పు. వచన రచన బాపిరాజుగారిది హృదయంగమ మైనది. గ్రాంథికము, వ్యావహారికము తుల్య ప్రవృత్తితోనే వ్రాయుం గలవారు. వ్రాంతలో నెన్నో క్రొత్తమలుపులు, పోలుపులు చూపఁగలరు. పాత్రలతో సర్వాత్మనా కలియఁగల శక్తి వీరిలో నున్నది. సంఘమర్యాదలు సునూత్న

ముగా గుర్తింపఁగలరు. మానసిక తత్త్వము క్షణములోఁ దెలిసికొనఁ గలరు. ఈ విశిష్టలక్షణములతో బాపిరాజుగారు పెద్దపెద్ద నవలలు వ్రాసిరి. పుటలు పెంచుటయే పరమార్థముగా భావించినవారు గాక, రసఘటములుగా వీరు నవలలు తీర్చినారు. విషయము వచ్చినపుడు దానిని ఆమూలచూడము ప్రత్యక్షముచేయుట వీరి కలవాటు. సగము సగము, తెలిసీతెలియని మెఱుకతో గొలుకుట కాయన యిష్టపడరు. ధర్మము—శిల్పము—కవిత్వము—ప్రేమ—సంగీతము—మొదలయిన వానిపై ఆయన తన నవలలలో సందర్భము ననుసరించి కావించిన విశాల చర్చలు ప్రత్యేకగ్రంథములు కాఁగలయవి. 'హిమబిందు' లో నెన్నో ప్రకరణములు బాపిరాజుగారికి పురాతన శాస్త్రములలోఁ గల ప్రగాఢ ప్రవేశమును తార్కాణించుచున్నవి. ఆంధ్ర చరిత్రయు, బౌద్ధయుగ చరిత్రయు, లెస్సగాఁ బరిశ్రమించి యాకళించినవా రగుటచే వీరి నవ లలు చాలభాగము చారిత్రకములై యున్నవి. చరిత్రలో నిట్టి కృషిచేసిన నవలా రచయితను వేఱొకని మనము చూడము.

ఇట్టి బాపిరాజుగారి కళాజీవితము చైత్రరథము. ఆయన నిత్యమంద హాసి. ఆయన న్యాయవాదిగా నుండఁదగిన చదువు బి. యల్ చదివెను. భీమవరములో నొకయేఁడు 'బల్ల' కట్టెను గాని, హృదయ మొప్పు కొనక, బందరు ఆంధ్రజాతీయకళాశాలలో ప్రిన్సిపాలుపదవిలోఁ బ్రవే శించెను. ఇది 1935 మొదలు నాలుగేండ్లు సాగినది. అక్కడనుండి చెన్నపురి జీవనము కొన్నాళ్లు. చలన చిత్రములు కొన్నింట చిత్రకళా దర్శకత్వము నిర్వహించిరి. అనసూయ— ధ్రువవిజయము ఇత్యాదులు— 1942 వ సంవత్సరములో నివన్నియు మాని హైదరాబాదున ప్రచు రిత మగుచున్న 'మీజాను' పత్రికకు సంపాదకత్వము నెఱపుటకై వెళ్లిరి. అది ౪౭ సం॥ వఱకు నిర్వహించిరి. ఇది యిటు లుండఁగా, భంందరు, భీమవరము, హైదరాబాదు, మదరాసు మున్నగు ప్రసిద్ధస్థలము

లలో కళాపీఠములు స్థాపించి కులపతిగానుండి కళారాధనము చేసినారు. బాపిరాజుగారి చిత్రములు మంచికీర్తి సంపాదించుకొన్నవి. ఖడ్గతిక్కన, శబ్దబ్రహ్మ, శ్వేతతార, శశికళ, రుద్రమదేవి, నాగనృత్యం, సముద్రగుప్తుడు, బుద్ధుడు, సూర్యదేవ, భిక్షుకి, గౌరీశంకర్, భిక్షుకి, మీరాబాయి, ఈ చిత్రములు ప్రతిష్ఠ తెచ్చుకొన్నవి.

అమృతహృదయములో నిన్నికళల లోతులు ముట్టిన బాపిరాజుగారు ధన్యులు. ఆయన యక్షరములలో రసికహృదయ తంత్రులను పలికింపఁ జేయఁగలశక్తి యున్నది. ఆయన పాటలు, బొమ్మలు జీవమూర్తులవలెఁ దేలుఁగుచు సంచరింపఁ గలవి. ఆయన నవలలకు ఉత్తమ స్థానము వచ్చినది. మరపురాని బాపిరాజుగారి ప్రేమగీత మిది పాడుకొందము.

మరచిపోవబోకె బాల మరచిపోవకే!
అరచి అరచి పిలువలేను
తరచి తరచి కోరలేను
పరచిపోవు కాంతులోన తీపిలోన, మరచిపోవకే!
పారేరుమనే కెరటాలే
మారుమోగ నా పాటలు
ఒరిగిపడే రేఖలోన నురుగులోన మరచిపోవకే!
ఒక్కణ్ణే యిసుకబస్తు
ఒక్కణ్ణే నీరుదెసలు
ఒదిగిపోవు దూరాలూ
చెదిరిపోవు మేఘాలూ, మరచి పోవకే!
అదుముకొన్న నీతలపులు
చిదిమిరాల్చు నా హృదయము
ఏరలేను రేకలన్ని
ఏరలేను పుప్పొడినీ, మరచిపోవకే!

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## 1891

వెలనాఁటి శాఖీయ బ్రాహ్మణుఁడు. కౌశికసగోత్రుఁడు. తల్లి: మహాలక్ష్మీసోదెమ్మ. తండ్రి: లక్ష్మీపతిసోమయాజులు. జన్మస్థానము: పోలమూరు[రామచంద్రపురము తాలూకా] నివాసము: రాజమహేంద్రవరము. జననము: 23 ఏప్రిలు 1891. ఖరసంవత్సర చైత్రశుద్ధ చతుర్దశీ గురువాసరము. రచనలు: ౧. మహాభక్తవిజయము ౨. వీరాంగనలు ౩. భారత రమణీమణులు ౪. ప్రేమపాశము [నాటకము] ౫. వారకాంత. ౬. మిథునానురాగము ౭. శ్మశానవాటిక ౮. రక్షాబంధనము ౯. అనాథబాలిక. ౧౦. వీరపూజ. ౧౧. రాజరాజు [నాటకము] ౧౨. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు [నేఁటికిముద్రితములగు సంపుటములు] ౧౩. పాణిగృహీత శ్రవణానందశృంఖల ౧౪. ఆయుర్వేద యోగ ముక్తావళి. ౧౫. వైద్యక పరిభాష [ముద్రితములు] ౧౬. కర్ణవధ. ౧౭. ఊరుభంగము. ౧౮. బొబ్బిలియుద్ధము. ౧౯. నిగళబంధనము [పయి నాలుగును నాటకములు] ౨౦. ఆత్మబలి [నవల] ౨౧. శ్రీమద్రామాయణము [వ్యావహారిక వచనములో] ౨౨. ఖండకావ్యములు, ఇత్యాదు లముద్రితములు.

నేఁటి తెనుఁగు కథా రచయితలలో, మునుముందుగా జ్ఞప్తికందు కొందఱిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగా రొకరు. ఒక రనుటకంటే, మొదటివా రనుటయు నతిశయోక్తము కారాదు. కారణము, ఆయన వ్రాసిన ప్రత్యక్షరము సహజప్రతిభనుండి పొటమరించినది; ఆయన చేసిన ప్రతికల్పనము ప్రత్యక్షమున కవిరుద్ధమైనది; ఆయన పాత్రలచేఁ బలికించిన ప్రతిపదము, ఇరుగుపొరుగుల మనము వినుచున్నది; ఆయన ప్రదర్శించిన ప్రతి సంవిధానము మన యనుభూతులకు దవ్వుగానిది; ఆయన కట్టిన కథ లెల్ల తెలుఁగుదేశపు టెల్లలు గడచిపోయినవి. ఈ తీరున సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అచ్చమైన తెనుఁగుఁదనమును వలచి

వచ్చిన రచయిత. ఆంగలముకాని, వంగముకాని, మఱియొక వాఙ్మయముకాని మర్యాదకైనఁ జదివి చూచినవారు కారు. విశేషించి, 'హిందీ' ని, చేరఁదీయరాదని చిరకాలమునుండి వారి వాదము. ఇంక, సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కూడఁబెట్టుకొన్న సంపత్తి సంస్కృత సాహిత్యమొక్కటే. ఇటులు, విజాతీయమైన సంస్కారధోరణికి దూరముగా నిలచి, కృతకత్వకల్పితములుకాని యాంధ్రత్వము నారాధించిన రచయిత రచన లెట్లుండును? అనుకరణములుకాని, అనువాదములుకాని చేయవలసిన ప్రారబ్ధము సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి లేదు. యథార్థముగా ఆయన చూపులకుఁ గనిపించిన వస్తువు, ఆయన చెవులకు వినిపించిన మాటలు మూటఁగట్టుకొని కథలలోఁబెట్టి కళ కట్టించును. ఉత్తమజాతి రచయిత చేసెడి పనియు, చేయఁగలిగిన పనియు నింతే! దీని వివరణము ముందు మనవిచేసెదను.

శ్రీపాదవారిది యనూచానమైన పండితవంశము. శ్రౌత స్మార్తములు, జ్యోతిషము వీరి వంశ విద్యలు. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి తండ్రిగారు యాజ్వ. ఆయన కన్న ముగ్గురు కుమారులలోను మన శాస్త్రిగారు మూఁడవవారు. వంశస్థులందఱివలెనే వీరుకూడ శ్రౌత-స్మార్తములు, పౌరోహిత్యము అధ్యయనము చేసినారు. జ్యోతిషము స్కంధత్రయము పఠించినారు. అదికాక, పల్లూరిలో గుంటూరి సీతారామశాస్త్రిగారు, వేట్లపాలెములో దర్భా బైరాగిశాస్త్రిగారు, తమయింట, అన్నగారు శివరామ సిద్ధాంతి దీక్షితులుగారు గురువులుగాఁ గావ్యపాఠము చేసిరి. పసినాఁటనే తెనుఁగులపై నభిరుచి యంకురించిన దగుటచే శాస్త్రిగారు గురువుల చాటున నాంధ్రకృతులు చదువుటయు, ఏవో చిన్న చిన్న రచనలు చేయుటయు సాగించినారు. సరియైన యుపదేశ మున్నఁగాని కవితారచన చేయరాదని ౧౯౧౦ సం॥లో సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నిశ్చయము కలిగినది. ఈ సునిశ్చయమే, పీఠికాపుర సంస్థాన కవులగు

వేంకట రామకృష్ణులను శాస్త్రిగారికి కవితా గురువులుగాఁ జేసినది. ౧౯౧౦ - ౧౧సం॥లో రామకృష్ణకవుల సాహచర్యమున నెన్నో సాహిత్యపు మెలఁకువలు, కవిత్వపుఁ బోలపములు శాస్త్రిగారు గుర్తింపఁగలిగినారు. ఇరువదియేండ్ల యీడు వచ్చుసరికి శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు సానఁబెట్టిన రత్నము.

ప్రధానముగా, వీరి జీవితములో మెచ్చఁదగిన విషయము, వీ రే యధికారిని దోసిలియొగ్గి "నెలకూలి చాకిరీ"కొడఁబడకుండుట - వీరివలె నాత్మగౌరవము నధికముగా నిలఁబెట్టుకొనువారు తక్కువ. అట్లని, పరనిరపేక్షముగా జీవింపఁగల విత్తవంతుఁడును కాఁడు. ఆయనలోని తలఁపులు పయిమాటలు నొకటైనూటిగా నుండును. దాఁపఱికము లేదు. చెప్పినదానికిఁ దిరుగు డ దు. ఎదుటివాఁడు సహృదయుఁడయినచో హృదయము ముద్దగట్టి ముందుఁబెట్టును. కానిచో, పిలిచినను, పెడ మొగము పెట్టును. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యథార్థవాదిత బంధు విరోధమునకుఁ గారణము కారానిది. ఇది యిటులుండఁగా, వారి తొలిరచన 'వారకాంత' యను నాటకము. కవిత్వము నాటకాంతము కావలయునన్న పెద్దలమాట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ముందునకుఁ దెచ్చినారు. ఈసందర్భమున వారొకప్పుడు చెప్పిన 'రేడియో' ప్రసంగము స్మరణకు వచ్చుచున్నది.

"పాఠకునకూ, ద్రష్టకూ రసానుభవం కలిగించి తన సందేశం స్ఫుటంగా వినిపించాలంటే, రచయితకు, తక్కిన కావ్యాలకంటే నాటకం చాలా మంచిసాధనం. కాని నాటకరచన చాలా కష్టమైనది. కావ్యసామాన్యం రచించే టప్పటికంటే నాటకం రచించేటప్పుడు రచయిత గొప్పబాధ్యత వహించ వలసివుంటుంది. తనజాతివారికి సభ్యత అలవడ జేయడమూ— అదితప్పిపోకుండా చూడడమూ—ఇదే ఆ బాధ్యత. కవికి ఇంతశక్తీ బాధ్యతా ఉందని తెలుసుకొన్నప్పుడు, శక్తి ఉందా

లేదా అని చూసుకోకుండానే నేను నాటకరచనకి పూనుకున్నాను. నేను మొట్టమొదట రాసిన నాటకం—అంటే, నాకు నేనై రాసిననాటకం— "వారకాంత". కాని దానికర్తృత్వం నేను మరచిపోతున్నాను. నా నాటకాలలో నేను చెప్పుకోగలవి "ప్రేమపాశం", "నిగళబంధనం", "రాజరాజు"— ఇవి. వీటిలో ఒకటీ రంగస్థలం ఎక్కలేదు. చదివినవారు మాత్రం అనుకూలంగానూ ప్రతికూలంగాను కూడా మాట్లాడారు. కొన్ని ఏకాంకికలున్నూ రాశాను. వాటిలో నాకు మిక్కిలీ ప్రీతిపాత్రం "కలంపోటు".——"

ఈ 'వారకాంత' నాటకములోఁ బద్యములుకూడఁ జేర్చినారు. ఇది ప్రత్యేకించి చెప్పుటలో, సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ౧౯౩౮ నుండి ఖాత్రిగా పద్యరచన ప్రాతికూల్యము వహించుట కారణము. ఈ ప్రతికూల భావము వారికి పద్యము హృద్యముగా వ్రాయలేక పోవుట వలనఁ గలిగినది కాదని యీక్రింది పద్యము సాక్ష్యము చూపుచున్నాను.

బ్రతుకు ఘటించు నోషధి కరాళవిషంబున, నుక్కుటీవలం
దతి మృదునాదమున్, దహనునందు ప్రకాశము, నుప్పునీటిలో
రతనము లాణిముత్తెములు రాళ్ళను, కప్పకు జీవనంబులున్
చతురతఁ గూర్చువెయ్యది యసాధ్యమునీకిఁక దీనబాంధవా!

"అత్త - అల్లుడు" - "అలంకృతి" - "అభిసారిక" - "బాలిక, తాత", మొదలగు ఖండకావ్యములు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మనోహరముగా రచించినవి యున్నవి.

శ్రీ శాస్త్రిగారి మొదటినవల 'మిథునానురాగము' అన్నీ మొదట ౧౯౧౯ సెప్టెంబరులో వెలువడినది. "ఇరువుర యొక్కచోటికే పోదము" అని దాని పేరు. "ఇదియాది, ౧౯౨౩ సం॥ దాఁక గ్రాంథికములోనే శాస్త్రిగారు రచనలు సాగించుచు వచ్చిరి. క్రమముగా రెండుమూడేండ్లకు సంపూర్ణముగా వ్యావహారిక భాషావతరణము. విశేషమేమనఁగా

వీరు గ్రాంథికము వ్యావహారికము కూడ సహజమధురమైన శైలిలో వ్రాయఁగలవారు. శాస్త్రిగారు మున్మొదట వెలువరించిన చరిత్ర గ్రంథము వీరపూజ. ఆగ్రంథ మందలి గ్రాంథికశైలీ సౌభాగ్యము చాల విలువగలది. శ్మశాన వాటిక, రక్షాబంధనము ఇత్యాదులగు వీరి నవలలు ప్రజానీకములో సువ్యాప్తములై యున్నవి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వచనరచనలోఁ జలువ చందనము వంటి దేదో యుండి హృదయమునకు రాసికొనుచుండును. సమాసముల గడబిడలు, అన్వయముల తిరుగుడులు మచ్చునకును రానిచ్చు స్వభావ మాయన కలమునకు లేదు. ఎంతసేపును, శాస్త్రిగారి చూపు సహజత్వముమీఁద. ఇది యటుండె,

౧౯—౨౧ సం॥ నుండి శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారి స్వసిద్ధాంతములకు బీఠమై 'ప్రబుద్ధాంధ్ర' వెలసినది. శాస్త్రిగారి సంపాదకత్వమున నీపత్రిక తొలియేఁడు ప్రతిపక్షమునకు వెలుపడుచు, రెండవ యేఁటినుండి మాస పత్రికగా మారినది. ఆదిలో, ప్రబుద్ధాంధ్ర సగము సంస్కృతభాషా రచనలతోను, సగము తెలుఁగు రచనలతోను, వెలువడుట శాస్త్రిగారి యుభయభాషా వైదుష్యాభిమానములకు నిదర్శనము. అల్పకాలము ననే 'ప్రబుద్ధాంధ్ర' తెలుఁగునేల మూలమూలలకుఁ బ్రాకి పాఠకులను వలపై చిలాగినది. ఈ ఆకర్షణమునకు మహోత్తమరచయితల వ్యాసములే కాక, శాస్త్రిగారి వ్యాఖ్యలు, విమర్శనములు హేతువులైనవి. వీరి కలమునకు జంకుగొంకులు లేవని తొలుతనను కొంటిమి. గతానుగతికధర్మావలంబన మాయన బొత్తిగా సహింపలేరు. దానినిబట్టి హృదయములో నుండియో ఉండకో నూటికిఁ దొంబదిమందిచేఁ ద్రొక్కఁబడుచున్న సిద్ధాంతమును అమాంతముగా శాస్త్రిగారు గర్హింతురు. పట్టి గర్హణముతో సరిపెట్టక వాడికల వ్రాఁతలోఁ బెట్టి సుప్రచారము చేయుదురు. ఆయనలోనున్న యీగుణమునకు వారి 'ప్రబుద్ధాంధ్ర'

నిలువుటద్దమైనది. "హిందీ — గాంధీ — ఖద్దరు" ఈమూడును శాస్త్రిగారి సిద్ధాంతములకు విరుద్ధమైన పదార్థములు. బౌద్ధుల త్రిరత్నములవలె, భారతీయుల పారాయణములోనున్న యీమూడు శబ్దములను విసర్జించుచున్న శాస్త్రిగారి గుండెనిబ్బరమునకు, అబ్బురమైన పట్టుదలకు మనము మెచ్చవలయును. 'ప్రబుద్ధాంధ్ర' తొమ్మిదియేండ్లు నడచి మంచిప్రసిద్ధిలో నాగిపోయినది. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి జీవన వైభవమునకు 'ప్రబుద్ధాంధ్ర' సాగిన దశాబ్దము మెఱుఁగు కాలము. ౧౯౩౪ సం॥ నుండి ఆపత్రికలో పద్యప్రకటనము నిషేధించి, వచన రచనలే ప్రచురించినారు. కావున వచనవాఙ్మయమునకాపత్రిక చేసిన సేవ మఱువరానిది. శాస్త్రిగారి సర్వగ్రంథరచనము నూఱయెత్తు, ఈ పత్రికా ప్రచురణ మొకయెత్తుగా సాగినది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ౧౯౧౬ మొదలు నాలుగేండ్లు కళాభివర్ధనీ నాటకసమాజము నడపికొనియుండుటఁ జేయుకొనుట వారికళాభిరతికి గుఱుతు. నాటకములలో స్త్రీ-పురుష వేష ధారణము చేసినవారనియు వినుకలి. సంగీత కళపై వీరికెక్కువ మక్కువ. సుమారు నూఱుకృతులు గురుముఖమునఁ జెప్పుకొనిరఁట. కాని, గొంతెత్తి పాడఁగా నేను వినలేదు. ౧౯౪౭ నుండి సంగీత సాహిత్య సభలు జరిపించుచు వీరు రాజమహేంద్రవరమున నూత్నకళా గౌరవము చాటుచుండుట ప్రశంసింపఁదగిన సంగతి. నన్నయ — శ్రీనాథ జయంతులు జేగీయమానముగా నడపించుచున్న శాస్త్రిగారి ప్రాచీన సారస్వతాదరణము నమస్కారణీయమైనది.

ఇంక, ప్రకృతము, వారు చిన్నకథలు వ్రాయుదురు. కాని, అవి గుణమున, పరిమాణమునఁ గూడ పెద్దకథలు. సంభాషణములసంతనలో నింత పరిపక్వత గల కథారచయితలు తక్కువ. పాత్రల మాటలలో వ్యక్తులతీరులు, భంగిమములు సుస్పష్టముగా మనకు గోచరింపఁ

జేయుదురు సాంసారికమైన ముచ్చటలు, సాంఘికమైన యాచారములు ప్రదర్శించుటలో శాస్త్రిగారిది యందివేసినచేయి. వైదికకుటుంబముల లోని నడతలు వీరికథా ప్రపంచమున నచ్చుగ్రుద్దినట్లు కానుపించును. 'వడ్లగింజలు – మార్గదర్శి – కన్యా కాలే యత్నాద్వరితా' – ఇత్యాదులయిన వీరికథలు రసవాహినులు. ప్రేమపాశం, నిగళబంధనం, రాజరాజు, కలంపోటు మొదలయిన సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నాటికలకుఁ 'తెలుఁగునాఁట' సుప్రసిద్ధి వచ్చినది. నాయుద్దేశములో 'రాజరాజు' వీరి నాటకముల కన్నిటికిని కన్నాకు వంటి దని – అందులో నన్నయపాత్ర పోషణము అనన్య సాధారణమైన తీరులో శాస్త్రిగారు తీర్చినారు. రాజరాజుకడ, ఆత్మగౌరవము వీసమంతయినను చెడిపోకుండ నన్నయచేఁ బలికించినపాటవము సుబ్రహ్మణ్య శాస్త్రి గారికే చెల్లినది. ఇది యన్నమాట కాదు, ప్రతిపాత్రయును రాజరాజులో జీవన్మూర్తులై కనిపించును. ఇట్టి 'రాజరాజును' సాహిత్య సామ్రాట్టు విక్రమదేవవర్మ మహారాజు కృతిపొందుట యభినందనీయము. 'కలంపోటు' మొదలగు నాటికలు వీరివి యెన్ని సారులు చదివినను జదువవలయు ననిపించును.

నాటికారచనలో, కథారచనలో, పత్రికా సంపాదకతలో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారిది తెలుఁగు భూమిలో నొక ప్రత్యేకపీఠము. నాలుగుదశాబ్దులనుండి బహుగ్రంథ రచనలచే భారతీ సమారాధనము చేయు శాస్త్రిగారి వయస్సు నేఁటికి షష్టిలో నున్నను, భౌతిక పుష్టియు, భావపుష్టియు గలిగియుండిన ధన్యులు. వారికృతు లెన్నో మునుముందు మనము పఠింపఁగలము.

# సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

## 1897

వైదికబ్రాహ్మణులు. తల్లి: బుచ్చినరసమ్మ. తండ్రి: సుబ్బయ్య. నివాసము: సికింద్రాబాదు. జననము: 10 2. 1897సం. గ్రంథములు: ౧. తత్సమ చంద్రిక ౨. కావ్యాలంకార సంగ్రహము (వ్యాఖ్యాన సహితము) ౩. జాతక కథాగుచ్ఛము (౨, భాగములు) ౪. కీరసందేశము – ద్వంద్వయుద్ధము. ౫. గోవర్ధనాచార్య సప్తశతి సారము ౬. పుష్పాలతోట (ఖండకావ్యసంపుటి) ౭. కావ్యమంజరి ౮. నడుమంత్రపు సిరి (అధిక్షేప కావ్యము) ౯. సూక్తికర్ణ ౧౦. అభ్యాసగణములు ౧౧. వాసవదత్త ౧౨. రేణుకా విజయము ౧౩. వివేకానందము (కావ్యములు) ఇత్యాదులు.

జాతక కథాగుచ్ఛాది పద్యరచనల వలనను, తత్సమ చంద్రికాది లక్షణ గ్రంథరచనలవలనను సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారిపేరు తెలుగువారు లెస్సగా విన్నదియై యున్నది. ఆయన మంచి పండితులు. గొప్పకవులు. వ్యాకరణమున, అలంకార శాస్త్రమున, వీరు ప్రధానముగా కృషిచేసిరి. వారి వ్యాకరణ కృషికి తత్సమచంద్రికయు, అలంకార శాస్త్రకృషికి కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యయు నిదర్శనములుగా నిలుచు గ్రంథములు. వేదాంతమున, ప్రస్థానత్రయపాఠము చేసిరి. ఇట్టి వ్యుత్పత్తి గౌరవముతో, శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి గురుత్వముతో సూర్యనారాయణ శాస్త్రిగారు సహజమైన కవిత్వమును వృద్ధిపఱచుకొని, నానాకృతులు రచించిరి, రచించుచున్నారు.

శ్రీశాస్త్రిగారి పట్టుదల మిగులమెచ్చదగినది. ఆయనకావ్యాలంకార సంగ్రహవ్యాఖ్య ౨౦౦ పుటలు పరిమితిగల గ్రంథము. ఆలంకారికుల సర్వసిద్ధాంతములు పరిశీలన చేసి వా రావ్యాఖ్య సంఘటించిరి. కావ్య

స్వరూపము — రససిద్ధాంతము మున్నగు కొన్ని స్థలములలో మన ప్రాచీనాలంకారికులు భిన్న విభిన్నములుగాఁ బ్రదర్శించిన మతములు వీరు గుఱుతించి వాని నెల్ల నీవ్యాఖ్యలో బయలుపఱుచుట వీరి పరిశ్రమకుఁ దార్కాణమైన విషయము.

వారి "తత్సమచంద్రిక" యు నమోఘ కృషి ఫలితము. సిద్ధాంత కౌముది, మఱి యితర పాణినీయవ్యాఖ్యాగ్రంథములు శాస్త్రిగారు బాగుగాఁ బరిశీలనము చేసినా రని యీ కృతి తెలుపుచున్నది. పయి రెండులక్షణగ్రంథములు వీరికి లాక్షణికులలో మంచిస్థానము నిచ్చుటకుఁ జాలియున్నవి.

ఇదియిటులుండగా, సప్తశతీసారము, జాతక కథాగుచ్ఛము, వివేకానందము, వాసవదత్త మొదలయిన వీరిపద్యరచనలు పాఠ్యములై ప్రసిద్ధిఁగొన్నవి. తెలుఁగు పలుకుబడి వీరిది సుఖముగానుండును. వ్యాకరణవిశేష విశిష్టములయిన ప్రయోగములు వీరి కవితలోఁ దఱచు. అన్వయములో నెడనెడఁ దిక్కనగారి తీరులు. యతిప్రాసములకుఁదడవు కొన్నటు లుండదు. కాని, శాస్త్రిగారు యతిప్రాసబంధములు పద్యకవితకుఁ దగిలింపరాదని యొకప్పుడు వాదము నెఱపినవారు.

కావించె నేపతి తన వజ్రకాయంబు

ఆహా! వివరించి వ్రాయుటకుఁ బట్టదు కావ్యమొకండు

ఇత్యాదులుగాఁ గొన్నిపద్యములలో యతులు తప్పించి చూపిరి. ఈ పద్ధతి సార్వత్రికము చేయుట నచ్చకయే, వారు మరలఁ గృతుల నన్నింట సలక్షణత పాటించుచునే వచ్చుచున్నారు. అచ్చ టచ్చటివి సూర్యనారాయణ శాస్త్రిగారి కావ్యములనుండి మచ్చు తునుకలు.

క. మీసాల తేనె నాఁదగు

నీ సంసృతి సుఖముకొఱకు గృహమేధము గో

చీ సంరక్షింపఁగ స
న్న్యాసి వటాటోప మట్టు లక్షింత్రు జనుల్.

*

క. విడిది నికుంజాంతరములఁ
బడక శిలాతలములందుఁ; బ్రాశము బిసముల్
మడుఁగులు నారలు కోఁగా
గడఁగిరి తపమునకు నియతగతి నా భ్రాతల్.

*

శా. సాయాహ్నంబులఁ దమ్ములందఱ నశోకవృక్షచ్ఛాయఁ గూర్చుండఁగా
శ్రేయఃప్రేయములం గుఱించి యతి గంభీరం బుపన్యాసముం
జేయుం; దెల్పును దారతమ్యమును దక్షోత్తముండు; వారెల్లరుం
బీయూషంబును గ్రోలు చందమునఁ దృప్తింబొంది హర్షింపఁగన్.

ఇవి జాతక కథా గుచ్ఛమునందలివి. 'వివేకానందము' నుండి మఱి మూఁడు :—

మ. అడుగంటెన్ మన భారతీయమగు విద్యల్; పుచ్చిపోయెన్ గడున్
గడు ధర్మంబులు; వేషభాషణములుం బాశ్చాత్యలోకంపుఁ బో
కడలన్ మైలపడెన్; సమస్తజనలక్ష్యం బర్థకామంబులై
పెడదారింబడెఁ; బూతిగంధియగు నీ విశ్వం బిసీ! కన్పడున్.

*

తినఁగా మూల్గుచు నెంగిలాకులవయిన్ దీర్పంగఁ బెద్దస్పిరిం
జనుచున్ సీ! గవులూఱు గుంటలకు, వృక్షచ్ఛాయలంబండు చుం
డను వానన్, మొయిఁ జింకిపాఁతలను మూపంబెట్లా! రక్షించు కొం
చును జీవించెడి పేదలం గనఁగఁ జెందుగా దుఃఖ మీడెందముల్.

*

చాలుఁగా మూలము లేని సాంఘిక దురాచారంబులే యయ్యెఁ బో
మేలుంబంతులు జాతికీ భరతభూమిం ; దత్పురోవృద్ధికిన్
ఆలోచింపఁగ వేరుఁబుర్వులు మతాధ్యక్షుల్ ; పురోధోగణం
బేలా, పెక్కులు ! దయ్యముల్ కరణి నెంతేఁ బట్టిపల్లార్చెడిన్.

*

ఏవంవిధముగా మధురమైనదియు మృదువైనదియు సాధువైనదియు నగు కవితారచనతో శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు పెక్కు కబ్బములు సంతరించుచున్నారు. నిజాంరాష్ట్రమున, ఆంధ్ర సారస్వత పరిషత్తువారి మహాదరణ గౌరవములకు వీరు పాత్రులయినారు. యావదాంధ్రమున వీరి రచనలు ప్రాకుచున్నవి. మహబూబు కాలేజిలో తెలుఁగు పండితులై మూఁడు దశాబ్దులనుండి శిష్యుల నెందఱనో తీర్చి దిద్దుచున్నారు. వీరు సాహిత్య శిరోమణి, విద్వాన్, పి, ఒ, యల్ మున్నగు పట్టములు పడసినారు. సకల సౌభాగ్య సంపన్నులై, పండిత కవులై విరాజిల్లుచున్న సన్నిధానము శాస్త్రిగారి సారస్వత జీవితము చక్కనిది.

# వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి

## 1896

వెలనాఁటిశాఖీయబ్రాహ్మణులు. తల్లి: మణికర్ణికాసోమిదేవి. తండ్రి: వేంకట చయనులు. జన్మస్థానము: ఇందుపల్లి. పెంచుకొన్న తలిదండ్రులు కామమ్మ, రామయ్య. దత్తత, కొమానపల్లి. జననము: దుర్ముఖినామ సంవత్సర–అధిక జ్యేష్ఠశుద్ధషష్ఠి–ఇందువాసరము. 1896 సం. రచనలు:– ౧. వేంకటేశ్వరశతకము ౨. మునిత్రయచరిత్రము ౩. శంకరవిజయము. ౪. శబర శంకర విలాసము – ఇత్యాదులు.

ప్రతిభా వ్యుత్పత్తులు సరితూఁకములో నున్న కవులెందఱో యుండరు. ఆవిధముగా నున్న నేఁటి కవులు కొందఱిలో వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగా రొకరు. వీరు 'శంకరవిజయ' ప్రబంధకర్తలుగా నేఁడు మంచివిఖ్యాతి నందుచున్నారు. వీరి 'మునిత్రయచరిత్ర' ప్రౌఢార్థప్రచురమైన రుచిరకావ్యము. ఈ రెండు కృతులును శాస్త్రిగారికి మహాకవితా పట్టముఁ గట్టించుటకుఁ జాలియున్నవి.

శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు శిష్టవంశీయులు. వారితండ్రి వేంకటచయనులుగారు ఆహితాగ్నులు. చయనాంత క్రత్వనుష్ఠాతలును. తల్లిమణికర్ణికాసోమిదేవి. ఈ పుణ్యదంపతుల కడుపు మనశాస్త్రిగారు. వీరు చిననాఁట శ్రీ మరువాడ కాశీపతిశాస్త్రిగారితోఁ గాళిదాసత్రయము పఠించిరి. పదపడి, చావలి లక్ష్మీనరసింహశాస్త్రిగారి సన్నిధిని సాహిత్య గ్రంథములు, లఘుకౌముదియు నధ్యయనము చేసిరి. అప్పుడే యాంధ్రకవితాభిరతియు సంకురించినది. లక్ష్మీనరసింహ శాస్త్రిగారి యాచార్యకమునెడల మన శాస్త్రిగారి కృతజ్ఞత చక్కనిది.

మ. కలమున్ జేతను బూని పద్యమని యేకాసంతయున్ వ్రాయఁగాఁ
దలఁపుం జెందినముందు మ్రొక్కవలెఁ గాదా, సంస్కృతాంధ్రమ్ములన్

గల మర్మంబులు నాకుఁదెల్పి కవితా నైపుణ్యముంగూర్చు చా
వలి లక్ష్మీ నరసింహశాస్త్రి గురుదేవ స్వామికిన్ భక్తిమై.

౧౯౨౭ ప్రాంతమున పిఠాపురమున నుండి, శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి గారి కడ వీరు వ్యాకరణ శాస్త్రాధ్యయనము గావించినారు. ఈక్రింది పద్యము చూడుఁడు:

శా. తర్కవ్యాకృతి పారదృశ్వ నిఖిలాంధ్ర జ్యోతిషాంగ్లోక్తి సం
పర్కున్ సూర్యబుధేంద్ర శిష్యమణి దర్భావంశ్య సర్వేశ వి
ద్యార్కున్ వ్యాకరణోపదేశికు ద్వితీయానంతు నెంతున్ శుభో
దర్కత్వంబు కృతజ్ఞతం బడసి మత్కావ్యంబు రంజిల్లగన్.

"మునిత్రయచరిత్ర"

మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారికి వీరు 'మునిత్రయచరిత్ర' నంకితమొసంగిరి. ప్రత్యేకముగా "రాయుడు శాస్త్రి యశశ్చంద్రిక" కావ్యము రచించి మహామహోపాధ్యాయుల షష్టిపూర్తి సన్మానసందర్భమున సర్పించిరి. ఇవన్నియు నేల పేర్కొనుచుంటి ననగా, శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి హృదయములో పండితగురువులపట్ల నిట్టి భక్తి ప్రపత్తు లున్నవనుటకు.

సంస్కృతాంధ్ర వైదుషీ భూషితులైన వీరు ౧౯౩౦ సం॥ లో అమలాపురము బోర్డుహైస్కూలున తెలుఁగు పండితులుగాఁ బ్రవేశించి రెండేండ్లు అచ్చటనుండిరి. తరువాత కాకినాడ నేషనల్ స్కూలులో మఱిరెండేండ్లు పండితోద్యోగము. పిదప, పాణంగిపల్లి జమీందారు శ్రీ సబ్నవీసు కృష్ణారావు పంతులు (బి. ఏ) గారికి సంస్కృతాంధ్రోపాధ్యాయత్వము. అప్పుడే ప్రొద్దుటూరి 'కవి' వ్యాసపు పోటీపరీక్షలో ద్వితీయ బహుమానము. ఈ పురస్కారము కారణముగా జమీందారు "కవిసింహకంకణము" చే సూర్యనారాయణ శాస్త్రిగారిని బహూకరించెను. "జీమూతవాహనచరిత్ర" మను ఖండకావ్యము పాణంగిపల్లి

ప్రభావమునకు శాస్త్రిగారంకిత మిచ్చినారనుట ప్రకృతము తలంచుకోవలసిన విషయము. ఇది యిటులుండగా, శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున పండితులుగా నుండి వీరు కావించిన వాఙ్మయసేవ మఱచిపోరానిది. ౧౯౨౫ సం॥ నుండి ౧౯౩౨ వఱకు వీరా కార్యాలయోద్యోగము నిర్వహించిరి. ఈ యుద్యోగమువలన శాస్త్రిగారి మేధాసంపద మఱింత మెఱుగులు దేఱినది. ఆంధ్రప్రబంధములలోని రహస్యములు పెంపరాలవారికిం దెలిసినన్ని వేఱొకరికిం దెలియవేమో యనిపించును. ఆయన కున్న ప్రయోగపరిజ్ఞానము నిస్సమానమైనది. ఆయనకు వేలకొలంది పద్యములు నోటికి వచ్చును. ఒక ప్రయోగమునకుం బది యుదాహరణపద్యములు వెంట వెంటనే చదివి చూపంగలరన్నది యతిశయముగా నన్నమాట కాదు. ఇట్టి ధారణాపాటవముగల వీరు సూర్యరాయ నిఘంటు కార్యాలయమునకుం జేసిన యుపకృతి కృతజ్ఞతకుం బాత్రమైనది.

మఱి, శాస్త్రులుగారి కవితారచనలోని విశిష్టత యేమనంగా, వారు ప్రయోగవైచిత్ర్యమును వలచిన రచయిత లగుటచే నడుగడుగున నూతన ప్రయోగములు కనంబఱచెదరు. ఇంచుమించుగా వారి కావ్యములోని పెక్కుఘట్టములు భట్టి కావ్యమును స్ఫురణకుం దెచ్చుచుండును. పాణినీయము నామాలచూడము చుళుకించినవారు కావున వారి కవిత యిటు లుండుటలో నబ్బురమేమి? ప్రయోగదృష్టి యెంత యున్నదో శాస్త్రులు గారికి రసదృష్టియు నంతేయున్నది. ఆ హేతువున వారి కృతులు పండిత హృదయరంజకములై యున్నవి. మునిత్రయ చరిత్రము నందలి కొన్ని యుదాహరణములు:

సీ. వియ్యపురాలటుల్ తినెడు వేళకు వచ్చు టెకాని యింత సా
హాయ్యము సేయఁ బోదు దికటా పసిపాప విలాపమొందఁగా

సయ్యోల నూఁవరాదో జలమెుక్క పనంటెఁడు తేరరాదో తే
దెయ్యెడ నిట్టిదంచు గణియించు గరాసయి తోడి కోడలిన్.

*

సీ. చెదపుర్వు గమి గ్రసించిన కప్పునుండి యా
పాసనానల ధూమపటలి వెడల
ముంజూరిలకు వంగిపోవుట లోనికి
వచ్చి యేఁగెడు వారు వంగిమసల
గోడలమూఁబు నాల్గుదెసల నిల్పిన
కంపపెందడుకలు గాలిఁ గదల
నుసిరాలి లోపలి వస మాసి నిట్టరా
డొకప్రక్క కొక్కింత యొదిగియుండ
గోమయ విలేపనంబు ముగ్గులునుమాత్ర
మమర దారిద్ర్యదేవీ విహారసౌధ
మనఁదగిన వర్షగురు ప్రాఁతయాకుటిల్లు
లోచనంబుల కెదురుగా గోచరింప,

*

ఈలీలనైన సాధుప్రౌఢశయ్యలో శాస్త్రులుగారు "శంకరవిజయము" మహాప్రబంధముగా సంతరించిరి. ఆకృతి శాశ్వతముగానుండుటకుఁ జాలి యున్నది. మహాకవితా పట్టము శంకర విజయమువలన శాస్త్రులుగారికి లభించుచున్న దనుటలో విప్రతిపన్ను లుండరు. వారు రచించుచున్న 'విద్యారణ్య చరిత్ర' తెలుఁగు కవితాశాఖకు కైసేఁత కాఁగలయది. ఆస్తిక బుద్ధి సంపన్నులు, వ్యుత్పన్నులునైన సూర్యనారాయణశాస్త్రి గారు తీసికొన్న యితివృత్తములన్నియు సుపవిత్రములైయుండుట సుప్రశంసార్హమైన విషయము.

# భమిడిపాటి కామేశ్వరరావు

# 1897

వెలనాటి శాఖీయబ్రాహ్మణుడు. తల్లి: లచ్చమ్మ. తండ్రి: సరసావధానులు. జన్మస్థానము: అకివీడు. నివాసము: రాజమహేంద్రవరము. జననము: 30 ఏప్రిలు 1897. రచనలు: ౧. కాలక్షేపం ౨. ఇప్పుడు. ౩. అప్పు ౪. నిజం ౫. అప్పుడు ౬. మాటవరస ౭. గుసగుసపెళ్లి. ౮. పెళ్లిట్రయినింగు. ౯. రెండురెళ్లు. ౧౦. అన్నీతగాదాలే. ౧౧. మేజువాణి. ౧౨. మనతెలుఁగు. ౧౩. కాలక్షేపం. [2 భాగాలు] ౧౪. లోకోభిన్నరుచిః. ౧౫. తనలో. ౧౬. మాయలమాలోకం. ౧౭. చెప్పకేం. ౧౮. మృచ్ఛకటిక. ౧౯. ముద్రారాక్షసం. ౨౦. ప్రణయరంగం. ౨౧. త్యాగరాజు ఆత్మవిచారం– ఇత్యాదులు.

ఈనాటి హాస్యరచయితలలో శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు గారి స్థానము ప్రత్యేకము విశిష్టము నైనది. బాగుబాగు—ఎప్పుడూ ఇంతే—కచటతపలు—తప్పనిసరి—వద్దంటే పెళ్లి—ఘటన—ఈ మొదలయిన ప్రదర్శనాల సంవిధానముతో వేఱుచేయలేని కామేశ్వరరావుగారి పేరు యువప్రపంచమున నిత్యవిహారము కలది. ముఖ్యముగా, కళాశాలలలో వీరి నాటికలు ప్రాయికముగా ప్రదర్శితము లగుచుండుట గమనింపఁదగినది. విద్యార్థుల హృదయములు కృతకసంసార దూషితములు కానివి; పరమస్వచ్ఛము లైన వారి యాత్మ లానందమయములు. కనుకనే తత్త్వావధారణమునకు దారిచూపు హాస్యరసముపైనే వారికిఁ జూపు. సంసారబంధితుఁడు తెఱచుగా నవ్వలేని కుటిలుఁడు. సత్యమును సత్యముగా గుఱుతింపలేకపోవుట హాస్యమునకుఁ గారణమగుచున్నది. ఈగుఱుతుగల సంసారులు అరుదుగానుందురు. అనఁగా, తత్త్వనిర్ధారణమునకు చర్చాగ్రంథమైన హాస్యరసము నాస్వాదించుటకు సంయతాత్ముఁడే అధికారి యగుచున్నాఁడు. బ్రతుకును పొడిగించుకొనఁ దలఁచినవారికి నృత్య—హాస్యముల యక్కఱ మిక్కిలి కావలసియుండును. కాఁబట్టి హాస్యము

నకుం దపస్సుతో సాదృశ్యము చెప్పవచ్చును. ఈ యభిప్రాయ మాలం కారికులు సూచించినదియును.

ప్రకృతము ; భమిడిపాటి కామేశ్వరరావుగారి ప్రతిరచనయు హాస్య రసప్రచురము. ఆయన రచన చేతిలోనున్న పాఠకుఁడు, ఏయవస్థలో నున్న వాఁడైన నవ్వును ; చిఱునవ్వును ; అంతలో, పెద్దపెట్టున నవ్వును ; మరల మందహాసమున కవతరించును ; అంతలో, అట్టహాసమున కధిరోహిం చును. ఇట్లు చేయింపఁగల సుగుణము, ఆయన వ్రాఁతలలోను, మాటల లోను, సరితూకముగానే యున్నది. కామేశ్వరరావుగారి కూర్పులలో భావముతోపాటు, భాషయును హాస్యరసోత్పాదకమగుట విశేషము. ప్రహసనకర్తలలోఁ బేరుమోసిన వీరేశలింగముపంతులు, చిలకమర్తి కవియు దీనిని సకృత్తుగాఁ బాటించినారు. "కన్యాశుల్క" కారునిలో స్విష్టకృత్తుగా నీలక్షణ మున్నది. 'భమిడిపాటి' వారికి 'గురుజాడ' వారి దారి యెరవడి కావచ్చును. కామేశ్వరరావుగారి రచన వినీవినఁగనే భాష, మొదల నవ్వించును ; భావము పిదప కవ్వించును. వీరి భాషలో ఆపాత రమణీయహాస్యము భావములో విచారిత రమణీయహాస్యము నుండెనని నే ననుకొందును.

"...నాగరికత అబ్బి, జెంటిల్ మెన్ అనగా పెద్దమనిషి అవడానికి సర్వ విధములా పెరుగుతూన్న నన్ను ఈన ఇంతడౌన్ రైటుగా ఇన్సల్ట్ చేయుట చూచి ఎటుల ఊరుకొనుట? దేర్ ఫోర్ తమషా బికేమ్ కసి. చదువుకోనివాడు ఏదేనా చేస్తే తప్పూ. అదే చదువుకున్నవాడు చేస్తే పామరులకి తప్పులా కనిపించినా దానిగర్భంలో గొప్పప్రిన్సిపల్ ఉందని సమర్థించి, తప్పుకాదని స్థాపించి, అది ఒకవేళ నలుగురికీ భర్జించకపోతే కాంట్ హెల్ప్ అనగా సహా యముచేయలేము అని చెప్పిపారేసినెగ్గొచ్చు...." "బాగుబాగు" నుండి

ఊరకే మచ్చుకొఱకై యీపంక్తులు పేరుకొంటిని. స్థూలరూపముగా నుండిన యిక్కడిభాషలోను సూక్ష్మరూపముగానుండిన భావములోను మనస్సులను గదలించి నవ్వింపఁగల తీరు స్పష్టముగాఁ దోఁచుచున్నది.

ఇట్లే కామేశ్వరరావుగారి ప్రదర్శనములు, ఉపన్యాసములు, కథలు బహిరంతర్హాస్యరసవాహినులు. ఆయన రచనల పేళ్లు, వానిలోని వ్యక్తులపేళ్లు కూడ వింత పుట్టించునవి. కచటతపలు—వద్దంటేపెళ్లి—ధూమాలమ్మ ఓఘాయిత్యం—శానయ్య — మరకమ్మ—చిక్కేశ్వర్రావు — ఈ నామకరణములు మఱి యెటువంటివి? శ్రీ కామేశ్వరరావుగారి రచనలో కొన్ని పట్టులు, చెవినిబడిన కొంతసేపువఱకు నవ్వుపుట్టింపక, చర్వణమయిన తరువాతఁ గడుపు చెక్కలు చేయును. నాయుద్దేశమున 'భమిడిపాటి' వారి హాస్యములో ఉత్తానమైన వాచ్యతకంటె, ఉదాత్తమైన వ్యంగ్యమర్యాదపాలు హెచ్చుగా నుండుననియే. ఒక ప్రసిద్ధవిమర్శకుఁడు లక్ష్మీనరసింహముగారి హాస్యమునకును వీరేశలింగముగారి హాస్యమునకును భేద మున్నదని చెప్పుచు నిట్లు తేల్చెను: "వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము గిలిగింతలుపెట్టి నవ్వించును. వీరేశలింగముగారి హాస్యము గిల్లి బాధించును" అని. రచయితకు ప్రజాప్రబోధదృష్టి నిండుగా నుండునపుడు, వాని రచనలు వాచ్యార్థములై పునకు ములుసూపుట తప్పదు. వీరేశలింగము వంటులు సాంఘికముగా సంస్కారవు మెఱుఁగులు సరిదీర్పవలసిన సుప్రచారకుఁడు 'చిలకమర్తికవి' కూర్పుతీరులు కోరినంతగా, వీరేశలింగమువంటులువలె ప్రబోధదృష్టి పరిపుష్టముగాఁ గలిగియున్న వాఁడు కాఁడేమో! అందుకే, ఆ యుభయుల హాస్యరచనలకు నిట్టియంతర మేర్పడినది.

ఇపుడు మన కామేశ్వరరావుగారు కూడ ప్రబోధదృష్టిని మించిన కళాదృష్టి కలవారని నేను నిశ్చయించుకొన్నాను. వీరు అనువదించిన 'మొలియర్' ప్రదర్శనములు, స్వతంత్రించి వ్రాసిన ప్రదర్శనములు, మొత్తముమీఁద సొంతరచనలవలెనే యుండుట మెచ్చదగిన విషయము అనుసరణపట్టున గూడ స్వతంత్రముగానే తీర్పఁగల చాతుర్య మాయన కలములో నున్నది.

'బాగుబాగు' కామేశ్వరరావుగారు తొట్టతొలుతగా వ్రాసిన 'ఆట'. దానిరచనాకాలము ౧౯౨౩ సం. అది కళాశాలావిద్యార్థుల కోరికపై వ్రాయఁబడ్డది. ఈ 'ఆట' నాఁటికి, నేఁటికి సుప్రచారప్రశస్తుల నందుచునేయున్నది. మొదటిరచన కీర్తి ప్రసిద్ధివచ్చుట యొక్కడనో కాని యుండదు. కామేశ్వరరావుగారి "ఆట" లన్నియుఁ బ్రదర్శితములగుట శ్లాఘనీయము.

ఉత్తమ హాస్యరచయిత తత్త్వావధారణమునకు మార్గదర్శి యను కొంటిమి. ఇట్టి దర్శకత్వము 'భమిడిపాటి' వారిలో నున్నది. ఉదాహరణమునకు 'అద్దెకొంపలు' రచన యొక్కటి చూతము.

ఇంచుమించుగా నిరువది పుటలు అద్దెకొంపలనుగూర్చి సామాన్య ధోరణిలో వ్రాసివ్రాసి చిట్టచివర ఈ దిగువ పంక్తులు సంధానించిరి :

"...అద్దెలధోరణిబట్టిచూస్తే, భౌతికలోకంయొక్క అస్థిరత్వం స్ఫురణ కొస్తుంది. కొంపలేకాదు ఊళ్లూ, జిల్లాలూ, ఈఇండియా, ఈప్రపంచము ఇవన్నీ కూడా అద్దెవ్యాపారాలే కదా అనిపిస్తుంది! రోగంవల్లో, బెడద చేతో, అవాంతరం మూలానో, కూనీ ద్వారానో, ఆత్మహత్య రూపం గానో, దారిద్ర్య ధర్మమా అనో ఏదో తరవాత తరవాత మాత్రమే మానవులకి గోచరించే కారణాన్ని పురస్కరించుకుని జీవుడు శరీరం ఖాళీ చేసి పోతూండడం ఆరగారగా చూడగా ఎవడిమట్టుకువాడికే తెలిసే దాన్నిబట్టి—జీవుడికి శరీరాలు అద్దెకొంపలు."

పయినున్న యావద్రచనకును, దిగువనున్న యీవదిపంక్తులు జీవము పోసినవి. ప్రాణమువంటి యీ 'పేరా' లేనిచో 'అద్దెకొంపలు' వ్యాసము సర్వము వట్టి శరీరముగదా! నిస్సారమైన యీ వస్తువును హాస్యరసస్ఫూర్తితోఁ జిత్రించుటలోఁగల విశేషముకంటె, దానిని తత్త్వ సరణిని సమన్వయపఱచుటలోఁ జూపిన విశేషము ప్రశంసాభాజనమని నేను భావించెదను. ఇది యొకటి కాదు, కామేశ్వరరావుగారి రచనలలోఁ

వెక్కింట నిట్టి మెఱపులు తట్టుచుండును. ఇట్టి తత్త్వదృష్టిలేని హాస్య రచయిత హాస్యాస్పదుఁడు కావలసినదే.

శ్రీ కామేశ్వరరావుగారి ప్రదర్శనములు, తదితర రచనలు నిటు లుండగా, "త్యాగరాజు ఆత్మవిచారం" వారి కూర్పులలో గొప్పతావు నాక్రమించుకొనిన గ్రంథము. ఆరువందల సంఖ్యకుఁ బైబడియున్న త్యాగరాజు కీర్తనములను తొమ్మిదిభాగములుగా విభజించి, కీర్తనార్థములు చక్కని వచనములో సంతరించినారు. పాఠవైవిధ్యమువలన దుర్గమార్థములై యున్న కీర్తనల సరసార్థములు తేర్చి సహజమధురమైన భాషలో నీగ్రంథము రచితమైనది. ఈకృతిలో శ్రీ కామేశ్వరరావుగారి విమర్శన పాటవము, సంగీతములో వారికిఁగల యభిమానము రూపము కట్టియున్నది. ఆయన యశస్సునకీగ్రంథము వైజయంతి. పద్యమునకు రాగమక్కఱలేదను వీరి సిద్ధాంతము జగమెఱిఁగినది.

వీరు ఆంగ్లమునఁ బట్టభద్రులగుటయే కాక, సంస్కృతమునఁ జక్కని సాహిత్యము కలవారును. ౧౯-౨౦, ౨౧ సంవత్సరములలో మదరాసు "ఎకౌంటెంటు జనరల్ ఆఫీసు" లో నుద్యోగించిరి. వాఙ్మయారాధన దృష్టి ప్రబలముగాఁ గలవారగుటచే, అది విరమించి రాజమహేంద్రవరము వచ్చి వీరేశలింగోన్నత పాఠశాలలోనుండి యుండాఁక అధ్యాపక పదవి నిర్వహించుచున్నారు.

# వేదుల సత్యనారాయణ శాస్త్రి

## 1900

తల్లి గురమ్మ. తండ్రి కృష్ణయ్య. జన్మస్థానము భద్రాచలము. జననము వికారి సంవత్సర ఫాల్గుణ బహుళ షష్ఠి బుధవారము. 22-3-1900. రచనలు. ౧. దీపావళి ౨. విముక్తి ౩. మాతల్లి ౪. ఆరాధన ౫. ముక్తావళి. [కావ్యములు] మఱికొన్ని నవలలు, నాటకములు, వ్యాసములు ఇత్యాదులు.

'వేదుల' వారి పేరు తలపోయఁగనే 'దిపావళి' స్మరణకుఁ దగులును. దీనికిఁ గారణము కవితన్మయుఁడై రచించిన కావ్యకదంబము మా కూర్పులో నుండవలయును. నిజమే.

శ్రీ సత్యనారాయణ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలోఁ జక్కని సాహిత్య సంపత్తిగలవారు. గురుకుల వాసముచేసి గొట్టుపుల్ల శ్రీనివాసాచార్యులవారికడ కావ్యనాటకాలంకారములు పఠించిరి. చిలుకూరి సోమనాథశాస్త్రిగారి సన్నిధానమున వ్యాకరణాధ్యయనము సాగించిరి. చల్లా వేంకట నరసయ్యగారి దగ్గఱ స్మార్తము కూడ పాఠము చేసిరి. కవితాగురువులు కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులవారు. దివ్యమైన యీగురుత్వ భాగ్యముతో "వేదుల" వారు సంగ్రహించిన వైదుష్యము ప్రశంసనీయమైనది కాదా! విద్వత్పట్టభద్రులైన శాస్త్రిగారు కాకినాడ, పెద్దాపురము, పేరూరు హైస్కూళ్లలో నిరువది నాలుగేండ్లుగా నాంధ్రోపాధ్యాయ పదవి నిర్వహించుచున్నారు. పెక్కురు జమీందారులు వీరిని గౌరవించి వార్షికబహుమానము లిచ్చుచున్నారు. వీరు శతావధానులు. కాని, దేశకాలస్థితులు గుర్తించిన లోకజ్ఞత వీరియందుండి, ఆగారడీ పనులను కట్టిపెట్టించినది.

ప్రకృతము : అద్యతనాంధ్రకవులలో వేదుల సత్యనారాయణశాస్త్రి గారి స్థానము మంచిది. ఆయన ప్రతిభ సమంచితమైనది. వ్యుత్పత్తియు దానికి దీటయినదని తెలిసికొంటిమి. దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతుల చెలికారముతో నీయనకు పాశ్చాత్య కవితారామణీయక మాకళింపునకు వచ్చినది. తనకు, ఆజానజమైయున్న ప్రాచ్యసాహిత్య ప్రతిభ తాయదృష్టము తోడైనది. ఈసన్నివేశముతో నెన్నో ఖండకృతులీయన సంతరించెను. పదముద్రలో నీకవి బహుభద్రత గలవాడు. పలుకుబడి చిక్కగా, చక్కగా, కుదిరికగా నుండును. సంస్కృతవాణిపై మక్కువ పెంచుకొన్నను, వాడిన తెనుగునుడి తెలుగులో ముద్దుగా నుండును. భావన లోతుకలది. ప్రాక్తన సంప్రదాయములకు సమీపస్థుడై, క్రొత్త చవులు పుట్టించునట్లు కవిత్వము కట్టుటలో 'వేదులకవి' మంచి నేర్పరి. ఆనాడు శ్రీనాథుడు సీసములకు పేరుపడినట్లుగా, ఈనాడు 'వేదుల' వృత్తములకు పేరుపడెను. శయ్యాసౌందర్యము చెంపకుండగా జాగ్రత్తగా, మునువెనుకలు చూచుకొని వ్రాయుట యీయనలో నలవాటు. అందువలన, ఆయనప్రతిపదము మలయమారుతమువలె చదువరిని సుఖపెట్టును. ఈమార్గమునకు సంస్కృతకవులలో జయదేవుడు తెనుగు కవులలో ముక్కు తిమ్మనగారు దర్శకులు. వేదులవారి 'విముక్తి' కావ్యమునుండి మూడు ఎత్తలు.

ప్రాకుల్ పెట్టిన దిమ్మచీకటుల యీపాషాణ కారాగుహా
ప్రాకారమ్ములు వ్రీలి నాబ్రతుకుపై ప్రాభాత శోభామయా
శాకాంతిప్రసరమ్ము సోగడిని స్వేచ్ఛామారుతాశ్వాస గీ
తా కోలాహల మేదొ నాయెడద నుత్సాహమ్ము లూగించెడిన్.

*

ఊపిరి యాడనీని కఠినోపలబంధములో, కలా కలా
లాపముగాని, నర్తన విలాసముగాని, తరా పరీసుఖా

వాపముగాని, లేనిపుటపాకపు చీకటి జీవితంబు నె
ట్లోపితినో గదా, యవలియొ డ్డగుపింపని కాల మీాదుచున్.

*

ఎన్నడు సోకునో తరఁగ లెత్తఁగ తెమ్మెర తావియూర్పునా
యున్న నమేన, ఎన్నడు దయారుణరాగ మనోజ్ఞతల్ జగా
వన్న పసిండిపూఁత చెలువమ్ముల నావయి గ్రుమ్మరించునో
యన్న నిరంతరాశ బ్రతుకాపిన దాగిరి గర్భపుం జెఱన్.

'మాతల్లి' కావ్యమునుండి మఱిరెండు ఉదాహరింపకుండ నుండలేను.

అరనిక్కోర్కెగా బ్రతుకునందు రగుల్కొనుచున్న దొక్కటే
కోరిక, నీకృపావనికి కోయిలనై నతమాలపింతు, మం
దార సుమారుణద్యుతి వితానముగా ల్పెడి నీమనోహరా
కారమునన్ మధూదయ వికాసము నింపుము తల్లి, నాయెదన్.

*

ఏయను భూతిలేక రనమెండి, వివర్ణత దోగి వాసనల్
వోయిన నాహృదంబుజములో నొలికింపు మొకింత సర్వ సం
ధాయకమైన నీయడుగుఁదమ్ముల పుప్పొడి తోడితేన; త
ల్లీ యదెచాలు నాకు ఫలియించును ప్రోవిడుకొన్న నాకలల్.

ఈ రచనలో భావస్ఫుటత, భాషాపటుత యెటులు వియ్యమందు చున్నవో చూచితిరి. ఎప్పుడో హరీంద్రనాథుఁడు 'దీపావళినాఁడు' అను పద్యములతుఁ దలయూపె నని చెప్పి, యిప్పుడు సత్యనారాయణ శాస్త్రిగారి రచనలు గొప్పగానుండునని బలవంతముగా మన మెప్పు కొన నక్కఱలేదు. ఆయన కూర్పులో సాజముగా నట్టి లగువు బిగువు లున్నవి. అట్టి భావానాస్నైశిత్య మున్నది. అట్టి శిల్పనంపత్తి యున్నది.

ఈ గుణములుగల కావ్యములకు దీపావళి రాశి. అందుకే, వేదులవారి పేరు విన్నవెంటనే, ఆకూర్పు స్మరణకు వచ్చుట. శాస్త్రిగారు కొన్ని నాటకములు, కథలు, విమర్శనములు వ్రాసిరి. ఏవి వ్రాసినను, ఆయన పద్యకావ్యరచనలోనే శ్రద్ధధానులు.

ఈ 'గౌతమీకోకిలము' కాంత యిటులున్నది:

కానుకనై ధరాధిపుల కాళ్లకడం బొరలాడి వాడిపో
లేను, ధరాపరాగ పటలీ మలినమ్మగు ద్వారతోరణా
స్థానమునం దురిం బడఁగఁజాలను, డోసిటి వేగి ఘోరకా
రా నరకమ్మునం దునురు రాల్పఁగలేను నిశేమవరక్తనై.

*

నీచపు దాస్యవృత్తి మనసేరని భారత మాతృదేశ సే
వా చరణమ్మునం దనువు లర్పణఁజేసిన వారి పార్థివ
శ్రీ చెలువారుచోటఁ, దదస్రుగుచులన్ వికసించి, వాసనల్
వీచుచు రాలిపోవగ వలెం దదుదాత్త సమాధి మృత్తికన్.

---

# నోరి నరసింహ శాస్త్రి

## 1900

హరితస గోత్రులు: ఆపస్తంబ సూత్రులు. జన్మస్థానము: గుంటూరు. ప్రకృతనివాసము: రేపల్లె. తల్లి: మహాలక్ష్మమ్మ. తండ్రి: హనుమచ్ఛాస్త్రి. జననము: వికారి వత్సర మాఘశుద్ధ సప్తమి. 6-2-1900 సం॥ తేది. రచనలు:- ౧. గీతమాలిక ౨. భాగవతావతరణము [పద్య నాటిక] ౩. సోమనాథ విజయము [నాటకము] ౪. క్షేమాభిక్షుని ౫. వరాగమనము ౬. ఆత్మస్మృతి ౭. తేనె తెట్టె ౮. పతంగయాత్ర. ౯. స్వయంవరము. ౧౦. షణ్ణవతి [ఇత్యాది నాటికలు, కావ్యములు] ౧౧. నారాయణభట్టు ౧౨. రుద్రమదేవి [నవలలు] ఇంకను, అనేక కథలు, వ్యాసములును.

శిష్టాచార సంపదలో నోరివారి వంశము పేరు మోసినది. నరసింహ శాస్త్రిగారి తండ్రి హనుమచ్ఛాస్త్రి గారు గుంటూరు "మిషను కళాశాల" లో సంస్కృతాంధ్రాధ్యాపకులు. వీరు పాదుకాంత దీక్షితులు. వారితండ్రి గోపాల కృష్ణయ్యగారు మంత్రశాస్త్రకోవిదులు. ఇట్టి శిష్ట వంశమున నరసింహ శాస్త్రిగారి పుట్టుక. వీరి పినతండ్రి గురులింగశాస్త్రి గారు సుగృహీతనాములు. వారు చెన్నపురి తొండమండలము హైస్కూలున పండిత పదవిలో నుండెడివారు వ్యాకరణము, వేదాంతము, జ్యోతిషము, మున్నగు శాస్త్రములలో వీరిది గట్టిచేయి. తెలుఁగువచనములో ననేక పురాణములు వ్రాసినారు. భగవద్గీతార్థ ప్రకాశిక వీరు వ్రాసినదే. ఆంధ్రవాఙ్మయ సూచికలో, ముద్రితములైన వీరి రచనలు చాల నున్నట్లు కనఁబడుచున్నది. మహాభారతము, స్కాందపురాణము, మార్కండేయ పురాణము, జైమిని భారతము మున్నగు గ్రంథములకుఁ దెలుఁగువచనములు వీరు రచించియున్నారు. బయూరి త్యాగరాయ శాస్త్రులు అందుసన్నువారు వెనుక

వెలువరించిన కృతులలో ముప్పాతికపాలు గురులింగశాస్త్రిగారివే యనవలయును. ఇట్టి బహుగ్రంథములు రచించిన విద్వాంసుల వంశము నరసింహశాస్త్రి గారిది.

శ్రీ నరసింహశాస్త్రిగారు అధునాతనాంధ్రకవులలో సంప్రదాయసిద్ధమైన రచన సాగించుచున్నారు. ఆయన దేవీభాగవత రచన నేఁడు సుప్రసిద్ధమగుచున్నది. నారాయణభట్టు — రుద్రమదేవి మున్నగు నవలలు వారివి మనమెల్లరము పఠించుచున్నాము. నాటికలు కూడఁ దఱచుగా నరసింహశాస్త్రిగారు వ్రాయుచున్నారు. వారి విమర్శనములు పత్రికలలోఁ గనుచుందుము. అనఁగా వీరికలమునకు బహుముఖములుగా సాగుచేవ కలదని స్పష్టపడుచున్నది. ఇట్టి ప్రముఖ రచయిత జీవితవిశేషములు పేర్కొనఁదగినవి.

౧౯౧౮ వఱకు నరసింహశాస్త్రిగారు గుంటూరున 'ఇంటరు' చదివిరి. పదపడి, పచ్చయప్ప కళాశాలలో బి. ఏ. చదివి యుత్తీర్ణత. పట్టభద్రులయిన తరువాత, గుంటూరు కళాశాలలో రెండేండ్లు ఉద్యోగము. ౧౯౨౫ సం॥ లో బి. యల్. పరీక్షలో నెగ్గి గుంటూరులో న్యాయవాదిత్వమునకుఁ బ్రారంభము చేసినారు. ౧౯౨౭ సం॥ నుండి 'రేపల్లె' కు మకాము మార్చి నేఁటిదాఁక నక్కడనే వృత్తినిర్వహణము. సంస్కృతాంధ్రములు గురుముఖమునఁ బఠించినారు. పదవయేటనే కవి కావలె నన్న కోరిక నరసింహశాస్త్రిగారిలో మొలకెత్తినది. ఈ మొలకను దోహదముచేసి, మొక్కఁగాఁ బెంచిన యుదారులు శ్రీ శివశంకరశాస్త్రిగారు. కొడవటిగంటి వెంకట సుబ్బయ్య, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, పెద్దిభట్ల పూర్ణశర్మ, కోపల్లె శివకామేశ్వరరావు — మున్నగు ప్రథమ 'సాహితీసమితి' కవుల స్నేహములో మన నరసింహశాస్త్రిగారికి నవ్యసాహిత్యములో నొక వెలుఁగు కాన్పించినదఁట. పదునెనిమిదేండ్ల వయస్సు నిండువఱకు వీరు వీరగ్రాంథిక

వాదులు. తరువాత, వ్యావహారిక భాషావాదులు. పద్యరచనకూడ వ్యావహారికములోనే సాగింపవలెనని కొన్నాళ్లు వీరిపట్టు. అది క్రమముగా నడలి పద్యమునకు గ్రాంథికము, గద్యమునకు వ్యావహారికము కావలెనని కొంతకాలము. ఇప్పుడు పూర్తిగా నరసింహశాస్త్రి గారిలోఁ గ్రొత్తమారుపు. వ్యావహారికభాష వచనరచనకుఁగూడ అనుకూలము కాదని నిశ్చయము చేసికొన్నారఁట. శాస్త్రాది విషయములు నిరూపించు వ్యాసములు, పూర్వకాలమునకు సంబంధించిన కథలు, నవలలు గ్రాంథికవాణిలోను, నేఁటి కాలమునకు సంబంధించిన కథలు, నాటికలు, సిద్ధాంతములు చేయని వ్యాసములు వ్యావహారిక వాణిలోను నుండవలయునని నరసింహశాస్త్రిగారిప్పటికిఁ జేసికొన్న సిద్ధాంతము. ౧౯౩౦ నుండి, శాస్త్రిగారిలో కర్మశ్రద్ధ ప్రబలినది. ౪౧ సం॥ నుండి పూర్ణదీక్ష. వంశీయమైన ధర్మము తప్పింపఁ దరముకాదు.

శ్రీ నరసింహశాస్త్రిగారికిఁ గథారచనలోను శ్రద్ధ యున్నది. గులాబిపువ్వు, శ్యామసుందరుడు, గానభంగము, చేసుకున్నవారికి చేసుకున్నంత, భవిష్యత్తు, వధూసర – ఇత్యాదులయిన వీరి కథలు సాహితి, సఖి, భారతి, ఆంధ్రవార్షిక సంచికలలో చూచియుందురు. శాస్త్రిగారి నాటికలు సోమనాథ విజయము, ఖేమాక్షుని, వరాగమనము, ఆత్మస్మృతి, పతంగయాత్ర, షణ్ణవతి, ఇత్యాదులు రసికమానసములు కరగించునవిగా నున్నవి. శ్రీ శివశంకరశాస్త్రిగారి వలెనే వీరెక్కువగాఁ బద్యనాటికలు వ్రాయుటకు మక్కువ చూపినారు. ప్రధానముగా నరసింహశాస్త్రిగారి 'నారాయణభట్టు' పేర్కొనఁదగిన మంచి నవల. వీరి గద్యరచనా విధానము చాల సరస మధురమైనది. పాత్రల సంభావణము ఉదాత్తముగా నడపింతురు. కథాసంవిధానము మీఁద కంటె, విషయ విమర్శనము మీఁద వీరు ప్రీతిచూపెదరు. ఈ గుణము "నారాయణభట్టు" లోఁ గన నగును. పలుమొగాల వెలి విరిసిన

నరసింహశాస్త్రిగారి వాణి నేఁడు దేవీభాగవత రచనలోఁ బరిణతమై యున్నది. అందలి సుందరకథారణి యీతీరు గలది.

శా॥ ఆలీలన్ శుకయోగి తండ్రిదరి గార్హస్థ్యంబు వెళ్ళించి పై
కైలాసాచల శృంగభూమి పితృసంగంబున్ వధూసంగమున్
బాలాపుత్ర సమస్త సంగతులు పోనంబెట్టి నిశ్చింత మే
ధాలత్వం బగుపెక్కి నిశ్చలత నాత్మధ్యాననిష్ఠు నిల్చినన్.

శా॥ అంతం గొండొకకాల మేగ శుకుఁ డాత్మారాముఁడై సిద్ధుఁడై
వింతం గొల్పుచు సర్వభూతములకున్ విద్యుత్ప్రభాపుంజ భా
స్వంతుండై నెగసెన్ విహాయసిని భాస్వద్బింబ సంభేదియై
భ్రాంతంబై గిరిశృంగ మచ్చట ద్విధా వ్రయ్యంగ నుత్తిష్టమై.

మ॥ సకల త్రైదశ మానిసిద్ధ బహుధా సంస్తూయమాన ప్రథన్
శుకుఁ డాకాశపథంబునందు వృషదశ్వుండట్లు స్వచ్ఛందుఁడై
ప్రకటాశాళి ద్వితీయ భాస్కరుని రేవన్ వెల్గుచుం బోవ, తం
డ్రికి నుత్పాత పరంపరల్ కనఁబడెన్ భీశోకముల్ కూర్చుచున్.

ఇట్టి హృదయంగమ శైలిలో దేవీభాగవతము నాంధ్రీకరించు శ్రీ నరసింహశాస్త్రిగారిని 'కవిసామ్రాట్' బిరుదముతో దేశము సత్కరించినది. సాహితీసమితి కార్యదర్శిగా వారు చేయు సాహిత్య ప్రచారము విశేషించి గౌరవార్హము.

# తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# 1901

కమ్మవంశీయులు. తల్లి: చెంచమ్మ. తండ్రి: నారయ్య. జన్మస్థానము: గుంటూరు మండలములోని కావూరు. జననము: 25-12-1901. రచనలు:- ౧. ఆత్మకథ ౨. రాష్ట్రగానము ౩. ఆత్మార్పణము ౪. ధర్మజ్యోతి. ౫. అమరజ్యోతి ౬. పఱిగపంట. ౭. పెద్ద కాపు [కావ్యములు] ౮. మహేంద్రజననము [నాటకము] ౯. రామలింగేశ్వర శతకము ౧౦. రామశతకము ౧౧. గాంధీతారావళి — మున్నగునవి.

తెలుఁగువారి కవితా శాఖలో నిరువదవ శతాబ్దివచ్చి వసంతరేఖలు దిద్దినది. ఈ శతాబ్ది యవతారముతోఁ పాటు జన్మించిన కవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి. ఆయన కృతులు ఆంధ్రరాష్ట్రమున గానము చేయఁబడుచున్నవి. వారి "రాష్ట్రగానము" పేరు విననివా రుండరు. సీతారామమూర్తి చౌదరిగారు మహాత్ముని "ఆత్మకథ" కావ్యరూపముగా సంతరించిరి. అది సుప్రసిద్ధము. ఆయన ధర్మజ్యోతి, అమరజ్యోతి, పఱిగపంట, పెద్దకాపు ఇత్యాదులు యువరసికులకు నిత్యపారాయణమున నున్న కృతులు.

పుత్తెకొక్క బుద్ధి పుట్టు జిహ్వకు నొక్క
రుచి జనించు నంట రూఢిమైన
నరసులెల్ల మెచ్చ మెఱయింతుఁ గైతలోఁ
గమ్మఁ దనము మత్కులమ్మునవలె.

ఇది చౌదరిగారి నియమము. ఈ నియమము తప్పకుండ కమ్మని కవిత గల కూర్పులు మనకెన్నో వా రందిచ్చిరి. తొల్లింటి కవుల ధర్మములు పీసమెత్తు కాదనుటకు వీ రిష్టపడరు. రస భావ పరిపుష్టమైన రచనావైదగ్ధ్య మాయనలో వలసినంత యున్నది. భాష నిర్దుష్టము.

పలుకుబడి బింకమైనది. ప్రాఁతమాటలకు క్రొత్త పూఁతపూయు కూర్పు నేర్పు చౌదరిగారి కెన్నఁడో యలవడినది. ధర్మనిష్ఠకు సదవిష్ఠమైన యితివృత్తము లాయన యేఱుకొనఁ గలవారు. ఉభయ భాషలయందును చక్కని సాహిత్యము. సంస్కృతాంధ్ర శబ్దముల బరువులు, మురువులు పట్టిచూచి, తూఁచి పద్యములలో సంధానింపఁ గలుగుటలో సీతారామమూర్తికవి చేయితిరిగిన చతురుఁడు. సుశిక్షితులైన కవులు నేఁటి వారిలోఁ బలుచబడుచున్నా రన్నమాట కొందఱికి కోపకారణము కారాదు. చౌదరిగారివలె ధారాళముగాఁ గవిత కట్టువారు లేరనికాదు. ఈ సౌభాగ్యమునకుఁ దోడు సౌష్ఠవము కూడ నుండవలయును. దానికి, సంస్కృతాంధ్ర కావ్య పరిజ్ఞానమేకాక, వ్యాకరణ ప్రవేశముకూడ విధిగా నుండవలసినది. ఈయుభయము మన సీతారామమూర్తి చౌదరిగారిలో నున్నవి. ఈ యస్తిత్వము చూచుకొని పండితకవులును వీరిని గౌరవించుచున్నారు. విద్వత్కవులగు తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారితోఁ గాళిదాసత్రయము చౌదరిగారు పాఠముచేసిరి. ఆయన యాచార్యకము వీరి భాషాజీవితమున కొక మేలిదారి నగపఱిచిన దనవచ్చును. ఈ కృతజ్ఞత చౌదరిగారిలో నున్నది.

ఏకశ్లోక రహస్య బోధనముచే నెవ్వాఁడు శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁ జేయు నవ్విబుధుఁ గొల్తుం వెంకటప్పార్యు న
స్తోక శ్లోక మయూఖరాజదఖిలాశున్ రామగాథామృతా
ఖ్యాక గ్రంథమతల్లికా జనకు మద్గీర్వాణ భాషాగురున్.

౧౯౩౦ లో వీరు ఉభయభాషాప్రవీణ పరీక్షలో నుత్తీర్ణత నందినారు. చిట్టిగూడూరు పాఠశాలలో వీరికి గురుత్వము నెఱపిన శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారిని గూర్చి 'ఆత్మ కథ' లో నిటులు స్తుతి చేయుచున్నారు.

"శబ్దశాస్త్రాది లక్షణ సంప్రదాయ
మెవ్వఁ డెఱిఁగించె నాకు నయ్యుద్ధ చరితుఁ
బ్రస్తుతించెదఁ బుంభావ పద్మజాత
రమణి దువ్వూరి వేంకటరమణ శాస్త్రి"

ఈ యుదాహరణము లెంచు కనఁగా, సీతారామ మూర్తి చౌదరి గారు గాలిచదువు చదివిన వారుగాక గురుకుల క్లిష్టులై శాబ్దాదుల యందుఁ గృత పరిశ్రము లనుటకు - వాస్తవమునకు, వారియేపద్యము పట్టినను, ఈవిషయము వెల్లడి యగును. "ఉభయతోముఖ గవాయుత దాన ఫలదాత్రి" - "దేశభక్తి పదవీ నదవీయసి" "తచ్ఛ్రవణ సాహితి దుశ్శక మెట్టివారికిన్" - "పుంవవు రీడ్యమాన" "శ్రద్దధానుఁడు" - "రామాభిధానపు న్నిర యార్చిరంగ" - ఇత్యాదులైన రహస్యములు శిక్షితునకుఁగాని తెలియనివి. ఇట్టివి చౌదరిగారు కృతులలో వందలు వాడినారు. అట్లని, కేవల ప్రయోగ వ్యామోహము కలవారే యను కొనరాదు. రసదృష్టిలోఁ జూచినను వారి రచనలకు మంచి స్థానమున్నది. శయ్యా సౌందర్యము మంచిది. భావనయు గంభీరమైనది. ఆవేశమును ప్రశంసనీయమైనది. పోకడలు ధర్మనిష్ఠానిష్ఠితము లయినవి. ఇఁక వారి ధోరణి యెటు లుండును? అందులో, నిండుగాఁ దెలుఁగుఁ దనమును వలచిన రచయితలు చౌదరిగారు. పరభాషా-వేష సంస్కార సంపర్కములు బొత్తిగా నీయనకు నచ్చవు. జాతీయ మైన పరమ ధర్మము నీయన దివ్యమంత్రముగా నుపాసించుచున్నారు. ఆయన రాష్ట్రగానాదులు దీనికిఁ దారకాణగా నిలఁబడురచనలు. క్షేత్ర జీవులు, ఆదర్శజీవులు, శిథిలక్షేత్రములు - ఇవన్నియు చౌదరిగారి కవితా వాహినీ పూరములోఁ బరిపూతములగు వస్తువులు.

అమ్మ తెల్లులవంటి యావు లింటింటిలోఁ
గదుపులై యమృతంబు పిదుకఁ జేసి
కండబలము నూపి కొండలైనను మోసి
కలుము లందిచ్చు గిత్తలను బెంచి
పసిముద్దుగాని సంపద ముద్దుగా దన్న
జీవసూత్రము శిరసావహించి
గోడగరి పడ్డంగి గోసంగి కనుదోయి
దైన్యరేఖలకు దోదవ్వొసర్చి
కదురుగలచోటు కవ్వంబు కదలుచోటు
కఱవులకు ధూము కేతువుగా నెఱింగి
త్యాగమున నాశ్రయము కర్మయోగి వగుచుఁ
గీర్తిఁగనవయ్య భారతక్షేత్రజీవి!

*

బెబ్బులివంటి మా తెలుఁగుబిడ్డ మగంటిమి మున్ను సైతముఁ
బొబ్బిలికోటలో నుబికి పొంగి పరాసుల ముందిముంచి త
బ్బిబ్బొనరించి శాత్రవుల బిట్టుపొగడ్తలఁ గాంచదా? జగం
బబ్బురమంద నాఁడిటొనదా? శరదిందువికాసకీర్తులన్.

*

కమ్మనిమాటలాడి నయగారము సూపినమాత్రఁ జిచ్చు పె
ట్టమ్ముల నాయకత్వ మిసుమంత సహింపఁడు తెల్గుబిడ్డ; శౌ
ర్యమ్ము సమంచితాశయపరంపర బట్టు విలాప్పు నీతి కై
క్రమ్మరుచున్నవాఁ; డతనికోంక లెన్నటికిన్ ఫలించునో!

ఈ తీరయిన జాతీయావేశముగల కవులు తక్కువ. ౧౯౨౨ లో పన్నుల నిరాకరణోద్యమమున మన చౌదరిగారు జరిమానా శిక్ష బొందెను. అదిగాక, గుంటూరుజిల్లాకాంగ్రెసు సంఘములో పేరు

పదేండ్లపాటు సభ్యులై జాతీయ ప్రబోధము గావించినారు. రాట్నము, గాంధి, అస్పృశ్యత, పంజాబువధలు, భారతమాత ఇత్యాదిశీర్షికలతో వీరు రచించిన పద్యములు తెలుఁగు చదువరులకు సువరిచితములు. వీరి యాదర్శములకుఁ దగినటులుగా మహాత్ముని యాత్మకథ మధురమైన కావ్యముగా సంతరించినారు. ఈరచన లిటులు సాగించుచునే దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల హైస్కూళ్లలో నాంధ్రోపాధ్యాయ పదవి నిర్వహించి శిష్యుల నెందఱనో దిద్దినారు. ప్రకృతము పీ రుపాధ్యాయ పదవియందే యున్నారు.

ఈయభినవ తిక్కననుగన్న తలిదండ్రులు ధన్యులు. చౌదరిగారితండ్రి నారయ్య ధర్మజ్యోతి. ఆయన శీలసంపద శాశ్వతమైన కృతిగా సంతరించి, యీపుత్రుఁడు మనకిచ్చెను. జనకునిపై తనయునకుఁ గల భక్తిగౌరవము లకేకాక, నీతి నిష్ఠావిశేషమునకు, రసభావ సౌష్ఠవములకుఁగూడ 'ధర్మజ్యోతి' తారకాణమైన కావ్యము. చౌదరిగారు తండ్రినిగూర్చి యిటులు వ్రాయుచున్నారు:

చదువకయున్న నేమి బుధసత్తము లుబ్బఁగ నర్థభానసం
పద వికసింప భాగవత భారతముల్ వివరించు; హృద్యముల్
తదమలకావ్యపద్యములు ధారణ కగ్గముచేసి వేనవేల్
చదువునతండు; తచ్ఛ్రవణసాహితి దుశ్శక మెట్టివారికిన్.

మక్కువమై కొండికనాఁ
డక్కఱగల యు ! లేనియప్పుడు నొఱపౌ
చక్కట్ల దండ లాతఁడు
పెక్కులు మన్మ్రదుల హృదయపీఠికఁ జుట్టెన్.

సౌజన్యమూర్తియగు "తుమ్మల" కవికి ౧౯౪౭ లో, కనకాభిషేక గౌరవము జరిగిన సందర్భమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యధ్యక్షుఁడుగా విప్పిన హృదయ మిట్లున్నది.

"మన చౌదరి యతిప్రాసములకై భంగపాటుచెంది తలగోఁకి కొనుచు బలాత్కార పద ప్రయోగములుచేసి, యర్థము ననుసరించి పదములు వాడక, పదములఁబట్టి యర్థమును వంపులువెట్టి వంగఁజేయు నీరసుఁడు గాఁడు, భావ మనర్గళముగాఁ బ్రవహించు చందాన వ్రాయు మహనీయుఁడు. యతి పదాదియందే కాక మధ్యమునను గొనలు వ్రాలును. ప్రాసమునకు యతికిని పద్యమందు నడక నిలిచి దాఁటవలసిన యిబ్బంది లేదు. అర్థమునుబట్టి పదములు, పదములలో లీనమైనరీతిని యతిప్రాసములు ననాయాసముగ నప్రయత్నముగ, స్వచ్ఛందముగ వచ్చి చేరుచుండును. ఈసిద్ధియందుఁ బ్రసిద్ధుఁడు తిక్కన. ఈవర్గమున తిక్కన్నతో సజాతీయుఁడైన వాఁడు మన చౌదరి. అనఁగా సరి సమానుఁడని యతిశయోక్తి బలికి ప్రమాణము చేతు. ఆవర్గమున సగ్రాసనత్వము లేకున్నను నాసనత్వము కలవాఁడని నామనవి"

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము - 1950